# మల్లాది రామకృష్ణ శాస్త్రి

# కథలు



1

మల్లాది రామకృష్ణ శాస్త్రి

# కథలు

మొదటి సంపుటం

మల్లాది రామకృష్ణ శాస్త్రి

శతజయంతి ప్రచురణ (1905–2005)




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

MALLADI RĀMAKRISHNA SĀSTRY KATHALU - Vol 1

మల్లాది రామకృష్ణ శాస్త్రి శత జయంతి ప్రచురణ (1905-2005)

ప్రచురణ నెం 2350 / 2171 R
ప్రతులు 1000
వి పి హెచ్ ప్రథమ ముద్రణ అక్టోబరు, 1999
వి పి హెచ్ ద్వితీయ ముద్రణ మార్చి, 2005



వెల : రూ. 150-00

ప్రతులకు . **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞానభవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001
E-mail. visalaandhraph@yahoo com

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ



ముద్రణ శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్-29 ఫోన్ 55599831

# సాహిత్య సేవలో మరో ముందడుగు

ప్రజల నుంచి ప్రజల్లోకి సాహిత్యం – అన్నది విశాలాంధ్ర ప్రచురణాలయం నినాదం. ఆ కర్తవ్య నిర్వహణలో ఎదురయ్యే కష్టనష్టాలనూ, ఆటంకాలనూ అధిగమిస్తూ ప్రగతిశీల సాహిత్యాన్ని ప్రచురిస్తోంది ఆధునికాంధ్ర సాహితీ నిర్మాతలు – కందుకూరి – గురజాడ – గిడుగు – తాతాజీ – శ్రీ శ్రీ రచనలనూ, ఇంకా పలువురివీ ప్రజలకందించింది. తెలుగు సాహిత్యంలోని దాదాపు అన్ని ప్రక్రియల్లోని ప్రసిద్ధ రచయితల అభ్యుదయ రచనలనూ ప్రచురించింది

కొడవటిగంటి కుటుంబరావు (1982), శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (1992), ఇటీవల (1997) దాశరధి రంగాచార్య రచనలనూ ఒక పధకం ప్రకారం ముద్రించి సాహిత్యాభిమానులకు అందిస్తున్నాం.

అలాంటి పధకాల్లో ఒకటిగా మల్లాది రామకృష్ణశాస్త్రి గారి రచనలను ప్రజల కందిద్దామనుకున్నాం. పలు పర్యాయాలు మేం ఏర్పాటుచేసిన రచయితల సమావేశాలలో వచ్చిన అనేక సూచనలలో మల్లాది రచనల ముద్రణ కూడా ఒకటి ఆధునిక వచనానికి అందచందాలద్దిన ఘనత మల్లాది వారిది. సుమారు 130 కథలూ, రెండు నవలలూ, మరికొన్ని సాహిత్య వ్యాసాలూ ప్రచురణకున్నాయి. 1957లో విశాలాంధ్ర ప్రచురణాలయం మునిగోరింట, రంగవల్లి, అల్లోనేరేడు, రసమంజరి అన్న మల్లాది వారి 4 కథా సంకలనాలను ప్రచురించింది తెలుగుదనం తొణికిసలాడే మల్లాది వారి కథలను సంకలనాల రూపంలో తొలిసారిగా ప్రచురించే అవకాశం ఆనాడు విశాలాంధ్ర ప్రచురణాలయానికే దక్కింది. ఆ తర్వాత 1960, 1963, 1967 లలో మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథలు అన్న పేరిట మరో 4 కథల సంపుటాలను ఆదర్శ గ్రంథ మండలివారు ప్రచురించారు. వీటిలో పాత సంకలనాలలోని కథలతో పాటు మరికొన్ని కొత్తవి కూడా చేరాయి. ఆ తర్వాత నవోదయ పబ్లిషర్స్ ఈ అన్ని సంకలనాలలోని కొన్ని కథలను ఎంపిక చేసుకొని రెండు కథా సంకలనాలను వెలువర్చడం జరిగింది.

ప్రస్తుతం మా ఈ ప్రణాళిక ద్వారా 1960–1967 సంవత్సరాలలో ప్రచురించిన మల్లాది రామకృష్ణశాస్త్రి గారి కథా సంకలనాలలో కొన్ని కథలను ఒక సంపుటిగానూ, మిగిలిన రెండు సంకలనాలలోని కథలనూ – ఇంతవరకు సంకలన రూపంలో

రాకుండా విడిగా ఉన్న కథలనూ కలిపి రెండవ సంపుటంగానూ, నవలలను మూడో సంపుటంగానూ వెలువరించాలని మా ఉద్దేశం. అందులో భాగంగానే ఈ మొదటి సంకలనం రెండోది (కథలు), మూడోది (నవలలు) కూడా త్వరలో వస్తాయి. వీటి ప్రచురణకు అంగీకరిస్తూ అవకాశం కల్పించిన మల్లాది వారి కుమారుడు శ్రీ నరసింహశాస్త్రి గారికి కృతజ్ఞతలు. అలాగే "మారాకు"గా ముందు మాటరాస్తూ – "వచనంలో మేస్త్రి" కథన చాతుర్యాన్నీ – కథల వైశిష్ట్యాన్నీ, సారాంశాన్నీ వివరించిన – ప్రముఖ పత్రికా సంపాదకులూ – సాహితీవేత్త శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ గారికి ధన్యవాదాలు. అలాగే టైటిల్ కి ముఖచిత్రం (ఫోటో) అందించిన స్వామి చిత్రానంద, చెన్నయ్ వారికి కృతజ్ఞతలు.

ఆధునిక సాహిత్య పథంలో దీపధారులైన ప్రముఖుల రచనలను ముద్రించి రానున్న తరాలకు అందించే మా కృషిలో భాగంగా వెలువడుతున్న ఈ "మల్లాది రామకృష్ణశాస్త్రి రచనల"నూ పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

ఏటుకూరి ప్రసాద్
సంపాదకుడు

అక్టోబరు 1999.

# మారాకు

మృచ్ఛకటికం నాటకంలో, కవి శూద్రకుడు ఒక పాత్ర చేత అనిపిస్తాడు:

హృదయే గృహ్యతే నారీ
య దీదం నాస్తి, గమ్యతామ్ ... అని –

స్త్రీని హృదయంతో అందుకోవాలి. అదిలేక పోతే, ఆమె సన్నిధి నుంచి తప్పుకు వెళ్ళిపో – అని దీని భావం.

తెలుగులో అధునిక కథాసాహిత్యం కళ్లు విప్పుకొంటున్న తొలి దశలో స్త్రీని బహురూపిణిగా, హృదయవతిగా, వెల్లడిగా, చిత్రించిన రచయితలు ముగ్గురున్నారు వారు చలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి. వీరి కథల్లో కేంద్రం స్త్రీ. ఈ స్త్రీ తిరగబడడానికి ఎప్పుడూ సిద్ధంగావుండే జ్వాల. ఆమెను ఆవిష్కరించడంలో మాత్రం ఈ రచయితల మార్గాలు, శైలులు వేరు.

కొంటెతనం –

రసికత –

పారవశ్యం –

– ఈ మూడూ శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి జీవలక్షణాలు. జీవితంలో వాటి కూడికల, తీసివేతల, వెలుగునీడలే అయన కథలకు ఇతివృత్తాలు. ఆయన కథల్లో స్త్రీ – పురుషప్రవర్తనల్ని నియంత్రిస్తుంది. ఆమె విద్యార్థిని కావచ్చు, గృహిణి కావచ్చు, వేశ్య కావచ్చు, దేవదాసి కావచ్చు. ఆమె యౌవనంతో వుండవచ్చు, ముసలితనం అలుముకున్నది కావచ్చు, వినయంలో పొగరు, పొగరులో వినయం అయన స్త్రీ పాత్రల సొత్తు. వీళ్ల చాటున (ముందున్నా ననుకుంటూ) మసలే పురుషపాత్ర విద్యార్థి కావచ్చు, విద్యాధికుడు కావచ్చు, జమీందారు కావచ్చు, మహారాజు కావచ్చు, వట్టి పల్లెటూరి 'ఏలపదం' వంటివాడు కావచ్చు. "ఇదం బ్రాహ్మ్యమ్" అని జంధ్యం సవరించుకునేవాడూ కావచ్చు. వాడు తరుచుగా స్త్రీ ముందు ఓడిపోతూంటాడు. మన్నించి నమస్కరించి, తప్పుకు పోవలసినవాడై వుంటాడు.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథలు పట్టణాల్లో మసలేటప్పుడు ఒక లాగ, పల్లెల్లో తిరిగేటప్పుడు ఒకలాగ, కోనవెంట – కానవెంట నడిచేటప్పుడు ఒకలాగ, కథన శిల్పంలో, ఋతువుల వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాయి.

శాస్త్రిగారి కథలనగానే అయన కథలతో చెప్పదగిన పరిచయం లేనివారికి వేశ్యలు, శృంగారం, విశృంఖలత, చప్పున స్ఫురించే పరిపాటి వుంది. వేశ్య కణకణమండే నిప్పు అనీ, దేవదాసి వ్యభిచారం కోసం పుట్టలేదనీ, ప్రణయం, శృంగారం, అంటే వట్టి లైంగికవ్యాపారం కాదనీ, అయన కథలు పదే పదే చెపుతాయి.

'తెలుగులో కవితావిప్లవాల స్వరూపం' అనే పుస్తకంలో శ్రీ వెల్చేరు నారాయణ రావు – ప్రబంధాలలో స్త్రీకి, భావ కవిత్వంలో స్త్రీకి, చూపించిన తారతమ్యం ఆసక్తికరమైనది. ప్రబంధాలలో స్త్రీ అంటే శరీరం. భావకవిత్వంలో స్త్రీ అంటే అనుభూతి – అనేదే ఆ ప్రతిపాదన.

వట్టినే ఊహల్లో భావించుకుంటూ భౌతికంగా స్త్రీకి కావలసినదీ, మానసికంగా అందించవలసినదీ అయిన – జీవనభోగం – మరిచిపోయి, కవిత్వంతో తృప్తి పొందే అలసుల మీద, పిరికివాళ్ళ మీద, శాస్త్రిగారికి సదభిప్రాయంలేదు.

నారాయణరావుగారి ప్రతిపాదనను సమన్వయించి, మల్లాది రామకృష్ణశాస్త్రి గారి కథలకు అన్వయిస్తే – సున్నితమైన అనుభూతులను కాలదన్నే వట్టి శారీరక కామన, శరీరాన్ని విడిచిన కేవల భావుకత్వానుభూతి, జీవితంలోనూ సాహిత్యంలోనూ హాస్యాస్పదాలవుతాయని శాస్త్రిగారు తమకథల్లో ప్రతిపాదించినట్టు బోధపడుతుంది. అయితే – ఒకానొక మార్మికపారవశ్యంతో, ప్రణయభావ వైభోగాన్ని ఆకాశానికెత్తిన వైనం 'కాముని పున్నమి,' 'దారుకావనం', 'దోదమ్మి', 'కన్నెగులాబీలు' వంటి కథలలో కనిపిస్తుంది. అదే చేతితో, అట్టడుగు జీవనదుఃఖంలో పడి, చూపులు గుచ్చుకున్న గాయాల శరీరంతో నిస్పాటంగా, రికామీగా బతికే సీతాయ్ గురించి – 'అర్ధ–నారి' కథలో చూపిస్తారు.

"సీతాయ్ బ్రతుకు చివరకు ఇలా అయిందా? ఎలా తెలవారుతుందో – దేశంలో ఎంతమంది పడుచులు... ఇలాగే సీతాయ్‌లు అయిపోతున్నారో!

"హాఁ – ఇలాంటి చరిత్రాత్మకములైన చచ్చుప్రశ్నలు లక్షాతొంభై, తెలుగువాణ్ణి కనక పరాఖత్‌గా నాకు నేను వేసుకోగలను. ఎందుచేతనా, వాటికి జవాబు చెప్పుకునే బాధ్యత, నాకూ, నా జాతికీ – వేదకాలంనుంచీ లేదు" – అని యీ కథ ముగింపు ముక్తాయింపు –

దీని సారాంశం ఏమంటే : శాస్త్రిగారు తన కథల్లో స్త్రీ పురుష శృంగారానుభవానికి (ప్రణయానుభవానికి) "అనుభూతి" పరంగా ఎంతటి ప్రాధాన్య మిచ్చారో, ఆమె 'శరీరం' మీద కూడా, అంతటి గౌరవం చూపించారు అని —

మల్లాది రామకృష్ణశాస్త్రి గారి కథల్లో కులానికి కాక, గుణానికి ప్రాధాన్యం కనిపిస్తుంది. 'గోరంత గొప్ప' కథలో రామాంజయ్య, రంగయ్య, కోమటి సుబ్బయ్య, దూదేకులసాయెబు ఇస్మాయిల్, – 'శివరంజని' కథలో చిక్కయ్య, 'గంగాలహరి' కథలో దేవదాసి రత్తమ్మ, 'కలికితురాయి' కథలో గొల్ల సింగన్న, 'వెలది వెన్నెల' కథలో కన్యాగురుకులం నడిపే వేశ్య కృష్ణాజీ, 'సాని – పాప' కథలో కోకిల ఇందుకుదాహరణలుగా చెప్పుకోవచ్చు –

వీరేకాక, ఇంకా – అతి అమాయకంగా కనిపించి, కళకు పరవశించే బ్రాహ్మణుడూ – అతితెలివో, అమాయకత్వమో ప్రదర్శించే బుద్ధిహీనుడూ, – బలహీనతల్లో పడిపోయి, కృంగిపోయేవాళ్లని బుజంతట్టి నిలబెట్టే మిత్రుడూ, కొంటె కోణంగి విద్యార్థీ – వంటి బహుపాత్రలు శాస్త్రిగారి కథల్లో తరుచు కనిపిస్తారు. కుహనా శ్రేయోభిలాషుల ఉపదేశ వాక్కులు, అరసికుల మిడిసిపాటు, అంటే ఆయనకు మంట.

శాస్త్రిగారి కథల్లో జీవన రసికతాపూర్ణ పాత్ర తాతగారు. ఆయన జ్ఞాని, లౌకికుడు, కొంటెవాడు, పండితుడు; మీదు మిక్కిలి "జరలేని యౌవనానికి" సన్నిహితుడు. ఈయన ద్వారా శాస్త్రిగారు, శృంగార తాత్త్వికతను – "స్త్రీ పుంసయోగోద్భవ"మైన జీవనాలంకారంగా ప్రతిపాదిస్తారు –

వేశ్యాకులం ఉద్ధరింపు పేరిట, ప్రభుత్వం దేవదాసీలలో కళాపార్శ్వాన్ని ఘోరంగా దెబ్బతీసిందని శాస్త్రిగారు నమ్మారు. దానిని తమ కథలద్వారా ఖండించారు.

మల్లాది రామకృష్ణశాస్త్రి గారి కథలలో పాఠకులను ఇబ్బంది పెట్టేవి, ఆయన కొన్ని కథలకు పెట్టిన రాగాలపేర్లు. శహన, అసావేరి, కన్నడ, హంసధ్వని, శివరంజని – ఇత్యాది. అలాగే పద–వర్ణం, యక్షగానం, సామగానం, వంటివి కూడా.

కర్ణాటక శాస్త్రీయసంగీత సంప్రదాయంప్రకారం ఆయా రాగాలు కొన్ని రసాలను, భావాలను నిర్దేశిస్తాయి. ఉదాహరణకి శహన. ఇది కరుణ, భక్తి, శాంత రసాలు పలికే రాగం. 28 వ మేళకర్త హరికాంభోజి జన్యం – జంతువులతో లైంగికక్రియ జరపాలనే విపరీత ప్రవృత్తిగల హరిదాసు అనే చిన్నవాడి కథకు ఈ పేరు పెట్టారు. అంటే ఆ కుర్రవాడి అమాయకత, దయనీయ స్థితిని – కరుణతో చూడాలనే వుద్దేశమేమో తెలియదు.

అలాగే అసావేరి. ఇది సున్నితం. కోమలం. 8వ మేళకర్త హనుమత్తోడి జన్యం. వెంకటరత్నం అనే కుర్రవాడు అతి సున్నితమైన మనస్సుకలవాడు. తన తల్లి చనిపోయాక ఆ బెంగతో మళ్ళీ పెళ్ళి మాటెత్తక తనను పెంచిన తండ్రి జీవితం ప్రభావం, ఇతడి మీద వుంది. కడివెడు దుఃఖం మింగిన 'అమ్మమ్మ' ఎంత పోరినా, ఇతడు ససేమిరా పెళ్ళి చేసుకోడు. చివరికి ఇతని నిర్ణయాన్నే ఆమోదిస్తుంది అమ్మమ్మ ఈ కథకు ఇందులో హృదయాల కోమలత్వాన్ని ధ్వనిస్తూ – ఈ రాగంపేరు పెట్టారేమో తెలియదు.

మరో రాగం కన్నడ. ఇది వీరరసప్రచోదకం. రాగం ఎక్కువగా, కృతిమీద ఆధారపడి, రక్తి కట్టగలది. 29 వ మేళకర్త ధీరశంకరాభరణ జన్యం. ఒక కుర్రాడు ఓ సినిమానటిపై మోజు పెంచేసుకుని, ఆరోగ్యం చెడగొట్టుకుంటున్న సందర్భంలో కథకుడు (ఉత్తమపురుషలో కథనం నడిపే పాత్ర) డాక్టరు బారినుంచి కాపాడి, మిడివేసవిలో ఆ కుర్రవాణ్ణి, తనకు పూర్వపరిచిత అయిన ఆ నటి యింటికి తీసుకు వెళ్తాడు. ఎండ వేడిమికి తాళలేక ఒళ్ళు పేలిపోయి, ఏ అలంకరణలూ, సున్నితత్వం లేకుండా ఆమె కనిపిస్తుంది. కుర్రాడికి ఆమె రూపం చూసి వికారం, విరక్తి కలిగాయి. కథకపాత్ర లక్ష్యం నెరవేరింది. ఆ కుర్రవాడికి కనువిప్పు కలిగింది – పడిపోయే మనిషిని పట్టుదలగా నిలబెట్టిన కథక-పాత్రది వీరోచిత కృత్యంగా భావించి – ఈ కథకు ఈ రాగంపేరు పెట్టారేమో తెలియదు.

ఇలాగే ఇతర రాగాలు, తదితర సంగీత సంబంధ శీర్షికలు, శాస్త్రిగారు ఎందుకు పెట్టివుంటారో – ఎవరైనా నమ్మశక్యంగా అన్వయించ గలిగితే బాగుంటుంది. ఈ విషయమై శాస్త్రిగారు మౌనం వహించారని నేననుకుంటున్నాను. ఎవరికైనా చెప్పారేమో! నాకు తెలిసినంతలో తెలియదు.

మల్లాది రామకృష్ణ శాస్త్రి గారిది, 'కథవ్రాసే శైలి' కాదు. "కథచెప్పే శైలి" – ఇంకొక లాగ చెప్పాలంటే : ఆయన కథ "వినిపించే" కథ. "వ్రాసే కథ" కాదు. ఆయన కబుర్లు చెప్పినంత తేలికగా కథ చెపుతారు. నృత్య, సంగీతాలంటే ఆయనకు ప్రాణమని, మనకు కొన్ని కథలు చెపుతాయి.

ఇంకొక విశేషం: శాస్త్రిగారు ఒక్కొక్కసారి తను చెప్పదలుచుకున్న కథనంతా చెప్పక పోవచ్చు. ఒక్కొక్కసారి గూఢంగా చెప్పవచ్చు. ఆయన, తన "శ్రోతను" (పాఠకుడని కావాలనే నేను పేర్కోవడం లేదు) తనతో పాటు "పూరకుడు"గా పాలుపంచుకోవాలని ఆశిస్తారు.

ఈ సంపుటంలో కథలన్నీ చదివితే మనకనిపించే సారాంశం: ఆయన నిత్య నూతనత్వం కోరే మనిషి. కుల, మతాలకు మించిన మానవ హృదయస్పందనం; జీవన వాస్తవాలను, ఒడిదుడుకులను ఏమరకుండా, నడవగలిగే నడవడి; ఆయన కోరుకుంటారు.

జీవితం – పాటంత సరళంగా, పరిమళమంత స్వచ్ఛంగా, జనపదమంత నిరాడంబరంగా, యౌవనోత్సాహమంత కాంతితో – సాగాలని ఆయన ఆశిస్తారు.

పచ్చని చేలమీద పైరగాలి వంటిది మల్లాది రామకృష్ణశాస్త్రిగారి మనస్సు.

*భక్తి పలికితే – తులసీ దళమంత !*
*ప్రణయం పలికితే – మరువపు మొలకంత!*
*కొంటెతనానికి పోతే – కోటప్పకొండ తిరునాళ్ళంత!*

ఇన్నాళ్ళకి మళ్ళీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారి కథలను బృహత్ సంపుటిగా పాఠకుల కందిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారిని మనసా అభినందిస్తూ –

సికిందరాబాద్
15-9-1999
మంగళవారం.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

# కథాక్రమం బెట్టిదనిన...

# ఛాందోగ్యం

ఆ లోకం...

అ - లోకం; దీనికన్న, అదో "మాఁలోకం."

- చచ్చి చెడి, ఏలాగో అక్కడికి ... దిగజారితే! కాదా, ఎగప్రాకితే...

ఈ లోకంలో చావని కావని బ్రతుకంతా పిశాచ, పీడగా ఆవహిస్తే, మరి, అప్పుడు...

అ లోకాన్నుంచి ... ఏ లోకానికి ఎగ, దిగ ...?

ధిక్ ... అఫ్‌సోస్ .

చావంత చచ్చిన చావూ, మరొకటిలేదు.

చావు-బ్రతుకులు ..

బ్రతకమని, యీ జోగాయ్ - మాథాయ్ అంతా, వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నారు.

... బ్రతికుండగానే ...

- బ్రతకనుకదా అనే నిరాశతో, పెళ్ళాం మెళ్ళో పుస్తే - పూసా, భువనేశ్వరంలో ఆ సామి-సన్నిధిని...మీదు కట్టింది -

చచ్చిపోతే...నేను చచ్చినంత ఒట్టు...

నామీద...నామీద.. ఒట్టే -

అక్కడా, అక్కడా అడ్రస్ తెలియని ప్రియురాళ్ళందరూ...

రాళ్ళకూ, రప్పలకూ, మొక్కుకుంటా రంటావా?

ఒక్కతె ముక్కూ మొగమైనా జ్ఞాపకం లేదు. ఇప్పుడు ... నిజం చెప్పొద్దూ - ఉహూఁ...

ఒప్పుకోను ..

అబ్బ! ఒప్పుకోనంటే, ఒప్పుకో నోహో అని, నన్ను, ముప్పతిప్పలూ పెట్టలా, అవాళ ... అప్పన్న మేనకోడలు?

అదేనయ్యా...దీం తస్సాదియ్యా.

అప్పటికీ .ఇప్పటికీ...

మన మగసిరిమీద, ఈ దెబ్బపోటు...

అబ్బ!...పో-టు...

...మెత్తహో ఉండేవి కావూ దాని చెంపలు?

...కెంపులు చుట్టూతా, మధ్య మాంచి రవ్వ...ఆ దుద్దుల్లో తళుక్...

- హ...బ్బా-ఎడం డొక్కలో క-ళుక్...మంది.

- మందిచ్చినప్పుడల్లా పుచ్చుకోవాలా, ఏం -

గుచ్చుకుంటుందోయ్...చెన్నకేశవులూ –

ఏపూట కాపూట, పంకజమ్మ చెల్లెలి చూపులు...యుష్మత్ సూదికి...తాతగా – ముత్తాతగా...గుచ్చుకునేనోయ్...

అచ్చాయిగాడి మేనత్తను – కొంచెం కదలేసి, సంగతేమిటో తేల్చవే అని, హెచ్చరించడానికే, మనకు ముచ్చెమటలూ పోసినాయ్..

ఆసుపోసినట్టుగా, అటూ ఇటూ తచ్చాడి. ఆపక్కనుంచి ఈ పక్కకూ...యీా...

ఊం...ఈపక్కనే పడి ఉండనీయ రేమ్రా...

ఇటు ఒరిగినా..అటు తిరిగినా, మధ్య మీకు ఒరిగే దేముంది?

మీకు...ఏం ఒరిగిందీ?

నన్ను మరిగిందనుకుని, ఒళ్లు హూనం చేశాడు కదూ, సీనయ్య, అమ్మణమ్మను, అవాళ...తెల్లారిగట్ట...

ఇవాళ – గడిచేట్టు లేదేం? ఏమో లేకపోతే, ఏం!

..."ఏం రాకపోతే, ఓం – యబ్బో! నువ్వులేకపోతే ... నీ తాత, .." అంది కాదూ, అక్కమ్మ ముత్తవతల్లి?

పిల్ల...పసందైందికదా అని, కొండమీది కోతులన్నీ దింపాను దానికోసం...

– కోసం ... మో...సం –

– నన్ను మోసం చెయ్యకండో అంటూ, ఇంటావిడ రాగాలు సాగించడానికి ... ఇంకా ఎంత టైమ్ ఉంది?

... ఇల్లూ – బంగారం

దానిల్లు బంగారం కానూ...

"ఇల్లూ వాకిలీ అంటూ కాస్త ఏర్పడితే... మీ పేరు చెప్పుకుంటానండీ" అని, బ్రతిమాలుకుంది, పాపం, వారిజ:

... "ఇంటి వాసాలు లెక్కబెట్టేందుకు, నేనొక్కణ్ణే చాలునటే.." అన్నాను...చిన్న బుచ్చుకుంది...

అలా...నొచ్చుకోవడమే, దానికి అచ్చొచ్చింది.

– మరీ పచ్చిపో ఉన్నాయేం, బత్తాయీలు?...ఫలంపాటు.

"అటూ పోటూ వేళ – అక్కడకాదు, ఇక్కడ ఉందాం రండి!" అని ... అది చిలకకు చెప్పినట్టు చెప్పింది...

ఉహూం...అంటే ఉహూం...

దానికన్న నేను తడిపి ముప్పందుమైనా...

తైనా, నాకు వాడితే, చెవుడు నీకు రావాలేం? –

ఏం సాంబశివుడూ, ఏం చేస్తూందిరా, మీ కన్నమ్మ...

...అన్నెము, పున్నెమే నెరుగనమ్మ...ఛస్, ప్రబంధంలో ఆడది పద్యం పాడకపోతే, ఏం?

ఏం – రోగం?

రోగం?–నాయ్–నాయ్:– అంటే పేదవాళ్ళకు వచ్చేది జబ్బు, మనది వ్యాధి, ఇతి వైజయంతీ...

కాంతిలో నిలువకే...నీ చెక్కులు, కందితే...

అందితే వదిలేవాణ్ణా? దానియక్క చాటున దాక్కుంటే మాత్రం?

...మాత్ర మింగినా, మంచినీళ్లు తాగలేదు..మా మనోహరా..
తాగలేనూ? –
మీగడ తీసేసి తోడెట్టాలా ఏమిటే మీ అమ్మాయిని సింహాచలం?
– లేదు, బాబూ, పక్కింటి నాగేశ్వరికన్న, ఎటుచూసినా, మా చంటిదే కాస్త చిక్కన...
అందోయ్–అయ్‌తేనే రమ్మందోయ్...
ఓయ్ అనకముందే కోయిలను కవ్వించేదోయ్, కొంటెపిల్ల..
జంటస్వరాలనేవాళ్లం అప్పలస్వామి కూతుళ్లను –
అందుకోసం కాదుగాని అవాళ ముత్తానికి రంగారావుకు పళ్ళురాలినాయ్.
...టొంయ్–మనటమేకాని, అరవిందది అంతా పట్టి బోకరింపని నిమిషంలో తేల్చేశాం కాదూ?
ఆదిలక్ష్మి కళ్ళల్లో అదోమాదిరి అందం...
పందిరిమంచం మీంచి క్రిందికి దింపేట్టున్నారే?....
– బాలీసులాగా ఉండేది, గాలీబు మరదలు –
వరదా, మువ్వగో–పా...లా...
చాలించండోయ్ ఏడుపులూ...చావు, దగ్గిరకు రావడానికి హడలుతూంటేను!
సుబ్బులూ...
మబ్బులు దుబ్బులుగా పుట్టడానికి, ఏమిటా మహత్తర కారణం?
దేశంలో లేస్తే మనకేం పట్టింది?...మనకు లేచిందే రణం...
ప్రణకిణాంకిత.. దిగ్గిరగా ఆడవాళ్ళముందు అనేందుకు వీలులేకుండా, అక్కడ, ఓ బూతు తగలేయకపోతేనేం, జగ్గాయ్?
...ముగ్గు చెరిపేస్తానని బెదిరిస్తే, బుగ్గలు నులిమేసింది కాదూ, అమాంతం... లక్ష్మీకాంతం –
ఎంత భారీమనిషో, స్వారి చేసినట్టుండేది..ఛాస్...సడీ చప్పుడూ లేకుండావచ్చి, జాజిపొదను గడ–గడలాడించేది...
మడిమే గా, కృష్ణుడిలో దక్కిన మానవత్వం...
పాపం నిత్యద్విత్వంగా బ్రతికిన బ్రతుకు...తల్లీ...
– మన గోడమీద మెసిలే బల్లికి, పిల్లలు ఎందరో? వల్లీ వల్లని మగడైతే...తల్లిప్రాణం కాదూ? మరి...తలనుంచి తోకకు వస్తుందా?
ఇంఖా పుండుకు రాస్తూంది ఇల్లాలు; మళ్ళా గట్టెక్కితే మాత్రం మర్యాద దక్కిస్తాననే నమ్మకం ఏమిటో?
అమ్మకచెల్ల నాదు మన సమ్మక చెల్లదు...ప్చ్...తంజావూరులో ఏమూల చూచినా ఇలాగే తిక–మక:
...రకానికో కోరకాన్ని, గికురించే...
సకిమోముగా–నాలేనీ...నా...
మనసా వాగటోకే – మళ్ళీ జన్మలో మనకు ఈ రంధి ఎలాగూ తప్పదు...
దుకూల చౌరాయ...నూతన జలధర రుచయే, గోపీ వధూ...టీ...

★ ★ ★

# ఔనౌను

– గోపన్నకు – ఏవిచారమూ లేదు:

పెళ్ళాంమాత్రం పుట్టెడు దుఃఖంతో ఉంటుంది, ఎప్పుడు చూచినా; ధుమ ధుమలాడుతూ అన్నా ఉంటుంది: అక్షులూ – పక్షులూ పాడలేట్చూ, – తన్నూ, – కనిపెంచి, పెద్దవాన్ని చేసి, – పీడ వదుల్చుకున్నట్టు, చివరికి యీ నిర్భాగ్యుడికి అంటకట్టిపోయిన తలిదండ్రులనూ, కడుపున ఒక్కకాయన్నా కాయించకుండా, – కష్టపట్టినట్టు ఆ రవంత వరమూ యివ్వడానికి మొగమొగాలు చూసుకుంటూన్న దేవాదిదేవులనూ – వాళ్ళకు పితృ పితామహాదులంటూ ఉండేవాళ్ళనూ – తిట్టి దుమ్మెత్తిపోస్తూ ఉంటుంది:

అలా ఏప్పుడూ, నోరు మూతపడకుండా ఆడిపోసుకుంటూ ఉంటుందంటే ఆ యిల్లాలులోపం ఎంతమాత్రమూ లేదు: గోపన్న ఏదీ పట్టించుకోడు: బెల్లంకొట్టిన రాయల్లే మిన్నువిరిగి మీద పడుతూన్నా తన్నుకానట్టు, నిశ్చింతగా ఉంటాడు: ఇంట్లో, ఆపూటకన్నా వండి వార్చేందుకు – ఉప్పూ పప్పూ నిండుకున్నాయన్న విచారంలేదు: ఇంటిఇల్లాలికి, – మెడలో పసుపుకొమ్ము తప్ప – చిన్నం ఎత్తు పుస్తైన్నా లేకపోయెనే అన్న విచారం లేదు–

– "అంతా రాముడి కరుణ – అన్నింటికీ ఆ దయాసింధువే ఉన్నాడు" – ఇలా శ్రీరంగనీతులు చెపుతూంటే, – తనకన్న వేయిరెట్లు దరిద్రంలో మునిగి తేలి, తరించిన భక్తుల చరిత్రలు నిదర్శనంగా ఏకరువు పెడుతూంటే, – ఒళ్లు మండుకురాదూ? – ఆయనకు ముదిరిన వేదాంతం ఆడకూతురికి ఎలా అబ్బుతుందీ?–

ఎప్పుడూ చీటికీ మాటికీ కజ్జాతప్పదు – అది రగిలి – రగిలి, – రోజువిడిచి రోజన్నా పస్తులుండటం తప్పదు – ఇదంతా కూడా ఆ రాముని కరుణే! – ఏదన్నా ఓ కారణం అంటూ కనబడితే – ఆ పూటకు పొయిలోపిల్లి లేవకపోయెనే – అనే ధ్యాసే పోతుంది: ఇలా కాగా, – కాగా ఏనాటికైనా, – ఈ రెండు పూటలా భోజనంకోసం అంగలార్చడం – ఉదరం మీద ఉండే ఈ మమతా, క్రమంగా సన్నగిలిపోయి – ఇవన్నీ తుచ్ఛ ఐహిక ప్రమేయములనీ, – రామనామామృతం సేవించితే, – ఆకలి దప్పులు జన్మజన్మలకూ ఉండవనీ, – అందు లవలేశమన్నా వంటపడితే, – అసలు మళ్ళీ జన్మంటూ ఉండదనీ, – అందుకు, – ఆ సుమూహూర్తానికి, – యిప్పుడు పడుతున్నామనుకున్న యాతనలన్నీ, – దోహదములనీ, – ఇలా తపించగా తపించగా – ఆ తరుణం రాకమానదనీ, – గోపన్న ఎన్నోవిధాల నచ్చచెప్పాలని యత్నించాడు కాని, ప్రయోజనం లేకపోయింది:

లేకపోగా, – ఆనాటి కానాటికి ఆవిడ హారం మితిమీరి పోయింది అందరికిమల్లే తానూ ప్రయోజకుడై, – నలుగురి యిల్లాళ్ళలో తను తలయెత్తుకుని తిరిగేట్టు నిర్వాహకం చేయకపోతే, – ఇహ, ఒక్క క్షణం యీ కాపురం చేయలేనంది. ఏ గంగలోనన్నా దిగుతానంది; అంత అఘాయిత్యం సాగకపోతే – అధమం పుట్టింటికైనా పోతానంది అ ఎత్తే ముష్టి – నష్టీ అక్కడే యెత్తుకు తింటానంది తనూ, తన శ్రీరామచంద్రమూర్తీ కలిసి, ఎల్లకాలమూ ఉట్టికట్టుకు ఊరేగమంది· కుచేలోపాఖ్యానం, మహాభక్త విజయం కలిపి చలిమంట వేయమంది – ఇది ఏదో తేలేదాకా, గంగ ముట్టనంది – మాటకు మాట జవాబు చెప్పవలసిన అవసరం లేదంది – చెప్పినా విననంది:

గోపన్న, – శ్రీరామచంద్రుడిపటానికి నమస్కారం చేసి – ఉత్తరీయం వేసుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు: ఇది, ఆ యింట మామూలే! –

వెళ్ళడం, తిరిగి మళ్ళీ పూజవేళకు యిల్లుపట్టడం – ఇదీ మామూలే! –

– ఆతడు – అటు వెళ్ళాడోలేదో, – ఎవరో పెద్దమనిషి – "గోపన్నగారు ఉన్నారా?" అంటూ వచ్చాడు: "ఉన్నారా అమ్మ?" అని ఆ యిల్లాలిని పలుకరించాడు

"లేరు!–" అని ఆమె రుసరుసలాడింది.

"ఎప్పుడొస్తారు?"

"ఏమో!–"

"భోజనం వేళకు –"

– ఆ యిల్లాలు ఛ్రుమంటూ లేచింది –

"లేరంటే పోరాదూ? – ఎవరయ్యా మీరు – మీకేం బాకీ ఉన్నారా?–"

ఆ పెద్దమనిషి, – మృదువుగానే –

"వారి దర్శనానికి వచ్చానమ్మా?–" అన్నాడు:

"అం – అదే నేనంటూంట! – నాకు తెలుసు, వారి దర్శనానికే. ఆయన్నూ నన్నూ నడిబజారులో పెట్టి వేలం వేసినా రాగిడబ్బు రాలదు–!"

– "ఈ ఇల్లాలేం పైత్యానపడ్డదా? –" అన్నట్టు విస్తుపోయి – ఆ పెద్దమనిషి – "అదేమిటి తల్లీ! – ఆయన దైవసమానులమ్మా! – " అని మాత్రం అని సెలవు పుచ్చుకున్నాడు.

ఆయన గడప దిగీదిగడంతోనే, – పూచిన తంగేడల్లే ఒంటినిండా నగలతో, – వయ్యారి నడకతో, – నవ్వుకుంటూ కలకలలాడుతూ, – "ఇది తప్పకుండా సానే!" అని తేలికగా అర్థమయ్యే వాలుచూపులతో, – మాంచి ఏపుమీద ఉన్న ఓ సింగారి, – అతి చొరవగా లోపలికి వచ్చి, – "అమ్మగారూ దణ్ణం!" అంటూ దగ్గిరగా కూర్చుంది:

"ఎవరు నీవు? –" కొట్టొచ్చినట్టు అడిగింది ఆ యిల్లాలు, చూసీ చూడటంతోనే, కళ్ళుకుట్టి –

"అయ్యగారు ఉన్నారా అమ్మ?"

"ఏం – మా ఆయనతో నీకేం పని? –"

"ఉంది! –"

"ఉందీ? ఎత్తింది ఆడపుటక కాదూ, సిగ్గులేదూ? – పట్టపగలు నడిబజారుగుండా నడచివచ్చి – అయనతో పనుందంటావ్? – ఈ ఇంటోకి నిన్నెవరు రమ్మన్నారు. మింగమెతుకు లేదుగాని, – మధ్య మాకు ఇదో తంటసమా? – ఇదా, భక్తి? – కనుక్కుంటానుండు–!"

"అపచార మమ్మా!–"

"నాకు నీతులు బోధిస్తావుటే – నీ బ్రతుకెంత, నీవెంత–"

"శానమ్మా! – నా మనవి ఆలకించండి!–"

"ఏమిటా మనవి?–"

"ఇదె!–"

– వెయ్యి మొహరీలున్న మూట, చెంగున తీసి, ఆ యిల్లాలి ముందు ఉంచింది – "మీదేనమ్మా – మా ముత్తవ తల్లికి అయ్యగారు, – ఏదో చల్లనిముక్క ఏనాడో చెవిని వేశారు: అదే స్మరించుకుంటూ, సుఖంగా కాలంవెళ్ళబుచ్చుకుంది: చివరి ఘడియల్లో నాకు చెప్పిపోయిందమ్మా – సరిగా నాటికి ఏడాదినాడు, – అయ్యగారికి ఈ తృణం సమర్పించి, – స్వీకరించమని ప్రార్థించానని మనవిచేయమన్నదమ్మా – నేను మనోహారినమ్మా – మీ దర్శనం యీ రూపేణా చేసుకున్నాను – కాని, అప్పుడప్పుడు అయ్యవారి పాదాలు కళ్ళకు అద్దుకుంటాను –"

మొగాన బొట్టుపెట్టి, – చేత తాంబూలం ఉంచి, – ముల్లె అందించి సాగిలి మ్రొక్కింది –

"అదేమిటే నీ యిల్లుబంగారంగానూ – నాకు మొక్కుతావెందుకే – నీవు మంచిదానవు గనుక – మీ ముత్తవతల్లి మాట దక్కించావు! మరొకళ్ళయితే – అప్పుడు తల ఊపినా, – యింత సొమ్ము చేజార విడుచుకుంటారా? – నీకు పిల్లలెందరు? – ఎన్నడన్నా వచ్చి చూసి పోతూండు –"

మనోహారి సెలవు తీసుకుని వెళ్ళిపోయింది – మరో గడియకు గోపన్న వచ్చాడు – వచ్చీరావడంతోనే, – యిల్లాలు గునగునలాడుతూ, – "ఏమండోయ్!–" అంటూ గంతులేసినట్టు వచ్చి, కంఠం పెనవేసుకుని, – గుక్కతిప్పకుండా చెప్పివేసింది – ముల్లె కళ్ళఎదుట గలగల లాడించింది –

"రామా!–" అన్నాడు గోపన్న నిట్టూర్పుగా – "పుచ్చుకున్నావా?" అన్నాడు.

"అదేమిటండీ? – పుచ్చుకోక చేదా?–"

"కాదుటే, – వెర్రిదానా?–"

"ఇహ మీ వేదాంతం చాలించండి – లెండి భోజనానికి –"

– ఇలా అంటూండగానే, – యిందాకటి పెద్దమనిషి మళ్ళీ చక్కా వచ్చాడు, గోపన్నకు మ్రొక్కాడు – చూసీ చూడటంతోనే, – ఆ యిల్లాలు నవ్వు మొగంతో, – "దయచేయండి బాబూ!" అని ప్రత్యుత్థానం చేసి, – "ఇంతకు ముందు ఒకసారి వచ్చి వెళ్లారండీ, 'వస్తారు ఉండండి!' అందామనుకుంటూండగానే చక్కా బోయినారు – వారిని కూడా భోజనానికి ఉండమనండి–" అంటూ లోపలికి చక్కాబోయింది

"ఎవరుబాబూ తమరు?" గోపన్న ఎంతో వినయంగా పలుకరించాడు: వచ్చిన పెద్దమనిషి, అదాటున గోపన్న పాదము లందుకుని కళ్ళకు అద్దుకున్నాడు.

"అదేమిటి బాబూ!" అని గోపన్న కలవరపడుతూ తప్పుకుని, లేవనెత్తాడు –

"అంతే అయ్యా!–ఇందుకోసం ఇన్నాళ్లూ తపించాను–ఇప్పటికి తరించాను –"

"కొన్నేళ్ళక్రితం – గోదావరి స్టేషనులో, రాత్రిపూట మీరు నిద్రపోతూండగా, – మీరొండినున్న మూడు పచ్చనోట్లూ మాయమైనాయ్, కాదూ? తీసింది, నేనే – అప్పటికి నాకు అదేవృత్తి – కాని, ఆ సొమ్ము వచ్చిన వేళావిశేషాన అనాటినుంచీ నేను పట్టింది బంగారమైంది. అనుకోకుండా, ఏమీ యత్నంలేకుండా, అన్నీ కలసివచ్చినవి వాటంతట అవే:

"నేను మళ్ళీ ఎన్నడూ నీచానికి దిగలేదు – మీ సొమ్ము విడిగా వర్తకంలో తిప్పాను–వృద్ధి అయింది – మనవిచేసుకుందామని వచ్చాను – అనుగ్రహించరా!–"

గోపన్న ఆశ్చర్యపడలేదు – కనురెప్పైనా కదలించలేదు

"శ్రీరాముడికి దయకలిగింది నాయనా!–ఆ కొంటెవాడు ఎప్పుడూ యింతే–"

ఇల్లాలు, – లోపలికి వెళ్ళినట్టు వెళ్ళిందేకాని, – లోగుమ్మంలో నిలుచుని, ఇదంతా ఆలకించింది – కళ్ళింతలు చేసుకుని–

"ఏంబాబూ, – ఏమాత్రం వృద్ధి అయింది?–" అన్నది –

"లక్షరూపాయలు దాటుతుందమ్మా!–యీ యేటి లాభాలు కలుపలేదింకా?–"

"నా ఉనికి ఎలా తెలిసింది నాయనా!–" అని గోపన్న కించపడుతూ అడిగాడు–

"అనాడు పైకంతోబాటు రైలు టిక్కెట్టుకూడా ఉందికదా బాబూ:– ప్రయాణం ఎక్కడికో తెలిసింది – యాదాలాపంగాచూసి, – మీ పక్కనే జారవిడిచాను – తరువాత కొన్నాళ్ళకు యీ ఊరువచ్చి జాడలు తీశాను – మీ దర్శనం చేశాను: అప్పుడప్పుడువచ్చి మీకంటపడకుండా, దూరాన్నుంచే మ్రొక్కి పోతూండేవాడిని – ఈ మాత్రమైనా కూడబెట్టి, అప్పుడొచ్చి, మీ పాదాలదగ్గిర వ్రాలుదామనుకున్నాను: ఈనాటి కది సిద్ధించింది.–"

ఉన్నంతలో, భుజించి ఆ పెద్దమనిషి, – సెలవు తీసుకున్నాడు. తనకు అగత్యం లేదు, – ఆ సొమ్ము తన యిల్లాలి పరం చేయవలసిందని, గోపన్న, – అతడలా ప్రాధేయపడుతూంటే అసలు కాదనలేక, ఒప్పుకున్నాడు –

– "ఇవాళ లేచినవేళ ఎటువంటిదండీ!" అని ఆ యిల్లాలు కలకలలాడింది. చిటిపొటి పోణెములు ఎన్నో చేయబోయింది: తాము, ముందుముందు, ఎలా సుఖపడిపోయేదీ, – ఇన్నాళ్లుగా మనసులోనే కుమిలి హతమారిపోతూన్న ముద్దు ముచ్చటలన్నీ ఎలా తీర్చుకునేదీ, నోరునెప్పిలేకుండా ఏకరువు పెట్టింది. అన్నీ విని, విని, – గోపన్న, –

"ఇంతటితోనైనా, కడుపు నిండినట్టేనా?" అని నవ్వుగా సౌమ్యంగా అడిగాడు –

"ఆహా! నాకింకే కోరికాలేదు: నేను పట్టిననోములు ఫలం లేకుండా పోతాయా? – ఇట్లాగే మళ్ళీ యీనాటికి మన నట్టింట ఉయ్యాలతొట్టె వేసుకుంటే–"

గోపన్నవంక క్రొత్త పెళ్ళికూతురల్లేచూసి సిగ్గుపడ్డది –

గోపన్నకు, – కన్ను తడి అయింది.

పూజామందిరం దగ్గిరకు వెళ్ళి – "అర్థం అయింది ప్రభూ!–" అని నవ్వాడు – వచ్చేశాడు –

– గోపన్న మళ్ళీ యింటికి రానేలేదు: ఎందరిని విచారించినా ఎవరికీ అచోకీ తెలియదు: ఎన్ని దేశాలు గాలించినా, జాడేలేదు: ఏమైపోయినాడో తెలియదు:

– వేసీవేయకుండా ఉన్న ఆ యింట్లో – ఆ యిల్లాలు ఒక్కతే – ఎప్పుడూ ఆ పూజామందిరందగ్గిరే కూర్చుంటుంది – "అర్థం అయింది ప్రభూ! అనుగ్రహించు!–" అని జపిస్తూంటుంది:

తొలిరోజుల్లో విలవిలా ఏడ్చేది – భయపడేది – ఇప్పుడు ఏ విచారమూ లేదు; అతిశాంతంగా ఉంటుంది – ఏనాటికైనా అతడు తిరిగివస్తాడనే నమ్మకం ఉంది – ఎప్పుడు వస్తాడో అనే ఆరాటం మాయమైంది – అలా, రాముణ్ణిచూస్తూ కూర్చోడం తప్ప, – ఆ యిల్లాలికి మరోకోరికే – ధ్యాసే – లేదు.

★ ★ ★

# శివరంజని

చిక్కయ్య–పండి పండి ఆరముగ్గి రాలిపోయినాడు: గుటుక్కు మనగానే అతడి ఆత్మ స్వర్గానికి ప్రయాణంకట్టింది: పోతూ పోతూ, ఆ జుంగమీసాలూ, ఆ పాత తంబురా, అంటిపట్టుకు వెళ్ళింది:

– స్వర్గందాకా వెళ్ళాడు: బయట గేటు వేసిఉంది.

"పాపం, నిద్రపోతున్నారేమో!" అనుకుని తట్టకుండా అక్కడే ఉన్న ఓ చట్టుమీద చదికిలపడ్డాడు:

ఎంతసేపు అలా కూర్చుంటాడూ?–విసుగేసుకొచ్చింది: మీసాలు ఎగసన దోసుకుని, తంబూరాదండె అందుకుని, పంటితో చుంగు బిగించి, రింగ్ మనిపించి, గొంతు ఎత్తాడు:

అవతలివాళ్ళకు నిద్రాభంగం అవుతుందేమోనని, – కూనిరాగంగానే ఎత్తుకున్నాడు – కాని మనసు ఊగినకొద్దీ మీటు మోపైంది – ఆ లోకంలో ఒంటిగా వదిలేసివచ్చిన పెళ్ళాంమీద భ్రమకొద్దీ గొంతు మోగింది –

– ఒంటిగా తూగేవు
ఓ సైన మారాజ
ఇంటికాడ చుక్క
కే(భ్రమత లాయెనో...రాజా–
ఉత్తుత్తి పున్నాని
కురికి గంటేసేవు
నీ నీడలో తొంగి
సూడవో మారాజ...

– ఇలాగే పాడుతున్నాడు – పాటతో ఊగుతున్నాడు. ఇంతలో గేటు అర్దరినుంచి ఎవరో కేకవేశారు.

"ఎవ రక్కడ?"

"ఓహో! ఎవడో దేవతల్లె ఉన్నాడు" అనుకున్నాడు చిక్కయ్య. గరపచేలో రాటుతేలిన ఘటమేమో, తడుముకోకుండా రొమ్ము విరుచుకున్నట్లు జవాబు చెప్పాడు:

"నేనే!"

"నేనంటే?"

"చిక్కయ్యని!"

"ఏమిటా మోత?"

"మోతకాదు, పాట!"

"దాంతాడు తెగిరిలే–ఇంత ఆలస్యంగా వచ్చావేం?"

"అయిందిలే–ఆలస్యం! ఇందాక సంజె పొద్దునేకా, మనం చచ్చిపోయింది!"

"సంజె పొద్దునా?–అయితే, రేపటికి జేరుకొనేవాడన్!"

"ఏమయ్యోవ్, దేవుడూ!–నేను మెరకచేలో మనిషిని!"

"అలాగేం?–మన దేవూరు?–ఏ తాలూకా?"

"నందిగామ!"

"ఊరు?"

"చెపితే నీకేం తెలుస్తుంది?–ఎన్నడన్నా ఆ చాయలకు వచ్చావా ఏం!"

"నాకు అంతా ఎరికేలే–ఏ ఊరు?"

"సింగారం–"

"పేరు–?"

"మా యింటిపేరు అయినాబత్తులవాళ్ళు–

"బండ చేష్టయ్య రెండో కొడుకునయ్యా – చినలింగయ్యని!

"చిక్కయ్యంటారు ఎరగవ్?–"

"అంటే అన్నారులే!– తెల్లారేదాకా అక్కడే పండు, గొడవచెయ్యకుండా!–"

"పరేలేవయ్యా!– నీ మానాన నీవుపోయి బబ్బో!"

"ష్!– నిశ్శబ్దం!–"

చిక్కయ్య మెదలకుండా కూర్చున్నాడు: అది మండువేసంగి అయినా తెల్లవారుజామున చలిచలిగా ఉంది – ఒళ్ళు విదిలించుకుని, మళ్ళీ తంబురా అందుకొని గొంతు విప్పాడు –

కువకువలాడుతూ, దేవకన్నెలు గేటు దగ్గిర మూగి సందులగుండా తొంగి చూస్తున్నారు.

"ఎంతచక్కగా ఉందోనే–ఏం బాగాపాడుతున్నాడే!" ఈ కిలకిల పసికట్టి, చిక్కయ్య మరీ పెచ్చురేగాడు – ఇంకోటి అందుకున్నాడు –

జొన్న సేల మయ్యాన
– వన్నెసూసి కన్నేసి
దారికాసి చేరదీసి
కోరమీసం యెంకటసాఁయ్–
ఏమన్నాడే సిట్టీ
ఏమన్నడే–వా, డేమన్నడే...
– ని న్నేమన్నడే!...

దేవకన్నెల లేతకన్నులు విలవిల్లాడుతున్నాయ్ –

"ఏం పాట అది?"

"యాలపదం"

"యాల, యాల!" కన్నెలు సంబరపడ్డారు –

"ఏం లయగా ఉందే!"

ఇంతలో గేటు విచ్చుకుంది.

"చిక్కయ్యా!" దేవత గుమ్మంలోంచి కేక వేశాడు.

"ఊఁ!"

"రా—లోపలికి రా—"

"—నన్ను బ్రతిమాలడం దేనికయ్యా – నేనే వస్తాంటినిగా!"

– ఒక్క మెరుపులో, దేవలోకం అంతా తెలిసిపోయింది, రంజుగా యాల పదాలు పాడే లయకా డెవడో వచ్చాడని. అది యింద్రుడిదాకా ప్రాకింది. పైగా, ఆ పూట, దేవరాజుకు ఆటవిడుపేమో కూడా –

చిక్కయ్యను లోపలికి వెంటబెట్టుకువెళ్ళి, ఆ దేవత ఏదో విడిదిలో దించాడు: అమ్మయ్య – అని నడుం వాల్చబోతూండగానే – మరో బడాదేవత ఉరుకులు పరుగులుగా వచ్చాడు –

"చిక్కయ్యా?"

"అంటే, మనమే!"

"పదాలు పాడుతావటనే?"

"భేషుగ్గా!"

"అయితే, రా పోదాం!"

"ఎందాకా?"

"ప్రభువు సన్నిధికి!"

"ప్రభువా?"

"ఏం భయమా?"

"నాకెందుకయ్యా? – పద!"

ఇద్దరూ కలిసి, ఓ పెద్ద వీధిగుండా పడిపోతున్నారు. రెండుపక్కలా కొండలల్లె, వెండి ముద్దలల్లే ఇళ్ళున్నాయి. అందులో అందరూ కిటకిటలాడుతూ, గడ్డాలు వ్రేళ్ళాడే ఋషులున్నారు:

ఆ యిళ్ళన్నీ దాటి, ఓ అపరంజి భవంతిముందు ఆగి, – పహారావాళ్ళకు సంకేతవాక్యం చెప్పి లోపలికి వెళ్ళారు:

ఒక్క మనవి:—

లోపల దేవరాజు తీరుబడిగా కూర్చుని, తాపీగా హుక్కా త్రాగుతున్నాడు. చిక్కయ్య దేవరాజును చూసి, దాసోహం అన్నాడు. ఆయన పరధ్యానంగా ధీమాగా తల ఊగించాడు.

చూస్తూ చూస్తుండగానే, ఒక్క నిమిషంలో అక్కడకు, దేవకన్నె లందరూ ఎక్కిదక్కిగా వచ్చిపడ్డారు. మరీ మరీ ముందుకు రావాలని, ఒకళ్ళనొకళ్ళు త్రోసుకుంటున్నారు. కిచకిచలాడుతున్నారు, కేరింతలాడుతున్నారు, గుసగుసలుగా కసురుకుంటున్నారు.

"అచ్చా!, చిక్కయ్యా!— పాట మొదలెట్టు!" అన్నాడు దేవరాజు:

చిక్కయ్య ఈ విడత ఖచ్చితంగా సాష్టాంగ ప్రణామం చేసి

"ప్రభూ" మీ ఆజ్ఞకు అడ్డేమిటి! అలాగే!— కాని,

మా ఊరు కుర్రకుంక లెవరన్నా ఇక్కడున్నారేమో తమకు ఎరికేనా?" అని విన్నపాలైనాడు:

"ఏం - వాళ్ళెందుకూ?"

"బాబూ, చిందేసేవాళ్ళుంటేనేకాని, పదానికి అందం ఉండదు."

దేవరాజు చిరునవ్వుతో "అలాగేం!" అన్నట్టు తల వూచాడు: ఓ మురా దేవతల్ని పంపాడు, ఎవళ్ళన్నా ఉంటే తక్షణం హాజరుపెట్టమని!

వెళ్ళినవాళ్ళు వట్టిచేతులతో తిరిగివచ్చారు-

"ఆ వూరివాళ్ళు ఒకడో అరో తగిలాడు కాని, అందరూ ముసిలివాళ్ళు బాబూ!" అని మనవిచ్చారు.

"ఎబ్బే, వాళ్లేం లాభంలేదు: ముసిలివాళ్ళకు అంగ లేస్తుందా?-వాళ్ళవల్ల నేమౌతుంది?" అని విసుక్కున్నాడు చిక్కయ్య - "అయితే బాబూ, మా కుర్రమూక అంతా ఏమైంది? పదుచువాళ్ళు కూడా, మా సీమలో అడపా దడపా, చచ్చిపోతూండడం కద్దె - వాళ్ళు ఏమైనట్టు?" అని అడిగాడు.

"బహుశా నరకంలో తగిలితే తగలచ్చు!" అన్నాడు దేవరాజు.

"ఆఁ-మా బాగా సెలవిచ్చారు బాబూ-మీ మాట నిజమే అయి ఉండచ్చు; ఉంటే, వాళ్లు అక్కడే ఉంటారు: ఆ సజ్జంతా నాకు తెలుసు బాబూ:-"

"ఒక్క కోటయ్య కొడుకు అంకమ్మ ఉన్నాడే, - డొంకలో, మునసబు కొత్తకోడల్ని ఉన్న పాళాన నిలేశాడు - అదేమిరా అని నలుగురూ కమ్ముకుంటే చీల్చిగద్దలకు వేశాడు! ఒక్క చేతిమీద వందపురులకు అగ్గిపెట్టాడు - వాడు నరకంలో ఉండక మరెక్కడుంటాడు?-

"సీతయ్య మేనల్లుడు చిన్న తిరుపతిగాడు - రాణాలో మాటిచ్చివచ్చి - పట్టపగలు దివాణం దోచేశాడు! విచ్చుకత్తులాళ్ళు ఝూం-ఝూం అంటే బురుజెక్కి గండితగల కుండా ఉరికాడు-ఒక్కడూ వందమందికి జవాబు చెప్పాడు-గడిదొంగ-కాని, - వాడి చిందే చిందుబాబూ-మా సీమలో వెయ్యిన్నొక్క పల్లెలోను, - వాడిని మించిన మొనగాడేడీ - అడుగువేస్తే - హంసకులికినట్లే-"

- "పాడవేం!" గర్జించినట్టు మందలించాడు దేవరాజు. చిక్కయ్య ఉలిక్కిపడకుండా, నిదానంగా మీసం • ఎగదువ్వుకుని, గొంతు సవరించుకుని, తీగె రంగు మనిపించి -

"ఏం-వింటారు?-" అని అడిగాడు-

"నీ యిష్టం వచ్చింది-"

"కొయ్యోడిపదం - పాడనా?"

దేవరాజు - "ఏదైనాసరే!" అన్నట్టు తల ఊగించాడు - చిక్కయ్య అందుకున్నాడు-

నిమ్మతోట మలుపుల్లో - దా
నిమ్మ రెమ్మ కులుకుల్లో-
చెమ్మచెక్కలో చెయ్యోడిసేవ్-ఓ
లమ్మో! చక్కిలిగింతలు రో
రయ్యోకొయ్యోడా!...

– ఈ పదం అసాంతం పాడేశాడు!

దేవరాజు విన్నంతసేపూ ఊతగా హుషారుగా తల ఊపించాడు – "శహబాష్" అన్నట్టుచూసి, – చిక్కయ్యను అతిచనవుగా పలుకరించి, అంతఃపురానికి – చిందు వేస్తున్నట్టు అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయినాడు –

దేవరాజు అక్కడనుంచి వెళ్ళిపోగానే, – అంతవరకూ ఆనందం బిగబట్టుకువున్న దేవకన్యలు, ఋషులు, పరమ సిద్ధులూ అందరూ చిక్కయ్యమీద విరుచుకుపడ్డారు: ఇంకా పాడమని వేధించారు–

చిక్కయ్య అంత రణగుణ ధ్వనిలోనూ చీమకుట్టినట్లైనా లేకుండా కూర్చున్నాడు! అందరివంకా ఒక్కసారి పరకాయించి చూశాడు! ఆ మొగాల్లో ఆవేశాలు చూసి, – గండుమీసం మెరమెరలాడింది – ఇంకోపదం లంకించుకున్నాడు –

*ఝునక ఝునకో – ఝునక ఝునకా*

*కులికిందిలే – భలే కులికిందిలే –*

*మొన్న – కులికింది రాసోరి కూనా*

*నిన్న – వెలిసింది వడగళ్ళ వానా–*

దేవకన్నెలందరూ ఎగిరి గంతు వేశారు – ఒక్కొక్క చరణం వింటున్నకొద్దీ వాళ్ళ ఒళ్ళు వాళ్ళు మరచేపోతున్నారు. చిక్కయ్య పదం ఆగగానే మరోపదం అందుకుంటున్నాడు–

ఇక్కడిలా వాళ్లందరూ సంబరాలు పడుతూండగా, – దేవగురువు, మరేదో ఊర్ధ్వలోకంనుంచి స్వర్గానికి వస్తూండగా, – గాలి దారిని ఓ దేవకన్నె పాడుకుంటూ పోయింది.

*ఒహోహోరాజ! ఓ–హో మారాజ!*

*'కో' యంటే 'ఓ' యంటనోయ్ రాజా...*

– మరో పక్కనుంచి ఇలా వినిపించింది, – మరో మొగగొంతు –

*వరదగాలి తేలిపాయె*

*హొలెహొలె సిన్నదాన*

*చిలకపచ్చ కోకచెంగు*

*ఒలికిం దుయ్యాలమీద – ఓ సిన్నదాన...*

బృహస్పతికి గుండె బేజారై పోయింది. అక్కడే చదికిలపడి, – రెండు చేతుల్లో తలకాయ పెట్టుకు కూర్చున్నాడు–లేచి, – గావంచా కాళ్లకు బంధాలు పడుతూండగా, – స్వర్గంలోకి పరుగెత్తుకు వచ్చాడు!

అన్ని యిళ్లూ బోసిపోతూ ఉన్నాయి: ఏ యింటా ఒక్క దేవతకాని, ఒక్క ఋషికాని లేదు: లోకం లోకం యావత్తూ చిక్కయ్యచుట్టూ మూగి, – పాటకు వంతగా పరవశంగా చిందువేస్తూంది!

దేవగురువు నిర్ఘాంత పోయినాడు – తలవంచుకు యింటికి వెళ్ళిపోయినాడు: వెళ్ళి భీష్మించుకు కూర్చుని దేవరాజుకు కబురంపాడు – వచ్చీరాగానే – "ఏమిటిది?" అని శాపమంత ధూకుడుగా అడిగాడు –

"ఏముందీ: – ఏం లేదే!" అన్నాడు దేవరాజు.

"ఈ ఘోష ఏమిటి?"

"సర్వజ్ఞులు తమకు తెలియని దేముంటుంది!–భూలోకంలో యాలపదం అనే ఒక గీతవిశేషం ఉన్నదట – చిక్కయ్య అనే ఓ పుణ్యాత్మ ఇక్కడికి వాటిని పట్టుకు వచ్చాడు! ఏం బాగున్నాయ్ గురూ ఆ పాటలు!–స్వర్గం అంతా వూగిపోతూంది–"

బృహస్పతికి ఇక వినడం అసహ్యమనిపించి, – అక్కడనుంచి బ్రహ్మలోకానికి ఎగిరిపోయినాడు:

అక్కడ పద్మాసనంమీద కూర్చుని, వాణి, యాల పదం వీణెమీద వాయిస్తూంది. హంస చిందువేస్తూంది – బ్రహ్మ నలుమొగాలా శహబాసుగా నడుంవాల్చి వింటున్నాడు.

ఇతగాణ్ణి చూడగనే, వాణి పాట ఆపకుండానే, లయలో కలిపి, "దయచేయండి!" అన్నట్టు నవ్వుమొగం విసిరింది: బ్రహ్మ మర్యాదకోసం లేచి కూర్చోబోయినాడు

"అవ్వ!–నీకిదేం పోగాలం గీర్దేవీ!"– అని మౌనంగా అంగటి నొక్కుకుని, బృహస్పతి అక్కడనుంచి ఛర్రున మళ్లాడు.

కాలు, యింటివేపు లాగుతూంది – కాని, అక్కడా యీ చిచ్చు రేగిందేమో? – అసలే చిందులమారి తార –

స్వర్గం నడిబొడ్డుమీద వ్రాలి, లోకం యావత్తూ మనసుతో పరకాయించాడు: అంతా నరకమల్లే విలవిల్లాడిపోతూంది. ఏ పంచనా సామగానంలేదు – ఏ చక్కినా వేద పారాయణ వినరాదు – అంతా లయ–మయం.

మనస్సంతా హీనం–హీనమైపోయి, – కాస్త సంబాళించుకోవచ్చును అనే ఆశతో నందనోద్యానం చేరుకున్నాడు– అక్కడా మళ్ళీ ఈ ఘోషే దాపురించింది: ఉద్యాన పాలికలందరూ, చెట్టా పట్టాలు వేసుకుని, మెరుపులల్లే చిందులేస్తున్నారు: దేవద్రుమాలన్నీ లయగా ఊగుతున్నాయి – చిక్కయ్య నిశ్చింతగా కూర్చుని తంబుర మోగిస్తూ పాడుతున్నాడు – ఆటకు, పల్లవి ఊతగా –

బృహస్పతి, ధూకుడుగా రావడం చూసి దేవకన్యలందరూ, మర్యాదకోసం అన్నట్టు, ఆటపాట కట్టిపెట్టి వైదొలగారు –

చిక్కయ్య తంబుర మూగపోనిచ్చి, మ్రాగన్నుతో అలాగే కూర్చున్నాడు:

"చిక్కయ్యా!"

"అయ్య!"

"ఎక్కడికన్నా వెళ్ళిపోరాదూ?"

"ఎక్కడికి వెళ్ళను బాబూ!"

అవును, ఎక్కడికి వెళతాడు–? బృహస్పతి ఆలోచనలో పడ్డాడు–

"ఎందుకు వెళ్లాలి – చచ్చిపోగానే, యిక్కడికి రప్పించారుగదా!–" అని చిక్కయ్య సవాల్చేశాడు;

"ఆఁ–అదే చిక్కు!"

"నేనేం తప్పు చేయలేదే – ఎవడిగొంతూ కొయ్యలేదే – ఎవడి భార్యనూ –"

"అవునవును – నిజమే!"

"నిజమే అయితే – మరి?"

"నీవు వచ్చినప్పటినుంచీ స్వర్గమంతా – నీ పాటే పాడుతూంది – ఆ ఆటే ఆడుతూంది" –

"ఓఁ! అదా, కథ?"

"ఎక్కడికి వెళదామని నీ ఉద్దేశం చిక్కయ్యా?" బృహస్పతి ప్రాధేయపడుతూ అడిగాడు –

చిక్కయ్య ఒక్క నిముషం ఆలోచించి –

"మీకెందుకులే బాబూ, బాధ–పోతానులే;–" అని లేచాడు

"ఎక్కడికి!"

"ఉన్నచోటికే!"

"భూలోకానికా?"

"ఓఁ–భేషుగ్గా!"

"ఏదో తారామండలంలో నీకు వసతి కల్పించుదామనుకున్నానే–"

"నాకు తారావద్దూ, దగబోలూవద్దు సెలవు–సెలవు"

"స్వర్గం విడిచిపోవడమే?"

"అఁ–మాలావు స్వర్గం–. నేనెక్కడుంటే అదేస్వర్గం: మా కొండల్లో, కోనల్లో స్వర్గం లేదూ –

అన్నీ చుట్టబెట్టుకుంటూ పోతాబాబూ, పాతలయలన్నీ యాదకు తెస్తా –

ఒంటికాడ చెట్టునీడ కునికిపోతూ, రెల్లూదే గొల్లపిల్లడి వెన్ను నానుకొని, – పాతలయ వొడుపులందిస్తా–

దుత్తమీద దుత్తపెట్టి నీటుగా దుద్దుకూరి సంతకు పోయే సింగారి నడకలో వడుపులో లయ కలుపుతా.

కూలికి ఒళ్లంతావంచే పాలికాపు చెవివారను, వాళ్ళ అయ్య నేర్పిన పదం ఊదుతా.

ఏకులబుట్ట ముందేసుకు కూచుని ఎన్నెన్నో ఊసులు పోయే అవ్వకు చిన్నప్పటి చిందు అందిస్తా–"

చిక్కయ్య తంబురదండె అందుకుని రెవటల్లే లేచి నిలుచున్నాడు –

బృహస్పతి కొంచెం సంకోచంగా, – "బాగానే ఉంది కాని, ఈపాటికి లోకంలో నీ లయ పాతపడిపోయి ఉండదూ? ఎవరూ చెవిని పెట్టకపోతే –" అన్నాడు.

"వాళ్లే చెడిపోతారు నాకేం బాబూ; పారేవాగుల్లేవా? పర్వతాల్లో గుహల్లేవా, – పచ్చపట్టుమీద మీటుకుంటూ పోయే పైరుగాలి లేదా – మనుషులకు చెవుడొచ్చినా, – మన లయకు చేటురాదు బాబూ – సెలవు!–" చిక్కయ్య వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నాడు –

"సెలవు చిక్కయ్యా!–" బృహస్పతికి ఏదో జ్ఞాపకం వచ్చి ముందుకు పరుగెత్తుకు వెళ్ళి ఆపేశాడు –

"నామీద కోపం లేదుగద!"

"ఎందుకు బాబూ?"

"నీవిలాగే పాడుతూ కూచుంటే – స్వర్గమంతటికీ యీ పదాలే అబ్బుతాయి వేదాలు మూలబడిపోతాయి అని భయమేసింది చిక్కయ్యా!"

"అంతేనేమో, బాబూ!"

"స్వర్గానికి కాకుండా చేశానని ఏమీ అనుకోవుగద!"

"అదేమిటయ్యా! – అన్నీ తెలిసిన పెద్దలు మీకే దిగులేమిటి? – నాకు కొరతేమిటి బాబూ:– నా మనసు ఎక్కడ వుంటే – అదే స్వర్గం–"

ఎంతో వినయంగా నమస్కారం చేసి చిక్కయ్య సాగిపోయినాడు, తంబుర చంకను పెట్టుకుని.

స్వర్గంలోంచి బయటపడ్డ తరువాత, – ఏదో ఇరకాటం అంతాపోయి, ఎంతో హాయిని పడ్డట్టున్నది చిక్కయ్యకు. ఎడాతెరిపీలేని శూన్యంలో ఎంతో స్వేచ్ఛగా ఊపిరి లాక్కుంటూ తేలిపోతున్నాడు.

దోవలో, మిలమిల్లాడుతూ పాలవెల్లి ఏదో ఎగువకు నిశ్చలంగా ప్రవహించుతూంది: అందులో మునుకలువేశాడు: ఈదినంత ఉరవడిలో, ఉన్నచోటునే తపనంతా తీరేట్టు స్నానం చేశాడు: ఒడ్డున నిలుచుని, – "ఇంతటితో నీకూ నాకూ సరి;" అన్నట్టు స్వర్గంకేసి తిరిగి జుట్టు ఝాడించాడు – భూలోకానికి జాలే నడిరోడ్డు పుచ్చుకున్నాడు – గొంతు ఎత్తాడు:

*ఆ౯–వహావ్వా!*
*గతుకుల కంకటిమీద*
*ముతకా కంబళి మడత*
*కాట్టేదూ గడిదీసీ*
*ఒట్టేసుకు పక్కేసీ*
*ఉక్కలో ఒక్కణ్ణే*
*ఊరించకే అమ్మడూ –*
*...పచ్చపచ్చాల వెన్నెలే –*
*...పుచ్చపూల...వన్నెల పై పెచ్చులే–*

చిక్కయ్య పాడేపదం, వాళ్ళ పరగణాలో ఉన్న కొండలూ, కోనలూ అందుకున్నాయి*.

★ ★ ★

* పోలిష్ మహారచయిత ఫేడ్మూఫేర్ రచించిన "స్వర్గలా ది ఫిడ్లర్" – దీనికి ప్రాణం. – మ.రా.శా.

# అసుర - సంధ్య

వాడు కొంచెం ధూకుడుగా, రవంత తూలుడుగా లోపలికి వచ్చాడు: నేనూ, మరో నాలాటి పెద్దమనిషీ కుర్చీలు దగ్గరగా లాక్కుని చిన్ననాటి ముచ్చటలు కూడ బలుక్కుంటున్నాం: కలయబడ్డట్టు, మధ్యకు అడుగువేసి, "ఏదీ పంతులూ! చెయ్యి యిలా పారెయ్!" అన్నాడు: పారేశాను: పట్టుకుని ఊపేశాడు:

"ఏం-దెబ్బ, తగిలిందా ఏంరా!" అని, నవ్వుతూ అడిగాను, చేయి వాడికి అప్పగించేసి-

"ముక్కుకు సూటిగా!" - హూంకరించినట్టు అని, నావంకా, ముక్కూ మొగం ఎరుగని అవతలి పెద్దమనిషి వంకా చూసి, ధీమాగా పకాలుమని - ఒక్క అంగలో వెళ్ళిపోయినాడు.

"ఎవడువీడు?-" అన్నట్లు చూశాడు బొమలుచిట్లించి, అవతలి పెద్దమనిషి-

"సుబ్రహ్మణ్యం!"

"ఏ సుబ్రహ్మణ్యం?-"

"అదేమిట్రా - అల్లా తెలియనట్టు అడుగుతావేం. వీడిని ఎరక్కపోవడ మేమిటి? - ఎరగనివాడు ఊరి మొత్తంమీద ఒక్క పురుగు లేడే" - అనబోయి అంతలో మాట సంబాళించుకున్నాను:

అవును - వీడికి ఎలా తెలుసు? - ఇరవైవేళ్ళ యీ సందున యీ ఊరువచ్చిన పాపాన పోయినాడా యీ పెద్దమనిషి? - ఇతగాడూ నేనూ బళ్ళో, ఎన్నేళ్లో కలిసి చదువుకున్నాం - కాలేజీ నాటకాల్లో కలిసి వేషాలు వేశాం - ప్రైజులు పంచుకున్నాం - చదువు అయిపోగానే - ఇక్కడకాదు యింగ్లండనీ, అక్కడకాదు అమెరికా అనీ, - యింతలో యుద్ధమనీ, - మొత్తానికి బయలుదేరిన వేళావిశేషం ఎలాంటిదో కాని, - ఇన్నాళ్ళకు తిరిగివచ్చాడు - ఇవాళే, - ఓడ దిగాడు.

"సోమయ్యగారి సుపుత్రుడురా! - " అని, విప్పి చెప్పాను.

"సోమయ్యగారంటే - గ్రుడ్డిసోమయ్యేనా -"

"ఊఁ!"

"పెంచుకున్నాడా?"

"పెంచింది మరొకరు!"

"అదేమిట్రా!"

"అంతేరా:- వీడు మొర్రో ఫలానివాడి కొడుకో అంటూంటే అదేమిటంటా వేంరా?-"

"అనక? - సోమయ్యకు, ఎన్నడో మనం పుట్టకముందే..."

"పెళ్ళాం పోయిందనుకో-ఏం, మళ్ళీపెళ్ళి చేసుకోకూడదా?-"

"అన్నేళ్ళు వచ్చాకా?-కళ్ళు చప్పగా పోయినాకా? ఎవరిచ్చార్రా పిల్లని వీడికి-?"

"ఎవరో తలకు మాసినవాళ్ళు – పిల్లది ఏంచూసి చేసుకుందో నీకూ తెలుసుగద!"

"డబ్బుంటే నేంలే:- వీడు పెళ్ళి చేసుకోవడం, ఆ పెళ్లాం ఓ బిడ్డను కనడం జరిగిందన్నమాట – పోనీలే వంశం నిలిపింది, వారసుణ్ణి ప్రసాదించింది."

"ఒరేయి బాబ్జీ! – నీవు పొరపాటు పడుతున్నావ్ – సోమయ్య చేసుకున్న చిన్నది, పరుపురుషేక్షణ పరిహృత వ్రతశీల-సాక్షాత్ పచ్చి పతివ్రత-"

"ఆవిడ పాతివ్రత్యానికి నీవు హామీ యివ్వడమెందుకురా – ఎలాగైతేనేం – ఆడదైనందుకు కనడం ప్రధానం, ఒకవేళ కుంటిదీ గ్రుడ్డిదీ కాదుకద!-"

"అదేం ఖర్మ-బంగారపుబొమ్మ-శలాకలాటి పిల్ల-ఆ చక్కదనం చూస్తే-ఆడపిల్లలే విరుచుకు తినేట్టు ఉంటుంది-ఉండేది!-"

"మరి, యిప్పుడేమైంది?-"

"సోమయ్య కాస్తాగుటుక్కుమనగానే మాయమైంది-"

"ఎవడితో-"

"అదే ఎవరికీ అంతు చిక్కలేదు-"

"మూటా ముల్లెతోనేనా?-"

"ఏబ్బే! కట్టుబట్టలతో-"

"చిత్రంగానే ఉందే! – అదేమన్నా, ఒక్కవేళ – ఏ కాశీ మజిలీల్లోంచో ఊడిపడ్డ కామినీ భూతం కాదుకద? – ఇంతకూ ఎవరా సంబంధం కుదిర్చింది?-"

"నేను!-"

అవతల పెద్దమనిషి – గ్రుక్కమింగీ – మిర్రి మిర్రి చూసి-ఫక్కున నవ్వి – "యిదా కథ! – నన్ను వీడిపించడానికా, – యింత గ్రంథం వేసావ్? – నే నప్పుడే పసిగట్టానులే-!-" అని గుక్క తిప్పుకున్నాడు –

నేనూ రెండుబారలు కలిసి నవ్వి –

"ఇంతకూ నీవు నమ్మలేదన్న మాట! – యిదిగో భగవద్గీత – పట్టుకు ప్రమాణం చేస్తున్నాను – ఇహానైనా నమ్ముతావా? – నీకు యిలాటివాటిమీద విశ్వాసం పూర్తిగా చచ్చిపోయిందా –"

"నీకు మతిపోయిందా?- అయినా, నీ నిర్వాహకం ఏమిటో చెప్పు-ఏ అమాయకురాలి గొంతుకోశావో-"

"పాతికేళ్ళ చిన్నది-అమాయకురా లేలా అవుతుంది?-"

"అయితే, అందులో ఏదో మాయామర్మం ఉంది. అన్నాళ్ళు పెళ్ళి కాకుండా – నాకేం అర్థంకావడం లేదురా అబ్బీ:-"

"వింటే అవుతుంది-కాకపోతే అప్పుడడుగు, – విప్పి చెపుతాను-"

"అంతేలే!-అసలు ముడివేసింది, నీవేగా!-"

– "ఒరేయ్ ఒట్టంటే ఒట్టే! – ఇది వ్రతకథ లాటిది. ఇహానన్నా చెప్పనిస్తావా?-ఇంతటితో పోనీయనా! –"

– "ప్రస్తావనే ముక్కాలు వీశెకు పెంచావ్; ఇప్పట్టున వదిలివేస్తే – మన్మథుడు ఊరుకోడురా –"

"ఇందులో వాడి ప్రమేయం ఏమీ లేదురా-"

"ఉండకపోయినా యిబ్బంది రాలేదురా – ఒక్క ఇండియాను మినహాయిస్తే – ఏ దేశంలో చూసినా, మన్మథుడు అక్షరాభ్యాసపు వయసన్నా రాని పసిగుడ్డు – రతీదేవికి అంగాంగ వైభవం అంతా పుష్కలమే కాని, – కళ్ళు మాత్రం ఉండవు – అంతమాత్రాన ఆ దేశాల్లో రాత్రులూ, పవళ్ళూ గొడ్డుపోతున్నాయా?

– గుర్రం గుడ్డిదైతేనేం గాని యీ సందేహం మటుకు బాధిస్తుందిరా! చౌడప్ప పద్యపాదాలు జ్ఞాపకం ఉన్నాయ్ కాదూ – 'ఇలు వరుస మానుషంబును కులమున్ గల సోమయాజి కూతురి కైవన్, ఎట్‌సెటెర, – పెళ్ళయిందంటే పోనీ సంబరమే ననుకో. కాని, వగ్గయిపోయిన సోమయ్య బారసాలకు ఎక్కివచ్చేంతగా పుంజుకున్నాడా నిండు మనంబుతో, "మమ" అనుకున్నాడా?–'

"చెప్పేది వింటే ఏ సందేహం ఉండదు. మళ్ళీ కాస్త కాఫీ నంజుకో, సిగరెట్ ఆరకుండా రగుల్చు; మనం మంగళం పాడేదాకా ఊకొట్టు–"

అవతల పెద్దమనిషి నేను అన్నంతాచేసి కుర్చీకి ఒరగిలపడి కూర్చుని "సై" అన్నట్టు తల విసిరాడు. నేను అనగనగా, అని మనసులో గొణుక్కుని కథ ఎత్తుకున్నాను. టెలిఫోన్ గణగణలాడింది. అందుకని పక్కను బడ్డోవేశాను; మాటలమధ్య రగడలేకుండా పనస ఎత్తుకున్నాను.

– 'సోమయ్య స్వభావం మొదటినుంచీ మనకు తెలియందేముందీ? ఎప్పుడూ, ఒంటికట్టు రామలింగమే గద!

బంధువులందరినీ, ఎల్లకాలమూ అల్లా ఆమడదూరాన్నే ఉంచేశాడు. వీళ్ళందరికీ తనమీద ఆపేక్షకాదు. తన దగ్గర ఏ కాస్తో కూస్తో ఉన్న ముల్లెమీదే చూపని ఆ ఉద్దండుడి నమ్మకం. 'మాకు అంతో యింతో భగవంతుడు యివ్వనే యిచ్చాడు. నీ డబ్బు ఎవడి క్కావాలయ్యా! బడుగల్లే అలా ఉన్నావని నీమీద జాలికొద్దీ ఏదో కనిపెట్టి చూద్దామని వచ్చాంగాని!' అంటూ అయినవాళ్లు ఒకళ్ళో యిద్దరో మొత్తుకున్నా, 'ఊహుఁ – అదంతా ఓ వేషం, ముందు ఇల్లా' అంటూనేచేరి పీరం కట్టుకుని, వీడెప్పుడు హరీ అంటాడా అని కాచుకు కూర్చుంటారు. నాకు దగ్గులు నేర్పుతారా!' అనేవాడు, చివరదాకా ఆ మాటమీదనే ఉన్నాడు.

ఇంట్లో గొల్ల వెంకాం ఒక్కతే కనిపెట్టుకుని ఉండేది ఇంత చేదోడుగా. అదిమాత్రం ఏం చిన్నదా, చిదుకుదా, ఇంత వయస్సూ చెల్లించేనాయెను. మొదటినుంచి తిని ఉన్న విశ్వాసాన అల్లాగే అంటిపెట్టుకుని ఉంది. అరమరిక లేకుండా ఉపచారం చేసింది, వెళ్ళిపోయింది.

అప్పటికే సోమయ్యకు ఏణ్ణర్ధంనుంచీ, బొత్తిగా చూపు ఆనడంలేదు. ఒంట్లో దార్ఢ్యం అసలే లేదు. అది పోయిందనగానే, ఆ పూటంతా భోజనం మానేసి, పలకడం మానేసి – ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. చివరకు ఓ ప్రొద్దువేళకు తెప్పరిల్లి 'ఇంకో గత్యంతరం లేదు. చేసుకుని తీరవలసిందే!' అని గొణుక్కున్నాడు. ఆ మాటే నాతోనూ అన్నాడు.

నేను విస్తుపోయినానంటే నమ్ము; ఎన్నడూ లేనిది ఇప్పుడు సోమయ్యకు ఈ బుద్ధి పుట్టిందా? చేసుకుందామన్నా ఆడపిల్ల లంటే అంత ఊనకాచి ఉన్నారా? ఎంత డబ్బుకు ఆసపడినా చూస్తూచూస్తూ ఏ కన్నతండ్రి చేజేతులారా కూతురి గొంతుక కోస్తాడు?

ఈ మాటలే సోమయ్యతో అన్నాను: మందలించాను. కాని, ఆ మానవుడు అదే మాట రాచి రాపాడాడు. అయితీరవలసిందే అన్నాడు. ఆ రవంతపుణ్యమూ నేనే కట్టుకోవాలన్నాడు.

ఇహ తప్పుతుందా మరి! ఇష్టదైవానికి మ్రొక్కుకుని రెండోకంటివాడికి తెలియకుండా ఇంట్లోనే వెంకటేశ్వరస్వామి పరం ఎదుట సోమయ్యను ఓ యింటివాణ్ణి చేశాను.

పెళ్ళికూతురు మా బావమరిదికి మేనమామ కూతురు. మూగపిల్ల. కాని, మాంచి యోగ్యురాలు.

పెళ్ళికి మా అక్కా బావా పెత్తనం చేశారు కొత్త సంసారం కదా అని తోడుగా వీళ్ళయింట్లోనే వచ్చివున్నారు. నేనూ సరే, వాళ్ళతోబాటే – అప్పట్లో మనకూ మరో పనీ పాటా అంటూ వేరే లేదాయెను!

పిల్లది ఘట్టి యోగ్యురాలని ముందే మనవి చేస్తిని కదా! అలాగే మెలగింది సోమయ్య మనసు కనిపెట్టి, అతడికి ఏ లోపమూ రానీకుండా వేయి కళ్ళతో కనిపెట్టి చూసింది. ముప్పొద్దులా చక్కగా స్నానానికి అన్నీ అమర్చి స్నానం చేయించేది. సుష్టుగా భోజనం చేస్తున్నంతసేపూ దగ్గర కూర్చుని విసురుతూ యిష్టాగోష్ఠిగా మాట్లాడుతున్నట్టు రకరకాలుగా నవ్వేది. నిద్రపోయేదాకా కాళ్లు వత్తేది. ఇలా పాత్తిళ్ళలో కూనను పెంచినట్టు పెంచింది.

సోమయ్య అన్నాళ్లూ యింద్రభోగము అనుభవించాడనుకో. కళ్ళారా పిల్లదాని చక్కదనం చూసి మురిసిపోయేందుకు లేకుండా ఆ మాలదైవం దృష్టి ఊడలాక్కున్నా, ఇంటికైన యిల్లాలు, నోరారా పలుకరించేందుకూ, పిచ్చాపాటీ చెప్పేందుకూ వీలులేకుండా ఆ లోపం ఒక్కటే ఉన్నా, ఆ సంసారానికి మటుకు మరే లోటూ లేకుండా చూడముద్దుగా ఉండేదనుకో. క్రమేణా, సోమయ్యకూ ఆ మూగనవ్వే అర్థంచేసుకోవడం అలవాటయిపోయింది. మనసులో మాటలు విప్పి చెప్పినట్టు విపులంగా సైగలుచేయడం తనంతట తానే అలవాటు చేసుకున్నాడు. ఇంటి ఖామందు లిద్దరూ అలా మూగగానే కాలక్షేపం చేసుకుంటూ రావడంతో చూసే యింటిల్లిపాదికీ – అంటే మా అందరికి ఆ పోడిమే అలవాటైపోయింది. కొత్తలో మా అక్కా బావా, చూసి నవ్వేవాళ్ళు కాని క్రమేపీ పాతబడిపోయింది.

ఇలా ఉండగా ఉండగా సోమయ్యకు ఓ చింత ఆవేశించింది. అసలు ఏ పోణిమీ లేనంతకాలమూ సుఖంగానే ఉన్నాడు. కాని, పెళ్ళి అంటూ ఒకటి అయింది కనుక, ఇహ ఆ తరువాయికూడా తీరి, ఆ కడుపున ఓ కాయ కాస్తే–ఈ ధ్యాసలో పడ్డాడు. కాని, అది సాధ్యమా?–"

ఇంతవరకూ కొంటె చూపుపెట్టి వింటూన్న అవతల పెద్దమనిషి ఎద్దేవగా ఆవలిస్తూ, ఒళ్ళు విరుచుకుంటూ "సాధ్యం కాకేం జేస్తుందిలే! అన్నాళ్ళూ యింట్లో నిన్ను కట్టేసి మేపింది, ఆ మొక్కు తీరుస్తావనేగా? నీ అండ చూసుకోకుండానే చేసుకున్నా డంటావా?" అని తనలో తాను అనుకుంటూన్నట్టు నసిగాడు.

నేను ఛెళ్ళుమని లేచాను.

"ఒరే బాబ్జీ! ఆ మాటే అనవద్దన్నది. ఆ మహాయిల్లాలు విషయంలో అలాంటి పాదిత్యం తలచినవాళ్ళకు కళ్ళు పోతాయి. అంత పతివ్రత అష్టాదశ పురాణాల్లోనూ లేదు. ఆ యిల్లాలికి పురుషుడంటే ఒక్క సోమయ్యే. అతడు ఎంత కొరమాలినవాడైనా –"

అవతల పెద్దమనిషి ఈ ధూకుడుచూసి కొంత తగ్గాడు. "నేనేం పాపపు మాట లనడంలేదు భాయీ! సోమయ్య మనసులో కోరిక నెరవేరేందుకు దైవం ఏ రూపాన అనుగ్రహించి ఉంటాడా అని మధన పడుతున్నాను" అన్నాడు.

"అంతే–సరిగా దైవమే అనుగ్రహించాడు! దైవకృప కూడా ప్రవరిస్తేనేకాని మానవ యత్నం ఎంతఉన్నా ఫలం పాటి కాదనీ, దైవం తిన్నగా చూసినప్పుడు ఇలాటి ప్రమేయాలతో నిజంగా నిమిత్తమే లేదనీ, ఏవం విధములైన ధర్మపన్నాలు సోమయ్యకు సవాలక్ష తెలుసును. కన్యగా ఉన్న మరియమ్మను పరిశుద్ధాత్మ కరుణించి కమ్ముకుంటే పశువుల చావడిలో నైతేనేం, బంగారుతండ్రిలాగా లోక రక్షకుడు జన్మించలేదూ? ఏదో ఒకనాడు యాదాలాభాన మనువు తుమ్మితే ఇక్ష్వాకు రాజేంద్రుడు ఉంగా అనలేదూ? అలాగే ఎందుకు జరగకూడదు! సూర్యుణ్ణి ఆరాధించి గొంతెమ్మ కవచకుండల సమేతుణ్ణి కన్నదా లేదా? భక్తి తప్పనప్పుడు ఫలం తప్పుతుందా, ఇదెంత కలియుగమైతే మాత్రం!"

"కలౌ వేంకట నాయకః – అన్నది, వేదవాక్కు భక్తులకు సర్వకాల సర్వావస్థలయందూ కొంగుబంగారమైన శ్రియఃపతి. అహరహమూ, నమ్మికొలిచినవారిని చిన్న చూపు చూస్తాడా? సోమయ్యకు, ఈ నమ్మకం మూఢునికన్న ఉద్ధోలంగా ఉంది: ఇలవేలుపైన వేంకటేశ పెరుమాళ్ళకు అహోరాత్రాలూ యీ కోరికే మనవి చేసుకున్నాడు. సరిగా ఏడాది తిరిగేటప్పటికల్లా పొత్తిళ్ళలో పాపను అందుకుని, రొమ్ముకు హత్తుకున్నాడు. అలాటి తపస్సు దైవం ఎన్నటికీ వృథా చెయ్యడు అని మా కందరికీ కూడా తెలిసివచ్చిందిరా భాయీ–"

"తరువాత మరో అయిదుసంవత్సరాలు జీవించాడు సోమయ్య పిల్లవాడి ముద్దు మురిపెములన్ని ఆలకించాడు. అంత ఆస్తి పొల్లుపోకుండా, సక్రమంగా అనుభవించేందుకు హక్కుదారుడు కలిగాడన్న సంతోషం, దిక్కు దివాణమూ లేకుండా, ఒంటిగా పక్షికిమల్లే రాలిపోకుండా, తనకు అయినవాళ్ళ కళ్ళఎదుట సునాయాసంగా కళ్ళు మూశాడు. పిల్లవాడికి ఏమీ భయంలేదు, మేము కళ్ళల్లో పెట్టుకు పెంచుతామని, మా అక్కా బావా, ఆయనకు అభయం యిచ్చారు. మా బావమరదే పైగా వాళ్ళ ప్లీడరుకూడాను! ఆస్తి సంరక్షణ విషయంలోనూ, సోమయ్యకు యెవ్విధమైన దిగులూ లేకుండా పోయింది. అన్నమాట తప్పకుండానే, మావాళ్ళు పిల్లవాడిని పెంచి, విద్యాబుద్ధులు చెప్పించి, ఇంతవాణ్ణి చేశారు."

అవతల పెద్దమనిషి, సాంతం విని, "అలాగేం!" అన్నట్టు, కోరగానే తల ఊగించాడు. "మరి, పిల్లవాడి తల్లి సంగతేమిటి?" అన్నాడు.

"మొదటే మనవి చేశానుగా? ఎవరో దేవతామూర్తి పాపం, ఆ వృద్ధ బ్రాహ్మణ్ణి కనికరించింది. ఇల్లు నిలిపింది. వచ్చినపని అయిపోగానే, అవతారం ఉపసంహరించుకుంది."

"మరి, మీ బంధువన్నావు కదూ!"

"అవును; మనకు దేవతలు బంధువు లుండకూడదా?"

"పోనీలేగాని, – అలాటి దేవతకు, ఈ నిక్షేపరాయుడు పుట్టాడేం?–"

"అది మేనమామ పోలికలే!–"

"అతగా డెవడు?–"

– ప్రశ్న వేస్తుండగానే, సమాధానం ఆకళింపైనట్టు, అవతల పెద్దమనిషి, నన్ను చుర చుర చూసి నవ్వాడు – నేనూ నవ్వాను!

"ఇదంతా నీ భాగోతమూ!" అన్నాడు.

"ఏదో!–మనకు చేతనైన సాయం, మనం చేశాం!–నిజంగానే ఎక్కడినుంచో, పిల్లను కొనుక్కొచ్చి కట్టబెట్టామనుకో, ఆ బ్రతుకు అభాసు కావడమే తప్ప ఆ బ్రాహ్మడు ఏం బావుకునేవాడు? మొన్నాటినుంచీ, యిల్లు సత్రమైపోయేది; లేదా, చేతికి అందినది తుడిచిపెట్టుకుని పిట్టే తుర్రుమనేది. అలా కాకుండా, – నేనే అప్పుడప్పుడు చీరె సింగారించాననుకో, – నిజంగానే దయతో, జాలితో, అవసరమైన ఉపచారం చేశాననుకో, ఈమాత్రం ఉద్ధరింపుకు నేను పూనుకోవడం మంచిది కాదూ? – నిజంగా, సిసలైన ఆడపిల్లయితే మాత్రం, ఆ బ్రాహ్మడికి అంతకుమించిన అవసరం పట్టదు కదా! ఎవరినో తెచ్చి ఉసురుమనిపించడం ఎందుకు?–

"సరిగ్గా సోమయ్య తపస్సుచేస్తున్న రోజుల్లోనే, మా అక్కయ్యకు ఈ బంగారుతండ్రి పుట్టాడు. ఈ సాయం ఆ దంపతులు చేశారు ఉత్తరత్ర పిల్లవాడూ సుఖపడుతాడు, ప్రస్తుతం సోమయ్య కోరికా తీరుతుంది. అంతేకాని, వాళ్ళకు పిల్లలు చేదనా?–పెట్టిపోషించుకునే శక్తి లేకనా?–"

"మీరు అందరూ కలిసిచేసిన మోసం అన్నమాట!"

"అది, గిట్టనివాళ్ళు అనవలసినమాట! – సోమయ్య నిశ్చింతగా బ్రతికాడు. మహారాజల్లే కళ్ళుమూశాడు. అదే మనకు కావలసింది. మోసమను, – లౌక్యమను, – రొండో కంటివాడికి తెలియకుండా, రొష్టులేకుండా, మనం చేయగలిగిన ఉపకారం ఆ జీవికి చేశాం –"

– "మరి మేనల్లుణ్ణి యిట్లా తయారుచేశావేం? పట్టపవలే తీర్థం సేవించి వస్తున్నాడు?–"

"ఏనుగు ఎక్కినప్పుడు ఆమాత్రం తూలుడు ఉండకపోతే ఎలా? వాడు పైకి అలా కుర్రతనంగా ఉన్నాడు కాని, నిన్నూ నన్నూ అమాంతం కబళించే ప్రయోజకుడు. వాడు పందెంకట్టిన ఘోడా ఓడిపోవడం అంటూ లేదు: ఇప్పుడూ ఆ విసురుమీదనే వచ్చాడు – ఎంతో కనుక్కుంటానుండు–"

టెలిఫోను సరిగ్గా అమర్చి పిల్చాను, – అవతలనుంచి చెప్పిందంతా, "సరే,–! ఓహో! అలాగా–!" అంటూ విన్నాను –

"అంతా ఓ పాతికవేల పైచిలుకు గెల్చాడు – మనిద్దర్నీ సాయంకాలం సహపంక్తికి – ఆహ్వానించాడు–సరేనన్నాను–"

"సరుకు మంచిది దొరుకుతుందా?" అన్నాడు నసుగుతూ అవతల పెద్దమనిషి–

"దొరక్కపోతే–పుట్టిస్తాడు–అంతా మన తరిఫీయతే!" అన్నాను.–

★ ★ ★

# మంచి ముత్యాలు

నేను, కాఫీకి వెళుతూ మేలుకొలుపుదామనుకున్నాను. కాని, రెండురోజులు రైలులో ప్రయాణమై వచ్చాడు, పోనీ యింతలో కాలేజీలో మునిగిపోయేదేమీ లేదుకదా అని ఊరుకుని..వేళకు భోజనంచేసి, నా దోవను నేను వెళ్ళిపోయినాను.

మనకు కొంచెం మొగమెరుకఉన్న మావేపు అమ్మాయి అవాళ రేడియోలో... కుయికుయిలాడింది. టీచి ఒద్దున కూర్చునివిని...అసహ్యించుకుంటూ...అడుగుతీసి అడుగువేస్తూ లాడ్జికి చేరుకునేటప్పటికి...అప్పూట అతి ఆలస్యమైంది.

చీకటి, ఏమూలా దీపంలేదు: మెట్లు ఎక్కుతూ కేకవేశాను. జవాబులేదు: తలుపుతోస్తే వచ్చింది. మళ్ళా దిగ్గరగా పిలిచాను. పక్క వసారాలోనుంచి మూలిగాడు:– చేజాడను, ఏది ఎక్కడున్నదీ వెదుక్కుంటూ, వెళ్ళి దీపం వేశాను.

... వసారా పిట్టగోడకు కాళ్ళు తన్నిపట్టి చెల్లాచెదరుగా ఉన్న పక్కమీద, ఐమూలగా తిరిగి, మసులుతూ పడుకుని ఉన్నారు. దగ్గరకువెళ్ళి ఒళ్ళుపట్టి చూశాను. పలసల లాడుతూంది.

అక్కడనుంచే ఎదుటింటి డాక్టరును కేకవేశాను. వచ్చి, నిదానంగా పరీక్షచేశాడు: బడలికవల్ల నేమోనని...నాకు తోచిన సలహా యిచ్చాను. తల ఎత్తకుండా రవంత ఊగించి వెళ్ళి మందు పంపించాడు...

తగని బాధ మింగుతూన్నట్టు ఉండిఉండి నరాలు బిగదీసుకు మూలుగుతున్నాడు: ఏమని అడిగితే పలుకడు... గడియారాన్ని కంట కనిపెట్టుకుని...వేళకు మోతాదు తప్పకుండా...రాత్రల్లా కంటిలో వత్తివేసుకు కూర్చున్నాను. – ధారకం ఏదన్నా చేద్దామని ఎన్నిసార్లు ప్రయత్నించినా, అది మాత్రం నాతరం కాలేదు.

తెల్లవారిన తరువాత కూడా అలాగే ఉంది. డాక్టరు చూచి అనుమానించి ఆఖరుకు తాను అనుకున్నదే నిజమని నాతో తేల్చి చెప్పాడు.

మావాడు సుఖపడివచ్చాడు!

అంతో యింతో రాటుదేరిన ఘటాన్ని, నాకేమీ అనిపించలేదు విశేషం: మనవాడు, మడివిడిచి కొంచెం దోవలోకి వచ్చాడుకదా అని పూరాగా సంతోషించేందుకు లేకుండా పాపం మొదటిసారే, గంతువేసివేయడంలోనే కాలు కాస్తా జారి –

అసలే బిడియపడుతూన్న వాడిని, బేజరూరు ఆషామాషీలతో బెదరకొట్టవద్దని డాక్టరుకు ఆనపెట్టి మందు సక్రమంగా నడిపే కట్టుదిట్టంచేసి, వేయికన్నులతో కాచి, మళ్ళా నెల తిరగకముందు మామూలు మనిషిని చేశాను.

మనిషి మామూలుగా కనిపించుతున్నాడేకాని, మనసులో బెదురు తీరినట్టు లెదు. నేను ఎన్ని విధాల మరిపించాలని ప్రయత్నించినా...పరధ్యానంలోంచి బయటపడడు...

పడేబాధ ఏమిటో చెప్పడు. రాత్రిళ్ళు నిదురలో..గాభరాగా కలవరించుతాడు – మేలుకుని...మూలుగుతాడు...'ఏమిటిరా అబ్బీ!–' అని ఎంత నయాన అడిగిచూసినా ... ఉలకడు, పలకడు...

– తెల్లవారకముందే ... లేచి కూర్చుని, దీపం చప్పగా ఆర్పేసి గదంతా చీకటిచేసి నాకు ఎక్కడ వినబడిపోతుందోనని దిగమింగుకుంటూ పట్టుతప్పి వెక్కి వెక్కి ఏడుస్తూన్నాడు.

విని సద్దుచేయకుండాలేచి కూర్చుని సిగరెట్ అంటించుకునేందుకు పుల్లగీసి ఆ వెలుగు అలా ఒక సెకను నిలిపి వెలుగు వెనుకనుంచి అతన్ని కణకణగాచూసి వెలుగు ఊదేసి అక్కడనుంచి లేచి వెళ్ళిపోయినాను.

ఆవాళ కాలేజీకి నాకు సెలవు. అతడు ఆ చాయలకు వచ్చి ఎన్ని వారాలైందో – హాజరుమాత్రం నేను చెపుతున్నాను, మామూలుగా.

భోజనం ఆలస్యంగాచేసి వచ్చి అతడివంక చూడకుండా నా మానాన నేను సర్కార్ శాస్త్రి పుస్తకం ముందు వేసుకు కూర్చున్నాను. కాని, బలవంత బ్రాహ్మణార్థంగా ఉంది. ఎంతసేపైనా పేజీ తిరగడంలేదు. ఎదురుగుండా ఆతడలా దిగాలుపడి ఉంటే నాకు ఓపట్టాన తగని యిరకాటం అనిపించింది. అయినా అప్పటికే గంభీరంగా ఊరుకునేఉండి పండ్లబిగివిని నాలుగు కొట్టేదాకా పీరంవేసుకు కూర్చుని ఇకనైనా కాస్త కాలు జాడించి గాలిపోసుకు రాకపోతే లాభంలేదని బయలుదేరే సన్నాహంలో ఉన్నాను.

మావాడి చాయల్లో కదలిక వినపడుతూంది. వెనుదిరిగి చూడకుండా, అద్దంముందు నిలుచుని టై సరిచేసుకుంటూన్నవాడిని, అలాగేఉండి, అందులోంచి ఓ కంట అతన్ని కనిపెడుతూ ఉన్నాను. షర్టుమీద ఉత్తరియ్యం వేసుకుని చెప్పుల్లో కాళ్ళుపెడుతూ ఉన్నాడు. నాతో కలసిరాకపోయినా తన మానాని తాను ఎక్కడన్నా చాంద్రాయిణం చేసినా మాబాగే, కొంత తేరుకుంటాడు అని నేను చూసీ చూడకుండా, నూమూలు ముభావమే అంటిపెట్టుకున్నాను.

నా వెంటనే వచ్చాడు. ఎదుటకుర్చీలో, నావంక చూడకుండా కూర్చుని, కాఫీ యిత్యాదులు నాతోపాటు కానిచ్చి అనుసరించాడు.

బీచిఒడ్డున నడుస్తున్నాము. కెరటం ఉరవడి గమనించకుండా ఎవరి ధ్యాసలో వారముంటే, అల మామీదకు ఎగబడి విరిగి, ఉక్కిరిబిక్కిరిచేసి, అదిచూసి మాకు ఎదురుగా నడుస్తూ వస్తున్న ఆడపిల్లలు కొంటెతనం పట్టలేక పనివేళా మమ్మల్ని రాసుకునేట్టుగావచ్చి, మా ముఖాలమీదనే విరగబడినా, అది అయినా అతని గమనికకు రాలేదు.

మేరీరాణి కాలేజీ ఎగువదాకాపోయి యిసుక మెత్తలాగా చేసుకుని దానిమీదగా ఒరగిలి, కాలుజాపి పడుకున్నాను. అతడు నా ప్రక్కన కూర్చున్నాడు. సముద్రానికి, చూపులతో అంతుకనుక్కునేపట్టుతో చూసినకొద్దీ పొంకానికి మబ్బుకమ్మకపోయినా మూసుకుంటున్న చీకటులను దూసుకుని గట్టునపడడానికి నురగలు గ్రక్కుతూన్న అలలల్లో అల్లాడిపోతున్నాడు.

నాకు దిగులనిపించింది. పాపం, నిక్షేపంలాంటి పిల్లవాడికి యీ బెడద ఎందుకు వచ్చిపడ్డదా, ఎన్నటికి కోలుకుని మళ్ళా మామూలుమనిషి అవుతాడో అని, అభం

శుభం తెలిసీ తెలియని వయసులో యిలాంటి తాకిడీలు రావడం ఉత్తరోత్ర ఒకందుకు మంచిదే అయినా, అప్పటికప్పుడు తట్టుకోవడానికి మాత్రం తలతిరిగిపోతుంది.

ఆ ఆలోచన అదేపనిగా మననం చేసేటప్పటికి నా సాధక బాధకాలు చూడకుండా తన వేదన పేరను జాలితో గుండెకరగించుతూన్న అతని ఊరూపేరూ లేని వేడి అసహ్యం వేసే స్థితిలోకి వచ్చింది. అలాంటప్పుడు పరాకున ఏంమాట తూలుతానో అని నన్ను నేనే చీదరించుకుంటూ మాటలు అయీకాని ధ్వనితో కసురుకున్నాను. అందుకు అతడు తలయెత్తి ఉలికిపాటున చూశాడు. వంచుకు కుంచుకుపోకుండా గడ్డంక్రిందుగా చేత్తో గిరిగీసి ముగ్గులోకి దింపాను.

"చెపితే పోయేదికాదు. నా బాధ నాతోనే ఉంటుంది" అని విరక్తితో గునిశాడు. నేను స్థాయి ఎక్కించకపోతే పాకాన పడేటట్టు లేదు.

"చెపితే పోదా...చెప్పేది కాదా?"

అతడు అంతకూకలిసి ఏకబారున తల ఊగించాడు.

"పోకపోతే అన్నింటితోబాటు అదీ ఒకపక్కన పడి ఉండనీ, అంతేగాని నెత్తికెక్కించుకోమోక"

"నా చేతకావడంలేదు"

"కనుకనే నేను సాయంపట్టి దాన్ని అవతలకు దొర్లిస్తానన్నది. విన నేర్పు అయినా లేదా నీకు?"

"నాకూ ఏమీ లేదేమో యీ లోకంలో అసలు"

"అదుగో, వేదాంతంలోనికి పోయినావాఅంటే తంతాను. ఏమిటోయ్! నీకేం కొమ్ములు మొలిచినాయా?"

"విరిగినాయి."

"ఏ కొండకేసి కొట్టావో..."

"కొండ విరుచుకు మీదపడితే దానిక్రిందపడి నుగ్గు నూగవడం తలదా తప్పా?"

"అడిగినదానికి జవాబు చెప్పడం అలవాటు కానివాడవు ఏలా యిన్నిమెట్లు ఎక్కివచ్చావు. నీకన్న నేను ఎక్కువగా ఇంకా అడ్డదిడ్డంగా మాట్లాడగలను, ఎన్ని వేషాలైనా వేయగలను. తాతకు దగ్గువరస నేర్పక!

అవును కాదు అని నోరువిప్పి చెప్పడానికే యింత సాగదీయించుకునేందుకు ఆ ఆట లిక్కడకాదు – అత్తవారి యింట్లో"

ఎందుకోసం అతడలా వలవలా ఏడ్వడం మొదలుపెట్టింది? అందులో నేననుకోకుండానే ఏదైనా ఘాటుగా తగిలిందా? రగడ పెరిగిపోతూన్నదే.

"అన్నీ తెలిసేనా"

"ఎవరికి నీకా, నాకా? – నీవు, తెలిసిచేస్తూన్న పనే అయితే నీమీద జాలితలచినవాడు శుద్ధఫూల్. కాని నాటకమాడే నేర్పు నీకు ఉందని, యిప్పటికీ నాకు నమ్మకం కలగక పోవడంచేతనే"

"అందుకు నా కృతజ్ఞతాపూర్వక..."

"ఆ వందనాలేమో పెొప్పవేసి నీకు దాఖలు చేసుకుంటానుగాని, యిక నీవు బాధపడి నన్ను వేధించక అసలు గొడవేమిటో తేల్చు. అంతగా మిన్ను విరిగి

మీదపడేవిషయమైతే అప్పుడు ఓ చెయిచూద్దాం అప్పుడూ యిప్పుడూ, నేను అండను ఉన్నంతవరకూ నీకువచ్చే ఫరవా ఏమీలేదు"

చెపుదాం అనే తెగింపు మొగంలో అలా స్పష్టంగా కనబడుతూఉన్నా, అతను యింకా బెరుకుగా వెనుకాడుతున్నాడు. ఈ పట్టున విడవకుండా రెచ్చగొడితేనేగాని పసివాడు పలువరుస విప్పడని నేను ఊహించినకథ ఊదేసి ముగ్గులోకి దించుదామని–

"ఏం నీవు చెపుతావా?...నన్ను చెప్పమన్నావా" అని అడిగి అతనిచేత సరేనని తల ఊపించి, నేను పాయలు దీయడం ప్రానుకున్నాను.

"అనగనగా ఆ అబ్బాయికి ఆ వేసవికో మళ్ళా రోహిణికో భార్య కాపరానికి వస్తుంది. వస్తుందికదా ఎప్పుడెప్పుడని ఎదురుచూస్తూ నోట్లో వేలువేసుకుని ఆ గడియరావడం కోసం కనిపెట్టుకుని కూర్చునే అంత అర్భకుడు కాకపోవడం చేత, ఆ శుభకార్యానికి దోహదంగా కొంత ఆ పంపిణీ మీదనే యీలోగా కాలక్షేపంచేస్తే – ఎందుకన్నా ముందుకు అక్కరకు వస్తుందికాదూ – అనే ఆలోచనపోయి అంగబలమూ, అర్థబలమూ పుష్కలంగా ఉన్నవాడు గనుక, అనుకున్నపని అతిధారాళంగా అవిచ్ఛిన్నంగా నిర్వర్తించడం చేత ఆ తపోవేడిమికి అతల వితల తలాతలాదికాలు ఉడికిపోయే దివ్యస్థితి యథాక్రమాన సంభవించగా మహర్షి తపోబలం మోపై తల్లక్రిందులై తల్లడిల్లిపోతున్నాడు పురుషుడికి కర్తగా కథాప్రారంభంచేసి కార్యకలాపానికి పురాణచ్ఛాయ ఎందుకు యివ్వవలసి వచ్చిందంటే, 'దేవతలు చేయుతప్పులు దివ్యకథలు' అని పాతనాటకం ఎందులోనో ప్రమాణం మనకు లభించింది."

మన ధోరణి వింటూన్నకొద్దీ నవ్వులో పడిపోయి మగతగా ఉండటం మరచిపోతాడని ఆశపడటం నాది పొరబాటు.

"దేవత ఉభయవాచకమని నీవు ఒప్పుకుంటావా?"

"వైయాకరణి అడిగేతీరు అది కాదుగాని, నీ వన్నది తెలిసింది. అడదైనా అంతేనా అనేనా దేవర ప్రశ్నించేది? అలాగైతే,

ఆ అనూపానూ తెలియనందువల్ల నా ఊహ ఎక్కడ బెడిసిందో తోచలేదు అతనివాలకం చూస్తే ఇందాకటినుంచీ నేను పోయిన ఊహలన్నీ చెరిపేకథ ఇంకోవిధంగా అల్లుకు రావలసివస్తుంది. అందుకు అనేక చిలవలుపలవలూ ఉన్నాయి. ఏ చిగురు కదిలించినా, ఏదో చిక్కే, అయినా మరో మాదిరిగా వాయించి చూదామని...

"అలా అయేపక్షంలోనూ యీ తంతు అంతా జరుగుతుంది రసం ఒకటే రుచిస్థాయీ భేదం కాని, అసలు ఆలోచన తెమిలేందుకు వ్యవధానం తెచ్చుకోడానికని, నేననేదేమిటో నాకే అర్థంకాకుండా, కోమటిపురాణంలోకి దిగాను.

అతను సరిగానే అర్థంచేసుకుని నేను చెప్పినపారమే నాకు ఒప్పగించడం మొదలుపెట్టాడు.

"అనగా అనగా ఆ అబ్బాయిఉన్నాడే అతనిమీద నీవుమోపిన నిందలే నిజమైతే అతడు ఏనుగునెక్కినట్టు సంతోషించుతాడు. అన్నీ అబద్ధాలు. అందులో అతనిదోషం ఏమీలేదు..." అని నలుగురాచినట్టుగా అన్నాడు.

"అని నేను నమ్మనా?"

"అది నీ దయ. కాని యిదంతా నాటకమని నీవు నన్ను చూస్తూండికూడా

అనుకుంటే నేను సహించలేను. నామీద జాలిపడవద్దు. నన్ను నీ చాయలకే రానీయవద్దు. నీకు యిష్టంలేకపోతే అంతే. నా బాధ నిజమని నమ్ము."

"నాకు తెలిస్తేగా"

"అవును, అంతఘోరాన్ని నీవు అనుకోలేవు. నేనూ అలా జరుగుతుందని కలలో అయినా తలచలేదు ..కాని జరిగింది."

"ఊం..."

"నేను మొన్న మాఊరు వెళ్ళినప్పుడు మావాళ్లు పండగకని కోడలిని మా యింటికి తీసుకువచ్చారు."

"అదృష్టవంతుడివి, అనుకోకుండా అలా కలిసి రావాలి"

"కలిసినందుకే వచ్చింది"

ఆరోగ్యం యీ నడుమ చెడిపోవడంవల్ల మెదడేమన్నా డొంకల్లో సంచారం చేస్తుందా ఏమని, నిర్ఘాంతపోయి నిలువుచూపులతో అతని ముఖానికి కన్ను లప్పగించి అలా కదలమెదలలేక పోయినాను. అతడనేదాంట్లో, నిజమే ఉంటే అంతటితో యిక కొంప లంటుకుపోయినవన్న మాటే. ఆ మంట యిక చల్లారదు.

అతనిలో అకారణంగా అమాయకురాలి మీద, అలాటి నింద వేయడానికి తయారుకాగలిగిన నీచత్వం ఏకోశాన అయినా ఉండటానికి అవకాశము ఉండవచ్చునేమో అనే ఊహకూడా నాకు కలగవలసిన సందర్భమే అయినా – అద్దం వంటి అతని మనసు నేనెరుగుదును. ఎంతో మనసుపడి, ఏరీ కోరీ తెచ్చుకున్న బంగారపుబొమ్మను ఎన్నడైనా ఎప్పుడు కొరుక్కుతిందామా అనే రెపరెపలాడే వయసుకాదు, అనవసరంగా అంత అన్యాయానికి ఒడిగట్టి ఆ చిన్నదాని జీవితం పాడుచేయగలడా?

అతడు అబద్ధం ఆడవలసిన ఆగత్యం లేదు, ఎటు పారజూచినా.

ఆ పిల్లదానివిషయంలో వ్రేలువంచడానికి వీలుపడని నిప్పంటి వంగడం. పరాకున అయినా ఆ యింటపుట్టిన పడుచులమీద అలాటి పాపంమాట పడవేయడానికి, పగవాడైనా తలచడు.

ఎలా సమన్వయం చేయాలి? –

కీలకంలో ఏదో తికమక ఉండితీరాలి, అని మనసుకు తడుతూనే ఉంది. కాని, తెమిలి, చిక్కు వీడటంలేదు. కాని, అదేలక్ష్యంతో, తరచగా తరచగా కిటుకు మెదడుకు చిక్కింది. తెలిసినతరువాత, తెలివి ఇంతలో ఉన్నదిగదా పనీపాటాలేనట్టు, ఎలుకనుపట్టడానికి కొండంతా త్రవ్వినట్టుగా, అని నాలోనేను అతనికి తెలియరాకుండా నవ్వుకున్నాను.

నేనేమనుకున్నదీ, అతనికి తెలియనీయలేదు. నా మాటనమ్మి చెడినవాడు లేడుకాని, ఇప్పుడు అతనికి ఏది చెప్పినా నమ్మడు. ఇంత ముదిరినతరువాత, నమ్మించి మళ్ళా దోవకు మళ్ళించకపోయినానో ఇక ఇంతలో బాగుపడి కోలుకోడు.

ఏమనకుండా, గంభీరంగా ఊరుకున్నాను. ఎవరి ఆలోచనలతో వారు, మసకముదిరేదాకా, అక్కడ కాలక్షేపం చేసి, తిరిగివచ్చి వేగిరం భోజనాదికములు ముగించుకున్న తరువాత మళ్ళా బయటికి బయలుదేరదీశాను. వెళ్ళేటప్పుడు 'ఎక్కడికి' అని నదురుతో అడిగాడు. 'ఎక్కడికో–అక్కడికే' అని యిక ప్రశ్నించకుండా ఉండేటట్టు సమాధానం చెప్పాను.

బస్సుదిగి ఆ వీధివేపు వెళుతూన్నప్పుడే అతను కనిపెట్టి వెనకఅడుగు వేయబోయినాడు. అతని మాటలు సాగనీయలేదు అనుకున్నది అయేదాకా మాటాడేందుకైనా వీలు బెసకనీయలేదు. ఏమనుకున్నాడో ఏమోకాని ఎదురు చెప్పకుండా పరమ విధేయతతో నాతోబాటు రాత్రంతా యథావిధిగా పండుగ చేశాడు.

తెల్లవారకముందే సానివాడనుంచి తప్పించుకుబయటపడి కాఫీవేళకు యింటికి వచ్చేశాము. అనుకున్నదానికన్న అలవాటులేని జాపోసనంకనుక ఎక్కువగా అలసిపోయి పసివాళ్ళాడుతూ అతడు పట్టు బలవంతాన రవంత చిరుతిండి తిని అమీద ఆదమరచి నిద్రపోయి, అనక ఎప్పుడో దీపాలు పెట్టేవేళకు లేచాడు.

"ఫిర్" – మళ్లా రాత్రి నిన్నటివేళ అవుతోండగా అతడు ముస్తాబుకావడం చూసి, కొంటెతనానికి అన్నాను.

"తుర్ –"

చేతనైతే రెక్కలుకట్టుకుని, అక్కడకు ఎగిరివెళ్ళి ఎప్పుడు వ్రాలుదామా అన్నంత ఉత్సాహంతో ఉన్నాడు రంగం చెడకుండా ఉండేందుకు, కడుపునిండినా నేనూ అతనితో పాటు సహపంక్తికి తయ్యారుకాక తప్పిందికాదు. పదిరోజులపాటు

చెక్కు చెదరకుండా నునుపుతేలుకుంటూ వస్తున్నాడు. అతడిని అలా వదలివేసి వూరుకుంటే వ్యవహారం మరీ ముదిరి, పట్టపగ్గాలు లేకుండాపోతే అప్పుడు అనుకుని, దింపిన దొహటే అయిందొకటీగా అయితేగా అయితే, ఇక...

"...ఎంతకాలం యీ ఆటలు..?" ఇక సాయంకాలము అతడు అక్కడకనే బయలుదేరబోతూంటే మాట వరుసగా అన్నాను

"...సాగినంతకాలం...ఇంకా చిలుముమిగిలింది అది కాస్తాకూడా అమ్మవారి పరమైపోయినతరువాత అప్పుడు ఆటకడుతుంది" మాంచి ఆరోగ్యంగా జవాబు చెప్పాడు.

"ఆట కట్టింది..." అన్నాను.

"అది...నీకు ఎలా తెలుసు?"

"ఆడించిన వాడిని...కనుక..."

"అయితే...అతి దారుణం..."

"అంతకన్న ధారుణమైన అంచనా నేను వేసింది"

"అవును. నీ వంతవాడవే"

"అంతకు అంతవాడిని ఇప్పుడు నీకు అర్థమౌతుంది చెప్పనా? నీవు యిన్నాళ్ళూ నిప్పుల గుండం త్రొక్కావు. ఆ పచ్చి విషకన్య – దానిమీద చెయివేసినవాళ్ళు యిదివరలో చాలమంది మళ్లా కోలుకోలేదు. ఏరికోరి, నీకు దాన్ని కావాలనే జోడించాను. ఎందుకో చెప్పనా నీవు మంచం ఎక్కావనుకో! అప్పుడు నీ బాధకు జాలిపడినా అంతకన్న విచారించేవాడిని కాను. నీకు ఆ మాత్రం ఘోరమైనశిక్ష నీవు చేసినపనికి కావాలిసిందే. కాని, నాకు నమ్మకం ఉన్నది నీవు నమ్మని ఆ అమాయకురాలి నీ యిల్లాలి శీలమే నిన్ను వేయికళ్ళ కనిపెట్టి కాపాడుతుందని అంత ధైర్యం లేకపోతే, ఎంత మొండివైనా చూస్తూ చూస్తూ యింతకు సాహసించలేకపోయేవాడినే. నిన్ను దోవకు తిప్పడానికి యింతకు మించిన ఉపాయం దీన్ని మించిందిలేదు. చేశాను యిప్పటికైనా చూశావా?"

"సంతోషించాను. సమయం వస్తే నిన్ను నమ్మినవాడిని అసి అయినా చూడకుండా పాతాళంలోకి నెట్టేయగలవు."

"అవును, అటూ యిటూ లేకుండా మధ్యను త్రిశంకుడి లాగా నావాడు ఉంటే నాదేం ప్రయోజకత్వం. చేతికొద్దీ విసిరితే నీతిమాలినవాడైతే అడుగుకి అంటుకుపోతాడు. కాకపోతే ఎదురెగిరి ఆ ఊపుతో స్వర్గంమీదకు గంతులేస్తాడు. ఎలాగైనా మా బాగే."

"అంతేకాని నేను ఎంత చెప్పినా నా మాటమీద నీకు నమ్మకం కుదరలేదు."

"నీ గౌరవంమీద నమ్మకం పోలేదు. ఓయి జోగులూ! నీకు మతిపోయిందికాని నాకేం కర్మం? వెనుకాముందూ ఆలోచించగల నిదానం ఉంటే నాకీ శోష తప్పేది కాదూ? ఒక్కటి చూస్తే నీకీ శంకలన్నీ లేకపోయేవే. నీ భార్యకు అక్కరరాకముందే ఆభరణాలతో తయారుకావలసిన అవసరం ఏం వచ్చింది? వస్తే ఆవలి వానిని మరగి నిన్ను అసలు దగ్గరకు రానిచ్చేదేకాదు. పోనీ ఎవడన్నా బలాత్కరించాడేమో అనుకుంటే అంతపని జరిగినమీదట అయిన యింటి పిల్ల ఇక బ్రతికేదా? ఆమెలో లోపం ఏవిధంగానూ ఎటుజూచినా ఉండటానికి వీలులేదు. అందుకనే నీ మర్యాద చెడలేదని నీవు చెడకుండా కాపాడుకునేందుకు నిన్ను యిలా చెడగొట్టవలసి వచ్చింది.

"ఇప్పుడు కొంచెం మెదడుచేత పనిచేయించిచూడు. నీ భార్యతో సుఖపడబోయి సంకటస్థితిలోకి వచ్చావు. సంకటాలలో యీదులాడి శిగపూవాడకుండా ఒడ్డెక్కావు. తగిలించుకునే బేడీలు తన తత్వంలో ఉందికాని అవతల అవి ఉన్నా లేకపోయినా 'ఉండందీ తగులవు' అనేది మామూలీ మాట శాస్త్రం ఒప్పుకోదు. నీవూ ఒప్పుకోక తప్పదు. తప్పుచేసినందుకు పరిహారంగా –"

"రాజతరంగిణిలో కథ ఉంది తెలుసునా? మహారాజు చక్రవర్మ చూసిన పామును పుట్టలోకి పోనీయకుండా చేసిన పాపానికి...పరిహారణోపాయం అంతరంగికు లుపదేశించిన దేమంటే – ఇదివరకువన్నీ తుడిచిపెట్టుకుపోయేందుకు పతివ్రతతో సాంగత్యం చేస్తే ఫలం దక్కుతుంది అని. ఆమీద కథ చాలా ఉంది కాని, మనం ఇది ఉపయోగించుకుందాం."

"మనం...భరించగలమా?"

"ఇంకా పెరటద్రోవనే ఉన్నావు. భరించేవారున్నారుగా మన పతివ్రతలు. బిచాణాకట్టు – మా యింటికి నేనూ, నీ అత్తవారింటికి నీవూ..."

"ఏ మొగం పెట్టుకొని..."

"ఎప్పటి మొగమే...ఆ మొగం యిన్నాళ్ళకు కనపడకపోతే అందుకు ఎంత మొగం వాచిపోతూందో పాపం, ఆ పసిది..."

"అవును. పసిది"

"అందుకున్నా లేవోయ్ పిడుగా! దైవం చల్లగా చూస్తే మళ్ళా యీనాటికి ఆ పసిదాని...కో పసిది: అంత ఘటికుడవే...ఇంతకూ నా మాట తప్పడమంటూ ఉంది గనుకనా?"

★ ★ ★

# మలయమారుతం

–గ్లాస్గోపంచె..జరీనంబరు పాదంమీదపరచుకునేట్టుగా..అంచు పద్మాగ్రంలాగా అమరికగా బంగాలీకట్టూ, అల్లిక బనియన్...ఉల్లిపొర...గీరలలాల్చీ..పక్క జేబులో ఘుమాయించే జేబురుమాలు...పైజేబులో, అకారం, అంకెలూ, చూచాయగా కనబడుతూ, పదిరూపాయల నోట్ల బొత్తి...బుగ్గను రూపాయకిళ్ళీ...

...అనుకున్న ప్రకారం వేళకుసరిగా...ఆ గుమ్మం ఎక్కాడు. సత్యం..

తలుపు ఓరవాకిలిగా ఉన్నది: చెప్పుల చప్పుడు విని...లోపలినుంచి "వచ్చె..వచ్చె.." అనుకుంటూ...ఆ అమ్మాయి తల్లి...హాలులో దీపం పెద్దదిచేసి, తలుపు తీసి "రా నాయనా" అని పలుకరించి, గుమ్మంలోకి వచ్చి, వీధి అటూ ఇటూ తొంగిచూసి వెనుకనుంచి, తలుపు వేసింది..

..."కూర్చోండి అలా నిలుచుంటారే: ఇప్పుడే...యిందాకటినుంచీ మీరు వస్తారుకదా అని యిక్కడే కూర్చుని... ఇట్టేలోపలికి వెళ్లాను పాలల్లో తోడు వేసి వద్దామని..మీరూ రానే వచ్చారు...అమ్మాయీ!.. వారు వచ్చారే..."

చంద్రం...అవతల వసారాలోంచి...ఆ పక్క గదిలోకి వెళుతూ తన వేపుచూసి ఒక్కమారు తళుక్కుమన్నది: సత్యం... జేబులోనుంచి పైకంతీసి, ముసలిదానికి యివ్వబోయినాడు.

"నాకెందుకు బాబూ! మీవంటివారు మా యింటికి రావడం...అమ్మాయి అదృష్టముకొద్దీ–అదే నాకు పదివేలు...ఇక మీ యిష్టం...మీ యిష్టం. యిచ్చుకోండి, మానుకోండి. నేనల్లాచూసి సంతోషించడమే..." అని లోపలికి చక్కాబోయింది

చంద్రం ఏ గదిలోకి వెళ్ళిందో.. సత్యం...అందులోనే ప్రవేశించాడు. కలకలలాడుతూ ఉంది..

లేచి నిలుచుని...సోఫామీద నుంచి...నవ్వుతూ.. కనులతో పలుకరించింది..చొరవగా చేజాపి పట్టుకోబోయినాడు.. కొంటెగా తప్పించుకుని తలుపువేపు తల విసిరింది. వెళ్ళి గడియవేశాడు...

"ఇదుగో ... ఇంద –" జేబులోనుంచి...నోట్లు బయటకు తీస్తున్నాడు. చంద్రం కోపంగా..."డబ్బు...మీరే ఎరుగున్నారు: మే మెన్నడూ డబ్బు మొగమే చూడలేదు...ఆ బల్లమీద పారేయండి..."

జవాబు చెప్పకుండా...అయిదునోట్లూ – ఆమెకు కనబడేలాగున విడబరచి లెక్కపెట్టినట్లు నటించి, మళ్ళా బొత్తిచేసి... బల్లమీద పొందాను...ఎత్తుపెట్టాడు...

"కూర్చోండి..."

"నీవుకూడా...ఇక్కడ .."

"మీకు ఎదురుగా .ఇక్కడ."

"ఉహూఁ..ఇక్కడ నాపక్కను."

"అమ్మో...ఆశే..మీరు మంచి పిల్లవాళ్లు కారు."

సత్యానికి...యీ చెలగాటం అదో సరదాగా ఉంది: ఖరీదు యిచ్చి కొనుక్కున్నా.. అమాట అని రసాభాసం చేసుకోవడంకంటె ..యిదీ బాగానేవుంది ..కొత్తగా సంసార పక్షంగా...

"వీణ ..వాయించనా..."

– అక్కరలేదు...అని తల ఊగించాడు .చంద్రం త్రాచులాగా లేచింది..."మీరేం సరసులు.. మొక్కు తీర్చుకోడమైతే..యిక్కడకు రావడం దేనికి ..యింటి దగ్గరనే.. పడి వుంటే. .యీపాటికి పక్కంతా చెల్లాచెదురూ చేసుకుని .యిల్లాలూ మీరూ నిదురపోతూ వుండేవారుగా...యిందుకోసం...యీ ఖర్చంతాఎందుకు...యింతే ఈ కాలంవాళ్ళు.. కొనుక్కుందామని వుబలాటమే కాని...తీరా అక్కడకు వచ్చేటప్పటికి...అనుభవించడం చేతకాదు..."

"పోనీలే...వింటాను...".

"ఏం ..నన్ను ఉద్దరించడానికా?.. నా పాట వినడానికి యింతకన్న ఎవరూదొరక రనా...చెప్పకండి .యిదేం బలవంతం బ్రాహ్మణార్థంకాదు...సరసాలేమీ నేరవకుండా . అందు కోసమే వచ్చానంటే...నేను కాదనను...మిమ్మల్ని ఎంతో ఒప్పించాలని...మల్లె మొగ్గల వంకీజడ వేయించుకున్నాను...పాము కుబుసంలాంటి వుప్పాడచీరె...మొగలి చాయ రవిక...యిదిగో యీప్రక్కనుండి పండువెన్నెల...మీరు చక్కగా...నవమన్మధులులాగా నాచేత గంధం పూయించుకుని, పన్నీరు చల్లించుకుని...పోయిగా.. నేను మీ యెదుట కూర్చుని వీణె వాయించినతర్వాత.. ఆమీద...నామీద ప్రేమతో...ఎంతో అనుకున్నాను.. మీరు వస్తామని కబురుపంపినప్పటినుంచి మిమ్మల్ని మెప్పించడానికి. ..ఎన్నో ఊహించాను. పోనీండి...మీకు అవన్నీ వెగటైై...అదొక్కటే, అవసరమైతే... ఎన్ని కోరికలున్నా...ఎప్పుడూ మా బ్రతుకింతేకదా...మాకు దొరికేవారు...ఎన్నడూ యీపాటివారేకదా అని...ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకుంటాను...చెప్పండి...మీకు మొగమాటమెందుకు?..."

"–నేనంత పశువును కాను...నిన్ను చూడగానే...మనసు నిలుపలేకపోయినాను కాని...నొప్పించాలని కాదు... నాకూ హృదయం ఉన్నది...అనుభవించాలనే కోరిక ఉన్నది...అందుకనే నిన్ను వెదుక్కుంటూ వచ్చింది..."

"అంత ధర పెట్టింది"

"ఆమాట అనకు..నాకు చిన్నతనం వేస్తుంది...తలవంచుకోవలసివస్తుంది.. అన్నీ కొనగలమా...ఐశ్వర్యము ఎంత ఉండనీ...అందులోనూ, నిన్ను..."

"–ఎంతవారండీ...నా మనస్సు కనుక్కోవాలని వేసిన పన్నాగమా యిదిఅంతా.. న కూ తెలియక కాదులెండి...చూడగానే పోల్చుకున్నాను. అయినా, ఏదారికి వస్తారో అని...అమ్మదొంగా..."

– సత్యం కొంచెం యిరకాటంలోనే పడ్డాడు.

గడియారంముళ్ళు రెక్కలుకట్టుకున్నంత వేగంతో .. కాలాన్ని గిరగిర లాడించు తున్నవి: టింకానికిపోయి...పెద్దచిక్కు తెచ్చిపెట్టుకున్నాడు...ప్రొద్దు చాలా పోయింది...సంగీతం గింగీతం యిప్పుడు వద్దులే...అంటే చంద్రం అతిచులకనగా చూస్తుంది. సాని కూతురి ఎన్నికలో అంత వాసి చెడటం...ఎంతమాత్రమూ పరువైన పనికాదు...కాదు కూడదు. .అంటే ఒప్పుకోక ఏం చేస్తుంది. కాని...అఖరికి...ఆ అమ్మాయి తనను అసహ్యించుకోవడమూ? ..

ఎన్ని కప్పుల టీ త్రావినా...అందుకోసం పవలంతా నిద్రపోయినా...వేసుకున్న కిర్లీ పూరాగా వేడిచేసి... మత్తుగా, తమాషాగా...ఏలాగో ఉంది ఒంట్లో .అయినా..ముందు, ఒకసారి ముద్దిడుకోనిచ్చినా... ఉహూఁ...చంద్రందగ్గరకే రాందే...

"ఒప్పుకున్నాను కాని...ఒక్క ముద్దు..." అని రాబోయే నిదురను బలవంతాన బిగబట్టి...పసివాడిలాగా బ్రతిమాలుతూ అడిగాడు...

"ఊఁ...ఇప్పుడా?...మెప్పుకు...అనక ఆ బహుమానాలు!"...అనినవ్వుతూ.. తివాచీమీద కూర్చుని...చంద్రం వీణె సారించింది.

– చల్లని. .గాలి...ఒళ్ళు మరిపించే...పాట!

– తెల్లవారి...ఒంటరిగా మేలుకున్న తరువాత...అనుకుని ఉసూరుమన్నాడు... అప్పుడు అల్లా కూర్చున్న చోటనే నిదురపోయినానుకదా అని...అనుకుని మాత్రం వీంలాభం...కోపం అంతా ఎదురుగుండా గవిసెనలేని వీణ మీద చూపించాడు... ఒకటి రెండు తీగెలు పుటుక్కుమనిపించి...వంచినతల ఎత్తకుండా...మంచులో తడిసిన మల్లెపువ్వులాగా...చెక్కుచెదరకుండా.. యింటికి వచ్చి ... మంచంమీద నిదురకు వ్రాలాడు.

* * *

# సామగానం

– విని...ఏమీ చెప్పకుండా ఊరుకున్నాను...వెళ్ళిపోయినాడు.

మరునాడు మళ్ళా వచ్చి..ఆ సంగతే చెప్పాడు. నవ్వి వేళాకోళం చేశాను...

మూడోనాడు...సగం విని...మొగం వాచేటట్లు చివాట్లుపెట్టి పంపించాను.

అంతకన్నా ఏమిటి చేయడం?...అసలు అందులో ఏముంది, ఒకరు ఆర్చేందుకూ, తీర్చేందుకూ?

కలలు ఎందుకువస్తాయి?...తిన్నతిండి సరిగా అరగనప్పుడు, అమాంబాపతుగానూ... ఎదురురొమ్ముమీద చేతులు వేసుకు పడుకుంటే...ప్రత్యేకం భయంవేసేట్టుగా... కలలు...వస్తాయని ఆబాలగోపాలమూ తెలిసినసంగతి...

కలలో–ఏమేమి వస్తాయి?...ఎవడి అదృష్టము వాడిది...అందలం ఎక్కినట్లుగానూ... ముక్కు మన్నుకాకుండా క్రింద బోర్లపడినట్లుగానూ...అనుకున్నవన్నీ...అయే యోగ్యత లేకపోతే...ఆ కోరికలన్నీ మనసులో వెనుక పీటని నెమరునపడి..అవి మనకు అంతుచిక్కని ధోరణిలో అల్లా, యిల్లా కలల్లో చిగిరిస్తాయి...ఇది, నా మతం కాదు; మనకన్న కొమ్ములు తిరిగినవాళ్ళు...ఎన్నో ఢక్కా మొక్కీలు తిన్నమీదట తేల్చిన...సిద్ధాంతం...

కలలకు అర్థం ఏమిటి?...ఒకటేమిటి, కోటి:– చెప్పేవాడి తాహతునుబట్టి ఎన్ని చిలవలు పలవలయినా అల్లవచ్చును... అవి నిజమవుతాయా? ఏమో, ఎవరు చూసివచ్చారు?...అవవచ్చు..కాకపోనూవచ్చును...తెల్లవారగట్ల వచ్చినవి చాలా వరకూ అయితీరుతవని...పెద్దవాళ్ళు చెపుతూంటారు...కాని, నికరంగా అయి తీరవలెనని శాసనంలేదు...నాకు మాత్రం ఎంతమాత్రమూ నమ్మకం లేదు...

లక్ష్మయ్యకు...మొదటిరోజున కలవచ్చినప్పుడు...నిదురలేచేటప్పుడు అంతా పూర్తిగా జ్ఞాపకంలేదటకాని... ఆ మనిషి...అప్పటికీ కళ్ళకు కట్టినట్టుగా ఉన్నది...ఇక రోజా...ఆరోజు వచ్చిన కలే, వీసపాలన్నా మార్పు ఏమీ లేకుండా!–

ఆమె ఎక్కడో ఎరుగున్న మొగమే, కాని పోల్చుకోలేదు – ఎరుగుండటమంటే...రోజా...నిదురలో కలసిమెలసి ఉంటూండటం చేతనా అంటే, అదికాదట, మొదటిసారి కనబడినప్పటినుంచీ...అలాగే తోస్తూన్నదట...

ఏలా ఉంటుంది? – ఏమో, ఇలా, ఇలా అని ప్రత్యేకం చెప్పదగినదేదీ కనుపించదు...అందుకు ఆడవాళ్ళ లాగానే ఉంటుంది...కాని...ఏదో మొత్తానికి ఉండి ఉండాలి, ఇదీ అని చెప్పలేకపోతున్నాడు కాని..

పోనీ. .ఆఖరుకు...విధవా...సధవా? – అమాత్రం అన్నా...చెప్పగలడా?...ఏమో అదీ అనుమానమే – ఎందుచేతనంటే...తలకట్టు ఉన్నదన్నమాటేకాని...యిఖ యితర

పుణిస్త్రీ లక్షణాలేమీ లేవు .అంటే.. మామూలుగా మెళ్లో..పుస్తెలు . పూసలూ.. కాళ్ళకు మట్టెలూ...ముఖానా...చేతులకు ఉన్నవీ అంటే ..అవి యీకాలంలో అందరికీ ఉంటున్నవి. అందువల్ల ఛప్పన ఫలానా అని చెప్పడానికి వల్లకాదు.. కాని మొత్తానికి నిగ్గుతీస్తే పుణిస్త్రీ అనడంకన్న...

సరే...అయితే. పోనీ ఒకటనుకుందాం. ఒక్కొక్కప్పుడు జాతకంలో అలాటివి అంటూ వుంటే...ప్రత్యక్షంగా జరగకపోయినా... యిలా, ఆ దోషం అంతటితో శాంతించడానికి...అవడమూ కద్దు. అలాంటి దేమన్నావుందా?..లేదు, నిక్షేపంలాంటి జాతకము!

మరి...ఇప్పుడు ఏమిటి చేయడం?

చేయడానికి ఏం వుంది, వాడి ముఖం కాకపోతేను...కలలోకి.. ఎవరో పనీపాటా లేకుండా వస్తూంటే...ఏం మునిగిపోయింది? వచ్చేదానికి బుద్ధిలేకపోతే...లక్ష్మయ్యకు – ఏండ్లు వచ్చిన సంసారి. వీడికన్నా వుండవద్దూ?

వింటే ఎవరన్నా ఏమనుకుంటారు? – నాతో తప్ప ఎవరితోనూ ఈ సంగతి చెప్పలేదు...అయితే మాత్రం ఒరిగిందేముందీ? ముక్కూ మూతీ మూసుకు కూర్చోకుండా?–నాతోకాదు.. బ్రహ్మదేవుడితో చెప్పినా.. ఆరుస్తాడా–తీరుస్తాడా?

ఇప్పుడు ఏం చేయాలి? – అదిగో, ఆ వెర్రివేషాలే కూడవన్నది! ఏమిటి చేసేది?–ఏం చేయాలని అభిప్రాయం?–

ఎవరో? – ఏలా తెలుస్తుంది? ముప్పైమూడుకోట్ల జనాభా జీవించినదే ఉంటూంటే...ఎక్కడని, ఏ దేశంలో అని... విచారించడం? యిప్పటిదే అని మాత్రం ఏలా?...ఏ యుగంనాటిదో...ఎందుకు కాకూడదూ? .

– ఎన్ని చెప్పినా లాభంలేదు ఏలాగైనా ఆమె ఎవరో కంటపడేదాకా. ఇంకో ఆలోచనేలేదు...ఏమీ మనస్సుకు ఎక్కడంలేదు...

సరే...కర్మంజాలక...అలాటి ఆడది అంటూ ఉండి ఛప్పన్న దేశాలూ గాలించగా ఎక్కడో కనబడిందే అనుకో...అప్పుడు ఏమిటిరా. ?–అప్పటిమాట అప్పుడు చూసుకోవచ్చును...ముందు కనబడటం అంటూ వుండనీ...

మన ఊళ్లో...తెలిసినంతవరకూ .. ఊహూ... ఎక్కడా అలాటి ఆమె తగులలేదు... నీలాటి రేవులూ.. సర్కారుభావులూ..అక్కడ కాపలా వేయడం..తెల్లవారగట్లనే లేచి రోజుకు ఒక్కొక్కపేట చొప్పున...తెల్లవారే లోపున గస్తీ తిరుగుతూ.. ఇంటిముందర ఊడ్చి నీళ్ళు జల్లుతూ ముగ్గువేసే...వితంతువులను పరకాయించి చూడటం .. ఇంకా...ఏకాదశినాడు, గుళ్ళల్లోనూ.. హరికథలూ వీధినాటకాల దగ్గిర. కార్తీక స్నానాలూ, మాఘస్నానాలూ... పర్వాలప్పుడు సముద్రానికి వీలయినంతవరకు శక్తి వంచలేకుండా...చూసి...అక్కడకు. అక్కడ యిక లాభంలేదు అని తేల్చుకున్నాడు... చూడటం అంటే...బయట కనబడినవాళ్ళనేకాని...యింటి యింటికీ వెళ్ళి. 'ఏమండీ మీ యింట్లో... ఇలాంటి వితంతు వెవరైనా ఉన్నారా?...చూడాలి, పనుంది.. ఉంటే దయచేసి ఒక మారు యిలా పిలుస్తారూ, మీరు, రోజూ కలలోకి వెళుతున్నారే, ఆతడు మిమ్మల్ని వెదుక్కుంటూ వచ్చాడు..' అని అడగడానికి వీలున్నట్టయితే... క్షుణ్ణంగా చెప్పవచ్చును...ఆ ఊళ్ళో ఆమె లేదూ, అని...

తిరిగి...తిరిగి...కొన్నాళ్లకు దానితో దిమ్మతిరిగి ..బుద్ధివస్తుందేమో ననుకున్నాను. కాని, లక్ష్మయ్యది, రాక్షసత్వం: మూటాముల్లే కట్టుకుని బయలుదేరుతా నన్నాడు దేశంమీదికి...ఉషకు...అనిరుద్ధు డెవరో ముందు తెలుసునా?...పోనీ మనకెందుకు అని...ఎవడో వెధవాయ కలలో కనపడినాడు అని ఊరుకుందా?...ఏం, మనంమటుకు తక్కువ తిన్నామా?...ఏం లోటూ, తిరిగేందుకు సత్తువ వున్నది...తిరగడానికి సత్తుగా వున్నది ఎందుకు మానుకోవాలి?.. ఏదో అమీ తుమీ తేలకుండా?...పట్టుబడితే...దాని సంగతేదో తేలకుండా నిదురపోవడమేనా?—

లక్ష్మయ్య... ఆలా దున్నపోతులాగా కాకుండా కొంచెం చిన్నవాడైనట్లయితే... ఎప్పుడూ ఇలాటి వెధవ వేషాలు వేయవుగద—వెయ్యవుగంద...అని పట్టుకు దవడ వాయగొట్టివుందును...కాని, యిప్పుడేం చేయడం...నానా గడ్డికరచి...బ్రతికివున్న వాళ్లూ పొట్టకుకూడా సరిగా తినకుండా వీడేదో ఉద్ధరించుతాడని...లప్పంతా వీడికే కట్టిపోయిన...ఆ తండ్రి ముండావాడిని మనసులో ఛెడామడా తిట్టి...'నీ కర్మానికి ఎవరు కర్తలు?, అనుకుని...సరే పోయిరా...ఏ ఊరు వెళ్ళినా, ఈ పంపిణీమీదనే వెదకుతూండు...కాకపోతే.. పోనీ, నీకు చేతనైనట్టుగా భోగట్టాచేయి...వచ్చేటప్పుడు వట్టిచేతులతో మాత్రం రాక; పుల్లాయ వేమవరం వెళ్ళినట్టుగా. ఎందుకన్నామంచిది, కొంత దైవ సహాయ్యంకూడా వుండాలి కనుక, బయలుదేరేనాడు సత్యనారాయణ వ్రతమూ వెంకటేశ్వరులకు దీపారాధనా చేసుకుని...కోరిక ఫలిస్తే ఏటేటా అలా చేసుకుంటూంటానని...ఇద్దరూ కలిసి కొండకు వస్తామని మొక్కుకో...'

సరే...నేను చెప్పవలసినవన్నీ చెప్పాను...'క్షేమంగా వెళ్ళి లాభంగా రా...ఎన్నడన్నా ఓ ఉత్తరంముక్క...నీకు తీరికవుంటేసుమా...రాసిపారేస్తూ ఉండు...' ఇలా, పైకి సామంగానే అని.. సాగనంపాను:

ఇంకో యావ ఏంలేదు గనుకనా, ఎప్పుడూ అదే జ్ఞాపకం ఉండడానికి?...ఎవడన్నా ఎరుగున్నవాడు అప్పుడప్పుడు... 'లక్ష్మయ్య ఈమధ్య ఎక్కడా కనిపించడంలేదేం...ఎక్కడికి వెళ్ళాడు...ఎందుకు?'...యిలాటి బారవ-ప్రశ్నలు వేసినప్పుడు మాత్రం...లక్ష్మయ్య అవస్థ...నా ఊహలో కళ్ళకుకట్టేది...వాడినీ, రైలులో పక్క కూర్చున్నవాళ్ళు యిలాటి ప్రశ్నలే వేస్తారు...ఎక్కడికి?—సరే ఏదో ఫలానా ఊరికి! ఏంపనిమీద...బంధువు లెవరన్నా వున్నారా?...ఏమని సమాధానం చెపుతాడు?...కలలో ఎవరో సకేశి కనబడ్డది. అవిడ కంటబడటంకోసం బయలుదేరానని...నిజం చెపుతాడా? విన్నవాళ్లు చెప్పాహటి పుచ్చుకుంటారు; పై స్టేషను రాగానే...ఆ పెట్టెలోనుంచి దింపుతారు. దిగనంటే పోలీసునుపిలిచి...పిచ్చివాడని...అతనికి అప్పగిస్తారు...ఏమీ జవాబు చెప్పకుండా ఊరు కుంటాడా—వీడి కెంతనిక్కు! అని ఒకడు, ఏం చూసుకుని అంత పొగరు? అని యింకొకడు...వీడేం ఆకాశంనుంచి దిగివచ్చాడా...మాట మాట్లాడడానికే అంత యిదా?...అని కార్పణ్యంతో...చేతనైనంత వరకూ నాలుగువైపులనుండి కాల్చేచూపులు చూసి...ఆ తరువాత ఎలుకమీద, పిల్లిమీదా పెట్టి, ఏదో లోకాభిరామాయణంగా... మాటలతో చంపేస్తారు. ఎట్లైనా కంఠానికే పట్టుకుంటుంది: సరి...ఆ అవస్థ ఏలాగో తప్పించుకుంటాడు...అన్నీ...లౌక్యంగా... అబద్దాలే ఆడి...అంతటితో గడచి బయటపడతాడా? – అడుగడుగుకీ ఎవరి వంకన్నా – పరాకున ఒకసారి రెండుమార్లు చూస్తే పక్కను తోడుగావుండే ఏ ముసలమ్మ అయినా అది

చూడటం సంభవించెనా... 'ఏం..నీకేం పోయేకాలం వచ్చింది? ఎందుకూ దానివంక అలా ఉరిమి ఉరిమి చూస్తావు?...నీ గుడ్లు పీకించేస్తాను చూసుకో.. నలుగురినీ పిలిచి నోట గడ్డిపెట్టిస్తాను .ఏం..నీకు దానిలాంటివారు లేరూ? తల్లీ తోడూ అంతా తగలబడి పోయిందా? కళ్ళు ఊరుకుండకపోతే యింతకారం సన్నగా తాల్చికొట్టుకో'..యిదే వరుసను యక్షులూ, పక్షులూ అదలిపోయేట్టుగా..తిట్టి తిట్టి...ఏమిటో అని చోద్యం చూడటానికి పోగయిన వారు నలుగురూ నాలుగు మాటలూ అని...మరీ కర్మం తప్పిజారితే...సున్నంలోకి ఎముక లేకుండా .పాపం...అంతా తలుచుకుంటే, నవ్వు వచ్చేది – కోపమూ వచ్చేది...జాలీ వేసేది ..యిదంతా బయటకు పొక్కనీయకుండా..వాడి యోగక్షేమం అడిగినవాడితో 'ఏమో, లక్ష్మయ్య నాకూ కనబడటంలేదు – కనబడి చాలా రోజులయింది–' అని టూకీగా జవాబుచెప్పి తప్పించుకుంటూ వుండేవాడిని...నిజానికి అంతేకూడాను: ఎక్కడ తిరుగుతున్నాడో, ఏం అఘోరిస్తున్నాడో... వాడి అజాపజా తెలియలేదు.

ఎక్కడికి పోతాడు?...ఏమౌతాడు, రేపీపాటికి యిల్లూ యిల్లాలూ ఎక్కడవున్నారా అని మళ్ళా వెదుక్కుంటూ రాడూ?...

అలాగే...రానే వచ్చాడు.

కనబడటంతోనే...అంతదూరాన్నుంచే...'ఏంరా, ఏమైంది? – కాయా పండా?' అని పొల్లుకేకగా పలుకరించాను. లక్ష్మయ్య – దగ్గరకువచ్చి ..నా చేయి పట్టుకుని... నింపాదిగా 'చెప్పాలి..యింటికి వెళుదాముర' అని మెల్లగా అన్నాడు· కనబడ్డదా లేదా...ముందు, ఆ సంగతి చెప్పు, తరువాత భారతమంతా కానిద్దువుగాని. అని, చెప్పేదాకా...అక్కడే నిలవేశాను.

లక్ష్మయ్య, నదురుడుగా...తల ఊగించాడు. 'ఊహుఁ అలాకాదు, నోటివెంట చెప్పు'మని సాగదీసి, 'అవు'ననిపించాను.

"కనబడిందన్న మాటేనా?"

"ఆహా"

"ఎక్కడ?"

"కనబడిందిగా...ఎక్కడనైతేనేం?"

"అడిగినది ఒకటీ...చెప్పేదొకటీనా?"

"చెప్పుతూంటినిగా!"

"ఏమిటీ, నీముఖం! అంత అంతఃపురాంగన అయి. ఆమె పేరే..యీ పాపాత్ముడు వినడానికి వీలులేకపోతే... పోనీలే...ఇక్కడనే వుట్టికట్టుకు ఊరేగు ."

"అదికాదు...చెప్పడానికి సిగ్గవుతూంది."

"ఏం...అచ్చంగా కోతిలా వుందా?.."

"ఎబ్బే!.. చెపితే...నేను వెర్రివాడ ననుకుంటావేమోనని భయం. అంతేకాని .."

"– అది ఏనాడో నీకు వుండవలసింది: ఉంటే యిందాకా వచ్చేదా వ్యవహారం?...యింకా నీకు అదుపూ ఆజ్ఞా ఏమిటి?–చెప్పు –"

"చెప్పనా..."

"పోనీలే మానేయి..."

"ఎవరూ కారు...నా భార్యే!"

లక్ష్మయ్యవంక...నిలువు గ్రుడ్లువేసుకు చూశాను. వాడికా, నాకా, మతిపోయింది!

"అందుకనే, నీవు నమ్మవనే.. చెప్పడానికి సందేహించింది!..కాళ్ళ బలపాలుకట్టే ట్టుగా యిన్నాళ్ళనుంచీ తిరిగి. విసుగెత్తి నాలుగురోజులపాటు యింటిపట్టున వుండి, మళ్ళా బయలుదేరుదామని..నిన్న సాయంకాలం మెయిలులో వచ్చాను ఇంటికి చేరుకునేటప్పటికి కనుచీకటి పడుతూవుంది.. మా ఆవిడ తలుపు తీసింది...నా కళ్ళను నేను నమ్మలేకపోయినాను. మొదట, ఎప్పుడూ, అదే పలవరింత కావడంచేత..అలా భ్రమపడుతున్నా నేమో అనుకున్నాను: కాదు. మా యిల్లాలే: తలంటిపోసుకున్నది కాబోలు..అందుచేత నిరాభరణసుందరి. ఒళ్ళు తుడుచుకుంటూన్నదో ఏమో, నా పిలుపు వినబడేటప్పటికి చప్పున ఎదురుగుండా వంకెను నా మల్లుపంచె కనబడితే అది చుట్టుకు వచ్చినట్లుంది...ఏమైతేనేం .మూడుమూర్తులా .నా కలలో అంతకాలం కనిపించింది. అ మూర్తే..నాకు సందేహం ఏమీ లేదు: మనసు యిన్నాళ్ళనుంచీ పడిన యాతన గడచి గట్టెక్కినందుకు.. శాంతిగా, దానిలో అది 'అమ్మయ్యా!' అనుకుని ఊరడిల్లింది...ఆమెను చూచిన కొద్దీ..నా గుండె కుదుటపడింది. మా ఆవిడకు, నా గొడవంతా ఏం తెలుసునూ పాపం..'ఏమిటండీ...అలా చూస్తారూ?' అని రెట్టించుతూ నన్నూ, నా వాలకం చూసి తెల్లబోవడం మొదలుపెట్టింది. 'ఏమీలేద'ని ఆమెకు నచ్చచెప్పేటప్పటికి రాత్రి తాతలు దిగివచ్చారు..." అని ముగించాడు లక్ష్మయ్య.

నాకు లోపల నవ్వు ఆగడంలేదు...కాని, పైకి తొణకకుండా..

"అయితే...పెద్దచిక్కే వచ్చిందే" అన్నాను

"ఏం" అన్నాడు ఆదుర్దాగా...

"అవును, నీవు ఇకనుండి ఎవరితో చేయడం కాపురం?..."

"అంటే..."

"ఇంటావిడ అనుకుంటే...మనసు ఒప్పదు, కాదనుకుంటే...అలాటి కానిపని చేయ డానికి...నీలాటి శ్రోత్రియుడికీ... మనసు ఒప్పదు...చూస్తూచూస్తూ రండాగమనం;..."

"అప్రాచ్యపుమాట యిలాటిదేదో అంటావనే అనుకున్నాను...అన్నంతపనీ చేశావు..."

"అన్నంతపనీ చేస్తే-నీవు యిన్ని ఆటలు ఆడేవాడవా?...ఒళ్ళు పొగరు కాక పోతే...ఊఁ..."

లక్ష్మయ్య తల వంచుకుని ఒకటే పరుగు. ఈ అక్కసుతో రేపు భోజనానికి మాత్రం పిలవడు: వ్రతం ఎలాగూ చేస్తాడు మళ్ళా, కోరిక ఫలించినందుకు. చేయకపోతే ఎక్కడ పడవ మునుగుతుందో అని భయంకాదూ! –

★ ★ ★

# యక్షగానం

ఏం చెయ్యనుచెప్పు? దేవుడు నన్నల్లా పుట్టించాడు అందమైన పిల్ల కనబడితే మీరు చూసి సంతోషించి ఊరుకుంటారు. కనుచూపుమేర దాటిపోగానే, ఆ సంగతే మరచిపోయి, మళ్ళా మామూలుగా ఉండగల తాహతు మీకుంది తామరాకుమీద నీటిబిందువులాగా, ఏదీ అంటకుండా తిరగగలరు ఈ మిత్రుడికి అది చేతకాదు

చూసి ఊరుకోలేను. అంత త్వరగా మనసు తిప్పేసుకోలేను. నాకు ఓపట్టున అసలు మనసుకెక్కదు. కాని చక్కని అమ్మాయిని, ఎవరైనా నాకు నచ్చిందో, ఇక తాళుకోలేను. మనసు యిచ్చివేయాలిసిందే. ఏమరుపాటునైనా ఒక్కచిరునవ్వు విసిరితే, ఏనుగు నెక్కవలసిందే, దక్కకుండా పోయిన తరువాత, అదేపనిగా, తలచుకు తలచుకు చిక్కి శల్యమైపోవాలిసిందే – ఆ దెబ్బతట్టుకుని, కొంచెం కోలుకుంటూండగా ఇంకోతవాయి వచ్చిందో – వ్యవహారం మళ్ళా మొదటికి రావలసిందే – కాని, ఏం చెయ్యను. ఎప్పుడూ ఓడుచెయ్యే అయినా మోజుమాత్రం పోవడం లేదు.

మొన్న సెలవులియ్యగానే రాముడి పెళ్ళికని గంగలకుర్రు మనవాళ్ళందరమూ కలిసిపోయినామా? నీవు, పరిషత్సభలకని, గుంటూరు జారుకున్నావు అక్కడా మామూలు అవాంతరమే వచ్చింది. ఒక్క తమాషా ఉందోయ్ మళ్ళా. పదహారేళ్ళు దాటిన పిల్లల్లందరూ, కొంచెం కనుముక్కు తీరు అమరికగా ఉన్నవాళ్ళందరూ సర్వసాధారణంగా నా కంటికి అప్సరసలుగా కనబడుతారు. కాని, చుక్కల్లో రోహిణిలాగా వాళ్ళందరికీ ఎవరో ఓ అమ్మాయి నాకు ఒళ్ళు పరవశమైపోయేటంత వయ్యారంతో, కులుకుతూ ఎదుటబడుతుంది. అంతటితో అయ్యగారు నీళ్ళుకారిపోతాడు

బళ్ళుదిగి గుమ్మంలోకి కాలుపెట్టడం వ్యవధానంగా మన్మథజ్వరం ముంచుకు వచ్చిందని మన సుబ్బులు, అసాధ్యుడు కనిపెట్టాడు. ఎవరో చూపించేదాకా, వదలలేదు. చూడగా వాడికి నోరూరినట్టుందోయ్ – తలఊచి మెచ్చుకున్నాడు మంచిరకాన్నే ఏరుకున్నావన్నాడు. ఏలాగైనా, కవివికదా అన్నాడు. వాడి హుషార్ మాటలు వింటున్న కొద్దీ ఇక్కడ, మన ఆకాశసౌధంమీద అంతస్థులు పెరిగిపోతున్నాయ్–

నా గొడవేదో నేను పడకుండా సక్రమంగా జరిగిపోయేదానికి అడ్డుపేచీ కొట్టాడు. "ఒరే భాయీ, మనం వచ్చింది పరాయిచోటు. స్నేహితుడి పెళ్ళికి ఆ పిల్ల ఎవరో ఎరగకుండానే చూపులు పారేయడం, కర్మంజాలక, మన వాడెవడి భార్యా అయినా అయితే, అది మిత్రధర్మం కాదు. ఎవరో, ఏమో అనుకుంటారని కాదు. మన మనసుకు మనకే బాగుండదు: ఆ పిల్లకూడా, నీ చూపుల్లో చూపుకలిపి ఖుషామత్ చేస్తూందంటున్నావు గనుక, స్నేహితుల్లో ఎవరి భార్యా కానిపక్షంలో చెల్లెలైనా, మరెవరైనాకానీ. ఫరవాలేదు. నీవు నిరాఘాటంగా ముందుఅడుగు వేయవచ్చును. నీ అదృష్టం పండించుకోవచ్చును. అదేదో తేలేదాకా నీవు కనురెప్ప

మెదపడం చేయి విసరడం, చిరునవ్వు నవ్వడం, ఇత్యాదులు...బాబూ...తెలిసిందా?"

వాదించి లాభంలేదు. సరేనని ఒప్పుకున్నాను. కాని, తెలుసుకోవడం ఎల్లా? వచ్చిన స్నేహితుణ్ణి ప్రతివాడినీ "ఏరా అబ్బీ, నీవు సకుటుంబంగా వచ్చావా" అని లౌక్యంచేసి అడిగి చూశాననుకో. అవతలవాడు అవునన్నా, కాదన్నా ఆ అమ్మాయి ఫలానివాడి పెళ్ళాం అని తేలదు కదా! అంతటితో పోనీ, ఇంకా కొంచెం చొరవచేసి, ఆ అమ్మాయి నీ భార్యయేనా అని ఎవడినో ఉజ్జాయింపుగా అడిగితే, తీరా నిజమయేపక్షంలో మనవాడికి అనుమానం కలగకమానదు. అది మరీ అసలుకే మోసం. మా కొటరీ వాళ్ళని ఎవరిని అడుగుదామా? అందరూ కొంటెతనానికిపోయి మా ఆవిడంటే, మా ఆవిడని ఎగపడితే మనం అనుకున్నపని కాకపోగా నలుగురికీ ఆతతాయితనం చేయడానికి సందుచూపించినట్టవుతుంది. ఈ ముసుగులో గుద్దులాట యెందుకు? ఆ అమ్మాయినే ఆమాట అడుగుదామా అంటే కోమటిసరసంలోకి తేలదూ?

ఎటూ తోచక ఏమిటీ కర్తవ్యం అని మంత్రోపదేశంచేసినవాడి దగ్గరకే మళ్ళీ సలహాకు వెళ్ళాను. ఆ ధీరుడు సెలవిచ్చింది ఏమంటే – "ఈ సందర్భంలో నీ స్వయంకృషివల్లనే తెలుసుకోవలసిందేకాని, వేరే మార్గం లేదు. జాగ్రత్తగా కనిపెడుతూ ఉండు. ఎప్పుడూ వెన్నంటి తిరుగుతూనే ఉన్నావుకాదూ? ఎవరు ఆ అమ్మాయివేపు సొంత సొమ్ములాగా పరిచయంగా చూస్తూంటారో నలుగురిలో ఉన్నప్పుడు, ఎవరికోసం ఆ అమ్మాయి చూపులు వెదుకుతుంటాయో – అట్టే గడిదేరినట్టు కనబడటంలేదు ఇంకా – కనక వాళ్ళిద్దరూ దంపతులని మనం నిశ్చయించేసుకోవచ్చును ఈ దోవ తొక్కిచూడు. ఆపైన ఆపెచిత్తం – దేవరభాగ్యం!"

చూశాను. అటూ లాభించలేదు. మిసమిస లూరిపోతూన్న పిల్లగనుక ప్రతివాళ్ళ చూపులకీ, ఆ అమ్మాయే గురి. మిడిసిపడుతూన్న బేడిసల్లాగా చెంపకు చారెడు కళ్ళు వేసుకుని సదస్యం సావడంతా చుట్టూ తిప్పి నిమిషానికి మూడుసార్లు కలువల తోరణాలు కడుతూన్నది.

పునః గురుపాదుల దగ్గరకు వెళ్ళి స్వస్తి చెప్పుకున్నాను. వాడంటాడుకదా – "అవునురా – ఉత్సవాల్లో, ఈలాటి శుభకార్యాల్లో ఆడపిల్లలు వెనుకా ముందూ చూడకుండా, మాంచి ఉమ్మసుమీద ఉంటారు. వాళ్ళకు ఆటవిడుపు రోజులు ఇవే. పట్టిరోజుల్లో అయితే, కూచుంటే తప్పు, నిలుచుంటే తప్పు – ఇప్పుడేగా రికామీగా ఉండనిచ్చేది. అయినా పెళ్ళికివెళుతూ పిల్లిని చంకన వేసుకువచ్చినట్లు వచ్చేవాళ్ళు ఒక్కళ్లే రాక ద్వంద్వ సమాసాలు దిగుతాయేమిటోయ్–"

నాకు, చప్పున ఒక ఊహతట్టింది – "ఒంటరిగానే వచ్చిందేమోరా? ఇంత చలాకీగా ఉన్న అమ్మాయి. గుదిబండను కోరి వెంట తెచ్చుకుంటుందా? – అలాకాని పక్షంలో ఇంతకాలం వృధాగా గడచిపోకుండా ఈపాటికి ఇంద్రభోగం అనుభవిస్తుండేవాడినే. పోనీ ఇప్పటికైనా నేను చొరవ చేయవచ్చునా?" అని వాడి అనుజ్ఞ అభ్యర్థించాను.

వాడా మన బోల్తాలో పడేది? నా ఆదుర్దా కనిపెడుతూన్నకొద్దీ మరీ నిదానంలోకి దిగిపోయాడు. నాట్యశాస్త్రం నా ముఖానికి దగ్గిరగా ఆడిస్తూ "అమ్మమ్మ! మనం ఏ

పని చేసినా అనుకున్నమాట ప్రకారం పోవాలిసిందే – ఒంటరిగా వచ్చిందనుకోడానికి ఏం నిదర్శనాలున్నాయి? – ఊహాగానం పనికిరాదోయ్ భయ్యా! మనకు ప్రత్యక్షం – ప్రమాణం ముందు నికరంగా తేలవలసిందే" – అని ముద్ర వేసేశాడు.

"అయితే ఏం చేయమంటావురా – ఈతటపటాయింపులతో పుణ్యకాలం కాస్తా గడిచిపోతూంది – ఇవాళ సదస్యమూ అప్పుడే, నాకబలి అయిన తరువాత ఒక్కక్షణం ఉండము కదా? – పోనీ. ఏదో మస్కా వేసి ఏలాగో ఇంకోరోజు కూడా దేకినా, ఆ అమ్మాయి ఉంటుందో లేదో తెలియదుకదా? – ఏదో అమీతుమీ తేలకపోతే ప్రాణాలు నిలిచేట్టులేవు – భరతవంశపు బ్రతుకు .."

మాటకుమాట అడ్డంవేసి బ్రహ్మాండమైన ఎత్తు ఏదో తట్టినట్టు కళ్ళు జిలజిలలాడిస్తూ నా భుజం తట్టి "నీ రొట్టె నేతిలో అమాంతం విరుచుకు పడుతుందిలేరా! దీనికిక తిరుగులేదు. నీవుపడ్డ శ్రమంతా రెట్టికిరెట్టింపు ఫలిస్తుంది" అని అభయం ఇచ్చాడు. ఏమిటో చెప్పమని తహతహలాడిపోయినాను. వాడు, తాపీగా "కొంచెం ఓపికపట్టాలి. కార్యార్థివి ఇంత తొందరపడితే ఏలా? దైవం అనుకూలించాలి మనయత్నం కలిసిరావాలి. మిధున విడియాలందుకునేందుకు జంటలు జంటలుగా దంపతులు తయారుకాక తప్పదుకదా – అప్పుడు ఈ తర్జనభర్జన ఏమీ లేకుండా ఇదమిత్థమని నిర్ధారణఅయిపోక తప్పదు –"అన్నాడు.

"తేల్చుకుని, మూటాముల్లే సర్దుకుని బండి ఎక్కడమేనా?" –

"ఏం, ఉన్న వ్యవధి చాలదేం? – వెన్నెల రోజల్లా ఉంటుందా? – "దొరికిన నిమిషం దీరుపోదు, మన దొరగారే మొనగాడు' – వినలే ఈపాట, మామజాగా ఉంటుంది. ఇంకేం ఖుషీసే జావో – ఈలోపల మాత్రం ఏమన్నా పిచ్చవేషాలు వేశావా 'నాకు నీ యానగలదుసుమా ..'నాయనా!"

వెక్కిరింపు ముదిరిపోనీయకుండా తప్పించుకుని బయటపడి నిమిషమొక యుగం లాగు యుగమొక నిమిషంగా గడిచిపోయే ధన్య–తరుణావసరం ఎప్పుడెప్పుడా అనుకుంటూ గడిపాను. ఎన్నిసార్లు ఆ అమ్మాయి కనిపించినా తలఎత్తి చూడనన్నా చూడకుండా తప్పించుకుని మనసు సంభాళించుకుని మహూర్తమాత్రం కురుకాంత ధైర్యం ఇలా, ఏలాగో, తేలిపోతూ నేలకు వాలిపోతూ ఎల్లాఉన్నారో సహించి, నాకే ఆశ్చర్యంగా ఉంది.

మనకోసం ప్రొద్దునిలుస్తుందా పరుగెత్తుతుందా! – దానివేళ దానిదికాని? – నేను, ఆ సాయంకాలమంతా తీర్చి దిద్దుకొని ఉబుసుపోక ఇష్టంవచ్చినట్టు షికారుకొట్టివచ్చి నిద్రపోదామనుకుని, రాక, లేచి చెరిగినతల జాముసేపు మళ్లాసరి జేసుకుని మరోమారు లవెండర్ తుంపురులు ఒంటిమీద చిమ్ముకుని, పాన్పువేయగానే అక్కడ ప్రత్యక్షమైనాను. ఈ బ్రహ్మచారికి ఇక్కడేంపని, అని కొందరు వింతగా చూసి నవ్వుకున్నారు. మనం అవేవీ లక్ష్యంచేసేస్థితిలో లేము· చూస్తూ, మనసూ ఒకకొసాకుతెచ్చి మెలిజేసి పాన్పు చుట్టూ చక్రభ్రమణం చేయిస్తూన్నాను ఒక్కొక్కళ్ళే వస్తూన్నారు. తలోవేపునుంచీ వచ్చి సరసను నిలుచుని తాంబూలాలు పుచ్చుకుని కలిసి మళ్ళా విడబడుతూన్నారు.

అందరూ వచ్చారు ఆ అమ్మాయి కనబడదు తాంబూలపుపళ్ళెము ఖాళీ అయింది. ఆ అమ్మాయి జాడాయేలేదు.

పాతాళందాకా కుదించుకుపోతూన్న అడుసుల్ని బలవంతాన పైకల్లిపేసుకుంటూ ఊపిరన్నా సలుపుతుందని - పక్కవసారాలోకి వస్తూన్నాను: సుబ్బుచాటున ఇరికిపోతూన్న చంద్రరేఖ తళుక్కుమని మాయమైపోయింది ఆ అమ్మాయిమాట వినపడ్డది. ఇంకో అడుగువేసేటప్పటికి ఆ అమ్మాయి కనపడ్డది. నన్ను చూసి నువ్వు మొగం దూరంగా చేసుకుని మాసినచెరగు పిడుదులమీదుగా తిప్పి అంచురొండి సమర్చుకుంటూ తొలగిపోయింది!

ఏం చెయ్యను చెప్పు? దైవం వంచన తలపెట్టినప్పుడు ప్రతీకారం మన చేతులోపనా?

తిరిగి వచ్చేశాం. మనసు మనస్సులో లేదు. మరచిపోదామన్నా మరపుకురావడంలేదు.

స్కూలుకు వెళ్ళడంకూడా కట్టిపెట్టి వసారాలో కుర్చీలో దిగాలుపడి కూర్చుని ఉండేవాణ్ణి. దేహం మన స్వాధీనంలోలేదు. సుబ్బులు, వాడిపనేదో వాడు చేసుకుపోతూ నన్ను పలకరించకుండా, నా ఛాయలకైనా రాకుండా తమాషాగా తప్పించుకు తిరుగుతూండేవాడు. మెదడంతా, భూకంపం తరువాత ఓపోరులాగా అయిపోయింది. ఎప్పటికి కోలుకుంటానో నాకే తెలియదు. చెప్పి మనసులో మంట చల్లార్చుకునేందుకు వెళ్ళినవాడవు నీవు యకాయకిని తిరిగిరాకుండా, అక్కడినుంచి మదరాసుకొట్టేసి నీ చిత్తం వచ్చిన యింటిమీద బుద్ధిమళ్ళిన తరువాత కాని, దయచేయకపోతివి

మాడు వాళ్కానో అయిపోయి సెగలుచిమ్ముతూంటే యథాశక్తి ఉపశమనం చేసుకుందామని చిమ్మచీకటిలోనే లేచి బాగా ఎండఎక్కి తెరలువిడిపోయేదాకా, మంచులో ఇంటిముందు తోటలో తిరగడం అలవాటుచేసుకున్నాను. కాని సాఫీగా నడకసాగేదనా? ఏమేమో జ్ఞాపకం వచ్చి అడుగు ముందుకు పడేదికాదు మరిన్నీ గులాబీబొగడలు మంచులో చెమ్మలెత్తి తేనెలూరుతూన్నట్టుగా ఉండేవి. అలాటప్పుడు ఆ అమ్మాయి పెదవులేమోనని భ్రమపడటం నా అవస్థలో అబ్బురమా?

కోరకాలేనా...విచ్చినగులాబీలు మాత్రం మోసం చేయలేవనుకున్నాను? -

అవాళ గులాబీ చెట్టుదగ్గిరే నిలుచుని ఉన్నాను. ఎండతెరవిచ్చింది కాని, నేను తడిసిన తలను, చేతులతో అద్దుకుంటూ పరధ్యానంలో ఏమో, అలాగే ఉండిపోయాను.

గేటు తలుపు కొంచెం చప్పుడైంది. ఏడెనిమిదేళ్ళ అమ్మాయి ఓ రెక్క కొంచెం నెట్టి ఆ సందులోనుంచి తల ముందుకు రానిచ్చి బెదురుకుంటూ ముగ్ధంగా మహా మధురంగా నా చూపు తన వేపులాక్కుంటూ "గులాబీపూలియ్యరూ" అని కూసింది. నేను, ఏమీ చెప్పకముందే, ఆ అమ్మాయి వెనకాతలనుంచి "రావే పోదాం" అనే పిలుపు - కొంచెం ఉండి, "నీవు రాకపోతే నేను వెళ్ళిపోతున్నాను" అనే బెదిరింపూ, అంతకన్నా మరీ అందమైన గొంతులో వినిపించినవి వినీ వినడంతోనే మనసు స్టీరింగు తప్పిపోయినకారులాగా తూలుకుంటూ పొగరుబోతు పరవళ్ళలో గేటు కమ్ములు దూసుకునిపోయి బయట వాలింది.

ఈ భాగ్యవశంచేత గాలికి నెట్టుకొని కటకటాలకు అడ్డంగాఉన్న రెక్క ఈవలికి నెట్టుకువచ్చి ఆంధ్రవధూటీ సౌభాగ్యం అరచాటుగా ఉన్నప్పుడెంతగా ఉవ్విళ్ళూరిస్తుందో నాకు అనుభవించే యోగ్యతను ప్రసాదించింది.

నన్ను పూలడిగిన చిన్నపిల్లమాటకు జవాబులేక, నా ధోరణ అర్థంకాక, మళ్ళా అడగడానికి ఛింకంలేక, పూల ఆశ వదలలేక పన్ను ముందరికి పోనీయకుండా అడ్డంగా అక్కడే నిలుచుని ఉన్నది. రెపరెపలాడిన వల్లెచాటు చెరగునన్ను కూడా ఆ స్థితిలోకే తీసుకువచ్చి మాయమైంది: ఆశలు వెనుకకు మళ్ళించుకుని ఆ పిల్లకు ... పసరు పూవులైనా మిగల్చకుండా గులాబీ గుబురంతా దూసిలంగా ఒడి నింపేశాను. పాపం మాటసందెడై కాళ్ళు బందాలుపడుతూండగా వాళ్ళ అక్కతో కలుసుకోవాలని పరుగెత్తింది· గేటుదాటివచ్చి మెట్లమీద నిలుచుని కనుచూపు మేరదాకా మలపుతిరిగి వాళ్ళు కనపడకుండా పోయేదాకా ప్రతిమావస్థకు వచ్చింది మన మూర్తి!

లోపలికివెళ్ళానన్నమాటేకాని చేజిక్కిన నవనిధులూ పొరబాటున జారవిడుచుకున్న కృపణావతారం మెరుగునాకన్న ఇంకొకళ్ళకయితే ఈ స్వల్పవిషయం ఇంతగా మనసుకు పట్టిచ్చేదికాదు. నేను మొదటనే మనవిచేసుకున్నానుకాదూ? ఏ నీవో ఇంక మరొకరో అయితే అడిగిన పిల్లకు ఒకటో అరో పూలిచ్చి, వెనుకనుంచి పిలిచినపిల్ల బహునాజూకుగా కులికిందని, ఒకమారు దమ్ముగా అనుకుని మళ్ళా మర్నాడు. ఆ పిల్లే వచ్చి పూలడిగితే ఆనవాలుపట్టలేక కొత్తగా చూసేవాళ్ళు – నేనా? మీకూ, నాకూ అక్కడే ఉంది తేడా.

అప్పటినుంచీ ఇంకో ఆలోచనపోలేదు: వేరేపని తోచలేదు. రాత్రి ఆ పవలూ ఎలాగో గడిపాను. తెల్లవారగానే తోటంతా తిరిగి గులాబీలన్నీ కోసి పూలబుట్టలో అందంగా అమర్చి, ఎప్పుడు వాళ్ళువస్తారా అని ఎదురుచూస్తూ నిలుచున్నాను. ఎలా అనుకున్నాననుకుంటావా? అది నా మనసుకు తెలియాలి.

ఇద్దరూ కలిపే వస్తున్నారు ఒకరితో ఒకరు ఏవో కబుర్లుచెప్పుకుంటూ, నవ్వుకుంటూ. నన్ను చూడగానే, చిన్నపిల్లముఖం కలకలలాడి అడుగు ముందుకు వేసింది. ఆ వయ్యారి అనుమానించినట్టు గమనం మందగించింది అన్నమాటేకాని, ఇద్దరికి అట్టే ఎడంలేదు.

దగ్గరకురాగానే నేను చేతులుజాచి పూలు అందీయబోయినాను: చిన్నపిల్ల అమిత ఉత్సాహంతో దగ్గరకు రాబోతూండగా మా భామ చేయిపట్టుకుని ఆపి కోపంగా "వద్దు" అన్నది, నావంక చూడకుండా చెల్లెలినే గదమాయించుతూ. ఆ అమ్మాయిమాత్రం తక్కువతిన్నదా ఏం? విదిలించుకుని, రెండోచేత్తో సజ్జ అందుకుని, "నాక్కావాలి, నిన్న అన్నీ నువ్వే తీసుకున్నావుగా అమ్మ! చిన్నదాన్ని నన్ను అన్యాయంచేసి! ఒక్కపిసరన్నా యిస్తానేమో చూసుకో" అని చాడీలుగా చెప్పడంలో నాకు వేయిదేవతలు వరాలు కురిపించినట్లయింది. పూలన్నీ ఆ అమ్మాయి తీసుకుందా నిన్న?

మళ్ళా మర్నాడు –

"నాకు మల్లెలు – అక్కయ్యకు గులాబీలూ" అని నన్ను చూడగానే నవ్వుకుంటూ దగ్గరకు వచ్చింది మరదలు: నాకూ, ధైర్యంవచ్చి చేయికొంచెం పైకిఎత్తి "ఎవరికోచ్, ఎవరిక్కావాలోచ్" అని ఆ అమ్మాయివంకేచూసి చేరరమ్మని చూశాను. ఫలించింది – మరీ దరిదాపుకు రాలేదు చేతికి చేయైనా తగులనీయలేదు. కాని అందుకుని తలవంచుకుని, నిలుచున్నది పూలమీదనే చూపు నిలిపి నేను ఆపైమాట తోచక పలుకరించలేదు. వాళ్ళూ పలుకలేదు "వెళుతున్నాం" అన్నది చిన్నమ్మాయి. మౌనం ఉభయపార్శ్వాలా కంటకమైపోయినతరువాత, "మళ్ళా రేపు" అన్నాను.

అప్పటికి జవవచ్చి: నిశ్చయంగా చెప్పలేను కాని తల దవంత ఊగించిందని తోచిందోయ్ నాకు.

మూడోనాడు మామూలుకన్న కొంచెం ఆలస్యంగా అయితే ఒంటరిగా వచ్చింది. మనకు అంతకన్న కావాలిసిందేముంది? – వసంతలక్ష్మిని ఆహ్వానించే మాధవుడి మమతతో లోపలికి తీసుకువెళ్ళాను చెట్టుచెట్టుదగ్గిరా నిలిచి పూలు వీరి కోసుకుంటూ కోసినపూలన్నీ వెనువెంటనే దండగా అల్లుతూ జాజిపొదలచాయకు చేరుకునేటప్పటికి వంకీగా తయారుచేసి నాచేత బ్రతిమాలించుకుని తురుమనిచ్చింది. నవ్వుకు నవ్వుతోనే బదులుతీర్చింది: అందుకున్న చేతిని అంతలో లాక్కోకుండా నాకైవసాన మనసార మసలనిచ్చింది. ఎంతకు నోచుకున్నానో ఎన్ని కలలుకన్నానో? ఒకళ్ళకి ఒకరు ఎంత కావలసినవాళ్ళమైపోతా మనుకున్నానో ఇప్పటికీ పరచిపోకుండా ఉన్నానోయ్! [ఆవాళ అందం, అలంకరించుకున్న సోయగం, గోధుంరంగుచీరె, నొక్కునొక్కుల పైట అమరిక, జబ్బా జరీగేరలకు రాచుకుంటూ తళుకుమనే లోలాకులు కులికేనప్పుడల్లా, వెన్నెలలు చిలుకుతూ, ఎందుకులే బాబా! పలికినందుకు తలచుకున్నందుకు ఫలమేమి?

ఈ మూన్నాళ్ళ సహవాసంతోనే, ఆ అమ్మాయి మీద నాకు మక్కువ ఆనూపంగా పెరిగిపోయింది. కనబడేదాకా నిలువలేకపోయేవాడిని. కలుసుకున్న తరువాత ఓ పట్టున విడువలేకపోయేవాడిని. నవమల్లిక చూశావ్. ఇంత కథాచెపుతూ ఇందాకటినుంచి పేరుఏమిటో చెప్పడమే మరచిపోయినాను. నీవన్నా అడిగావు కాదేం? – మరొచ్చి వినడం విసుగాఉంటే చెప్పు, మొగమాటానికి పోక, అం లేదుకదా సరే

నవమల్లిక కాలేజీలో పెయింటింగ్ నేర్చుకుంటూంది. చుట్టయినా, మాయింటి మీదుగా వచ్చేది వచ్చేవేళకు, నేను సిద్ధంగా కాచుకుని ఉండేవాణ్ణి. ఇద్దరంకలిసి బహుకులాసాగా ఏవేవో అర్థంలేనికబుర్లు చెప్పకుంటూ దోవలో ఎవరూ చూడనప్పుడు చేతులు కలుపుకుంటూ నడచిపోయేవాళ్ళం నిదానంగా. ఎంత ఆలస్యంచేసినా కాలేజీగేటు కనబడగానే అప్పుడే వచ్చామే, ఇక విడిపోవాలికదా అని అడుగు ముందుకు వేయడానికి మనసొప్పేదికాదు: టైమైపోయిందని పారిపోయేదాకా అక్కడే నిలుచుని మాటలలోకిదించి కదలనిచ్చేవాడినికాను.

సాయంకాలం చివరి పీరియడ్ ఎగగొట్టే నేను కాలేజీ నుంచి, ముందుగా బయలుదేరి వాళ్ళ స్కూల్ దగ్గరకు వచ్చి తారట్లాడుతూ తొందరగా నడవదని స్కూల్ గడియారాన్నీ, వేళకుగంటకొట్టడని ముసలిబంట్రోతునూ, మనసునూ లక్షలు తిట్టుకుంటూ కాలు నిలువకుండా ఉండేవాడిని. టైమైపోయి మల్లిక గేటుదాటి బయటపడగానే ఇంకోదోవను, అది మరీచుట్టు, వాళ్ళ యింటిదాకా కలిసి వెళ్ళేవాళ్ళం. వాళ్ళ మేడ సందులో లోపలగా ఉంటుందిలే. నేను మొగదలనే ఆగిపోయేవాడిని, మల్లిక గడపలన్నీ ఎక్కి వెనుదిరిగి నావంక చూసి మాయమయేదాకా! – "లోపలికి రావచ్చును, మావాళ్ళు ఎవరూ ఏమీ అనరు..." అని అనేకసార్లు రమ్మని బలవంతం చేసింది. నాకే ఎందుచేతనో దమ్ములుండేవి కావు.

– సుబ్బులు వాళ్ళ ఊరువెళ్ళారు: నేను ఒంటరిగానే ఉన్నాను: ఆ సంగతి మల్లికకు తెలుసు.

శనివారం – సెలవురోజు కనుక ఆనాడు ఉదయం మేమిద్దరమూ కలుసుకోలేదు సాయంకాలం టోర్నమెంటు చూడటానికివెళ్ళి పొద్దుగుంకిన తరువాత ఇంటికి చేరుకున్నాను. స్నానం, భోజనం అవీచేసి నాయరుహోటలుకు వెళ్లి టీ త్రాగివచ్చి ఫ్రాన్సిస్‌కోవిట్టేపుస్తకం పూర్తిచేయాలని రాత్రి ఎంతైనాసరే సిగరెట్ ముట్టించి కుర్చీలో ఒరిగాను.

పేజీ తిరగకముందే తలుపు చప్పుడు కాకుండా తోసుకుని, మల్లిక లోపలికి వచ్చింది: – మరీ దగ్గిరకి వచ్చింది:

ఆవేళప్పుడు అసలు ఎన్నడూ లోపలికి రావడం ఆమెకు మామూలులేదు: చూడగానే మొదట ఆశ్చర్యం వేసింది. నాకోసమే వచ్చిందికదా అనుకునేటప్పటికల్లా మనసు పొంగిపోయింది. వెంటనే కౌగిలిలోకి లాక్కుంటే అభ్యంతరం పెట్టదు. నాకు తెలుసును కాని నామతం అది కాదు.

కూర్చోమన్నాను. దూరంగావున్న కుర్చీలో పోయి కూర్చుంది. అక్కడనుంచి ప్రేమఅంటే ఏమిటో ప్రణయజీవనం అంటే, ఏమిటో సామాన్య ప్రాపంచిక సుఖాలకు మించిన మానసికానురాగం ఎంత ఉత్తమమైనదో ఎంత గొప్పగా చెప్పాననుకున్నావు?–

నా తెలివితేటలకు అభినందించాలనీ ఇంత చదువుకున్నవాణ్ణని నన్ను మల్లిక మెచ్చుకోవాలనీ కాదు. నా మనసు విప్పి చెప్పాదామని. ఆమెచేత "నేను నిన్ను మనసార ప్రేమిస్తున్నాను" అని అనిపించుకుందామని...

విన్నది. విని, ఊరుకున్నది.

కూర్చున్నదల్లా లేచి నావంక చూడకుండా 'వెళ్ళివస్తాను' అంటూ అడుగు సాగించింది.

నేను, ఆదుర్దాగా ముందుకు ఉరికి చేయిపట్టుకొని "అప్పుడేనా" అన్నాను. ఆమె పెడమొగంగానే, "అవును" అని చెయ్యి కొంచెం మోటగా విదిలించుకుంది.

"నీవు వుంటావనుకున్నాను" – నాకు మాటలు తడబడినవి. బ్రతిమాలుతూ అడగటంలో మల్లిక కొౌరడాఛలుకులాగా నావంక మళ్ళీ కళలేని చూపుతో తీయదనం లేని నవ్వుతో "అలాగా" అని మిగిలినమాటలు మింగేసి వెళ్ళిపోయింది.

అంతే ఆనాటినుంచీ నేనూ, మల్లికా పరాయివాళ్ళం. చాలా రోజులదాకా కనిపించనేలేదు, ఇప్పుడు ఎన్నడన్నా ఒకవేళ కనిపించినా నావంక చూడనైనా చూడదు.

ఏమిటి కారణం భాయీ, నాలో లోపమూ? లేకపోతే జాతకఫలం అలాంటిదా?

చెప్పనా – ఏమిటో?

మొదటిది – నీకు ఎవరిని ప్రేమించాలో తెలియదు.

రెండు – ఏలా ప్రేమించాలో అంతకన్నా తెలియదు. ఏం, శంకరాచార్యుణ్ణి అనుకుంటున్నావా ఏం, శృంగారం, వేదాంతం కలగలిపి చలాయించుకు వచ్చేందుకు? ఆ అమ్మాయి నీమీద ఆపేక్షతో వచ్చింది: లెక్చరువినడానికా? ఉక్కిరి బిక్కిరి చేసేస్తివి. ఇంకానయం – కెవ్వున కేకవేసి నీకు పిచ్చి ఎత్తిందనుకుంటూ వీధినిపడ్డది కాదు – నీకు అలాటి సత్కారము కావలసింది. లేకపోతే కొంచెం గడుసరి అయితే "చుప్ రహో" అని చెవిమెలివేసి అరచేతులలో ఎత్తుకొని...

చేతగానితనం కాకపోతే ఎందుకువచ్చిన వేషాలురా ఇవి – భాయీ!

# దారుకావనం

అందరు ఆహితాగ్నులూ, తలో పుడిసెడు తీర్థం యిస్తే – అది పుచ్చుకుని, – బాధ లేకుండా భగవాన్లు, – గుర్రాలెక్కి వస్తున్నానని ఆకాశంలో ఒక పక్కి పొడిచాడు –

వాడికన్న ఎంతకుముందో, వీడు వచ్చేశాడు.

ఊరికి ఎండెక్కింది – ఆకలి ఎక్కింది – నీలాటి రేవులో, ఏదో ఒకటో అరో, – నిండుకుండ తొణికే ఓపికలేక అలా నిల్చిపోయివుంది –

రేవు దిగాలుపడివుంటే, – పాపం కదా అనుకుని, – వీడు దాహం తాగుదామని, నీటిచాలుకు వంగాడు, నీడలు పేనేసి లాక్కున్నాయి – బుజ్జగించినట్లు, – లేత చెక్కిలిమీద, చేసే మారాము ముద్దొచ్చి అలా పుణికినట్టు, – నీటి పాయను అనేసి, ముందుకు అడుగు వేశాడు – తామర తంపర పెనవేసుకుంది – పట్టుచిక్కక జారిపోయింది – ఉసూరుమంటూ కుప్పకూలిపోయింది –

వీడు, – నడిబొట్టుమీద, అడుగులు, లెక్క పెట్టుకుంటున్నాడు:

"ఒరేయ్! – అబ్బీ!"

"ఏయ్! – నిన్నేరా?"

"ఇందరా, కానీ!"

– వినిపించుకుంటూ నవ్వుకుంటూ చక్కా పోతున్నాడు: పోగా పోగా, ఏ ధర్మతల్లో, గుమ్మంలోకి వచ్చి, ఆగమని కేకేసింది: పట్టెడు పిడచ పడేస్తాను ఉండమంది:

"వద్దులే తల్లీ!–" అన్నాడు!–

"ఏం, అదేం పోయేకాలంరా నీకు?" అని గద్దింపుగా ముందుకు వచ్చింది:

"నిలు,–అక్కడే నిలు అంట!"

వీడు,–పోనీ–పాపంగా, నిలవబడి పోయినాడు – ఆ యిల్లాలు,–వీడిని పట్టుకుని, అటు ఏడు తరాలూ, ఇటు ఏడు తరాలూ,–పనికిమాలినవాళ్ళ కోవను అంతా తూర్పార పట్టింది–వీడికి–, ఎండ కన్నెరుగని ఆ తల్లి, కడుపులో చల్లంతా, అల్లా గలబరించుకుంటూందేమో అని, తగని జాలివేస్తూంది: ఆ వగర్పూ, ఆ తామసం చూసినకొద్దీ, నవ్వు ముంచెత్తుకొస్తూంది!

నాళ్ల నడుమేమో, – నలుగురు ఇల్లాళ్లూ, – చోద్యం చూడటానికి అక్కడ పోగైనారు: 'ఎందుకు అలా తిట్టిపోస్తున్నావ్, – మిట్టమధ్యాహ్నంపూట', అని ఒక్కరూ అడిగిన పాపాన పోలేదు: 'ఆ ముష్టి వెధవ ఏమన్నాడు, – ఏం చేశాడు'?–అని అందరీ ఆదుర్దా:

ఆవిడ – ప్రజల్లో పడ్డ తరువాత, – రొప్పు రవంత సంబాళించుకుని, – మాటకుమాట పేనుతూ, వీడిమీద సవాలక్ష పితూరీ పెంచింది. వీడి పొగరుమోతు తనమేమిటో అంతుకనుక్కోవలసిందే అంది. ఇందుకనే, వీళ్లిలా మలమలమాడిపోవటం, అని శాపంగా అంది:

అందరూ, నిజమే అన్నారు–! అందులో ఓ తల్లి,–"ఏంరా, పిలిచి బిచ్చంపెడతానంటే,–వద్దనడం నీకు యిదేం తెగులురా?"–అంది–

"ఏం చెయ్యను,–మాయమ్మా!–ఆకలి కాలేదు!" అని అపరాధం చేసిన గొంతుతో అన్నాడు,–నవ్వుతో ఉక్కిరిబిక్కిరౌతూ!–

"కాక? – ఇదేమిటే అమ్మాయ్, – ఈ విడ్డూర్యమేమిటే? ఏటికేడాదీ ఎండే వెధవకు, ఆకలి లేకపోవడమేమిటే?–" ఆ తల్లి ఆశ్చర్యానికి అంతులేదు. పక్కనున్న పడుచును పట్టుకుని, – "ఇదేమిటే!–ఆః!–ఇదేం చోద్యమే!" అని బుగ్గలు గుంజుతూంది: నలుగురు అమ్మలక్కలూ, – ముక్కుమీద వ్రేలు వేసుకున్నట్టు అయిపోయినారు: వీడు అంత నిర్లక్ష్యంగా పోవడం, మాటకు మాట అనకుండా, – అడిగినదానికి కావలసిన సమాధానం చెప్పకుండా – వీడూ, ఓ మామూలు మనిషల్లే, రెండు కాళ్లతోనూ నడిచిపోవడం, ఆ ధర్మతల్లికి నలుగురిలోనూ మరీ చచ్చిన చావైంది: –

"పోనీలేవే – ఇందుకే వీళ్లకు పుట్టగతు లుండవ్!–" అంటూ, అందరూ సముదాయించి, – పుట్టెడు దుఃఖంలో ఉన్నట్టు ఆ యిల్లాలు, అపసోపాలు పడుతుండగా, – యింట్లోకి నడిపించుకు పోగలిగారు.

–వీడు అదేపోతగా, పోతూనే ఉన్నాడు: దోవలో గుడియేదో ఎదురుగుండా వచ్చింది: లంకంత ముఖద్వారం ఆగమని బ్రతిమాలినట్లు అనిపించి, – ఆగుదా మనుకున్నాడు: అనుకోకుండానే అడుగు ముందుకు వేశాడు: పోనీగదా అని ఆగాడు. వెళ్లేవాళ్లందరూ లోపలికి, అతి మడిగా, అతి బరువుగా, అడుగులు వేస్తున్నారు: బయటికివచ్చే మూకంతా, – ఉసురుసురైపోయి, – కరిమింగిన వెలగపళ్లల్లే, – తగని బోలుగా బయటపడుతూంది:

ఎవరో పొరుగూరునుంచి, ఆ దోవను పోతున్న ఆసామి, – ఆగి, చెప్పులు విడిచి, చేతపట్టుకుని, – జారవిడిచి లెంపలు వేసుకుని, గోపురంవైపు తలఎత్తి కళ్లుమూసుకుని ఏదో గొణుక్కుని, – వీడిని, యాదాలాభంగా, – "ఏమిటి, ఇయ్యాల?" అని అడిగాడు:

"ఏముందీ, మామూలే!" అని గాలిలోకి అన్నాడు వీడు –

"అంటే!"

"అంతే!–పాపంచేసిన వాళ్లందరూ లోనకెళ్లి మస్తరేయించుకు వస్తున్నారు!–"

ఆసామి, ఉలిక్కిపడినట్టు "ఆః!" అని బెదిరి, – "కళ్లు పోతాయిరా, వెర్రోడా!" అని నయానే చెప్పాడు:

"కళ్లుపోతే–చెవులు లేవూ?" అంటూ వీడి ప్రశ్న –

"వెర్రి యెదవకు – యేదాంతం!" అంటూ ఆసామి రుంజుకుంటూ సాగిపోయినాడు, భయం – భయంగా నవ్వుకుంటూ,

– వీడు యింకా సాగిపోతూనేవున్నాడు – పోయిపోయి కొంతదూరాన ఊరు ఆగిపోయింది: అవతల అదేదో, – మర్రిలాటి రావిచెట్టు – చెట్టుకు పసుపూబొట్టూ, – క్రిందంతా పొంగిలిరాళ్ళూ, – పాలచారికలూ, –

ఎవరో ఓ పేరంటాలు పాలు పొంగించుతూంది – పొంగిపొర్లి పోయినప్పుడల్లా, – చేయెత్తి దణ్ణం పెడుతూంది. కొమ్మల్లో బ్రహ్మరాక్షసులల్లె పాతపక్షులన్నీ విలవిల లాడుతున్నాయ్. ఓ ముసలమ్మా ఓ పసిపిల్లా, – కాకాయ్‌అని తోలుతూ అష్ ఉష్ అంటున్నారు: ఇంకో బొడ్డు ఊడనివాడు, – కుక్కానక్కా ముందుకుదూకి కలియబడకుండా, – అమ్మ అండచూసుకుంటూ, కాపలా కాస్తున్నాడు:

ముసలమ్మ, వీడివంక అదోచూపు చూసింది – మనవడు, చేతిలోవున్న పుల్ల, నేలకు వాలుగా దిగేసి, – జబ్బలుకట్టుకు, దానిమీద మోపుగా అని, ఆకలంతరీమాగా చుర–చురలాడాడు.

వీడు, చూసీ చూడనట్టు అదంతా దాటిపోయినాడు. దోవకు అడ్డంగా రాతిమీద రాయి కూర్చుంది. దోవ, తలవంచుకుని తప్పుకు పోయింది – తన దోవను.

వీడు, దానిమీద కూర్చున్నాడు: రాయి, దాచుకున్న ఎత్తుపల్లాలు సర్దుకుంది.

కుక్క ఒక్కొకటే, అడుగు వెనక్కువేస్తూ, ఆగి, పంజా ముందుకు ఆవలింతగా జాపుతూ, ఇక్కడకు జేరుకుంది – అన్నీ, ఎటూచూడటం మానేసినాయ్.

చిన్నవాడు, కవ్వింపు దిగజారిపోగానే, రోషంగా మంకుతనంగా, – "అమ్మా!" అన్నాడు:

పొంగించే యిల్లాలు, బర్దకంగా ఇటు చూసింది: చిన్నవాడిచూపు అందుకొని, వీడివంక చూసింది: అందినంత మేరా కలియజూసి, మళ్ళీ తిరుగుముఖంగా, వీడినే చూసింది: రెప్పవాలేలోగా, ఎంతోసేపు చూసినట్టు చూసింది – పొలిమేరలో కాపు వేసిన బసవన్నచూసి, ఆయన ఇంటి లేగలాగా, మెడ–బెదురుగా, మళ్ళీ అటు తిరిగింది –

ఆ బెదురు, ముసలమ్మ అందుకుంది – కనుచూపు మేర ఎక్కడా, మరో మనిషి తోడులేనట్టు కనిపెట్టింది – "అయినంత వరకూ చాలు, దించి, చేయి చూపించి, ఇక తెములు –" అని ఊదరపెట్టింది, కోడలిని.

అందరూ, కదిలారు: ముందు చిన్నవాడూ, వాడికి వత్తాసుగా, అవ్వ – ఆ అడుగుల్లో అడుగు వేసుకుంటూ, రాక్షసుణ్ణి కవ్వించే మోహిని భంగిమంలో, పాయసం దుత్తపట్టుకుని, కోడలూ –

వాళ్ళా యీవేపే రావాలి, – రాచుకుంటూ పోవాలి – మరో దోవలేదు–

కుక్కలు, ఆశగా తోకలు ఆడిస్తున్నాయి – దగ్గిరకు వస్తూన్న కొద్దీ – వీడు, కూర్చున్నచోటే ఒళ్ళు విరుచుకున్నాడు:

అవ్వా చిన్నవాడూ, దారి దిగి నడిచారు – కోడలు అడుగు యింకా, దోవలోనే ఉంది.

వీడు ఒళ్ళు ఝళిపించాడు: అవ్వ అమ్మయ్యో అన్నట్లు, చిన్నవాడిని తనచాటుకు యీడ్చుకుంది: వీడు కూర్చున్న పాళానే లేచాడు: కోడలు, ఎక్కిళ్ళు మింగినట్టు నిలుపు నిలుపూ ఒక్కసారి గళబరించుకుని, దుత్త జారవిడిచింది – కళ్ళు చేరెడు

చేసుకుని ఒరికిపోయిన పట్నంతా చూస్తూ, అడుగు వెనుకకువేసి, అత్తమొగంచూసి, ఏడుపు సాగించింది - కుక్కలన్నీ అంతమేరా కమ్ముకున్నాయ్ -

వీడు, నవ్వుకుంటూ పోతున్నాడు - కోడలు, శ్రుతి హెచ్చించింది -

కోపం తెప్పించుకు ఆగాడు: కొరడా ఝళుక్ మన్నట్టు అటు తిరిగాడు.

"ఏమే కూతురా!-ఆరగింపైందని ఏడుపా? సంగీతం పాడు, దేవుడు దిగివస్తాడు?" అని నవ్వాడు: కోడలు, మూతి ముడుచుకుని, దెబ్బతిన్నట్టు కూలబడ్డది -

'వదినోయ్'!- అవ్వను, కసిరినట్టు కూక వేశాడు 'ఎక్కడైతే నా భక్తులు సంగీతం పాడుతారో, - అక్కడ మనం ఎప్పుడూ ప్రత్యక్షం-' అని పాటపాడినట్టు అన్నాడు - గాలిబుడగల మీద అడుగులు వేస్తున్నట్టు, - జువ్వన సాగుతున్నాడు -

చేలుదాటి, ఇంకోవూరు వచ్చింది - ఊరులోకి అడుగు పెట్టనీకుండా, తోట అడ్డం వచ్చింది - తోటకోసం, పువ్వులు, - పువ్వులకోసం, పిల్లలు -

పూలన్నీ పైటలనిండా దోచుకుతెచ్చి, - ఆ ఒక్కతే పిల్లసరసను రాసులు పోస్తున్నారు: ఆ పిల్ల, - వాటిమీద, ఆనీ అననట్టు, - వ్రేళ్ళు మోపి, - వీణ మీటినట్టు పుణుకుతూ, మనసు ఎక్కడో పెట్టుకు కూర్చుంది -

"నీవు ఏ రాజు కూతురివె కొమ్మా!"

"నీ పేరేమిటే ముద్దుగుమ్మా!"

తత్వం పాడినట్టు, వీడు, విరగబడి పాడుతున్నాడు - పిల్ల, విని, గరిపాడిచింది:

"ఎగనేసుకుపోయే రాజుకొడుకు - వేటాడుతూ ఇటు రాలేదా?-"

నవ్వుతూ ఒక్క అడుగు ముందుకు వేశాడు - వీడు చిన్నది, యేడువారాల సొమ్ముల బరువుతో - పంచకల్యాణి మీదికి లంఘించే ఒడుపుతో కూర్చుంది - వీడివంక చూసీ చూడని రీవితో, ఆస్థానకవి పరకాయించినట్టు, - తల ఊపుకుంటూ తనలోతాను, కుమిలి - నవ్వుకుంటూంది -

"జయము జయము - మహారాణి!"

చిన్నది - అదేమన్నట్టు ఉలిక్కిపడ్డది -

వీడు, మరో అడుగు ముందుకు వేసినట్టు, - గొంతు చేరువకు తెచ్చి, - దేవరహస్యంగా, - పెదవులు కదిలించకుండానే, - కాగలకార్యం, - చూపు మెలపులో వివరించాడు-

"ఎంతకాలం ఉంటాడు, - ముసలిరాజు! -"

"యుద్ధాల్లో సాయంకాలానికి, ఇంద్రుడు రథం పంపిస్తాడు - మాతలి తోలుకుపోతాడు -"

"ఆ క్షణం నుంచి, మీ నాథుడే ప్రజలకు దిక్కు -"

"ఓపలేని మహారాణి, - కిరీటం మోయలేనే అంటుంది - దాసదాసీ జనంబులు వల్లకాదు తల్లీ అంటారు - అంటూ అంటూ ఉండగానే, - వంశాంకురం - కేరుమంటుంది -"

"మీ భరతుణ్ణి, నేను ఎత్తుకు ముద్దుచేస్తా! - బాణం గురి తప్పనీయనమ్మా!"

చిన్నది, చంద్రకాంత ప్రతిమ అయిపోయింది - సంతోషం ఓడిపోతూన్నది -

మల్లీ పువ్వులు చేరుకుంటున్నాయ్, రాసిదగ్గిరకు – అల్లంతదూరంలోనే పిల్లలనందరినీ ఆపేశాడు, – వీడు,: వాళ్లకు వీడి వాలకం చూసినా, – భయం వేసినట్టు లేదు – రెక్కలు కట్టుకుని, ఏదో పక్షి తూలుకుంటూ నడచిపోతున్నదని, – అంత వింతగానూ చూస్తున్నారు –

"కన్నె కుమారికి – కలలు నిండాయోయ్! – " ముందుకు దూకినట్టు అన్నాడు – అందరికీ చక్కిలిగింతలుగా నవ్వారు – నవ్వుల్లే పోతున్నారు –

"ఎవడే – వీడు!"

ఓ చిన్నది త్రుళ్ళిపడ్డట్టు, – ఎన్ని జన్మల వెనకాల నుంచో అడిగినట్టు, – తనలో తాను అనుకుంది – అన్ని చూపులూ, అదే మాట పనవి – పనవి, వెంటాడినవి –

వీడి కూనిరాగం, – పాట ధోరణిలోకి వచ్చింది – "మల్లెపంది రదిగో – ఇదిగో – " పాట ముందరికి సాగుతూంది – వీడి అడుగు, వెనుకకు పడుతూంది – పడి, పడి, పిల్లకు కూత వేటుగా, ఆగింది – కమ్చీ ఝళక్ మన్నట్టు ఎదురు మొగమైనాడు –

"సుందరి! – మాధవు డల్లడుగో – " మాధవుడు, ఎన్ని హావభావాల హొయలయేదీ, – ఆ భంగిమాలన్నీ, – చూపుడు వ్రేలితో, – శూన్యంలో, బొమ్మలు వేస్తున్నాడు – పిల్లలు, వలబడ్డ జక్కవలల్లే – క్రిక్కిరిసి, కదలకుండా విలవిల్లాడుతున్నారు – పుస్తకం రావ్వనమూసేసినట్టు బొమ్మలు తిప్పడంమానేశాడు – పారం అర్థం అయిందా – అన్నట్టు పరకాయించి చూశాడు – పిల్లలకళ్లు – పైపారాలు గడ–గడా వప్పగించేస్తున్నాయ్ –

– ముతకకంబళీమడత ఎగిరి భుజానపడ్డట్టు – ముసలిగా కుదిలించుకు పోయినాడు – మసకతో తడుముకుంటూన్నట్టు – "ఓ మల్లియలార! – మీ పొదలమాటున లేదుగదమ్మ–!" క్రియాపదం జారిరాగంలో, అనుకుంటూ అందిన తీవల్లా కదిలించి చూస్తూ – తోట దాటాడు – పేట దాటాడు –

దోవ, దారితీస్తుంది, – అడ్డంకొట్టి, చేలగట్టుమీదుగా పెద్దరోడ్డును అంటుకుంది.

ముందు, – పూటుగా ధాన్యపుబస్తాలు వేసుకుని భారీ ఎడ్లబండి పోతూంది – వీడు, రోడ్డుమీద అడుగుమోపగానే – అది, ఎగిరిపడి, – బండి రెక్కవాల్చింది: మొగ్గిన చక్రం, – పెళపెళమంది: పైపైన బస్తాలు ఒళ్ళు విరుచుకున్నాయి: అడుగుపీటీని ఉన్నవి, పూర్వకాలపు ముత్తైదులల్లే, అలాగే అంటిపెట్టుకుని ఉన్నవి –

ఎద్దులు, మర్యాదకోసం, బండితోబాటు వత్తిగిలి, – యిది మనకు మామూలే అన్నంత యాదాలాభంతో, – లేచి నిలుచున్నాయ్ –

తోలుకు వెళుతున్న ఆసామి – కూలబడి పోయినాడు – మనిషి సాయం లేనందుకు కొరకొరలాడాడు: ఎందుకు అంత ఒడ్డూ పొడువూ ఉండి – చేయి అందిచ్చేందుకు లేక – అనుకుంటూ, – ఓపిక ఉన్నంతవరకూ, – ఎడ్లను బాదాడు: అవి, దెబ్బలు పడుతూ, – మారాంచేసే కుర్రకుంకను తాతగారు చూసినట్టు, – చూసి, వెన్ను అప్పగించి ఊరుకున్నాయ్ –

ఆసామికి చేతులు తప్పబడ్డాయ్ – బస్తామీద చేయి వేసి ఊపి చూశాడు: అది పైపైన గునిసి – , మొండికేసుకు ఊరుకుంది – మళ్ళీ చెన్నాకోల అందుకుని,

– ఆ జతమీదికి దూకుదామని లేచాడు – అవి కోడెలల్లే గంతులు వేస్తూ దూరందూరంగా కాచి, కవ్విస్తూన్నాయ్ –

వీడి అడుగు, – ఆసామి దగ్గిర పడింది – వీడిని చూడగానే, వాడికి ప్రాణం లేచివచ్చింది –

"ఇదిగో అన్నా – దేవుడల్లే వచ్చావ్!–" అంటూ, ఒక్క తలవిసురులో, తన అవస్థ, తనకు వీడు చేయవలసిన సాయం, యావత్తూ వివరించాడు –

వీడు, – వాడిని చూడగానే, వినగానే మండిపడ్డాడు –

"నేను దేవుణ్ణికాను – దయ్యాన్ని?"

వాడు, తెల్లబోతూ – "అదేమిటి అన్నా?" అని గొణుక్కున్నాడు –

"– దేవుడు నీకెందుకు అక్కరకు వస్తాడు? వరమిచ్చి పోతాడనుకో, – ఒరిగేదేముంది? –

మనం పట్టుకుంటే – మళ్ళీ వదలడమే – ?"

– వింటున్న కొద్దీ ఆసామికళ్ళు బైర్లు కమ్మినాయ్ – ఎన్నో ఊహలున్న ఓ పొల్లుకేకవేసి, – దోవా తెన్నూ కానకుండా, – అడ్డంపడి, – ఎటో దూసుకున్నాడు.

వీడు, ఆ దోవ చెప్పినట్లు నడుస్తున్నాడు – మేసె ఎడ్లజత, – "శహబాస్"– గా తల ఊపింది.

"మనం ఎంత చేసినా, – వీళ్లు యింతే –" వీడు చెప్పిన ఊసు వాటికి అర్థమై, – అవి నవ్వినాయ్ –

దోవ, ముక్కుకు సూటిగా, ఏటిఒడ్డున మర్రిక్రింద మాయమైంది –

మర్రిమీద బ్రహ్మరాక్షసి ఉంది గనుక – అందరూ, – ఆ నీడన్నా మీదపడకుండా వైదొలగిపోతారు –

చెట్టు నీడను, దుబ్బు కట్టి ఉంది, పచ్చ. ఏ నాటినుంచో యెండి రాలిన అకులు చీకిరి బాకిరిగా, చెల్లాచెదురుగా – మేటిగా పడివున్నాయి – దానిమీద, ఓ బడుగు, – సొమ్మసిల్లినట్టు, – అడ్డదిడ్డంగా పడివుంది –

"మవ్వనే–అవ్వా!–" ఆకూ ఆకూ ఆడినట్లు అడిగాడు –

"ఔ! నేనే కొడుకా!" మండా – మండా రాపాడినట్టు పలికింది – పెళుక్కున లేచి కూచుంది –

"బువ్వ తిన్నట్టున్నావే!" నవ్వాడు –

"నేను, పెట్టేదాన్నేకాని, తినేదాన్నికాను! – పేదరాసి పెద్దమ్మను –" బొమిక – బొమికా కోపంగా ఖంగ్ మంటూంది – వీడు మాటకు చేయి అడ్డంపెట్టి సముదాయించాడు – "ఔనులే!"–గా గొంతు తడుముకుంటూ –

పెద్దమ్మ – తనలో తాను మరింత కస్సుమన్నది –

"ఔనేమిటి? – కాదంటేమాత్రం – నేను నేనే! – కొమ్ములు తిరిగిన జేజెలందరూ, – రాజు వేషాల్లో ముస్తాబయి – వేటకని అదో వంకబెట్టి – సందెపడగానే నా పంచ చేరేవారు – కాదా? –

"ఒరేయ్ అబ్బీ! ఏ రాజు కూతురినైనా – కదలేయ్ – ఎవరి చలువో కనుక్కో"

వీడు యింకా నవ్వాడు –

"అందరూ, – ఆలయంలో కునికితే – నిన్ను నమ్ముకు వచ్చినందుకు – వన్నొక్కడినే ఉసూరుమనిపించావ్ కదా!–"

"ఏమిటీ?" – మసకతో పరకాయించింది – వెయ్యేళ్ళ నాటి చూపు చూసింది.
"నువ్వా?" వీడు గుసిసినట్టు నవ్వాడు –
చితుకులు తునిగినట్టు – ఆ రెండు చేతులూ – వీడి కంఠానికి అడకత్తెర వేసినాయ్ –
"పుట్టని బిడ్డలకు – పేరేం పెట్టుకుందాం – మగడా –"
"అందరూ అవ్వా అంటూంటే – నన్ను ఆడదానల్లే ఎందుకు చూశావ్! –"
"జానవమని ఎందుకు కవ్వించావ్ –"
"నీ పడుచుదనంకేసి పాపమని జాలిపడ్డానే!"
"అర్ధరాత్రిదాకా ఉంటేగ, – ఆ రవంతనవ్వ్వానవ్వనో!–"
తీగె అల్లుకున్నట్టు అల్లుకుంది – ఆకూ అలం, నజ్జునజ్జవుతూ మెటికలు విరిచింది – వీడు, మర్రాకుమీది పాపడల్లే – అవ్వ రొమ్మున ఉంగా అన్నట్టు ఉన్నాడు –
దోవతప్పిన పాలికాపు – తనకు ఊపిరి సలుపనట్టు – గుంజి విడదీశాడు – వీడిని బ్రతికించానని, అదిరే కేక వేశాడు –
అకడ, గుయ్యారంలో, మనసూ మనసూ కలుపుకుంటూన్న మనిషీ – మనిషీ తప్పూ ఒలకబోసుకుంటూ వచ్చి కమ్ముకున్నారు –
"నేను రాకపోతే – పిచ్చిది పీల్చేసి ఉండును!" అన్నాడు ధైర్యంగా, జబ్బ పుష్టిగా, వీడిని చూపిస్తూ –
వీడి – వాలకం, వాళ్ళ కళ్ళకు నిజంగా బ్రతికి బయటపడ్డవాడికిమల్లే ఉంది –
అవ్వ – మూటల్లే పడిఉంది.
"ఊపిరి లేదేమో?" – అంది, – మనిషీ మనిషిలో ఆడవంపు –
వీడు, ఆ కళ్ళల్లోకి దూకినట్టు చూశాడు – అప్పటికి నవ్వాడు –
పాలికాపు, వీడినీ పిచ్చివాడన్నాడు –
పాలుపొంగించిన కొత్తకోడలు, కడవ చంకనెత్తుకు పోతూపోతూ అదరికి వచ్చి –
కాదు – పిచ్చివాడు కాదని ఖండితంగా వాదించింది –
"నీకెలా తెలుసేం?–" అని నిలవేసింది – అవతల ఆడచూపు–
చూపుకే అర్థమయ్యేట్టు చూసింది – కోడలు – ఆ మనసు రెపరెపగా ఊగింది.
పక్కనున్న మనిషి – "ఎవడోబిచ్చగాడు!" – అన్నాడు, అర్థంలేనిమాటగా –
వీడు – వినిపించుకోకుండా – పడిఉన్న ఎముకలపోగు మీద – ఆకూ అలం పోగుచేసి, కప్పేస్తున్నాడు –
"పోయింది–పాపం!" పాలికాపు అంటూండగానే, – పైనుంచి, పచ్చని కొమ్మవిరిగి, – మేటిమీదపడ్డది – అందరూ గచ్చకాయలల్లే దూసుకున్నారు –
వీడు, కొమ్మనానుకొని, నిద్రల్లే మేలుకుకూర్చున్నాడు – పట్టుకదలగానే, – పడగెత్తిన త్రాచులు, – అంతటా పారాడుతున్నాయి – వీడు అలాగే ఉన్నాడు–
పల్లె–పల్లే అక్కడకు వచ్చిపడ్డది – ఆ బుసలు చూసి, – ఒక్క పిట్టలేకుండా పోయింది –
అందరూ పోయిన త్రోవనే – మరి వెనకాల, వీడు పోతున్నాడు – ఆగకుండా!

# కలికితురాయి

భోగబిడౌజుడైన శ్రీవాసిరెడ్డి వెంకటాద్రి నాయనివారు, – అమరావతిని, నందన తుల్యంగాచేసి, ప్రజలందరినీ కన్నబిడ్డలతోబాటు పాలించుకుంటూ తమ ఏలుబడి క్రిందికి వచ్చిన పరగణా సమస్తమున్నూ పౌరుష–దైవికములైన యీతిబాధలు లేకుండాచేసి, చల్లగా కాపాడుతూన్నా – శ్రీవారి హయాములో –

ముక్త్యాల పరిగణాలో పుట్టి పెరిగి, – ప్రభువువారి పశుగణాన్ని కనిపెట్టుకుని ఉండేవాడు, సింగన్న: నడికట్టులో రెల్లు మలచిన పిల్లనగ్రోవీ, మూపున రాగోల, – ఎప్పుడూ, ఏదో క్రొత్తపదం మోగించుకుంటూ, పరగణాలో బంజరు అంతా అలమందను మేపుకుంటూ తిరుగుతుండేవాడు, సింగన్న: అక్కరవస్తే సివంగి అంత జముకు: అంతకన్న వడి అయిన దుముకు: ఏదీ కవ్వించకపోతే – లేగదూడ వెక్కిరించే అమాయికం!

మనిషిభాషలో, మాటలు ముక్తసరిగా పదో పన్నెండో అలవాటు సింగన్నకు: అంతకన్న ఎక్కువ వాడిక లేదు... మనుష్యులు మసలేచోట – రద్దీ రవ్వతో బ్రతికే నగరాన, పండుగనాడైనా కాలుపెట్టేవాడు కాదు:

మందలో ప్రతిగోవుతోనూ, ప్రతిలేగతోనూ, కంటితోనే పలుకాడేవాడు: కోరిన నడక నడిపించేవాడు:

ఓనాడు, ఏదో, మారుమూల కోవలో, మంద మేపుకుంటూ, – జువ్వినీడను కూర్చున్నాడు: ఉన్నట్లుండి అల్లంత దూరాన డెక్కల చప్పుడైంది: సవ్వడి, క్రమంగా, ఈవంకకే చేరువైంది: జువ్వినీడ విడి, – మర్రిమొగకు ఎగసాడు: అద్దరి కొండగడచి, ఏదో దండు, మూకగట్టుకుని దుముకుతూంది. ఎవరో అనుకున్నాడు: ఎటు దుమికినా మనకేంలే! అనుకున్నాడు: అక్కడే కూర్చుని, పిల్లనగ్రోవి అందుకున్నాడు:

దండు, మర్రిజాడకు వచ్చింది: అన్నీ దుమ్ము కొట్టుకున్న మొగాలు: నడి ఎండలో మిటమిటలాడే నాపబండల వంటి మొగాలు: ఏ రెప్పలోనూ మెత్తని వాలిక లేదు. – ఏ నుదురునా నునుపు లేదు:

ఎన్నడూ, పుట్టి బుద్ధెరిగిన తరువాత, అంత కరుకైన కవళిక ఏ మొగానా చూడలేదు, సింగన్న: అదేం మనుషులో అనుకుని అట్టే ఆకళించి చూస్తున్నాడు:

ఈ చూపుకు చెట్టు మొగదల ఉన్న చూపులు, చురచురా నాటినాయి: క్రింద మనుషులు చెట్టుకు ఎగనెక్కి వస్తున్నారు: క్రింద విచ్చుకత్తులు ఝామ్మని మెరుస్తూ కొరకొరలాడుతున్నాయి: సింగన్న, నిడిబారుకొమ్మను అంటుకుని చీమల్లె ప్రాకిపోయి, సివ్వంగికిమల్లె దుమికాడు: ఒక్క అరుపు అరిచాడు: అరుపులోనే రాగోల అందుకుని, మళ్లీ కుప్పించాడు:

ఆ దూాకు మందంతా అందుకుంది: ఏకబారున వరదూసిన బాకులల్లె కొమ్ములు ముందుకువంచి, – సింగన్నకు వెన్నుకాపుగా నిలిచింది:

దండు అలాగే నిలబడిపోయింది:

"మాతో కయ్యమెందుకూ – మీదోవ పుచ్చుకొండి – పోయే మనుషులు. నురుగుపాలు త్రావి మరీపొండయ్యా!" అన్నాడు సింగన్న: "చేపండే తల్లుల్లారా! – తలకుమాసిన దరిద్రులొచ్చారు:" అని, పాలతల్లులలో పలికాడు:

"మేం, దరిద్రులమా?" అన్నదోకత్తి:

"కాకపోతే–మా సీమలో కాలుపెడతారా? – పుట్టిన గడ్డమీద గూడుంటే, – కట్టుకున్న ఆలుంటే – ముప్పొద్దులా బువ్వుంటే – యిలా దుమ్ముకూ ధూళికీ కొట్టుకొస్తారా? –" హరికథ చెప్పినట్లు అడుగు ముందుకేస్తూ అంటున్నాడు, సింగన్న:–

అన్ని కత్తులూ, పిడికిలి బిగిసి గాలిలో పదునాడినాయ్:–

"ముక్కలుగా చెండుతామ్!" అని ఒక్కవాటంలో రాపాడినాయి:

– "ఆకలికి అక్కరవస్తాయా? – మీ మొగంలే – వెర్రి వేశాలూ చాలించండి" అన్నట్టు ముంజయ్య రేపాడు: అటు తిరిగాడు:

దండు నిలువునిలువుగా మండిపోయింది: కన్నూ మిన్నూ కానకుండా, ఒక్కుమ్మడిగా ముందుకు ఉరికింది: సింగన్న, వేసే అడుగు ఆపి, నిట్టనిలువుగా మెలిదిరిగి – ఈటల్లె దండు వెన్నుకు దూసుకు పోయినాడు: దండులో అన్ని గుండెల్లోకీ, జమిలి కొమ్ములు దిగిపోయినాయి:

సింగాలకు లేనిసత్తువ గంగిగోవులకు వచ్చింది! ఎండి కాలిన ఆకుల్ని గుచ్చెత్తినట్టు, దండునంతా పొడిచేసి, తల విసురున పక్కకు గిరవాటు చేసినాయి: చెక్కు చెదరకుండా, ప్రవాహంలో దిగి, కొమ్ముల జీర కడుక్కుని, పట్టుమీద విచ్చుకుపోయి, దేవిమానాన అది లేగల్ను ఓ కంట కనిపెడుతూ, మేస్తూన్నది:

సింగన్న మనసు చివుక్కుమన్నది: "నేను లేనుటేతల్లుల్లారా! కొమ్ములకు పండుగ మనసైతే – పారాణి నేను పూయనా? – ఆ గుండెలు డొల్ల, – ఆ రక్తం బురద: నాకోసం శుద్ధిబుద్ధీ చెరుపుకుంటారా!" గోవులన్నింటికీ సింగన్న మనసు తెలిసిందే! – అడక్కుండా దురుసుతనానికి పోయినామే, అని కించపడుతూ బెదురు చూపులు చూసినాయ్: సిగ్గుపడి తలవంచుకున్నాయి; ఎన్నడూలేనిది, – చిరాకుపడి, – బిడ్డలమీది కసురుకున్నాయ్.

– ఎక్కడో పుల్లరిబయలులో ఏ మూలనో, గుట్టు చప్పుడుకాకుండా జరిగిన సాహసం, చరచరా ప్రభువు సన్నిధికి ప్రాకిపోయింది: సింగన్న సముఖానికి రావలెనని, సెలవైంది:

సింగన్న, మందను విడిచి రాలేనని విన్నవించుకున్నాడు: ప్రభువు మాటకు, ఆజ్ఞకు తిరుగులేదని వార్త తెచ్చిన వేగు, తెలియచెప్పాడు: తానూ అంతే అన్నాడు సింగన్న: వచ్చిన వేగు, బ్రతిమాలి చేతగాక వెళ్ళిపోయినాడు: సముఖంలో యీ మాట చెప్పడానికి జంకాడు:

ఓరకంట చూపే మనసు అర్థంచేసుకునే వెంకటాద్రి ప్రభువు, తాను స్వయంగా సిబ్బందితో బయలుదేరాడు, సింగన్నకు దర్శనం యివ్వడానికి – పరగణాలో ఏ మూలనో ఉన్న వెర్రిగొల్లకోసం, ప్రభువు తరలివెళుతున్నాడంటే ప్రజలకు విడ్డూరంగా ఉంది: రాణీవాసం కూడా, వేడుకకు తరలింది:

అలమందంతా, ప్రభువును పసికట్టి, బరాబరులు చేసింది కాని – సింగన్న ప్రభువుతో పల్లెత్తి పలుకలేదు: చూసి చూడగానే, ఆ కన్నుల పండువకు చేతులు జోడించాడు – అంతే:–

"ఏం కావాలో! కోరుకో" అన్నాడు ప్రభువు:

"నాకేం కావాలి!" అని తనలోతాను గొణుక్కున్నాడు, సింగన్న:

"నేరనివాడు ప్రభూ!" అని ప్రెగ్గడ మనవిచేశాడు:

"నేరవివాడంటూ మా పాలనలో ఒక్కడన్నా ఉండటం మనకెంత దొడ్డరికమండీ!" అని ప్రభువు ప్రెగ్గడను మందలించినట్టు చనువుగానే పలికి, – సింగన్నను చేరదీసుకున్నారు: "నాయనా, మమ్మల్నిమించిన మొనగాడివయ్యా!" అని పెదవి విప్పారు:

అతని మాలిమిలో పెరిగిన మందనంతా సింగన్నపరం చేసి, – మంద మేసుకొచ్చినంతపట్టూ అతడికే ధారాదత్తమని సెలవిచ్చి, ప్రభువు, ఎంతో వేడుకగా, తిరిగి నగరికి వేంచేశారు:

సింగన్న ఒక్కడే మిగిలాడు: ప్రభువు తనను స్వయంగా చూడవచ్చాడని ఉబలాటమూ లేదు: కనుచూపు మేరంతటికీ ఖామందునైనానుగదా అని, – సంబరమూ లేదు: తన చూపే తనది: తన పాటే తనది:

కాని, ఆ ఒంటిపాటు అట్టేకాలం నిలువలేదు: రాణీవాసంలో, – పరిజనంలో వయసు అందుకున్న చిన్నది – మల్లిక – సింగన్న మొగసిరిమీద కన్ను వేసింది: ముగుదల అందుకుని, అపట్టునే నిలిచిపోయింది:

దూరదూరంగా నిలిచింది, వోరగా చేరువైంది: నీడల్లే అయింది:

వయసుకు వనరైనట్టు పలికింది: సింగన్న ధోరణి అటుమరలింది కాదు:

మనసు విప్పింది: మౌనంగా చెప్పింది: బలవంతాన తన పస అలవాటు చేసింది: కాని, అంత సంబరంలోనూ సింగన్న చూపు అటు మళ్ళించుకోలేకపోయింది:

వన్నెవన్నెల పూలుతురుముకునేది: ఒక్కచోట నిలువకుండా చెంగేది: నీరెండలో మెరుగు తెచ్చుకుంటో ఒళ్ళంతా ఒక్కకులుకులో విరుచుకునేది: ఆ విరుపులోనే, ఒడుపుగా చేతులు అందిచ్చేది – సింగన్న అల్లంత దూరాన ఎక్కడో, ఒక్కటే ధ్యాసలో ఉండేవాడు:

మల్లిక ఎంతో నూరిపోసింది: 'ఈ సీమకంతా నీవే రాజువు: కోట కట్టుకో; కులంవారిని కూడదీసుకుని ఏలుకో – గద్దెమీద, నా సరసను కాలుమీద కాలువేసుకుకూర్చో! ఇన్నాళ్ళూ పాలమీద బ్రతికావు: ముప్పొద్దులూ బంగారం తినవచ్చు: ఠీవిగా సుఖపడచ్చు!–'

సింగన్న, అదేమీ అర్థంకానట్టు, వినిపించుకోనట్టు ఉండేవాడు: "తండ్రికి బిడ్డమీద దయఉంటే, – తానుండగానే పంచియిస్తాడా?–" ఇలా దిగులుపడేవాడు: "ప్రభువు

ఏలే పరగణాలో ఇంతకాలం బ్రతికారు; మీకు, సింగన్నదొరా, తల్లుల్లారా!" – తలఎత్తి గోవులవంక చూడలేక బిడియపడేవాడు: ఇలాగే ఎన్ని ప్రొద్దులో నడిచిపోయినాయి: ప్రభువుకు, ఈ వైనమేమీ తెలియకపోయె సుమీ!

దివాణంలో చల్లగా పెరిగిన మల్లిక, – ఈ బ్రతుకు బ్రతకలేకపోయింది: మనసు రాయి చేసుకుంది: విడిచి వెళ్ళిపోదామనుకుంది: తనపోరు లేకపోతే, – అతడికన్నా మనసు మళ్ళుతుందేమో, తానైనా సుఖంగా ఉంటాడు కదా అనుకుంది:

అడుగు ముందుకు వేసింది – పడలేదు:

అక్కడే కూచునిపోయింది:

ఎండ మిడిమిడిగా – కాల్చుకుతిన్నది. పుట్టి పెరిగినదంతా కలగానూ, – యీ బ్రతుకే నిబద్ధిగానూ అనిపించింది:– కూచునిలేచే సత్తువ లేకపోయింది:

ఎప్పుడూ పచ్చతోరణంతో కలకల్లాడే కోట – నిత్య కల్యాణంలా ఉండే దివాణం, ఎందుకో తనమీద కత్తిదూసినట్టు జడుసుకుంది – అంత దిగులులోను, – అనుభవించిన సుఖం తలచుకుని, – అల్లంతలో, – నవ్వుకుంది – నవ్వులోనే ఒరిగిపోయింది:

అంతకు అంతలోనే, – ఆవులన్నీ, – బసవన్నలై రంకెవేసినవి: మందకొడిగా ఉన్న సింగన్నను కమ్మినట్టు తరిమివేసినవి –

నేల అంటిముట్టకుండా తేలిపోయే కాళ్ళకు, పోగా పోగా, – ఏకడనో, – మల్లెతీగె పెనవేసుకుని నిలిపేసింది: అంతలో మారాకువేసింది, – మొగ్గతొడిగింది: అల్లంత విచ్చింది: చిరునవ్వు మెరిసినంత పట్టువుంది – తీవె, – పూవూ పచ్చపట్టులో, – కానరాకుండా కలిసిపోయింది:

ఆ కాళ్ళు ఇక అక్కడ నిలువలేదు: ఎటోపోయినవి: ఎక్కడో చొల్లియిపోయినవి: సింగన్న అదే తొలిసారి గొంతు విప్పి, – "మల్లికా!" అని అంబా – అన్నాడు: ఆ పిలుపుకు ఆకాశం వెన్నంటుకున్న వెలుగు, పేరిన ముద్దగా రాలిపడి, – సింగన్నను కరువున పోసింది: ఆ బొమ్మ అలాగే, – వెలుగు మళ్లే వేళకు – కుదించుకు పోయింది –

ఆవులమంద, దివాణంముందు చేరి, అంగలార్చింది: వాపోయింది: ప్రభువును తరలించుకవచ్చి, – మల్లిక మాయమైన చోటు, – సింగన్న, క్రుంగిపోయినపట్టూ, రాపాడి విశదపరచింది· ఆ కధ అంతా కళ్ళకు కట్టినట్టుకాగా, – అంతటి ధీరుడూ పసిపాపడైపోయినాడు: మన్నించమని ఆలమందకు కేలుమోడ్చాడు:

మల్లిక నవ్వినచోట, లేమల్లె: సింగన్న మనసు తెలిసిన చోటు – సింగారం:–అవి రెండూ, ఆ పరగణాలో కలకాలం నిలిచే గ్రామాలు...

★ ★ ★

# ఆసావేరి

వెంకటరత్నం, బస్తీబ్రతుకు ఇహ యీ జన్మకు విడిచిపెట్టాననే ఖాయంచేసుకున్న తరువాత, – ఏనాడో పుట్టిపెరిగిన మేనమామలగారి ఊరు చేరుకున్నాడు: ముక్కుపచ్చలు ఆరకముందు ఆ గ్రామం వదిలిపెట్టి, – చదువుకోసం బస్తీ చేరుకోవడమేమిటి! ఇహ అంతే, – మళ్ళీ నాటికి నేడు, – పదిహేనేళ్లకు, – మళ్ళీ ఆ ఊరు తొక్కడం:

వేసంకాలం సెలవలు వచ్చినా యింటికి వెళ్లడమనే మాటే లేదు: మేనమామకు ఏటికి ఏడాదీ బస్తీలో, – ఏదో కోర్టులో ఏ తగాయిదో ఉంటూనే ఉండేది. చుట్టు పక్కల షుమారు ఏభై అరవై గ్రామాల తాలూకు దావా తగాయిదాలన్నీ ఈయన చేతిమీదుగానే నడిచేవి. పాపం, ఆ బ్రాహ్మడికి, – బ్రతికినన్నాళ్లూ క్షణం తీరికంటూ లేదు. పోనీ ఆద్యంతాలకు యింత లప్ప యిచ్చాడా అంటే – అదీ లేదు; ఆ కొంప ఒకటీ – మరో రవంత చెక్కా –

ఆ యిల్లు ఒక్కటే – ఒంటికట్టుగా మిగిలింది: అదీ ఇన్నాళ్లనుంచీ దీపంపెట్టే దిక్కు అంటూ లేక, అలాగే అఘోరిస్తూంది, ఉన్నంత మేర ఉంది – కూలినంత మేర కూలింది – ఏదో ఊళ్లోవాళ్ల పుణ్యమా అంటూ – అసలు నామరూపాలు లేకుండాపోక – అంతంతమాత్రంగా ఉంది.

అమ్మమ్మ పుణ్యమా అంటూ, చెప్పించిన రెండు ముక్కలూ అబ్బినవి. కాని, చెప్పిన బుద్ధులు ఒక్కటైనా చెవికి ఎక్కలేదు. ఆవిడది ఎప్పుడూ ఒక్కటే పోరు – "చెడిపోతావురా, నాయనా! పెళ్ళిచేసుకొని ఒక్క యిల్లువాడవి అవరా!–"

పెళ్లిమాత్రం చేసుకోనంటాడు. నీవు ఏది చెప్పినా చేస్తానుకాని, అదిమాత్రం ఎత్తవద్దంటాడు. పోనీ అని, – అమ్మమ్మ ఊరుకుంటుందా – ఆవిడ ఆ వసా మానలేదు – వీడు అదే జవాబూ మానలేదు.

చదువుకున్న ముక్కలు అక్కరకు వచ్చినవి: తోటి వారందరికన్నా ప్రయోజకుడనిపించుకుంటూన్నాడు. ఊళ్లో నలుగురిచేతా, ఔననిపించుకుంటూన్నాడు – వాహినీగానే బ్రతుకుతున్నాడు –

"ఎంత సంపాయించిమాత్రం ఏంలాభం? బ్యాంకీలో డబ్బు మూలుగుతుంటే మాత్రం – అదంతా ఏం జేసుకోను? – ఏ పాణెమూ లేకపోయిన తరువాత – ఇదంతా ఎవరు తినను? నేను హరీ అన్న తరువాత, ఆకలి ఎరిగి, వేళకు పెట్టేదు అన్నం పెట్టేదిక్కైనా ఉండదాయె – వీడు ఏం కాను? వెయ్యేళ్ళు పండాల్సిన పంట వీడిబ్రతుకు ఎలా వెళ్లమారును?"

ఇదే ఎంతసేపటికీ అమ్మమ్మ గొండాడింపు! వినడం పరిపాటైపోయి – క్రమంగా, వినిపించుకోకుండా చక్కా పోయేవాడు –

పెళ్ళి మాటంటే గిట్టకపోవడానికి – అవతల సాగిస్తూన్నది ఏమీ లేదు:

– తను పుట్టినతరువాత, ఇంకా నెలైనా వెళ్లకముందే, అమ్మంటూ లేకుండా పోయింది: అమ్మ ఎలా ఉండేదో తెలియదు: గ్రాయకం వస్తూన్నప్పటినుంచీ – ఇదొక్కటే గుర్తు – ఎప్పుడుచూసినా, నాన్న తన్ను ఒళ్లో కూర్చోపెట్టుకునో, – చంకను వేసుకునో, భుజంమీద బజ్జోపెట్టుకుని చిచ్చికొడుతూనో – ఎప్పుడూ ఏడుస్తూండేవాడు – వెక్కి వెక్కి ఏడుస్తూండేవాడు – తన్ను గుండెలకు గట్టిగా అదుముకుని, – భయం వేసేట్టు బావురుమనేవాడు. గుండెలు చీలిపోతున్నట్టు రంపకోతగా మూలిగేవాడు –

అదే జ్ఞాపకం: నాన్నపడ్డబాధంతా జ్ఞాపకం –

అమ్మమ్మ కన్ను బుస్సూమన్నప్పుడల్లా అమ్మ జ్ఞాపకం వచ్చేది – నాన్న మూలుగు వినపడేది –

ఎందరితీరో, పేరుపేరువరుసా చెప్పి అమ్మమ్మ విసుక్కున్నప్పుడల్లా – 'ఇదీ సంగతి!' అని చెప్పిచెపుదా మనిపించేది – చెపితే, ఆ సత్యకాలం మనిషికి ఏం అర్థం అవుతుంది? – కూతురుని తలచుకుని కుమిలిపోతుంది –

అమ్మమ్మకు, చెట్టంత కూతురు పోయిందన్న విచారంకన్న – అలాటి రుషితో వెయ్యేళ్ళూ వర్ధిల్లే అదృష్టం అమ్మకు లేకపోయిందనీ, ఎప్పుడా, ఎప్పుడా అని బ్రతికిన ఆ నాలుగునాళ్ళూ, కంటికి ఏకధారగా తపస్సుచేసి, ఆ తపస్సు ఫలించి కన్ను మూశాడనీ, నాన్ననే, నాన్నపడ్డ బాధనే తలచుకుని ఎప్పుడూ ఇదయేది: నాన్నంటే, అమ్మమ్మకు, ఆ ఉన్న ఒక్క కొడుకుమీదాకన్నగూడా ఎక్కువ లక్ష్యం.

పెళ్ళిమాట ఎత్తితే, అందుకూ అంతభయం! – అచ్చటా – ముచ్చటగా, చక్కగా చెట్టాపట్టాలు వేసుకుని చిలకాగోరింకలల్లే పోయే, ఏ దంపతుల్ని చూసినా, కర్మం తప్పివస్తే – వాడూ అలాగే కుమిలిపోవాల్సిందేకదా అనిపించేది – మనస్సు ఎప్పుడూ శుభం పలికేది కాదు –

## 2

వెంకటరత్నానికి ఒక్కడే మనసు కలిసిన స్నేహితుడు. ఆ ఒక్కడికి పెళ్ళీ పేరంటాలు అయినాయి. కాని, ఒక్కనాడూ పట్టుమని సుఖపడ్డ పాపానపోలేదు. ఆ చిన్నది, అసలే అబ్బనాకారం పిల్లట – ఆ ఏడు ఆ ఏడు వచ్చినకొద్దీ ఏమాత్రమూ రెక్కోకపోంగా, మరీ మూలికచెడ్డది: అయినా, ఆ అడ్డంకి తీరి, వీడి యింటికి – అంటే రంగశాయి యింటికి వచ్చిన వేళావిశేషంకొద్దీ రవంత కోలుకుంది: అది, చివరకు మూణ్ణాళ్ళ ముచ్చటే అయినా, అంతలోనే, పెనిమిటికి అరచేత వైకుంఠం చూపించింది. చివరకు, అంత బాధపడకుండా, చూసేవారిని బాధపెట్టకుండా కాలం తీరిపోయింది.

– రంగశాయికి ఇంతటి కష్టం వచ్చిందని కబురు తెలియగానే, వెంకటరత్నం, ఓ వారంరోజులబాటు మూసిన కన్ను తెరవలేదు: ఇంకోవారం రోజులదాకా వీధిమొగం చూడలేదు:

ఇంకా ఒంటికి సత్తువ సరిగ్గా చేరుకోకపోయినా, నడిచేందుకు ఓపిక లేకపోయినా, అలాగే యీడుకుంటూ బయలుదేరాడు.

"ఎక్కడికిరా నాయనా, ఇప్పుడూ?" అంది అమ్మమ్మ: ఫలానిచోటికని చెప్పాడు:

"అయితే యిప్పుడు వద్దులే!" అంది:

"ఏం?" అన్నాడు:

"నువ్వు – వెళ్ళినవాడివి, ఏదో అడ్డదిడ్డంగా వాగుతావు! – బాగుండదు" అని బ్రతిమాలినట్టు చెప్పింది –

"నాకేమంత కళ్ళుమూసుకుపోయినా యనుకున్నావా? వాడలా పుట్టెడు దుఃఖంతో ఉంటే–"

"అదేరా నాయనా, నేను వద్దన్నది! వాడు మళ్ళీ పెళ్ళికొడు కవుతూంటే–!"

"ఆఁ!" అని వెంకటరత్నం దద్దరిల్లిపోయినాడు –

"కాకేంరా! – పెళ్ళాంపోతే, పెళ్ళికొడుకు? – ఊపూటే శుభమస్తు అనుకుంటారుట! – నెల తిరగకముందే, ఆ మూడు ముళ్ళూ పడిపోవద్దూ మరి?–" వింటూనే నిలుచున్నవాడు అలా చదికిలపడిపోయినాడు – అమ్మమ్మ తన ధోరణిలో పాత ఆలాపన ఎత్తుకుంది:

"అది, ఒక్క ఆ రుషికి చెల్లిందిరా నాయనా! – నా తల్లి, నా కడుపులో చిచ్చుబెట్టిపోయిన తరువాత, ఆ నాయన ఒక్కనాడు పట్టుమని ఇంత అన్నం తిన్నాడా, ఏనాడైనా కంటినిండా, ఆదమరచి నిద్రపోయినాడా!" – అలా, ఏడ్చి ఏడ్చి–"

వెంకటరత్నం ఒరదూసిన కత్తల్లే బయలుదేరాడు.

రంగశాయిని, నమిలి మింగేద్దా మన్నంత కోపంగా ఉంది: వీడూ ఓ మనిషేనా! – వీడిదీ ఓ బ్రతుకేనా? –

– గుమ్మం ఎక్కుతూనే, అనవలసినవి నాలుగూ అనేశాడు, మొగానే! పట్టుకు దులిపేశాడు.

రంగశాయి, దేనికీ సమాధానం చెప్పకుండా, వింటూ తలవంచుకు కూర్చున్నాడు. కొంతసేపటికి తలఎత్తి, మొండి చూపు చూశాడు: అక్కడున్న పెద్దమనుష్యులలో ఒకరు కల్పించుకున్నారు:

– "చాలేవయ్యా అనవసర ప్రసంగం – మహా కొమ్ములు మొలిచినట్లు మాట్లాడుతున్నావ్ – పిలవనిపేరంటంగా వచ్చి, ఏమిటీ ఆగడం? – ఇది కుటుంబ వ్యవహారం! – "

అలా వాగుతున్న దౌడ వాచేట్టు కొట్టడం వెంకటరత్నం చేతులోపనే! – కాని, అసహ్యంవేసి, కొంచెం అంచాడించాడు: ఇంతలో, ఈతణ్ణి ఎరుగున్న మరోవృద్ధు అనునయంగా ఇలా మొదలుపెట్టాడు –

"అలాక్కాదు నాయనా!

"ఇది, ప్రపంచధర్మం – ఎంత దుఃఖం వచ్చినా, శరీరఇంద్రియ వ్యాపారము లున్నవి చూశావూ, అవి యథారీతిని సాగుతుండవలసిందే! ఇది కేవలం భగవన్నిర్దిష్టము బాబూ –"

వెంకటరత్నం ఒళ్ళు మరచిపోవడానికి ఇంతకుమించిన ప్రకోపు అక్కరలేదు

ఆ వృద్ధు ఎక్కడకు తేలుస్తాడో తనకు తెలుసును – 'మనిషిపోతే పోయిందే అనుకో – పుట్టెడు దుఃఖమే అనుకో, అందుకని, నిత్య – నైమిత్తిక కర్మకాండ ఏది మానాడు? – పోయినవాళ్ళకోసం అఘోరిస్తూకూర్చుంటే ఇహ ఆ బ్రతుకు ఏంకాను? – ఉసూరుమంటూ రోజులు ఎలా వెళ్ళమారను?' – ఇదే ధోరణి కాదూ? –

ఈ ముక్కలన్నింటికీ తలదన్నే సబబైన సమాధానాలు వెంకటరత్నానికి తెలియకనా?

– "ఏంబాబూ, సరేగానీ, ఇలా కాకుండా, మరోలాగు జరిగిందనుకోండి! – పిల్లదే ఉండి, చిన్నవాడే కన్నుమూశా డనుకోండి! – అప్పుడూ ఇదేనా తతంగము? – ఆశ్రయం ఏమీ లేనిదే, పండితుడికీ, వనితకూ, లతకూ బ్రతుకుతెరువు లేదని, పెద్దలు సెలవిచ్చిన మాటే కద! – అందుకని, ఏడుపులూ పెడబొబ్బలూ మానిపించి, మళ్లీ పెళ్ళిపందిరి వేయించేవారేనా?–"

ఇలా ఢీ అంటే, అవతల పెద్దమనిషి, సవ్యంగా సమాధానం చెప్పడం మానేసి, మొగం కండలు చించుకుని, గంపంత యాగీచేసి, అందరూ కలిసి తన్ని తరిమేసినంత రభస చేస్తారని రూఢిగా తెలుసు. ఆయనకు జవాబు చెప్పడం అనవసరం: – ఆ మొగంవంక చూస్తేనే, మీద తేళ్ళూ జెర్రులూ ప్రాకినంత కంపరం ఎత్తుకొచ్చింది. ఆయన నయగారాలు వింటూంటే పరమ అసహ్యం వేసింది:

ఉవ్వెత్తు తామసం దిగమ్రింగుకుంటూ, కొట్టినట్టు లేచి నిలుచున్నాడు; మండిపడుతూ వచ్చేస్తున్నాడు:

రంగశాయి, సిగ్గూబిడియమూ లేని మొగం పెట్టుకుని, లేచివచ్చి –

"సాయంకాలము కలుసుకుంటానులేరా!–" అన్నాడు.

"వద్దు – ఈ జన్మకు నీమొగం చూపించవద్దు..." మెడనరాలు బిగుసుకుపోయినట్టు రిక్కించి, తనలో తాను గొణుక్కున్నాడు – వచ్చేశాడు –

– జ్వరం వచ్చినా బాగుండిపోను. ఒళ్ళు తెలియకుండా మూలుగుతూ పడిఉండేవాడు – కాక తగలకపోగా, మెడకు తాడుపోసి, గాడినూతిలో, దింపినట్టుంది. నెత్తిమీద వెయికొండలపెట్టు ఏదో పెద్ద గుయ్యారం పడ్డట్టు ఉంది: నోటికి వచ్చినట్లు తిట్లన్నా పెగిలినా, కొంత ఇదిగా ఉండేది: మాటంటూ పెగలదు: ఎదుర్రొమ్ములో కుతకుత లాడిపోతుంది –

కాని – అలా పట్టూ విడుపూ అంటూ లేకుండా, తిని – కూచుని ఖాయలా తెచ్చుకోవడం కూడా విసుగే:

"దేనికి నే నింత బాధపడటం? –

ఒక్క రంగశాయి మొగానే ప్రొద్దుపొడిచిందా?

లోకంలో నూటికి ముప్పాతిక ఈతీరేగా?

అందరినీ ఉద్ధరించగలుగుతున్నానా?

అవకతవకలు మానిపించగలుగుతున్నానా? –

లోకం ఎట్లాపోతే నాకేం? –

నా దోవ నాదీ! – దానిగతి దానిదీ!"–

– అని మొండితనం, బొత్తిగా ఉడుకు మోతుతనంగా వచ్చేదే కాని, నిభాయించుకోలేకపోయేవాడు: చడసారం ఆ వయసుకే, వెయ్యేళ్ళా నిండిన ఆ చిన్నదాన్ని తలంచుకుంటే, మళ్ళీ మనసు యధాప్రకారం అయేది.

"– బ్రతికినన్నాళ్ళూ, అలా, ముక్కుతూ మూలుగుతూనే, అలాగే ఓపికా, లేని నవ్వూ తెచ్చిపెట్టుకుని, కట్టుకున్నవాణ్ణి సుఖపెట్టాలని ఇదయింది, కాని, తానేంబావుకున్నది?–

అదంతా, వీడు మరచిపోయినట్టేనా? –

కొత్తనీరు వచ్చి, పాతనీరు తుడిచి పెట్టుకుపోయిన తీరేనా? – ఆ చిన్నదే జ్ఞాపకం రాకుండా బ్రతికే రాక్షసుడా?–

కాడనుకుందాం: రంగశాయి మామూలుమనిషే అనుకుందా: లోకాన్నుద్ధరించేం దుకే, పెద్దఘటాల పోరు మాపుకునేందుకే, మళ్ళీ గూట దీపం పెట్టే దిక్కుకోసం పట్టుబలవంతాన మొగ్గాడనుకుందాం!

ఇహ, ఆ సంసారం ఏం లక్షణంగానో ఉంటుంది: వీడు, ఈ పెళ్ళాంమీద చిరాకు వచ్చినప్పుడల్లా, పోయినదాన్ని తలచుకుంటూ, కంటతడి పెట్టుకుంటూ, నీకన్న అదే మంచిది, గుణవంతురాలు అని, అయినవేళా, కానివేళా ఎంచులు పెడుతూంటే, ఇహ, మరి, దీని మనసు ఎలా ఉంటుంది? – వాళ్ళ ఆయనకు రెండో సంబంధం కాని – తనకు మొదటి అఘోరింపేకదా –

– వీధిబడి అరుగుమీద, ఏబ్రాసంటి చంటివాడు, బోడిపలకమీద గీతలు గీస్తున్నట్టు, మనస్సంతా, ఇలాటి దద్దమ్మ– ఆలోచనలు గీరుకుంటున్నాయి – పలక విసిరికొట్టినట్టు–మనసు విసిరివేశాడు – అది, చెక్కు చెదరకుండా కప్పల్లే అంటి పట్టుకుని ఉంది:

ఈ ఆలోచనల్లో ఒక్కటీ తనది కాదు: అవన్నీ అది కాలంనుంచీ, ఎందరో గింజుకుంటూన్నవి – పూర్వజన్మకుమల్లె పట్టుకుని బాధిస్తూన్నవి –

క్రీస్తునాధుడు అందరిపాపాలకూ ఆహుతి అయిపోయిన, పంధొమ్మిదివందలేండ్ల పైచిలుకు, యీనాడు, ఇంతవరకూ చదివి, ఇన్నీ చూసి, ఇలా వాజమ్మల్లే ఆలోచిస్తూపడుకోవడం తనకూ, తను చదువుకున్న అంతంతలావు పుస్తకాలకూ పరమ – నామర్దా!

కాని, ఇప్పుడు ఏమిటి చెయ్యడం? – రంగశాయిని పట్టుకుని, పనసకాయకుమల్లే, పప్పు–పప్పు చేసేస్తే –

"స్తేమటుకు, వీడి ఒక్కడి పీడా విరగడైపోతుంది కాని, లోకం అంతా, డొంకలో పల్లేరుకాయలేగా! –

–గోడకేసి కొడుతున్న బంతల్లే, ఎటు ఆలోచించినా ఎదురుతిరిగి, తనముందరే మళ్ళీ గంతువేస్తూంది: కొట్టినకొద్దీ మిడిసిపడుతూంది –

– ఇదికాదు, ఉపాయం: వాడికిలేనిబాధ తనకెందుకూ? – వాడు పుట్టెడు దుఃఖంలో వున్నాడని తను అంగలార్చడ మెందుకూ? – పురాణాల్లో రుషుల్లే ఏ చెట్టుకొమ్మకో కాళ్ళు తగిలించి, తలకిందులుగా వ్రేల్లాడితేమటుకు, కంటికి కనపడేది అంతేగా! – అదేగా!

ఈ ఒంటిని వాళ్ళకోసం, వీళ్ళకోసం, వృథాగా రొష్టుపెట్టడం ఎందుకూ? – చదువుకునే రోజుల్లో నాలుగు మంచి ముక్కలు చెవినిపడ్డపాపాన దేవోన్ని యావత్తూ మడికట్టించి కూర్చోపెట్టడం సబబేనా? –

## 3

ఉప్పెన వచ్చినప్పుడు –

కెరటం తాటిప్రమాణంగా ఊరిమీదికి విరుచుకుపడ్డప్పుడు – అంత ప్రమాదం కనిపించదు. విసురు తెగిపోయి – మళ్ళిపోతున్నప్పుడే, – ఊరు మొత్తాన్నంతా తుడిచిపెట్టుకుపోతుంది –

తెల్లవారేటప్పటికి, వెంకటరత్నం మనస్సు, సముద్రపు ఒడ్డున వానకురిసి వెలిసినట్టుంది – అంతా ఏకచదును అయిపోయింది. కాని అడుగుపడితే, ఆ ముద్ర అలాగే హత్తుకుపోతుంది –

ఎన్నడూ, వంచినతల ఎత్తనివాడు, నిద్రలేచినప్పటినుంచీ, వెన్నువిరుచుకునే తిరుగుతున్నాడు:

ఏ ఆడపిల్ల చూచినా, గుమ్మటంగా అందంగా కనిపించుతూంది. నడుంవంగిన అవ్వ – కాలుతీసి కాలుపెట్టలేక యీడుకుంటూ పోతున్నా, ఏభైఏళ్ళక్రితం ఎలా నడిచిందో, ఆ నడకే కనబడుతూంది: అందాకా ఎందుకూ, అమ్మమ్మ కూడా, తన కంటికి ఆడదల్లె కనిపిస్తూంది!

లోకం అంతటా ఒక్కటే క్రియాపదం అర్థం అవుతూంది.

తూర్పువాళ్ళ నూనెగానుగ కర్రూకిర్రూగా ఆడుతూంది: కళ్ళకు గంతకట్టుకున్న ఎద్దు లాగుతూంది – పిటపిటలాడుతూ, ముక్కుకు నత్తు అంటిన పడుచు, రవిక లేకుండా, పిట్టు తిరగదోడుతూంది, నూనె ఓడుతూంది –

మోటార్లు బాగుచేసే షెడ్డులో, ఏదో కారుకు, ఇంజన్ అంతమేర బావురుమంటూ ఉంది. టూల్ బాక్స్‌లో రకరకాల రెంచిలూ అడ్డదిడ్డంగా పడివున్నాయ్–చక్రాన్ని బోర్లగిలా పడేసి, ఎవరో పడుచువాడు, బలవంతంగా టైర్ పెకలిస్తున్నాడు, టైర్ పెనుగులాడుతూంది.

టెలిగ్రాఫ్ స్తంభందగ్గి, తీగెలచుట్టలు చెల్లాచెదురుగా పడివున్నాయ్–దొరువులో దిగి, కారుదున్నపోతు మొండికొమ్ములతో ఒడ్డు రాపాడుతూంది–

చాకలివాళ్ళ రేవులో నాపబండమీద బావురుకప్ప గుండె, లయగా కొట్టుకుంటూంది–గాలిపతంగీ కత్తిరింపల్లే, తొడలు జమవేసి ఉత్తరీయం మొలకు కట్టుకున్న చాకలిది, ఉదికిన బట్టలు కండెలల్లే పిండి, రాసిగా విసిరివేస్తూంది–

చేనంతా కుళ్ళగిస్తూ, నాగలికర్రు చాలుచేసుకు దిగిపోతూంది–

–ఏది చూసినా బూతే కనిపిస్తూంది–

కాలువగట్టు వెంటే నడిచిపోతున్నాడు. బాటంతా, వానకు తడిసి, ఎండకు ఎండి, ముడతలు ముడతలుగా పొత్తికడపల్లె తగులుతూంది – కనుచూపుమేరలో, కొండనడినెత్తిన మబ్బు రాచుకుపోతూంటే పైట తొలగినట్టు, కొండగుబ్బ, కొట్టొచ్చినట్టు కనిపించుతూంది.

లాకు దగ్గిరకువచ్చింది: అంతమేరా మొక్కలు పువ్వులు పూస్తున్నాయి. నిమ్మగడ్డి కత్తిపదునుగా గుబురుకట్టి పెరిగింది వచ్చే పడవల్ని ఆకట్టుకునేందుకు లాకుతలుపులు విచ్చుకున్నాయి, పడవల్ని కబళించుకున్నాయి– హోరుగా లాకు నిండుతూంది–

కొమ్ములు వచ్చీరాని మేకపోతు, బొడ్డువూడని లేగదూడను కుమ్ముతూంది లేగ మువ్వల్లె చిందుతూంది కన్నెచెరలోనే పడివున్న గోవూ గోవూ కలయబడు తున్నాయ్–అల్లంతదూరాన పసిరిక నంజుతూ, పొదుగు బలిసిన మరోటి పోతల్లె ముందుకు దుమికి, మొగరీవి నటించబోతున్నది.

–కొజ్జాల డోలక్ మోగుతూంది–గసిగలాగా ఉన్న రవికా కోకా లయ తప్పకుండా ఆడుతున్నాయ్: చోద్యం చూస్తూన్న మూకలోంచి, ఓ చిన్నవాడిని ఎగరేసి అందుకుని, కొండలు బద్దలైనట్టు ముద్దెట్టుకుంది, గరుకుమూతి.

చిన్నవాడు విలవిలలాడుతూ క్రిందికి జారిపోయి–"గుచ్చుకుంది!" అని వెక్కి వెక్కుతూన్నాడు–

కొజ్జా, చిన్నవాడి చెంపలు పుణికి, కణతను మెటికలు విరుచుకుని, పైటలోంచి సూది లాగి, అందరికీ చూపించి, విరగబడి నవ్వి, సూది మునిపంట కరుచుకొని, మళ్ళీ చిందుతున్నది–

చోద్యంగా మూగిన మూకంతా, రకరకాల పకాల్‌మన్నది–వెంకటరత్నం, నవ్వే మొగాలన్నీ పరకాయించుతున్నాడు. ఆ నవ్వులన్నీ గాలివాటాన పోతున్నాయి. అన్నింటికన్నా అచ్చంగా మరో నవ్వు, తనలో తాను నవ్వుకుంటూన్నట్టు, తన కొక్కడికే వినబడుతూన్నట్టు, అనిపించింది.

అదిగో, ఆ పడుచే నవ్వుతూంది· నూనెకారే కొప్పులో, సిగపాయను అంటి, పొటకరించిన గన్నేరు పూలు, ఒడినిండే బంతిపూలు, సందెడు జనపకట్ట, కట్టలో కొడవలి –

చూసిన చూపు నాటి, నవ్వు ఆపేసుకుంది. తలవంచుకు తప్పుకుపోయింది. మెడకు పగ్గంపడి లాక్కుపోతున్నట్టు అటే పోతున్నాడు–

తోపులోకి మళ్ళింది గన్నేరు. మలుపులో అడుగు ఆపి, ఇటే చూసింది–అల్లంత చేరువనే, రక్కిసపొద చుట్టు తిరిగి, ఆనవాలుగా ఆగింది–

తల ఎత్తి చూసి తల వంచుకొని నవ్వింది – నిలువు నిలువునా ఝల్లుమన్నది–మెడమీద నరం గుటకపడ్డట్టు కొట్టుకుంటూంది –

సందిట జనుంకట్ట చెట్టువారకు నిలవేసింది. ఒడి దులిపేసి, బంతిపూలు, పంచెగుడ్డలో దూముడి వేసింది. కిక్కురు మనకుండా ఉంది

చెట్టుపెణకు, కొప్పు అదిమి, మెడ రిక్కించింది. ఒళ్ళు విరుచుకుంటున్నట్టు చేతులు జాచింది:

వెంకటరత్నం – వెన్నంటి వానజల్లు కొడుతూంటే, పరిగెత్తుకుపోయే బడిపిల్లకాయల్లె–దోవ నలగదొక్కుకుంటూ అక్కడనుంచి దూసుకున్నాడు–

పడుచు, పోయేమనిషి వాలకం చూసి, మునిపళ్ళు బిగించి, ఈల వేసినట్లు తుపుక్కుమని, చీరెకుచ్చెళ్ళు జాడించినట్లు విదిలించుకుని – సందిటకు జనపకట్ట అందుకుని – అడుగువేసి, వాటంకుదరక – కట్టను గుండెకు అదుముకుని,

గరిపొడిచినట్టు మెట్టదిగి – అల్లంత దూరాన తోపుమాటుకు ఉన్న సాహానికి కాలిబాట అందుకొని, ఆగి – నలువంకలా పరకాయించి, – దూరపు చేలో, – ఇంకా జనుము తెగవేస్తూన్న మనిషిని పొడగట్టి, – చెంపలు కంది – పెదవి, కన్నూ తెరచుకొని, రొమ్ము విరపుగా, మడి తొక్కుతూ, అడ్డంపడి సాగిపోయింది –

– వెంకటరత్నం యిటు పరుగెత్తుతూనే ఉన్నాడు – ఆడుతూన్న కొజ్జా, ఈ పోకడ ఓరకంట చూసి, ఆడే ఆట ఆపకుండానే – అనువుగా, పాడే పదానికి ఊతగా, ఈల కొట్టాడు – మరో కొజ్జా, అట్టహాసంగా, డోలక్ ఊతంగా కాలెత్తిపట్టి ముక్తాయించి, ఒక్క గిర్రుకొట్టాడు–

వెంకటరత్నం ఇంకా పరుగెత్తుతూనే ఉన్నాడు – ఎటో తెలియకుండా –

ఏనాడో ఆహుతి అవుతూంటే, ఆర్పేందుకని అట్టహాసంగా మోగుతూ, కుమ్ముకుపోయే అయోమయమల్లే ముక్కుకు సూటి కాలికి అందిపుచ్చుకుని, దూసుకుంటున్నాడు – నడిచే సమ్మర్దం, ఆ ధాటి పసిగట్టి, అలవోకగా, దూరదూరానే తప్పుకుంటూంది.

రోడ్డుకు అడ్డంతిరిగి నిలుచుని, – వేదాంతంలోంచి శృంగారంలోకి మళ్లేందుకు విశ్వప్రయత్నం చేస్తూన్న బసవన్న మాత్రం అలా ప్రమాగన్నుగానే ఉన్నాడు. ఎంతసేపటినుంచో జలదరింపుగా, కాచుకుని విసిగిపోయిన, లేగ, ఆ పోయే పోకడ జాలులో కులికి, కట్టు తెంచుకున్నట్టు కుప్పించి, చివరికి త్రొక్కుతూ, నాధేశ్వరుణ్ణి, ఓపికున్నంతగా వెక్కిరిస్తూంది.

వెంకటరత్నం, కాలు యింకా ఆగలేదు – మోకాళ్ళ పర్వతం ఎక్కుతూన్న అర్భకుడల్లే తూలుతో అడ్డదిడ్డంగా, తనకు తానే బందాలు పడుతూన్నంత ఉత్కృష్టంగా, గాలిని డిక్కీకొడుతూన్నట్టు సాగుతున్నాడు–

–రంగశాయి ఎదురువస్తూ ఆపాడు–

'ఏమిటిరా, అబ్బీ! ప్రళయం?

'ఎందుకంత రొప్పు?–

'ఏం తప్పు చేశావ్ – ఇంకా పారిపోవడానికి?–'

–ఆపగానే రొప్పు ముంచుకొచ్చింది – వెంకటరత్నం గొంతుక, మాటల్లో లేని తిట్లు తిడుతూన్నట్టు – కత్తులు రాపాడుతూన్నట్టు – ఎగశ్వాసలో కొరకొరలాడుతూంది–

రంగశాయి, వీడి అవస్థ ఏమాత్రమూ ఖాతర్ చేయలేదు. మాటవరుసకు పలుకరించినట్టు–జవాబు వచ్చేలోగా, అనవలసిన నాలుగూ, నాలుక చివర ఉన్నవి దులిపేసుకున్నట్టు అని, తన ధోరణిలోనే వాగుడుకు దిగాడు:

చేతిలో ఉన్న పత్రిక విప్పాడు – పేజీ పరకాయించి తీశాడు – 'ఇదిగో చూడు మన ప్రతాపం!' అన్నంత ధీమాతో, జండా ఎత్తిపట్టుకున్నట్టు ఝళిపించాడు!–

ఆ పేజీలో – రంగశాయి పుస్తెకట్టిన కీర్తిశేషురాలి బొమ్మ, రెండు రంగుల్లో ఉంది: అవాలు దిమ్మరించినట్టు పేజీ యావత్తూ క్రిక్కిరిసి అక్షరాలు ఉన్నాయి.

"సొంతంగా బ్లాక్ చేయించాను–స్వయంగా, ఒక్క తప్పు లేకుండా అక్కడ పడిగా

పులు పడిఉండి, సరిచూశాను: వెయ్యికాపీలు ముక్తాగా పుచ్చుకుని కావలసినవాళ్ళందరికీ, ఎక్కడెక్కడికీ, పోస్టు చేయించాను–

"కాలం తీరిపోతేమాత్రం చిన్నచూపు చూశాననుకున్నావా? అయిల్ పెయింటింగ్స్ రెండింటికి ఆర్డరిచ్చాను, బొంబాయిలో. ఒకటి మన సావడిలో ఉంటుంది – మరొటి మహిళామండలి భవనానికి సమర్పించే ఏర్పాటు చేశాను–

"నేను ఎన్నటికీ లోపం చెయ్యనురోయ్ అబ్బీ!–"

వినగా వినగా నవనాడులూ క్రుంగిపోయినట్టు – అరికాళ్ళనుంచి శీతలం ఎగబ్రాకినట్టు ఒక్కసారి మొద్దయిపోయినాడు, వెంకటరత్నం.

వెన్నంటి వణుకు పుట్టుకువచ్చి, మలేరియా ఛర్రమన్నట్టు కణకణలాడిపోయినాడు – గడ్డ తన్నినట్టు – రంగశాయిని ఎగిరి తన్నాడు – మళ్ళీ, కాలూనుకున్నాడు.

– ఆ తాకుడుకు, కాబోయే పెళ్ళికొడుకు – పడి – బెణుకల్లే ఎగిరిపడి – రోడ్డువార కాలువలోకి ఐమూలగా దొర్లి యిరుక్కుపోయినాడు – మళ్ళీ లేవకుండా అణగారేందుకు, ఏ దుంగో – దూలమో అందుకు విసిరేద్దామని, వెంకటరత్నం, అటూ ఇటూ చూశాడుకాని, ఏదీ అందుబాటులో రాలేదు–

అటు తిరిగిచూడకుండా – వాడి మానాన వాణ్ణి పడేసి, వెళ్ళిపోయినాడు నిదానంగా.

– మళ్ళీ మొదటికే వచ్చాడు.

కాలువ వంతెన ఎక్కాడు. కమ్మీ అనుకుని తొంగిచూస్తే – క్రింది ఉరవడికి కళ్ళు గిర్రుమన్నాయి – తలకాయ, కొండల్లే గాలిలో వ్రేలాడుతూన్నట్టూ, ఒళ్ళంతా కొట్టుకుపోతున్నట్టూ అయిపోయింది. పళ్ళు పటపటగా బిగించి, కణతలు నెప్పి పుట్టేంతగా బిగించుకుని, తలబరువు దించుకుని హోరులో రెక్కవిరుచుకున్న పతంగీని, గిరికీ కొట్టకుండా, దించుకునే ఒడుపులో, నింపాదిగా, ఒంటికి తెలివి తెచ్చుకున్నాడు – ఎవడో రాక్షసుడు నడుంపట్టుకొని పిడపవేస్తే – ఊపిరి కలుక్కుమన్నట్టు – వల్లమాలిన నిట్టూర్పు వచ్చింది. దులిపేసిన గోనెసంచీకిమల్లే వ్రేళ్ళాడిపోయినాడు–

వంతెన దిగి, గట్టువెంబడే నడచిపోయి – ఏదో చిక్కని నీడను నడుంవాల్చాడు. నిదుర తెప్పించుకునేందుకు, ఎన్ని విధాలో, పక్కకుదుర్చుకుంటూ మసిలాడు: బడలిక మాత్రం దిగజారింది.

అటూ ఇటూ ఎవరూ లేకుండా చూసి, పసిపిల్లాడల్లే – కాలువలో దూకాడు – బాగా ఓపికవచ్చేదాకా ఈది, ఒడ్డుకు వచ్చి, అప్పుడు సొమ్మసిల్లి పడుకున్నాడు–

– ఇంటిగడప, ఎక్కేసరికి, ప్రొద్దు వాటారింది:

అమ్మమ్మ లోనడవాలో చెంగు పరచుకుని గోడవారను పడుకుని ఉంది. వీడికోసం కాచుకుని కూచుని కూచుని కునికిపాట్లువస్తే అట్లాగే నడుం వాల్చిందేమో, పక్కనే వత్తులపెట్టె, చేసిన వత్తులూ అలానే ఉన్నాయి. అలికిడి విని, మత్తుగా, చిరాకుగా, లేచికూర్చుంది–

"ఎక్కడికి వెళ్లావురా నాయనా?" అంటూ లేచి దగ్గిరగా, వచ్చింది –

"స్నానానికమ్మా!" – తడుముకోకుండా చెప్పిచొక్కా విప్పుకుంటున్నాడు–

"ఇప్పుడేం స్నానంరా?–"

"మైలపడ్డాను!"

"ఏం?–"

"ఓ ఛండాలుణ్ణి తాకాను!"

"తాకితేమాత్రం!–ఎప్పుడనగా పోతివి? తిండీతిప్పలూ లేకుండా ఇదేమిటిరా–తండ్రీ!"

జవాబు చెప్పకుండానే, కుర్చీలో నడుంవాల్చాడు–వచ్చిన ఉత్తరాలు అందుకుని, వాటివంక చూడకుండానే పరధ్యానంగా ఉన్నాడు–

"ఇంటిదగ్గరనుంచి ఏమన్నా వచ్చిందా?–" అమ్మమ్మ మరింత చేరువకు వచ్చి నిలుచుంది–

"ఇంటిదగ్గిర ఎవరున్నారు? – దయ్యాలూ, భూతాలేగా!–" కసిరికొట్టినట్టు అన్నాడు.

అమ్మమ్మ – ఇంకా ఏదో అడుగుదామనుకున్నది, పెదవి దగ్గిరే ఆపేసుకుని "వడ్డించనయ్యా" అంది:–

"ఏదీ కానివేళ – ఇప్పుడేమిటి అమ్మా–" అంటూ ధూకుడుగా లేచి, గదిలోకి వెళ్ళిపోయినాడు–

"అయ్యో నాయనా! – ఈ అభోజనం ఏమిటిరా! ఎంగిలిపడి లేద్దుగాని, రా! – రెండుముద్దలు పెరుగూ అన్నం తింటే," గుమ్మందాకా తరుముకువెళ్ళింది, ఆదుర్దాగా – ఆగి, మౌనంగా, చేసన్నగా బ్రతిమాలింది–

"వద్దమ్మా! – మహాప్రభూ! – నేను హోటలుకు వెళుతున్నానులే! – నీ మనసువచ్చినంత మెక్కివస్తాను–"

– ఆ కసురూ, ఆ విసుగూ చూసి, లాభం లేదనుకుని అమ్మమ్మ తగ్గింది: వెంకటరత్నం బట్టలువేసుకుని, బయటకు నడిచాడు –

అమ్మమ్మ ఓ కంటను ఆ పోకడ కనిపెడుతూ నిలుచుంది. గుమ్మంలోకి వెళ్ళి మలుపు తిరిగేదాకా, అలానే చూస్తూ నిలుచుంది.

తలుపు జేరవేసి, తల వంచుకుని యింట్లోకి వెళుతూ "ఏ యీడుకు ఆ అమరిక లేకపోతే, యింతే – పిచ్చులూ వెర్రులూ ఎత్తుకురావూ? – అయినా, వీడికి యీ మొండిపట్టు ఎందుకువచ్చిందో? – వీడు కుదుటపడడు ఇహ! – ఆ చూసేయోగం నాకు లేదు" – అని గొణుక్కుంది.

– వెంకటరత్నం మలుపు తిరిగేటప్పటికి సంజెదీపం వెలిగింది – నడవగా నడవగా మల్లెలవాసన కమ్ముకుంటూంది.

ఆకలి జ్ఞాపకంచేసుకుని, కడుపు మాత్రం నిండింది.

ఇంకా ముందు అన్నీ పూలదుకాణాలు: ఆ వాడనుఅంటే – రకరకాల తీపి కారంసరుకు–

– కత్తిదూసినట్టు – లంకంత గ్లాస్కోపంచె బంగాళాకట్టుగా – ఊపిరిజేబులో, బరువుగా రూపాయలూ, భుజాన లుంగీచుట్టినట్టు తాపుకున్న ఉత్తరీయం – అమడదూరం ముసిరే కామినియా తలనూనె ఘాటూ, ఎవడో ఒకడు, చేజాపి, ముంజేతికి మల్లెదండ కట్టించుకున్నాడు: కట్టిన సాయేబు, యిచ్చింది పుచ్చుకుని, చేయెత్తి సలాం పెటాడు.

పక్కబజారులో, రద్దీ జాస్తీగా ఉన్న అంగడిదగ్గిర ఆగి – కట్టి సిద్ధంగా ఉంచిన మిఠాయి – పొట్లాలు, మొనలు ఎత్తిపట్టి అందుకున్నాడు. రా జెవరి కొడుకన్నట్టు సాగిపోయినాడు –

అలాటివాళ్ళు – ఆవేళప్పుడు ఎక్కడికి వెళతారో, ఊళ్లో అందరికీ తెలుసు – అలాగే వెంకటరత్నానికీ తెలుసు – అనుకోకుండానే తానూ అటే మళ్లాడు.

– వాడ – వాడంతా నిత్యకళ్యాణంగా ఉంది! – గుమ్మంగుమ్మం ఒకటో అరో పడుచుగా కలకలలాడుతూంది–

ఏదో చూపు నిలవేసింది. ఏదో కులుకు లోపలికి లాగేసింది–

తాను ఇటు తిరగగానే – అటు తిరిగి నపడుచు, తల్లో చెండు గురిగా ఉంచుకుని, పైటచెంగు విసురు దారి చూపిస్తూన్నట్టు నడిచాడు

గదిగుమ్మందగ్గిర ఆగి – చెళుక్ మన్నట్టు తిరిగి, ఎంతో పరిచయం ఉన్నట్టు తల ఎగనెత్తి నవ్వి – ఎంత సొగసుగానో సిగ్గుపడుతూన్నట్టు తలవంచుకుంది –

ఎలా నవ్వాలో చేతగాక – చెంపలూ పెదవులూ కలిపి సాధనచేస్తూన్నట్టు, వెంకటరత్నం వెర్రిచూపు ఒక్కటిచూస్తూ నిలబడ్డాడు.

ఇంతలో, లోపలినుంచి, రొండివి తాళంచెవులు అమర్చుకుంటూ యింటిపెద్ద వచ్చింది. పలకరించబోయింది: దగ్గిరగా వచ్చి, మనిషిని పరకాయించిచూసి – 'ఫరవాలేదు – సొమ్ము ఎక్కడికీపోదు!' – అనుకున్నట్టు – తాను కల్పించుకుని, నిష్కర్షగా ముందే చేతిలో పడవేయించుకోవలసిన అగత్యం లేదు అనుకున్నట్టు – చిన్నదాని సైగ అందుకుని వెళ్ళిపోయింది – మనసులో కరుకులు ఎంచుకుంటూ –

అలా, నిబ్బరంగా, పెద్దదిక్కు వెళ్ళిపోయిన ఉత్తరక్షణంలో – పడుచు ఈ రశికుణ్ణి కమ్ముకుంది. చేతిలో చేయి కలిపి, లోపలికి, వడుపుగా చేర్చుకుంది. పన్నీరు చిలికింది – నవ్వింది – చక్కిలిగింతలు చేసింది: ఎన్నోవిధాల బెల్లించింది. చెండల్లె–పొన్నుమీద ఎగిరిపడి, చేతులు జాచింది–

గాలికి, లేత తామరతూడులు ఆడినట్టు మూపులు కదిపింది. మోడీకి పడగ విచ్చుకున్నట్టు జబ్బలు బిగించి, పద్మకోశాలుగా, సైగచేసింది – బరువు చేదుకుంటున్నట్టు – నరాల బిగివిగా, ముంజేతులు రొమ్ముకు ఆన్చుకుంది–

వెంకటరత్నం ఉన్న చోటనుంచి కదలలేదు – "ఏమూ?" అన్నట్లు చూసింది. జాలిగా, ఎంతో అనుభవంగా దగ్గిరకు వచ్చింది – ఆ కంటతడి చూసింది–

చెక్కిళ్ళమీద చేతులు ఆన్చి – 'ఎందుకూ?' అన్నట్లు తల ఊపింది: పిల్లదానివంక తెప్పవాల్చకుండా చూసి, పొంగిపోయే దుఃఖాన్ని దిగమ్రింగుకుని, మూలుగుతూ, కన్నీళ్ళు గ్రిమ్మరించాడు–

పడుచు, పెదవివిరిచి, యింటిపెద్దను, పిలుచుకువచ్చింది: నాయకసాని, గుమ్మంలో నిలుచునే, ఎగా–దిగా చూసి–

'ఏమిటి బాబూ!–' అని పలుకరించినట్టు గదమాయించింది –

వెంకటరత్నానికి – వెన్ను ఛెళ్ మన్నట్టయి ఎక్కడిశోకం అక్కడ హరించుకు పోయింది–

"ఏమీలేదు!" అని తనలో తాను గొణుక్కుంటూ, జేబులోంచి, రూపాయిల బొత్తి అందుకుని, పక్కమీద పడేసి యివతలకు రాబోయినారు.

నాయకసాని, కాలు కదపకుండానే–

"ఇదేమిటబాబూ! మావల్ల వచ్చిన అపరాధం ఏమిటి?–" నిలవేసింది–

"ఏమీ లే"దని తలవంచుకుని ఆడించాడు–

"అయితే, ఉండిపోండి!"

వెంకటరత్నం తల ఉహూమని ఊగింది: నాయకసాని ఛర్‌మన్నది–

"ఏం బాబూ! – మాకు బిచ్చం పెట్టడానికి వచ్చారా?–అలా మేం ముట్టుకోము – తీసుకుదయచేయండి!–" అంటూ దోవ యిచ్చింది వైరౌలగి –

పడుచు, యీవంకన్నా చూడకుండా గదివిడిచి పోయింది:

ఎంతసేపటికో తెప్పరిల్లి – వెంకటరత్నం యిల్లుదాటి వచ్చేశాడు – ఇంట్లో ఎవరూ కంటబడలేదు – వీధితలుపు ఓరవాకిలిగా ఉంది: గుమ్మం దిగివస్తూండగా మాత్రం, ఎవడో ఎగమీసం దువ్విన పొట్టిముసలివాడు తక్కుతూ, తారుతూ వచ్చి, పక్కపక్కల్నే నిలుచుంటూ చేతులు జోడించి నసిగాడు – వెంకటరత్నం అర్థంచేసుకోకుండా వచ్చేశాడు –

ఆ – యింట్లోకి వెళ్ళగానే –

ఆ గదిలో అడుగుపెట్టగానే –

అమ్మజ్ఞాపకం వచ్చింది –

"అమ్మా!–నీ కొడుకు చివరకు యీ స్థితికి వచ్చాడా" అనుకుని దుఃఖం వచ్చింది.

అలా వచ్చిందీ – అందుకు తయారైందీ తానేనా అనిపించింది –

– తన్నుచూసి తాను నవ్వుకున్నాడు – అంతటితో తేటపడ్డాడు–

ఇంటికి, ఎంతో కలకల్లాడుతూ తిరిగివచ్చాడు: అమ్మమ్మతో విసుగొచ్చేదాకా లోకాభిరామాయణం వేశాడు: పడుకోబోతూ –

"రేపు మన ఊరు వెళ్లివస్తానమ్మా!" అని చులాగ్గా అన్నాడు:

"ఎందుకురా నాయనా!–" అమ్మమ్మకు ఏమీ అగత్యం కనబడలేదు – ఆమాటే అడిగింది –

"ఏమిలేదు – ఇల్లు ఏతీరున ఉందో చూసివస్తాను: ఇప్పుడు నాకు తీరుబడే – అందుకని –"

ఆవిడ అడ్డుప్రశ్న వేయకుండా – అడిగేవి అన్నీ ఊహించుకుని, కలగలుపుగా, వచ్చేటంత విపులంగా, మాట చొరవనీయని ధోరణిలో చెప్పేశాడు – ఒప్పించాడు.

అమ్మమ్మ రావడానికి వీలులేదని తెలుసును. ఊళ్లో బ్రహ్మాండంగా ఏదో సప్తాహం జరుగుతూంది – ఆ కాలక్షేపం విడిచిపెట్టి వస్తుందా? – పుణ్యంపురుషార్థం అంటే అమ్మమ్మకు ఎంత కాపీర్నమో వెంకటరత్నానికి ఉగ్గుపాలనాటినుంచీ ఎరుకే!–

ఒక్కర్తే ఎన్నాళ్ళున్నా ఉండగలదు – ఇక్కడేం భయంలేదు. పైగా అమ్మమ్మ నోట్లో నాలుకఉన్న మనిషి – దివ్యంగా నిభాయించుకు పోగలదు–

మంచి శకునంకాదని, మళ్ళీ ఎప్పుడొస్తావని అమ్మమ్మ అడగలేదు – "క్షేమంగా వెళ్ళి లాభంగా రా నాయనా!" అనిమాత్రం అని ఊరుకుంది.

"అల్లాగేనమ్మా! – నాకేం, నిక్షేపంలా వెళ్ళివస్తాను! – అవసరం ఉంటే ఉత్తరంముక్క వ్రాయించు–!" అన్నాడు:

"అంత అవసరం ఏముంటుందయ్యా ఇక్కడ–ఇంతలో!–నీవు ఎలాగూ రానే వస్తూంటివి, అక్కడ నాలుగూ చక్కబెట్టుకోంగానే! – నీకుమాత్రం అక్కడ తోస్తుందా ఏమన్నానా?–"

ఇలా అన్నా – ఎప్పుడొచ్చేదీ చెపుతాడేమోనని అనుకుంది కాని – వెంకటరత్నం అన్నింటికీ ఔనన్నట్టు తల ఊగించాడు. అంతే!–

## 4

– బయలుదేరి వచ్చేముందు అంతే అనుకున్నాడు:

మళ్ళీ బస్తీమొగం చూడకూడదు: ఆ మారుమూలే పడిఉండి, నిశ్చింతగా, మనసుకు ఏమీ బాదరబందీ లేకుండా బ్రతకవచ్చును అనుకున్నాడు. ఇల్లూ వాకిలీ సరిజూసుకుని అమ్మమ్మను రప్పించుకోవచ్చును – ఉన్న మడీ మట్రా ఆ రవంతా – సొంతంగా దగ్గిరఉండి, ఉబుసుపోకకు, సేద్యం చేయించుకోవచ్చు: చేనుగట్టుమీద, కావలసిన ఘూరా నారా పండించుకోవచ్చును – నలుగురినీ పోగుచేసి, తీరికగా లోకం భోగట్టా యావత్తూ చెపుతూ కాలక్షేపం చేయవచ్చును అలవాటైతేసరీ – ప్రొద్దుపోక ఏం చేస్తుంది?–

వెళ్ళినరోజు – కొత్తగనుక, ఎలాగో అలా వెళ్ళమారిపోయింది – ఇహ, మర్నాడునుంచీ ఏ నిమిషానికి ఆ నిమిషం, ముళ్ళమీద ఉన్నట్టు అనిపించడం మొదలుపెట్టింది:

ఆ కొంపమీద, ఒక్క దమ్మిడీ పెట్టినా దండుగే! – అది ఎంత బాగుచేయించినా అంతే! – అంతకన్న కొత్తది కట్టించుకోవడం నయం!–

వచ్చే రెండుబస్తాల అయివేజుకోసం ఇతగాడు అక్కడుండి ఒరిగించుకునేదేమిటి? – అవతలవాళ్ళను వెక్కిరించినట్టు కాదూ?

ఊళ్ళో అందరికీ, ఏ కారుకు ఆ పనులు అందరికీ ఉంటాయి – తీరికగా నలుగురూ కూర్చున్నప్పుడు ఇతడు కూడా అక్కడ జేరితే – అందరూ అతి మర్యాదగానే చూస్తారు – కాని అతకరు:

ఇక, లోకంలో భోగట్టా అందామా అంటే, ఛప్పన్న దేశాల్లో ఎక్కడేం జరుగుతూందీ, తనకన్న వీళ్ళకే ఎక్కువ విపులంగా తెలుసును – చదువువచ్చిన ప్రతి ఆరిందాకూ పత్రికలు కంఠోపాఠం! – వినికిడి, బట్టీ!

ఇహ తనకు పొద్దుపోయేది ఎల్లా?

ఎంతసేపని పుస్తకాలు ముందేసుకుని కూర్చుంటాడు? – ఎంతసేపని, నడుంవాల్చి ఏదేదో ఆలోచిస్తాడు? – ఎన్ని ఝాములు నిద్రపోతాడు?

ఏమీ వ్యాపకం లేనిదీ ఎలా నిద్రపడుతుంది? ఎప్పుడు తెల్లవారుతుందా అని, కోడికూతలు లెక్కవేసుకోవడం – తెల్లవారినప్పటినుంచీ మళ్ళీ ఎప్పుడు

సంజెపడుతుందా అని నోట్లో వేలువేసుకు కూర్చోడం! – కరణంగారింట్లో వేళకు మడికట్టుకోవడం – ఏ పూటకు ఆ పూట ఎక్కిదక్కిగా – పట్టుబలవంతాన, యింటివారు ఏమనుకునిపోతారో అని తినడం – సంజెపూట కాలాడినంత పట్టు ఎటో తిరిగిరావడం – మళ్ళీ మర్నాడు అంతే!

ఎటు తిరిగితేమాత్రం, ఏముందీ –

అన్నీ అవే చేలు – అందరూ అదే పని – తను, ఎందులో అన్నా కల్పించుకుందామన్నా – పలుకరిస్తే వెక్కిరించినట్టు అనుకుని ఊరుకుంటారు: వాళ్ళు చేసేది ఏదీ తనకు చేతకాదని, అందరికీ ఖచ్చితంగా తెలుసు: తను బస్తీనుంచి చోద్యం చూసేందుకు వచ్చిన అప్రయోజకుడు–

అయితే, మరి యిదేమిటి? –

కరణంగారి యింటికి ఏ అభ్యాగతి వచ్చినా, ఇలాగే పూటపూటా విందులు చేస్తారా?–ఇలా అడుగులకు మడుగులొత్తుతారా? – యింటికి కొత్తగా అల్లుడు వచ్చినట్టు మర్యాదచేస్తున్నారే! – ఏదో ఉంది: ఇది కేవలం లౌక్యం కాదు: తనవల్ల ఆయనకు జరిగేదేముందీ? –

ఉండి ఉండి – తీరా ఆ పూటే కరణంగారు అసలుసంగతి బయటపెట్టాడు –

మామూలువేళకు – అలా ఎటన్నా తిరిగివద్దామని బయలుదేరుతూండగా – ఆయనకూడా కలిసివచ్చాడు: ఆ మాటా యీ మాటా ఆడుతూ, హఠాత్తుగా, ఆ మాట, అంటే అసలుమాట – ఎత్తాడు:

– తన రెండోకూతురి అందచందాలూ, చురుకుదనం, గొంతుస్వారస్యం – భాగవతంలో ఎన్నిపద్యాలు నోటికి వచ్చిందీ – ఎంత బాలతొడుగు ఉన్నదీ – తాను యిదివరకు, పెద్దల్లుడికి ఎంతెంత ముట్టజెప్పిందీ – దేశకాలపరిస్థితులనుబట్టీ, ఆ భద్రాద్రి రాముడికృపవల్లా, తాను ప్రస్తుతం ఎంతకు తూగగలిగిందీ దస్తావేజు మతలబీలో ఏకరువుపెట్టి– సరే అంటే సరే అనమని, సుతారంగా మెడలువిరిచాడు: యింట్లోవాళ్ళ అభిమతమూ ఇదేనన్నాడు: తామందరమూ అనూపానూ చూసుకునే, 'శుభం!' అనుకున్నామన్నాడు: చిన్నదాని అభిప్రాయమూ యింతే అని తెలుసుకున్న తరువాతనే – ఈ చెవిని వేస్తున్నానన్నాడు – తేల్చి చెప్పాలిసిందే అన్నాడు – ఒప్పుకోక తప్పదన్నాడు!–

వెంకటరత్నం ఏకాండంగా మ్రాన్పైపోయినాడు: ఈమధ్యరాని కోపం వచ్చింది, మామూలుగా వచ్చే దుఃఖం వచ్చింది – కిక్కురుమనకుండా, కరణంగారి మొగంవంక చూశాడు; ఎన్ని ఢక్కామొక్కీలో తిని, చెక్కుచెదరకుండా మెలిదిరిగిన ఆ జమిలిమీసంకేసి చూశాడు! – నోరెత్తితే లాభం లేదనుకున్నాడు –

ఏం–ఏం?–అని కరణంగారు కుమ్మినట్టు వేధించగా, చివరకు పట్టుబలవంతాన, 'అలాగేలెండి, మీ మాటకు అభ్యంతరం చెపుతానా? – మా అమ్మమ్మకు చెప్పివస్తా–' అని నసిగాడు:

"నేను వెళ్ళి చెప్పివస్తాను: వెంటబెట్టుకువస్తాను: అంతకన్న మాకుమాత్రం కావలసిందేముంది! అందరికీ పెద్దది. ఆవిడసమక్షానే–" అంటూ కరణంగారు పేచీలోకి దిగారు–

వెంకటరత్నానికి గుక్క తిరగలేదు – తాను ఏమన్నా నెగ్గేట్టు తోచలేదు:

ఎలాగైనా అయితే – అల్లుణ్ణేకదా – అని కొంత ధైర్యం తెచ్చుకుని కొసమొండిగా 'పెళ్ళి అన్న తరువాత చూసుకోవలసిన వీలూ చాలూ బోలెడు ఉంటుంది నేను కాదనలేదుగదా – నన్ను వెళ్ళిరానీయండి!–' అన్నాడు. కరణంగారు లౌక్యంగా తగ్గి, పరేనన్నాడు:

ఆరాత్రి యిల్లంతా మరీ కళకళలాడింది:

కరణంగారి భార్య, ఒకటికి పదిసార్లు బలవంతంగా మారువడ్డించింది: 'ఏమోయ్!' అని పలుకరించింది! పెళ్ళికూతురుకాబోలు, మాంచి గమకంగా ముస్తాబై తనకంట పడకుండానే, ఎటునుంచో వేయికళ్ళతో పొంచిచూసినట్టు అవిపిస్తుంది: కరణంగారు ఒక్కటే ముసిముసి నవ్వుగా ఉన్నారు.

రాత్రి – ఎంత కొట్టుకున్నా కంటికి కునుకంటూ రాలేదు–నిన్నసాయంత్రం – అలా జరిగినప్పుడే, ఇహ ఆ ఊళ్లో ఒక్కక్షణం ఉండలే ననుకొన్నాడు–పులిమీద పుట్రగా ఈ పూట కరణంగారు ఈ ప్రస్తావన తేవడంతో–

ఎప్పుడు తెల్లవారుతుందా–అదే స్మరణ!

–నిన్న సాయంత్రం ఏం జరిగిందని!–

ఎటో షికారు వెళ్ళాడు–గట్టుదిగి డొంకపుచ్చుకున్నాడు–అది పోయిన పోకడే పోయి – యీ ఊరుదాటి, అవతల శివార్లకు చేరుకున్నాడు – నడుస్తూన్నంతసేపూ బాగానేవుంది – ఎదటంతా పచ్చపట్టేకాని, ఏ కొండగుర్తూ లేదు – అడుగు చులాగ్గా పడుతూందేమో – కనుచీకటి అయేదాకా సాగుతూనే ఉన్నాడు: అప్పటికి అనిపించింది – చాలా దూరం వచ్చానేమోనని:

ఎదురుగుండా, కూతవ్రేటుగా మరో ఊరు, తోపులోంచి, మిణుకుమిణుకు గుర్తుగా కనబడుతూంది–పుంతవిడిచి, మెరకపట్టి, వచ్చినవేపు చూశాడు: తన ఊరు ఎంతో దూరాన చూచాయగా బొమ్మలై కనబడ్డది–పక్కా క్రోసున్నర అయినా ఉంటుంది:

చరివేసినట్టు చీకటి, ఒక్క విదిలింపున ముంచుకువచ్చింది. మెరాబాలోంచి రకరకాల కీచులూ, హెచ్చూతగ్గు స్థాయిల్లో –చెవికి అందని ఝుడితిలో ప్రారంభం అయినాయి–వెళ్లేటప్పుడు దోవ తడుముకుంటూ పోవాలి: ముల్లూ ముట్రా ఉంటుంది – కాలికి జోడు లేదు – ఇటు పోయేవాళ్లు ఎవరన్నా ఉంటే, మనిషి సాయాన అయినా పోవచ్చును. అనుకుంటే – అటు, ఆ ఊరికి చేరువౌతూపోయే అలికిడేకాని, అటు ఎవ్వరూ రావడంలేదు–

ఒంటరిగాపోవడమూ–ఎవరన్నా వచ్చేదాకా అగడమూ ఆలోచన తెగక అలాగే నిలుచుండిపోయినాడు–

ఇంతలో ఉన్నట్టుండి–చేరువుగానే, వెనుక పీటీ గుబురులోంచి, ఆడగొంతు ఆర్తనాదం చెప్పుమన్నది: ఏదో హత్య జరుగుతూన్నట్టు అనిపించింది:

వెంకటరత్నానికి గుండెపిరికి ఏనాడూ లేదు: వినీవినడంతోనే, అభయంగా ఓ పొల్లుకేక పెట్టి–సవ్వడినిపట్టి అటు లంఘించాడు–

–చూసి, తల వంచుకొన్నాడు:

ఎవరో ఇద్దరు పడుచువాళ్ళు–

ఆ కేకకు అర్థం, అది కాదు – ఇది–!

వాళ్లేం సిగ్గుపడలేదు – ఈతడు వచ్చాడని మర్యాదకోసం – అన్నట్టు కొంచెం దూరదూరంగా నిలుచున్నారు:

"మీరా బాబూ!–" అని పడుచువాడు పలుకరించాడు: "కరణంగారింటికి వచ్చిన మారాజు!" అని పడుచుకు వివరించి చెప్పాడు–

"బస్తీ మారాజా!" అని పడుచు పకాల్ మంది!

"దోవ తప్పారా బాబూ! – ఇదిగో – ఇటు దిగి – జమిలితాళ్లమయంగా తలవంచుకుపోండి, మనూరు అదే– – ఓ మైలులెక్క తగ్గుతుంది–"

వెంకటరత్నం తనలో తాను "థేంక్స్" అని అలవాటుకొద్దీ అని, కిక్కురు మనకుండా, తలవంచుకుని, – దోవ పుచ్చుకున్నాడు. వెనుకనుంచి, వాళ్ళ నవ్వుచెండుతూన్నట్టు వినిపించి నిశ్శబ్దమైపోయింది –

దోవ అయోమయంగా ఉంది: అలవాటైన కాలైతే తప్ప ఆడదు – ముందుకు కాలు సాగడంలేదు – వెనక్కి తిరిగి వచ్చిన చోటికే చేరుకుందామంటే – వాళ్లను ఉసూరు పెట్టినట్టు కాదూ-

అయినా ఇంకోమార్గం లేదు–

ఇటునుంచే డొంకలోకి అడ్డంకొడదామంటే అసలు మరీ గుయ్యారంగా ఉంది: ఎదుట పుట్ట ఉందో, – గట్టు ఉందో, ఆనవాలన్నా లేదు –

పల్లబిగివిని, – వెనక్కి తిరిగాడు: తాను మళ్ళీ దాపురిస్తున్నానని వాళ్లకు గుర్తుతెలిసేందుకు, పెద్దగొంతుకలో ఏదో పద్యం ఎత్తుకున్నాడు – అదే పనవి – పనవి అనుకుంటూ, వచ్చినచోటికి చేరుకున్నాడు: అక్కడ ఎవరూ లేరు – వాళ్ళదోవను వాళ్ళు వెళ్ళిపోయివుంటారు –

అక్కడే నుంచునిపోయి – నవ్వుకోవడం మొదలుపెట్టాడు: తాను యిక్కడికి రావడం ఎందుకు – వచ్చి చేసిన ఘనకార్యం – ? డొంకలో చిక్కుపడటమేగా? ఉన్న ఊరే అయితే – ఏ బెడదా లేకుండా తప్పుకుతిరిగేవాడుగా!

– వెతుక్కుంటూ కరణంగారి మనిషి లాంతరు పుచ్చుకువచ్చాడు: తాను యీ ప్రాంతాల్లో తచ్చాడుతున్నాడనీ, బహుశా దోవ తప్పి ఉండవచ్చనీ యిందాకటి పడుచువాడు యింటికిపోతూ, కరణంగారి యింటిదగ్గర చెప్పి మరీ వెళ్ళాడుట – అంతేకాదు, వాడు వీడితో ఇంకా ఏమో, ఏమేమో చెప్పి ఉండకపోదు – వీడివాలకంలో ఏదో నవ్వు ఉంది.

ఇంటికి చేరేటప్పటికి కరణంగారు కనిపెట్టుకు కూర్చున్నాడు: ఏమీ అనలేదు – "అయ్యో! దారిలో అవస్థ పడ్డావా?–" అంటూ మాటవరుసకన్నా అనలేదు – వట్టి చిరునవ్వు తప్ప ఏమీ యీ ప్రస్తావనే తేలేదు – ఆయన మౌనంగా చెవిపుచ్చుకు మెలేసినట్టుంది!

ఆయన అలా ఊరుకోవడం వెంకటరత్నానికి మనసు చివుక్కుమన్నది. తనను చూసి నవ్వుకుంటున్నాడా అనిపించింది – ఖాయంగా అంతే అయిఉంటుంది.

ఆయన ఒక్కడే కాదు – తెల్లవారి లేచి – ఎవరివంక చూచినా, అందరూ తనను చూచి నవ్వు ఆపుకుంటున్నట్టే తోచింది. ఇక ఆ ఊళ్లో ఎలా ఉండటం?–

వెళ్లిపోదామనే నిశ్చయానికి రావడానికి ఆ పవలంతా పట్టింది: రాత్రి భోజనంవేళ ఆ సంగతి చెప్పి, కరణంగారి దగ్గర సెలవు పుచ్చుకుందామనుకునేసరికి ఆయన సంజెవేళ వెంటవచ్చి – ఇదొకటి ఎత్తాడు – పెళ్ళంటూ – ఇక ఉండటానికి అసలే వీలులేదు –

– మళ్ళీ యింటికి జేరుకోవడం ఎంతో బరువు దించినట్టు ఉంది: అమ్మమ్మ అనుకున్న దానికన్నా వేగిరం వచ్చాడనుకుని, సంతోషించింది: ఆవిడకు అసలురగడ ఏం తెలుసు?

అవాళంతా, తన ధోరణిలో తాను ఉండి అసలు సంగతి – అసలు ఏ సంగతీ ఆవిడతో చెప్పలేదు–

మునుపటికన్న ఊరంతా ఎంతో ఆప్యాయనంగా కనబడుతూంది: ఇంతవరకూ పడ్డ జంజాటన ఏదీ జ్ఞాపకం లేకుండాపోయింది:

తెల్లవారేసరికి, కరణంగారు ప్రత్యక్షమైనారు. ఆయన్ను చూడగానే, వెంకటరత్నానికి ముచ్చెమటలూ పోసినాయి: ఏదో ముంచుకుపోయే పనిమీదపోయే హడావిడిగా, – బయటికి తప్పకున్నాడు – ఏమనాలో ఆలోచించుకునేందుకు –

ఎంతసేపు తిరిగినా – ఏమీ పాలుపోలేదు–

అమ్మమ్మమీద – దైవంమీద – భారంవేసి, అపరాహ్ణానికి యింటికి తిరిగి వచ్చాడు:

కరణంగారు లేరు: వచ్చినదోవనే తిరిగి వెళ్లారుట – అమ్మమ్మ గండం తప్పించింది–

ఎలా అంటే – ఆయన చెప్పేవన్నీ చెప్పనిచ్చిందట – అన్నింటికీ సరే అన్నదిట – కాని, ఒక్కటిమటుకు పారజూసి మరీ, శుభమస్తు అనుకోమందిట –

"పిల్లవాడికికూడా, తండ్రిచాలికే అని జ్యోతిష్కులు అన్నారు – కనుక, పిల్లదాని ఆయుర్భాగ్యం విషయంలో మీకు అనుమానం ఉండి, మొక్కు తీర్చుకునేందుకే అయితే, అంతకంటేనా? నా మనమడు, మరొకరిలాటివాడు కాడు – వాడంత యోగ్యుడులేడు: ఉన్నన్నాళ్లూ పువ్వుల్లో పెట్టి చూసుకుంటాము – ఇదీ నాయనా, అసలు సంగతి – ఎవరో ఎవరో అయితే, మీరిచ్చే కట్నాలకూ, కానుకలకూ ఎగిరి గంతేసి ఒప్పుకోకపోదునా? – తెలిసి మీ దగ్గిర ఈ విషయం దాస్తే నాకు మరి పుట్టగతులుంటాయా? –" అందిట!

కరణంగారు పిల్లదానికి యీ గండం తప్పించినందుకు అమ్మమ్మపాదాలంటుకు మొక్కి – అభోజనంగానే వెళ్ళిపోయినారుట! –

వినగా – అమ్మమ్మ మనసు, అప్పటికి తెలిసి, వెంకటరత్నం, పసిపిల్లవాడల్లే, కృతజ్ఞతగా బావురుమన్నాడు –

అమ్మమ్మ – పొదివి పట్టుకుని, "నీ మనసు నాకు తెలుసురా తండ్రీ! – నీ బాధ నాకు తెలుసు! – ఆ తండ్రి బిడ్డవు కాదూ – బిగ్గరగా ఏడిస్తే, నీ మనసు ఏమైపోతుందో అని, ఏదో వంకపెట్టి ఎప్పుడూ విసుక్కుంటానురా నాయనా!–

"నీమీది కోపాన కాదు! – కాదురా తండ్రీ!

" నీవు పెళ్ళి చేసుకోలేదని నాకేం విచారంలేదు: మనమరాలిచేత ఉపచారం చేయించుకోవాలనే ఉబలాటమూ లేదు: నేను ఉన్నన్నాళ్ళూ యింత వండి పెడతాను–ఇహ ఆ తరువాత అంటావ్ – నీ తల్లి ఎలా తలిస్తే – అంతే–

"తానే, తన బిడ్డను కనిపెట్టుకుంది!

"ఆ రుషిమాత్రం–"

వెంకటరత్నం–కళ్ళుమిరుమిట్లుగొలిపే కాంతిలో నిలుచోలేకపోయినట్టు, విడిచి, వీధిలోకి వచ్చేశాడు: మనసులో అమ్మమ్మకు అనుక్షణమూ, అడుగడుగునా మ్రొక్కుకుంటూ.

ఆ వెలుగు దూసుకువచ్చిన తరువాత, ఈ నడివీధి, ఈ సమ్మర్దం, ఈ దీపాల మినుకుమినుకు – ఈ మల్లెల గుమాయింపూ, ఇదంతా, మనకు అందుబాటులో ఉండి, తనజోలికి రావడానికి భయంభయంగా తప్పుకు తిరిగే, ఏదో సాదాలోకంలాగా అనిపించింది వెంకటరత్నానికి–

అప్పటికి, మామూలు మనిషి అయినాడు–

రంగశాయి కనబడితే, పలుకరించాడు: నిలవేసి కుశల ప్రశ్నలు వేశాడు–"నీవు కనబడకపోతే ఏమీ తోచడంలేదురా!" అన్నాడు. "రేపు మీ యింటికి వచ్చి, కొత్త సంసారం ముచ్చట చూస్తా" నన్నాడు! – మామూలు ధోరణిలో వెన్ను తట్టాడు–

వెంకటరత్నం – ఎటు చూసినా, ఏమీ ఎబ్బెట్టు కనిపించలేదు.

* * *

# అక్క మహాదేవి

పూర్వము ఎన్నడో - పెద్ద లెవ్వరో పలుకంగా, విన్నాము!

అవునా, ఆ పెద్దలు, తనకన్న తెలిసినవారు, సూక్ష్మముగ తెలియజెప్పంగా, గురికుదిరి, గురుతుగా, చిత్తమున జేర్చుకొన్న వృత్తాంతము, ననుబోలిన వారికి తేట తెల్లముగా వివరించిన వైనము ఎట్టిదంటేనూ-

శ్రీకరమ్మైన కల్యాణపురమ్ములో, శివానుభవ మంటపంలో. అల్లమ ప్రభువు శూన్యసింహాసనం అధిరోహించి ఉండగా - కెళల కైవారాన - చెన్నబసవన, సిద్ధరామయ్య, - తెలుగు బొమ్మయ్య.

సత్యక్క, ముక్తాయక్క-

నిమ్మవ్వ, కదిరె రెమ్మవ్వ-

మొదలైన, శరణులందరూ - యిలా పేరు పేరున బలసి కూర్చుని, శివానుభవ చర్చలో, లీనమై ఉన్న సమయాన, అలాంటి తరుణాన-

చిరునవ్వే కట్టుకోకగా - గురుభక్తే పైరిణీగా - దైవకృపే తానుగా -

తెలియని కనులకు తానో ప్రశ్నగా,

తెలిసిన మనసుకు, తానే సమాధానముగా -

లేత అనటి ఆకంత నేవళాన ఉన్న ఒక చిన్నది, మైజారు కురుల దుప్పటి కప్పుకుని, వారి సన్నిధికి జేరుకోగా,

ఒక కన్ను కసిరింది -

ఒక చూపు చురచురలాడింది -

ఒక వాలకం వంకబెట్టింది-

కొందరి మనసులు శివశివా అన్నవి- .

కొందరి వైఖరి. భవా - అభవా - అన్నది-

ఆ చిన్నదాని చెక్కిలి 'చెన్నమల్లికార్జునా!' అన్నది!

ఎవరా చిన్నది: అక్కమహాదేవి!-

కన్నవారెవ్వరు - అతి సామాన్యులు!-

వారిపేరు? - కన్నతల్లి సుమతి; తండ్రిపేరు-నిర్మలశెట్టి; వృత్తి? - శరణులను సేవించుకోవడం; ఆస్తి? - శివభక్తి!

ఆ తల్లికి - తొలిచూలూ మలిచూలూ యీ చిన్న దొక్కతేనా? ఔను:

బిడ్డకు వెన్ను చలువ లేకపోయెనే - అనుకుంటిరా ఆ తలిదండ్రులు? ఏనాడూ లేదు. పిల్లదానికి కంటి చలువ ఉంది: కళ ఉంది: ఎత్తుకో వచ్చినవారు - 'ఎవరీ

బాల' అని అబ్బురపడేవారు: ఆడించ వచ్చినవారు – 'అంబా!' అని చేమెత్తి మొక్కేవారు:

పాలీయబోయినప్పుడల్లా ఆ తల్లికి పరవశమయ్యేది...

ఎవరవమ్మా – తల్లీ: మా యింట ఎందుకు వెలశావమ్మా – అని ఆ తండ్రి చెక్కిలి పుణుకుతూ ముద్దుచేసేవాడు:

అలా పెరిగింది ఆ చిన్నది;

పేరేమని పెట్టారు: పేరెవరు పెట్టారు?

"అక్క" అన్నారు. అన్నదెవరు, పంజరాన ఉన్న చిలుక: అనాటి కీనాటికి ఆ తల్లికాపేరే!

చిన్నతనాన ఒక ఆటలేదు – ఒక అల్లరిలేదు! వెన్నముద్దల్లె నవ్వుతూ ఉండేది.

కన్నెతనాన ఒక చిలిపితనంలేదు: ఒక చికిలింపు లేదు! పవలూ రేయీ వెన్నెలగాచే చందమామల్లె తిరుగుతూండేది! పగటి వెన్నెలేమో అని అబ్బురపడేవా, అంబ సిగపూవుగ జేసికొన్న జాబిలికి చీకటు లెక్కడివోయీ – ఆ వెన్నెల పవలెల్లా ఎక్కడ – కదళీవనంలో! ఏల? – అది వాని లీల·

అలా రూపాన ఉన్న కన్నెను – ఆ పురమేలే రాజు, మాంచి ప్రాయాన ఉన్నవాడు చూచినవాడై, కులమిదనీ గుణమిదనీ తెలుసుకున్నవాడై, బరాబరుల వారిని, ఆ ఇంటికి పంపి, మీ కన్నెను ఏలినవారు, చేపట్టామన్నారని, ముగుదల సేయంగా, తల్లిదండ్రులు తబ్బిబ్బై తలయూచి, అక్కమ కావైనం తెలుపగా, చిన్నది, మౌనంవీడి నవ్వి, కోటలోవానిని తోటలోకి రమ్మను, కోరిన దిచ్చి చేపట్టమను – అని పలికిందాయెను!

ఆ రాజు – వానిపేరు కౌశికుడులే – ఉగ్రం తెచ్చుకుని, సిగపట్టి యీడ్చుకుని వచ్చి పాదదాసిని చేసుకుని, తక్కిన భోగసానులకు ఊడిగం జేయించే సన్నాహాన, అక్కమ ఉన్న తావునకు రాగా, ఆ తల్లి, ఎదురేగి కుశలమడిగి, ఏమని అడిగినదంటేను–

"మారాజా! మామిడికి తీయని నీరు

నిమ్మకు పుల్లని నీరు

మల్లెకు విరజాజికీ పరిమళోదకం పోసిన దెవరయ్యా!

జల మొకటే, స్థల మొకటే, ఆకాశ మొకటే – వెరసి ఒక్కటే – మరి, యీ భేదములకు కారణమేది – కర్త ఎవ్వరు? "

రాజు పలుకలేకపోయినాడు–

చిన్నది, ఓరి అజ్ఞానీ అన్న చూపుచూసి –

భూమిలో నిధి, ఫలములో రుచి, నువ్వులలో నూనె–కంటి కగపడదు–

ఆ తీరుననే, భావమున మరుగుపడి బ్రహ్మ మున్నది కదా!

ఆ నెలవు తెలుసుకో –

చెన్న మల్లికార్జునా శరణు నీవే అని వేడుకో –

వాడు నిన్ను చేపట్టిననాడు నిన్ను నే చేపట్టేను అన్నది:

ఆ రాజేమో, జైనుడు: శైవుడు కాడు: పరమ శివుని నమ్మినవాడు కాడు.

కాకపోయినా, కన్నెమీది మక్కువతో తలయూచినాడు:

ఆనాటినుండి కన్నె : కన్నవారింటికి పోలేదు – ఏమమ్మా యిది? అన్నారు వారు:

పరునికి యివ్వతలపెట్టగానే, పుట్టిన యిల్లు మరుగు పడినదమ్మా – నాకిక తలిదండ్రులు దూరపుబంధువులు: కన్నవారిల్లు ఎన్నడో ఊగిన ఉయ్యాలః మనసు దూరం జేసుకోను: కాని, మరింత మీకు చేరువకాను– అని పలికి వారికి మ్రొక్కి సాగనంపినది – కన్నతల్లికి దుఃఖం వచ్చినది. బిడ్డను సందిట జేర్చుకొని, వగవగ వాపోయినది – అక్కమ్మ – నవ్వి – "వెట్టిచాకలి, ఊరివారి బట్టలు, రేవున వేసి అవి తనవే అన్న మమకారంతో బండను బాదినట్లు, ఏది నాదనుకున్నా, దుఃఖమే అమ్మా! యీ ఆర్తిదీర్చేవాడు, ఆ చెన్నమల్లికార్జునుడే–"

ఆ తల్లిదండ్రులకు, శోకములో ఆనందము కలిగినది:

అలా, ఆ చిన్నది, ఆ కదళీ వనంలోనూ, చెంగటనున్న వనంలోనూ, ఉనికి చేసుకుని – చేసుకుని ఉంటూండగా, తానొక్కనాడైన తలదువ్వుకోలేదు – జలక మాడలేదు, వలువ మార్చలేదు – కాని,

చెదిరిన ముంగురులె చేర్చుక్కగా –

గుబురుకమ్మిన ధూళి అంగరాగమ్ముగా,

తోజూపే కజ్జలముగా,

కన్నె తనానికి ఆ రోజు కారోజు కళ హెచ్చగా – రాజుకిది తెలిసి, సరిగె కోకలంపగా, జలతారురైకలంపగా, ఏడు వారాల సొమ్ములంపగా –

పెగ్గడికాండ్లతో అక్కమ ఏమన్నదంటేను – "మ్రానుకు వనమే కోక, కొమ్మకు చిగురే రైక, పూసిన పూలే సొమ్ములు – అంబరమైన ఆభరణమైన, లోకాలకు నీ వొక్కడవే చెన్నమల్లికార్జునా–

"తనువు నంటినదీ మాయ – తానుగా విడువనిదీ మాయ – రాజుకు రాణిగా, యోగికి యోగినిగా, మనసుకు మమతగా, కనులకు ఆనందబాష్పములుగా, రగడ చేసేది మాయ – శోకము వచ్చినా, సుఖమే వచ్చినా – కన్నీరు తప్పదా – చెన్నమల్లికార్జునా, – లోకులకిది నీదు మాయగా దోచెను: నా కిది, నీయాన చెన్న మల్లికార్జునా–"

అన్నది – ఆ పలుకులు విన్న ఒక శరణు డన్నాడు కద–

"అక్కమా! నీవు శివుని సిగవే." – వారి వాకోవాక్యము లీ తీరున నడచినవట–

"సిగను కాను, సిగపూవునూ కాను: వానిమేని సగమలముకొన్న జగజ్జనని చిరునగవే, భువనాలకు వెలుగులీయ, ఆ వెలుగు రవంతసోకేనని వెంపరలాడే మొయిలు చిలపను!"

"మొయిలు లేనిదీ, మెరుపు లేదాయే – తాను లేనిదీ వాడు లేదాయే! తానే వాడని తెలివి తెచ్చుకో!"

"ఆ తెలివి నాకీ జన్మకు కటాక్షించకయ్య చెన్న మల్లికార్జునా – తాను వాడాయెనో, తానెవ్వరిని స్మరించేను, సేవించేను – మరి, ఈ జన్మకు ఫలమేదయ్యా

చెన్న మల్లికార్జునా –" ఆ శరణుడు, భవుని స్మరించి, అక్కమను దీవించి, గడచిపోయినాడు!

మరికొన్ని దినములాయె! అవి పున్నమిప్రొద్దులాయె! ఏలిన వానికి తమకం హెచ్చె – తానై కదలివచ్చి, "రావే బంగరుబొమ్మా! రాణివాస మేలుకొనవే!" అని చేయందుకొనఁగా, పండు నిప్పులు సోకినట్లు చేయి భగ్గుమనంగా, ఆ రాజు విలవిలలాడంగా, అక్కమ కణకణలాడి అల్లంతలో చల్లనై –

హరిని మ్రింగే – అజుని మ్రింగే
ఇంద్రునీ చంద్రునీ మ్రింగె
బల్లిదుల మ్రింగె బలవంతుల మ్రింగె
నీ మాయ:

ఇన్ని మాయలు నేర్చిన నీయందు తానో మాయావినని ప్రల్లదములాడి మనియేను చెన్న మల్లికార్జునా!–

కేవల మహంకారమునకు తావలమై, ముప్పది రెండు పాశముల జిక్కి, భ్రమించే వేసాలవారి మోసాలు జూసి గాసిలి, తల ఎత్తలేని బిడియాన, యీ చిత్తము నీ పద సన్నిధికి చెంగున చేరేనయ్య చెన్న మల్లికార్జునా!–

ఇలా పలికినదై, అక్కమ ఆ తావు వదలి, తనకు తానై కదలిపోవుచూ –

కరుణ నీవైనవాడా, నీవే నరుడయ్యేవని కలకాలము ధ్యానించంగా, వనాన కోకిలలూ, చిలుకలూ మంగళ వాద్యములు మ్రోగించి, పుప్పొడి భూతి బూసి, పూవుల కంకణము కట్టి, "పోవే నీ భవుని వద్దకు!" అని హెచ్చరించిరయ్య!–

జలమే కళ్యాణ మంటపము; పై మెరుపే చలువ చప్పరము; తారల తళుకే కలికి తోరణము; రోదసి పెళ్ళిపీట! చీకటి తునకలె తలంబ్రాలు – కదల కాళ్ళులేని కాంత పెళ్ళికూతురై, మొదలూ తుద లేనివాడు కాంతుడై, కలకాలము నిలిచే కాపురము మనదాయెనయ్య చెన్న మల్లికార్జునా!–

నీవు పుట్టిన దెచ్చట
గురువుల కృప అనే కుదురున
పెరిగిన దెచ్చట
శరణుల కరుణ అనే వనాన.
మెక్కినదేమి
భావమనే పాలు, సుజ్ఞానమనే నేయి, పరమార్థమనే చక్కెర–
మజ్జనము?
సజ్జన సాంగత్యము!
నిత్య పూజ?
శాంత చిత్తము!
పూజా పుష్పము?
పారవశ్యము!
ధూపము?
నిట్టూర్పు!
దీపము?

అమల భావన!

ఆరతి?

నిరతి!

నివేదన?

తన జన్మలు

తానెవ్వరు?

బసవన్న భక్తి, చెన్న బసవన్న జ్ఞానము, మణవాళయ్య నిష్ఠ, ప్రభులింగని జంగమ స్థలము, అజగణ్ణ ఐక్యస్థలము, నిజగుణుని ఆరూఢ స్థలము–సరిసమాన మిళితమై, వెరసి తానాయెగా:–

అనుభవ మంటపాన కొలువున్నవారూ యీ పలుకులాలకించి తలలూచంగా, చెన్నబసవన్న, మౌనాన దీవించగా, ఆ దీవెన వహించి, అక్కమ సాగిపోయె – చెన్నబసవేశ్వర శరణులనినారు గదా–

"ఆద్యుల అరువది వచనములకు

బసవన యిరువది వచనములు లెస్స–

బసవన్నవి – యిరువది –

ప్రభులింగని – పది –

ప్రభుదేవుని పది – అజగణ్ణవైదు –

అజగణ్ణవైదు – కూడలి సంగమయ్య దొక్కపలుకు

ఆ ఒక్కపలుకే, అక్క!"

ఔనోయీ – యిది వారి మెచ్చుకోలు!

అక్క మహాదేవి ఏమైనది?

శ్రీగిరి జేరుకొనినది! కదళీ వనము ఉనికి జేరుకున్నది–తానేమనుకున్నది?

కలకల పలికే చిలకల్లారా,

కోయని పిలిచే కోయిల్లారా!

ఝూంకారాల తుమ్మెదలారా!

నా పతి ఏడమ్మా!

తనను వెదకికొనుచు రాగ

తానూ వెదక బోయెనో,

లోగిరిలో దివ్వెవెలిగె,

లోకేశా, మరలి రార!

బయల కలయజూచి భంగపడినాను,

హొయలుమీరేవాడ: హృదిలోనె ఉన్నావు!

కలగంటినే–అక్క, కనుగొంటినే

కలత నిద్దురవీడి మేల్కంటినే

జడల కెంపులవాడు, జడినగవువాడు

నుడిలేని సడిలేని కడలేనివాడు

అన్యమెరుగనివేళ ఆశించినాడు
అడియాస కడదేర అదరించాడు!
అల్లంత సేతకే కల్లోలమై,
కల్లోలమే ఏక ఉల్లాసమై,
ఆదికాలం తపస నగ్నమై, మగ్నమై,
ఆరు తంత్రులు మీటెనే
ఆరుడిగి మూడై, మూడుడిగి రెండై
రెండుడిగి ఒకటై, ఆ ఒకటి తానై...
ఆ ఒక్కటి తానై, తరించెనోయి అక్కమహాదేవి!

* * *

# వనమాల

లోగిలిలో దివ్వె ఉన్నది. మనిషి అలికిడి లేదు.

ఒకటికి రెండు పిలుపులకూ, పలికేవారు లేరు.

ఆలయంలో అర్చన, యింతకుముందే ముగిసింది.

ప్రసాద మందుకొని, సేవింపులవారు మడి విడిచి వస్తున్నారు. వారిలో, వీరు లేరు.

లేక ఏమైనారు? తాము విజయం చేస్తున్నామని వర్తమానము అందిందే–మరి, దర్శనం అనుగ్రహించరా దనుకున్నారా? ఆ మేరకు, తిరిగి కబురంపలేక పోయినారా? ఇంత దూరమూ రప్పించింది – ఇందుకా? మనము వెనుదిరిగేమా? –

వచ్చిన దిద్దరు! ఒకడు పైకి గంగి గోవు. ఒకరు కానవచ్చే గండుసింగం. సేలువువలె వాటుచేసుకున్న వీరగాథ!

సింగం ఉరుకూ – ఉద్రేకంతో మౌనంగా గర్జించి, మాటలు బుసకొట్టింది. ఆ కరుకుతనం కనువిందు చేసుకుంటూ, గంగిగోవో చదికిల పడ్డది.

పాల దుత్తతో వచ్చాడు చిన్నవాడు – ఆగంతుకుల వంక చూసినాడు. చూసీ – చూడనట్లు తన మానాన తాను లోపలికి పోతున్నాడు.

## 2

"ఎవరిది?" అన్నది సింగం – పంచమీద పాదం మోపి, వీరముద్రవేసి, పిడికిలి పట్టుకు చిబుకం ఊని, నిలుచున్న ఆ గండు రౌతు వంక పరకాయించినాడు చిన్నవాడు.

"నేనే – చిన్నవాడ్ని!"

"ఎవరి చిన్నవాడివి?"

"చిరుతలు పట్టినవారి..."

"పేరు?"

"ఇంకా తెచ్చుకోలేదు."

గంగిగోవు చిరునవ్వు నవ్వింది.

"అయ్యగారి ఆల కాపరివా?" అన్నది.

"అయ్యగారే – ఆలకాపరి, నేను పాలమేపరిని!"

"లోగిలిలో ఎవరూ ఉన్నట్టు లేదే?"

"లేరు. ఈ అన్నమయ్య, ఆకడ కొండ మలుపులో – తులసీ తోటలో పూసలు తరిమెన పడుతూ కూర్చొని – నేటికి మూడు పొద్దులాయె!"

"ఈ అమ్మ –"

"కోడలిని చూడ మనస్సై దిగువకు పోయె!"

"ఆహా! వారి వియ్యాలవారి యింటిపేరు?"

"ఇంటిపేరూ లేదు; ఇల్లూ లేదూ – అదో శూన్యం!"

"అదేమి?"

"చేసుకున్న పుణ్యం! వర్థి పెళ్ళికి వడ్డీ దండుగ –"

"అయ్యగారైనా, యీనాడు తిరిగివచ్చేరా?"

"వారి చిత్తం! వీరంత వారుకారా – తలకో బుద్ధి, తలో దేవుడు..."

"వారి కుమారులు..."

"వీరంతటి ఘనులే! ఎన్నడూ యింటిపట్టున ఉండడు – ఈ చాయలకే రాడు."

"అదేం?"

"అయ్య పెంపకం? – వర్థి తిమ్మడు!

"వాడి ఊసు మనకేలగాని, అయ్య దర్శనానికి వచ్చారా – దూరాభారంనించా? అలా నిలుచునే ఉన్నా వేమయ్యా, అన్నమయ్య కూర్చుని సంకీర్తనం చేసుకునే చోట – పాదం తాకించావేమయ్యా! కూర్చో! లోన గోపాలుడికి అరగింపుచేసి, ఆ పాలు మీకిచ్చేను ఆరగింతురు గాని...మన పుణ్యము బాగుండి, అమ్మగారు తిరిగి వస్తిరా సరి – లేదా యీ ప్రొద్దు కింతే! అదేమయ్యా, కూర్చోమంటిని కదా, కూర్చోవేమి? నీకేం సింహాసనం కావాలా? కూచో!"

"నాయనా! తెలియక అంటున్నావు., వారు రాయలవారు!" అన్నది గోవు.

"రాయల వారనగా?–"

"విద్యానగర ప్రభువులు! వీరవిక్రమావతార శ్రీకృష్ణ రాజేంద్రులు."

"ఆ! ఆ మారాజులా మీరు? నిజంగా చేయెత్తి మ్రొక్కాలి! స్వర్గంలోఉన్న రంభాది గణానికి సోమయాజి మూకను తప్పించి, కరుకు తురకలను కట్టిపెట్టిన ధర్మతండ్రివి ప్రభువు వైనందుకు ప్రజలందరి పాపమూ, పాపమని నీవేచేస్తున్న పుణ్యజనుడివి!"

"అబ్బాయీ!" అన్నాడు అప్పాజీ.

## 3

"పూర్వజన్మ సుకృతంవలె యెన్నడూ వెన్నంటి ఉండీ, వీరినింతవారినిచేసిన తిమ్మన్నగారు తమరేకదూ! మీకో మ్రొక్కు మ్రొక్కాలి. దేశంలో ప్రజలను తురకల కన్న కరుకువారినిగా తీర్చి దిద్ది, యెదిరి చేలు కోయించి కుప్పలు వేయిస్తున్న శాంతమూర్తులు! శత్రు రుధిరంతో సంధ్యావందనం చేసే శ్రోత్రియులు..."

రాయలవారు హుంకరించినారు. చిన్నవాడి సిగ ఒడిసిపట్ట పోయినారు. తిమ్మరుసు రాయలవారిని సందిట పట్టుకుని మందలించినాడు. "చిరంజీవీ! అయ్యగారి సేవకుడూ మనకు పూజనీయుడే!" అన్నాడు.

అంతలో వచ్చారు తిమ్మక్కగారు. అతిథులను పోల్చుకున్నారు. ఆదరించినారు.

"చిన్నవాడేమి చిలిపితనానికి పోయినాడో – మీరు మన్నించవలె! తిమ్మన్నబాబూ!

వీడు మా చిన్నవాడు. యెన్నడూ తమ దర్శనం చేయలేదు. వీనిమాటలకు ఏమనుకున్నారో – మన్నించండి. దీవించండి!"

తిమ్మన్నగారు ఆశ్చర్యపడినారు

"అమ్మా! మీ పెద్దపిల్లవాడు.."

తిమ్మక్క కొడుకు వంక చూసింది. ఆ కొంటెతనం అర్థం చేసుకుంది. ఓహో అనుకుంది.

"గుడిలో ఉన్నాడు కాదూ, బాబూ! వాడు మా పెద్దపిల్లవాడు కాదూ! మీకు తెలియనే తెలియదా?"

"అమ్మా! వారు మీ దైవం కాదా?"

"నా దైవం మువ్వగోపాలుడు నాయనా! వీడు మా బిడ్డ!

"ఏదో యింతకాలమూ ఆ వరుసనే గడుపుకుంటూ వస్తున్నాము. మహారాజులు దయచేసినారని వారికి వర్తమానం చేయనా?"

"వద్దమ్మా, వారి దర్శనానికి మేమే పోయేము!"

రాయలవారు తిమ్మక్కకు మోకరిలి మ్రొక్కినారు. ఆ మ్రొక్కు గోపాలార్పణం.

చిన్నవాడు, ఆగంతుకులను అయ్యవారివద్దకి తోడుకొని పోయినాడు.

అన్నమయ్య రాయలవారిని కనులతో పలుకరించి, తిమ్మన్నగారితో సల్లాపము చేసినారు.

తాము రాజధానికి దయచేయవలెనని మనవి చేసినాడు రాయలు. "రాలేను" అన్నాడు అన్నమయ్య.

"కృష్ణరాయా! ఇక్కడ కామాటం ఎక్కువ. వీడు నన్ను వదిలి వుండడు. గుడి విడిచిరాడు. నేనూ రాలేను" అన్నాడు

నేను మీతోబాటే ఉండిపోతాను అన్నాడు. రాయలు ఆ నిశ్చయంతోనే వచ్చాడు.

అప్పాజీ కలవరపడి కలుగజేసుకున్నాడు. రాయలు తన మనసు మారదన్నాడు. యీ రాజ్యం శాశ్వతమా? తనకు విరక్తి పుట్టింది. ధర్మదేవతకు తా నొక్కడే రక్షకుడా?–

అన్నమయ్య చిరునవ్వు నవ్వాడు. "నాయనా! నీకు రక్తీ లేదు, విరక్తీ లేదూ. పుట్టుకతో వచ్చిన అసక్తి.

"రాజ్యభారము త్యజించి రాలేదు. మహారాజువలెనే వచ్చావు. ఆ రీవినే నన్ను నీవెంట తోడుకొని పోదలచావు. వీరుడిగా పుట్టి భక్తునిగా బ్రతకలేవు. విరాగివై కాలం వెళ్ళబుచ్చలేవు. ఉన్న తావునే అంత వైభవాలలోనూకాని, నీ అవతార సమాప్తికాదు. యిది ఆలయంలోవాని ఆదేశం.

"నా తులసిమాల నీకిచ్చేను. నేను వెంటవచ్చినట్లే.

"నీ మూర్తులు ఆలయంలో చిరస్థాయిగా నిలిపేందుకు కోనేటిరాయుడి ముగుదల అయినది. నీవిక్కడ వున్నట్లే. అదే నీకు దక్కే సుకృతం.

"మనం యెందుకు పుట్టామో, యెలా అవతరించామో అది మనచేతలేదు నాయనా! వాడికి యెరుక.

"పోయి రావయ్యా! అనడమే యిది మాటవరుసకే కాని మరల రాలేవు. ఆ ప్రాప్తము నీకు లేదులే.

"నీకిక ఆంధ్రనాయకుడు చేరువ. వారిని, వీరికి మారుగా సేవించుకో. నిలయము రణరంగమే అయినా, అంతరంగంలో కొంత శాంతి.

"అన్నట్టు యీ నడుమ కావ్య వినోదివైనావట. అదీ ఒకతీరు ఉద్రేకమే. నీకు వనరైనదే ఆ వ్యాసంగమే లగించుకో. వీర విహారంగా కవితలల్లు, కాలక్షేపముచేసు. చేసిన సేత గణన కెక్కేను.

"రాయలూ! రక్తపాతమైనది కాని, నీవు సాధించినది లేదు. విద్యానగరము కలకాల ముందునది కాదు నీ పేరున ఒక్క కావ్యము మిగిలినా నీ జన్మకు సుకృతము. సందె గోవిందా, యిక సాగిపో."

రాయలవారు తిరిగి రాజధానికి విజయంచేస్తూ చిన్నవాడివద్ద సెలవందుకున్నారు. "చిన్నవాడా, నీ దీవెన మాకు దయచేయ"మని వేడుకున్నారు.

చిన్నవాడు అన్నమయ్య చేసుకున్న పుణ్యంవలె, నిండుగా అన్నమయ్య చూపువలె, చల్లగా స్వామిసన్నిధిలో సామఘోషవలె, ఉద్గీథంగా యిలా పలికినాడు: "నన్నడిగి పుట్టలేదు. నాచేత పెరగలేదు. నా దీవెన నీకు అపోదులే. గుడిలో పడిగాపులుగా, ఆ రాతి నీతివాని ఎదురుగా, కంచుపోతగా ఖంగీలుమని కుదురుగా ఉండమన్నాడుగా అన్నమయ్య అదే నీకు దీవెనైతే మరెవరు పలికినా శాపమౌతుంది. 'నీకు పరివారంగా కొంతపాపజలం ఉండనేవుంది. దానికితోడు నీవు నరికిన తురకల యిల్లాళ్ళ గోడు నీకు మనుమలు నెత్తించేనులే. వారే తాతకట్టిన సౌధం కూలద్రోసి, మూటకట్టిన ముల్లె దోచుకునేరులే. అది నీ వ్రాత మారాజా! నీ శిథిల ఘనతకు, జీర్ణవైభవానికి శాశ్వత రక్ష! అందుకు సాక్షి తుంగభద్ర. కెంపుడిగిన నిర్మల వాహిని, ఎన్నడైన గిరి కందరాల నీ పేరు మార్మోగించేనులే! అదే నీకొక్క తులసిపూస; యిదే నీ గీత!"

* * *

# శహన

ఊసరవెల్లి ముదురుకుంటూ వచ్చి, తొండైకూర్చుంది!

హరిదాసుకు తప్పకుండా పిచ్చ ఎక్కిందని అనడానికి, ఇరుగూపొరుగూ వారికి, తదనంతరం క్రమంగా, సిగ్గుసిగ్గుగా తెలిసిన తార్కాణం, - వాళ్ళ మేనమామకు, ఆ పూట ప్రత్యక్షంగా తారసిల్లింది: కర్మమా అంటూ - ఉత్తరత్ర అయనే వైద్యానికి కూడా నడుముకట్టవలసి వచ్చింది:

—అనగనగా, - అవాళ - దొంగచాటుగా దొడ్లోకి దూకి, లేతచిగుళ్ళన్నీ నంజూతూన్న మేకపిల్లను ఒడిసి పట్టుకున్నాడు: మచ్చికగా లాలించుతున్నాడు. బ్రతిమాలుతున్నాడు: అది, వెర్రిగా అరచి, నాలుగుకాళ్లా గింజుకుని, - ఎగిరి అవతలపడ్డది: పడి, అల్లంతదూరాన బెదురుగా నిలుచుని, మెటికలు విరిచినట్లు ఒళ్ళు విరుచుకుని, - “చూడు, మా ఆయనతో చెప్పి నిన్నేం చేయిస్తానో” అని స్పష్టంగా అర్థమయేంత చూపు చూసి, - యింతలో మామయ్య అలికిడి పొడగట్టి - మొండిగోడమీదికి గంతున ఎగబ్రాకి, - వెలుపలకు ఉరికింది:

హరిదాసు గొంతుకూర్చున్నచోటే చతికిలపడి, - 'కులసతి సిగరికావలె' అన్నాడు “కాదు మామయ్యా! - చూడు ఆ లంజకాన ధీమా! - తనొక్కతే మహాలోకానికంతటికీ ఆడదైనట్లు! - ఎల్లా గింజుకుందో -” అంటూంటే మామయ్య యిదంతా ఛలోక్తి అనుకుని అప్పటికి నవ్వేశాడు:

ఎలాటి అవకతవకప్పని అయినా, ఒకసారి జరిగితే, - అర్థం అయీకాకా, అయినా చూసిచూడనట్టుగా పోనీయవచ్చును. రెండోసారైతే, మనసు గతుక్కుమన్నా ఎలాగో సర్దుకుపోవచ్చును: ముచ్చికి ముమ్మాట్లయితే - ఏదో తప్పకుండా మునిగిందన్నమాటే -

దాసుకు, చదువూ సంధ్యా, ఆస్తీ పాస్తీ అన్ని హంగులూ పుష్కలంగానే ఉన్నాయి. ఇలాంటివాళ్ళకి ఐదవతనానికి కూడా, లెక్కప్రకారం ఏ కొరతా ఉండకూడదు, - కాని, - చదివిన చదువు, వంటబట్టి, ఎందుచేతనో ఉన్నట్టుండి, - వెర్రితలలు - ఒక్కటికాదు వేయి - వేసుకొచ్చింది:

వాడి వైఖరిలో ఏమీ పిచ్చలేదు: మాటపొందికలో తడబాటు లేదు: అర్థంకాని ధోరణికాదు: కాని, అంత సులువుగా - యీ కలికాలంలో - ఆచరణలోకి పెట్టడానికి మటుకు అనువుకాదు: అదే వచ్చిన చిక్కు: పిల్లవాడిలో మరో అవలక్షణమంటూ ఏమీ లేదు:

అసలు యీ బెడద పుట్టుకురావడానికి కారణం వినాయక చవితి కథ: అందులో ఓ రుషి, - సంతానంకోసం వచ్చిన ఓ రాక్షసరాజు యిల్లాలిని ఏనుగక్రింద మార్చి, తానూ అదేధోరణిలో పడి, - వరమిచ్చి పంపుతాడు: - ఏమిటి ఈ మార్పులో

ఉండే పోహణి, అని లేతబుద్ధి ఆరా తీయడం మొదలుపెట్టింది. మనుష్యులకూ జంతువులకూ మమకారం విషయంలో గ్రంథాంతరాల్లో సవాలక్ష గ్రంథం ఉంది:

"రుష్యశృంగుడి తల్లి ఎవరు? – అశ్వత్థామ పుట్టువేమిటి?

గ్రీకుపురాణాల్లో స్వామివారు, – ఓ చిన్నదానికోసం హంసై – మరో చిన్నదాన్ని దోచుకుపోయేందుకు బసవన్నై, మరో శృంగారఘట్టంలో నరమృగమై – ఇలా వీలైనంతవరకూ పశుధర్మమేగా సాగించింది?

దేవతలూ రుషులూ చిద్విసియోగంచేసి, – అనుష్ఠించిన ధర్మాన్ని, – సామాన్య మానవులు మటుకు –"

టూకీగా యిదీ ధోరణి, – మామయ్య కంటపడుతూన్నవే, – ప్రయోగ విధానాలు!

దాసుతో తర్కించి ప్రయోజనం లేదు: దేవతలూ దేవకల్యులూ స్వచ్ఛందులనీ, వాళ్లు చేసినట్టు మనంచేస్తే లోకం ఊరుకోదనీ. ఊరుకోలేదనీ, పాతనిబంధన శిక్షాస్మృతిలో – ఇలాంటి ముచ్చటపడ్డవాళ్ళను, – రెండు జీవాల్నీ కట్టగట్టి నిప్పుల్లో పారవేయమని అనుశాసనం ఉందనీ, – మనువుకూడా 'పశువేశ్యాది గమనే–' ఈ హంశంమీద నిప్పులు చెరిగాడనీ – ఇలా వాదించినా, నచ్చచెప్పాలని ప్రయత్నించినా, – దాసుకు ఈ కబుర్లకు అన్నింటికి విరుగుళ్ళు తెలుసు.

ఇలా ఉంటే మేనల్లుడు బ్రతికి బట్టకట్టలేడేమోనని మామయ్యకు కొండల పెట్టు భయం వేసింది. ఏమిటా ఉపాయం అనుకున్నాడు! తోచక, మొండికేసి, – తనతో వచ్చేయమన్నాడు!

"ఏం–ఎందుకూ?–ఇక్కడలేంది అక్కడేముంది?" అన్నాడు దాసు:

"ఏముందో చూద్దువుగానిగా?–" ఇంతకంటే తెగించలేకపోయినాడు: స్వవిషయంలో: కాని, ఏభైఏళ్ళ – యీ నడుమను, అగ్రహారంలో వాటిల్లిన పచ్చిబూతులన్నీ మరింత పుష్టిగా వర్ణించి చెప్పి – "ఇప్పటికి మా ఊరేం చెడిపోలేదు, అలాగే వుంది? వచ్చి దాఖలా చూడవచ్చు!" నన్నాడు: కవి కంఠపాశంలో, వక్షోజద్వితయానికి తగిలించిన ఉపమానాలన్నీ గడగడ ఏకరువుపెట్టాడు! అంతా విని, దాసు – "నీ కంఠశోష చాలిస్తే – అలాగే వస్తా" నన్నాడు! మామయ్య ఉక్రోషం చంపుకుని – సంబరపడ్డాడు.

శాంతతండ్రి పంపించిన భోగంచానలు, – లడ్డూ కంబుల ఏపుమీద, రుష్యశృంగుణ్ణి పడవ ఎక్కించినట్టు – మేనమామ ఎలాగైతేనే హరిదాసును స్వగ్రామంనుంచి మకాం ఎత్తించి, తన ఊరు జేర్చాడు:

ఇలా తీసుకురావడంలో, రెండు కిటుకులు ఉన్నాయి. మామయ్య మామగారు, మంచి కట్టుదిట్టమైన భూతవైద్యుడు! పిల్లనిచ్చిన మామగారనే పలచదనంకొద్దీ, ఆయన హాహాతుమీద, మామయ్యకు ఎన్నడూ యీసడింపే కాని, ఆయన సంపాదన చూసినతరువాత, – ఆయన కట్టిన తాయెత్తూ, పెట్టిన విభూతి పనిచేసి బాగుపడ్డవాళ్ళను చూసిన మీదట – ఇది అంతా భేషజం కాదు, – ఇందులో ఏ వీసపాలో పస ఉండకపోదు అనే నమ్మకం ఎడనెడ పొడసూపినా, అది క్రమేణ ముదిరి, ఆయనమీద గౌరవంక్రింద మారుతుందేమోనని, – వీలైనంతవరకూ ఎంచులు పెడుతూండేవాడు:

తీరా, దాసుస్థితి యీ రీతయిన తరువాత - యిది, మందూమాకులవల్ల అయేపనికాదు - ఆ ముసలాయన్ను మంచిమాట చేసుకుంటే ఎలాగో ఓలాగు సాధకం చేస్తాడు, - అనుకున్నాడు: ఏదో గ్రహం ఆవేశించబట్టే, - ఎన్నడూ, వయసుకొద్దీ కలలో అయినా ఉలికిపడే అలవాటెరుగని అమాయకుడు - ఋషివంటి కుర్రవాడు, - ఇలా జంతుజాలంతో సరసాలాడటం ప్రారంభించాడు. అంతేకాని మరొకటి అయిఉండదని నమ్మాడు: అదొహటీ!

రెండో కిటుకు ఏమంటే - ఇంట్లో ఎదిగి ఈడేరినపిల్ల సిద్ధంగా ఉంది: ఎలాగూ వచ్చే వైశాఖమాసంలో ఇద్దరికి ముడిపెట్టాలనే అనుకుంటున్నారాయెను - ఏనాడో - శుభం - అనుకున్నారాయెను:- అది కంటిఎదుట మెలగుతే, - మేనత్త కొడుకేకనుక సిగ్గువిడిచి యోగక్షేమం కనుక్కుంటే - ఆ రంధిలోపడి అయినా, యీ గొడవ మానుతాడేమోనని - అదో ఆశ!

వచ్చిన మరునాడే, - ముసలాయన ప్రయత్నంచేసి చూశాడు, శతవిధాల - ముగ్గులోకి దించాలని: కాని, - దాసు సిగపాయ అందిందికాదు. చివరకు ఆయనకు విసుగెత్తి బింకంచెడకుండా - ఇదేదో అపూర్వప్రయోగం అయిఉంటుంది: అలాటిదేగనుక అయేపక్షంలో, - అసలువాడు దయతలచి ఉపసంహరిస్తేనే తప్ప, - అన్యుడికి, ఆ ప్రక్రియ సాధ్యం కాదన్నాడు:

అయినా, ఈ కొసవెర్రివల్ల, ఎవరికీ ఏమీ చెరుపు లేదు గనుక, - విధికీ, చేసుకున్న కర్మకూ వదిలిపెట్టి, - జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూ ఉండటంతప్ప, - గత్యంతరం లేదని సలహా యిచ్చాడు: మామయ్యకు ముసలాయన అశక్తత చూసి నమిలి మ్రింగేద్దామన్నంత కోపంవచ్చింది కాని, ఆయనమీద విరుచుకు పడడం వృథా కంఠశోష అని, ఊరుకున్నాడు:

రెండో ఎత్తు వేద్దామనుకున్నాడు:

కాని, ఇందులో సవాలక్ష హంసపాదు లున్నాయి: ఊళ్లో ఎవరింటోనో రాచకార్యమైతే, పిల్లదాన్ని చేరదీసి, - అరమరిక లేకుండా తతంగం యావత్తూ నూరిపోసి, - శ్రమ లేకుండా పొక్తుపరచి ఉండేవాడే!-

కాని, ఇక్కడ, - కన్నబిడ్డ: తానుగా కదిపి చూసేందుకు వీలులేదు: పోనీ, - చూపెడితే అందుకుపోయే మచ్చా అంటే, యింటి అనవాయితనుబట్టి పిల్లది, ఏమాత్రమూ నోట్లో నాలుక లేకుండా, పచ్చి మడిగా పెరిగింది: నట్టింటికి వచ్చినవాడు, సాక్షాత్ మేనత్తకొడుకు, - నేడో రేపో కాబోయేనాథుడు, అని బొడ్డు ఊడినప్పటినుంచీ తెలిసేవున్నా - బేజారుగా సిగ్గుపడటం, తలుపుచాటున నక్కడంతప్ప, - ఆ చిన్నదానికి, - ఆ కవళికలో మరో ఆలోచనే ఉన్నట్టు పొక్కడం లేదు: అలాటి ఇతికర్తవ్యతామూఢురాలిచేత ఇంత నిర్వాహకం చేయించాలి! ఎలా?

ఇంట్లో ఉన్నదల్లా, తానూ, తన యిల్లాలూ, కూతురు కామాక్షి, పల్లెటిదిక్కూ - అనాదిగా కలిగిన సంసారం కావడంవల్ల, లంకంత లోగిలీ - అభాండంలాగా పెరడూ: యావజ్జీవమూ, మనిషీ - మనిషీ కంటపడకుండా - ఆ యింట కాపురం చేయవచ్చు: ఇల్లు కుశలమైతే - ఎదుటపడక తప్పదు - అలా అయితే -

క్రమంగా సిగ్గు మాసిపోయి, – కన్ను చనువన్నా ఏర్పడేది.

పోనీ; – అలాటి ఏర్పాటేదన్నా చేస్తే –

ఆలూమగడూ ఆలోచించుకుని, – పొరుగూరి తీర్థానికి ప్రయాణం కట్టారు: యింట్లో చిన్నవాళ్ళనిద్దరినీ దిగవిడిచి: మర్నాడుదాకా రామన్నారు: మేనమామ వెళుతూ వెళుతూ దాసుతో – "సిగ్గుపడక ఏంకావాలంటే అది అడిగి చేయించుకో!" అని మరీమరీ చెప్పాడు: కూతురికి, తల్లికూడా చెప్పదగినంతమట్టుకు బుద్ధులు చెప్పింది: ముసలాయనతో, – వీళ్ళనోకంట కనిపెట్టి ఉండమని చెప్పి – వాళ్ళు చక్కాబోయినారు: మర్నాటికల్లా తిరిగివచ్చారు:

వచ్చినతరువాత విచారించగా తేలిన సారాంశమేమిటంటే – పిల్లదివెళ్ళి తాతగారింటో కూర్చుంది: దాసు యింట్లోనే స్వయంపాకం చేసుకుని నిశ్చింతగా భోజనంచేసి, – పడుకున్నాడు: సంజెపూటన్నా తనయింటికి వస్తాడేమోనని, – ముసలాయన పిలవడానికి వెళ్ళేసరికి, – పళ్ళురాలినంతపనై, – పశువుల సావడిదగ్గర పడిఉన్నాడు: ఏమిటిరా నాయనా అంటే! ఉలకడు పలకడు –

మేనమామకు, కూతురిమీద వల్లమాలినంత కోపం వచ్చింది. "నీవు మనిషివా– పశువ్వా?–" అని, ఒకటికి పదిసార్లు అన్నాడు: కాముడు మొగం యింతచేసుకుని, – పోయి పశువులశాలలో ఒక గడ్డి మేటమీద వాలింది·

మేనమామ కూతుర్ని తిడుతూంటే – ఒక్కొక్క విడతకూ దాసు ముఖంలోకి, ఓ కొత్తకాంతి వచ్చింది: పిల్లదాని వెనువెంటే వెళ్ళాడు: దాసును పొడకట్టి కొట్టంలో ఉన్న లేగలు, – కుమ్మే ఉరవడికోసం నడుములు రిక్కించినాయ్– దాసు తిన్నగా, – కాముడి పడిఉన్న చోటు చేరుకున్నాడు:

పూర్వకాలంలో, గ్రీకుదేశపు కథల్లో – ఓ తమాషా సంఘటన ఉది: ఓ చక్రవర్తికి, – మనిషి ఒళ్ళు, ఎద్దుతలకాయతో రాక్షసిబిడ్డ పుట్టుకొచ్చింది: అదే, సింహం తలకాయ అయితే, తండ్రి జాగ్రత్తపడి ఉండేవాడేమో, – కాని – ఎంత కుమ్మేధీమా ఉన్నా పులుమేసే జాతేకదా ఫరవాలేదు అనుకుని, – పుట్టుక గోప్యంగా ఉంచాడేతప్ప, మరేం కట్టుదిట్టాలు చేయలేదు. అది దేశానికి ఉపద్రవంగా పరిణమించింది: పిల్లవాడు ఎదిగినకొద్దీ – ఎద్దుతలకాయ, – కోరలు పెంచి, – మాంసంతప్ప మరోపదార్థం ముట్టకుండా, – కనబడ్డ ప్రాణినల్లా చీల్చుకుతినడం మొదలుపెట్టింది: అంతటితో, కన్నతండ్రి కళ్లు తెరిచి, – తగిన బందోబస్తు చేశాడు: ఎలాగంటే –

నెత్తిమటుకు ఎద్దైనా, – ముప్పాతిక మువ్వీసం ఎత్తింది మనిషిజన్మకదా, – ఏపైన ఆడగాలి సోకితే, – ఆ ధూకుడుతగ్గి లొంగిపోవచ్చు అని ఎవరో సలహాచెప్పగా, – ఆ ప్రయత్నమే చేసిచూశాడు తండ్రి: కాని అది బీభత్సంగా పరిణమించింది: బోనులోపడ్డ పిల్లలు పొలికేకలు పెడుతూంటే, – వింటూన్నవాళ్లూ అది తొలి బెదురనుకున్నారు: తీరా చూసేటప్పటికి – ఎముకలుతప్ప ఏమీమిగలలేదు: ఆ రాక్షసిబిడ్డకు ఆకలిలో తేడాలు తెలియవు: కంటపడ్డ ప్రాణిని నమిలి మింగడమే తప్ప మరోవిధంగా అనుభవించడం తెలియదు – ఎవరో చేయిచేసుకుని హతమార్చేదాకా, – అలాగే బ్రతికాడు–

కాముడు బళ్ళో చదువుకున్న పుస్తకంలో, ఈ కథ – పెద్ద బొమ్మలతో సహా–ఉంది:

బావ రంకె వేశాడు: విని, ఒళ్ళు తెలిసి తల ఎత్తి చూసింది: దాసు అచ్చంగా పుస్తకంలో రాక్షసుడల్లేనే కనిపించాడు: ఇంకో అడుగు ముందుకు వేస్తాడు: పట్టుకుంటాడు: అప్పుడంవిరిచినట్లు ఒంటిచేత్తో పెళపెళలాడించి మెక్కేస్తాడు:

ఆ నిలుచుకున్నది–బావకాదు: ఏదో రాక్షసి, – రాక్షసికాదు–అదో జంతువు: చేలో మేసే జంతువుకాదు: ఏదో మెకం:– తరతరాలుగా అడవుల్లో, కీకారుకోనల్లో అలమందల్ని మేపుకుంటూ చేతివాడి మీద వర్ధిల్లిన జాతి, – కొండకూ కోనకూ, ఆ నిర్భయానికీ దూరమై, – ఏనాడో అపాటిసత్తువ క్షీణించిపోయినా, – అలవోకగా అద్దిగర్భంలోంచి బడబా, తలవిసిరినట్లు, రవ్వంతగా రగిలింది; కప్పుదండె, – ఎగిరి అందుకుని, – కాముడు, గుండె విచ్చుకునేట్టు తన్నింది దాసును; కూలినకళేబరాన్ని, యువతలకు యీడ్చుకువచ్చి పడేసింది: మోపుతాడు సడలిన గడ్డిమేటికిమల్లే పడిఉన్నాడు దాసు: చూసి, – నవ్వొచ్చి నవ్వింది.

ఆకలింపై – మామయ్య ముసిముసి నగవులతో యింట్లోంచి వచ్చాడు: చూసీ చూడటంతోనే – "ఏమిటే!–" అన్నట్లు నిర్ఘాంతపోయినాడు:

కాముడు, నసుగుతూ, – "ఎలాఉన్నాడు – బావ?" అంది.

"బ్రతికి ఉన్నాడా?" అని మామయ్య దడఎత్తుకొచ్చి అడిగాడు. అడుగు ముందుకు వేశాడు: కాముడు ఆపేసింది:

"బ్రతికితే మనల్ని బ్రతకనివ్వడు!–"

"–నివ్వక?"

"అందర్నీ భోంచేస్తాడు: అది నీ కిష్టమేనా?–అందుకోసమే వెంటబెట్టుకు వచ్చావా?–"

ఇంతలో, కాముడుతల్లి వచ్చింది, నీలాటి రేవునుంచి; ఆ వెనుకాలే తాతగారు వచ్చారు: ఆ వెంట మరికొందరు ఇరుగు పొరుగువారు మూగారు:

"అనుకున్నంతా జరిగిందన్నమాట! ఆ భూతం మ్రింగేయకుండా విడుస్తుందా!–నేను అప్పుడే అంటినిగా!" అని ముసలాయన స్వస్తి ప్రారంభించాడు.

మామయ్య, – కొరకొరలాడుతూ, "చంపింది ఈ భూతం,–" అని పొల్లుకేకవేసి, – తనకూతురే మేనల్లుణ్ణి హతమార్చిందని, – యాగీ మొదలెట్టాడు!

ఎవరుమటుకు ఏమంటారు? – కళ్ళయెదుట ప్రత్యక్షంగా కళేబరం కనబడుతూండె – కన్నతండ్రి ఖచ్చితంగా చెబుతూండె– అయినా, – ఏమీ అనకపోతే, బాగుండదని, కొందరు, నిట్టూర్పుగా యధాలాభంగా, – "అయ్యోపాపం!" అని గొణుగుకుంటూ చల్లగా ఎవరికివారు జారుకున్నారు:

ఇంటిల్లిపాదే – మిగిలింది: ఇక ఏమిటి కర్తవ్యం?– ఎవరూ తర్జనభర్జన పడనక్కరలేకుండా, – దాసే పరిష్కారం చేశాడు: ముక్కి, మూలిగి, కళ్ళు తెరిచాడు: దాహమని సైగచేశాడు: త్రాగి లేచికూచున్నాడు:

"ఎలా బ్రతికాడా?" అని అందరికీ వల్లమాలిన ఆశ్చర్యం: బ్రతికితే మళ్ళీ తంటాయేగదా, అని తలచుకొని పాడలు: ముసలాయన సర్దిచెప్పి, అందరికీ ఇలా ధైర్యం పోశాడు:

"ఎలా బ్రతికాడా? – దెబ్బతిన్నది, – భూతంకాని, – వీడుకాదు: దానికి గింగురులెత్తితే, – అవలంబనంగా ఉన్న యీ కాయం చట్టుయిపోయింది: దాని త్రోవను అదిపోయింది: మనవాడు మనిషల్లే బ్రతికాడు – చూడండీ ఆ పీరసం!–"

దాసు, నిజంగానే బ్రతికాడు: క్రమంగా రెక్కాని ప్రజల్లో పడ్డాడు: కాని, – అంతా, గతమంతా మరచిపోయినాడు! చదువుకున్న చదువంతా తుడిచిపెట్టుకుపోయింది! పిచ్చకవలిక ఏమీలేదుగాని, వంచిన తల యెత్తడు: అడిగితేనే తప్ప సమాధానం చెప్పడు: నవ్వూ ఏడ్పూ ఈ రెండూ కూడా లేవు:

మునుపు వాడంటే హడలిపోయిన జనాభా – ఇప్పుడు జాలిపడుతూంది: "ఇలాంటి బ్రతుకు, – ఏం బ్రతుకు!" అంటుంది: "ఇదీ ఒకరకం పిచ్చే" అంటుంది:

కాముడికి పెళ్ళికాలేదు: ఎవడూ చేసుకునేందుకు ముందంజవేసి రాలేదు: కథలో లోతుపాతు తెలియకపోయినా, – "ఎద్దంటి మేనత్తకొడుకును ఎగిరి గుండెల్లో తన్నింది, – మన్ని బ్రతకనిస్తుందా" అని, – అయిన ఈడువాళ్ళందరూ బెదిరిపోయినారు:

కాముడికి ఈ చీకూచింతా ఏమాత్రమూ లేకపోగా, – ఆ మాట ఎత్తితే విరగబడి నవ్వుతుంది: ఇలా అంటుంది:

"మాకు పెళ్ళికేం తక్కువ? – మా బావకడుపునో కాయకాస్తే. వాణ్ణి కట్టుకుంటా:–బావకా, – నాకో కూతురు పుడితే దాన్ని మెడకు కడతా–"

"మేనత్త మేనమామ బిడ్డలు–దీనికీ పిచ్చికాదుగద!" అని ప్రజలు అనుకోవడం కద్దు! ఇంతకుమించి కథ పెగలదు...

★ ★ ★

# పద-వర్ణం

నేను తాగను: (అని నేనే అనేది:) తాగనంటే, అదేదో పరమ-నిషేధమనీ, అసలా అలవాటే ఎన్నడూ యింటా-వంటా లేదనీ కాదు- ప్చ్...ఏం లేదు. ఈమధ్య ఎందుచేతనో తాగడం లేదు:

మరి, రోజూ ఆ తాగివచ్చేది? ... అతను సీనయ్య.

సీనయ్య చాలా పెద్దమనిషి: వర్ణి మర్యాదస్థుడు: నేను ఎరుగున్నంతలో, అతని కన్నుదోయికి ఎన్నడూ అన్యకాంతలు అడ్డమంటూ వచ్చిన పాపాన పోలేదు:

సీనయ్య తాగుతూన్నట్టు నిక్కచ్చిగా నాకు ఒక్కడికే తెలుసును: ఆఁ- అంతేలెండి. అలా అనుకునేందుకు సిసలైన కారణములు ఉన్నవి: కాని, ఒట్టుపెట్టుకున్నట్టుగా ముప్పొద్దులూ ఎందుకు తాగుతున్నాడో, నాక్కూడా తెలియదు సుమండీ!

సీనయ్యా నేనూ కలిసి చిన్నప్పటినుంచి పెద్దైదిగే దాకా ఒక బళ్ళోనే ఈడూ-జోడూ-గా చదువుకున్నామనీ, పసితనంనుంచీ కూడా చాలా మమేకంగా ఉండేవాళ్ళమనీ...ఒకళ్ళంటే ఒకళ్ళం నాటికీ-నేటికీ ప్రాణం విడుస్తామనీ... యీ వైనాలన్నీ మా యిరుగూ-పొరుగు వాళ్ళకు ఏం తెలుస్తాయి?-అసలే ఆ వాడకట్టున నాకు అంత మంచిపేరు లేదు...కనుక పోయిందేమీలేదు ఇవాళ నాకు కొత్తగా...మాయింటికి వచ్చేవాడు, ఆ సందుకుండా, సజావుగా మామూలుగా అందరు మనుష్యులలాగా, నడవకుండా, కాళ్ళు పైకెత్తి చేతుల ఆధారంతో కప్పదాట్లుగా వచ్చినా, లేక పిల్లి మంత్రంవేసి మా గుమ్మందాకా దొర్లుకుంటూ వచ్చినా...ఎవళ్ళూ విడ్డూర్యంగా చూడరని నా నమ్మకం: అలాంటప్పుడు ఎవడో ఒక అర్భకుడు ఒక్కవీస పాలు అడుగు-అటూ యిటూ వేస్తూ, గాలిలో, పదేసి అడుగులకు ఓ పర్యాయం ఒక్క అంగుళం మేర తూలుతూన్నాడంటే...అదొక లెక్కా జమా?...కనుక, "వీడూ ఓహో గ్రంథసాంగుడులాగానే ఉన్నాడే" అని మా వాడకట్టు జగజెట్టుల ప్రశంసాలేశాన్నైనా సంపాదించుకునే యోగ్యత, సీనయ్యకు అబ్బలేదు: మా వాడ - కట్టు ఒక్కటేమిటిలెండి, అసలు లోకంతీరే యిలాఉంది. తాగిన తరువాతకూడా, తలవంచుకుని తనదారిని తాను పోయేవాడు. దానిదృష్టిలో...మనిషి కాడు. వర్ణిపశువు... సరే దానికేంగాని...

"ఎందుకు తాగివస్తున్నావు భాయీ?" అని అడగవలసిన అవసరం నాకు లేదు. మీరు వెయ్యి చెప్పండి - లక్ష చెప్పండి, ఒక మనిషి తాగితే చెడిపోతాడని...నాకు ఎంత మాత్రము, ఈనాటివరకూ, నమ్మకములేదు...

...ఒక వేళా-పాళా అనకుండా, పొద్దోయీ-పొరమారీ వచ్చేవాడు. యిష్టం ఉంటే నాతోబాటు వేళకు యింత కలో-గంజో త్రాగేవాడు. ఇక్కడే నిద్దరోయేవాడు.

"నిక్షేపంగా యిల్లూ వాకిలీ ఉండగా నీకు ఇదేం ఖర్మంరా?" అని నేను అడుగనూలేదు. ఎన్నడూ వాడిని ఏ విషయంలోనూ పల్లెత్తుమాట అనడం..అలవాటులేదు.

కానీ, ఇలా ఎన్నాళ్ళు జరగాలో అని, నా మానాన నేను ఊరుకున్నాను.

ఆవాళ మధ్యాహ్నం, సీనయ్యపెళ్ళాం, మా యిల్లు వెదుక్కుంటూ వచ్చింది.

"రా అమ్మా, రా!" అని నేను పలుకరించనూలేదు.

"ఏరీ అన్నయ్యా, ఆయన" అని ఆ చిన్నది పలువిప్పి అడుగనూలేదు.

ఆ అమ్మాయి, గుమ్మంలోకి వచ్చింది.. గుమ్మంలోంచి లోపలి హాల్లోకి వచ్చింది... అక్కడే నిలుచుంది... పోయి ఆ కుర్చీలో కూర్చుంది .

ఆ పిల్లది అడగలేదన్నమాటే కాని...నేను ఏదో మహా - హడావుడిగా ఉన్నట్టు అటూ యిటూ తిరుగుతూ, అవీ-యివీ అక్కడివిక్కడా - ఇక్కడివక్కడా సర్దుతూ, ఆ వంక చూడకుండా ఉన్నా, నేను యెటుచూసినా యెదుట ఉన్న ప్రతివస్తువూ...వేయిగొంతులతో నన్ను ఆ ప్రశ్నే అడుగుతూంది...

"అదిగో ఆ లోపల ఉన్నాడు. అవతల గదిలో పడుకున్నాడు" అని నేను వేరే చెప్పనక్కర్లేదు. ఆ అమ్మాయి లోపలికిపోయి చూడకూడదూ?

...సీనయ్య...అక్కడికే వచ్చాడు. తనంతట తానే వచ్చాడనుకోను ఆ అమ్మాయి ఆత్మశక్తి అంత దొడ్డది అనిపించింది...నా వళ్ళు గిరుక్కున అటువేపు తిరిగింది...

సీనయ్యను చూడగానే ఆ చిన్నదాని రెండుకళ్ళూ ఒక్కచూపున మణిలాగా మెరసినవి..సీనయ్య ఛెళ్ళున కమిచీదెబ్బ నిలువునా తిన్నట్టు లోపలికి దూదిపింజెకుమల్లే యెగిరిపోయినాడు. ఒరుగాలి కొట్టినట్టు తలుపు ఠఫేన పడ్డది...

నాకు కళ్ళు తెరిపినపడి, తలయెత్తే సత్తువలోకి మెడ సడలే వ్యవధానంలో...సీనయ్య భార్య వెళ్ళుతున్నానని అయినా చెప్పకుండా, సడీ చప్పుడూ లేకుండా వెళ్ళిపోయింది...ఆ కుర్చీవంక చూడటానికి జంకాను. అది యెక్కడ యెగిరి తంతుందో అని భయంవేసింది...

సావిట్లో బల్లమీదా, కుర్చీల్లో సోఫాల్లో పడివున్న సమస్తసామగ్రీ; పుస్తకాలు, కలాలు, రాళ్ళు - రప్పలూ, దిళ్ళూ దిసమొలలూ...అన్నీ, అక్కసుతో యెగిరివెళ్ళి "తీస్తావా తియ్యవా?" అని ఆ తలుపుమీద పోయిపడ్డాయి... అది బద్ధకంగా..అనుమానంగా తెరుచుకున్నది...ఒక్క నిమిషం ఉండి సీనయ్య బయటికి వచ్చాడు...

"ఏంరా సిగ్గులేదూ?" అన్నాను. కోపం భగ - భగలాడుతూంది కాని, అంతకన్న కొట్టినట్టు దురుసుగా యెలా అనాలో నాకు చేతగాలేదు. సీనయ్య, చీమన్నా కుట్టనట్టుగా వినిపించుకునీ - వినిపించుకోనట్టుగా...నిర్లక్ష్యంగా నన్ను యెగా-దిగా చూసి "నువ్వూ యింతేనా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అంతేనా అంటే?"...నాకు వాడి ఊహ ఏమిటో అర్థం కాలేదు.

"అందరిలాంటి ఫూల్‌వే అన్నమాట."...వాడు నదురూ బెదురూ లేకుండా ధైర్యంగా అనేశాడు. నాకు కోపం రావడానికి...జంకింది; కాని లోలోపల కుత - కుతమంటూంది.

"నువ్వా యింతేనా?– అయ్యోపాపం... ఆ యిల్లాలు...ఆ బంగారుతల్లి వెదుక్కుంటూవచ్చి పడిగాపులు పడివుంటే యీ పనికిమాలినవాడు...బుద్ధిలేకుండా చూసి తలుపువేసుకుంటాడూ? అంత తామసానికి. .అలా కంటిచూపూ – నోటిమాటా లేకుండాపోవడానికి ఆ చిన్నది చేసిన మహాపరాధం ఏమిటయ్యా?"

"ఇదేనా నీ మనసులో ధోరణి?..." సీనయ్య గద్దించాడు:...ఇన్ని చిలవలు–పలవలుగా ఆలోచించలేదన్నమాటే కాని, అసలు సాపుగా ఊహ అదే కాదని యెలా అనగలను?...నా నదురుడు పరకాయించి, సీనయ్య ఇహ ఒంటికాలిమీద లేచాడు...

"ఒరేయ్! నీవు యింకా సత్యకాలపు మనిషివి. ముక్కుకు సూటిగానే ఆలోచిస్తావు. కొందరు ఉన్నారు అక్కడక్కడ మహానుభావులు...అతిరథులు: మహారథులూను. ఇదే వాళ్ళ కంటబడి నట్టాయెనా అందలంలో యెక్కించి పధ్నాలుగు పేటలు ఊరేగించక పోయినారూ?...పెళ్ళాంమీదా పుట్టెడుకోపం ఉండి, నమిలివేద్దాం–మింగివేద్దాం అన్న అక్కసులో ఉండి, ఆ యింటిపట్టున అన్నా ఉండకుండా, నా కంట నరుడూ, నరుడికంట నేనూ పడరాదు. అన్నట్లు కన్నానటోయి కన్నానవచ్చినట్లు, ఏ జోలీ – శొంఠీ లేకుండా కాలక్షేపం చేస్తుంటే, తగుదునమ్మా అనుకుంటూ, మళ్లా యిక్కడికి ఏం ముఖం పెట్టుకు ప్రత్యక్షమైనావు? – చేసిన నిర్వాకం చాలదా?...అంటూ సాగదీసి యీ చెంపా ఆ చెంపా వాయికొట్టకుండా...సిగ పాయతీసి తన్ని తగిలేయకుండా, తాను ఏ పాపమూ ఎరుగకపోయినా, తనకు ఆ చిన్నదాన్ని చూడటానికి మొగం చెల్లనట్టు తలుపుచాటున దాక్కున్నాడే కాని, ఆ రాకాసిని చిన్న మెత్తుమాట అనలేదు, ఫ్ఛీ–యీ కలికాలంలో పుట్టవలసినవాడు కాదు...అని నన్ను చూసి హర్షించనివాళ్ళు, జాలిపడనివాళ్ళు ఉండేవారు కాదంటావా?..."

ఆ వాగుడుకు దరీ – అంతూ కనబడటంలేదు...సరే, వాడికెంత ముచ్చటగా ఉందో, వాగి–వాగి వాడిమానాన వాడే ఊరుకుంటాడులెస్తూ అని వినీవిననట్టు నేనూ ఓ చెవివప్పగించి ఊరుకున్నాను. పోనీ, పాపం వాగనీండి...మాటలకు యీ నడుమ యిద్దరమూకూడా మొగంవాచిపోయినాము, వాడు ఎప్పుడూ పిలిస్తే వినిపించుకునే ధోరణిలో ఉండేవాడు కాదాయెను. వినిపించుకున్నా ఉలికేవాడూ – పలికేవాడూ అసలే కాదాయెను...సరే కానీండి, మాటలు ఇంగ్న మార్మోగడం యింటికీ వంటికీ కూడా మంచిది.

"ఏంరా, ఏం మాట్లాడవేం?"

– ఏం మాట్లాడేది? అనలేనిమాటలన్నీ పేని మూలిగాను.

"అవునా, కాదా?"

– తల అయినా వాడికి తెలిసేట్టు ఊపక తప్పేట్టులేదు. సీనాయ్ నావంక అలా రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. నాకు చూస్తున్నంతసేపూ నా తలకాయి వాడి కన్నుసన్నల్లో మెలుగుతూన్నట్లుగా...ఆడుతూనే ఉంది...

సీనాయ్ కళ్ళల్లో పాడి ఆరిపోయింది, జాలిగా చెమ్మగిలినవి.

"నీవన్నమాటలలో ఎంత నిజం ఉన్నదో నీకు తెలియదురా!" అంటున్నాడు ప్రాధేయపడుతూన్నట్టు...'అంటే?' అని నేను మౌనంగా ప్రశ్నించక తప్పదుకదా...

"ఏంరా నాకు సిగులేదూ?"

– దానికి ఉంది – లేదు అని ఖచ్చితంగా సమాధానం చెప్పడానికి నాకు తరం కాదు.

"మా ఆవిడమీదకోపం కాదురా. సిగ్గుపడి అవతలికి తప్పుకున్నాను.."

"నిజం?"

ఆశ్చర్యంవేసి అడిగానన్నమాటేగాని; వాడి వాలకం చూసిన తరువాత ఆ సందేహం ఏమీ లేకుండాపోయింది...ఆ సంగతి ఒప్పుకున్నందుకు ఎంత లజ్జించుకున్నాడో...ఎందుకూ, తెలిసిపోవడంలేదూ?

"నీకు ఎందుకురా మధ్య అంతసిగ్గు...కుల–పతివి గాని, సతివికాకపోతివి –"

"తాగుతున్నానని ఆమెకు తెలుస్తుందేమోనని..."

"ఏమో తెలిస్తే?"

"ఏమూ?...ఏమో!" వెయ్యికారణాలు వాడికళ్ళు చెప్పినవి. అయ్యోపాపం అనుకున్నాను...జాలితో కాదు సుమా, అంతో యింతో గౌరవంతో.

"ఏంరా. పోనీ, నీకూ ఆవిడకూ అంత యిష్టం లేనిపని చేయాలిసిన అగత్యం ఏం వచ్చింది?...యిది మూణ్ణాళ్ళ ముచ్చటేకాదూ?...ఏం పుట్టినప్పటినుంచీ తాగుతున్నావా? అది లేకపోతే ఉండలేవుగనుకనా? ఇంతకూ నీకు మీ ఆవిడ ఎక్కువా? ఈ తాగుడు ఎక్కువా?"

"అలా అడిగితే ఏం చెప్పనురా? మా ఆవిడను మించిన వస్తువు సృష్టిలో యింకొకటి నాకేం లేదురా! ఆవిడ సౌఖ్యం కోసం నేను ఏ త్యాగానికైనా వెనుదీయనురా?...కాని..."

"ఊఁ–కాని–"

"తాగక తప్పదురా!"

"అలాగేం?"

"అవునురా, నా బాధ నీకు ఎలా అర్థం అవుతుంది?"

"బాధ ఏమిటో చెపితే..."

"...వంగ రాజ్యంలో దుస్సహ దురంత క్షామతాండవం...అబ్బ, అది తలుచుకుంటే...ఆ మాట వింటే... హుఁ...అది మరచిపోయేందుకు తాగందీ బ్రతుకలేనురా..."

– "అవును, సీనయ్యా–యే ఆ మాటలు అంటూన్నది" – అని నాలో మనసుకు నచ్చచెప్పుకున్నాను.

పెద్దపెట్టున లోకాన్నంతా ముంచి ఎత్తేటంతటి నవ్వు ముంచుకు రాబోయింది. కాని మనసులో మనసు 'ఏమిటే భడవా, ఏం తెలిసిందని నీకు అంత యద్దేవా?' అంటూ చెంపలోపల ఛెళ్ళున కొట్టింది.

"అంతేనా మరి! అంతకన్న ఏం చెయ్యమంటావు చెప్పు?..." సీనయ్య ప్రశ్న నన్ను తరుముకు వస్తూంది... నవ్వుకూడా వస్తూంది...

తాగడం ప్రారంభిస్తే నవ్వడం మరచిపోగలనా – లేదా?...ఛస్ – ఆమాట అనుకుంటేనే నవ్వువచ్చేట్టుంది.

నవ్వితే సీనాయ్ దీక్షకి అపచారం చేసినట్టు!

అందుకనే...నేను తాగను!

# కనుకరిలి

అమవస ప్రొద్దులు. మునసబుగ్గారి పశువుల సావడిలో, కరణంగారి గంగిగోవు నొప్పులు పడుతూంది. అక్కడ ఊరూ నాడు ఏకమైంది.

– అసలు కరణంగారి వెల్లావు కడుపుతూన్నదని, ఆ నోటా ఆ నోటా పొక్కగానే, ఎవరికి వారు ముక్కుమీద వేలేసుకున్నారు. – 'ఎంత చోద్యమమ్మా!' అనుకున్నారు. పొరుగూరినించి పనివేళా భత్యాఖర్చులు పుచ్చుకునివచ్చిన సహదేవుడు అటు పట్టిచూసి ఇటు పట్టిచూసి. పొత్తికడుపు మీద వేలు తాషా వాయించిచూసి, జాపక్కా ఝామున, మొత్తంమీద తేల్చి చెప్పాడు–కడుపైనా కావచ్చును అని. వినీ వినడంతోనే కరణంగారు నిలుచున్న పొళాన ఎగిరి గంతేసి గుళ్లో రుద్రాభిషేకం చేయించాడు!

ఆ సంబరానికి కారణం ఉంది! కరణంగారి యిల్లాలు కాపురానికి వచ్చి యిప్పటికి మూడు పదులు దాటింది! యిక వడసారం ఏడాదికో ఏణ్ణర్థానికో, మొగవాడు మూడు రోజుల పట్టపగలూ చేయి కాల్చుకోవలసిన అగత్యం కూడా తీరిపోతుంది. కాగా పోగా, ముచ్చు–ముప్పై ఏళ్ళలోనూ, శాపంపెట్టినట్టు ఏ నెలకానెల ఆ మూణ్ణాళ్లూ పంచలో చెంగు పరచుకుని అఘోరించడమేకాని, నాలుగు రోజులు అటోయిటో అయిన పాపానన్నా పోలేదు. నోచిన నోములన్నీ ఏ గంగలో కలిసినవో?

పోతే, ఆ యిల్లాలి అనువాయితే, యింట కట్టేసుకున్న తువ్వాయికీ వచ్చినట్టుంది. దాని యీడువన్నీ యీపాటికి మనవల్ని ఎత్తినాయి. అదిమటుకూ నిమ్మకు నీరెత్తినట్టు యెన్నడూ హడలందే! దానికి అసలా సలసలే ఉన్నట్టులేదు.

ఉన్నట్టుండి ఈ విడ్డూరం పుట్టుకొచ్చింది–

ముదురు నొప్పులు వస్తున్నాయి. మూగజీవం తీయలేని తీత తీస్తూంది. కళ్ళు తేలవేస్తూంది. కరణంగారు వెయ్యి దేముళ్ళకు మొక్కుకుంటున్నాడు. కాలుకాలిన పిల్లికిమల్లే కలయ తిరుగుతున్నాడు. అంభా అన్నప్పుడల్లా అంత మనిషి గుడ్లమీద కుక్కుకుంటున్నాడు–

మొక్కిన మొక్కుల ఫలాన–మెట్టుకు గండం గడచింది. పురుడూ పుణ్యం అన్నీ సక్రమంగా జరిగించాడు కరణంగారు. కోడెకు కరణంగారి నాన్నగారి పేరు – నరసయ్య పెట్టుకున్నాడు. ఊరంతా, యింటియింటికీ పటికిబెల్లం బాదంపప్పులూ పంచిపెట్టారు – నెలపురుడు వెళ్ళగానే నరసయ్య పేర కరణంగారు, ఓ నన్నూరు రూపాయలకు జాతీయ పొదుపుపత్రాలు కొన్నాడు. మెళ్లోకి అంజనేయులు బిళ్ళా పులిగోరూ చేయించాడు. లేగడు అల్లారు ముద్దుగా దిన దిన ప్రవర్ధమానుడౌతున్నాడు.

ఏడాది వెళ్ళిందనగానే, ఓనాడు, అల్లవారి ఆడబడుచు సిగచుట్టుకుని, నలుగురూ నడిచేదారిని పోక, డొంకదాటి కందచేనుకు దరిదాపుల్లో కలయదిరుగుతూంటే

గాలివాటుకు చెంగుచెదరి, ఆ పాటున చెంగు చెంగానికి నరసయ్య బెదిరి, చెంగున మీదికి వచ్చిపడి, వచ్చీ రాని కొమ్ములతో కోరాడు. ఆ చిన్నది ప్రైప్రాణాలు పైన పట్టుకుని నోటమాటలేక పలుకులేక–ఎల్లా వచ్చిపడ్డదో ఊళ్లోకి. నలుగురూ పోగైనారు. 'ఎవడ్రావాడు!'–అని బొబ్బ లెట్టుకుంటూ కర్రలందుకున్నారు. పిల్లది, ఆసరికి తెప్పరిల్లి, 'నరసయ్య!' అంది. ఆ మాటకు నవ్వేవాళ్ళు నవ్వారు. ఎత్తి పొడిచేవాళ్ళు ఎత్తిపొడిచారు.

పిల్లదాని తండ్రి కరణంగారి దగ్గర ఆగిచేశాడు. కరణంగారు, వినీ విననట్లుగా 'పోనిద్దూ బావా! ఏదో కుర్రతనం!' అని అప్పటికి సర్దిచెప్పి ఆ పెద్దమనిషిని అటు వెళ్ళనిచ్చి నరసయ్యను పట్టుకు ఆ చెంపా యీ చెంపా మెత్తగా వాయించి – 'ఎక్కడికి పోతాయి, దిక్కుమాలిన పోలికలు!' అని విసుక్కుని – 'పుటక మారినా బుద్ధులు మారలేదు!' అని తండ్రిమీద కసురుకుని "అది మనకు లాయక్ కాదురా నాయనా! నలుగురిలో ఔననిపించుకోవాలి! పెళ్ళీ పేరంటం కావలసిన వాడవు ఇప్పటినుంచే ఇలా పరవళ్ళు త్రొక్కితే ఎవరిస్తారురా నీకు పిల్లను?–" అని నయానా భయానా చెప్పి చూశాడు. కాని, పూజారి అప్పయ్య అన్నట్టు–ఆ, గడ్డితినే – బుద్ధి ఎక్కడకు పోతుంది. ఏరోజుకు ఆ రోజు ఏదో ఓ కుమ్మరాం యింటిమీద వచ్చి పడుతూనే ఉంది!

ఇవాళమటుకు – ఇవాళ ఉదయం అవధాన్లగారి మడిధోవతికాస్తా చెరిసగానికి మేసేశాడు. నిన్నమటుకూ నిన్న, వెంకమ్మత్త సవతికూతురు ఎంతో ప్రాణపదంగా, నరుడికంట ఈసరికి పడకుండా, ఎక్కడో ఏడంతస్థుల్లో దాచుకున్న విగ్గు, వంటయింటి గుమ్మంముందు ఎండలో బెడితే, ఎట్టా పసికట్టాడో, అమాంతం మొండిగోడ దూకివచ్చి నోట కరచుకుని ఆ ముద్దరాలు, 'మొర్రో దాంతో నీకేం పనిరా!' అని ఎంత మొత్తుకుంటున్నా, చెవినిబెట్టకుండా పారిపోయినాడు. ఇవన్నీ, బ్రతికి బాగుపడే వాడి లక్షణాలేనా! – వీడికి వెరచి, వీడి హాములికి వెరచి, పచ్చని యిల్లా లెవ్వతే నడివీధికి రా భయమైతే!–

కరణంగారి ప్రాణం మటుకూ విసిగిపోదూ–ఎద్దులాగా ఉంటె–కొట్టే ఈడా తిట్టే ఈడా? అక్కసుకొద్దీ ఆ తల్లిని బట్టుకు చడామడా దులిపేశాడు! – 'ఏ తలకు మాసిన దున్నపోతుకు కన్నావే వీడిని!' అని దుయ్యబట్టుకున్నాడు. ఆ దెబ్బతో పాపం, ఆ యిల్లాలు రెండు రోజులు మేత నోటి దగ్గిరకు రానిస్తే ఒట్టు!–

"పోనీ, చెడ్డవాడు ఎలాగూ చెడ్డవాడుకదా – అచ్చోసి వదిలేయరాదా!–పుణ్యమూ పురుషార్థమూ ఉంటుంది!–" అని, ఎన్నడూ కలిపించుకోని మునసబు మాట వరుసకు సలహాయిచ్చాడు. కాని, కరణంగారికి అంతపనికి చేతులు రాలా!

ఎంత చెడ్డా, కన్నకడుపు కాకపోయినా, ఎత్తుకు చంకవేసుకోకపోయినా – పెంచిన మమకార మాయెను! ఇహ ఇలా కాదనుకుని, మంచి రోజుచూసి, కమ్మరాడికీ బత్తుడికీ పురమాయించి, పొట్టింగా ఒక్కడు ఎక్కేందుకు సరిపడ్డ బండీ చేయించాడు. నరసయ్యను కాడిక్రిందికి లాగి, తాను ఎక్కి కూర్చుని కమిచీతో ఇట్టే అన్నాడు. ఇహచూసుకోండి, నరసయ్యకు నేలకు కాళ్లానలా!–ఆగ మేగాలమీద, బండీ – బండీతో ఏటి గట్టుకు ఎగబడ్డాడు– మొదటిగతుక్కే కరణంగారు ఎగిరిపోయి, మూడు పిల్లి మంతరాలువేసి, ముక్కుమన్ను గాకుండా, పదిబారల దూరంలో

ఉన్న రక్కిస పొదలోకి దొర్లుకుంటూ పోయి గుచ్చుకుపోయినాడు.

ఆ దెబ్బతో కరణంగారికి తలతిరిగి నోట్లోకి వచ్చింది – ఆ పడిన పాటుకు, మళ్ళీ ప్రజల్లో పడలా!–

అంతటితో, నరసయ్య గుక్క తిప్పుకుని, – అటునుంచి అటే కాలికి బుద్ధిచెప్పాడు.

పోయి పోయి, నరసయ్య, మేసినప్పుడు మేసి, తూలినప్పుడు తూలి, డెక్కలరిగేట్టు అదే దౌడున, – ఓ దారీ తెన్నూ, అనకుండా, – చేలుదాటి, – చేమలు దాటి, – వాగులు దాటి, వనాలుదాటి – మన్యంలోపడి, ఏదో మారుమూల కాలూని, అక్కడక్కడే–బితుకు–బితుకుమంటూ తిరిగాడుతూండగా–

ఓనాడు – ఓ పొద్దువేళ, అల్లంతదూరాన – ఏదో అలికిడైంది. ఏదో జీవం కదిలింది. 'అమ్మో' అని కూత వినపడ్డది. చెంగలి నోటపట్టిన నరసయ్య, చెంగున రంకె, అంతదూకూ దూకాడు. ఆకడ, ఓ ఆడకూతురు రెల్లు పోచల్లే వణకిపోతూ, గాలిమీద పైరాకుమల్లే గడగడలాడుతూ, పొద్దు తిరుగుడు పువ్వల్లే మారుమొగం వేసుకొంది. యెదరగా, యెవడో కసాయి, చెయ్యోడిసిపట్టాడు–రెట్టగట్టిగా అంకించుకున్నాడు. పిన్నది మెడ వొరగేసింది – నరసయ్య, దూకిన దూకులోనే దాపలి సూదికొమ్ము నడుముకు దిగేశాడు ఒక్క ఊపున, ఆ జీవాన్ని ఏడకో చిమ్మేశాడు.

'అంభా!' అన్నాడు నరసయ్య!

'అన్నా!–బసవన్నా!'–అన్నది–పిన్నది. మెడకు చేతులేసింది. మూపుమీద తల ఆన్చి, ఏడుపు గుక్కపట్టుకుంటూ గంగడోలు నిమిరింది.

చిన్నది, ముందు అడుగేసింది – నరసయ్య తోక రిక్కించి, ఎటు అలికిడైనా, ఉలికిపడుతూ, వెన్ను కాపుగా, అడుగులో అడుగు వేశాడు.

పుంతలో పోగాపోగా, తాటితోపు – తోపుదాటగా, కాలువగట్టు – గట్టువారనే మినుకు మినుకుమంటూ గుడ్డివెలుగు – వెలుగు వెనకాల ఓ చుట్టు గుడిసె.

గుడిసె ముంగలే – కంటికి చేయి అడ్డం పెట్టుకుని, అటూ ఇటూ పరకాయిస్తున్న – ఓ మునసబులాంటి ముసలాయన – చిన్నదాని రాకచూసి అల్లంత దూరానికే – 'అమ్మీ!' అని కేక వేశాడు. చిన్నది – ఎగురుకుంటూ పోయి, 'తాతా' అని బావురుమంది. విని – విని, ఆ ముసలాయన, నరసయ్య చేరువకు వచ్చి – గడ్డం పట్టుకుని, నుదురుమయాన ముద్దెట్టుకున్నాడు.

కట్టెయ్యకుండా, గడ్డిమేటి తెచ్చి ముందరేశాడు. కడపునిండా కుడితిపట్టారు. నరసయ్య ఆ రేయి అక్కడే కునికాడు.

తెల తెల్లవారింది. సూరీడు కంట పొడిచాడు. నరసయ్య కన్ను విప్పాడు. విప్పిన కంటికి వెలుగొచ్చింది – కట్టెదర – కట్టుకొయ్యను – లేగ, దిత్తరి చూపుచూసింది.

నరసయ్య–ఉలికిపడి లేచాడు. అడుగు వెంట అడుగు అట్టుకేసి వేశాడు. ఉన్నట్టుండి – లేగ ఒళ్ళు ఝల్లుమన్నది. ఎగిరి గంతేసి కట్టుతాడు తెంచుకుని, గంతుమీద గంతులో కమచూపు మేరకుపోయి – ఆగి ఓరగా ఇటు చూసింది. నరసయ్య పరుగు అందుకున్నాడు.

ఆ పరుగు పరుగు ఎండ వెలుగు నకనకలాడుతూండగా, ఓ కోవెలో, ఓ మావి పీడను ఆగింది. ఆగినంత పట్టున, పచ్చిక, అడుగుల మేరకు దించుకుపోయింది.

సంజవేళకు, ఆడమనసూ, ఇంటి మొగమైంది. కాని, – నరసయ్య – అడుగు అటు పడనీయలా!

ఆ జంట – నరుడికంట పడనంత దూరానికిపోయింది.

ఎన్నాళ్ళకో, ఓనాడు, తెల్లవారుతూందనగా, మింట వెలుగు మసికారకముందు – తొలికోడి కూత–మారు కూత మయాన–నరసయ్యకు – కొడుకు పుట్టాడు.

పుట్టిన బిడ్డను చూడగానే – నరసయ్యకు తన పుట్టుక జ్ఞాపకం వచ్చింది. తండ్రిపడిన సంబరం గుర్తుకొచ్చింది – పడిన ముచ్చట యాదకొచ్చింది. తండ్రి కళ్ళల్లో ఆడాడు. పురిటి గుడ్డుకు అడుగు నిలవగానే – తల్లినీ బిడ్డనూ వెంటేసుకుని, నరసయ్య – నేలకు అడుగాన్చకుండా – ఒక్కటే పడిలో, తన ఊరొచ్చాడు.

పొలిమేరల్లో పొద్దుగూకింది. కోవెల పక్కన కోనేట్లో తానమాడి, గుడి ముందర శిరములువంచి, తల్లినీ బిడ్డనూ అక్కడే నిలిపి – తానుగా తానొక్కడూ, తల్లిని వెదుక్కుంటూ పోయినాడు–నరసయ్య.

ఉండేచోట తల్లిలేదు–కట్టుకొయ్య ఆనవాలన్నా లేదు–అటు తిరిగి, యింటి మొగ కొచ్చాడు–గుమ్మానికి తలుపు లేదు పైన–అల్లంత మేరా–కప్పులేదు–

నరసయ్య లోపలికి–అడుగేశాడు. తండ్రి పండుకునే మంచం–బూజా బుంగితో గోడకు ఎత్తిఉంది. తలవారంతా చెదలు– యిల్లంతా, జిల్లేళ్ళు –ఉమ్మెత్తలు! – నరసయ్య తల గోడకేసి కొట్టుకొన్నాడు.

అక్కడనుంచి–మునసబుగారి యింటికి వచ్చాడు. అరుగుమీద గురక వినబడుతూంది. అది మునసబునాయుడే. చిన్ననాటి చనువుకొద్దీ, కొమ్ముతో గీరి పలుకరించాలని, – తల ముందుకు వంచాడు, – కింద చెప్పులు దోడుంది. – చూసిన కన్ను అల్లాగే గడ్డకట్టుకు పోయింది – ఆ చర్మం – తన తల్లిది!–

గొంతు మారుమోగకుండా – నరసయ్య పంటిమీద పన్నునొక్కి నుదుటితో తల్లి నద్దుకున్నాడు–అల్లంత దూరం నీమనడక నడుచుకుంటూపోయి–దిక్కులు మార్మోగేటట్టు–'అంభా!'–అని అరిచాడు!–

అరుపుకు–రెండు అరుపులు మారుమ్రోగినాయి. నరసయ్య–ఆ గొంతు వారకే దుమికాడు అదే – పొలిమేర – అక్కడే తన వాళ్ళుండాలి–ఏరీ!–

మళ్ళీ అరుపులు మ్రోగాయి!–నరసయ్య–అటు ఉరికాడు!–తల్లీ బిడ్డా–మెడలు వ్నాయి–జీవాల్లేవు. కూర్చిన చిరుతలు – కోరలు చూపినాయి–

ముందురుకు నరసయ్యది–మూడూ కలిపి ఒక్కముద్దగా గోరాడినాయి – ఏ ముద్ద కాముద్ద – జేగురు ముద్దయి – విడిపోయింది.

రెండు–కొమ్ములు–కొన ఊపిరిగా– ఆ జేగురులోంచి అల్లంత లేచినాయి–'అంభా!' అన్నాయి–నేలకంటినాయి!–

★ ★ ★

# చికిలింత

వెంకట్రాయులుగారి భవనంలో ధనలక్ష్మి మూలుగుతూంటుంది - అని అందరూ చెప్పుకుంటూరు. ధనలక్ష్మి మూలుగు సంగతి దైవ మెరుగునుకాని, నౌకరు రంగడు మట్టుకు - అడాపాడా మద్దెలకొట్టా - ఒక్కడే కావడం మూలాన, గంపచాకిరీ చెయ్యలేక ఓపికున్నప్పుడు విసుక్కుంటాడు: ఓపిక లేనప్పుడు మూలుగుతూంటాడు. వాడి మూలుగు రాయలకి అలవాటై పోయింది.

అలవాటుకొద్దీ, ఆ పూట రాయలు రంగడిని పక్క యింటికి వెళ్ళి, పత్రిక పట్టుకురమ్మన్నాడు. అలవాటుకొద్దీ వాడు వెళ్ళాడు. వట్టి చేతుల్తో తిరిగి వచ్చాడు.

–ఏం?

–వాళ్ళు పత్రిక కొనడంమానేశారుట!–

–కారణం?...

–మన బాధపడలేకట!– మొగంమీద కొట్టినట్టు అనేశాడు, ఆ పెద్దమనిషి!

–ముష్టి అణాపేపరు అడిగి పట్టుకురాలేని నీవు ఎందుకు పనికివస్తావురా?–

–ముప్పొద్దులూ మీ యింటపడి మేయడానికి–

–మేయబట్టే, - యింత పోతరం!–

–పోనీండి: పొమ్మంటే పోతాను–

–చేతనైతే పొమ్మనకముందే పోవాలి:

–పోతున్నానుగా–

రంగడు ఓపిక తెచ్చుకుని, గిరుక్కున వీధిగుమ్మం వేపు తిరిగాడు.

–'ఒరేయ్ రంగడూ! – నీవాలకం చూడగా, అన్నమాట నిలుపుకునేట్టున్నావేంరా? నీకు యిదేం దుర్బుద్ధిరా?'

రాయుడు, కుర్చీలోంచి, కాళ్ళుక్రింద పెట్టి లేవడానికి ప్రయత్నం చేశాడు.

ఎదురు గుమ్మంలోకి, ఎవరో అమ్మాయి వచ్చింది. పచ్చగా ఉంది. ది పద్దెనిమిది వేళ్ళుంటాయి. మొగాన లక్ష్మి ఒడుతూంది. కట్టుకున్న కోక, తగని దరిద్రగొట్టుగా ఉంది.

ఎవరమ్మాయ్, నీవు!

పనిమనిషినండి!–

ఎవరింట్లో?

యీ యింట్లోనే.

ఎప్పటినుంచీ?–

మీరు ఒప్పుకుంటే ఇప్పటినుంచీ!–

రంగడు, ఉన్నచోటే నిలిచిపోయి, విరగబడి నవ్వాడు.

–మా అయ్యగారిది అదృష్టజాతకం! నేను యింతకుముందే నౌకరీ మానుకున్నాను–

ఏం జీతం సరిగా యివ్వరా?

అసలు యిచ్చిందెప్పుడు? యిన్నేళ్లాయె, ఎర్రని ఏగాని కళ్ళ జూడలేదు.

ఉన్న నౌకరీ ఊడితే, ఈ వయసులో అన్నం ఎట్లా?

సన్నాసుల్లో కలిసిపోతాను!

మంచి ఆలోచనే!–కలిసిపోగానే నాకో కార్డుముక్క రాసేయి! తెరిపి చేసుకుని నేను వచ్చి కలుస్తాను.

రాయుడు, వాళ్ళ మాటకు అడ్డం వచ్చాడు.

అమ్మాయ్! – నీకు నౌకరీ ఎందుకు?

ఉద్యోగం పురుషలక్షణం అన్నారు భారత ప్రభుత్వం వారు!

అయితే పోయి వారినే అడుగు.

అడుగుదామనుకున్నాను కాని – అంతలోకే యిది ప్రజా ప్రభుత్వం అన్నమాట జ్ఞాపకం వచ్చింది. ఏ రాయైతేనేం పళ్లూడగొట్టుకునేందుకు? మీరూ ప్రజలేకదా అని వచ్చాను.

హాఁ – కూత ఘనంగా ఉందే వచ్చిన దోవనే దయచేయి–

యింతలో రాయల భార్య, నాగమ్మ రంగడిమీద పొల్లుకేక లెట్టుకుంటూ అక్కడికి వచ్చింది.

అలా, దుంగల్లే అక్కడ నిలబడిఉంటే కూరెవరు తరుగుతా రనుకున్నావురా!–

– అయ్యగారు!–నేను నౌకరీ మానేశాను లెండమ్మ!–

ఆ నౌకరీ నా కిప్పించండమ్మా! తరగడంలో నేను మొనగాడిని – అని అందుకుంది ఆ వచ్చిన అమ్మాయి!

– నీ వెవరు!–

–అమాయకులందరూ నన్ను అభం శుభం తెలియని ఆడపిల్లంటారు: ఆడపిల్ల లందరూ అచ్చం – మొగరాయుడంటారు. ఎవరేమన్నా పడేందుకు ఓపికలేక, ఇలా పరుగెత్తుకుంటూ వచ్చి యిక్కడ తేలాను.

నీ పేరేమిటి?

ఇన్నాళ్లూ రోజుకోపేరు: ఇవాళ మీరేం నామకరణం చేస్తారో?

ఇన్నాళ్ళూ ఎలా బ్రతికావ్?

'మునుపు తిన్న తాయిల్లాలు మనసులో నెమరేసుకుంటూ! పండగనాడూ, పబ్బంనాడూ, మీలాంటివాళ్ల లోగిళ్ళముందు నిలవబడి, గారెలవేపుడు గుమాయించేగాలి పీల్చుకుంటూ!'

'గాలిపీలుస్తూ బ్రతకమట్టే, కన్నుల పండువుగా వున్నావు మా తల్లీ! కనీ పెంచే వయస్సంతా మా అయ్యగారి పాదాల దగ్గిర గడిచిపోయింది. నిన్ను పెంచుకుంటానమ్మడూ: దేవుడితోపులో చిక్కవి చెట్టుక్రింద అల్లంతమేర చిమ్ముకుని, ఆ నీడనే పడుందాం: రా అమ్మా – నన్ను కన్నతల్లి చిన్నప్పుడే కన్నుమూసింది. ఆ

పేరుని పిలుచుకుంటా?...అచ్చటా ముచ్చటా తీరాలి తల్లీ! కాదనకమ్మా' అన్నాడు రంగడు - మాట కలిపించుకుని-

ముష్టి అణాపేపరు కాగితం అడిగితేలేనివాడివి, ఆడపిల్లనేం సాకుతావురా అని ధుమధుమలాడాడు. రాయుడు.

"చూస్తారుగా! రా అమ్మా! రా! అక్కడనుంచుంటే లాభంలేదు. - అయ్య పెట్టాపెట్టడు, అడుక్కు తినానివ్వడు" అని అడుగు ముందుకు వేశాడు రంగడు.

రాయుడు కుర్చీలోంచి ఒక్క దుముకు దుమికి -

"ముష్టి - నీ పెంపకమేమిటి? నేను పెంచుకుంటాను" అన్నాడు.

అమ్మాయి ఊహూఁ అన్నట్టు తలవూగించింది.

"అంతమాట మీరనరాదు—సేవినరాదు. కనీపెంచే తల్లి - యింట మహాలక్ష్మల్లే ఉండగా, యీ తలకుమాసిన దాన్ని పెంచుకోవల్సిన అవసరం ఏం వచ్చె? ఏం తాతా? ఈ యింట ఎన్నడూ తొట్టెకట్టలా? భోగిపళ్ళు పోయలా - ముద్దకుడుము తీయలా, - అన్నెం పున్నెం లేకుండా అంత నిప్పచ్చరంగా కాపురం చేస్తున్నారంటావా, అయ్యగారూ, అమ్మగారూ?-" అని గదమాయింపుగా మనసు చివుక్కుమన్నట్టు - అయ్యో పాపం! - అని వాపోయినట్టు, వీళ్ళది ఇలాటి పుటకేమో అని, విస్తుపోయినట్టు, భూమ్మీద ఇలాంటి మనుష్యులుకూడా ఉంటారా? - అని, ముక్కుమీద వేలేసుకున్నట్టు, చెంపపెట్టు, పెట్టినట్టు మృదువుగా అడిగింది.

రంగడు, నోరెత్తాడు: రాయుడు, పీక నులుముతానన్నట్టు, ఉరిమిచూసి, చేయిజాపి, పండావిప్పాడు.

ఆ అమ్మాయి, కనుతెప్ప అయినా కదిలించకుండా, రాయడిని పసిపిల్లవాడిని చూసినట్లు చూసి, ఫక్కున నవ్వింది:

"పైకి భీకరంగా ఉండేవాళ్ళు - పరమ పిరికివాళ్ళు! నిండుకుండ ఎన్నడూ తొణకదు. ఏమీలేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది. అన్నీ ఉన్నది అణిగి ఉంటుంది. ఈ నీతులన్నీ మామూలుగా కాపీబుక్కుల్లో కనబడుతాయే! అయ్యగారు, అంతలెక్కన్నా, బళ్ళోకి వెళ్ళినపాపాన పోలేదా - ఏం? ఈ ఉరుములూ మెరుపులూ చూడగా చూడగా యీ ఇంట కలిమంత లేమి కూడా ఉన్నట్టు ఘట్టిగా స్పష్టమౌతుంది- ఏం తాతా? - ఏమిటి వీరికి లోటూ? -"

- "నాకేంలోటూ లేదు!" అని రాయుడు గర్జించాడు.

"అవునమ్మా - నిజానికి ఏ లోటూ లేదు: బంగారంలాటి కొడుకున్నాడు-"

"- ఒరేయ్ రంగడూ! - వాడి పేరు యీ యింట ఎత్తితే -"

"నాలుక చీలుస్తానన్నారు. నా కెరికే! - అయ్యో! ఆ మాటమీదనే ఉండండి! నాకు రెండునాలికలున్నాయ్! ఒక్కటి చీల్చినా ఒకటి మిగుల్తుంది"

"పీక తెగ్గోస్తే-"

"చేతుల్తో సైగచేసి, చెప్పాల్సింది చెపుతాగాని, యింత లెక్క వచ్చినాక, యిక వదుల్తానా! అమ్మడూ, మా ఊళ్ళో, మంచివాళ్ళున్నారు. మనసు చంపుకోనివాళ్ళున్నారు. కాని, మా అయ్యడబ్బుకి వెరచి, మా అమ్మనోటికి వెరచి ఒక్కళ్లూ ఇదేమని అడిగినవాళ్లే లేరు! నీవు వచ్చి అడిగావు. ఆ భారతం విప్పుతున్నా చూసుకో!- నిజానికి నన్ను నిగ్గదీసి అడిగితే అబ్బాయిగారు యీ

యింట పుట్టవలసినబిడ్డ కాడమ్మా! పెద్దలు చేసుకున్న పుణ్యంకొద్దీ పుట్టాడుకావి. దక్కించుకునే యోగ్యత మాకు లేకపోయినదమ్మా! తరిమేశామమ్మా!"

"అదేం?"

"అంతే! మా అయ్య తీరంతే – 'మూడుతరాలకు సరిపోయే సంపదుంది – నౌకరీ చెయ్యను నాన్నా!' అన్నాడు బిడ్డ – 'అంతా నా స్వార్జితం – కూచుని మేసేందుకు కాదు – నౌకరీ చేయకపోతే – బయటికి నడవరా నాన్నా!' అన్నాడు–అయ్య–అంతే–మాటపడి, ఒక్క మినిట్ ఈ ఇంట ఉండలా బిడ్డ! పచ్చిమంచినీళ్ళన్నా ముట్టలా! కట్టుబట్టలతో తలొంచుకుని దారిపట్టాడు!"

"ఉహూఁ–నీవు అడ్డం వెళ్ళలేకపోయినావా తాతా!–"

"ఎందుకు అమ్మడూ! బిడ్డకు యీ యమచర వదలకుండాలనా, – బయటికి పోయాడో – బాగుపడ్డాడే"

"బాగుపడ్డాడంటావా"

"ఢంకామీద దెబ్బకొట్టి చెపుతా! ఎంతకలికాలమైనా – ఉన్నాడని నమ్మినవాడికి నిదర్శనం యిస్తూనే ఉన్నాడమ్మా దైవం – ఆ బిడ్డే బాగుపడక – అడవులుపట్టి అల్లాడిపోతే – పట్టపగలు చుక్కలు రాలవూ! మున్నీరు ఏకంగాదూ? భూమంతా వరదేసుకుపోదూ!–"

"ఎక్కడున్నాడంటావ్?"

"ఎక్కడున్నా – చల్లగా ఉంటాడు! – బిడ్డకోసం, రోజుకు వేయి మొక్కులు మొక్కుతా – ఒక్క మొక్కన్నా వరం యివ్వదూ?"

ఇంతసేపటికి రాయడికి గొంతు పెగిలింది! "రంగడూ! నన్ను చంపకురా!–" అన్నాడు! నాగమ్మ కళ్ళు ఎర్రబడి, ఉబ్బిపోయినాయి. వచ్చేశోకం, దిగమింగుకుంటూ "నోరు మూస్తావా లేదా!" అనబోయి, బావురుమంది.

రాయడు, నాగమ్మవంక కొరకొర చూడబోయి కొరమారినట్టు దగ్గి గొంతు రాసుకుని–

"ముష్టివాగుడు కట్టిపెట్టి పడుంటావా లేదా? వెధవ బెదిరింపులూ నీవూనూ! ఇదిగో అమ్మాయ్! వాడి వాగుడుకు దరీ అంతూ అంటూ ఉండదు కాని – వినిపించుకోక! ఉండాలని వచ్చావు కదా – ఉండిపో – ఏం – అలా చూస్తావేఁ? – నిన్నేం పస్తులుంచంలే–బంగారం మేపలేంగాని, కలో గంజో మాతోబాటు తాగుతూ పడుండు! పో – లోపలికి వెళ్ళి – తలదువ్వుకొని బొట్టూ కాటుకా పెట్టుకుని అమ్మగార్ని అడిగి మరోకోక కట్టుకో!"

రాయడు యీ మాటలంటూనే పైపంచ బుజాన గిరవాటు వేసుకుని వీధిలోకి చక్కాబోయినాడు.

"అయ్యగారికి ఇష్టం వచ్చిందేమోనమ్మా! లేకుంటే యింతమంచిగా, యింత యీవిగా మాట్లాడటమే!–" అని రంగడు కసురుకున్నాడు. నాగమ్మ నవ్వింది.

"అమ్మాయ్! నీ పేరేమిటే!" అని చనువుగా అడిగింది.

"మీకే పేరు యిష్టం!"

"మా అమ్మ పేరు భావమ్మ, ఆ పేరు – ఆడపిల్ల పుడితే పెట్టుకుందామనుకున్నా – నా నొష్టను రాయలా..."

"పోనీ మనవరాలికి పెట్టుకోవచ్చునుగా!"

నాగమ్మ – కుమిలిపోయింది, ఆ పిల్ల చప్పున ఆమె కాళ్ళుపట్టుకొని – "ఎన్నడూ నోరెత్తనమ్మా మనసునొప్పించనమ్మా!" అంది.

నాగమ్మ, పిల్లదాని తల నిమురుతూ "నిన్నేమని పిలవనే?" అంది.

"పిలా!"

రోజులు గడచి పోతున్నాయి – పిల్ల గుణగణాలు చూసి, నాగమ్మ, నీ కుల మేమని అడగలా! యింటి పెత్తనం అప్పగించింది. యివతల చెంబు అవతల పెట్టనీయకుండా, నాగమ్మను కూచోపెట్టి పిల్ల, ఆరిందిగా యిల్లు దిద్దుకుపోతూంది.

పిల్ల, రోజుకో కథ చెప్పకలదు. పూటకో పాట పాడకలదు! రాయుడు కథలంటే చెవికోసుకుంటాడు. నాగమ్మ పాటలు వింటూ అన్నం నీళ్ళూ మరచిపోతుంది.

సంక్రాంతి వచ్చింది.

పిల్ల తలంటి నీళ్ళుపోసుకుని నాగమ్మ పట్టుబలవంతాన, ఒకటో అరో సరుకు పెట్టుకుని, యింట మహాలక్ష్మల్లే తిరుగుతూంది. చిటికలో పంచభక్ష్య పరమాన్నాలూ తయారుచేసింది. వడ్డించాను రమ్మంది పదిగంటలకల్లా.

రాయుడు పడమటింట్లోకి వచ్చి కూర్చుని, పక్క విస్తరి చూసి "అది ఎవరికి?" అన్నాడు.

"తండ్రి ప్రక్క ఎవరు కూర్చుంటారు?"

రాయుడు తెల్లబోయిచూస్తూ కూర్చున్నాడు.

"కలుపుకోండి, నెయ్యి వడ్డిస్తాను–పండగనాడన్నా మూరు విస్తరి వేయాలికదా. కోపంవస్తే ముఖం కండలు చించుకుంటాం గాని, అనుబంధాలు కోసేసుకోగలమా? పాపం. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో, తిన్నాడో లేదో మీ అబ్బాయి. పోన్లెండి, చెప్పినమాట వినకుండా శరించి పోయినవాడిని మీరేం చేయగలరు? పక్కన వున్నట్టే భావించుకుని–పప్పూ బువ్వా తింటే కొంత మనశ్శాంతి!"

రాయుడు అన్నంమీద వేసిన చెయ్యి వెనక్కు – లాక్కుని, అంత ఎత్తున ఎగిరిపడి – "పోఁ బయటికి పోఁ" అని అరిచాడు! నాగమ్మ, పరుగునవచ్చి, పిల్లను కౌగిలించుకుని, "నీవు పోతే నూతులో పడతా!" అంది.

రాయుడు గది తలుపు బిడాయించుకుని ముసుగెట్టుకున్నాడు. పిల్ల, ఒకసారికి పదిసార్లు, గుమ్మంలో మంచుని బ్రతిమాలింది. ఉలకలా – పలకలా!

నాగమ్మ – పిల్ల, కనపడీ కనపడటంతోనే బావురుమంటోంది.

రంగడుమట్టుకు డొక్కలు దించుకుపోతున్నా గుక్కచెల్లగా గుక్కెడు మంచినీళ్ళు త్రాగుతూ "నా సామిరంగా! యిన్నాళ్ళకు, నా కళ్ళు చల్లబడ్డాయి అమ్మడూ?" అని జపం చేస్తున్నాడు.

ఒంటిగంట అయింది.

మబ్బేసింది ఒక చినుకు పడ్డది.

అబ్బాయి వచ్చాడు. "అమ్మా!"..అన్నాడు. నాగమ్మ దిక్కులు దద్దరిల్లిపోయేట్టు అవురుమంది. రంగడు చిందులు తొక్కుతున్నాడు. రాయుడి గదితలుపు బద్దలయ్యేట్టు మోగించాడు.

రాయుడు తలుపుతీశాడు.

బిడ్డ తండ్రిని పలుకరించాడు.

ఏమీ జరగనట్టు, ఏమీ ఎరగనట్టు, యిల్లువిడిచి పోనట్టు, కలతలే లేనట్టు – క్షణంలో కలసిమెలసిపోయాడు.

అందరూ భోజనంచేశారు.

తల్లి కొడుకును దగ్గిర కూర్చోబెట్టుకుని లక్ష ప్రశ్నలు వేసింది. ఒక్కదానికీ సమాధానం చెప్పకుండా "ఆ పిల్ల ఎవరమ్మా" అని అడిగాడు.

"పనిమనిషిని!" అని పిల్ల నదురూ బెదురూ లేకుండా జవాబు చెప్పింది.

"అలా అనుకుంటే మా కళ్ళుపోతాయ్. ఎవరో ఏమో అడిగినా చెప్పదు. ఓనాడు వచ్చింది. ఉండిపోయింది: నా తల్లే చేసేది – మళ్ళీ, యీ పిల్లే చేస్తుంది నాకు పోషణ! మన యింటికి లక్ష్మి వచ్చిందిరా నాయనా? నా తండ్రిని నాకిచ్చిందిరా తండ్రీ!"

"ఏమండీ! ఆ మాటమటుకు అనద్దు! మాటమీదుండటం మొగసిరికాని, బింకాలు కొట్టిపోయి బిక్కమొగం వేసుకురావడం యిదేం ప్రజ్ఞ! అయ్యగారికి తగ్గకొడుకే!" అంది పిల్ల.

"గడుసుది లాగుందమ్మా!" అన్నాడు బిడ్డ.

"గడుసో దుడుసో! మీ అయ్య కళ్ళు తెరిచింది. అందుకు సంతోషించు!" అన్నాడు రంగడు.

"అమ్మాయ్! నీకు పెళ్లి అయిందా?" అన్నాడు రాయుడు, ఉన్నట్టుండి.

"కాకపోతే–"

"మావాడిని నీకిచ్చి చేస్తాను!"

పిల్ల నవ్వింది.

"చేసుకోగా చేసుకోగా యీ అడ్డాలపాపణ్ణే చేసుకోవాలా? నేనే చేసుకుంటే – నాకు తాళికట్టేవాడు నాన్నకు వెరవనివాడు కావాలి!"

"మావాడు అంతేనమ్మా! నన్నూ నా డబ్బునూ రోలీ క్రింద కట్టి చక్కా పోయినాడు."

"పోయినవాడు పోకుండా తలవంచుకు వెళ్ళిన త్రోవనే మళ్ళీ దయచేశాడు కద! ఇక బుద్ధివచ్చింది. మీ చెప్పచేతుల్లో ఉంటాడు. ఏరినపిల్లను కట్టుకుంటాడు. పెళ్ళానికి మల్లెపూవులు కావాలన్నా మీకు ప్రాధేయపడతాడు. అంతేనా – ఏమండోయ్, ఇలాటివాణ్ణి కట్టుకునేందుకు, ఆడపిల్లలు కానికి మూడు చొప్పన బజారులో చవగ్గా దొరకడంలేదు. నా ఎరికలో, మీ వాడికి – పెళ్ళి అయేయోగం

లేదు–" అని గట్టిగా గదమాయించింది–పిల్ల– "లక్షరూపాయలిచ్చి–కట్టబెట్టినా – నా కక్కరలేదు" అని రెట్టించింది.

"అమ్మా!–అమ్మా!–అంతమాటనకమ్మా! నా బిడ్డ గుణగణాలు నీకు తెలియ వమ్మా! కోటిలో ఒకడమ్మా!" అని బ్రతిమాలింది, నాగమ్మ. అంటూ చప్పున కాళ్లుపట్టుకోపోగా, పిల్ల ఎగిరి, పక్కకు గంతేసి–

"అత్తయ్యా" అంది. నాగమ్మ–తెల్లబోయింది బిడ్డ ఫక్కున నవ్వాడు.

రాయుడు–ఊం–ఊం అని మూలిగి, బిడ్డవంక చూసి – అంటే – ? అన్నాడు.

"మీ కోడలన్నమాట!" అన్నాడు బిడ్డ.

రాయుడు విని వినడంతోనే – ముఖకవళిక మార్చాడు–

"ఉహూ–యిదా నీ ప్రతాపం!–ఎలా పోషిస్తావురా?"

"మనకా బాధలేదు నాన్నా!–ఈ పిల్ల పోషణలో ఉన్నాను–"

"ఉహూ! – అత్తవారు స్థితిమంతులన్న మాట–"

"కాదండీ మామగారు–మీతో పోలిస్తే గర్భదరిద్రులు!–అల్లుడికో వేయి రూపాయలు జీతం – దాంతో, ఏదో ఓ పూట తినీ, ఓ పూట తినకా–" పిల్ల నవ్వేసింది –

"ఆం–ఆం–అంతవాడివైనావటరా నాన్నా!–" అంటూ రాయుడు కొడుకుని కౌగలించుకునేందుకు ఉద్యుక్తుడైనాడు–

బిడ్డ–ఒక అడుగు, వెనుకకు వేసి – "ఆగు! – నీకు ఆ అర్హతలేదు–" అన్నాడు – రాయుడు ఎంతో చిన్నబుచ్చుకున్నాడు–

"అదేమిట్రా నాయనా!" అని అతిదీనంగా అన్నది నాగమ్మ–

పిల్ల–అత్తగారి దగ్గిరకు చేరి రహస్యంగా–

"మరేం లేదు అత్తయ్యా! మీ అబ్బాయిది చంక వేసుకునే యీడు కాదుగదా! మరి, రేపో మాపో – మనవణ్ణికని" – సిగ్గు పడ్డది –

నాగమ్మ – ఎగిరి గంతేసి "నీ కడుపుడకా!" అంది.

రాయుడు – ముఖం చిట్లించుకొని బిడ్డతో "ఒరేయ్ – నీకు పిన్నంతరం పెద్దంతరం లేదురా – నా కోడలు చేత నాకు బుద్ధి చెప్పిస్తావుట్రా – కానీ – నీకూ – యిదే –"

"అదృష్టం పడుతుంది!–" అని రంగడు పూర్తిచేశాడు.

★ ★ ★

# కన్నడ

ఎదురుగుండా మేడలో ఉన్న మనోహరం తల్లి, కూతురి పాత బాకీదాడుణ్ణి ఎవడినో, గుమ్మంలో నిలవేసి నానా దులుపులూ దులుపుతూంది.. రమ్య-రాక్షసిగొంతుతో.

పక్క భవంతిలోనుంచి, జోలపాట వినబడుతూంది.

డాక్టరు బల్లదగ్గిర కూర్చుని, సరిపాత – కేటలాగులు తిరగవేస్తున్నాడు నేను కుర్చీలో పడుకుని, పాల్తు మేగజీనుల దొంతరలోనుంచి ఒక్కొక్కటీలాగి, బొమ్మ బొమ్మా పరకాయిస్తున్నాను.

...మాట్లాడేందుకు ఏమీ లేక, చేతినిండా పనిలేక ఏదో గొడవ పెట్టుకుని, భోజనం వేళదాకా ఎవరిత్రోవను వారు, ప్రొద్దుపుచ్చుతున్నాము.

– ఆ అబ్బాయి వచ్చి...నమస్కారం చేశాడు. డాక్టరు ఎదురుగుండా కుర్చీ చూపించాడు.

"ఏమయ్యా!...ఏమిటి?" అని అడిగాడు డాక్టర్.

"ఏమీ లేదండీ..." అన్నాడు ఆ పిల్లవాడు! పిల్లవాడంటే, మరీపసిపాపకాదు. మాకన్న ఏపాటో చిన్నవాడు... పైపెదవిపై – లేలేత నూనూగు .

హుంకారం, గొంతులో గొరగొర లాడించి, డాక్టరు తనపని తాను చూసుకుంటున్నాడు.

"మీతో–మాట్లాడాలండీ" అన్నాడు అతడు, కొంతసేపటికి తటపటాయింపులో నుంచి తెమిలి–

"ఊc మాట్లాడు!" అని డాక్టరు కసురుకున్నాడు, స్వగతంగా.

"ఒంటరిగా..."

"అయితే...ఎవరూ లేనప్పుడు రా..."

"ఎప్పుడండీ..."

"ఎవరు లేనప్పుడు..."

–నేను, పాకం ముదురుతన్నదని, అక్కడనుంచి లేవబోయినాను ."కూర్చో" అని నన్ను కూలేసి..."మంత్రసాని ముందర...ఆ సామెత తెలుసును కాదూ... ఇందాకా వచ్చి యిప్పుడు బిడియపడతావేం...ఫరవాలేదులే...మావాడూ వైద్యుడే...ఘన వైద్యుడు!...ఒకరిద్దరిని కాదు...రోజా పదిమందినైనా చంపుతూంటాడు...పలుకులతో."

డాక్టరు మాటలకు ఆ కుర్రవాడు...నవ్వాడు: హ్యామరు వాడి మొగంలాగా ఉన్నా...పరాయివాడున్నప్పుడు, బాగుండదని...నేనూ నవ్వక తప్పిందికాదు.

"మరి...ఒంట్లో బాగుండటం లేదండీ!"

"అలాగేం పాపం..."

"చాలా రోజులనుంచీ..."

"అయితే యిన్నాళ్ళూ ఏంచేశావు?"

"సిగ్గుపడి...దాచుకుంటున్నానండీ..."

"ఊఁ. పొడి అక్షరాలేం.."

"అంటే .."

"అంతే, చేసేటప్పుడు ఏం తెలుస్తుంది"

"నేనూ—ఏమీ జేయలేదండీ .."

"ఏం చేయలా...చెడుసందుల్లోనుంచి నడవడం...పాడుచోట కాలు ముడవటం. అదన్నాలేదూ...ఊరికే నిన్ను వెదుక్కుంటూ గాలిలో ఎగిరివచ్చినవా?"

"ఏమోనండీ..."

"అడిగినదానికి ..అదా జవాబు? అవును, కాదు, అని ఖచ్చితంగా చెప్పాలి...మళ్ళా, చదువుకున్నవాడవు!"

"అడగండి..."

"ఏమిటి అడిగేది? నీ..."

—గ్రుశలిమించింది: అవతలివాడిని హడలగొట్టడం, తాను సర్వజ్ఞుణ్ణనుకోవడమూ... సర్వసాధారణంగా స్టెతస్కోపు పట్టనేర్చిన ప్రతి భడవాలోనూ అంతో ఇంతో ఉన్నదన్నమాట, జగమెగిరినది. మావాడిలో ఆ హంశ మరీ ప్రకోపించి ఉంది...

కనుక నేను కలుగ జేసుకుని.

ఆ అబ్బాయిని బుజ్జగించుతూ—

"అవునయ్యా! డాక్టర్లంటే ఏమన్నా ఆకాశంలోనుంచి ఊడిపడ్డారా? వాళ్ళూ మనలాటి మనుష్యులే! మలయాళ మంత్రాలేమీ చెప్పరు వాళ్ళకు బళ్ళో, అవతలవాడి మనసులో ఏమున్నదో చెప్పకుండానే గ్రహించేటందుకు. అదిగాకుండా మెదడంటే ఏమిటో, దాని మంచిచెడ్డలూ సున్నితమూ...ఎంతో కృషిచేసి తెలుసుకున్న వాళ్ళు కనుక, దానిని ఎంతో భద్రంగా కాపాడుకుంటారు, కాని, నీలాగా, నాలాగా, అవసరం ఉన్నా, లేకపోయినా..అతి విరివిగా తరచు వాడేయరు:— వైద్యుడికి, రోగనిదానం తెలుసుకునే ప్రయత్నంలో, రోగి సర్వవిధములా తోడుపడి... ఆ మాట అతనికి దక్కనివ్వాలి: తెలిసిందా? – మనం అంటే ప్రకరణాన్ని బట్టి...నీవే యిక కానీ..!"

మా డాక్టరుకు నన్ను మింగేద్దామన్నంత కోపం వస్తూంది...కవలిక కనిపెడుతూనే ఉన్నాను. కాని, మనం గుడ్రిమింగే రకం: ఏం చేస్తాడు పాపం?

ఆ పిల్లవాడు దాచకుండా అంతాచెప్పాడు. చెప్పినదంతా మావాడు సావధానంగా, అర్ధనిమీలిత నేత్రాలతో విన్నాడు.

"ఊఁ.. కలలు వస్తూంటాయా?"

"ఆఁ..."

"ప్రతిరాత్రీ..."

"అవునండీ..."

"మారుతూంటాయా...."

"సాధారణంగా...లేదండీ"

"సీడచూసి బెదిరే రోగిని – నాడిచూసినట్టు నటిస్తూ పాకలేయడం – మా వెజ్జుకు చద్దన్నంతో పెట్టిన విద్దె – యిప్పటికే చాలా ముదిరింది, కానీ, ఫరవాలేదు. అయితే చాలారోజులు మందు పుచ్చుకోవలసి ఉంటుంది." అని శ్రీవారు సలహా చెప్పుతున్నారు. ఆ పిల్లవాడు అమిత ఆదుర్దాతో, అన్నింటికీ తల ఊగించుతున్నాడు.

"అత్తవారింటికి పంపితే" అని నే సన్నాసు మా డాక్టరు, పకపెక్కెంగా నవ్వాడు. ఆ అబ్బాయి, చాలా సిగ్గుపడ్డాడు–

"నీ పేరేమిటి .బాబూ "

"చంద్రశేఖరం"

"బాగుంది.. మరి, నక్షత్రం?"

"రోహిణి.. "

"అంటే, ప్రస్తుతం, నీ అభిమాన నక్షత్రం ..జన్మనక్షత్రంతో మన వైద్యానికి పనిలేదు...చెప్పు . సంకోచించవలసిన అవసరంలేదు. పైగా.. చాలా...అవసరం.."

– మరీ సిగ్గు పడుతున్నాడు; నా మాటలకు, డాక్టరు "వీడికేమన్నా మతిపోయిందా ఏమిటి" అని నావంక చోద్యంగా చూస్తున్నాడు...

"నీవు చెప్పనక్కరలేదులే. నేను కనుక్కో లేకపోయినప్పుడుగదా.." అని నవ్వుతూ, దగ్గిరకు వెళ్ళి, అతని జేబులోనుంచి, పర్సుతీసి .తీసి. అందులోనుంచి ఆ బొమ్మ బయటకు లాగాను "మంచి పోజు సంపాదించావు" అని ప్రశంసించి. తిరిగి ఎక్కడివక్కడ పెట్టేసి ..అతి శాంతంగా..."డాక్టరుగారు చెప్పినట్లుగా నడుచుకుంటే మూడు నిమిషాల్లో..నీ ఒళ్ళు మళ్ళా నీవు చెప్పినమాట వింటుంది. ఆయన హస్తంలో – ఒక వాటాలో అశ్వినులు అద్దెకు ఉంటున్నారు నీ అదృష్టం కొద్దీ దొరికాడనుకో, యింతకూ నీకు బాగుపడేయోగం ఉండబట్టే ఇక్కడకు వచ్చావు. రేపు మంచిది దుర్ముహూర్తం వెళ్ళగానే, రా. మందు ప్రారంభించేస్తారు. "

– యింకా యింకా మాటలతో యిలాగే చక్కిలిగింత బెడుతూ గుమ్మందాకా, ఆతణ్ణి సాగనంపివచ్చి, యథాస్థానంలో కూర్చున్నాను.

"నీ సావాసం కొట్టేస్తానురా మంచిరోజుచూసి..." అని, బుంగమూతి పెట్టాడు, డాక్టరు.

"మంచిది.. ముహూర్తం పెట్టించుకురానా?"

"పోరా...క్వాక్! నీలాటి స్నేహితుడు ప్రక్కనుంటే ధన్వంతరితాత అయినా. మరు నాటికి. .చదువుకున్నదంతా, మరిచిపోతాడు."

"బాగుపడతాడు. ఓరేయీ భిషక్! నీ రంగు నీళ్ళతో కనుక వాడి ఒళ్లు నయమైతే ..యిదిగో యీ కుడిచెవి ఉందిచూడు ..సమూలంగా ..నీ చేతులమీదుగా మూడు వాయిదాలమీద తెగ్గోయించుకుంటాను. "

– భోజనంచేసి, నా దోవను నేను వచ్చేశాను, సంవత్సరాది పండుగపూటా, ఏదో లోపలికిపోయి యిల్లాలితో మాటా మంచీ ఆడుకునేందుకు లేకుండా, యీ బ్రహ్మచారి పొత్తు ఎందుకని ..డాక్టరును విడిచి. .

పదిహేను రోజులదాకా...పరాయి పనులమీద, ఊళ్ళోలేను.

– వచ్చిననాడు సాయంకాలము...పొరుగు పేటవెళ్ళి తిరిగి వస్తూండగా.. ఆ పిల్లవాడు, లోపలనుంచి, త్రోవను నేను పోతూండటంచూసి గబగబావచ్చి నన్ను పలుకరించి...వాళ్ళ మేడమీదకు తీసుకువెళ్ళాడు.

ఇల్లు చాలా బాగుంది. అతనిగది, కలకలలాడుతూంది.

టీ వగయిరాలు, యితర పరికరాలూ, పుష్కలంగా సన్నిధికి తెప్పించాడు. మొగమాటపడకుండా, మాంచి పట్టుపట్టడంచూసి, ఆతడు, చాలా చనువుగా నాదగ్గిర కూర్చున్నాడు. నేను కుర్చీలో నడుమువాల్చి...పొగలో మునిగి, గోడలమీది బొమ్మలవంక...ఒక్కొక్క చిత్రాన్నీ ఎంతో నిదానించి...చూస్తున్నాను.

అన్ని మొగాలూ ఒకటే; అవతారాలుమారినా అంతా ఆ అమ్మాయే!

నావంక చూస్తూన్నాడని గమనించకపోలేదు. చూడనిచ్చాను తీరుబడిగా, చూడటం అంతా అయిపోయిన తరువాత ఆ చూపే తెప్పవాల్చకుండా అతనిమీదకు మరల్చాను. చూడలేకపోయినాడు.

– బాగున్నాయ్. అన్నీ బాగున్నాయ్! భలే బాగున్నాయ్.

– గోడమీద బొమ్మలవంక చూస్తున్నాను. బొమ్మలను చూసిన చూపుతోనే అతన్ని చూస్తున్నాను. అన్నమాటే.. అంటున్నాను.

"ఏమయ్యా! ఏలా ఉన్నావు?" అన్నాను.

"బాగానేలెండి..."

– ఆ మాటలోఉన్న విసువు, ముందు కనుక్కోలేక ఉలికిపడి, చెవి తడుముకున్నాను. కాని, అతని కవలిక చూసి తెప్పరిల్లి–

"హుఁ...అనగా ఇప్పుడు యిబ్బందులేమీ లేకుండా రాత్రిళ్లు సుఖంగా నిద్రపోతున్నావన్న మాటేనా...?"

"చూస్తే తెలియడంలేదూ, మీకు..." అన్నది అతని చూపు.

అవును, వెనుకటిలాగానే ఉన్నాడు. అంతకన్నా కూడా బుగ్గలు మరీ యూచుకుపోయి...కళ్లు కళాకాంతులూ

"తెలుసునులే" అన్నట్టు తల ఊగించాను.

"మందు మానేశాను" అన్నాడు, కొంతసేపటికి మాట తెముల్చుకుంటూ.

"మాంచిపని చేశావు."

– నావంక, ఆశ్చర్యంగా చూశాడు మా స్నేహితుడికి, అవచ్చే నాలుగుడబ్బులూ పోయిననవని, నాకేమన్నా అతని మీద కోపం వస్తుందనుకున్నాడో, ఏమో, నేను ఆశంక అతని చూపులలో గ్రహించి ఆ మాటనే రెట్టించాను.

"మంచిది యిక వెళ్ళిరానా" అంటూ గడియారం వంక చూసి లేచాను – వీధిలోకి వచ్చాను. నన్ను నాలుగడుగులు సాగనంపే మర్యాదతో, నా వెంటనే నడుస్తున్నాడు.

త్రోవలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా ఆగి అతనితో "రేపు విజయనగరం వెళుతున్నాను...నీవు కూడా వస్తావా ఏం? సరదాగా, పోయివద్దాం యిప్పుడు సెలవులేకదా నీకు..." అని అడిగితే, ఆతడు...ఏలాగో తప్పించుకుందామని చూశాడు కాని, చివరకు ఒప్పించాను. మన నాలుకమీద...పంచగ్రహకూటం...పీఠం వేసుకు

కూర్చుండగా... మాట వినకపోవడానికి.. మహామహులకే అలవి కాలేదే - ఆ కసుగాయకు, తరమా?

"మంచి" దంటే, "మంచి" దనుకుని..అతన్ని యింటికి మళ్ళించి .నేను మా డాక్టరు దగ్గిరకు వెళ్ళాను...

"ఎప్పుడు...రాక" అన్నాడు...సోదరుడు. మోటారు సైకిల్ స్టార్టరును, కాలుతో సాముచేయిస్తూ... ఎక్కడికో బయలుదేరబోతూ..

"రాకరాక...నిక్షేపంగా ఒంటి బ్రాహ్మడు ఎదురుగా వస్తే...దిగరా గుర్రం..." అని పలుకరించి, కలిసి లోపలకి వెళ్ళాను...

"ఎప్పు డొచ్చావురా?..."

"ఎప్పుడు వెళ్ళానో...చెప్పావా?"

"నీ ముఖంలే..."

"నా ముఖమే నయం...నీ చేతిమాత్ర పడలేదో..యింతవరకూ ఏదో యిలా బ్రతికిపోతున్నాను...లేకపోతే నీ ముఖమే నా ముఖం..యింతకన్నా ఉంది...యిప్పుడు మునుపటికన్నా లక్షణంగా...ఆ చోక్రాముఖం ."

"వాడా...నీకెక్కడ తగిలాడు...అప్పుడే.."

"తగలడం...పరస్పరం!..మొత్తానికి...నేను అనుకున్నంతా అయింది'. పాపం, వాడేమీ నీమీద చాడీలు చెప్పలేదు కాని...ఎందుకూ, అర్థం ఉంది, ముఖం ఉంది వేరే అడగాలా?...అంతటితోనైనా...దయదలచి వదలావని విని..చాలా సంతోషించి...నీ ఔదార్యాన్ని నీ యెదుటనే వేనోళ్ళ పొగడదామని..హుటాహుటి నడలన్ ఇక్కడకు దయచేశాను..."

"ఒరే...నా శాయశక్తులా...ప్రయత్నంచేసి చూశాను సామ కామోపాయాలతో..."

"భేష్!...ఎవరా కామి?"

"ఎవరు?...ఎదురుగా ఉన్నవారే...పెళ్ళికూతుళ్ళు"

"వారిలో ఏ కూతురు.."

"శకుంతల..."

"...ఛిల్...వాడి కర్మంకాలి...చివరకా దీపం సెమ్మెమీదకా..నీవుతోసింది.."

"మిత్రమా! తియ్యని వ్యాధులూ, కమ్మని మందులూ ఉంటాయా? ఎవతైతే నేం...ఔషధం...కళ్ళు మూసుకొని.. మ్రింగవలసిందే..."

"ఐన-... వాడింకా వాడవలసిందే యీ పాటికి అనంతరంబో దేవా?..."

"ఆ దేవుడు...అప్పటినుంచీ...అసలు ముఖం తప్పించాడు ..ఇదిగో.. ఇక రెండు రోజులు చూసి...బిల్లు పంపించుతాను. కందకు లేని దురద, చామ కెందుకు, మధ్యని-"

"-చామకు, దురదంటూ రేగాలిగాని...అప్పుడు కంద, మందులోకైనా పనికి రాదు...బిల్లు ఎక్కడికీ పోదుగాని, యింకో పదిరోజులు పోనీ...అంతలో పాపం పెరిగినట్టు యింకా పెరుగుతుంది..."

"ఎవరిపాపం?"

" - పాపం పోనీ అని...దయదలచి, మీకు బిల్లులు చెల్లించేవాళ్ళది..."

"చెల్లించడం పాపమో పుణ్యమో, – అదైనా నీలాటి సైంధవులు అడ్డుపడకుండా ఉంటేనే..."

"అడ్డుపడటం చేతనైతేనే...తలంచుకుంటే ఎవరైనా ఒడ్డు ఎక్కించ గలిగేది.."

సెలవిచ్చిపోయినాడు.

మూడోనాడు సాయంకాలము..నేనూ చంద్రశేఖరం విజయనగరంలో ఉన్నాము

"ఎక్కడికి వెళదాం?" అన్నాను. స్టేషనునుంచి ఊళ్ళోకి వెళుతూ.

"మీ యిష్టం" అన్నాడు.

"నా యిష్టం. నీకు యిష్టమైతే.."

– యింతలో నాకు ముఖ్యుడైన స్నేహితుడొకడు తగిలి.. మరునాడు మధ్యాహ్నం దాక.. అతని యింటిలో మమ్మల్ని యిద్దరినీ ఖైదుచేసి కాలక్షేపాలతో ఎక్కడికీ తెమిలి కదలనిచ్చాడు కాడు.

..బట్టలు వేసుకు, నేను బయలుదేరుతున్నాను "నేను కూడా రానా?" అని...మొగమాటపడుతూ అడిగాడు శేఖరం రమ్మని తల ఊగించి బండిలోకి ఎక్కబోతూండగా..."ఎక్కడికి?" అని మళ్లా అడిగాడు..

"ఒకటి – బయలుదేరబోతూన్నప్పుడు బొట్టూకాటుకా పెట్టి పిలిస్తేనేకాని కదలకపోవడం, రెండు – వెళ్ళబోతూ 'ఎక్కడి'కనడం రెండూ మంచి శకునాలే .శుభ సూచనలు ముందే కనబడుతున్నవి–" అంటూ విసువుతో మంటగా కసిరాను.

"తెలియక అన్నానండీ" అతనికి, కళ్లనీళ్ళ పర్యంతమయినది

"తెలిసో, తెలియకో యిప్పుడు అనుకునిమాత్రం, ఏం లాభం?–ఏమైనా, నీ మంచికోసమేకానీ..."

నేనన్నది, అతనికి ఎలా అర్థం అయిందా? నావంకచూసి, మాటాడకుండా, బండిలో యింకాపైకిపోయి కూర్చున్నాడు

ఆ అమాయకత్వం చూస్తే, బహు జాలివేసింది బుజ్జగింపుగా "మనం ఎక్కడికి వెళుతున్నామో తెలుసునా?" అని మాటలు ప్రారంభం చేశాను.

అతడు తల ఎత్తి చూసి...ఊరుకున్నాడు.

"మనం వెళ్లేది...అక్కడికే..."

"– ఎక్కడి"కని...తల ఊగించాడు.

నేను కొంచెం నవ్వుగా..."ఆ అమ్మాయిని, యిదివరకు ఎన్నడన్నా చూశావా?.. తెరమీదా...కలల్లోనూ కాదు, నేననేది మనిషి..నిండునిలువు"

వింటూ చిరునవ్వునవ్వాడు...చివర అన్నవాటికి .చిన్నపుచ్చుకున్నాడు నేను..చేత అంకుశం అప్పుడప్పుడే, వదలదలచుకోలేదు

"అసలు...ఆ పిల్లది యీ ఊరేనన్న సంగతైనా తెలుసునా?–తెలియదూ? ఎవరినన్నా అడగలేకపోయినావా?..యే సినిమా పత్రికవారికి వ్రాసినా, మరునాటికి జవాబు వచ్చేదే ..పోనీ కేరాఫ్ అలదాని కంపెనీకే ఉత్తరం వ్రాయకపోయినావూ? మూడోనాటికి ముత్యాలలాటి అక్షరాలతో సంతకమై ముద్దొచ్చే బొమ్మవచ్చేదే? దానికి మంచి ఫ్రేము వేయించినా అందమూ, చందమూ కాని, అచ్చు అయి కాగితాలలోనుంచి కత్తిరించి.. గోడకు అతికించితే–ఏం ఫలం?..ఊఁ...మంచిచోటనే కన్ను వేశావులే ..చిదిపి

దీపం పెట్టవచ్చును. పైపూతవల్ల వచ్చిన కళ కాదది...అసలు పిల్లది, మెరిసిపోతూ ఉంటుంది...చూస్తావుగా...?"

అతనిని...కనిపెడుతూనే ఉన్నాను. నా మాటలతో గిలిగింతలై...పిల్లవాడు లోలోపల కిలకిలలాడిపోవడం. కళ్లమెరుపులో, ఉబలాటం దాచుకోగలిగినంత రాయడా ఏం?–ల

విజయనగరంలో – ఎండ మండిపోతూన్నది. గుమ్మంలోనే బండిదిగి..అతనిచేయి విడవకుండా పట్టుకుని లోపలికి ప్రవేశించి...ఎదురుగా ఎవరూ కనబడకపోతే, మనరాక తెలిసేందుకు, గొంతు సవరించుకున్నాను.

పక్కవసారా వేపునుంచి...తలుపు తీసుకుని...వాళ్ళ అమ్మ – తలుపులు వేసుకు పడుకున్నది కాబోలు చీకటిలోంచి వెలుతురులోకి రావడంలో, చూపు ఆనడానికి కళ్ళు చికిలించుకుంటూ... చూసి పోల్చుకుని... దగ్గిరకు వస్తూ..."త్రోవతప్పి వచ్చారులాగుంది..." అంటూ అంత ముఖంచేసుకుని...మాకున్న స్నేహాన సరసమాడి... చేతులో ఉన్న విసనకర్ర...అందించింది, కూర్చున్నాము...

"దాహం కావాలా?"

"ఎంత త్రాగినా...దాహం తీరుతుంది గనకనా"

"పోదురూ...మీకు...వెయ్యేళ్ళకూ, చిన్నతనమే..." అని మరీ చొరవగా మాట రానిచ్చి...నాలుక కొనపంటితో నొక్కుతూ...సంకోచంతో..."వీ రెవరు?" అని శేఖరాన్ని సూచించింది ..

"ఎవరైతేనేం...నాతో వచ్చినప్పుడు...నా అంతవారన్నమాటే కాదూ..."

"నూరు ఆరైనా...మీ అంతవారు మీరే...అందరికన్నా...అయిదాకు లెక్కువ చదివితిరి!..."

"మన చదువు ఇతరులకు ఒంటపట్టింది, కాని..." – యీ ముసలి సరసాలకి అంతు అంటూ ఎప్పటికి ఉండేదో కాని యింతలో...అవతలనుంచి..."ఎవరే అమ్మా!–" అనుకుంటూ, ఆ అమ్మాయి...గుమ్మంలోకి లోపలనుంచివచ్చి అక్కడే ఆగి...నన్ను చూసి...వినుగనెక్కినంత సంతోషంగా...చంద్రబింబంగా ముఖం చేసుకుంది...

శేఖరం కళ్ళకు...ఆ అమ్మాయి కనబడటం...!

ముఖమంతా నీళ్ళు కారుతూన్నవి...తొడుక్కున్న బాడీ తడిసి ఒంటికంటుకున్నది... ఒళ్ళూ ముఖమూ సూదిమొనమోపే సందులేకుండా...పేలి, కందగడ్డలాగా...బాడీ, విప్పకుండానే...వీలయినంతవరకూ వీపుమీద, మెడదాకా ఎగసన దోసుకుని...దువ్వెనతో, చేయి వెనుకకు మెలివేసి గోక్కుంటూ...దురదలో హెచ్చుతగ్గుల తికమకలు ముఖ కవళికలో... పెదవి విరుపుల్లో ప్రకటించుతూ...తలంటి పోసుకున్న జుట్టు...పైనంతా రేగి... అలకలు కళ్ళదాకా అంటుకుని...చెవులూ ముక్కు...బోసిగా...

– అదీ...చూడటం శేఖరం...సుభద్రా కుమారిని...

"రా...సుబ్బులూ! యిక్కడ పరాయివాళ్లెవరూ లేరులే! యీ అబ్బాయి, నిన్ను చూడాలని ఊరునుంచి గంపెడాశతో, వచ్చాడు. ఆశ పెట్టింది నేనేననుకో. 'ప్రొద్దూత్సర్లను ముప్పతిప్పలా పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించుతూ, ఎక్కడో కొమ్మెక్కి కూర్చున్న ప్రసిద్ధ తారను మనం సందర్శించ వీలవుతుందా?' అని యీతడు

నిరాశ చేసుకున్నాడు. కాని...నేను, 'మరేం మునిగిపోలేదయ్యా! యిప్పుడంటే యిలా ఆకాశానికి అంటిందికాని సుబ్బులు నా కళ్ళముందర పిల్ల కాదూ, పరికిణీ కట్టుకోకుండా నా ముందర తిరిగేదే. దానిల్లు బంగారంగానూ, యిప్పుడింత యిదైనా మనం వెళితే ఆమాత్రం దరిశనమైనా యివ్వదా! చూదాముగా!' అని హామీ యిచ్చినంతపనిచేసి తీసుకువచ్చాను. రా, వచ్చి యిలాకూర్చో. యింటికివచ్చిన పెద్ద మనుషులకు మరియాద చేయడం...ఏంకావాలో, పళ్ళో, పాలో ఏమీ కనుక్కోకుండా యింకా చిన్నతనమేనా? పెద్దగా పేరుమ్రోగి..."

సుబ్బులు...దీపాలముందు నడకతోవచ్చి శేఖరం బారున కూర్చున్నది. అతడు కూర్చున్నచోట, ఆమె ఎక్కడ తగులుతుందో అని ఒళ్ళు కుదించుకున్నాడు, నేను నవ్వు ఆపుకున్నాను.

"ఎంత పేరుమ్రోగినా అదంతా మీ చలువే. దానికి యింకా నేర్చుకోవాలీ, యింకా బాగా పైకి రావాలీ, అని ఎప్పుడు అదే ఒకటే ధోరణికాని, అందరిలాగా విక్కులూ, నీలుగులూ నేర్చిన పిల్ల కాదండీ! అయినా, మీరు ఎరుగని దున్నది కనుకనా?" అని తల్లి అందుకున్నది· "అవునులే – అబ్బే! దానికవేమీ లేవు నేనెరుగను గనుకనా" యీ, లాటి అతుకు మాటలు; నడుమనడుమ విసురుతూ మాటకు అడ్డంవచ్చింది...

"మళ్ళా ఎక్కడా భూక్ కాలేదా?" అని ఆ అమ్మాయిని పలుకరించాను. సుబ్బులు తల్లివంక చూసింది.

"ఏమి భూకింగులో–"

"–వీళ్ళకు సమాధానాలు చెప్పలేక నా పని అవుతున్నదండీ...ఏపూటకాపూట ఎవరో ఒకరు రావడం...ఎంతైనా యిస్తాం పిల్లదాన్ని పంపించాలి అని ప్రాణాలుతీయడం. .తెరమీద ఎక్కి ఏదో తైతక్కలాడి రావడమూ కావలసింది మనకు?...దానికి ఎవరుబడితేవాళ్ళు తయారు... మనకు డబ్బే ప్రధానం కాదుకదా! – ఏదో...మంచిచోటుచూసి . అన్నీ కలిసివచ్చేటట్టుగా ఉంటేనేగాని...అమ్మాయి యీమారు కదలనంటూంది...దాని అవసరంఉంటే – దాని కాళ్ళదగ్గిరకే వస్తారు. . వచ్చారో...దేశాన్ని దోచుకున్నారే! అమ్మాయిపేరు చెపితేనే...కనకవర్షం కురుస్తుంది...ఎవరెరుగరు గనుక?"ఎట్ సెటరా–

– రాచకార్యం అయిపోయింది...కాఫీ...గీఫీ... ఎండకూడా, చల్లబడుతూంది:

"వెళ్ళి–వస్తాము..."

"అప్పుడేనా..." అన్నది, తల్లి. "ఈ పూటేనా" అన్నది, కూతురు...

"– ఎన్నాళ్ళున్నా మీ యింట్లో, ఎప్పటికప్పుడు పరగడుపే..." అని తల్లివేపు చూసి నవ్వి...సుబ్బులుతో – "అవును. నేను...యీవాళ బండికి వెళ్ళుతాను, మరి, ఈ పిల్లవాడు...నాలుగురోజులపాటు ఇక్కడ ఉంటాడు .మీకు తీరుబడిగా ఉన్నప్పుడు, చూసిపోవడానికి...వస్తాడు .."

...అని, "రావడం నీకు యిష్టమేనా?" అని చూపులతో ప్రశ్నవేశాను...

– తల్లి నవ్వింది: సుబ్బులు కిలకిలలాడుతూ, అల్లరి పిల్లవాడిని బెదిరించటం లాగా...నావేపుకు చేయి విసిరింది; నేను దూరం కావడంచేత తడవలేదు కాని, శేఖరం ముఖం నిండా...చేతిచెమ్మట...ఒత్తుగా జల్లుకుంది.

– "ఉండే నాలుగురోజులూ...యిక్కడే ఉండమనండి...ఏమీ లోపం చేయము కదా...మాకు కలిగినదాంట్లో..." అని అన్నది...తల్లి...

నేను శేఖరంవంక చూశాను; అందు కతడేమంటాడో అని; – "నేనూ బయలుదేరుతానండీ...మీతోనే...యింటిదగ్గిర మా అమ్మ బెంగపెట్టుకుంటుంది..." అని, నాకన్న ముందుగా లేచి నిలుచుని వీధివేపు దోవతీశాడు...

"యీ...ఊరు బాగుండలేదు కాబోలు, ఆ అబ్బాయికి..." అని యీసడింపుతో అన్నది తల్లి. సుబ్బులు నవ్వుతూ...క్రింద చతికిలపడి కూర్చుని...కుచ్చేళ్ళు మోకాళ్ళపైకి లాగి...దువ్వేన పెద్దపళ్ళతో...చర్మం గీరుకుపోయేటట్టుగా గోక్కుంటూ...యికిలిస్తూ..

తల్లి, గుమ్మందాకా నన్ను సాగనంపటానికి వచ్చింది; శేఖరం అప్పుడే త్రోవనుపోయే ఏదోబండి ఆపి అందులో ఎక్కికూర్చుని...ముందునుంచి...నన్ను తొందరపెడుతూ తొంగిచూసి, రమ్మని తలఊగించాడు. గుర్రం బెదిరినట్టుగా...బండీ పరుగెత్తుతూంది. శేఖరం, పరధ్యానంతో, మాటాడకుండా...ఎక్కడో చూస్తున్నాడు... నాలో, నేను మాటాడుకుంటున్నాను–

– "నయమే...సుబ్బులు ఒళ్ళు నిరుటిలాగా పేలలేదు. పాపం, క్రిందటి వేసంగికి...ఎక్కడబడితే అక్కడ సెగ్గెడ్డలు... కళ్ళూ ముఖమూ వాచిపోయి...ఒంటి చీరెనిండా నెత్తురుడాగులూ...అసలు ఒంటిమీద గుడ్డఅయినా నిలిచిందా... చూసేవాళ్ళకే రోతపుడితే..దానికది యింకా యెంత బాధపడిఉండాలి?–

"యింతకూ దానిననడం దోషం...తల్లి చెరిపేసింది.. బొద్దూడకముందునుంచీ... చుట్టకాల్చడం..నల్లమందు వేయడం నేర్పితే...అవి అందరికీ పడతాయా? అవి అయినా, పోనీ రోజుకు ఏ ఒకటో రెండో అయితే అనుకోవచ్చును. మూరెడూ బారెడూ...మగవాళ్ళకన్నా ఎక్కువగా – రోజల్లా ఒహాటే తగలేయడం...కుంకుడు కాయలంత ఉండలుమింగడం...ఏమన్నా అంటే...'యీదేశంవాళ్ళకు యింతే, మీకు తెలియకపోతే చూస్తూ ఊరుకోండీ...చేతనైతే మీరూ...మొదలెట్టండి...' అని మంచిగా, 'తగదు' అని బుద్ధిచెప్పబోతే...నామీదికి రయ్‌మని లేస్తుంది ఆ తల్లి, ఇంకా కొంతమెరుగు కాదూ...అందరిమీదలాగా...నామీద, ఆ తల్లీ కూతురూ విరుచుకుపడి...బూతులకు ... రేగితే... వాళ్ళముందు ఎవడు నిలువగలడు? – వాళ్ళనోటికి ఎవరు సమాధానం చెప్పకలరు?–"

"సరే... యిప్పుడు పులిమీది పుట్రగా కొత్త ఎడ్డడి కూడా వచ్చిపడిందా?... ఏంలక్షణంగానన్నా ఉంది...యిది... దీనికి పుట్టిన తెగులేకాని...సినీమాలో వేషాలు వేసేవాళ్ళందరూ...అలా ఒళ్ళు తెలియకుండా తాగుతారా? – అలా అయితే ఎంత సంపాదించినా ఆగుతుందా?...

"ఏమిటో...వీళ్ళని తలచడంకూడా పాపమే అనిపిస్తుంది, ఒక్కొక్కప్పుడు. అలా అనుకుని మానేస్తున్నామా? దాలిగుంటలో కుక్కలాగా...అప్పుడలా అనుకోవడమే కాని... తరువాత, బుద్ధి, మళ్ళా దానంతట అది పూరి మేస్తూనే ఉంటుంది...ఏమిటో...యీ బ్రతుకు...యిందులో, యిన్ని...అతుకులూ..."

–అర్థం లేకుండా...అసందర్భంగా...అడ్డదిడ్డంగా కొన్ని అబద్ధాలు.. బండిదిగేదాకా... విడవకుండా, అతనికి వినబడుతూండేట్టుగా...నాలో నేను గంద్రగోళం చేసేశాను. రైలుఎక్కి...ఊళ్లోదిగి...ఎవరిత్రోవనువారు యిళ్ళకు వెళ్ళిపోయినాము.

- నెల్లాళ్ళకు:

...తెరమీద...ఆతనికి పోలికఉన్న బొమ్మచూసి. డాక్టరుకు శేఖరంమాట జ్ఞాపకంవచ్చింది. "పుచ్చుకున్నన్నాళ్ళు – పుచ్చుకుని, అజాపజా తెలియకుండా పోయినాడు చూడరా, వాడు; యీపాటికి మంచం ఎక్కిఉంటాడులే"...అని అక్కసుతో మాటాడాడు.–"అవునోయ్! దేవర ఔషధమే సేవిస్తూంటే...యిప్పటికి, నీవన్నంతపనీ తప్పకుండా అయేది..." అన్నాను...డాక్టరుకు, త్రాగుతూన్న, సోడా..రోషంమీద కొరమారి...ముక్కుల్లోంచి, నోటినుంచీ త్రాగినదంతా గళబిళగా...ఉమ్మివేశాడు...రోజాడు.

గేటుబయటికి వచ్చాము...శేఖరం, సైకిలుమీద ఎక్కబోతున్నాడు...నన్నుచూచి...అగి దగ్గిరకు వచ్చాడు: డాక్టరు... అతని అభివాదము పెడమొగంతో కొంచెం టేకుగా అందుకున్నాడు...

"ఏమోయ్...ఏలా ఉన్నావు!" అన్నాను...

"కులాసాగా ఉన్నానండీ...మీ దర్శనానికి రావాలనే అనుకుంటూన్నాను...టెన్నిస్ మాచెస్‌కు వెళ్ళి నిన్ననే వచ్చాను...అందుచేత..."

"...సరే,...రేపు కలుసుకుందాము, తీరికగా.. డాక్టరుగారియింట్లో..." అని అతన్ని పంపించివేశాను.

"ఏరా...మంచం ఎక్కడానికి బదులు...సైకిలెక్కి ఝుమాయించి పోతున్నాడే... ఏమిటీ...మిరకిల్..." అని నిలవేశాను, డాక్టరును. గుక్కతిప్పుకోలేకపోయినాడు.

"ఏలా ఉన్నాడు యిప్పుడు?–"

డాక్టరు నీరసంగా..."బాగానే ఉన్నట్టు ఉన్నాడ"ని...ఉసూరుమన్నాడు.

"ఎందుచేత...ఏలా?...నీ మందే పనిచేసిందంటావా, నీకే నమ్మకం లేకపోయినా. నీకన్న గొప్పవాడు చేపట్టి... కుదిర్చాడంటావా?..." డాక్టరుకు...అన్నీ గొంతున పడ్డవి.

"పోరా...ఎవరికర్మం వారిది...ఎంతచేసినా...ఎవరికో యింకొకరి కామాట దక్కుతుంది!" అన్నాడు నిర్వేదంతో... యింటికి వెళ్ళి నడుం వాల్చిన తరువాత–

"మీకు మూాట దక్కితే చాలునుగా; ఏంరామరి, రేపు, వాడు ఫీజు తీసుకువచ్చి యిస్తాడుగాని, మరియాదగా పుచ్చుకుని...ఏ సనాతనుల సభకైనా ధర్మంచేయి..."అన్నాను.

"ఏం?" అని తల ఊగించాడు డాక్టరు...

"మెదడును ఏమాత్రం వాడనిజాతి, మీ తరువాత అది ఒక్కటే..."

"డిఫమేషన్..."

"–కాదోయ్! 'డి' కాదు 'రి' ఉన్నమాట ముఖంమీదనే ఒకసారికి పదిసారులు అనేస్తే...ఉలికి...లేకపోతే, ఏమిటిరా యింతవరకూ మీరుచేస్తున్న నిర్వాకం?...గడియారం యెడమచేతిలోలేందీ...నాడి చూడలేరు: చూచినా...ఒంట్లో ఎలావున్నదీ...జబ్బుఏమిటో, రోగి...మీకు పాఠం చెపితేనేకాని అర్థం చేసికోలేరు. యిందులో, యీ సర్వజ్ఞత్వానికి తోడు...నాలుగుసార్లు తొందరగా అటూఇటూ తిరగడం...అవతలవాడిని కసరడం.. అసలే వాడు ఎంతో అదుర్దాతో, ఏదో. ఉద్ధరిస్తారుకదా అనివస్తే...మీ హంగామాకూ భేషజానికీ...నిజంగా, ఖాయిలావచ్చేట్టుగా చేస్తారు తరువాత...కుదిరేభారం భగవంతుని అనుగ్రహంమీద...వాళ్ళు వాళ్ళు చేసికున్న... కర్మమీద..."

"అయితే...యిక మేమెందుకూ?"

"అదేరా నేను యిందాకటినుంచీ వేస్తున్న ప్రశ్న భాయీ, అంటే కోపంకాని... నీమటుకు నీవేంచేస్తున్నావు చెప్పు?. ..యింట్లో ఎవరికైనా జబ్బుచేస్తే ఏదుకొండల వాడికి మ్రొక్కుకోవడం...ముడుపుకట్టడం...తాయెత్తులు కట్టించడం...విభూతి పెట్టిం దం...దొడ్డివసారాలో, రంగాచార్యులు కూర్చుని కలవంలో నూరించి మాత్రలుకట్టి యివ్వడం. మీదాకా వచ్చినప్పుడు...అంతే యితరులకైతే...యిన్ని రంగునీళ్ళు.."

"ఎక్కడనుంచి...ఎక్కడకు తీస్తున్నావు...నీవనే మాట ఒకటైనా సబబుగా ఉందా?..."

"–ఉండదు...ఉంటే నీకర్థమౌతుందా? ఎందుకోయ్ యింకా మొరాయింపు?...శేఖరం సంగతి ఏమిటి చెప్పు..."

"నాకు తెలియదంటున్నావుగా...నీవే చెప్పు..."

అంతావివరంగా, ఆతడికి అర్థమయేట్టు చెప్పాను...

..."వయసువస్తున్న కుర్రవాళ్ళకు...సాధారణంగా ఎవరికో ఒకరికి తప్పు...అలా తప్పనిసరిగా...తెలియకుండా నడుము సడలుతూండటం.. సరే..."

"యిక్కడ ఏం వచ్చిందంటే...మనసులో ఆ అమ్మాయిని నిలుపుకుని, తరువాత, అసహ్యమే అయినా, అందులోనూ ఏదో తృప్తి పొందుతున్నాడు. .వాంఛతో ముదిరించుకున్న వ్యాధి...అరికట్టడానికి అతని ఆ తత్వానికి అలవికానిదై పోయింది..."

"అది తెలియక, నీవద్దకు వచ్చాడు. నీకూ అంత తెలివి లేకపోయింది. సామాన్య విధానాలన్నీ, అతనిమీద ఉపయోగించి చూశావు. సంసారం చేయించావు...కాని శకుంతలనేకాదు, సుబ్బులును తీసుకువచ్చి వాడికి అంటకట్టినా...మనము అసలు దానిని ఏమీ అరికట్టకలిగేవాళ్ళము కాము.

"మనసులో బొమ్మను...మనసుచేతనే చెరిపేయించాలి. మనసుకు రోషం ఎక్కితే...మనచేతకాని ఘనకార్యం... సమూలంగా...నిమిషంలో, అది చేసేస్తుంది.

"శేఖరం...అవాళనుంచే బాగుపడింది..."

"అన్నీ అలా ఒనగూడటం కాదు...నేను ఆలోచించి...చేసినపనే అది... సుబ్బులు మండువేసంగిలో మిట్టమధ్యాహ్నం ..అంత అసహ్యంగాను ఉంటుందన్న సంగతి నాకు తెలి సినదే...నేను అనుకున్నంత బీభత్సంగా లేకపోయినా...రోహిణి ముదరలేదుగా.. అదేవాడికి తల మున్కలైంది.

"ఆ దెబ్బకు...దిమ్మదిరిగిపోయి, సరిఅయిన ధోరణికి...తనంతట తానే మళ్ళాడు. ఎప్పటికి యిలాటి జబ్బు పడడు. కర్మంచాలక...ఒకవేళ పడే సందర్భమే అంటూ వచ్చినా...మీ సేవ చేయడానికి రాడు..."

– డాక్టరు...సిగ్గులేకుండా...నవ్వుతూ "యిప్పటికి నీ మనసు చల్లబడిందా?..." అన్నాడు..వెక్కిరించాడు..

...మరునాడు ఎదురుగుండా మేడమీద...గ్రామఫోను మోతలో గొంతులుకలిపి... శకుంతల, "చ–ల్లానా–యే–నూ–లేరా.. నాసామి ముద్దుగోపాలా..." ఘనా జటాగా పాడుతూన్నది; క్రింద, మనోహరి...ఎవరిమీదనో, రోజుకన్న యిబ్బడిగా అరుస్తున్నది...

* * *

# కథ

"ఊహూఁ, నేను రానంటూంటే ఏమిటి ఊరికేను? నీవు వెళ్ళరాదూ, నన్ను బ్రతిమాలకపోతేను?"

"రావూ?"

"ఊహూఁ"

"ఎప్పుడూ కూర్చుంటే ఏం తోస్తుంది...రా పోదాం"

"నేను ..రాను"

"నామాట వినవూ?"

"నామాట నీవు వినరాదేం? మహో – నేర్చుకుంటూన్నావులే"

"పోనీలే అమ్మ! నేనూ మానేస్తాను. ఎంతో సరదాగా పిలుస్తూంటే, నా ముచ్చట తీర్చడానికైనా రావచ్చునే"

"నేను రానే...ఏమిటి...ఓ...సాద నేను లేకపోతే కోవిల కూయదా, పూలు పూయవా, వెన్నెల కాయదా? నేనెందుకూ? నీవే పోయి అనుభవించరాదూ, ఆ వైభవమంతాను"

"వల్లకాదు"

"పోనీ – మానేయి, ప్రతిపనికి నాతో వంతేనా ఏమిటి?"

శాంతకు కోపంవచ్చి, ఇక అక్కడ నిలువకుండా వెళ్ళిపోయింది. వనం – వనలత – ఆమె వెళ్ళిపోవడం చూసి కూడా మాటాడకుండా ఊరుకుంది.

"ఎందుకూ పనికిరాకుండా – ఎవరికీకాకుండా – ఈలా అయిపోతున్నానేం?"

–కనుకొలుకుల్లో ఒకటిరెండు ముత్యాలు కనిపించినవి వనానికి. పైట చెరగుతో తుడుచుకోవలెనని యత్నించి మరల మానుకున్నది. ఒకటి – రెండు – ఇంకా బాష్పధార...ఆవేశాన్ని అపుకోలేకపోతున్నది –

"ఎందుకు – ఈ – లా బ్రతకడం – ఏమున్నదని...?"

"అక్కయ్యా! – వనం! – ఇదిగో నిన్నే –"

– ప్రభావతి నవ్వుతూ పరుగెత్తుకుంటూ వచ్చింది...

"మరే – రమేశమే – అన్నీ బడాయిమాటలేనే! – రెండు గేములు గెలిచాను – పట్టినాయనమ్మ! నాతోనే ఓడిపోయినాడు"

చిన్ని చెల్లెలిమాటలకి, ఆ విచారంలోనే, వనానికి నవ్వువచ్చింది.

"అలాగేం! –" అన్నది, ప్రసన్నభావం అభినయిస్తూ.

"మళ్ళా ఆడమన్నా! ఎప్పటికైనా సై౯—గెలవలేని కుక్క—గయ్యాళికుక్క—పారిపోయి, అమ్మదగ్గర దాక్కున్నాడు. రమ్మను—చేతనైతే"

☆ ☆ ☆

"అబ్బ! నేనురావాలా ఏం – అక్కడ ఎవరూ లేరూ–"

"ఎవరున్నారమ్మ, నాన్నగారు షికారు వెళ్ళారు, రజాక్ కారు తీసుకెళ్ళాడు. ప్రకాశం స్టేషనుకు వెళ్ళాడు, మరి తాతయ్యగారిని రమ్మనవా? ఆయన లేవనే లేడాయెను.."

"ఎందుకూ అంతచదువు? వస్తానులే –"

ప్రభ ముందుదారి తీసింది. వనలత నెమ్మదిగా ఆ పిల్ల వెనుక అడుగులు వేస్తూన్నది.

"అదిగో చూడు – ఆ కొమ్మను – ఉహూ౦–అది కాదే – నీలాంబరిమీదుగా – ఆ – అదే – నీవు కోస్తూండు – నేను గులాబీలు తీసుకువస్తాను – కోపి – ఫౌంటెనుదగ్గర పెట్టివచ్చాను కాని – అన్నీ కోయి – నాకే – శాంతకు చూపించమోక –"

ప్రభావతి పరుగెత్తుకుని పోయింది. వనం ఆ కొమ్మను బాగా వంచి, బాగా వికసించిన ఓపూవుకోసి, రేకలు త్రుంచివేస్తూ, తలవంచుకుని అక్కడనే నిలువబడిపోయింది.

"వనం!–"

ఉలికిపడి చూసింది. కాంతం, ఆమెనే చూస్తూ, చాలా దగ్గరగా నిలుచుని ఉన్నాడు. ఎప్పుడు – ఏ మూలనుంచి వచ్చాడో –

"ఎంతకాలం – వనం"

ఆమె ఏమీ మాటాడలేదు. మళ్ళా తలవంచుకున్నది. కాంతం ఆమె చెయి పట్టుకున్నాడు: ఆతని చేతిమీద కన్నీటిచుక్కలు రాలినవి–

"ఎందుకూ – తలఎత్తి – ఈలా చూడు, వనం!"

వనలత వెక్కి వెక్కి ఏడువ మొదలుపెట్టింది – కాంతం ఆమెను సమాశ్వసించాలనే యత్నంతో –

"ఊరుకోవూ – !" అన్నాడు చాల నెమ్మదిగా–

"నా మాట వినవూ – ఎందుకూ – ఊరుకోవూ?"

వనం వంచినతల ఎత్తలేదు. కాంతం ఎన్నోవిధాల ఆమెను బ్రతిమాలాడు. ఆమె మారుపలుకనయినా లేదు–

"వనం!–"

ఆపలేని ఆవేశంతో, కాంతం ఆ అమ్మాయిని కౌగలించుకోవలెనని ప్రయత్నించాడు – కాని ఆతని బాహువల్లరిలో చిక్కకుండా తప్పించుకొని – తేలకన్నులతో ఆతన్ని చూస్తూ జాలిగా – వద్దని తల ఊగించింది. కాని, కాంతం చూసీకూడా చూడనివాడిలాగా – ఆమెను – కౌగలించుకుని – పెదవి ముద్దిడుకున్నాడు. మళ్ళా – మళ్ళా –

ప్రభావతి పరుగెత్తుకుంటూ వచ్చింది. అతన్ని తప్పించుకోలేక...అతని కౌగిలిలోనే ఉన్నది, వనలత...

ప్రభావతి నవ్వుకుంటూ...ఒక్క పరుగుతీసింది.

## 2

"నిన్నుజూచి...ధన్యుడైతినీ...నీరజనేత్ర..."

పాడుతున్నది. ఊహుఁ, విచారమంతా ఆ కొంచెం సేపయినా మరచిపోవచ్చునుకదా అని...పాడుదామని ప్రయత్నిస్తున్నది; కాని సాగడంలేదు. వ్రేళ్ళు ఆడటమే లేదు. చివరకు, విసుక్కుంటూ పాటచాలించి, వీణను సోఫాకు ఒరగా అన్చి, తాను అలా ఓ ప్రక్కకు ఒరిగింది, వనం.

చీకటిపడింది. మేడంతాకూడా దీపాలు వెలిగినాయి. కాని, ఆ గదిలోమాత్రం దీపంలేదు...ఫేన్‌మాత్రం ఆడుతూంది.

ఎదుట పోర్టికో తలుపు తెరిచిఉన్నది. గోదావరి మీదనుంచి చక్కని గాలి వస్తూన్నది...ఏటినడుమనుంచి, గాలివాటు ఉన్నప్పుడల్లా, అవ్యక్తమధుర ధ్వనిలో పడవవాళ్ళ పాటల చరణాలు, అక్కడక్కడ వినబడుతున్నాయి. రొప్పుకుంటూ, వంతెననంతా ఊగిస్తూ, పాసింజరు పరుగెత్తింది. చల్లగాలికి గోదావరిఒడ్డుకు వచ్చి కూర్చున్న పిల్లవాళ్ళల్లో ఎవరో, గొంతెత్తి చక్కగా పాడుతున్నాడు.

"ఒదిలేశుని కొండలనడుమా<br>
వంచెగడ్డి కోసేదానా<br>
వంచెగుడ్డా, వల్లెగుడ్డేమే..."

వినపడుతున్నదికాని, వనలత వినిపించుకోవడంలేదు. ఏదో ఆలోచించుకుంటూ, ఎక్కడో, ఏ ధోరణిలోనో ఉన్నది.

"గిద్దలగిరీ కొండల నడుమా<br>
ఎద్దులకాసే...ముద్దులమరదీ<br>
నన్నుచూసీ నవ్వబోకోయి...హరిఒదిలేశా"

వనం – అప్రయత్నంగా ఆలకించింది. జాలిగా విని, నవ్వుకున్నది, అహోబిల నారసింహుడుకూడా, ఆడవాళ్ళ కోసం, అంత అవస్థపడుతాడుకదా అని...

"కట్టమీదనుం చెళ్ళేదానా<br>
కాలుకురచా చిన్నదానా<br>
కమ్మలిస్తా వెంటవస్తావా..."

–వనం చివాలున లేచి నిలుచున్నది. పాడేవాడి మీద, ఆ పాటమీద ఫెళ్ళున కోపం వచ్చింది. తలుపు మూసేద్దామనుకుని ముందుకు ధూకుడుగా వెళ్ళింది. కాని పోర్టికోలో అడుగుపెట్టేటప్పటికి, చల్లగాలికి ప్రాణం లేచివచ్చి, అలాగే నిలువబడిపోయింది. ఓ స్తంభాన్ని ఆనుకుని, ఉదయించాలని యత్నిస్తూన్న బాలచంద్రుణ్ణి చూస్తూ.

చూస్తూ – చూస్తూ ఆ చూపే క్రిందకు మరల్చింది. గోదావరి ఒడ్డున ఇంకా ఎవరో చాలామంది అక్కడక్కడ కూర్చునే ఉన్నారు. మనుష్యులు కనబడటంలేదు

కాని, సిగరెట్ల వెలుగు చూచాయగా గోచరిస్తున్నది.

క్రొత్తబులబాటం కాటోలును, ఎవరో...స్కూలు పిల్లవాడయి ఉంటాడు...టార్చిలైట్ మాటి మాటికి వేస్తున్నాడు. ఆ వెలుతురితో, భూమ్యాకాశాలు అలవి అయినంత వరకూ పరీక్షిస్తున్నాడు. ఓమారు వనం చాయల కూడా వచ్చింది వెలుతురు. అప్పుడు చప్పున ప్రక్కకు వొరిగింది ఆ అమ్మాయి...మళ్ళా చీకటి అయింది.

ప్రక్కగదిలో శాంత ఉన్నది, అలంకరించుకుంటూ గదిలో దీపం ఉన్నది, సన్నని గొంతులో ఏదో పాటకూడా వినిపిస్తున్నది.

ఒక్కమారే పాట ఆగిపోయింది. దీపం ఆరిపోయింది. ఉన్నట్టుండి మళ్లా వెలిగింది, మళ్లా ఆరిపోయి, మళ్లా...

వనానికి అప్పటికి అర్థమయింది...ఒక్క పరుగున లోపలికి వెళ్ళి స్విచ్ వేసింది. గదంతా వెలుతురయింది.

"శాంతా..."

"అక్కయ్యా!..."

పైటపిన్ను అమర్చుకుంటూ శాంత తనగదిలోనుంచి బయటికి వచ్చింది. వనలత ఆ అమ్మాయిని ఉరిమిచూసి,

"ఏమిటాపని" అని గర్జించింది.

శాంత...గోపోర్ పోజుతో...అలాగే నవ్వి,

"పాడుపని..." అని తన గదిలోకి తిరిగి వెళ్ళిపోతూన్నది.

వనం ముందుకి దూకి, శాంత జడ పట్టుకున్నది. శాంత కలవరపడి, తప్పించుకో లెనని చూసి, వశముకాక, నిలువబడిపోయింది.

"సిగ్గులేదూ?..."

శాంత ఊరుకున్నది.

"మాట్లాడవేం..."

శాంత ఎకసెక్కెంగా నవ్వి...

"అవును...అందరికీ...కాంతంలాటివాళ్ళు దొరకవద్దూ"! అన్నది.

–వనం ఒళ్ళు మరచిపోయింది. ఆ కోపంలో, చేయి ఎత్తింది.

"చిన్నమ్మాయ్!..."

వాళ్ల నాన్నగారు క్రిందనుంచి కేకవేశారు...శాంత తప్పించుకున్నది.

## 3

"నీవుకూడా రావూ?"

భోజనంచేసి మేడమీదికి వెళ్ళబోతున్నది వనం. కాంతం పైనుంచి ఎదురు వచ్చాడు...తప్పించుకుందామని చూసింది. కాని, మాటాడకుండా వీలులేకపోయింది.

"ఉహూ..." అని తల ఊపింది.

"రావూ...నీవుకూడా వస్తావని, చాలా అనుకుంటున్నాను...రావూ?"

వనం ఊరుకున్నది. కాంతం, దగ్గరికి వచ్చి...ఆమె చెక్కిలి నిమురుతూ,

"రావూ..." అన్నాడు.

ఆ అమ్మాయి అతనికి ఎడంగా జరిగి, చాలా దీనంగా,

"కాంతం!...నన్ను ఎందుకూ ఈలా హింసిస్తావూ?" అన్నది. అతడు తెల్లబోయినాడు.

"ఆయన...నీ స్నేహితులుకారూ? చనిపోయినవారు, కాని, నా మనసులోనుంచి పోలేదే...నీ మిత్రుడి భార్యను... అంటుపరచాలని చూస్తావా? అప్పుడు, నేను ఈ స్పృహలో లేను...నీ స్నేహితుని...తలచుకుంటూ...నీవు...ఈ పెదవిని...ఈ..."

ఆ ఆవేశంలో బలంకొద్దీ పెదవిమీద కొట్టుకుంది. నెత్తురు కమ్మింది.

"చూశావా...ఇదిగో..."

పిడికిలితో మళ్లా కొట్టుకున్నది. కాంతం అక్కడ నిలువకుండా క్రిందకు వెళ్ళిపోయినాడు. వనం అలాగే చాలాసేపు తలవంచుకుని నిలుచున్నది.

"అమ్మాయి, వనం! అక్కడ నిలుచున్నావే?"

అని వెనుకనుంచి ముసలమ్మ...మామ్మ...కేక వేసింది.

"ఏమీలేదు...పైకి వెళుతున్నాను..." అని వనం గబగబ మెట్లు ఎక్కిపోయింది.

గదిలో బల్లమీద...అతని...ఫోటో ఉన్నది. వనం దాన్ని తీసుకొని, చాలా జాలిగా చూస్తూ,

"నన్ను...వదిలిపెట్టి వెళ్లారు కాదూ...నేను...కూడా వస్తా..."

అని వెక్కి వెక్కి ఏడువ మొదలుపెట్టింది...

...గుమ్మంలో, శాంత నవ్వుతూ నిలుచున్నది...వనం ఆమెనుచూసి, కళ్ళ నీళ్ళు ఆపుకుంటూ, అక్కడనుంచి వెళ్ళిపోబోయింది. శాంత దగ్గరకు వచ్చి,

"ఏమి తోచదా ఏం నీకు, వనం! ఎప్పుడూ ఓటే శోకాలా? లే...వేళయింది, నాటకానికి వెళుదాము..."అన్నది.

వనం కోపంగా...

"నేను రాను..."అన్నది.

"ఎందుచేతనో?"

"నాయిష్టం!"

"పోనీ...నేను పనికిరాకపోతే...మీ కాంతం..."

వనం ఏమీ మారుపలుకకుండా తన ఏవగింపంతా ఆమెకు అర్థమయేటట్టు శాంతవంక జూచింది.

శాంత, ఆ బాణాన్ని లక్ష్యంచేయకుండా నవ్వి...వనం చేతినుంచి ఆ చిత్రాన్ని లాక్కొని సావకాశంగా చూసి—

"చక్కనివాడేనే...వనం...మీ ఆయన..."

అని ఆ చిత్రాన్ని ముద్దిడుకున్నది.

—"ఇంకా కదలరేమమ్మా! పది కావచ్చింది...అరగంటనుంచీ కారు వాకిట్లో ఉన్నది...లేండి...ఇంకా ఎంతసేపు?"

తాతగారు, ఓపిక చేసుకుని మేడమీదికివచ్చి హెచ్చరించారు. శాంత...

"చూడండి, మరి వనం రాదుట!" అన్నది.

వనం కూడా అందుకుని "నేను వెళ్ళనండీ...పోనిద్దురూ" అని, ఏదో పుస్తకం తీసుకున్నది, బల్లమీదనుంచి.

"అదేమిటమ్మా...వెళ్ళిరా, బాగుంటుంది...నీకోసం టిక్కెట్టుకూడా తెప్పిస్తే –"

"పోనీ, ఇంక ఎవరినైనా పంపండి"

"సరే, మీ యిష్టమమ్మా...నా మాటలు వింటారా"

అని ముసలాయన విసుక్కున్నాడు. ఆయన్ను నొప్పించడ మెందుకని, వనం ఒప్పుకున్నది.

– "నీవే కూర్చుందువుకానిలే కాంతం ప్రక్క...బలే –"

మెట్లుదిగి వస్తున్నారు – శాంత వనంతో మెల్లిగా అన్నది – వనం క్రిందకు చెంగున దూకింది.

"ఇలా కూర్చో. పోనీ నీయిష్టం...ముందుకూర్చో" అన్నాడు కాంతం. వనలత ముందు ఎక్కపోయింది – శాంత నవ్వి,

"అవును, రజాక్ ప్రక్కను బలే బాగుంటుందిలే...కూర్చో –" అన్నది. వనం మళ్ళా తిరిగి వెనుకనే ఎక్కింది. ఆమె వెంట శాంత, తరువాత కాంతం ఎక్కారు.

మూడు గంటలయి ఉంటుంది – నాటకం చాలా ఆలస్యంగా అయింది.

అంతకుముందు విన్న డ్యాన్సుసాంగు వచ్చీ రాని ఫణితిలో – ఈలతో విసురుతూ, డ్రైవరు, కారు వదిలాడు. వనానికి నిద్రతూలుతున్నది – ముందుకువాలి నిద్రపోయింది.

ఉలిక్కిపడి లేచింది...ఇంకా కారు సాగుతూనే ఉన్నది...నిద్రపట్టడంతోనే, అంతలో కలవరపడి మేల్కొంచింది.

అందుకనే...ఆ అవమానానికే కాబోలును.

రజాక్, ఆమెమీద చేయివేశాడు...ఆమె విదిలించుకుని ప్రక్కకు ఓసరిల్లింది.

ప్రక్కను...శాంత...కాంతం కౌగిలిలో ఉంది.

## 4

ఫోను మోటారు స్టార్టుచేసింది శాంత.

"...జాలముచేసి కలసి...వి లీరతనాల జామి
కీలజిత పంపేనన్న...తాలవనలోలా...అల..
నీమాట లేమాయెనురా...సామీ...పల్కరా..."

"ఎప్పుడూ...ఆ పాడూ జావళీలేనా...మరేవీ లేవూ..." అన్నది వనం...ఒళ్ళు విరుచుకుంటూ, సోఫాలోనుంచి లేచి...

"చాలా బాగుంటాయి...ఇది...విను..."

శాంత మళ్ళా ఒక క్రొత్తరికార్డు పెట్టింది...వనం చిడిముడిపాటుతో అక్కడనుంచి లేచింది.

"వనం!...ఇవాళే క్రొత్తఫిల్ము ఒకటి తెచ్చాను. తాతయ్యగారుకూడా చూస్తానన్నారు. నీవురావూ? శాంతా! నీవుకూడా వస్తావా..."

అని రమేశం ఎదురువచ్చాడు.

"వీటి తాతలలాటివి చూచాను, దాచుకో, నేను రాను నాయనా! తాతయ్యగారికి చూపించు కావాలంటే – అయనకు మహోఓపిక" అన్నది శాంత... రమేశము చిన్నబుచ్చుకున్నాడు. వనం అతని బుజంమీద చేయివేసుకుని, శాంతవంక తిరిగిఅయినా చూడకుండా, పోలులోకి వెళ్ళిపోయింది.

చూసింది కొంచెంసేపు...ఇక చూడలేకపోయింది...ఎక్కడ చూసినా శృంగార లీలలే...

ఇవతలికి వచ్చింది...ఇంకా ఫోను వినబడుతూనేఉంది. మధ్యమధ్య...ఆ ధోరణితో కలసీ కలియకుండా శాంత సంగీతమూను...

ఏమీ తోచడంలేదు, ఏదన్నా చదువుకోవచ్చును కదా అని, ప్రక్కగదిలోకి వెళ్ళబోయింది కాని, గుమ్మం దాకా పోయి ఆగింది. లోపల, వాళ్ళ నాన్నగారు, కాంతానికి వేదాంతం చెపుతున్నారు...వనం వింటూనిలుచున్నది...

"– చూశావూ...సంస్కారమంటే అదోయ్...కరవల్లిలో...ఆ యముడు...నచికేతుణ్ణి అడుగుతాడు...'యేయే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్కామాన్ఛందతః ప్రార్థ యస్వ...' అని...'ఇమా రామాః సరథాః సతూర్యా నహీదృశా లంభనీయా మనుష్యైః...' ఈ మాదిరిగానే ఎంత ఊరించినా...ఆ పిల్లవాడు...వయసుకు పిల్లవాడే కాని...మహానుభావుడా, తొణికాడేమో చూశావు...'వరస్తుమే వరణీయ స్సఏవ...' అని ఆత్మవిజ్ఞానం కావాలన్నాడోయ్...వాడా...ఇప్పటి కాలపు రకాలా...

"ఇప్పటి రకాలా...శ్వసతికథ మసౌ రసాలశాఖాం చిరవిరహేన విలోక్య పుష్పితాగ్రాం...ఈ బాపతేనోయ్...అసలు నేను చెప్పవచ్చింది ఏమంటే...శంకరుడు వీళ్ళ అందరిలోకీ నాయకమణోయ్...శంకరమతం...నీకు సులువుగా అరగంటలో చెపుతాను...ఎంతవాడో నీకే తెలుస్తుంది. భాష్యంలో...ప్రచురానంద..."

– "ఇప్పుడే వస్తాను ఉండండి"... అని కాంతం తప్పించుకుని వచ్చేశాడు..

"ఏమండీ శంకరాచార్యులుగారూ..." అని పలుకరించింది శాంత, వనం వెనుకనుంచి. ఎప్పుడు వచ్చి అక్కడ నిలుచున్నదో వనంకూడా గమనించనే లేదు...

కాంతం నవ్వి,

"వెనుకటికి శుకుడితపం చెడగొట్టడానికి రంభ వచ్చిందట. మరి, శంకరుడి..."

"...ఈ ఊర్వశి..." అని కనుసైగతో వనాన్ని చూపించింది శాంత. అతడు ఆమెవంక సాభిప్రాయంగా చూసి, ఏ కళ నున్నాడో, అక్కడనుంచి వెళ్ళిపోయినాడు.

"వనం..."

అని ఆమె బుజంమీద చేయివేసింది, శాంత.

వనం...'ఏం' అని తలఊచి అడిగింది...

"కాంతం...నిన్ను ప్రేమిస్తున్నాడు...అతన్ని..."

వనం అమెమాటకు అడ్డంవచ్చి...

"వద్దు...నాతో ఈ మాటలు చెప్పద్దు..." అన్నది.

శాంత రుంజుకుంటూ...

"అబ్బ...ఎంతఇల్లాలివే..." అన్నది...

వనం ఆడుపులిలాగా చెలరేగి...

"నేనా...నన్ను అనడానికి నీకు అభిమానం లేదూ.. నిన్ను ..నీవుచేసే పనులను చూస్తే...ఇల్లాలినా...కాను– నా మగడు...ఏ లోకంలోనో ఉన్నాడు. నీవు...నీవు"

శాంత ముందుకువచ్చి వనం చేయిపట్టుకుని,

"ఏమన్నావూ...జాగ్రత్త..." అన్నది...

"చేయి వదులు"

"వదలను, ఏంచేస్తావు?"

"వదలవూ?"

"ఊహూ..."

– రపీమని కొట్టింది వనం శాంతను. ఆ దెబ్బకు నిలకడతప్పి క్రిందకు – మెట్లమీదుగా దొర్లుకుంటూ పోయి, మేడ మీదికి రావాలని మెట్టుమీద అడుగువేస్తూన్న తాతగారిమీద పడ్డది. ఆయన అయ్యో – అయ్యో అనుకుంటూ క్రిందపడిపోయినాడు.

వనం గబగబ క్రిందకు వచ్చి – శాంతవంకైనా చూడకుండానే, తాతగారిని లేవదీసి, ఆయనకు సాయమై లోపలికి తీసుకునిపోయింది.

## 5

– ఎత్తినతల వంచకుండా, పైన తిరుగుతూన్న విమానాలని చూస్తూ నిలుచున్నది వనం పైమేడమీద...

కొంచెంసేపు తిరిగి. .చివరకు కనబడకుండా పోయినాయి..."స్వర్గంలోకి వెళ్లే విమానాలు ఏలా ఉంటాయో!"

...ఏమేమో తలపోసికుంటూ కన్నీరు పెట్టుకున్నది వనం.

"చూడు...చూడు, అక్కయ్యా!"

ప్రభావతి వనాన్ని హెచ్చరించింది...వనం ఆకాశం వైపు చూసింది.

"అక్కడ కాదు...క్రింద...తోటలో...అదిగో నీలాంబరాలదగ్గర..."

వనం చూసింది...తల తిప్పుకున్నది...మామూలే శాంతా...మరి...ఓ...

"శాంతా...ఇదిగో...ఇక్కడ..."

పిట్టగోడమీదుగా వంగి ప్రభావతి పిలవడం మొదలుపెట్టింది చేయివిసురుతూ. వనం వద్దని వారించింది, కాని అల్లరిపిల్ల, ఆమెను వినిపించుకోడంలేదు...

ఎంతో వయ్యారంతో, కులుకుతూ, శాంత వచ్చింది అక్కడికి.

"ఏం...ద్రౌపదిని మించిపోతున్నావ్?" అన్నది వనం. శాంత నవ్వి, ఆ మాట మార్చేసి, తలలో పూలదండ సరిచేయమని దగ్గరకు వచ్చింది.

–ఇద్దరూ క్రిందికి దిగి వచ్చారు...

హాలులో తాతగారు పేపరు చదువుకుంటూ కూర్చున్నారు...

"ఎక్కడికమ్మా!..." అన్నాడాయన ఇద్దరినిచూసి...

"షికార్ వెళ్ళివస్తామండీ..." అని శాంత జవాబు చెప్పి, వనం అడ్డుచెప్పకముందే ఆమెను లాక్కొనిపోయి కారు ఎక్కించింది.

"త్వరగా పోనీయవోయ్" అన్నది శాంత రిస్టువాచి చూసి...

"ఇంకా ఎంతత్వరగా...అక్కడేమీ మించిపోవడం లేదు..." అని రజాక్ మాట వెన్నుమీదుగా విసిరాడు.

"ఏమిటోయ్...ఒళ్లు దగ్గరపెట్టుకుని మాటాడు" అని వనం అందుకున్నది...

"పోనీలే...ఫరవాలేదు..." అని శాంత సర్దిచెప్పబోయింది.

కారు గోదావరి ఒడ్డున ఆగింది. ఇద్దరూ దిగి నడుస్తున్నారు, ముందుకుపోయి కూర్చుందామని...

"రజాక్ దగ్గరనుంచీ కూడా...నీవంటే అంత అలుసేనా" అని మందలించింది వనం...

"వాడి మొగం...ఏమీ తెలియదు. అమాయకుడు"

"మన నౌకరు."

"పోనీలెద్దూ..."

ఒకచోట కూర్చున్నారు. సన్నపట్టుచీరమీద నురి ముడుతలులాగా గోదావరిమీద, లేత అలలు పొటకరిస్తున్నాయి. వనం గోదావరివైపు చూస్తూ, పడుకుని ఉన్నది. శాంత, ఆదుర్దాతో దిక్కులు చూస్తూన్నది.

"ఇప్పుడే వస్తాను ఉండు" అని లేచి నిలుచున్నది.

"ఎక్కడికి"

"ఎక్కడికీ లేదు...ఇప్పుడే వస్తానుకాదూ..."

ముందుకు సాగిపోయి...తిన్నెలు చాటవడంచేత కనబడకుండా పోయింది శాంత...వనం ఆమెవైపైనా చూడలేదు...

క్రమంగా చీకటి మూసుకువస్తూన్నది. ఎవరో వెనుకనుంచి...వనం కళ్లు మూశారు. ఆ అమ్మాయి కలవరపడి లేచి కూర్చుని, బలవంతాన ఆ చేతులు తీసివేసింది...

కాంతం...నవ్వుతూ నిలుచుని ఉన్నాడు...

"కాంతం!...నీకు జాలిలేదూ..." అన్నది వనం. అతడు ఊరుకున్నాడు...

"దయయుంచి...నన్ను బ్రతుకనీయవూ..."

"దయయుంచి...నన్నూ బ్రతుకనీయవూ...వనం! నిన్ను విడిచి బ్రతుకలేకుండా ఉన్నాను..."

కాంతం మరీ దగ్గరకు వస్తున్నాడు...

"వద్దు...ముందుకు రావద్దు"...అని తాను వెనుకకు నడిచింది...వనం.

"ఉహూ...నీవు నాకు కావాలి...వనం..."

కాంతం ముందుకు వస్తున్నాడు...వనం చకచకా వెనుకకు అడుగులు వేస్తూన్నది:

"ఊరుకోవూ...కాంతం!..."

కాంతం వినిపించుకోలేదు...వనం ఆగకుండా వెనుకకు అలాగే నడచిపోయి...

గోదావరి మామూలుగానే ప్రవహిస్తూంది...ఆ పిల్లను తనలో చేర్చుకోవడానికి...రవంత ఎడమైంది...మరల కలుసుకుని కమ్ముకుపోయింది...

కాంతం అక్కడనే కూలబడిపోయినాడు...

చాలా చీకటిపడ్డది. రజాక్ హారన్ వేస్తూన్నాడు...శాంత నవ్వు చూచాయగా వినిపిస్తున్నది.

# దోదమ్మ

పున్నమి మళ్ళిన, – మూడున్నొక్క పొద్దున, – తొలిజామున తరుకేసిన కెంపుచుక్క, – రిమరిమ, సున్నలోకెక్కి శూన్యంలోకి ప్రాకి, – కానరానంతమేర కమ్ముకునివున్న మొయిలుతుంపరలో, ఒక మినుకు వల్లమాలిన వెలుగైపోవంగా, – రవరవమంచులు చిమ్మి – ఉహూహాలు ధారలు కట్టి, – ఏడుపాయలై ఏకరాశిని, – పాలవెల్లిమీద తొణికిపోగా, – పరుచుకున్న ముత్తెపుచుక్కలు, ఓ వాపి కదిలి, – వెలుగని వేడికి తీగెసాగి, – చుక్కలదారిలో సుడితిరిగి, :– నీడలున్న మేరల్లో, చిగురేసి, – తళుకు వాగులో, – మారాకు వేసి, – బెళుకు వాగులో, – మొగ్గతొడిగి, – ఏకమొయిని జారి, ఒంటిరేకవిచ్చి, – గాలితెరకంది, – మరింతవిచ్చుకుని, – మరో అలమీద, – పక్వానికొచ్చి – పాకానికొచ్చి – విప్పారిముల్లంత వెన్నేసి, – అంత వెన్నులోనూ ఓ రెమ్మ, పైరలో మరగిపోకుండా, – నేలమీద, – కావరాక వాలంగా, –

కోనలో వాయకుడికి, – కంటిమీద మెరుపు మెరసి, ఒంటికి సత్తువొచ్చి, – ఒక్కగుక్క, కుశేలొచ్చి, – గురువింద పొదమీద పులుగు పోరెట్టగా, – పుట్టినబిడ్డ పోరెట్టగా, – ఆ చేత అందుకుని, – అమ్మువిడిచినట్లు, – ఎగరేసి, – ఓ చేత అందుకుని, – ఔరకూనా, – సత్తువుంది, సంబరముంది, – గొంతులో బిగువుంది, – చూపులో పదునుంది: కోన ఏలుకునేవులే – అని, – ఓ కన్నెచేతి కెగురవేసి, – కోనదేవరా, వాకిలి పండంతపుట్టి, – తీయమామిడంత తేరుకోవాలి: పగవాడి కంటికి పనసముల్లు, కావాలి, – బైరుకున్న వడిచ్చి, – సింగం కోరుకున్న వాడిచ్చి, – నాగంత పరుగిచ్చి, – అలుగంత పదునిచ్చి, – ఆదుకోరా! – అని, మాట వేసారించి, – ఒంటిరెక్కాస గుబురు మొదల, – ఓ చెయి విదిలించి, – మంచుకుమల్లె, కెంపుచుక్కలుబుకంగా, – చుక్కనేలరాలకముందే, – కూనకు నుదురద్ది – ఇది, – నీ వెన్ను కాపురా కూనా, – అని, అని, – మొయిలుదేవుడా, – నీవు చినికితే, ముత్తెం దొరికింది – నీ సత్తెం జూపరా, – అని కొండాడి – కనులుమూసి, – మూడుఅంగలేసి – ఒక కన్ను తెరిచి, మూడుపరుగులుతీసి, – రెండు చూపులుకలిపి, – మూడు ఉరుకు లురకంగా, – ధగధగమనే గరపవెంపలిమీద, – పచ్చని, కాడ – రంగుకో చిగురు – చిటారున కెంపంత పువ్వు, – అల్లంత చిటిమాను కానరాగా – యిదే సత్తెమని, – తోడుగా పెరిగేవని, – చికిలి చికిలింత మండలు తెచ్చి, మానుతేనె పాదుకట్టి, – కడిమిపూల నీరోసి గోగుపుప్పొడి చల్లి, – మూడు పొద్దులకు గుబురుకట్టించి, – గుబురిచ్చిన నీడలో కూనను సాకమనంగా, –

వెల్లమొయిలు వెలుగేయంగా, – కొండగోగు పూసినట్టు, – కొణిదెవ చిగురేసినట్టు, – ఇరులు నిటారోయినట్టు – పున్నమి పున్నమికీ, – ఒక్కపిడికిలి,

– ఒక్క అల్లైతాడు, – రెండు అలుగులు, – ఒక్క బరిసె, ఒక్క సెలగోల – అంత ఉవ్వెత్తుకువచ్చి, – కూన ఎదిగి, – కోనకు సిరొచ్చి, – ఏడు నిలువులు ఎదిగి, – చిటారుపూవుతోవున్న పచ్చమాను, – వయసొచ్చినట్టు, – ఎవరినో కోయని పిలిచినట్లు, – ఊగులుపోవంగా. –

ఆ ఊగున, – కోనవాగుకు వెల్లువొచ్చి...వెల్లువరెచ్చి వరదొచ్చి, – కాలూన తావులేక ఏకమయం కాగా, – జీవాలన్నీ, – మరో కోనకు ఈదులాడుకుపోగా, – కోనసిరి, – తాపుట్టి పెరిగిన కోనకు వెన్నిచ్చుకోలేక, – మానికి ఎగబ్రాకి, – చిటారుకుపోయి, – కెంపుకొడిపూవును, – గోటితో గీరి, – మానువీకం – దీసి, – పదిలంగా చుట్టి, – అమ్ముకు లగించి, – ఆకాశంలోకి అంతరిక్షంలోకి విడువంగా...అలా దూసుకున్న పూవు, దారినిపట్టి... గాలిపొరమీద తేలుకుపోయి, – పుప్పొడి రగులంగా, – బరువెక్కి, భారమెక్కి, – తామరల మడుగులో, – మారాజు సీమలో, – సీమ ఏలేవాడి, గారాబాలకూన, – జలకాలాడంగా, – సరసను రాలె:

పూవుసోకిన మేర, – బుగబుగలాడి, – బుగబుగలాడిన మేర, ముదురుపచ్చదేరి, – వేయిన్నొక్కచుక్క, ఒక్క మొయిని మిడిసినట్లు, – చందమామ దూగర రేగినట్లు, – పాలవెల్లి నేలకూలినట్లు, వెలుగులు చిటపటలాడి, – రంగులు సుడికట్టి, – మడుగునీరు వడిపట్టి, – హంస కదిలినట్టాడంగా, –

రాలినపూవు, రంగు ముదిరి, రేకముదిరి, – పుప్పొడి పూసకట్టి, – పూస బుడగంతకెదిగి, – గాలిసోకిళ్ళ, చిటుకు చిటుకుమనంగా, – పుప్పొడిమంచు కమ్ముకోంగా, – రాచకూనకు, – మాయదారి మరులొచ్చె.. మనసును రెక్కలొచ్చినట్టనిపించె, – వినని ఎలుగు వినిపించె, – చూడని చోద్యాలు కనిపించె–

ఇదేమా అనుకున్నది, – రాచకూన, – నిలువలేకపోయె, నిదురగాకపోయె, – వెనుదిరిగి చూడంగ చీకటే అయిపోయె, తానెవ్వరైనదీ తెలియకనెపోయె...కనుమలసి చూడంగ మునుముందు వెలుగాయె–తనకు అందినట్లనిపించె – తానందినట్లగుపించె,–

అలా నిలువలేకపోయిన రాచకూన, – తనకు తెలియక, పలుకులేక, – పట్టు తప్పిన తీవెలాగా, – తీండ్రం మానిన సింగం జూలులాగా, – తమ్మిని విడిచిన తుమ్మెద ఝుమలాగా, – చంద్రుడు సోకిన చెంగల్వలాగా, – సొమ్మసిల్లి సోలిపోయి, – అదేమా అని ఆదుకునేవారు ఎవరూలేని ఏకాంతమాయెనేమొ, – మడుగున మల్లెలు కమ్మినట్టు, పైన జాజులు పయ్యెద సవరించినట్లు, – మందారాలు వల్లెవాటు వేసినట్లు, – పూపచిగురులు మేలిముసుగు నిమిరినట్లు, – కానరాని చేతులు, – తనకేమో అభరణాలిచ్చినట్లు, – అంగరాగ మలదినట్లు, – చిలిపిసేతలు చేసినట్లు, – లీలగా అనిపించగా, – బిడియం వసివాడించంగా, – తమకాలూ తబ్బిబ్బులుగా, – దొంతరవిడియ మందుకున్న మంకెన వాతెరతో, – కాముని చూడబోయే కన్నులతో మోమున నిండిన పున్నెముతో, – విన్నాణపు వేడుకతో, – వింతవేదనతో, – ఆణిముత్తెమంత మురిపెముతో, – చేర్చుక్కంత చెలువంతో, – నివ్వెరి మొనవాసి కలలో, – నిదురంత కాపురంచేసి, – మెలకువంత మగతా మమతా కుదురుకోంగా, – రాలిన పువ్వునందుకుని, – దాని సిగ్గులు నిమిరి, – కొనగోర కాటుకదీసి, – ఒక రేకను చికిలించి, – మరోరేక, – కెమ్మోవికద్ది, – అన్ని రేకలలా నెమ్మోమున హత్తించి, – రాలిన పూవును, రాజసంగా– పయ్యెద

కొత్తూరిచ్చి – చేపట్టిన వాని చెక్కిలి పుణికినట్లు, – వింత మనసుపోయి, – ఏమని పలికేనో –

గాలి పొరమీద తేలివచ్చి, – కానరాని వలపుతెచ్చి, – అలసిపోని ఆనందమిచ్చి, – కాంతుడు లేని కాపురమిచ్చి, – మిన్నంత కలలో కన్నతల్లినిచేసి, – బాలను ప్రోడను చేసినావు, యిది, – ఏ సీమ పట్లన వాని పంతమే! – తానందుక నన్నందుకుంటి ననుకున్నాడా, – నేలను నడిచేవాడు, నన్ను తేరిచూడరాదు., కొండకొమ్ముున ఉన్న వాడైతే, – నన్ను కోరుకోరాదు, – మానెక్కిన వాడైతే, – తనకు మనసైనా, – మక్కువ తీయలేనని పలుకవే... గాలిని పడిపో–

రాలిన పూావు, – వెల్లగొడుగై విచ్చుకోగా, – విచ్చుకున్న పూావు, – గువ్వలాగ పైన తేలగా, – తనకు తెలియక తానూ కదిలి – సీడను అడుగులు వేసి, – ఎదురయే చోద్యాలకు ఎడమోామై, – కంటికందిన, – వింతలకు పెడమోామై – సూటిచూపున – శూన్యంలో వెన్నెల కమ్మినంత మనసున, – అలాఅలా, – వాగులు దాటెనో ఏరులు దాటెనో, – గుట్టలు దాటెనో గుబ్బలి దాటెనో, – లెక్కలేకపోయి, –

అలా, – అడుగు కదిలి పోతూండగా, –

తామర మడుగులో, రాచకూాన తల పోసినప్పుడు, మానినున్న కోనసిరికి, – కొమరుతనం హెచ్చి, – కన్నెకలలో, కాంతుడైనప్పుడు, – మానుకూారి నేలపాదం పెట్టి – తానో తామర మడుగై, – కానరాని, తల్లితనానికి, – నూటొక్క హంస, – కూానలై, కనులబడగా, – సొమ్మసిల్లే ఆనందమొచ్చి, – హంసరెక్కలు అలసటలు తీర్చగా, – ముసిముసి నవ్వు ముసలి తనానికి, ముదిరే వేళ, –

తానెక్కిన మాని తావున, – కలయదిరిగిన కన్నెలేడి, కూానను విడిచిపోగా, – లేడికూానకు పుప్పొడి అద్ది, – తామర రేకులు తేనె దొన్నెలుచేసి, – వావిలి పూావులు మెదిపి, – ఆ ఉక్కెర మెక్కించి పెంపకం చేయగా, – కూానకు గుజ్జు సింగమంత, వెన్నొచ్చి, వేటొచ్చి, హంసలతో అన్నదమ్ముల పోలికను, – కోనసిరి కనుల నీడను గువ్వింతలాడుతూ ఉండగా, –

వెల్ల గొడుగు నీడ కదలివచ్చిన రాచకూాన, – తాను ఆ తావుకు చేరుకోగా, – చూడని తల్లిని చూసిన సంబరాన, – హంసలు కమ్ముకోగా, – ఒక్క హంస గునగునపోయి, కోనసిరితో గుసగుసలాడంగా, – తక్కిన హంసలు, బారుతీరి, బరాబరుల నడకలు నడిచి, – కోనసిరిని తల్లి కనులముందుకు తరలించుకురాగా, – లేడికూాన సింగం నీటున విద్దెలు చూపించగా, – చోద్యాన ఉన్న రాచకూాన, – కోనసిరిని చూసిందై, – కనులు అరమోడ్చిందై, – తలవంచుకున్న దాయెను, –

ఒక్క ఎగురున అందిన లేడికూానను, సందిట పట్టిన కోనసిరి మనసు యెన్నడూ లేని మరులోయింది,–

రాచకూాన, ఆకసాన, వెలుగు పొంగినట్లు పొంగిపోయి, – వేయిన్నొక్క చుక్క తళుకాడినట్లు, కదిలిపోయె – అంతలో ముత్తెమంత మోముచేసుకొని, – కనులతో ఏమన్నదనగాను, –

కన్నెతనాన కలవచ్చింది, – మెలకువ లేకనే ఫలించింది, – వెలుగు రాపాడగా పుటక యెత్తినవాడు, – నన్నేలుకున్నాడు. నేలకు రాలినవాడు, – నా వయసు నిదురపాల్జేసినాడు...నీవు తెలియక చేసినతప్పు, – నిదురలో నాకు మెప్పయింది...కానరాకుండా కాపురం చేశాము, – కలలు హంసలై పుట్టినవి: నా బిడ్డలు నాకు చాలు; కోసంత కోరికుండి, – లేడికూనవెత్తి పెంచి సింగాన్ని చేసినావు, – దానితో ఆట – ఆపైన నీ బ్రతుకు, – అని – తన దారిని తాను పోగా, – హంసలు అనుసరించిపోయె...

నాలుగు గిరులు కట్టి, – మడుగు చేసిన కోనలో కోసంత తామరల మడుగులో – ఆ హంసల పెంపకమాయె...

గిరుల కొమ్మలమీద చెంగలించే కూన పరుగందుకోలేక – కోనసిరి, – తాను పెరిగిన చిలికింత నీడనే తానో నీడగా నిలిచిపోయె...

★ ★ ★

# అంగరక్ష

కోడి మేలుకుంది. కొక్కొరోకోఁ–అవంగనే, వాడ మేలుకుంది.

వాడకట్టు జనానికి వంటిబద్ధకం, కంటిబద్ధకం వదిలే వేళకు, గోపురంలో గూడు మేలుకుంది, గువ్వ మేలుకుంది.

ఆలయంలో అయ్య మేలుకొలుపులకుగాను, అర్చకుడు ఓ రూపాజీవ సరసను మేలుకున్నాడు. స్నానం అయిందనిపించుకున్నాడు. విసుగ్గా విభూతి, కొట్టొచ్చినట్టు కుంకుమా, పెట్టుకున్నాడు. ఇన్ని పూవులూ, అన్ని దళాలూ, పట్టుకున్నాడు. తలపట్లుగా, ఆలయంతలుపు నెట్టాడు. సిగపట్లుగా, చీకటింట శ్రీవారిని సమీపించాడు. మూతి ముడుచుకునే, జ్యోతి వెలిగించాడు. ఆపద తరుముకొచ్చినట్టు అర్చన అయిందనిపించాడు. పూలూ పత్రి, అలవాటుగా గురితప్పకుండా గిరవాటు వేశాడు. పంచపాత్ర తల బొప్పికట్టేట్టు ఉద్ధరిణె తాటించాడు. ఆ చేత్తోనే, అరటి రవాకు తిప్పాడు. మంత్రపుష్పం విసిరేయబోతూ, అకస్మాత్తుగా అవసర నైవేద్యం మాట జ్ఞాపకంవచ్చి– ఒక్క పటికబెల్లం గడ్డ తీసి, పళ్లెంలో, ఖంగున పడేసి, చేతికందిన నారికేళం పగలేసి, వెరసి అన్నింటిమీదుగా, చేయిచూపించి, మరో ఉద్ధరిణ్డెడు ఉదకం అరివాణంలో రాల్చి, అంతసేపూ గొణుక్కుంటూన్న మంత్రం ఆపి సుతారంగా, మునివేళ్ళతో చెంపలు వేసుకుని, మొత్తానికి మొక్కు తీర్చుకొన్నట్లు పూజ ముగించి, నివేదన మూటకట్టుకుని, తిడుతూన్నంత దేదీప్యమానంగా, 'భక్తి తప్పినా ఫలం తప్పరాదు' అనే ముక్క, బండ యెత్తినంత బరువుగా నోటికొద్దీ ఊరిమీదికి గిరవాటు వేసి, 'అది, యెవడికి తగిలితే మనకేం' అన్నట్టు చేతులు దులిపేసుకున్నాడు.

నిన్నరాత్రి పక్కా ఝామున్నరపాటు పాటలూ పద్యాలతో, పరుండబెట్టి, శ్లోకాలూ స్తోత్రాలూ చదివి, పవ్వళింపు సేవచేసి, నామాల మాల ఏకరువు పెడుతూ, నానా విధ శక్త్యుపచార, భక్త్యుపచారములూ చేసి, కునికిపాట్లతో ఉయ్యాల ఊపి, ఎట్టకేలకు ఒంటరిగా వదిలిపెట్టిన ఉత్సవ విగ్రహాలు, వేసినపక్క చెదరకుండా, చేసిన అలంకారాలు చెదరకుండా, బుద్ధిమంతనవుపిల్లలకుమల్లె, పుస్తకాలల్లే ఎదురుబదురుగా, ఒంటిరెక్క మీద, అలా పరుండే ఉన్నారు.

వారి అతీ గతీ, మళ్ళీ అసుర సంధ్య వేళకుగాని, – పట్టించుకోవలసిన అగత్యంలేదు –

అదీ ఆనవాయత – ఉత్సవ విగ్రహాలకు మేలుకొలుపులు అంటూ లేవు; పవళింపు సేవకే, వారు బరిమీదికి వస్తారు. యీలోగా – వాటికి పులికాపు చేయడం, – అనగా, పాత్ర సామగ్రితోబాటు, తోలిచి, – తుడవడం, – ఏ కుర్రవాడో కానిచ్చి వేస్తాడు: అందుకు, అర్చకుడు స్వయంగా చేయి చేసుకోనక్కరలేదు: అదీ ఆచారం.

అక్షంతలు, – పిచ్చికలు ఏరుకు తినేస్తాయి. అదే వాటికి, ప్రసాదం, కువకువ మంటూ, కిచకిచమంటూ దేవర చిత్తానికి రా–వాటి సేవే సేవ!

అలాటి సేవలందుకుంటూ గుడిలో దేవర, తరతరాలుగా, చెక్కు చెదరకుండా, వెలసి, ఉండగా, ఊరికి ఉద్ధరింపుకాని కోవెలా, కోవిలకేసి చూడని కోటా, ఉన్నచోటనే ఉంటూండగా –

కోటలో, తరతరాలుగా, – పరివారము బలసి కొలువగా, – తిని కూర్చునేవారి సేవ లందుకుంటూ – బ్రతుకంతా, – పవలంత తీరికగా, – ఏరేయి కారేయి, వేసివేయని వేడుకగా, – వేసటగా, – అదే, ఆ వినుకలే తమ ఏలుబడిలో ఉంటూన్న ప్రజలకు మహా ప్రసాదంగా, – అలన చేయడం, తమ ఘనతకు తగనిదామైనని, కేవలం ఒక్క పాలన మట్టుకే సేవకుల భుజ స్కందాలచేత చేయిస్తూ, – తిట్లు వెదజల్లి దీవెనలు గొంటూ, – పానుపు మీద పాదాలు స్వయం శక్తిని క్రిందనైనా మోపకుండా, – హాయాములు వెలుగొందుతూండగా, – నారూ నీరూ కోరని పంట, – అరక దున్నని సేద్యంగా, – మడక దున్నని వ్యవసాయంగా, – కీర్తి చంద్రికలు గాదెల కెత్తించిన వారై, – అన్నదాతా అని పిలిపించుకున్నవారై, – ఉండగా, – ఉండగా –

వీరి హాయాములో, – అనగా, – నిన్న మొన్న ప్రాయానికి వచ్చిన బాలాజీ బుచ్చి తిమ్మ బహద్దరు వారైనటువంటి బుచ్చి నాయనగారి హాయాములో, – అప్పటికి గడచిన అన్ని రోజులలోనూ, ఎన్నికైన, ఒకానొక, సమయ్యాన, – అనగా, యీ చైత్ర శు॥ ౬, మంగళవారం, దుర్ముహూర్తం గుమ్మం వదలే, – ఉదయాన –

నగారా నౌబత్తులు, మ్రోగంగా మాంచి నిదురలో ఉన్న సువారం ధొరలు, కాచుకుని ఉన్న కడిగాపులవాండ్లు, 'దేవా, యిటు యిటు' అని, వారి చేయందుకుని చెవిదగ్గిరగా, మనవి చేయంగా, వారి మీసము వారు దువ్వుకున్న వారై, కనులు స్వయం కృషితో తెరచి, ఎదుట చూడక ఎటో చూస్తూ, ఎవడినీ కానట్టు, ఏ గోడమీద బల్లినో పలుకరించినట్టు, కొరమారిన గొంతును, ఏ చేతులో సవరించినట్టు, అదోమాదిరి అలవాటైన ధ్వనులు శాయంగా, చిత్తము చిత్తమనేందుకే, తల్లి గర్భంలోంచి, చేతులు కట్టుకుని, 'తుమాల' నెత్తికి సుట్టుకుని పుట్టినవాళ్ళు, ఎవడికి వాడు, కోట ఏమూలో అంటుకున్న దన్నంత గొంతుతో, నాయనా, నాయనా, అనుకుంటూ, ఒకడు నడుంపట్టి, మరిద్దరు లేవనెత్తి కూర్చుండబెట్టి, పిక్కలుపట్టి, పాదాలుచాచి, వెన్ను చాది, మక్కెలు గుద్ది, వారు ఆవలించంగా, చిటికెలు వేసి, 'ఏలిన వారు నిదుర లేచారు!' అని మనవి చెప్పకోంగా, ఆ వాక్యానికి, నిత్యకృత్యపు బూతొకటి కలిపి, పూర్తిచేసి, వాళ్ళచేత చిత్తం–చిత్తం అనిపించుకొని, ఉత్తర క్షణంలో, పంచాంగ శ్రవణానికి బాసిపట్టు వేయించుకున్నవారు కాగా,–

కాలంనాడు, పాత హవేలీలో, విజయం చేస్తూన్న వారైన గిరిజాల ప్రభువులకు, ఏవేళకు ఆ వెన్నెల పడుతూ, వయసంతా, ఒక్క పొద్దులుండని కాలక్షేపం చేసి, అక్కడి నిధులూ నిక్షేపాలూ...చిత్తము వచ్చినవారిని గుత్తకొనడంలో, నోటిసాయం చేతిసాయంతో కొల్లపోగా, రక్తి రగిలి రగిలి, చిగురుకు, చెక్కుచెదిరీ చెదరక గోడలూ గొబ్బెలూ మట్టుకు మిగులంగా, ఆ తగులాటం తనకేల అని, వాటి పాపానికి వాటిని వదిలి, తన పుణ్యాన తాను పోతూ, ముక్తికి ఏనాటికీ లోటు లేనేలేదు

కనుక, లోకసాజంగా, ఒక్క కన్ను భుక్తిమీద ఉంచి, యిప్పటికీ, వెనుకటి మంచే అనిపించుకుంటూన్న మాణిక్యం,–

ఎన్నడో తానూ ఓ బాలాకుమారే గనుక, అప్పటి పాటనా, పైట సర్దుకుంటూ, కుచ్చెళ్ళు దిద్దుకుంటూ, ముచ్చటి చూపులు చూసుకుంటూ, పిలువనంపి నారన్నంత చనవుతో వచ్చి, పలుకరించి పరిహాసం పట్టేరన్నంత బింకంతో, అట్టే ఒక్క కులుకు కులికి, అలవోకగా బరాబరులు చేసినదై, ఎదుట రేవిణీమీదనున్న వారి వాలకం ఓరకంట కనిపెడుతూ ఉండగా, వారు సెలవిచ్చారు గదా!

"పానకమా! – పాయసమా!–"

అంతలో మాణిక్యం మనవులు సెలవారబోసిందిగదా!

"..పానకమంత పలచనకాదు, పాయసమంత చిక్కనకాదు – కొంచెం కుడీ ఎడం – పచ్చిజామకాదు – పండుమామిడి కాదు. యిప్పుడిప్పుడే దోరకు వస్తోంది. ఆరగారగా, అనుభవించేందుకు మమ్మేలినవారికి, ఏవేళనైనా, అదుపులేదు, అభ్యంతరం లేదు కాని, అద్దాన్నపు బ్రతుకులూ, అల్పబుద్ధులూనూ!"

అయ్యో పాపమని ఆదరించపోతే, అణాకాసు రూపాయ్ ఒళ్ళల్లే మోగలే దేమందిట, వెనకటికో వీబ్రాసి.

"చిత్తగించండి, బాబూ" ఎంత కాయకం వచ్చినా ఎద్దు – ఏడు మాడలు పలుకుతుందా?

"తుల మెత్తుకు – తులమెత్తూ బంగారం – మేలిమి కావాలట. దీని ముత్తవ ముల్లె, తమరి దగ్గిర దాచబెట్టినట్టు–

"ఊపిచూసినా–ఉహుఁ మొగ్గందే! చిన్న మెత్తు తగ్గదట! అశాపాతకం! తిరిపానికొచ్చామా, దేవురించొచ్చామా, ఒళ్ళిచ్చుకుంటున్నామ్–ఒక్క ధరైతే ఖరారందా మనుకున్నామ్. తూగ లేకపోతే ఒగ్గేసెయమను– అనేసిందయ్యా!

"ఏలినవారు–చల్లగా ఉండగా, మరో తలకు మాసిన లక్ష్మీపుత్రుడు, తగు దునమ్మా–అని, ముందుకు రాగలడా– బయానా యివ్వగలడా? ఒకవేళ, యిచ్చిపుచ్చుకోడాలంటూ వచ్చినాయే అనుకుందాం–యీ ధర్మప్రభువులకు కాకుండా కన్వేసి అరాయించుకోగలడా?

"ఏడబుట్టి, ఏడ పెరిగినావే, దగిసీ, యీ అయ్య అనంగా, కోటిలో ఎన్నికైన మగరాయుడు కాడటే –

"కావాలెనని సుంత కనుసైగ చేసితే–
రావద్ద వొద్దికకు రంభ చెల్లెలైన
నీవుగామంటేను నిన్ను మించిన దొకతె–
ఈ సీమ దొరకదేమే ఏమేవ్"

మమ్మేలినవారి మీదనేకదా, వెనుకటికి ఆనాడు, సారంగపాణి అయ్యవారు పదం పట్టి పాడింది–, అలాటి పరువున్నవారి, పాదాల నీడ పడిఉండటం, కట్టినకోకకట్టక, పెట్టిన సొమ్ము పెట్టక, ఏడువారాల పున్నెమూ ఏకపానుపు చేసి, ఏలుకోమంటే, ఏలినవారు ఆలకిస్తే, అద్దదీ ఫలంపాటు కానీ, పరి గేరుకు తింటే అదో బతుకా! యింత మదుపు, యింత మక్కువ నీకు ఎక్కడ దొరికేనే?

సీమధారసానులంతటివారు పనిగట్టుకు పడవెక్కివచ్చి, బెదురూ బెరుకూ లేకుండా, చెట్టంత మొగుడు ఎదురుండగా, వీరిచేతికి చేయందించి, మీద చెయ్యేయించుకుని, వారి బాసలో వీరితోబాటు డాన్సులాడేవారే—చూసినవారు యిప్పటికీ చెప్పకుంటారు అది కలియుగవైకుంఠంటే! అలాటివారే, మా అయ్యవారు! ఛప్పన్న దేశాలవాళ్ళ సరసాలూ ఎక్కాలప్పగించి నట్టప్పగించేరే!

ఆసి నీ ఉబ్బు తబ్బిబ్బుకానూ

సొమ్ము శాశ్వతంకాదే అమ్మ—

మీయమ్మ మాటవినకే—

అలాటి ప్రాపకం—మళ్ళీ రమ్మంటే రాదే! అని, ఆ పింజెకానాను నయానా భయానా గట్టిగా కదలేశాను! కాని, బాబూ, దాని తల్లి గోరుముద్దలోనే ఏదో మంత్రం మదుపూ బెట్టినట్టుంది. అదీ, మెట్టు దిగలా! పైగా, అంటుందికదా, నాకో పదొచ్చెనో, నీకో పరకిచ్చేను!

పలుకుంటే పరగడుపేలనే వదినా –

వట్టి చేతులూపుకుంటూ వచ్చి, వారికి అప్పనంగా వరగబెడితే, నాకేం ముట్టాను!...నీకేం గిట్టాను? యిలా గిల్లికజ్జాకువచ్చింది బాబూ, మళ్ళీ జన్మకది మాయదారి ఒంటరి మగనాలు కానూ!

మీ గులాపుదానికి అంత అక్కరే వచ్చి, అంత అవసరమే వచ్చినా, దాని పక్కనలుగుడు సొత్తుకు చేజాస్తానా? యిచ్చేప్రభువులున్నారు – రాజాంగంగా పుచ్చుకుంటూను—పుచ్చుకుంటూనే ఉన్నాను!

అంతేకదా మన రివాజు.

యిచ్చే యీడున యిచ్చుకోవాలి పుచ్చుకునే తీరున పుచ్చుకోవాలి.

నిన్నగాక మొన్న కళ్ళుతెరచిన యీ బోడిపిల్లకు – ఆ మచ్చికలూ తెలియవ్, ఆ మర్మాలు తెలియవ్ – పోనీండి బాబూ. అది కాకపోతేమానె, దాని అక్కకూతురు మరొక్కతె అనువుకొచ్చేను. రేపో మాపో, మంచి పొద్దువేళకు, నేనే వెంటబెట్టుకొచ్చేను.

మాంచి వద్దికా వనరూ ఉన్నదాన్ని, దిద్ది తీసుకొస్తాను.

హస్తార్పితం చేస్తాను. ఆపైన అంటారా –

అడిగించుకునే అలవాటుందా, యీ అందాల బాబుకు? "అద్దిరా సుద్ది!" అని అద్దాల మేడకు వచ్చినదాన్ని వట్టి చేతుల్తో పంపివేస్తారా, యీ వైభోగ వసంతరాయలు! నిద్దురలోనైనా, నిలువునీటు మానని, యీ మానినీ మన్మధులు మాచేత పేద అరుపు లరిపిస్తారా?—కలలో మాట!

ఎదటఉన్నవారు, ఎప్పటికప్పుడు పెళ్ళికొడుకులే!

మమ్మేలేవారు, ఊరుకూ వాడకూ బాలాకుమారులే!

– మీ సిరిగల పాదాలకు మ్రొక్కి, మరులిచ్చే చూపులకు సొక్కి, మాకందని ఆ చెక్కిలి ఒరకంట నొక్కి మీ దివ్యరూపమే మనసులో కౌగిటబట్టి–

ఏ విరిబోణికైన వెన్నుడవై,

ఏ మోహినికైన ఈశ్వరుడవై,

ఈవీ రీవీ వెదజల్లుకుంటూ,

వెన్నెలంత వేడుకతో, విలసిల్లాలని విన్నవించుకుంటున్నదానన్నై, కుంటున్నాను బాబూ...మరి, నాకు సెలవిప్పించండి బాబూ.

– వేగిరం సెలవిప్పిస్తే వెంటనే తిరిగి వచ్చి, మరో ముచ్చట సొనుకూలం జేస్తాను బాబూ–తమరి చేతిమీదుగా సెలవు పుచ్చుకుని కదిలిపోతాను బాబూ!"

ధొరవారు పలుకలేదు. చేతులు కట్టుకున్నవానివంకకు జూసి, తల ఎగరవేసినారు. వాడు, పిడికిలి డమరుకమల్లె ఆడించగా, మాణిక్యము, ధొరవారి సన్నిధినుంచి కదలంగా, –

యిక పండితగోష్టి ప్రారంభమైంది–

– పంజరంలో పెరుగుతూన్న చిలుకను, ధొరవారి సన్నిధిలో, అల్లంత దూరంలో ఉంచగా, వారు చేత ఫలమందుకుని, దాని కందకుండా కవ్వించంగా, ఆ పులుగు స్వస్తి వాచకముగా, సంబోధన ప్రథమలతో, ప్రభువుల గుణగణాలు ఒక్క సహస్రముపైగా, సంతచెప్పి వింత వింత తద్ధితలు పన్ని, ఉగలుక్సమాసములు అల్లి, దండాన్వయముతో చెండాడి, ధొరవారి తల్లి తోబుట్టువుల వీరవిహారములు ఒక్కొక్కరుక్కుగా, ఘన జటక్రమాలు గుప్పించి శాంతిపన్నము ముమ్మారు రెట్టించి, ధొరవారి మునివ్రేలు, ఒడిసి పట్టి ఆకలి నొక్కు నొక్కంగా, వారు తమ పాండిత్యము దానిమీద కురిపించంగా, చిలుకతోబాటు సేవకులూ టెక్కలు ఎగురవేస్తూ సంబరాలు పోగా–

ఆ తరుణాన, బాబాజీ బుచ్చితిమ్మ బహదర్‌వారు వ్రఫ్ బుచ్చినాయన, ముందు వర్తమాన మంపకుండా, దయచేసిన వారు కాగా –

ధొరవారు దిగ్గున లేవబోయి, తాములేచి నిలుచున్నంత గౌరవాలు సేయంగా, సేయకపోగా, వారిని వారించినవారై, ఏమని సెలవిచ్చినారంటేను–

"తమరు, యిలా నిత్యానందులుగా ఉండటం–తమ సన్నిధిలో, యీ వినోదాలు సాగడం–తమతోబాటు సేవకులూ సంతోషాన ఉండటం–"

"మన పుణ్యం" – "మనం దేవాంశ సంభూతులంకదా నాయనా!–"

"చిత్తం!, తల్లులు కన్నారు–దాదులు పెంచారు. దేవతలం కనుక మనిషి బుద్ధులు మనకు నేర్పలేదు! మనుష్యులను చేయలేదు!–మనం సంభూతులమా–బూతులమా–సెలవీయండి! – మనం ఏనాడూ, అమ్మను అమ్మా అని పిలువలేదు: అమ్మచేతి గోరుముద్దలు తినలేదు – వారి చంకనెక్కలేదు. అందుకనే మనకింత కసి – పక్షిచేత పలుగుచేత వారిని తిట్టించి – మనం పరమానందపడతాం–చిత్తగించారూ!

ఈ ఉదయాన్నుంచీ–దేవతల రోజులుపోయినాయి, మనుష్యుల రోజులు వచ్చినాయ్ యిది – మనుష్యులూ, మానుషాలూ ఉండే కోట–దేవతలకు చోటులేదు: తమకు దేవిడీమన్నా–సువారం తవ్వించేస్తున్నాం. కోట పడగొట్టించేస్తున్నామ్. ఈ ఆట–కట్టు! నేను మనుష్యుల్లో మనిషినౌతాను. తమరు దేవతలు కనుక ఏ దేవాలయానికో దయచేయవచ్చు–" అనంగా,

"మా – నాయనకు ఎవరిమీదనో కోపం వచ్చినట్లుంది."

"నామీద నాకే–అది మీ మీదకొచ్చేనేమో – చెట్టుకు కట్టిస్తానో, చెంపపెట్టు పెట్టిస్తానో – కట్టుబట్టలతో గుమ్మం అవతలకు నెట్టిస్తానో–చెప్పలేం! చేతికందినముట్టుకు స్వీకరించి, విజయంచేయండి!" నాయన, అక్కడ నిలువలేదు.

ధొరవారికి – మరి కాలు నిలువలేదు. సరివారితో మంతనాలు చేశారు ఏలినవారిమాట సాగరా దనుకున్నారు.

దిక్పాలకులందరూ స్వర్గం విడిచిపోతే – దేవతల గతేంగాను ప్రభువులూ! అని పరివారం మొరబెట్టుకోగా–మంచిది–మే మెక్కడకు పోయేమురా – ఏలినవారికి ఏదో పీడకలొచ్చింది. బుద్ధి ఒక్కక్షణకాలం చలించింది. అంతే, కాని, యీ వెర్రి ఎంతసేపులే – అని ఓదార్చినారు.

ఆ వెర్రి అట్టే నిలిచిపోయె–పోయి పోయి వేయి విధాలాయె.

ఇక మనం కలుగజేసుకోవలె ననుకున్నారు. సగౌరవంగా – కట్టివేయించి – గుట్టు చప్పుడుకాకుండా గట్టిచికిత్స చేయించవలె ననుకున్నారు. కాని–ఏలినవారు–ఏరీ–

మండలాధీశ్వరుల దగ్గిరికిపోయి వ్రాలారు. ఆ కరగ్రాహాలు వీరి కరస్పర్శచేసి – కూర్చుండవేసి – వివరాలు విని, విని – అర్థంకానితనంలో – ఆ మాటల్లో ఉద్రేకం – ఆ మనిషిలో ఉద్వేగం – వైభవంగాకాక వంటిగా రావడం – "మేము" అన్న పలుకే లేకపోవడం – గమనించినవారై "జమీందారుగారూ! మీ పెద్దలు బాహుబలంతో రాజ్యాలు సంపాదించినవారు. క్రింది తరాలవారు ప్రతాపంతో రాజ్యాలు చేసినవారు పరగణాలో ప్రజలకు దేవతలు మీరు. మామూలు మనుష్యులు కారు. ఎందుకో బెదిరినట్లున్నారు. భయంలేదు. మీకు సీమ ప్రభుత్వపు రక్షణ సర్వదా ఉండనే ఉన్నది. పోయి రాజ్యం చేసుకోండి–" అన్నాడు. మీరు మహారాజులు! మీకేమండీ! అని మరీ మరీ అన్నాడు. నాయనకు, నిజానికి మతిపోయింది. "నన్ను మీరన్నా ఓ మనిషిని చేయండి" అని వాపోయినాడు. చేయించినారు – చికిత్స –

పదికాలాలు గడిచినాయ్ – బావుటాలు మారినాయ్ – దేశం–అశోక చక్రవిహితమై–ధర్మం–పాణిపాద రహితమై– గగనయానము కాగా–

అనాటి రాజసాలు పడుకు నూలు తెలిఉడుపులు కట్టగా–అనాటి విలాస విహారాలు–గీతా పారాయణ చేయగా–అనాటి నిద్రలేనిముద్రాధికారం కుటీర పరిశ్రమ కాగా–

సాలెరాట్నం – సరకారు యిలాకా భవనాలకు ముఖ్యాలంకారం కాగా – ప్రజలమీదికి ప్రణాళికలు రాగా – పరగణాలు చీలికలు కాగా–యిదే స్వాతంత్ర్యంకాగా–నాయనకు విమోచన కలిగింది: విడుదల చేయించింది–ప్రభుత్వం.

కోటలేదు. కోటతాలూకు ఒక్క పిట్టలేదు. ప్రభువు వారి పెద్దలు చేసిన రాజ్యం–ప్రజలకు శ్రమదానమైంది.

మందిలో పడ్డారు నాయన–అది మాబాగే కాకపోయె.

వెన్నుకటి జమీందారనేరు కొందరు – పాపం–వెర్రివాడనేరు కొందరు.

వీడూ మనతోబాటు మనిషే అనడు – అనలేదు ఒక్కడూ –

నేనూ–మనిషినే నర్రా!–అని మరో వెర్రినాయనకు–దానికి–చికిత్సా?–ఉహుఁ – మనిషిని మనిషిని చేయడం – భగవంతుడికే చేతకాదు. ప్రభుత్వమేం చేయగలదు–పాపం! సువారం ధొరవారున్నారే – వారు ఎలా కాలం గడుపుతున్నారంటావా – ఆ మాణిక్యం ఉందే–తిన్న విశ్వాసాన–తన పంచనుండనిచ్చి యింత కాచి పోస్తూన్నది. వారు అదే – రీవితో – అలనాటిరాజసంతో – నీమాజామాతో – ఓ కుక్కిమంచంమీద

కూర్చున్నవారై - మతిలేదు కనుక మహారాజులల్లే - బ్రతుకుతున్నారు.

అబ్బాయ్ బాబాజీ బుచ్చితిమ్మ బహద్దురున్నాడే - వాడు...ఉహుఁ-వాడు.. వీడే-ఆ బుచ్చయ్య!-

ఒహారి నమ్మకా నమ్మకాలతో నాకు నిమిత్తం లేదు. యింతకాలానికి-నేనూ ఓ మనిషినే అని, - నామీద నాకు గట్టి నమ్మకం కలిగింది. వెఱ్ఱికి వేయి విధాలు. అందులో యిదొహటి అంటావా - అయితేమానెలే యీ తరహా నాకు ఆనందంగా ఉంది!

ఆఁ...ఒక్కవిషయం...ముఖ్యవిషయం నే చెప్పలేదు...నీవు అడగాలేదు. అదేమిటంటే...

ఒక్క ప్రశ్న - నేనే వేస్తాను-విప్పుతాను! మా పుటకేమిటి?-మా పెంపకమేమిటి?-

మా నాయనగారు. వారి పెద్దల లాగానే - అన్ని అచ్చటలూ ముచ్చటలూ తీర్చుకుంటూ - ఓ కన్ను కోళ్ళమీద, ఓ కన్ను జవరాళ్ళమీదా, ఉంచి, ఎన్నడన్నా-రీవిగాను, ఏనుగో, గుర్రమో ఎక్కుతూ, తతిమ్మా వేళల్లో, బ్రతుకే పడకటిల్లుగా, జుట్టూ-కట్టూ, యథాలాభంగా, చెరిగేందుకు యియ్యకొనే, యిందువదనలు పందిరిమంచంగా, తోయజముఖుల తొలి ప్రాయమే హంసతూలికా తల్పముగా, ఉవిదల ఉష్ణాంగే ఉపబర్హణంగా, అలా అలా, వేదోక్తమైన పరిపూర్ణ ఆయుర్దాయము అనుభవించిన వారైనారనేది, జగద్విత మే.

నేనూ, అలాగే మెలగవలసిందేకదా?-

అబ్బాయ్, మా దాదులు, మాకు చిన్నతనంలోనే చిలిపితనం అలవాటు చేస్తారు. నూగుమీసాల వేళకు నూత్నమర్యాదలు అన్నీ సదరు సాముగరడీల క్రమాన తరఫీదు చేస్తారు. చవకబారు శృంగారం మాకు దూమెరుగు పెడతారు. సంసారి అయినవాడు కలలో అయినా తలవంచవలసిన అవక తవకలు - మాకు మర్దన చేస్తారు. ఆ మత్తు!...మా సత్తా! ఆ గతుకు మా బ్రతుకు! అదే మా వరస! అలా క్రిందా మీదా పడుతూ, అదే స్వర్గమని భ్రమపడుతూ...నిత్య కృత్యాల్లో, ఏదో నిదురమత్తులో, ఆ పూటకు యింట విస్తరి వేస్తాం. ఒక్కొక్కప్పుడు, వంశోద్ధారకుడు ఉద్భవిస్తాడు. అదీ, రాజసాని కనంగరక్ష!

నేనూ ఆ తరహాను పుట్టినవాణ్ణే, అలా పెరిగిన వాణ్ణే కాని, అనుక్షణం నన్ను వెంటాడి, నన్నాడించవలసిన ముసలినౌఖరుకు, మా గ్రహపాటున ముది ముప్పున, బుద్ధిమారింది. నాకు మంచి కథలు చెప్పాడు. మంచితనం నేర్పాడు-మంచివాణ్ణి చేశాడు. మంచివాడనగా మామూలు మనిషని మా పరిభాష! అదీ గుడ్డిలో మెల్ల! లోతప్పులు తెలియక, మా పరివారం - నన్ను హొన్నెక్కించాలని తంటాలు పడ్డది. యిక్కడ కోటలో చిన్నదొరవారు ఎదుగుతున్నారనగా, అక్కరకోసం-అక్కడక్కడ-కొన్ని పూలమొక్క లెదుగుతుంటాయి. వీళ్లే, నిగా ఉంచి పెంచుతారు. అది అంతవరకూ చెల్లుతూ వచ్చింది.

కాలం ఖర్మం కలిసిరాగా, ఓనాడు, నన్ను-అల్లందుకు పెళ్ళికొడుకును చేశారు. తగుబాటి మప్పారు. ఓ కుర్రదానిచేత-గులాబీలు నా కిప్పించారు. అలదాన్ని నా పాదసన్నిధిని కూచుండవేశారు. మీద, పూవులు ద్రిమ్మరించారు.

"గొజ్జంగిలా కొమరారి, మల్లెలా మరులుపోయి, జాజిలా సరసాలిచ్చి, సంపంగిలా చెలువాల పరవశించి-పూజలే పురుషుడుగా, నోములే పూవుల మాలగా-యీ చిన్నది చేసుకున్న పుణ్యము పరిమళించాలి-"

అని-ఆచేత ఆచేత దీవించినవారై, నవ్వేనవ్వుకో వరహో-కులికే కులుకుకు ఓ మొహరీ-చొప్పున వేనికవి విలుచుకునేందుకు తగినంత డబ్బు తలగడక్రింద ఉంచి – కొంగున కట్టేందుకు-జోడు రవ్వలిచ్చి-పైపైవాళ్లు వైదొలగంగా-ఒంటిపాటు చూసి-అయ్యది-ఓ కులుకు కులికి-నామీద మునివ్రేళ్ళ పన్నీరు చిలకంగా-దాని చెంప ఎగిరింది.

సంబాళించుకుని-మంచి గంధం అందుకుంది. మీది మీదికి వచ్చింది. పళ్ళు రాలినంత పనైంది. మన దిదోతరహో సరసమనుకున్నంత వయారం పోయి-ఎడమచేయి-మెడమీదికి పోనిచ్చి-గడ్డం పట్టుకుని ముద్దులు కుడవబోయి, ఎగిరి అవతలపడ్డది. ఆ పూటకు ఆ శృంగారం చెల్లు.

మరునాడూ-అదేతంతు-మరో శాస్త్రీ మార్చి-సాగించారు. పట్టుకు హూనం హూనం చేశాను. మళ్లీ-ఎవళ్ళూ మనజోలికి రాలేదు అర్జునుడి శాపం మనకు తగిలిందనుకున్నారు. అంతతో-ఆ రగడ తప్పింది.

పరగణాలో అంటే, మనం కాపురంచేస్తున్న ఊరిలో ప్రజలు ఎలా బ్రతుకుతున్నారా అని ఓ రాత్రి ఒక్కణ్ణే, తిరగబోయినాను! కోవిలకు పోయినాను. అక్కడో ధూపం లేదు-దీపం లేదు. కళలేదు, కాంతిలేదు. చీకట్లో ఎవడో పడుకుని బీడీకాలుస్తున్నాడు. పరదేశినని నన్నూ బట్పోనిచ్చాడు. వాడివల్ల కొంతవైనం తెలిసింది. అర్చకుడున్నాడే – వాడు హుటాహుటి సానికొంపనించివచ్చి-స్వామివారి మీద యిన్ని నీళ్లు జల్లుతాడంట! చిన్న జమీందారుగారికి-యుక్తవయసు వచ్చింది గనుక-వారిని పానుపెక్కించేందుకు ప్రజలదగ్గిర-డబ్బు దండుకున్నారట. చెప్పి చెప్పి, యీ రాచరికాలు తుడిచిపెట్టుకుపోతేకాని-దేశం బాగుపడదు! అనేశాడు. పారజాడగా, నాకూ అలాగే అనిపించింది. మేం ప్రభుత్వం చేసేది ప్రజలఘోషకా, వాళ్ళ సొమ్ము మా భోగాలకా అనిపించింది!

మనుష్యులమీద పశువులు ప్రభుత్వం చేయడమూ అనిపించింది. మొత్తం ఛీ అనిపించింది. కలగచేసుకున్నాను. మల్లాగుల్లాలు పడ్డాను. మనిషినైనాను. ప్రజలకు మా బాధ తప్పింది. ఔనా!

మీరు పెట్టిన బాధలో బాధలా హింసబెట్టేందుకు, నూతన విధానాన పథకాలూ ప్రణాళికలూ వచ్చిపడటం లేదా అంటావా-

అది – పరమాణువు పరిష్కరించాల్సిన సమస్య. నేను, యిన్నాళ్ళకు ఓ మనిషిని. అదే నా కంగరక్ష!

* * *

# వెలది వెన్నెల

పండు వేసంగి–

పట్టపవలే తాతగారు ఘుమఘుమలాడుతున్నారు, ఏమా విశేషం అనుకున్నాను:

ఒరే నవమదనా–ఏం చేస్తున్నావురా? అన్నారు, గది గుమ్మంలోకి వచ్చి–

చేత నున్న పుస్తకం దాచేయబోయినాను. కాదూ, వారికి చిరునవ్వు వచ్చింది: వచ్చి సరసను కూర్చుని, మునివ్రేళ్ళతో చెంపలు పుణికి – భార్య పురుడోసుకునేందుకు పుట్టిన యింటికి పోంగానే, పుస్తకం చేపట్టావా, నాన్నా!–పరాసుదేశం బోసిబొమ్మలు–కాగితపు దళసరీ, తళుకేకాని, కాలక్షేపానికి పనికివస్తాయా!–

ఒరేయ్ మన దేశం రత్నగర్భరా!–రాపోదాం!

"ఎందాకా?"

అందాకా!–నేరని విద్దెలు నేర్చుకునే వయసు, తీరని కోరికలు తీర్చుకునే వయసు – ఒంటరి పానుపుమీద అసురుసురంటూ, కాగితబొమ్మల కాళ్ళా వేళ్ళాపడితే – కలిసొచ్చేనా?–

పలుకరిస్తే–పలికే చిలకలుండగా, పావురావు కాగితంతో ప్రణయాలేమిటిరా?–

తాతయ్యా! యివి బూతుబొమ్మలు కావు! మహా శిల్పుల కళాఖండాలు:–

అయితే అలా బైండు పుస్తకంలో పడి ఉండనీ: కళ అనేది–కంటికి కట్టాలి– –తక్షణం–వంటికి పట్టాలి: అంగలార్చితే వచ్చేది కాదురా ఆనందం–అంకెకు దార్చి అనుభవంలో అందుబాటు చేసుకోవాలి! – మనం పడుచువాళ్ళంరా భడవా!– ప్రత్యక్షం మనకు ప్రమాణం – కావలసినన్ని కళాఖండాలు, కనుచూపుమేరలో కలవురా – యిహాకదులు:

కదలక తప్పింది కాదు!

ఎక్కడికని అడిగేందుకు ధైర్యంలేదు.

నీరెండ పొడ ఉండగా, ఆ చెరువుగట్టున బండి దిగినాము. మామిడితోపు అద్దరిని వూరు, చూచాయగా కనపడుతూంది:

బండీ కట్టుకొచ్చిన పెద్దపాలేరు, వూళ్ళోకి వెళ్ళాడు: తాతగారు తీరుబడిగా స్నానం చేసి అనుష్ఠానం తీర్చుకుని, మడి మాని, యథోచితమైన రీవితో, మెట్లమీద, కూర్చున్నారు:

దీన్ని కామావధాన్లగారి కోనేరంటారు: తెలుసునా?

ఊహుం–

వారు మా ముత్తాతగారన్న సంగతి తెలుసునా?

నీవు చెప్పగా విన్నాను:

పేరు చెప్పానుకాని, ప్రతాపం చెప్పలేదురా–చెప్పనా–నీవు యీ యీడున ముఖ్యంగా తెలుసుకోవలసిన హాంశం!

ఆయన నవద్వీపంలో, చదువుకున్నాడు – మిధిలలో మెరుగులు దిద్దుకున్నాడు – వారణాసిలో చండప్రచండుల చేత చిరంజీవస్వ, అనిపించుకున్నాడు. అయిదు పంవత్సరాలపాటు, కాశీ నరేశుల పండిత మండలికి మకుటాయమానులై ఉన్నారు.

అంతట స్వదేశానికి వచ్చారు.

వచ్చిన కొత్తలో–

దేశంలో మహారాజుల దివాణంలో, సంక్రాంతి పండుగలు, వేసీఘేయని వేడుకలు-

అనాడు కూడ, పండితసదస్సు, వేయికి పైగా దుశ్శాలువలు కోటగుమ్మం తొక్కినవి.

ఈ కామన్నకు పట్టుమని బ్రహ్మవర్చస్సైతే ఉన్నది కాని, పైన సేలువలేదు–కను బొమ్మల గర్వంలేదు. దండలు తిరిగి ఉన్నవి కాని, దర్పంలేదు–తనంతవాడు లేడన్న తలవిసురు లేదు. గుమ్మంవద్దనే ఆపేశారు. జంఝెపుపాచచూసి దొడ్డిసంభావనకు పొమ్మన్నారు.

పొమ్మన్నవాడివంక కామన్న అహా! – అన్నట్టు చూశాడు. అవతలివాడు జబ్బ పట్టుకున్నాడు: పట్టుకున్నాడో – పదిబారల దూరాన పోయిపడ్డాడు –

ఏం రభస అయేదో కాని, యింతలో అచ్చన్న దీక్షితులుగారు అక్కడికి రావడం జరిగింది. ఈ అచ్చన్న గారి దగ్గర చిన్నప్పుడు కామన్న రామశబ్దం ప్రారంభించి, సాగక మానేశాడు – మానడానికి కారణం ఏమో తెలుసునా –

ఈ కాకికూతలు నే కూయలేను–కావ్యపారం మొదలుపెట్టండి అన్నాడుట.

నోరుమూయరా–అన్నారుట వారు.

నోరు మూసుకుంటే చదువొస్తుందా, ముక్కు మూసుకుంటే మోక్షం వస్తుందా – అన్నాట్ట యితగాడు: అంత కోపధారి అట్టే నవ్వి–ఒరే కాముడూ, దైవం రక్షించాలి గాని, నీవు తార్కికుడవయ్యేవురా! నీ వైనంలో, ఆ ఝడితి ఉందిరా, కనుపాపల్లో గంభీరిమ కద్దురా–నీకు చదువు చెప్పగల సత్తా నాకు లేదురా–పోc–దేశం మీదికి పో–దేశాలన్నీ జయించుకురా–అని–వెన్ను చరచినారట, కామన్న కదిలాడు:

ఆపైన భారతమంత గ్రంధం ఉంది: అది మరోమారు:

ఇదిగో, ఆ అచ్చన్నగారూ, వీరూ, అన్నేళ్ళకు అక్కడ తారసిల్లారు: ఆ దుడుసుతనం చూసీ చూడంగనే పోల్చుకున్నారు. కామన్నా అని కౌగలించుకున్నారు: బుగ్గలు నులుముతూ:–

ఏమిరా, యింతకాలం ఎక్కడున్నట్టు?

దేశం మీద–

ఏం నేర్చినావురా–? యీ విద్యేనా–? అక్షరంముక్క ఏమన్నా అబ్బిందా?–

అబ్బింది–జబ్బపుష్టి!–

అరి ఏబ్రాసీ; పరువుగా, నోరు పెట్టుకుని బ్రతుకుతావనుకుంటినిరా!– పైన సేలువతో కంటపడతా వనుకుంటినిరా!– అయొపో!–ఏమైనా మట్టుకు, నా శిష్యుడవే–దా, సభకు పోదాం–

సభలో సంతర్పణ మాకు కాదు – మాది దొడ్డి సంభావన!–

అని ఎవరన్నారు?–

ఆ జలపాలరాయుడు–

అన్నాడో – పడ్డాడో – రాయడూ, మనసులో చెంపలు వేసుకుని, మావాని పాదాభివందనం చెయ్యి –

సభలో, –

కామన్న గురువుగారికి వెనుకగా నిలుచున్నాడు – వారిది – అగ్రాసనం –

మహారాజు విచ్చేసి, సభకు మ్రొక్కి ఆసీనులు కాంగా – ఆ సందెప్రొద్దుకు–

ఒక బక్కపలచని పడుచువాడు, తురక రీవివాడు, చిగురుమీసంవాడు, తులసిమాల మెడదాల్చినవాడు, లేచి నిలుచుని, తన బిరుదుల నేకరువుపెట్టి, గురువుల పేరెత్తి, దీటైన పండితులను, తనతో మాట కలుపమని, తన్నోడించగలవారున్నారా అని గద్దరించి, సభాపతికి హెచ్చరింపుగా చేజాపి, అంగుళితో ప్రశ్నించాడు–

అచ్చన్నగారు, వాని ఆగడము చూసి, కామన్నవంక జూసి, వీడెవడో రాలుగాయిరా, అనంగా,

ఆ కాయను యిట్టేరాల్చేను. అనుజ్ఞ నీయండి –

అభాసు చేయవుగద –

సభ మరింతగా, భాసించేను – చిత్తగించండి!–

అనగా – అచ్చన్నగారు తల యూచి ముగుదల ఈయగా,

కామన్న, ముందుకువచ్చి పండితులకు మ్రొక్కి – గీర్వాణంగా –

ఈ ఆయుష్మంతుడు–వరుస తప్పిన థోగందాని మద్దెల.

విద్దెలకు పరువుగా వినయమునేర్చిన పెద్దల మ్రోల ధిక్తాం అని మ్రోగినది. ప్రభువు లవధరించినారుగద!–(మహారాజు మోము బొమముడి యైనది)

మేలు!...

ఈ విద్వాంసునితో, తలపడగల సరసత, సభలో ఛాందసులకు–లేదు–వీరందరూ మడిగట్టుకొన్నవారు–వేదచోదితమైన దుడుసుతనం కలదేమో కాని, తారతమ్య మారయక నోరు పారవేసుకొనుట వీరి తరముకాదు, ఈ – వీరి విద్యలో పస యెట్టిదో నిగ్గుదేల్చగలవారిని ప్రభువులు రప్పించవలె –

వా దెవరనేరా – "కౌగిట వెనునది నాలుగు విధముల గరడీలు గరపు" అలనాటి ప్రౌఢనాయకి, సహస్రజీవి, గుడిసేవ సభారంజని – కామాగ మాధ్యయన పాటవమున వీరెంతటి గడితేరినవారో, ఆమె తమ సముఖమున తలస్పర్శగా పరీక్షించునుగాక: అలదానిచే భళా యనిపించుకొనేనో, మన పండితులు సేలువలతో వీనికి పానుపమరించేరు. కామశాస్త్రము, గోష్టికి రాదగినవిద్యయని ఆదిశంకరు లంగీకరించినదే – యింక ఆలస్యమెందులకు – ప్రభూ!

అందులకు దీటైన సభాపతులు – దేవరవారే–

అచ్చన్న దీక్షితులవారు, వాకోవాక్యమున మేలుబంతికాని, యిందుల, యీ వయసున, కోవిదులు కారు! దక్షత కల తామూ విద్దెల, కయ్యము, వినోదముగ, అవధరించి, కృతకృత్యులైనవారికి, మెచ్చి, ఉపద లిచ్చేరో, ఉలుపా లిచ్చేరో...

అన్నాడయ్యా!

అపరంగా, పండితులందరూ, పట్టలేక సేలువలు సవరించుకుంటూ చిరునవ్వులు నవ్వుకున్నారు.

ఇహ, సభా లేదు, శాస్త్రార్థమూ లేదు!

కామన్న తెలిసి అన్నాడో, తెలియక అన్నాడో కాని మహారాజావారు బుజాలు తడుముకున్నారు.

వైనం ఏమంటే – వారికీ నీలాగే కళాభిలాష, ఆ అభిరుచి, ఉద్దోలం,

మనం ఏదో, తగుమాత్రం సంపన్నులం, గనుక బోలెడంత విలువ పెట్టి, బొమ్మలున్న గ్రంథాలు కొనుక్కొంటాము. వారు వేసీవేయని సిరులున్న వారాయెను, తమకము, అగ్గలమయే తరుణాన సజీవప్రతిమలతో రాసవినోదములు ఏర్పాటు చేయించడం, పదములొత్తువారి సరసను ఏకాంత గోష్ఠిలో ఆనందించటం కద్దు: అది తరతరాలుగా వస్తూ ఉన్నదే: అది మన సీమలో పండిత పామరులు యావన్మందికీ ప్రాత్కృవిలె–

మహారాజావారు, ఏమాట కామాట–రాచపుట్టువు కదూ, మనసు రగులుతున్నా, పైకి శాంతంగానే చేయెత్తి అప్పటికి సభ చాలించి ఏకాంత మందిరానికి దయచేశారు!

సభలోవారు సభలో మిగిలారు!

అచ్చన్నగారు ముక్కుమీద వేలువేసుకుని, హాన్నా! ఎంతపన్ని జేస్తివిరా! అన్నారు!

ఆ గౌడబ్రాహ్మణుడు, యినుమిక్కిలి తలవిసురుగా యిచ్చటివారి పాండిత్యమింతింతయేనా, అన్నాడు – అనడం తడవుగా కామన్న చరచర వానిమీదికిపోయి, భుజములమీద చేతులువేసి వాని బాసలో గుసగుస లాడినాడు – వాడు అమాంతం కామన్నకు సాష్టాంగపడినాడు!

ఏల?

కామన్నను అప్పటికి, వాడు గురుతించాడు.

ఇంతకూ వాడెవరని – నవద్వీపంలో కామన్నతో కలిసి చదువుకున్నవాని శిష్యుడు! కామన్న వారణాసిలో ధర్మాధికారిగా ఉంటూన్నపుడు మహారాజ దర్శనం చేసి, విద్య చూపి అచ్చటి పెద్దలను మెప్పించి, సమ్మానము లందినవాడు! వాని బిరుదావళిలో కొన్ని, కామన్న కటాక్షించినవే, వాని వ్రేలి రవల ఉంగరము కామన్న మెచ్చి యిచ్చినదే.

పైన సేలువా, పటాటోపమూ లేని యీ అవతారములో, అతగాడు కామన్నను పోల్చుకోలేకపోవడంతో, ఆ రవంత రభసా జరిగింది.

చిగురుకు సద్దు మణిగింది! ఆతడు, ఆ పండితులు, తమ పరువు సలక్షణంగా దక్కిందని ఆనందించారు! కామన్న కలుగజేసుకుని ఉంటే ఆ గౌడుడు ఆగేనా? వానికాతీరున వినయము గరపి, తానూ, తన సీమ పెద్దరికము నిలిపినాడు.

ఇంతలో, అచ్చన్నగారికి వర్తమానం వచ్చింది–ప్రభువులు, ఏకాంతమందిరంలో ఉన్నారు –, తక్షణం దర్శనం యిప్పించమని శ్రీవారి సెలవైందీ, అని–

అచ్చన్నగారు – అడుగు ముందుకువేశారు – కామన్న ఆపేశాడు –

ఆ వచ్చినవానితో – యిలా అన్నాడు –

మహారాజు పరువుకు పుట్టలేదా – ధర్మము పట్టం కట్టలేదా? తాను పరగణాకు ప్రభువుకాని, పండితులు పాదధూళి శిరస్సునదాల్చి వర్ధిల్లవలసినవాడు కాదా? – యింతకాలమూ సుఖముగా నున్నది – వీరి దీవెనల బలిమిని కాదా – చతుర్ముఖుడు కానీ, శారదాదేవి కానీ, పండితులను విద్యాతపస్సంపన్నులను చులకనచేసిన, వారికి పూవూ పత్రీ పుట్టవే – మన రాజెంత! బ్రాహ్మణ్యము కన్నుదెరచిన ఒక్కచిటికెలో త్రోసిరాజుకాడా! – పండితసభ విడిచి పోయినాడే, – ఎవరి అనుమతి కోరినాడు? – పోఁ – గురువుల దర్శనభాగ్యమే ఆపేక్షించినవారైతే, వచ్చి పదములంటి ప్రసన్నుల జేసికొనమను! – అని తరిమివేసినాడు – అందరూ కలవరపడినారు, కాని ఎవ్వరూ కామన్న కెదురాడరైరి.

పండితులందరితో కలసి కదలిపోయి – వేణుగోపాలస్వామి ఆలయంలో యిష్టాగోష్ఠిలో ఉండగా – పక్కారుఝాముకు, పెద్దలంటే భయభక్తులున్న ఓ ఉద్యోగి నురుగులు గ్రక్కుతూ, అక్కడకు వచ్చిపడ్డాడు! సభలో కామన్న అన్నమాటలు చిలవలు పలవలుగా మహారాజుల చెవిని పడ్డవి – వారు కణకణలాడుతున్నారు. ఆ బ్రాహ్మణుడి సిగపాయ దెచ్చినవారికి పదిసంచుల వరాలిస్తామన్నారు! కాని, కోటలో బంటెవరూ ముందుకు రాలేదు: పాలెం వర్తమానం పంపారు, సాటిరాచవారికి – గడియకో, రెండుఘళ్ళకో వారు వచ్చిపడగలరు – యీతణ్ణి బ్రతకనీయరు – ఇక బ్రాహ్మణీకానికి ఉప్పూ, పత్రీ పుట్టదు...

వినీవినడంతోనే ఉన్నవారందరూ గగ్గోలైనారు. కామన్న చిరునవ్వుతో–అలాగా–అన్నాడు.

వచ్చేవారెందరు?

ఒకరో–యిద్దరో–

అంతేనా–మన కొక్కు వేలిక్రింద!

వారిచేత కత్తులుండేవయ్యా!–

రాచవారిచేత కత్తులుకాక, గరిటెలుంటవటయ్యా – రానీ–హుటాహుటి యిక్కడికే వచ్చేరు కద!–

ఉహుఁ–ఆలయములో అంతకు తెగించలేరు! బయట ఏ క్రీనీడనో నక్కి ఓ వ్రేటు వేసేరు!

మంచిది–నేనిక్కడ ఉన్నట్టు వారికి రూఢిగా తెలుసునా, వర్తమానం అంపవలెనా?

ఇక్కడికే వచ్చిపడతారయ్యా–

అయితే మా బాగేనయ్యా!–

అచ్చన్నగారు కామన్నను కౌగలించుకుని, నాయనా, నిన్నెట్లా రక్షించుకొందు మురా!–అని వాపోవపోగా – కామన్న పెద్దపెట్టున నవ్వి – గురువుగారు – మీ ఆశీస్సు నాచేతి వజ్రాయుధము–వచ్చిపడేవి–మీసములు పోతరించిన సొరకాయలు–నరకడం ఒక లెక్కా!–

మనము పరశురాముని కోవలోవారమే–కాని, రాచవారిని నిశ్శేషము చేయము. మీకా భయము అక్కరలేదు–యీ ఒక్క తప్పూ కాచేము–

గాయత్రి మనకు రక్ష–ఆ తల్లిమీద కత్తులు దూయగలవా డెవడండీ!–

అన్నాడు-

అంతలో పండితులందరూ ఒక్కుమ్మడి ఉవ్వెత్తున లేచి, నడుముకు అంగవస్త్రము చుట్టారు!

అచ్చన్న బాబూ-యిందరముండి యీ చిన్నవాడిమీద యీగ వాలనిచ్చేమా?-యిద్దరుకానీ, ఇన్నూరుకానీ, ఈ చాయలకు వచ్చారో, కలికంలోకైనా కనబడేరా? - అన్నారు.

కామన్న వారందరికీ మ్రొక్కి-తమకు తామసం జెల్లదు; యీ చిన్నవాడిమీద ఆ యీగలు వాలవు-చూచేరుగా-మీరు కలుగజేసుకోవలసిన గండకత్తెర కాదిది - అంటూ అనునయించినంతలో -

రాచవారు, రానే వచ్చారు. చీకటిమాటున, దొంగచాటున, కాదు-రొమ్ము విరుచుకునే-దివ్విటీలుగా...

అచ్చన్నగారిని పేరున పిలిచారు. వారు ముందుకు దయచేశారు. వెనువెంటనే ఉన్న కామన్నను నిర్దేశిస్తూ-అ ఆతతాయి సిగ ఉత్తరించి తమకు అందజేయమన్నారు! లేదా, అని, హుంకరించి చేతపట్టినవి - ఝుళిపించారు! కామన్న మేరువల్లే గాలియాతగా, దూసుకునిపోయి, వారి చేత కత్తులు అంకించుకొని, కత్తిమొన మోపుగా పల్లటీ కొట్టి ఎగిరి నిలుచుని, కత్తులు దూరంగా విసిరేసి - ఆ జోడు మీదకు మిడిసిపడి, రెక్క లొడిసిపట్టి, గోటమీటినట్లు, వారిద్దరినీ అచ్చన్నగారి పదసన్నిధికి ఎగజిమ్మినాడు. రాచజోడులు, బెల్లపు అచ్చులవలె, పడినారు - కామన్న, వారి వెన్నుతట్టి లేవనెత్తి - ఏలినవారి బుద్ధి క్షణికంగా చంచలించి-వాయి పులుమేసింది పో - మీకు విచక్షణ అక్కరలేదా?-అన్నదాతలు కనుసన్నగా ఆజ్ఞాపించినారని అగడము చూపవచ్చారా?-అమాయకులారా-మీకు మీసలు ఎగదువ్వంగనే యీ మిడిమేలపు రోసమబ్బెనా-యీనాటినుండి-మీరు మీ వంగడమువారు-మీసముపై చేయివేయరాదు-యిదే మీకు శిక్ష - యిదే మీ ఐదువల కుంకుమకు కలకాలము రక్ష-అని మందలించి-మహారాజులు ఎచ్చట-ఏ తీరున ఉన్నదీ-వారివలన తెలుసుకుని ఆ తావుకు ఒక్క ఉరుకున పోయినాడు-

ఆ తావు?-

ఉద్యానంలో-పూలపాన్పు-కలమలందిన మేనితో కన్నుల మత్తుతో - శ్రీవారో మల్లెలమాలను ఒడిసిపట్టే సన్నాహంలో ఉన్నారు: ఆ చిన్నది ససేమిరా . ఏలినవారూ - బ్రాహ్మణుడి సిగ ఉత్తరించమని సెలవిచ్చినారట - ఇంత పాపం ఏనాడూ మన సీమలో పుట్టలేదు-మీరు కులానికి మచ్చదెచ్చారు - మీ పెద్దల బ్రాహ్మణభక్తిని, గంగపాలు చేశారు! మీరు భ్రష్టులు - నేను వెలయాలినే కాని, కులమున్నదానను - ఈ కన్నె, మీకు లోకువగాదు!- అన్నది.

ప్రభువులు - బూతుకూతలకు దిగినారు - నిన్ను మా దండుకు ఎరగా వేస్తానన్నారు. దాని గొంతు పట్టుకుని - ఛీ పోవే అని విసిరేసి - తాము తూలుతూ పానుపుమీద పడినారు: అంతలో ఆ చాయకు వచ్చిన కామన్న - ఆ చిన్నది - పడిపోకుండా సందిట పట్టి నిలిపి - మహారాజుల సరసకుజేరి - వారి ఎగుమీసం - క్రిందికి దువ్వి - ప్రభూ! అని పలుకరించగా - వారు - రవుద్రంతో

పిడికిలి బిగించి – కామన్న మొగానికి గురిచూడగా – అతడా చేతిని ఒడిసిపట్టి – ఎడమచేయి రొమ్ముమీద వేసి, శాంతించవలె అనంగా – వారు – భటులకోసం పొల్లికేక పెట్టపోగా – ఆ చేయి వారి పెదవుల కదిమి – మీ గొంతు – మోటవానిచేతబడ్డ మొగలిరేక – నలుమట మా కలవోక –

కాని మీరు కలకాలము, నీతివంతులై వర్ధిల్లుట మా అభిమతము. మా ఆశీస్సు – ప్రభూ!

మీ కరములు మా పాదము లంటి అయుర్భాగ్య మందవలెనే కాని, మాపై కాలుదువ్వ నగునా? –

బ్రాహ్మణుని సిగ – వేదశిఖ – దానిని మీ కులము వా రహరహ మారాధించవలె–మీరు శలభములు కారాదు–యిచ్చి పుచ్చుకొను నేర్పు మా కులమున కున్నది. మీకు ప్రాణదానము చేసినాము. మాకు మీరు వాగ్దానము చేయవలె.

మీ వంశము ధర్మరక్షణకు పేరు మ్రోగవలె. బ్రాహ్మణభక్తితో వాసి కెక్కవలె.

కామన్న కుడిచేయి జాపినాడు. ప్రభువులు తమ కరపల్లవము నందుంచి, "యిదే మా పెద్దలమీద ఆన" అన్నారు బుద్ధిగా–

మీరు వస్తుతః బుద్ధిమంతులే, కాని, రాజసమ్మై, రావణుని కుక్కుటపుతనము మిమ్ము కమ్మినది: పోనిండు ఉభయుల గండము గడిచినది –

ఇంక మీ పెద్దరికము నిలుపుకొనవలె – యీ చిన్నదానిని మీ కోడలుగా చేసుకొనండి.

కులము చాలదనుకొనేరా – ఆపన్నను రక్షించినప్పుడే అది నాకు కూతు రైనది! యిందుకోసము, యీ బ్రహ్మచారి గృహస్థయి కన్యాదానము చేసేను! అభ్యంతరమా?–అన్నాడు కామన్న.

తమ ఆజ్ఞ అయినది కదా! అన్నారు శ్రీవారు.

అప్పుడు కామన్న ఒక యింటివాడైనాడు. కన్య ఎవరు – ఆ గౌడ పండితుడి సోదరి – అచ్చన్న దీక్షితులు గారు కన్యాదానం చేసినారు –

ఒరే నాన్నా – మనయింటికి తెలుగుపిల్ల కోడలుగా రావటం, నా హయాంలోనే ఆరంభం – మా తల్లి మహారాష్ట్రదేశపు ఆడపడుచు, మా ముత్తవ – ఒక కాశ్మీర కుసుమం – సరే, కామన్నగారి యిల్లాలు: నాయనా, ఆనవాయితి తప్పకుండా నీ బిడ్డలకైన దేశంమీద సంబంధాలు చేయరా –

అది మునుముందు చూసుకుందాం, మళ్ళీ కథలోకి వద్దాం – ఆ కామన్నగారు, ఆ చిన్నదానిని, తానన్న మాటమేరకు, సాలంకృత కన్యాదానం చేశారు; ఎవరికి? ఏలినవారి, రెండో కుర్రవాడికి – వేణుగోపాలుడి ఆలయంలో వివాహం జరిగింది:

ఆ కుర్రవాడు, భార్యతో కోటలో ఉండలేదు: ఈ గ్రామంలో సౌధం నిర్మించుకుని కాపురం చేశారు: కామన్నగారు – యీ గ్రామంలో గోపాల ఆలయం నిర్మింపజేశారు! వారు చుట్టపు చూపుగా వచ్చినపుడు స్నానాదికములకు గాను – యీ తటాక నిర్మాణం జరిగింది.

మనం యింతదూరము వచ్చిందెందుకు – ఆ స్వామి దర్శనానికి. ఆ లోగిలిలో నిత్యకళ్యాణిగా నివసిస్తున్న – వృద్ధనారీ దర్శనానికి –

ఇక బయలుదేరాము: ఆ గుమ్మము సమీపించగానే - యిద్దరు బాలలు పూర్ణకుంభములతో ఎదురైనారు: అడుగు ముందుకు వేయగా, మరో సుందరి ఆరతి పట్టినది: యింకను ముందుకు పోగా - ఆ అవ్వ - కైమోడ్పుతో, ఎదురై - తాతగారి పదములంటి, కైదండయిచ్చి - లోనికి సాగినది:

ఆసీనులమైనాము: వీణలు మీటుతూన్న జవ్వనులు, వాదన మాపి చేమోడ్చి మ్రొక్కినారు

కృష్ణా! వీడు, మా మనుమడమ్మా!-

అలాగే!-పొత్తిళ్ళలో ఉండగా వీరి దర్శనము చేసుకున్నాము. ఆనాటి కీనాడు, స్వామి దర్శనానికి తాతగారి వెంట దయచేశారా, నాయనా -

మన వేణుగోపాలుడు కడు చక్కని స్వామికదయ్యా - మనసులు తన కైవసము చేసిన కన్నెలకు, వయారమూ ఒద్దికలూ, లేతదనం - నీతిదనం - కలకాలమూ నిలిచే వరాలుగా వారు యిచ్చేరయ్యా - వారి వేణురవళి - మాకు గానం నేర్పెను. వారి మువ్వల సవ్వడి నాట్యం నేర్పెను. వారి చిరునవ్వు మాకు బాసికము. వారి కొంటెచూపులు మాకు మంగళసూత్రము - ఆ వెన్నెల చిందులమయ్యా - మేము - మా కన్నులకు అలవాడు పండువేనయ్యా-అని,

అయ్యగారూ, స్వామి దర్శనానికి, తరలిపోయేమా, తాము ముందు నడచేరా, అని మనవిచేసి - నాయనా - ఒక్క క్షణములో ఆయత్తమయేమయ్యా - అని లోపలికి పోయినది -

ఆ కన్నెలందరూ - తాతగారికి చేరువగావచ్చి నిలచారు. తాతగారు ఓ చిన్నదానితో -

ఏమే నవమల్లికా - మా మనుమడు చక్కనివాడందమా - అనగా - ఆ వయారి-

మోమందము-కేమిగాని-కన్నులలో రసికతవన్నెలు తేరలేదే అన్నది

మరో పడుచు-ఓరచూపే సుకుమారుడు నేర్వలేదో - అనంగా -

మరో ప్రౌఢ - చిరునవ్వు లెన్ని తీరులో, మీ చిన్నవాడు వల్లెవేసెనో - అని కనులార ప్రశ్నసేయగా,

మరో నేర్పరి-కనుసైగలతో పలుకరించు అలవాటు, మవునముగా పలుకాడు నేర్పు వీరికి వెన్నతో పెట్టలేదో - అని మోవిని లాస్యమాడించగా,

యిలా, యిలా ఆ బాలలు నామీద పూవులు బాణాలు వేశారు!

తాతగారు - అమాయకంగా, వీడిని, మనబడిలో చదువవేయలేదమ్మా, వీడి బాలుణ్ణయిన మనకోవకు తేవలె-అనగా,

మువ్వలు మ్రోగినటుల కిలకిలలాడి వారూ లోనికి పోయినారు:

తాతగా రందుకున్నారు:- చూశావూ, ఈ కృష్ణాజీ ఉన్నదే - మన కామన్నగారి చేతిచలువను వెలసిన వంశంలో చిగురుకు మిగిలినది. పారంపర్యంగా, ఆనాటినుండీ యీ కులానికి రాచపొత్తే - యీమెను పొరుగు జమీందారులు చేపట్టారు. కాని వంశాభివృద్ధి కాలేదు - అని కించపడలేదు - యీ భవనము, ఏనాడో, కన్యాగురుకులమైనది: ఈ బాలలందరూ రంభాకులమువా రనుకునేవు - నేను

పలుకరించిన చిన్నది బ్రాహ్మణుల ఆడపడుచు: పేదకుటుంబములలో కన్యారత్నములను వెదకి తెచ్చి విద్యాబుద్ధులు నేర్పి చక్కని శిక్షణమిస్తూ - జీవితం గడుపుతున్నది. ఈమె -

పూర్వం పాటలీపుత్రంలో యీలాటి విద్యా నికేతనము లుండేవట! అయిన యింటికన్నెలుకూడ, అచ్చట ఒద్దికలు నేర్చుకునేవారట.

లలితకళలే, లోకమునకు రక్ష - అనీ,

కన్నెలందరూ - ఆటపాటలునేర్చి - విద్దెలను దైవమున కంకితము చేసినవాడు - ఇంటింటా నిత్యకళ్యాణము కాదా అనీ, ఆమె అభిప్రాయము. మన అభిమతమూ అదే...

ఇంతలో ఆమె తిరిగివచ్చినది: అందరమూ ఆలయమునకు వెళ్ళినాము:

గోపాలుని సన్నిధిలో వీణెలు లాలనగా తానములు మీటినవి: మువ్వలు మందెమేలములుగా కువకువ లాడినవి: అంతటా అలముకున్న అగరు జవాది ధూపము మైమరపు ఘటించినది: బాలగోపాలుని మోమున మల్లెలు విరిసినవి. చివురులు కదిలినట్లు, చిలుక రెక్క లాడినట్లు - కొదమ తుమ్మెద ముసిరినట్లు - తంబురనాదము, రవళించగా - పందుతనము, విందుతనము వెల్లివిరియంగా - ఆ గానము నా చెక్కిలి పుణికినది -

గోరువెచ్చని వెన్న లిందరా -
గోరుగోరు మీగడ లిందరా -
గుమ్మపా లిందరా...
కమ్మని తాయిల్ల మిందరా -
యిందరా -
నందయగారి బుల్లి తువ్వాయీ - అందరా॥
అందెలు మువ్వలు సందిట దండలు
రవ్వల మొలనూ లిందరా -
పిల్లంగోరు చెన్నాకోడు
బన్నసరా లిందరా -
యిందరా -
గొల్లలవాడలో కొంటెకోణంగీ - అందరా॥
వెన్నెల వీడ - వేడుకమీర
సన్నజాజుల పానుపుమీద
పావుర పలుకు పలికేరా -
కోరిన తీరున కులికేరా -
పచ్చకప్పురపు తమ్మలమిందరా -
యిందరా -
కొమ్ములవాడి కోడెనాగన్నా -అందరా॥
ఆ గానములో, మబ్బున మెరుపు కమ్మినట్లయినది -
గోపాలమూర్తి పారాడు పాపడైనాడు -

లాలనగా పిలిచేది – వాడలో గోపిక –

అవ్వాడు – పసిబాలుడైనాడు – చేరదీసేది – యశోద.

వేణుగానలోలుడు వేడుక కాడైనాడు. సరసాలకు మంతన మాడేది – పొన్నమాను నీడను నిలిచిన ఒక జాణ –

కృష్ణాజీ మోమున, యిన్ని కళలు తిరిగినవి. ఇన్ని వన్నెలు, యిన్ని మన్ననలు మెరసినవి –

కన్నా – నిన్ను చూచిన కన్నుల వెలది వెన్నెల కలకాలము నిలిచేను.

నిన్ను కొలిచిన చేతుల, చివురుల నును మెత్తందనమె అనుదినము – పసమీరేను.

నిన్ను తలచిన మనమే, నిను సేవించిన తనువే – శాశ్వత యవ్వనమయ్యేను:

వెన్న దిన్నవాడా – నీ చక్కందనమే – కామనల కన్నెతనము.

నిన్ను కొలుచు వరము మాకు యిటులనే ప్రసాదించవే

మమ్మాదరించవే–మారుని కన్నవాడా!–

అని విన్నపాలు పలికినదై, కృష్ణాజీ సెలవిచ్చింది కదా – "నాయనా – అందము యీ నల్లవాని కన్నులనున్నది: అలవిమాలిన ఆనందము, వీని సన్నిధి నున్నది:

మా కులాన కన్నెను దయజూచినవాడు, రంభాకులము వారి విద్దెలకు వెలితనము బాపి ఐదువతనము అనుగ్రహించినవాడు. దైవానికి మించిన దైవం – మన కులముస్వామి – కామావధానులుగారు: వారి నిత్యదీవెన – వారి శాశ్వత ప్రసాద రూప మీగోపాలమూర్తి – మనసున చిరుమబ్బులు కమ్మినవాడు – తనువు, తనదే పెత్తనమని, దారికి వైదొలగించ, యత్నించిననాడు – తాతగారి మనుమడా, దైవం మెచ్చేబాలుడా, ఈ గోపాలుడు నీ సంగడికాడై సరసనుండేనయ్యా – కోరిన ఆనంద మిచ్చేనయా – తీరని కోరిక తీర్చేనయా – అని దీవెనగా అన్నది:

నా కనులు ఆ అవ్వకు మ్రొక్కినవి...

తాతగారు నన్ను కౌగిట జేర్చినాడు: వేయి జన్మలకు సరిపడిన చదువు చెప్పిన ఆ వేదమయునికి వీని మనము పూజాసుమమైనది...

* * *

# ఏలేలో

తానెక్కిన రైలుబండి కులుకుతూ, కుదుపుతూ తాళ మానగతుల తరలిపోయి, తలశిల గ్రామం శివారున, మరో ఊరు అసామీ చేమవారమ ఉమ్మడిగా ఆగంగా –

అక్కడ ఆ పూటకు దిగింది తానొక్కడే.

బండిని అక్కడనుంచి తరలించే సన్నాహంలో ఉరుకులూ పరుగులూ మీద, ఉన్న ఆసామిని వెంట తరిమి, స్వగ్రామంలో కొనుక్కున్న టిక్కెట్టు వారికి యధాతధంగా వప్పగింతపెట్టి ఇహ రోడ్డుపుచ్చుకుందా మనుకుంటాండంగా, పచ్చా ఎర్రా బావుటాలవారు...

శాస్తుర్లుగారు మందే గ్రామం? అనగా, ఫలానా అని చెప్పి –

"ఊళ్లోకేనా, ఇంకా పైకా" అనగా, అందీ పొందనట్టు ఊఁ అనేసి –

బంధువు లింటికా అనంగా, ఔనో కాదో తేలకుండా అహాఁ అని, మొత్తంమీద అక్కడనుంచి తప్పించుకుని బయటపడి రహదారందుకున్నాడు.

అదిగో, ఊరు పట్టు పది బారలు, చేరుకుంటాడు–వారి ఇల్లు ఎక్కడ అని ఎవరిని...ఎవ్వరిని నోరు తెరచి అడగటం?

ఎలా వాకబు చేయడం?

వాళ్ళ నడుమ ఉండదుకదా! విసిరేసినట్లు ఓ పెడగా ఉండాలి. బహుశా, ఆ చెరువు గట్టున ఒంటితట్టుగా ఉన్నదే కావచ్చును. బందోబస్తుగానే ఉంది లోగిలి. అడుతూ పాడుతూ, అంతో ఇంతో వెనకేసి ఉండాలి. గడప అట్టే అరిగినట్టు లేదు. ఈ మధ్యలో ఎన్నడో మరమ్మతుచేయించి ఉండాలి.

పద్మకోశహస్తంతో, తలుపు గుసగుస తట్టంగా తీశాడు ఓ తానీషా. బొమలు ఎగుర వేశాడు.

చూడు సాయేబూ, మరే, ఈ గ్రామంలో కందికట్టువారి లోగిలి ఎక్కడా అని ఎవరినన్నా అడిగి తెలుసుకుందామని, ఊరికి కొత్తవాణ్ణి చూడు, ఎదురుగుండా మీ గుమ్మం కనబడితే –

కందికట్టువారంటే – కలాలీలా?

కాదు. వెనుకటికి దేశం పచ్చగాఉన్న రోజుల్లో దేవుడి ఉత్సవాలకీ, ఇంకా పరువున్న మోతుబరులైతే, వారి ఇళ్ళల్లో శుభ కార్యాలకూ మేజువాణీ చేస్తూండేవారట. రాకేందువదన అంటారట. పాతికపైనా, అరవైకి లోపూ, ఒకటో అరో అటో ఇటో....సుమారు ఆ వయస్సులో వారట. కుదిమట్టంగా, దబ్బపండు పళాన ఉంటారట. తలకట్టులో బాలమెరుపు ఇప్పుడిప్పుడే అంకురించిందట. మాట

కొంచెం తొందర కాని, మనిషి వస్తుతః నిదానస్థురాలట. ఇదే గ్రామంట! ఖరారుగా తబిసీళ్లు తెలుసుకునే వచ్చాను.

రత్తమ్మా! ఏదో పేరు చెపుతారేం!

నేనన్న మనిషి రత్తమ్మా, ముత్తమ్మా కాదయ్యా.

ఇదుగో చూడు. పూర్తి విలాసం వ్రాసుకొచ్చాను! ఏమనుంది? నిన్ను చూడగా, నిన్న మొన్న పుట్టినట్టు లేవు. నీకు తెలియకపోవడ మేమిటి చెప్మా. పోనీ ఇలాచూడు, చిక్కడపల్లి చిన్న దివాన్‌గారున్నారే, ఎవరు? భుజంగరావు పంతులుగారు – ఆ ఇంటి తాంబూలం ఖర్చు – ఒకానొకప్పుడు తమమీద వేసుకున్నారట.

ఇప్పటికన్నా గురుతు కొచ్చిందా?

వచ్చింది. అల్లదిగో! ఆ జువ్విచెట్టు – దాని వెంబడే సాలెవీధి – కొసాకు మదురు తగులుంది. అడగా పెట్టా అవసరంలేదు, తలుపు నెట్టుకు లోన కెళితే బాదంచెట్టు – దాని కింద మద్దెల కొట్టుకుంటూ ఉంటాడు అంకాలు – వాడిని అడగండి. హంగుచేసేది వాడు...అన్నాడు ఆ పొచ్చా,

సరే. అటు పోకమానవల్లనా! మరో దారి లేకపోయెను –

అహాఁ తురక మాట. ఇంతమట్టుకు నిజం. బాదంచెట్టుంది. మద్దెల మ్రోగుతుంది. దగ్గిరసా వెళ్లి చూడబ్బాయ్ అన్నాడు. వాడు తనవంక – వంటివేళ మద్దెల పుణుకుతూనే ఎగాదిగా చూశాడు.

మరేఁ జూశావ్ అని చేజాపాడు.

నశ్యమా – లేదు.

"నశ్యం కాదు. రాజనశ్యం – మహారాజనశ్యం, ఆ రాకేందువదనను ఒక్క విడత కలుసుకోవాలి. మూడు ముక్కలు ఆ చెవి వేయాలి. ఇప్పుడే బండిదిగి వస్తున్నా. దిగడ మేమిటి – యకాయకి వచ్చేశాననుకో. వేగిరం పని ముగించుకుని తూరుబ్బండి అందుకుంటే రాత్రికన్నా భోజనప్రాప్తి ఉంటుంది. లేదా..."

"రత్తామ్" అని కేకవేశాడు అంకాలు "యామ్" అని జామిచెట్టు మొగదలనుంచి వినవచ్చింది. "వీరు ఏమిటో అంటున్నారు కనుక్కో." మనిషి కదిలివచ్చింది. మాంచి మిన్నతీమీదుంది. ముసలితనం అట్టే ఏకోశానా కనిపించకపోయినా – ఓ పిసరు వదవదనాడుతూ ఇమాంపసందల్లే ఉంది. శూద్రకళ ఏ వంకనా లేదు. పైగా – తగుపాటి శుచిగా ఉన్నట్టూ అగుపిస్తూంది.

ఆసి దీనిట్లు ఇబ్బడి బంగారంగానూ – ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూంటే ఆ హవణి ఎలా ఉపమిస్తూందంటేను – అదనుకు మదన మహీపతులవారిని ఆ రతీదేవమ్మ వారి రత్నాల చవికి మొగదలను దిగవిడిచి – ముగుదల లందినద్దై కదిలివస్తూన్న భద్ర మదారమా...అని. మేల్! ఆ వయసున ఉండవలసినంత సల్లక్షణంగా ఉంది. కనుకనే మన పెద్దలు వీరిని లక్ష్యలక్షణ సమన్వయ రూపాన శాశ్వత శుభ శకునాలక్రింద జమ కట్టారు.

ఒక్క అడుగు దూరాన – అడుగు ముందుకు వేయడం ఆపి – అలనా డేనాడో సభవారికి నిండుగా మ్రొక్కే తీరున – సంయుత హస్తాన – ఆ ప్రాయాని కమవైనంత త్రిభంగిని నిలిచి – కనులతో కుశలమడిగి – వార్త ఏమని చూపులతో ప్రశ్నించగా –

తాను విషయమేమిటో విశదపరచిన వాడాయెను. ఏలా అంటే –

మన స్వగ్రామం, దైవకృపవల్ల ఇప్పటికీ, తగుపాటి మోతుబరీ గ్రామమే. ఒకానొకప్పుడు వేదశాస్త్రాలకు నిలయమై ఉండేదట. ఆ ఉండటం చూసి అప్పటి నూజివీటి ప్రభువులు పరిసరాల ఉన్నటువంటి సుక్షేత్రాలు దాన పత్రాలు వ్రాయించి వీరికి దయచేయించినవారైనారట. కాని, ఏ కారణానో ఏమూలానో కించిత్ లోటుపాటు రావడం – అనగా, కౌలతల్లో కొంత తఫావతు వచ్చి తీర్మానము నిమిత్తము మూడుకోరట్లూ తిరగవలసి రావడం సంభవించిందట – ఇచ్చినవారూ – పరిగ్రహించినవారూ. కాని, అవి ఇంకా అంతో ఇంతో సత్యకాలమూ – పరిపాలకులు ధర్మప్రభువులూ కావడంతో ఉభయఖర్చులూ దివానమే భరించేట్టు హుకుం ఇచ్చినారట. చివరకు మీది కోరటులోకూడా తమకు అనుకూలం కాకపోయినా – బ్రాహ్మణులు సర్వదా పూజ్యులని భావించినవారు గనుక – ఆనందించి వారి ఆశీస్సులు అందుకుని మరింత ఘనంగా సత్కరించినారట.

వదాన్యత అంటే అదీ!

ఆ దివాంజీ ఉన్నాడే–సాటి గృహస్తే – ఏదో చూసీ చూడనట్టూరుకోరాదూ – ఊహుఁ అక్రమంగా ఆక్రమించుకున్నారు. మొర్రో అని రొష్టుపెట్టాడట. అతగాడేనట ఈ దావా తగాయిదాలకు కారణం – అట్లా ఉంటారు కొందరు. కత్తికట్టాడే కాని – కార్యం సానుకూలం చేయించగలిగాడా? ప్రభువులు సరసులుకనుక సరిపోయింది. ఇంతకూ మనలో మాట – ఇటువైపు పెద్దలున్నారే – వారిలో తపస్సు దైవచింతనతోపాటు సరిసమానంగా – ధనేషణకూడా వృద్ధిచెంది ఉంటుంది. జమీందారీ శేరీ – కట్టుకుపోయినంత అలా పోరంబోకగా పడిఉండటం మంచిది కాదనితోచి – చేతికందినంత మేర అందిపుచ్చుకుని ఉండి ఉంటారు. అది బాహాటమే. వీరి విభూతి పెండెకట్లూ – రుద్రాక్షలూ, దుశ్శాలువలూ వర్చస్సూ చూసి ఇలాటి భూదేవులు అక్రమానికి పూనుకుంటారా... ఎంతమాట...అని ముక్కుమీద వ్రేలువేసుకుని ఆ జడ్జీలు తీర్పు వీరిపరం చేసిఉంటారు. తిన్నది బ్రాహ్మలే కదా – పోనిద్దూ అని జమీందారుకూడా సరిపెట్టుకుని ఉండిఉంటారు.

వారి బ్రాహ్మణ భక్తి అలాటిది సుమీ! బ్రాహ్మణుడన్నవాడు ఒకవేళ నికరంగా దురాగతమే తలపెట్టనీ...అప్పుడూ మా విషయంలో వారు ప్రసన్నులే.

ఒకానొకప్పుడు ఆ, మా పెద్దల్లో ఒక నిరంకుశుడు, మదారుతనాన శ్రీవారి సన్నిహితు లొకానొకరు చేపట్టే ఉద్దేశ్యంలో ఉన్నటువంటి ఒకానొక చిన్నదాన్ని, కాస్త పుణ్యం కట్టుకున్నాడుట. అంతటితో ఆ కాబోయే పెళ్ళికొడుకు ఫాలాక్షుడైపోగా, ప్రభువులు హస్త చాలనంతో వారిని వారించి, "పోనిద్దురూ, వారు బ్రాహ్మణులు" అని సెలవిచ్చినారుట. అది అలా సమసిపోయేట్టు చేయడమే కాకుండా, అది కేవలం బ్రాహ్మణ పరసం కాకుండా, వారు రాజాంగంగా ఉండేందుకు కావలసిన సంభారములన్నీ దయచేయించినారట.

అదీ వారి ఉదారత!

ఏతావాతా చెప్పవచ్చిందేమంటే, మా ఊరి బ్రాహ్మణ్యంలో శ్రోత్రియత్వంతోబాటు కొంత శృంగార భావన కూడా కద్దు అని. ఎవరితో ఎలా మెసులుకోవాలో, ఎవరిని

ఎలా మన్నించవలెనో అంతో ఇంతో తెలియకపోలేదు. మునుపుకూడా మీవంటివాళ్ళు ఏ మేజువాణికో అంటూ మేము అహ్వానించగా రావడం, సంతోషంగా తిరిగి వెళ్ళడం ఆచారం. అప్పుడప్పుడు ఉభయులూ వయసులో ఉన్నవారైనటువంటి సందర్భంలో వచ్చిన మేళం మిడిమేలంగా కావడము కద్దు. అది ప్రకృతిసిద్ధం. దానికేం, ఏ ముచ్చటకు ఆ ముచ్చటే.

ఈమధ్య అర్ధాంతరంగా ప్రభుత్వంవారు బోక్యం కలుగజేసుకుని దేవమాన్యాలనూ, దేవదాసీలనూ ప్రజల పరంగా నిషేధించి, తమ శాఖగా జమకట్టుకోగా, ఆ వెనుకటి వైభోగాలు వెనుకటితీరున కొనసాగించేందుకు వల్లగాక పోగా, ఆ కాళిదాసువా రన్నట్టు ఏ సరసమూ, చట్టుబండలూ లేకపోవడంతో మధుపానం అధునావిడంబనా...అలా కాగా, దేశ వ్యాప్తంగా ఆ మూలా ఆ మూలా ఉన్నటువంటి లలిత కళ లనేవాటిని ఏకటాకిని మన రాజధానికి తరలించుకుపోయి ఏకరాశిజేసి, వాటి నిమిత్తం ఓ హెడ్డాఫీసు అంటూకూడా పెట్టి, ఆ రాశికి ముద్రశుద్ధి చేసి, ఛప్పన్న ప్రాంతములకూ కోటా పద్ధతి అంటూ ఒహటి ఏర్పాటుచేసి, ఇటుది అటూ అటుది ఇటూ రవాణా జరిపిస్తూ, ఏదో యధాశక్తిని వారూ ప్రజలబాగుకనే పాటుతున్నారనుకో...

కాని, దానా దీనా వ్యవహారం ఏ స్థితికి వచ్చిందంటే – నీకు తెలియందేముంది గనుక! తెలియకుండానే దేశం తెలుగువారిపోవడంతో – మీ, మా ప్రమేయమంటూ సాధ్యమైనంతవరకూ లేకుండానే శుభకార్యాలు వాటంతటవిగా జరిగిపోతున్నాయ్. పెండ్లిపందిట్లో వేదఘోష, గజ్జెలమ్రోత వినిపించకపోవడం అంటూ మునుపు ఎన్నడన్నా ఉందా?

రోజుల మహిమ. మనల్ని ఉద్ధరించేందుకు పదవులు భుక్తం చేసుకున్న మారాజుల మహిమ!

అస్తు!

కళావంతుల్ని నిషేధిస్తే కళాకాంతులుంటాయా? వీళ్ళ వెర్రికాని. అస్తాంతావదు.

ఇంతకూ, నే వచ్చినపని ఏమిటని అడిగావు కావు. మన గ్రామంలో పిల్లకాయలందరూ నిన్ను పిలుచుకువచ్చి, నీకో సన్మానం అంటూ సంకల్పించారు. కాని, ఇంతకుముందెన్నడూ మీ వాడకట్టున మెలగటం అలవాటు లేకపోవడంతో నన్ను ఉసికొల్పారు.

నేనూ ఇంతఃపూర్వము ఇలాటి రాచకార్యాలూ, రాయబారాలూ విషయంలో అభం శుభం ఎరుగనివాడినే అయినా – అందుకు సన్నద్ధం కావలసిన వయసు కాకపోయినా, ఇదేం బ్రహ్మవిద్యా – కానీ చూదాం అని బయలుదేరి వచ్చేశాను బండి దిగినప్పుడుకూడా కించిత్ కాళ్ళ గజగజాటు ఉందనుకో. కాని సభ్యా ఎదుట పడ్డాక అదేమిటో ఎక్కడలేని ధైర్యమూ పుట్టుకొచ్చింది. అంత బెదురూ ఏమయిందో – నీ ముఖం చూస్తూంటే మతెటో పోయి మనసు విప్పి ఏవేవో పనస చెపుతూన్నాను. నా ధోరణికేంగానీ నీ అభిప్రాయం ఏమిటో ఈ చెవినివేస్తే...

నాకు ఆక్షేపం లేదు–మీ అంతవారు–ఎన్నడూ మా గడప తొక్కనివారు వెదుక్కుంటూ రావడం–ఇలా ఇంతసేపూ మాటా పలుకూతో మన్నించడం

నేను మరోలాగు అనగలనా? తమ సెలవు ప్రకారమే నడుచుకుంటాము...మరి, తమ దేవతార్చన విషయం...

ఆc... ఈ పూటకు దేవుడూ లేదు – అర్చనా లేదు. ఇవాళ మాపటికి ఇంటిపట్టునే!

అయ్యోర్రామ! రాకరాక వచ్చి – మునుపెన్నడూ ముక్కూ మొగం ఎరుగకపోయినా ఎంతో కావలసినవారల్లే కలుపుగోలుతనంగా కబుర్లుచెప్పి – రవంత కార్యార్థులైకూడా వచ్చి పచ్చనిచెట్టు క్రింద నిలుచుని అభోజనం ఉంటామంటే....మేమేం అంత అంటే ముట్టరాని వాళ్ళమా?

ఆc ఎంతమాట! నా ఉద్దేశ్యం అదికాదు. ఆ పదుపాయం లేనప్పుడు–మనమేం జేస్తామ్?

ఉన్నంతలోనే కల్పించుకుంటాము. ఎలాగో సరసంగా సర్దుకుంటామ్. కాని పిండిన ఇంట్లో ఒక్కపొద్దులుంటామూ? పరమాదరణతో మేమే కావాలని వెదుక్కుంటూ దయచేసిన వారిని పనివేళా తిని కూచుని పస్తుపడుకోబెడతామా? అబ్బే, అది మా ఇంటా వంటా లేదు.

ఔను! మీ మరియాదలు అలాటివే. కాని కనుచూపుమేర బ్రాహ్మణ భవంతి అంటూ లేకపోయెను.

లేకపోయినంత మాత్రాన మీ బ్రాహ్మణీకానికి ఏలోటూ కలుగదు. మీ మడి ఆచారాలకు ఏ లోపమూ జరుగదు.

వండివార్చని పాత్ర సామగ్రి ఉంది.

ఆ పక్కన చిక్కని నీడ ఉంది.

అంటూ సొంటూ సోకని చోటు.

నవకాయ రుచులూ అమర్చుకునేందుకు బద్ధకించినా, ఇన్ని బియ్యం, ఇంత పప్పూ కుంపటిమీదిగి ఎక్కిస్తిరా, మీ అనుష్ఠానం అదీ కానిచ్చుకుని, తిరిగి చూడకుండా దించెయ్యవచ్చును. ఇలాంటి వాటిల్లో చెయిదిరిగినవారే అయిఉంటారు. మీకు నేను చెప్పాలిట కావి, వేగిరం మడికట్టుకోండి. వేళ పట్టున మీరింత ప్రాశనచేసి, మీ చేతిమీదుగా నాకో ఇంత ప్రసాదం పెట్టండి. అదే జన్మానికి శివరాత్రి అనుకుని అంతటితోనే తృప్తిపడతాను.

అరి వీళ్ళిల్లు అంటుమామిడి తోటలో కట్టా! అందరూ నామీద పెత్తందారులే! మా ఇంటిపట్టు మనిషీ ఇలాగే పురమాయిస్తుంది. ఈ ఆడవాళ్ళది అందరిదీ కనిపించని గడుసుతనం.

గడుసుతనం అనుకోండి. పదికాలాలపాటూ భర్తగారిని సేవించుకునేందుకు, వారు అన్నవేళా ఉల్లాసంగా ఉండేందుకు పదిలంగా ఉంచుకుంటూన్న పడుచుతనం అనుకోండి. కనుకనే నొసటి కుంకుమకూ, నోచిననోముకూ, మగవాని తీరుకూ, మగవారి ఊహాకూ, ముసలితనం లేదు, రాదూ అన్నారు మీలాంటి పెద్దలు.

మీకు నేను జెప్పాలిట కాని...

ఇలా మాటల్లోపడి, భోజనం మాటే మరచిపోయే స్థితిలోకి వచ్చామ్, త్వరగా తెమలండి బాబ్బాబు. మీరనుమతి ఇస్తే, మీ గడ్డం పుచ్చుకుని బ్రతిమాలుకుంటాను.

మరో రవంత స్వతంత్రం ఉండినట్టాయెనా, బుగ్గలు సాగదీసి బుద్ధిమంతనం నేర్పుతాను. మీరు–అలాగే నావంక రెప్పవేయక చూస్తూఉంటే అదేమిదేమని, ఆ కాస్త చనువు నేను చేసుకుని చేయిపట్టుకుని చెప్పినట్టు వినిపిస్తాను...ఏమని...సెలవు?

ఎలాగూ స్నానం చేయబోతున్నా గనుక, నీవు ఓ తగుమాత్రం ఒహావేళ చనువు తీసుకునే పక్షంలో తప్పులేదే అనుకో. కాని, దీన్నిగను పూలుముడవా!–పెంపకం అలాటిది కాకపాయె. పిన్ననాడు లేకపోయినా, పెద్దవాడైనా ఇలాటి లోకజ్ఞానం కూడా అంతో ఇంతో అవసరం అన్న ఇంగితం లేకపోయె. అందుమూలాన ఉన్నపళాన నీకిలాటి సదభిప్రాయం కలగడంతో అమీ తుమీ తేలక, ప్రస్తుతానికే అనుకో, నిరుత్తరుణ్ణి కావలసివచ్చింది. సహాలమూ, కాచి వడబోసిన దానివి, పుణ్యమూ పురుషార్థమూ ఎరిగినదానివి, నీకు నే జెప్పారిట కాని....

స్విష్టకృత్‌గా భోజనం.

భోజనానంతరము...

ముందుసావడిలో తివాచీవేయించాను. తాంబూలం...

ఓం దానికేం వాస్తవానికి పగటిపూట ఎన్నడూ అలవాటు చేసుకోలేదనుకో. ఒకటో అరో ఏ లవంగమో, ఏలకిపండో బుగ్గ నుంచుకోవడం, అలా సరిపెట్టుకు వస్తున్నాను ఇంతవరకూ.

నాకు ముందే తెలుసు నీవు నన్నంతతో వదలిపెట్టవని. మనకీ వైభోగం మళ్ళీ ఎప్పుడు సంప్రాప్తిస్తుంది? ఈ మనిషి ఏం జెప్పినా సరేననడమే కాని, విధి నిషేధాలు ఏకరువు పెట్టకూడదు అని గట్టి నిశ్చయం చేసుకున్నామ్. అందులోనూ మీ చేతి తాంబూలం మహారాజ భోగ్యం కాని సామాన్యమా? అలాటిది ప్రతిఫల రహితంగా అందుకుంటున్నానంటే విశేషంకాదూ. ఈనాడు వేసుకుంటినో ఏటి కేడాదీ ఘుమ ఘుమలాడనూ? సందర్భం ఇలా కలిసి వచ్చింది గనుక, సలక్షణంగా నీవు అందీయనూ వచ్చు, సంకోచరహితంగా నేను అందుకోనూవచ్చు.

అందులోనూ నీవు ముచ్చటపడటం, నేను మూర్ధవిధూననం చేయడమూనా!

నీకు నే జెప్పారిట కాని, తగుదునని తాంబూలం ఇస్తాంటే, తప్పుగా భావిస్తాడా వెలనాటివాడు. ఆహాఁ.

కాని, ఒక్క చిన్న తిరకాసు ఉంది. ఉన్నదే అనుకో, అలా భావించడం పరిపూర్ణ భ్రమ అని తెలుసుకున్నాను, తెలుసుకోగలిగాను. అనుకో.

అఁ మరేంలేదు. అదో పెద్ద విషయమున్నూ కాదు. ఈ ప్రయాణానికి సమకట్టినప్పుడు ఏదో దూరదూరంగా ఉంటే ఈ రవంత కార్యమూ సాను కూలం చేసుకురావచ్చు ననుకున్నానేగాని, మీ గుమ్మం ఎక్కవలసిన అగత్యం కలుగుతుందనుకోలేదు.

ఇక్కడ నిలుచునే తాంబూలం పుచ్చుకుంటే అది దొడ్డి సంభావనవుతుంది. అది నీకూ నాకూ కూడా పర్యాయతని గౌరవప్రదం కాదు. పారజాడగా, నీవు చెప్పినట్లు నడచుకుంటే వ్రతభంగం ఎలా అవుతుంది? శ్రీమంతుల బిడ్డలకు మీ లోగిలి క్రీడారంగం. రసికులైనవారికి నీ వయారం మన్మథ విజయం. పుణ్య జీవనులకు నీ శయ్యామందిరం రమారమి పూజాస్థానం. సంగీత నాట్యసల్లాపాలతో

నిరంతరమూ ఒకనాడు మారుమ్రోగిన కళామంటపంలోకి నన్ను ఆహ్వానించడం నీ ఆప్యాయతకు పరమ నిదర్శనం.

ఇలా సంభావించేటప్పుడు మీనమేషాలు లెక్కపెట్టడం భావ్యంకాదు. కనుక, నీవు రమ్మన్న ప్రదేశానికి నిర్మల మనస్సుతో, నిశ్చలచిత్తంతో రానూ వస్తాను; నీ చేతి విడియం అందుకోవడమూ మానను. చూశావూ. అడుగడుక్కీ ఏమిటీ నస? ఏమిటీ తేమానం? అనుకుంటున్నావు కాదూ? నీవు ఎంత కాదన్నా నీ కన్నులు నిజం పలక్కమానవు.

అవును, ఆమాటకొస్తే ఛాందసం మెండు: చాదస్తం ఓపాలధికం.

అదన్నా, ప్రథమంలో మాత్రమే సుమీ! ఈషత్ పరిచయం అయ్యేనో ఇహ మమేకమే.

మరేమీ పట్టింపు లుండవు.

ఆహా! తాంబూల మనగా ఇది! ఎవ్వరు కాదననీ ఈ విద్య నీది.

వెనుకటికి పార్వతీదేవి అమ్మవారు కూడా తమ యొక్క లోకావన శృంగార సౌభాగ్యం పరిపూర్ణం కాదనే పరికల్పిత భావనతో - అనగా, స్వామివారు దారుకావనంలో విహారం చేయడం వగైరాలు దక్షారామంలో తనివిదీరడం - ఇత్యాదులు కర్ణాకర్ణిగా విని ఉండడంతో దీనికి ఏమి సాధనం చెప్పుమా అని పారజూసినదై, స్వామివారి సన్నిధి తనకు నిరంతరమూ లభించేందుకుగాను తాంబూలమనేటటువంటి ఈ ధన్వంతరి చిటకా అమలులోకి తెచ్చిందాయెను - అని స్కాందం చెపుతూంది.

నీకు నే జెప్పాలిట కాని...

వాసీజలమూ, వటచ్ఛాయా, తాంబూలమూ, అఁ...మరి...తరుణీమణియొక్క ఆ పొంకమూ, శీతకాలం గోరు వెచ్చదనం, వేసంగిలో కోరినంత చల్లదనం ప్రసాదించే సత్తా గలవి కనుక ప్రతి మానవుడూ ఈ విషయం విస్మరించకూడదు సుమీ, అని పెద్దలు హెచ్చరించలేదా?

కనుకనే ఈ తాంబూల మనేదాన్ని చర్విత చర్వణంగా సేవించిన పునరుక్తి, అతి వ్యాప్తి లేకపోవడమే కాక, గుణ వృద్ధి కూడా అవుతుంది. తత్త్వము తరుణానికి సమశీతోష్ణ స్థితిలో ఉంటుంది.

చిత్తం.

తత్త్వం సర్వదా సమశీతోష్ణస్థితిలో ఉంటే సన్యాసి అవుతాడు కాని, క్షణమాత్రమైనా జాణ అయ్యేందుకు ఆస్కారం ఉంటుందా?

నిజమే.

మహారాజులు, మహాకవులకు కర్పూర తాంబూలం ఇప్పించారంటే అర్థం... ఈ దీప్తితో ఉత్తమ కావ్యం రచించవయ్యా అనే కాదూ?

ఓ మదనాభిరామసుందరి, ఓ పద్మాయతాక్షి ఫలానా పాంచాలునికి చెలులెవ్వరూ చెంతనుండని ఏకాంతాన దొంతర విడె మందించినదంటే భావం...నీకు నే జెప్పాలిట కాని, మొత్తానికి నీ వన్నదే వాస్తవం కావాలి. సిసలైన తాంబూలమే గనుక సేవించినట్టయితే, ఎలాటి సాత్వికుడికైనా అంతో ఇంతో ఉద్దీపనం కలుగకుండా మానదు. అది సాజం!

అందాకా ఎందుకు – నామటుక్కు నాకు మృష్టాన్న భోజనం, నీచేతి విడియం, ఇలాటి చతురసల్లాపం...ఈ అతిథ్యంతో మునుపెన్నడూలేని వగలు వంటబట్టి ముద్దు చేసేవారుంటే చంక నెక్కే స్థితికి వచ్చాననుకో. పోనీ, లేని సత్తువ తెచ్చుకుందా మనుకున్నా...అబ్బా! అన్నపారం ధమనుల్లో పరివ్యాప్తమయ్యే సరికల్లా ఒళ్ళు మనం చెప్పినట్టు వినదు! నడుం వాల్చాలిసిందే ఇదీ మన వరుస.

పైగా, సీలమండలూ, పిక్కలూ, ఈ మోకాళ్ళూ ఒక్కటనేమిటి – ఇహ ఒకటే జివ జివ–వీటిసొమ్మంతా పడిపోయినట్టు.

"వయో ధర్మం!"

అవునే అమకో. కాని, నా మానానికి నన్ను వదలదే. ఎంత పనిలో ఉన్నా, చెయి తెరిపి చేసుకునివచ్చి నన్ను కనుక్కోవలసిందే. చక్కగా సంవాహనం చేయవలసిందే. ఇహ చాలునన్నా వదలందే. అవును. పాతికేళ్ళనాటినుంచీ వస్తూన్న ఆచారం. ఎక్కడ ఏ కీలుకు ఎలా తశ్మాంతి చేయాలో ఆ చేతులకు అమరిపోయింది. ఆ చేయి సోకడమేమిటి, హాయిగా కునుకుపట్టడమేమిటి? పిల్లలు ఎదిగొచ్చి, ఎవరి కాపురాలు వాళ్లు చేసుకుంటూ, ఎవరిదోవను వారు తలో చోటా సలక్షణంగా ఉండిపోవడంతో లంకంత ఇంటికి ఇహామిగిలిందెవరు? తనకు నేనూ, నాకు తాను! అంతేగామరి.

అలా కావడంతో అవిడ పదిమంది పెట్టు గారాబాలూ నాకు చేస్తూండటంతో మరీ సుకుమారం బలిసింది. కాకపోతే, ఈ అపసోపా లెందుకు చెప్పు?

అలవాటు.

అలవాటే అయితే ఇన్నాళ్ళనుంచీ ఏమైంది? ఇవాళకు సరిగ్గా మండలం. చిన్నకోడలికి పురుడోసేందుకు వెళ్ళింది. ఇహ నేడో రేపో మళ్ళీ దిగుతుంది, అ( – ఇవాళ చవితి కాదూ...రేపూ.

ఇంతకాలం నా తిప్పలేమో నేను పడలా? తానే దగ్గిర కూచుందా? కాలునొచ్చినా, చేయినొచ్చినా సరిపెట్టుకుపోలా? దగ్గిర కూర్చుని బుద్ధులు నేర్పడం అదో సరసం కామోలు.

వచ్చి కూర్చుని పాదంమీద చెయి వేసిందో లేదో ఇహ ఓ కాశీ మజిలీ కథ అందుకుంటుంది. చెప్పింది చెప్పకుండా ఎన్నిరోజులైనా ఓ విసుగూ విరామం అన్నది లేకుండా చిలువలు పలవలుగా కల్పింది...

ఏనాటి ముచ్చట్లో...

తలో చోటా సలక్షణంగా ఉండటంతో ఇంటి దగ్గిర తనకు నేనూ, నాకు తానూ కావడంతో అవిడ గారాబాలన్నీ నాతోనే తీర్చుకోవాలాయెను. కనుకనే ఈ గూట దీపం పెట్టేందుకంటూ వచ్చిన కొత్తల్లో...

నిన్నిటు చూసి అటు దూసుకుంటూ, "కానీ చూద్దాం" అని కళ్ళతో పలుకరించిందట. నేను కనుక్కోనేలేదట.

అవేళపట్టున అకూ వక్కా అందించబోతే వీరికి అందుకోవడమే చేతకాదట. సగపాలు ముందు తన కివ్వటం – ఆ నేర్పేలేదట. ఎలా పండింది! ఎంత అపేక్షె...అంటూ మురిసిపోయే ముచ్చటే ఎరగనట.

జడలో పూలచెండు – చెంపకు ఓజారినా చూసీ చూడనట్టు ఊరుకున్నాడట. ముంగురులు చెరిగినా పట్టించుకోలేదట. నాకు సేవజేసి అలసిపోయినావ్ అని లాలించకపోతినట.

అసలు ఎలా పలుకరించాలో ఆ కలుపుగోలుతనమే ఏ కోశానా లేదట.

తాను అత్తవారింట అడుగుపెట్టిన రోజుల్లో నేను వట్టి ఋష్యశృంగున్నట. కావాలని పనివేళా కలుగజేసుకుని ఎలాగైతేనేం ఇన్నేళ్ళకు ఇంతవాణ్ణి చేసిందట.

ఇంతవాణ్ణంటే ఎంతవాణ్ణిలే... ఇలా చిన్నెలూ వన్నెలూ చిద్విలాసాలూ ఆవిడ చెప్పుకుపోతూనే ఉంటుంది.

వినగా వినగా ఓ కునుకు.

శ్రీరామా–రక్షకా–సీతామనోహరా!

అబ్బా!

ఆఁ...

తెలియకుండానే కునుకుదీశానే.

పరాయిచోట పక్కవేయడమే అలవాటులేదు.

అందులో ఎదురుగుండా తగు మనుష్యులుండగా ఎలా పట్టేందబ్బా ఇంత ఒళ్ళూపైదెలియని నిద్ర!

సత్యా, నీవుగాని జాలిదలచలేదు కద!

అదిగో, అలా ఒక్కనవ్వు నవ్వి ఊరుకుంటే నాకు అర్థమయేనా..చెప్పుదూ?

ఆఁ నిజమే. ఇలాచూడు. నీ కిదిన్యాయమేనా? మహారాజులంతలేసివాళ్ళచేత అడుగులకు మడుగులొత్తించుకున్నదానివి.

దానికేం లేస్తురూ.

అది అప్పటిముచ్చట. ఇది యిప్పటికి ముచ్చట.

అలా ఎదురుగా మీ అంతవారు అరమరికలేకుండా ఆపసోపాలు పడుతూంటే ఎలాచూస్తూ ఊరుకోనండీ.

పోనీ ఊరుకుందామన్నా చేసినచేయి ఊరుకోందే!

ఇదేం అకార్యమా – కాదు.

మీరూ లోకంతోపాటివారే. అయితే, కోరి, చేయించుకోకపోదురా? కాకపోతిరి! నేను కాస్తకనిపెట్టి చూడద్దూ.

ఆఁ అయినా యిదేమంత మహాభాగ్యం లేస్తురూ.

తానూ ఇక అట్టే సాగదీయడం సరసంకాదు.

సరిపెట్టుకున్నాడు.

పండూ ఫలమూ తీరుబడిగా ఆరగించాడు.

తూరుపుబండి దానిత్రోవదానిది.

ప్రదోష సమయం. ఈశ్వరాలయం.

తనకు...దారితోడు–ఆ మార్దంగికుడు.

చూడగా చూడగా అతగాడు పాడిమనిషి కాదు.

తరతమా లెరిగినవాడు. తనవిద్యలో తగుపాటి పారజూసినవాడు.

ఉండీలేనట్లు మెలగనేర్చినవాడు. వెంట ఉండతగినవాడు.

ఆలయ ప్రాకారానికి పదిబారల ఈ చెంపను చిన్న కొనను, చిక్కంగా తామర తంపర.

ఒంటిగా చంద్రుడు. పక్కపక్కల చుక్కలు.

వెలుగని వెన్నెల, సోకని గాలి, కనిపించని వేడుక, అనిపించని వేదన!

అది గమనించా డతగాడు.

ఇది ఎంతో పుణ్యము చేసుకున్న స్థలమయ్యా, మీవంటివారికైన పూజాస్థానమయ్యా!

ఎలాగనేదా!

ఇక ఇతిహాసమున్నది వినేరా? –

వేయేళ్ళకు వెనుక. నూరేళ్ళకుముందు ఈ దేశమేలే మారాజు కొడుకు–నిండు పున్నమివంటివాడు – వయసు వచ్చినవాడు కాగా –

ధర్మా లొకటిగా – తత్పరత లొకటిగా – పొలిమేర లొకటిగా పరిపాలన చేస్తున్న వీరాధివీరుడు.

వీరే తమకు అల్లుడని అనుకోగా, వారి ఆచారము మేరకు నిండుసభలో నిలువు తెరలు కట్టించి ఆ వంక రాణీ వాసమూ, ఈ వంక మగపెళ్ళివారూ ఆసీనులై ఉండగా పురోహితులవారు పది ముత్యములూ, ఒక్క రత్నమూ యువరాజు దోసిలిలో ఉంచి –

తెర మరుగైఉండి, ఈవలకు చేజాపిన ఆ చిన్నదాని దోసిలిలో ఉంచమనగా – బ్రాహ్మణాశీస్సులు చెలరేగగా,

ఆ రాజకుమారి, అతడు అలా తన హస్తములలో ఉంచిన ముత్యాల్నీ–రత్నాన్నీ పెద్దలు ఆదేశించగా – తనకు కనుచాటుగా పెళ్ళికుమారుడి సమీపంలో ఉన్న దేవతా విగ్రహంమీద ఒక్కసారి అర్పించమనంగా...

ఆచేత ముత్యం మిగిలె. ఎంత తప్పు!

అది ఆ కాలపు ఆచారమయ్యా. చిన్నదానిచేత రత్నం మిగిలితే ఆ మనువు రాణింపుకొచ్చేను. జంటముత్యాలైతే సంతానవతి అయ్యేను.

ఒంటి ముత్యమైతే వెలయాలు!

అది బహు అరుదు. కాని, ఆ నొసటనే ఆ పొద్దు పొడిచింది.

తప్పదు తలవంపు.

కన్నతండ్రి దద్దరిలిపోయె. కనుగొన్నవారు తల్లడిల్లిపోయిరి.

ఆ చిన్నవాడట్టె లేవబోగా – ఒక్కనిమిషము ఆ చెయ్యొడిసి పట్టిందా చిన్నది.

చిరునవ్వు నవ్వుకున్నది. మతిపోయెనేమో అనుకుంటేరట. కన్నతల్లి వాపోయిందట. చిన్నది మరోనవ్వు నవ్విందట.

ముత్యానికి సత్యం తప్పదమ్మా అంటూ మరింతగా నవ్విందట.

ఆ తల్లి మనసు మనసులో లేదట.

కన్నతండ్రి కంటతడి చూసిందట.

పూసినపూవు దేవునిపూజకైనా, పూబోణి సిగలోకైనా...

చేసుకున్న పుణ్యం ఒక్కటే మహారాజా!

ముత్యం నన్ను వెలయాలిని చేయలేదు. వెలలేని ముత్యాన్ని చేసింది

ఇందుకు చింతపడతారా. అదోతీరుగా నవ్విందట.

వారు వైద్యులకు వర్తమాన మంపినారట.

చిన్నది, చెలికత్తెలతో అంతర్ధానమైనదట

ఇహ, అక్కడ ఆ పెళ్ళికుమారుడు ఏ స్థితిలో ఉన్నాడంటేనూ –

ఓ మహారాజ కుమారా మన్మధాకారా!

ఈ వెలయాలు నిన్ను చేపట్టింది పెద్దల సన్నిధిని.

ఇది వెల్లడికాక మానేనా...

వెలయాలి భర్తకు ఎవరు పిల్లనిచ్చేరు?

మరి, మీ రేమయేరు?

ఇలా పత్రిక లిఖించి పంపిందయ్యా! వారూ, మతిపోకముందే మాయమైనారు!

ఆ పరిస్థితి అలా ఉండగా...

ఇక్కడ ఈ చిన్నదీ, చెలికత్తెలూ అలా తరలివచ్చి–

ఎవరికీ, కానరాని ఏకాంత ప్రదేశమని ఈ ఆలయంలో విడిదిచేసుకున్నవారై, స్వామిసేవలో తత్పరులై గతం మరచి, కలత దేరి ఉంటూండగా ఒకనాడు ఒక ఎరుకసాని పులుకు పులుకునవచ్చి ఈ చిన్నదాన్ని చేరదిలిచి, "ఎరుకో అవ్వ!" అనంగా, ఈ ఎరుకలు మాకెరికేలే అనీ తుసారించి "పిడికెడు ముత్యాలు ఓచ్చం వేయండే" అన్నది.

ఎరుకసాని మెరుపాడినట్లాడి "ఆసి ఇడిక్కా, మిడిసి పడేవే" అనంగా, గురువు ఎదుట ఉన్నట్టు, గురి కుదిరినట్టు, నేరనివిద్య నేర్పినట్టు, నియమాన ఉన్నట్లు ఆ చిన్నది అలవిమాలిన వయారాలుపోయి తన మనికి తానమై, తన ఉనికి గమకమై, పదవిన్యాసము స్వరజతియై, కరచాలనం సరళస్వరమై, నాట్యమాడి, ఒక క్రమానికి కులుకూ కుయూ మందగించి, మరో క్రమానికి మాన్పడగా–ఎరుకత ఉవ్వెత్తున నవ్వి కొండదేవరకు గగ్గోలుచేసి, గగనం చలించేట్టు సంకుపోయగా, ఆడినంతమేరా రత్నమల్లె తళుకిచ్చి, ముత్యాల రంగవల్లి రేకలుతీరి, ఆ బాల ముత్యాలలో తానో ముత్యమై ఉండిపోయిందట.

అప్పుడు కొండసాని వాక్కు ఏమన్నదంటే – ఆసి–తగరా!

"తండ్రి ఇచ్చిన బలిమి, తల్లిఇచ్చిన కలిమి, జన్మ ఇచ్చిన చెలిమి–చెల్లిపోయె–కోనకొచ్చి అయ్యమెచ్చి సానివైనావు–నీ చేతిముత్యం దేవర దేసికన్ను...ఆ చలువ సోకితే...సగం పాపం పోయేను. పోయిపోయి నీ చేతికి సోకిన మామిడితీగ– నీవు కదలినా నీడకదలని చోట, పాదుంచవే. మాటలో చిగిర్చి–పాటలో ఫలించి–ఆపైన పూసేనే కనకమామిడి. చిగురుచూసి, చిన్నెచూసి చిలక ఈకడ వ్రాలంగ–చివ్వో చివ్వో రాజకూతురి రాజసాలకు రవ్వో–రవ్వో–"

ఎరుకత కనుమాయైంది. ఎక్కడుంది? కనకమామిడి – ఆనవాలు తెలియని దానికోసం ఎలా వెదకడం? చేత మిగిలిన ముత్యం కొండదేవర దేసికంటికి అమరించింది. ముత్తెంలో ముత్తెమంత మెరుపురాబోయి, అంతలో వెన్నెల సన్నగిలినట్టు తళుకు తరిగి–పులుకు మిగిలింది.

కోన అంతటా కలయతిరిగింది. మనస్సు ఏ తీవెమీదికి పోలేదు. ఎన్ని లతలో చేతికి సోకినా, తనకు గగుర్పాటు కాలేదు. ఇదే అనిపించలేదు.

అలాగ ఎన్నిపొద్దులో ఆ రాజకూతురు తీవెను వెదికే తీవెగా అల్లాడిపోయి, తిరిగి కొండదేవర కొలువుకు వచ్చి, ఆ సన్నిధిలో మోకరిలి వాపోయింది.

ఎక్కడుంది కనకమామిడి?

సన్నిధిలో!

తీవే ఆ చేతికి సోకింది.

ఆ కంటివెలుగు చిన్నదానిమీద కమ్మింది!

దేవర వెన్నుచరచినంత నిబ్బరంతో, ఆ రాజు కూతురు, తీవెకు ఎక్కడ పాదుచేసింది? ఇదిగో—ఇక్కడ!

కనకమామిడి, నేల ఊనగానే, చిగురించింది. ఆ చిన్నది, తనకు తెలియకుండానే, అమితమైన ఆనందాన ఒడలు సారించగా – ఫలించింది.

చిగురు చిగురుచాటునా, ఓ రవ్వ, ఓ రతనం, ఓ కెంపు, ఓ పచ్చ ఫలించాయి. రవ్వలమీద సూర్యదేవర కన్ను పడగానే, తీవెన్న చిగురులు ముత్యాలయినాయి.

ఆ చిన్నది, ఆ వంక – ఆ కన్ను – అలా ఆర్పకుండా చూస్తూండగానే–

కోట విడిచిన రాజకుమారుడు, సరిగా యిక్కడకే వచ్చాడు. చేయందుకున్నాడు. చిన్నది, రవంత విదిలించుకోబోయింది.

కోటకు దూరమైనావు కావు. కోరికలకు దూరము కాలేకపోయితివి. నామీది పగ నాట్యమాడి తీర్చుకుంటివి. వెదకి వేసారేవేళ, ఎరుకసాని చెప్పిందిలే. తానే ఎదురై, మన కథ చెప్పిందిలే. వెలలేని ముత్యానివైనా, వెలయాలివైనా, నీవు నాదానివే! చెయ్యొడిసి పట్టినదానా, నన్ను చిన్నబుచ్చకే, అన్నవాడు కాగా–

నీకు చిన్నతనం కారాదనే–చేయందుకున్నాను అంతే! కాని, కోటలో శకునం వెన్నాడకుండా కొండదేవర శరణిచ్చాడు. కనకమామిడిచ్చి కాపుండవే అన్నాడు.

ఎరుకసాని మేలుచేసింది కాని ఎడబాటు తీర్చలేదు. దేవుని చూసిన చూపున నిన్ను చూడలేను. నిన్ను చూసుకుంటూ నవ్వకుండా ఉండలేను.

కనక మామిడికి నేను కామనలేక కాపున్నాను–ఆ ఫలం, నా మనోరథం! ఆ లత నా నిత్యమాంగల్యం! ఏ సేవలూ కోరని ఈ తీవెను విడిచి, నీ సేవలు నాకు చెల్లవయ్యా!–అన్నదాయెను. అప్పుడు ఆ రాజకుమారుడు తన రీవికి తగినంత మందహాసం చేసి –

"ఎరుకసాని పలుకు ఫలించింది. కామనలేని కామిని రతనాలు మనోరథమైన మానిని ఏ సేవలూ కోరనివారిని మన్నించే మదిరాక్షి కనకానికి కాపున్న కళ్యాణి–నీ మనవి ఆలకించేనులే" అన్నది. చిన్నదానా? నీ ఎదుటనున్నది కనకవృక్షమే! అని బుజ్జగించి, కనకమామిడికి కనులారా మ్రొక్కి –

నీవు ఫలించినట్లు మా నెయ్యము ఫలించాలి! నీ చిగురులు ముత్యాలు యీ బాలనగవుల రత్నాలుగా నీ సొంపులు ఈ వగలాడికి హేమ–సంపదగా కనకానికి సేవలు చేసినందుకు – కనకమే కామనగా– సర్వమే రూపముగా, తారుణ్యమే నీవుగా, యీ కులాస బాలలు వర్ధిల్లాలి! అని అంజలి మ్రొక్కగా కనకమామిడి

ఫలించిన రతనాలు, ఆ రాజకుమారుడి దోసిటనిండగా, ఆ చిన్నది సిగ్గుపడుతూనే ఆ చేతులు అందుకున్నదాయెను కాగా –

కనకమామిడి దేవరసన్నిధికి మాయమ్మై కథ మిగులు మొదలైంది.

ఎట్లనగా,

చేతికిచేయి సోకినపుడు దోసిటి రత్నాలు కదలగా కదలని సీడలు కదిలె. కనకమామిడి కుదురుకొన్నచోట తళుకు మొగ్గల జాలారు కమ్మె.

ఆ చిన్నది సిగ్గుమాలినతనమే సోయగమ్మై, కనకమే నిగ్గుదేరిన కనుపాపై, కులుకే తిలకమ్మై –

ఆ రాజకుమారుణ్ణి–అంతరంగాన జేర్చుకున్నదాయెను: అయ్యో! ఇదీ ఇక్కడికథ! ఆ రాజకుమారి పేరు రాకేందువదన!

అది మా కులానికి సత్యం! వినిపించి ముగించాడు అంకాలు. తాను విని ఊరుకున్నాడు.

అహ! అని మనసు పలికింది. కథ కనులలో కలయదిరిగింది.

తిరిగి యింటికి వచ్చాడు.

స్నానంచేసి దేవతావందనం చేశాడు. పాలుమాత్రం ఆరగించాడు. పై ఆసలేదు. అంకాలు మంచి గంధపు కలపము కనులముందుంచాడు. అలదుకున్నాడు.

పన్నీరుపై జల్లగా తనకువచ్చింది స్తోమత!

వచ్చింది! ఎగిరి వాలింది రంభ!

రంభ చెల్లెలే రాకేందువదన!

కప్పూర విడెము అందించింది.

గానాన ఆడింది.

కాగా తన మానాన తాను లేడు.

కాని, తనువు తెలియని స్థితిలో లేడు – రాలేదు. రంభ కనుసైగచేసింది. చేజాపింది. తాను చేతులు ముకుళించాడు.

దోసిట రత్నాలు లేవే చినదానా అన్నాడు.

రత్నమంటి దీవెన యివ్వలేరో అన్నది.

తాను దైవాన్ని తలచుకుని, తలవంచాడు.

"నేను రాజకుమారుణ్ణి కాను!"

"నేను వెలలేని ముత్యాన్ని కాను!"

తాను తలఎత్తి చూశాడు. బహుకరుణగా చూశాడు.

"మనకు ఫలప్రాప్తిలేదు" అన్నాడు.

రంభ బింకంగా నవ్వింది. "బ్రాహ్మణీకమే ఫలప్రాప్తి!"

హతోస్మి అనుకోబోయిన మనసు ధన్యోస్మి అనిపించింది.

తాను ఎత్తినతల వంచలేదు.

రాకేందువదన అతివినయంగా అడిగింది: "అయ్యా, తాము యిక నిదురించేరా?"

అమాయికంగా ఆనందంగా అమర్చి ఉన్న పాన్పుమీద తనకు తాను నిదురపోయినాడు. తూర్పున తెలవారకముందే మేల్కొన్నాడు.

..రత్తమ్మా! వెళ్ళివస్తాను గాని –

మళ్ళీ రాలేరు. కాని, ఒక్కక్షణం –

తాంబూల మిచ్చింది పైన సేలువ వేసింది, ధోవతుల చాపు కట్టబెట్టింది. దోసిలినిండు విచ్చురూకలు అర్పించింది. పాదములంటింది!

యిదేమిటన్నాడు! ఏనాడో తాను పట్టిన నోములకు యీనాటికి...ఉద్యాపన. కాక, దేవబ్రాహ్మణులు తన యింటికేవేళనుండివచ్చేరు?

ఆ మాటకు తాను సంతోషించాడు.

సెలవయ్యా! తమ ఆజ్ఞప్రకారము అనాటికి వచ్చి తీరకమానను. మరోసారి తమ దర్శనభాగ్యం చేవిడుచుకుంటానా – కాని, అన్యథా భావించవద్దు అక్కడ మరో కథ!

రత్తమ్మ చనువుగా నవ్వింది.

తనకు అప ?డూ రవంత మతిపోయింది!

* * *

# సోహం

తానెక్కిన తూర్పుబండి..

నిన్న సంజవేళనగా అడంగున బయలుదేరి, అడుగడుక్కీ ఒక స్టేషనూ, అక్కడ ఎక్కేవారూ, దిగేవారూ, ఈ గాసితో రాత్రంతా నిదుర లేకుండా వడచి వడచి, శ్రీనాధులవారి కర్ణాటాంగనవలె, వసివాళ్వాడుతూ, పోతూంది.

మద్దిన, ఒక స్వాములవారు ఎక్కారు, వారి సరంజామాతో, మనిషి బాల గంధర్వలాగున్నాడు. శకుంతల జన్మ వృత్తాంతం వింటూ కుతూహలం మరింత ఇనుమడించగా ఆ చెలికత్తెలమీదికి చొచ్చుకుపోయే యడవల్లి దుష్యంతుడి రీవిలో అర్ధ త్రిభంగిగా, ఉపవిశుడైనాడు. అప్పుడు తన వంక చూశాడు...తాను రివాజు ప్రకారం నడుముకు ఉత్తరీయం చుట్టుకుని గోత్రప్రవర వల్లించి నకర్మణాతో పాదాభివందనం చేశాడు. తనవెంట అగ్రహారానికి దయచేసి, తన ఇంట పాదపూజ లందుకుని, తన భిక్షావందనం స్వీకరించి చరితార్థుణ్ణి చేయమని అభ్యర్థించాడు. ఆయన ఓరగా నవ్వి, మాధవపెద్ది దుర్యోధనుడి గొంతుపెట్టి, అబ్బాయ్–అంత రభసెందుకులే – భిక్ష కేమిటి భోజనానికే వస్తాను. నేను స్వాములవారిని కాను, వర్ది సన్యాసిని. ఈ కాషాయాంబరం ఉందే – అది అవసరంకొద్దీ కించిత్ ఆడంబరం. చిత్తం చిలిపితనంమీద, భక్తి భార్యామీద, అబద్ధం కాదు! అర్థం కాలేదా?–

నీవు చూడబోతే అంతో ఇంతో యోగ్యుడివిలాగున్నావు! పిల్లలెందరూ – పెళ్ళి కాలేదా – ఓహో – కాకపోతే కొరతా లేదు, అయితే ఘనతా లేదు. ఇలా ఉండిపోవడం ఒకందుకు మంచిదే – అంటాను. ఇంటి పట్టున ఏ జంజాటనా ఉండదు. అర్ధరాత్రీ అపరాత్రీ వెళ్ళినా – అక్కరలేని ఆరాలన్నీ తీసి, యాగీ చేసేవారంటూ ఉండరు. అత్తెసరు వేసుకోడం మొగం మొత్తేనో...'సత్రాభోజనం, మఠానిద్రా!' ఉండనే ఉందిగా – రాజెవరి కొడుకురా అని బ్రతకవచ్చు. టింగురంగాగా తిరగవచ్చు. ఔనా కాదా?–

అబ్బాయ్ – ఈ గడ్డపాయన ఏదో వెర్రి వేదాంతం కోసం ఇలా మోగుతున్నా డనుకోబోకు. మనకు వెర్రీలేదు, వేదాంతమూ లేదు –, నిన్ను వేళాకోళంచేసే ఉద్దేశ్యమూ లేదు – యద్దేవాకనడం లేదు – యధార్థం అనుకో

నేనిలా ఎందుకు కావలసి వచ్చిందో చెపితే సర్వమూ తెలుస్తుంది. సంశయ విచ్ఛిత్తి అవుతుంది.

నాకు మన గ్రామంలో ఇల్లూ వాకిలీ ఉంది. ఇల్లు కనిపెట్టి ఉండేందుకు మూడు ముళ్ళూ వేసిన మేనమామ కూతురుంది. మాంచి తీరైన మనిషి. అవధాన్ల పురుషోత్తం ఆడవేషమల్లే ఉంటుంది – నిండు హృదయం. నిరాభరణ

సుందరి. ఇరుగూ పొరుగూ చెయ్యెత్తి మొక్కేంత చిత్తశుద్ధి కలది కోటి కొక్కత్తె ఉంటుంది అలాటిది.

నలుగురికీ చూడముచ్చటైన కాపురం మాది. నీడపట్టున ఉండి, సుఖపడటమే నా పని. అందరిలాగా ఓ పొలమెళ్ళడం కాని, పొద్దోయి రావడంకాని లేదు. ఒకరి జోలీశొంఠీ అక్కరలేదు. ఎవరితోను పిచ్చాపాటీ అడే అలవాటు లేదు – ఊళ్ళో ఉన్నా లేనివాడి క్రిందె జమ.

నాకది బాగానే ఉంది. కాని, నా తరహా ఊళ్ళోవాళ్ళకు సానాయించలేదు. అందులోనూ బాపమ్మొదినకు. బాపమ్మంటే మాకో వేలు విడిచిన ముత్తాత మనవరాలు. ఆవిడకు మూడో ఏట పెళ్ళయింది. మరో మూణ్ణెల్లకు వరదల్లో పుస్తెపుటుక్కుమన్నది. బుద్దెరిగినప్పటినుంచీ ముసుగేసుకుని మునసబీ చేస్తాంది ఆవిడకు అక్షర్లేనిదంటూ లేదు. నోరూరుకోదు. కాలూరుకోదు. పోనీ కజ్జాకోరా అంటే అదీ కాదు. అదోస్వైజం. సొంట్లు శోధించందీ ప్రొద్దుపోదు.

ఎవరో ఓ విశ్వస్థను గురించి ఇంత స్వస్తి చెపుతున్నావేం అంటావా? ఇంత చెపితేనే కాని, ముందు కథ అర్థంకాదు. ఓనాడు ఆవిడ పనివేళా మా ఇంటికివచ్చి, నేను స్వహస్తంలో కూడా ఉంటిని. ఒరే చిదానందం – నాపేరు అప్పటికీ ఇప్పటికీ అదేలే – 'ము' మరీ సంసార పక్షంగా ఉందనీ 'డు' చేర్చుకున్నాను – ఒరే అల్లుడా, కుర్రసజ్జు ఒక్కడూ పలుకలేదు. ఒక –మారొచ్చి నాలుగాకులు రాల్చిపోదూ అంది – మాట తీసెయలేక సరే కదా అనడం – అదే ఇంతకు తెచ్చిందనుకో –

నాచేత చెట్టు చెట్టూ దులిపించుకుని, అక్కడే నిలవేసి ఏమిరా నాది చెప్పాల్సిన వయసు, నీది వినాల్సిన ఈడూ. నిన్న మొన్నటిదాకా ఓ పుట్టగోచి పెట్టుకుని నాకు నిలువు చెంబుతో నీళ్ళోసిన వాడివి కదుట్రా – ఇప్పుడంటే ఇంత జుట్టూ జులపాలూ పెంచుకుని పెద్ద మొగరాయుడివైనావుగాని –

ఇంత నదరుగా ఎదగనైతే ఎదిగావు కాని నీకు తల్లో నాలిక ఉన్నట్లు లేదేమిరా. ఇల్లో నారాయణమ్మల్లే ఎప్పుడూ పెళ్ళాం కొంగట్టుకుని తిరగడమేనా? సాటి మగాళ్ళందరూ ఇలాగే చేస్తున్నారా? ఓ యబ్బ నీకే ఉందా మహా అపేక్ష అందరూ కాపురాలు చేయడంలా – అలా అస్తమానం ఇంట్లోనే ఇల కరుచుక్కూచుంటే నలుగురూ నవ్విపోతున్నారా! అలా చేస్తే దానికి అలుసైపోతావురా – అది నీ ఇంటా వంటా లేదురా!

మీ తాత మటుకు మీ తాత, ఒక్క క్షణం ఇంటి పట్టున ఉండేవాడా? ఇవాళ కప్రానుపాలెంలో ఉంటే రేపు కవుతరం.

రేపు కవుతరంలో ఉంటే ఎల్లుండి కుందేరు

మర్నాడు వల్లూరు, అమర్నాడు వణుకూరు – ఇలా సాలుకు సాలూ పొలాలమీదే ఉండేవాడు – కాని పోషణేం తక్కువా. ఇంటికే రావాలని బెంగా. మగ మహారాజంటే – అయన! అలాగని ఇంటిమీద శీతకన్నేశాడా? నలుగురాడా అరుగురు మగా – ఆ పోలికొచ్చింది కాదేమిరా? నాయనా!

పోనీ, అందాకా ఎందుకూ, మీనాన్న మటుకు మీనాన్న – ఆ తండ్రికి తగిన బిడ్డే అని అనిపించుకోలేకపోయినా ఉన్నంతలో ఓ నిక్షేపరాయు డనిపించుకోలా?

అదె ఎకరాల మాన్యం ఉన్న ప్రతివాళ్ళో - మామూళ్ళకు పోయినప్పుడు వసతిగా ఉండేందుకు రెండో కంటివాడికి తెలియకుండా సదుపాయం చేసుకోలా? మళ్ళీ ఇంటికొచ్చాడో. వాడంత మంచివాడున్నాడా అనిపించుకోలా? పెద్దవాళ్ళు అందుకే అంటారు - మగవాడు తిరక్క చెడ్డాడని. ఒరే నాయనోవ్! నిన్ను చెడిపొమ్మంటున్నా ననుకునేవ్ - ముందు ముందు బాగుపడాలంటే - ఈ పద్ధతి కాదు.

కొన్నాళ్ళు పోతే, ఇంత స్వతంత్రంగా చెప్పేవాళ్ళూ ఉండరు. నీ బుద్ధి నీవే చూసుకో ఎప్పుడూ మండిగానికి పెట్టిన కుంకుమల్లే పడుంటే - మీ ఆవిడకు మటుకు అచ్చటా ముచ్చటా ఎలా తీరను?

మావారు మొన్ననగా వెళ్ళారు. దీపాలెట్టే వేళకు ఎన్ని పనులున్నా తిరిగి వస్తానన్నారు - మొన్నలేదు, నిన్నలేదు. ఈవాళ ఇంతవరకూ అజా పజాలేదు. ఏం తిన్నారో ఏంలేదో. వారి కసలు పరాయిచోట నిద్రపట్టదు. ఎంత అగత్యమో కాకపోతే ఒక్క క్షణం ఉండేవారు కాదు. కాచి వడపోశాం, కొంగున కట్టేసుకున్నాం అని మన మనుకోవడమే కాని, ఏమో మగవారూ, ఎంతకన్నా తగుదురు. కంటికి అక్కడేం వద్రగా కనిపించిందో. ఇలా తపన పడటం, తీరా ఇంటికి తిరిగి వచ్చాక, అమాంతం మీద విరుచుకుపడటం, సన్నాయి నొక్కులతో మొదలెట్టి, వేధించి, రవంత వేపుకుతిని, తగుమాత్రం కంటతడి పెట్టి, ఆకలి లేదని అభోజనం పడుకునేంత హైరానుపెట్టి, గడ్డంపట్టి బతిమాలించుకుని, చేతిలో చేయి వేయించుకుని, వచ్చేపండక్కి పట్టుచీర పురమాయింపించుకుని, అట్టె మల్లెచెండు తలలో ఉంచుకుని, ఇంకా బెట్టుగానే, ఓ మెట్టూ ఓ మెట్టూ దిగి, ఏ అర్ధరాత్రి వేళకో, హాయిగా నిద్ర తీయాలని...జన్మంటూ ఎత్తి, ఆడపుట్టక పుట్టినాక - ఉండదుట్రా నాయనా! పొరుగూరు పోనూలేను, అంత గ్రంథసాంగుణ్ణికామా లేనంటావా - పోనీ ఉన్న ఊళ్ళోనే అయెను. నలుగుర్నీ చూసి నేర్చుకోనన్నా నేర్చుకోరా. నేనెందుకు చెప్పొచ్చానంటే - ఒకరి కొహారు మొఖం మొత్తేట్టు కారాదురా - కాస్త ప్రయోజకుడివై - నీవూ ఓ మనిషివే అనిపించుకోరా -

ఇంత నూరిపోసింది - నాకు ఓ చెంప నవ్వూ, ఓ చెంప కోపమూ - కాని, ఊహూ అన్నానో, మరింత సాగదీస్తుంది. ఆ పూటకు బయటపడేది కల్ల. సరే నన్నట్టు తల ఊగించాను. తప్పించుకొచ్చాను.

వచ్చానే కాని నాలో అర్థం బర్థం కాని మధన ఆరంభమయింది. మతోయిన మనిషి కాదు. తలక్రిందుల తత్త్వంకాదు - అందులో ముఖ్యంగా నా మేలుకోరి చెప్పింది - అంతే, కాని, నామీద ఏమున్నా పగా ఆవిడకి?

'స్వభార్యాయాంచ యౌవనమ్' - అని పెద్దలు విధివతుగా అన్నా, 'యౌవనే విషయై షిణామ్' - అంటూ కాళిదాసువారు చెప్పడంతో, ఒక్క నందగోపాలుడికే కాక శ్రీరామచంద్రమూర్తికి కూడా ఆ ప్రతీతి ఉండటంతో, వాత్స్యాయను డంతటివాడు తన గ్రంథంలో పారదారికం ప్రత్యేకంగా వక్కాణించడంతో, ఇలా ఇవన్నీ పారజూడగా, బాపమ్మ చెప్పిందాంట్లోను కొంత సబబు ఉన్నట్లు నాకు తోచింది. మరింత తరచిచూడంగా ఆ సలహా అనుసరణీయమే అనిపించింది. కాని, అది ఎన్నడూ అలవాటులేని ఆపోశనం మనకు - ఎలా ఉపక్రమించడం? అసలే బిడియం,

అందులో కొంత బెరుకూ – అడుగు ముందువేసినా, మనసు వెనుకాడటం – ఇలా సతమతమై, చివరకు ఏమైతేనేం – దీని అంతు కనుక్కోవాలని ఓనాడు సంజవేళ, అలా చెరువు గట్టుకేసి, చేలకేసి షికారుగా పోయినాను–తలకు ఉత్తరీయం చుట్టి, పంచ ఎగకట్టి – ఎవరూ నన్ను గుర్తు పట్టకుండా ఉండేందుకని...

అలా పోగా పోగా. చేలమయాన ఒంటరిగా ఎవరో జనప పన భుజా నేసుకుని వస్తున్నారు. ఆడకూతురే – దరిదాపులచూడగా, సంజీవరావు చిత్రాంగిలాగా ఉంది. అచ్చంగా – ఆ మసకలో నాకలా తోచిందనుకో ఏం పిల్లా అనగలిగాను ఓ పట్టానికి – అది అక్కడ ఆగిపోయి, అటూ ఇటూ చూసి, ఒక్క ఇకిలింపు ఇకిలించింది – కొంచెం ధైర్యం చేసి సమీపించాను. అది నా మొగంలోకి చూసిందో, అం – మీరా అయ్యగారూ, సీకట్లో సిక్కడ్డారా నేను తోడొస్తా లెగుండి–రాండి!–అంది నాకు కంపరమెత్తింది. పో–పో–పో–నీదారిని నీవు పో–అనేసి, చేనుకు అడ్డంపడ్డాను – అది వెనకాతలే నవ్వుతూ నవ్వుతూ వుండటంతో, నాకు మరింత మతోయి, ఎటో పోయి, ఎటో తిరిగి, ఏదో వేళకు ఇంటికి చేరుకున్నాను.

గుమ్మంలో మా ఆవిడ సిద్ధం! తల వంచుకు లోపలికి పోబోయినాను ఆవిడ నవ్వుమొగంతో ఆపేసింది – 'ఏమండీ, అలా పోయి రావాలనుకుంటే – పొద్దుండగా పోలేక పోయినారా – చేనికడ్డం పడటం ఎందుకు? చీకట్లో చిక్కడటం ఎందుకు? అది, మన లక్ష్మాయి కూతురు, వచ్చి చెప్పెళ్ళింది లెండి – లాంతరిచ్చి ఎవరినన్నా పంపించమంది. వెర్రిబాగుర్ది. బాపమ్మను పంపుదా మనుకున్నాను – అనుకుంటూండగా మీరే వచ్చారు...' అంది అతి నిదానంగా.

నేను గజ గజలాడిపోయి, బాపమ్మ ఏం చెప్పిందేమిటి? – అన్నాను.

ఏదో చెప్పిందిలెండి, దానికేంగాని, మీకు అలాటి మనసులుంటే లక్షణంగా పల్లెకోన పోయిరారాదూ? అక్కడ రంభలూ ఊర్వసులూ ఉంటారు. అలాటి చోటికిపోయి, చేతనైతే పెద్దల పరువు నిలబెట్టండి! నాకు చూడవేడుకే – అని నవ్వుతూనే అంది.

నాకు రోషం వచ్చింది. నేనంత చేతకానివాణ్ణనుకోకు తలచుకుంటే ఊళ్ళేలగలను. ఎందుకని ఊరుకున్నాగాని –

ఎవరూరుకోమన్నారు లక్షణంగా పోయిరండి పెట్టెలోంచి, అత్తా కోడలంచు చాపుతీసి ఇస్తాను. కట్టుకుని, ఓ వందో వందన్నరో పట్టుకుని వెళ్ళండి. అత్తరు రాస్తానంటే నాకు అలవాటు లేదనకండి. పన్నీరు జల్లబోతే పడిశెం పట్టేను అనబోకండి. పట్టికెళ్ళిన సొమ్ములో పాతికో పరకో వెనకేయండి – వాళ్ళతో బేరమాడకండి – మరో పది ఎక్కువే ముట్టజెప్పండి పట్టుకెళ్ళింది చాలకపోతే ఇంటికి కబురెట్టండి. మీకు, ఎక్కడన్నా గురి కుదిరితే, ఏ సంకోచమూ లేకుండా, వెంటబెట్టుకురండి. నాకూ కాస్త పొద్దుపోతుంది. ఏమంటారు. ఎందుకాలస్యం –

ఆవిడ ఇలా అంటూంటే నాకు ఎన్నడూ లేనిది, వల్లమాలిన ఉక్రోషం వచ్చింది – సరే తెమ్మన్నాను, తెచ్చింది. బయలుదేరాను.

పల్లెకోనే వెళ్ళాను. అక్కడ, రాకేందువదన అని ఒక జాణ ఉంటూన్నదని మునుపే తెలుసులే. యకాయకి వాళ్ళ ఇంటికే వెళ్ళాను. వెళ్ళానే కాని, ఎలా

పలుకరించాలో తెలియకపోయె. ఏం బాబూ, ఏం ఇలా దయచేశారు అంది. నాకు మాట పెగిలిరాందే! రొండినున్న దస్తుతీసి, అక్కడ ఉంచాను ఇవాళను ఇక్కడ బస చేద్దామనుకుంటున్నాను– అనిమటుకు అనగలిగాను ఆవిడ నావంక ఒక్కనిమిషం అట్టే పరకాయించి చూచి, నవ్వేసి – ఇంట్లో అలిగి వచ్చారా? – అంది

"ఇలారావడం, ఇదే మొదలు కాదూ, నాకు కనబడుతూనే ఉందిలెండి ." అంది.

నేను బిక్కుబిక్కుమన్నాను. ఏం బాబూ, మీకు ఈ హితబోధ ఎవరుచేశారు? మీకు ఇలాటి తెలివితేటలున్నట్టు నాకు ఏ కోశానా కనబడటంలేదులెండి. చెపుదురూ – అంటూ పక్కనొచ్చి కూర్చుని, గడ్డంపుచ్చుకుంది. నాకు ఒళ్ళు తెలియలేదు. గబగబ కథంతా చెప్పేశాను. అంతావిని, వెర్రితండ్రీ, ఏ గూటి చిలుక ఆ గూటే పలుకుతుంది. ఇలాటి బుద్ధులు పుట్టుకతోరావాలి కాని, ఎరువు తెచ్చుకునేవికావు. మీరు సెలవిచ్చిన పద్ధతిలోనే చూద్దాం. వాత్స్యాయన మహర్షి – గ్రంథం చేయాలని సంకల్పించి, అనుభవంకోసమని నానా దేశాల సానివాడలూ తిరిగివచ్చారా? వారు ప్రజ్ఞానిధులు గనుక సర్వమున్నూ వారికి విదితమైంది. శ్రీరామచంద్రుడికి దక్షిణ నాయకత్వమే ఉన్నట్టయితే, సర్గల సర్గలు వారిచేత వాల్మీకులవారు ఎందుకు శోకింపజేస్తారండీ? ఇంటిపట్టున సుఖం లోపించిందనుకోడం మూర్ఖత్వం. మావాడకట్టున రంభలున్నారనుకోడం అవివేకం. మీవంటివారు ఇలాటి ఉత్తరకుమార ప్రజ్ఞలకుపోవడం అజ్ఞానం. తిరుగుబండికి, ఇంటికి వెళ్ళండి – అని తాంబూలం చేతబెట్టి, నేనక్కడపెట్టిన దస్తుకు మరో రూపాయి చేర్చి ముట్టచెప్పి, అంకాలట, వాడినిసాయం ఇచ్చి బండికిపంపింది.

రైలెక్కా నన్నమాటే కాని, ఏ మొగంపెట్టుకుని ఇంటికివెళ్ళనా అనుకున్నాను. ఇంటికికాక మరెక్కడికి పోనూ? పోనీ మరో ఊళ్ళో, మరో గుమ్మం ఎక్కి చూద్దాము అన్నా, అక్కడ నా మొగం చూసేప్పటికి మళ్ళీ పద్దెనిమిది అధ్యాయాలూ ఏకరువుపెడితే...?

ఇంటికే వెళ్ళాను. నిజంగా అమాయకుణ్ణేమో, ఇలా జరిగిందని చెప్పేశాను ఆవిడ మళ్ళీ నవ్వింది. మీ ముఖారవిందం చూసేప్పటికి సానికికూడా జాలీ దయా పుట్టుకొస్తుంది. మీరు ఈ పంతంమీదే దేశాటనం చేస్తే సానుల్ని ఎందుకూ కొరగాని సన్యాసుల్ని చేశేట్టున్నారు – మీ జాతకం మీది, అందులో రాసిపెట్టలేదేమో? ఇహనన్నా సద్దుమణిగి ఉండండి – అంది.

హో శ్రీహరీ! ఇన్నాళ్ళుమట్టి కాపురంచేసిన ఇల్లాలికే ఇలా అలుసైపోతినే, నన్నో పసివాడికింద కట్టేసిందే. మంచికిపోయి, చివరకు ఈ స్థితికి వచ్చానా అనుకుని, ఇహ నేనిక్కడ ఉండేదిలేదు – అనేశాను ఆవిడ చిరునవ్వుతో, ఉండకేంచేస్తారు లెండి, ఎటుపోయినా చుక్క ఎదురాయెను! అంటూ ఒహటే నవ్వు. నా స్థితి చెప్పావూ? వెళుతున్నా ననేశాను. సాధ్యమైనంతవరకూ తిరిగివచ్చే ఉద్దేశ్యంలేదు అని కూడా అనేశాను. ఆవిడ నవ్వుమొగంతోనే తల ఆడించింది, ఓ యబ్బో! మీ సంగతి నాకు తెలియదా అన్నట్టు ఒక్క చూపు చూసింది. కొంచెం చలించినమాట నిజమే కాని పళ్లబిగివిని బయటకు వచ్చేశాను.

తీరా, వచ్చేశానేకాని ఏమిటి చెయ్యడం? నాకు ఇంటిపట్టునకాని, నిద్రపట్టదు. ఆవిడ వడ్డిస్తేనేకాని సహించదు. ముందు ఈ రెండు లోపాలూ సరిదిద్దుకోవాలి అనుకున్నాను. మరీ ఆకలనిపించినప్పుడు పండూ, పాలూ, రొట్టే, వెన్నా, ద్రాక్షా, నారింజా – ఇవి లఘువుగా పుచ్చుకోవడం ఆరంభించాను. రాత్రిపూట ఏకటాకీన రెండు ఆటలు ఏ సినిమాయో చూడటం అదోపనిగా పెట్టుకున్నాను. వీటికి డబ్బెక్కడిదంటావా? ముందు ఆ జాగ్రత్తమీదనే బయలుదేరాలే ఇలా పట్నవాసం చెయ్యగా చెయ్యగా, ఇంటిమీద రంధి, తాత్కాలికంగా కొంత ఉపశమించింది

మా ఆవిడమీద కసి కొంతమట్టుకు తగ్గింది కాని, అన్నీ కలిగుండి, ఈ తిప్పటేమిటా అని నామీద నాకు చికాకువేసింది. పోనీ తలొంచుకునో, ఎత్తుకునో ఇంటికి పోదామా అంటే ఊహూ, ఇంకా బెట్టుతగ్గలేదు మా ఆవిడ మీదనైతే చేతనైనంతవరకూ ఇలా శరించాను. కాని, నన్నిలా చేసిన ఆ సానికులాన్ని ఏం జేయాలి? వాళ్లమీద కత్తికట్టలేను. ఈ జన్మకు సరసుణ్ణి కాలేను కనక, ఒక్కమెట్టు పైకివెళ్ళి, వాళ్ళకు బుద్ధులుచెప్పడం ప్రారంభిస్తే, భేష్ బాగుందని తోచింది.

ఊరూరా తిరగడం – సానివాడలలోనే బసచేయడం – అక్కడ నలుగుర్నీ పోగుచేయడం, ఆసి మీ ఇల్లు బంగారంగానూ, వెనుకటి మీ పెద్దరికం నిలుపుకోండే భరతాచార్యులవారు మీకు గురువు. మీచేతనే ఆదికాలంనాడు దేవేంద్రసభలో సముద్ర మథనం ఆడించాడట. సానంటూ లేకపోతే, ఋష్యశృంగులవారికి పెళ్ళయేదా? మీ కులక్రమాగతంగా వస్తున్న ప్రధాన విద్య పురుషరంజనం సత్సానీయుడైనవాడే సత్సంసారి అయేనని మనపూర్వులు గ్రహించినందువల్లనే ఆనాటి ప్రభువులు పాంథులకోసం కామసత్రాలు వేయించారని మనం వినడంలేదా? ప్రభుత్వం తెలిసో తెలియకో మిమ్మల్నందర్నీ గజ్జెగనియం అవతల పారేసి, పెళ్ళిచేసుకోమనీ, ముత్తైదువల్లే ఓ మూలపడుండమని అన్నదే అనుకో. అదేం వేదవాక్యమా? అంతమాత్రాన ప్రజలవిషయంలో మీ బాధ్యతలు మీరు విస్మరించడమేనా? భరతవిద్య అప్పుడూ ఇప్పుడూ అంతఃపురాంగనలు సైతం నేర్చుకుంటూనే ఉన్నారనుకో అంతమాత్రాన ఏమయేను? మీవలే వాళ్ళు నిస్సంకోచంగా హావభావ ప్రకటన చేయగలరా? అయినవారికి అందుబాటులో ఉండగలరా? మీ బాగు మీ చేతిలో ఉంది. దేశంబాగు మీ చెప్పుచేతల్లో ఉంది. ఈ మాటమీదే ఉండి, దైవాన్ని నమ్మి, మళ్ళీ యథాపూర్వం లోకాన్ని ఉద్ధరించండి. ఎవరో కొందరజ్ఞానులు వ్యభిచార నిర్మూలనోద్యమం అనే అర్థంలేని సన్నాహం ఒకటి లేవదీసి, అందుకు మిమ్మల్ని లోకువ చేస్తే, పడి ఊరుకుంటారా?

అలాటివారే ఓ చేత్తో మిమ్మల్ని విదిలించి కొడుతూ, మరో హోదాచేత్తో లలితకళలకు సమ్మానాలని పేరెట్టి, బ్రతిమాలి పిలిచికెళ్ళి, పెద్దపీటలువేసి, శాలువలు కప్పుతున్నారే. ఆ అవకతవకలన్నా అర్థం చేసుకుని జన్మ సార్థకం చేసుకోండి.

ఈ ధోరణిలో గంగాప్రవాహంలాగా ఉపన్యాసా లిచ్చాను. అందరూ విని బాగుందన్నవారే – కాని ఒక్కరూ బాహాటంగా ముందుకురాందే.

పోయి పోయి, మన గవర్నమెంటులో ఒక గట్టి జవాబ్‌దారీ ఆసామినే పట్టుకున్నా. వీళ్ళకేదన్నా తరుణోపాయం చూపించకపోతే ప్రాయోపవేశం చెయ్యాల్సి వస్తుందేమో

అనికూడా అనేశా – ఆయన అంతా విని, అబ్బా! నాకిప్పుడేం పట్టవు. ఏనేస్థితిలో లేను. ఎన్నికలు అయింతరువాత, నింపాదిగా వినిపించు, నీవు చెప్పదలచుకున్నదంతా టూకీగా వ్రాసి పట్టుకురా. ఇక్కడ వీలున్నప్పుడు సభపెట్టి, పైకి పంపుదాం – వాళ్లేమంటారో చూద్దాం. అంతవరకూ ఎలాగంటావా? కేంద్రానికి చేరుకో. నీ తిప్పలేమో నీవు పడు. వారు ఔనంటే మేము కాదనం. మేము కాదన్నా, వారు కూడదంటే మేము సరేననక మానం. ఇది, అలిండియా! రాష్ట్రాలకు ప్రమేయం లేదు. పైగా ప్రజాస్వామిక మన్నమాటకు నీకు అర్థం తెలిసినట్టు లేదు. ఆసన మెక్కినవాడు చెప్పడం; ఆసీనులైనవారు చేతులెత్తడం – అలా ఉంటేనే 'ఏక వాక్యత' గాని, ఎవడికి వాడే వ్యక్తిస్వాతంత్ర్యం, వ్యక్తిగతాభిప్రాయాలకు విలువ, అని నినాదాలు మొదలెడితే, ఈ రాజ్యం ఎంతకాలం నిలుస్తుంది? చూశావ్గా, చట్టవిరుద్ధం కాకుండా, నీవు ఏమన్నా చెయ్యి. మాకు చీమకుట్టదు. తెలిసినా, పట్టించుకోము. బరిదాటావో, శిక్ష తప్పదు. తెలిసిందా – అన్నాడు. అహా! అన్నాను:

ఇది, వాళ్ళను పట్టుకు ప్రాకులాడితే అయేపని కాదు. ఇటునుంచే నరుక్కు రావాలి. చట్టసభకు ఈ విషయం ప్రాకించాలి, అందుకు తగు మనిషి దొరకాలి. ఇంతకు ముందన్నాను చూడు, రాకేందువదన అని – ఇప్పుడు రత్తమ్మంటారులే – ఆవిడే ఇందుకు తగింది. మంచిరోజు చూసుకువెళ్ళి, ఆ చెవిని ఇది వేసి, అమ్మా, రత్తమ్మా, నీవు ఎన్నికై, కేంద్రానికి వెళ్లి, అక్కడ సభలో గట్టిగా, ఒకసారికి రెండుసార్లు బల్ల గుద్దితేనే నీ కులానికి గతిమోక్షం – అని చెప్పడానికి నిశ్చయించుకున్నాను. నీవు ఏమంటావ్!

తా నేమంటాడు?

రత్తమ్మ కోసమే అయితే వాళ్ళ ఊరు వెళ్ళవలసిన అగత్యం లేదు. ఆవిడ మన ఊరు వస్తూంది, సమ్మానం వగైరా ఉంది. ఆ సభకు మీరు పెద్ద పీట వేయించుకుంటే బహునిండుగా ఉంటుంది! కాబోయే మంత్రిగా రాకరు లాంఛనప్రాయంగా ఏవో నాలుగు ముక్కలు చెపుతారనుకోండి. కాని, ఇందుకు మీవంటివారు ముందుకు రావడం ముఖ్యం. మీ ఉద్యమానికి మరింత బలం – అని అన్నాడు.

వారు – అంతకంటేనా అన్నారు.

ముఖ్యంగా వస్తానన్నారు.

అబ్బాయ్, నీదగ్గిర దాపరికం ఎందుకు గాని, నాకు ఈ తిప్పట మొగం మొత్తింది. నేను చేయదలచుకున్న దేదో చేశాననే అనుకుంటూ ఉన్నాను. ఇంత తిప్పటా తిరిగి నీవు సాధించిందేమిటయ్యా అంటావా? నిజం చెప్పాలంటే ఏమీలేదు. అట్టే పారజూడగా, ఒక్కళ్ళని ఉద్ధరించేందుకు మనమేపాటివాళ్ళం అనిపిస్తుంది. ఎవరు బాగు వారు చూసుకోకపోతే, మన మెంతకాలమని ఎగసన త్రోస్తాం? నేను చెప్పానుగా, ఒక్క పర్యాయం పల్లెకోన వెళ్ళి, తదుపరి కార్యభారం యావత్తూ ఆ రత్తమ్మమీద వేస్తినో, నిశ్చింతగా చేతులు దులిపేసుకోవచ్చు. ఆవిడ అసాధ్యురాలు సుమీ! అన్నట్టు, ఆవిడను ఆహ్వానించడానికి ఎవరు వెళ్ళారు?

నీవేనా – రాక అక్కడ నుంచేనా?

ఎలా ఆదరించింది? ఏమేం మర్యాదలు చేసింది?

అబ్బాయ్, నా దగ్గిర దాపరిక మెందుకూ - చెప్పుదూ?

తాను, అక్కడి ఆదరణ యావత్తూ ఒక్క అక్షరం విడవకుండా, ఏకరువు పెట్టాడు. ఆయన ఎగిరి గంతేసినంత పనిచేసి, అరి పిడుగా, అదృష్టమంటే నీది చూపులకట్టాఉన్నావు కాని, మాంఛి మాటకారి వన్నమాట! అక్కడ నీవు ఆ వగలు పోవడం, ఆవిడంతది నమ్మేట్టు నటించడం, ఉపచారం చేయించుకోవడం, అహాఁ - దరం వేసుకుపుట్టావు! పోనిలే పాపం, నీ ముచ్చట ఎప్పటికి తీరను...?

అబ్బాయి - నీ కథ విన్నమీదట, ఇంతకాలం నేనెంత అవివేకంలో పడ్డానో తెలిసొచ్చింది. నేనేమిటి? ఇట్టా తిరగడమేమిటి? ఎబ్బే!

అనుకుంటూనే ఉన్నాననుకో - పల్లెకోననుంచి అటు ఈమారు ఇంటికే పోదామని. పోవాల్సిందే!

బండి పట్ట స్టేషన్‌లో ఆగింది మరో పట్టాలమీద. వాకబు చెయ్యగా, మెయిలు అక్కడకు వస్తుందట, అందుకోసం ఈ బండి సైదొలగాల్సి వచ్చిందట! ఆ బండికి పోతే, ఎనిమిదింటికి ఇంట్లో ఉందునే - అని అనుకున్నాడాయన -

మెయిలు నిష్ఠురంగా వచ్చింది - మేము అటు చూస్తున్నాం. ఓ బండి దాటిపోగానే ఆయన ఉన్నట్టుండి ఉలికిపడ్డాడు. గబగబ తన పంచీ వెదకి, ధోవతీ ఉత్తరీయం తీసుకు ఆదరాబాదరా, చుట్టుకున్నాడు.

కాస్త డబ్బూ -

సరంజామా అంతా అక్కడే వదిలాడు. బండి ఇక్కడ పదినిమిషాలాగుతుంది కాదూ అన్నాడు. అబ్బాయ్, మీ ఊరొచ్చి పట్టుకెళతా గాని, అవక్కడే ఉంచు, పోయినా ఫరవాలేదులే. డబ్బుంది, వాడుకో. నేపోతున్నా - ఆ బండిలో మా ఆవిడుంది! పుట్టింటికెళ్ళి వస్తూన్నట్టుంది. మా మావయ్యకూడా ఉన్నాడు.

నవ్వుతూ బండిలోంచి దుమికాడు!

తానందుకు సంతోషించాడు. ఆ బండీ కదిలింది. తానెక్కిన, తనబండీ కదులుతూంది-

* * *

# గంగాలహరి

అలా కదిలిన బండీ తన ఊరు చేరుకుని, టేషన్ తన కోసమే అక్కడ కట్టించారనే లక్ష్యం లేకుండా, ఓ ఫర్లాంగు దాటిపోయి, అక్కడ సిక్సీలుగుతూ ఆగింది. అది దానికి నిత్యకృత్యం. అక్కడనుంచి గ్రామంలోకి అడ్డత్రోవ. పట్టుమని పది బారలుండదు! దిగేవాళ్లు అక్కడే దిగడం పరిపాటి. చేతనున్న టిక్కెట్టు పట్టాలపక్కను పచ్చదెండా ఊపేందుకు గూటిలో కూర్చునే సరయ్య చేతికిచ్చి పోవచ్చు. దిగవలసిన వారు దిగిపోయిన తరువాత, బండి నడిపించేవాళ్ళు మొగదల చేలోఉన్న కాయకసరూ, కూరానారా కోసుకున్న తరువాత, ఓ కూతవేసి, వెనక్కి అడుగేసి, టేషన్‌లో అప్పుడే వచ్చి ఆగినట్టు ఆగి, పొగలుగ్రక్కి, ఇబ్బాడిగా కూతబెట్టి, ముందుకు సాగిపోతుంది.

తాను చేనుగట్టుచ్చుకుని, కోమటి చెన్నయ్య మిరపచేనికి అడ్డంపడి, కరణంగారి బావమరిది ఘంటయ్యగారి వంగతోట చుట్టుతిరిగి, మట్టిరోడ్డెక్కాడు. నడుస్తూనే ఓ పది వంగపిందెలు గిల్లుకున్నాడు. మట్టిరోడ్డుకు ఈ చెంపనే పెరుగుతోటకూర మళ్లున్నాయి. మొక్క నవనవలాడుతూ ఉంది. ఆ మెరాబా అంతా గాజాల వెంకటసామిది. వాడి కొడుకు బస్తీకి వేసుకెళ్లేందుకు, మోపుకడుతున్నాడు. "ఏం మావోఁ – పంచకట్టి బండెక్కి పానకం తాగబోయినావంట...మాంచి గుమాయింపు మీదుండావ్. నిన్న రేతిరి ఏడనన్నా మల్లెపొదుకాడ తొంగున్నావా?" అన్నాడు – దిప్పకాయ..."సంజవేళకే వద్దామంటే బండందలేదురా –"

"సంబరంలో ఉండావేమో...సంజబండందుతుందా? – మావోఁయి, మనూరి మరేద దక్కించావులే... పద ఉళ్ళోకి...మనోళ్ళందరూ బాజాబజంత్రీలతో కాసుకుం డారులే...మేళం ఓయించేత్తారు."

"మరే మావోఁయి, ఎల్లకాలం నన్నిట్టానే కూరాకు పెరుకుతూ కూకుండ మంటావా? – నీవు మనువు ఒల్లకపోతే మానె – ఏ పోరగత్తైనో పెంపకం సేసుకొని దేవుడిమాన్నెం పక్కదల్లె, ఆ మూడుకుంటలూ మాకు అరణమియ్యరాదూ...సేవిస్తానంటే...బాపనపిల్లయినాసరే ఒల్లుకుంటా! – అట్టాగని మా ముసిలోణ్ణి ఈ అనిపిస్తాగా...సఁయే!..."

"సఁయే...ఒరే రంగయ్...లాల్‌సాయిబాదెక్కడున్నాడ్రా...?"

"బస్తీకి పోబోతుండాడు. జాంకాయలు కావి దేసుకుంటుండాడు. నీ కెదరవచ్చు. ఒకేళ ఉల్లిపాలెం డొంకను బోతడేమో. అటోఅడుగేయ్. దారిలో తగలచ్చు."

డొంకంబడి పదికావిళ్లు పోతున్నాయ్. పదమేసుకుంటూ సాయిబాబు చివరున్నాడు. తన్నుచూసి, "ఏం లింగయ్యా! ఈ గాడీకి వచ్చావా?" అన్నాడు ఆ ఊపుమీదే.

తానుచెయ్యెత్తి సైగచేసి ఆపి, "సాయిబూ...మనకో లక్ష మల్లెపూలూ, ఒక్క వెయ్యి గులాపువ్వులూ – ఓ రూపాయికి దవనం...ఓ వీశెడు మంచిగంధంబిళ్ళ కావాలి. ఈపూటే చెప్పి బజానాఇయ్యి... నీవు రాత్రికి అక్కడే దిగబడు. పది కొట్టేప్పటికల్లా ఇక్కడుండాలి. రాఘవయ్య కొట్టుమీదికెళ్ళి ఓ మాంచి సెంటుబుడ్డి – ఈ పాటిది ఖరీదెంతైనాసరే – తీసుకో. ఓ వెయ్యి ఊదొత్తులూ...రెండుసీసాలు పన్నీరూ – చెప్పినవన్నీ గుర్తుంటాయా? ఏదీ చెప్పు...ఆఁ.. అంతే...ఏ ఒక్కటి మరచిపోయినా మళ్ళీ నీవేపోయి రావాలి!–మాంచి సరుకట్టుకురా...ఇంద లెఖ్ఖ పట్టుకెళ్ళు....కురదలా పడితే పంపుదాం..."

"లింగయ్యా, ఒక్క ముసిలీ కంచెన్‌కోసం కాఫ్డీ సర్కూ కావాలా?"

"ఎబ్బె...గుళ్లో ఉత్సవంకాదూ...అలంకారానికి."

'అచ్ఛా!–"

సాయిబు సాగిపోయినాడు. తాను సరాసరి ఇంటికి వెళ్ళి ఇంత ఉడకేసుకు తిని, ఓ కునుకుతీసి, పొద్దువాటారే వేళకు కామయ్యగారి ఇంటికేసి వెళ్ళాడు.

కామయ్యగారి ఇల్లంటే గ్రంథాలయం.

కామయ్య పక్కపల్లెల్లో యాగ్గికం చేయించేవాడు. పెళ్ళికాలేదు.

ఏదో ఊళ్లో అవాంతర బాంధవ్యం ప్రాప్తంకాగా, ఉన్న ఉళ్లోవచ్చి సలక్షణంగా ఉండేందుకు ఊరొప్పుకోదు కనుక, పరాయిదేశం పట్టిపోతూ, ఇల్లు ఊరికిచ్చిపోయినాడు. ఆ రోజుల్లో దాన్ని ఏం చేయడమో తెలియక ఖాళీగా అట్టే పెట్టేశారు కరణంగా రొక్కడూ ఆ అరుగుమీద కూర్చుని చుట్ట కాల్చుకునేవాడు. చుట్టూ ఏ నలుగురో ఉండనే ఉంటారు కదా... ఏదో పిచ్చాపాటీ ఆడుతూ ఉండేవాళ్ళు. వాళ్ళు లేనప్పుడు కుర్రకారుజేరి, బీడీ లంటించి, పులిజూదం, దాడీ ఆడేవాళ్ళు. ఒక్క పర్యాయం మటుకు ఎవరో వీధిభాగవతులు ఓరోజక్కడ బసచేశారు కాని – గబ్బిలాల తాకిడి ఎక్కువై మరో ఇంట తల దాచుకోవలసి వచ్చింది. ఆ ఇంటికి ఓ తాళమంటూ అన్నా లేకపోవడంతో చీకటిరాత్రుల్లో కొంత భూతసంచారం ఉన్నట్టు భావించడం జరిగింది. చివరకు 'పుట్టెడు కుంఖం అయ్యవారు'...అంటే నాగలింగంగారు.. ఆయన అంత కుంఖం ఊళ్ళమీద ప్రోగుజేసి – ఆ కుంఖం లక్షపత్రితో అమ్మవారిపూజ చేయడంతో... ఆ పేరే రూఢి అయింది. ఆయన మంత్ర తంత్రాలు నేర్చినవాడు కావడంతో, 'నేనుండగా ఏ భూతం వస్తుంద'ని...ఒక్కడూ అపర రాత్రి అక్కడికి చడీచప్పుడూ కాకుండా వెళ్ళి, అక్కడి దొంగల్నక్కడే పట్టుకున్నాడు. కొంత యోచన ఉన్నవాడు కనుక ఇది వెల్లడి కావడం, గ్రామం యొక్క పరువుకూ ప్రాపకానికీ అంత మంచిది కాదని, బయటికి పొక్కనీయకుండా మాపుచేశాడు. ఉళ్ళో ప్రబుద్ధులు, వాళ్ళు బహుశా ఫలానా ఫలానా అయిఉంటారని ఊహించుకున్నా, అయ్యవారు చోటివ్వకపోవడంతో పోనీలే, మనకెందుకు, ఎవరిపాపాన వాళ్లు పోతారు అనుకుని ఊరుకున్నారు. ఆనాటినుంచీ ఆ ఇంటి కా ఈతిబాధ తప్పింది.

ఆ ప్రాంతాల్లోనే ఎన్నికలంటూ రావడం, అందుకోసం పొరుగూరునుంచి ఓ పెద్దమనిషి పదిమంది బలగంతో అట్టహాసంగా వచ్చి గ్రామం అంతా కలసికట్టుగా తనకు సాయపడాలని ప్రాధేయపడటంతో, ఇదే సమయం అనుకుని కరణంగారు

అయన్ని కదలేయడం, ఆయన సరేనని తప్పనిసరిగా ఇల్లు శుభ్రంగా మరమ్మత్తు చేయించి, కావలసిన గ్రంథాలూ, కలప సామానూ వగైరా కొనిచ్చి, 'శాంతా మల్లీశ్వర గ్రంథాలయము' – అని ఫలకం చెక్కించి, ఇక్కడ ఓ పూలదండ వేయించుకోవడంతో, చివరకు ఆ ఆసామీ నెగ్గలేకపోయినాడనుకోండి దానితో మనకేం నిమిత్తం? కామయ్యగారింటికి ఓ కళంటూ వచ్చి, రాత్రిపూట దీపం వెలిగి, గ్రామంలో నలుగురూ అక్కడే జేరడం...కొందరు మరీ పొద్దుపోయేదాకా పేట్లాడుతూ కూర్చోడం...అది ఊరికి నడిబొడ్డయింది.

తాను అక్కడికి జేరుకొన్నారు.

కరణంగారు చూసి కనుబొమ లెగరేసి పలుకరించారు.

కుర్రకారు పేకాటలో ఉండే, ఏంజేసుకొచ్చావని కేకవేశారు.

తాను చెప్పాడు..."ఆవిడ మహా యోగ్యురాలు మాంచి భక్తురాలు.

ఆవిడను చూడటంతోనే ఆ కులంలో ఈ మనిషి పుట్టాల్సినది కాదనిపించింది. ప్రతిమాటకూ చిత్తం చిత్తం అంటుంది. చేయెత్తి మొక్కుతుంది. నన్నో పెద్ద పండితుణ్ణి చూసినట్టు చూసింది. కాదు మొర్రో అన్నా, వినిపించుకోందే! – ఆ ఇంటికి ఎవరెళ్ళినా, అమిత మర్యాదా, తగని గౌరవమూ...అందులో బ్రాహ్మణులంటే ఇహ చెప్పనా –

మాది బ్రాహ్మణ అగ్రహారం అన్నాను.

వచ్చిన పనేమిటో ఒక్క ముక్కలో చెప్పాను.

నీవు తప్పకుండా రావాలి సుమీ...పెద్దలందరూ సంతోషిస్తారు అన్నాను.

చిత్తం చిత్తమని ఒకసారికి ముమ్మారంది. తన జన్మ తరించిందంది.

స్వామివారి ఆలయంలో రేపు అలంకారం అంతా తన ఖర్చుమీదనే జరగాలి, తనకా సుకృతం దక్కనివ్వాలి అని ప్రాధేయపడ్డది.

సరే అన్నాను.

రేపు సాయంకాలానికల్లా వస్తుంది."

కరణంగారు – "అరి నీ తస్సదియ్యా. భగీరథులవారల్లే గంగను దింపావే! – వెళ్ళి తెల్లమొగం వేసుకు తిరిగి వస్తావని, వీళ్ళందరూ విస్తుపోకొన్నారు. భేష్...ఓ కాగితమ్ముక్కందుకో...జాబితా వేద్దాం...ఏపాటి వసూలవాలంటావ్?"

తాను – "ఊరిసొత్తు పైసా అక్కర్లేదు.

గుళ్లో అలంకారానికి సరిపోయేది ఆవిడే పంపింది.

పైఖర్చు నామీదేయించండి.

సాధించుకొచ్చాననే సంతోషంతోబాటు –

రేపు ఒక్క రోజుకు –

నాకు పెద్దరిక మిస్తిరా... యజ్ఞం చేయించినంత ఫలం!

పైగా... నా ఇంటజరిగే శుభకార్యాలేమున్నాయ్ గనుక...?

కాస్త ముందుకు త్రోసి, సందడిగా తిరగనిస్తే మీకు పుణ్యముంటుంది"

అందరూ – "అదే మా అభిప్రాయం...

వయసులో పెద్దపెట్టున మేజువాణీలుచేసిన మనిషి...

పట్నాలన్నీ చూసిన మనిషి...

తవ్వి తలకెత్తుతామన్నా, తన కిష్టమైతేనే కాని, కదిలేది కాదట.

ఈ నడుమ బస్తీవాళ్లే కొందరు వెళ్ళి అడిగితే – ఊహూఁ – అని ముక్తసరిగా జవాబు చెప్పి పంపేసిందట!

అవిడేమిటి – ఈ కుగ్రామం రావడమేమిటి – రాదని ఖాయం చేసుకునే నిన్ను పొమ్మన్నాం.

వస్తూందంటే – నిజంగా వస్తానన్నదంటే – మన గ్రామంమీద ఇంత ఆదరణ చూపించిందంటే నమ్మశక్యం గాకుండా ఉంది. నీవుగాని మాతో టొకాయించడం లేదు గద?"

తాను – "రేపు బండి వేళకు నేనే బండీ కట్టుకెళ్తాను.

మీరెవ్వరూ అఖ్ఖర్లేదు.

వెంటబెట్టుకు రాకపోతినో – బండీ అక్కడే వదిలిపెట్టి ఏ కాశీయో బోతానుగాని మళ్లీ ఊళ్లో మొగం చూపించను.

అందాకా ఎందుకు – రేపు లాల్ సాయేబు బస్తీ నుంచి రానీయండి – మీకే తెలుస్తుంది...వాడు రాంగానే యావన్మందీ నడుం కట్టుకుంటేనేకాని – గుళ్ళో అలంకారం ఆవేళ్టికి పూర్తికాదు."

అందరూ సరేనన్నారు.

తెల్లారేటప్పటికల్లా – ఆలయ ప్రాకారానికీ ఈ ఇంటికీ సున్నం కొట్టిస్తానన్నాడు కరణంగారు. దారంతా తోరణాలు కట్టిస్తానన్నాడు మేళతాళాల్తో ఎదురురామా అన్నాడు. ఆలయ మర్యాదలతో ఆహ్వానించమా అన్నాడు. చుట్టుప్రక్కల పదూళ్ళకుపోయి పిలిచిరావాలన్నాడు. చీకటితో మనవాళ్ళను బస్తీకి తరిమి అక్కడ ఎవరికాళ్లో పట్టుకొని, పేద్ద సన్మాన పత్రిక వ్రాయించి – ఓ వెయ్యి కాగితాలు రెండు ఝాములకల్లా తెప్పించనా అన్నాడు.

ఆవిడను మళ్ళీ బండెక్కించేదాకా అంతా పెత్తనం నీదే.

ఆరంభించింది నీవు – నీవే సానుకూలంచెయ్ అన్నారు.

తనకు మటుకు అంతకంటె ఏంకావాలి? ఇంటికి చేరుకునేటప్పటికి పొద్దోయింది. వడ్డించుకున్నాడు కాని, ముద్ద నోటికి పోయిందికాదు. ఇన్నేళ్ళబట్టీ ఉంటూన్న ఇల్లేమిటో ఇవాళ బావురమంటూన్నట్టుంది. నిన్నరోజంతా – అప్పటి – అనుక్షణమూ జ్ఞాపకం వస్తూంది. "రాజును చూసిన కళ్ళతో మొగుణ్ణిచూస్తే..." అన్నట్టుంది తన స్థితి... తానిక్కడ ఇహ, ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండలేనేమో అనిపించింది...ఉత్తరాపోశనం పట్టేచాడు.

పద్ధతి ప్రకారమైతే – ఆ పూటకు ఏమీ పుచ్చుకోకూడదు. తానేమంత శ్రోత్రియుడా? తనకాపట్టింపు – ఆ పట్టింపే కాదు, ఏ పట్టింపూ లేదు షావుకారింటికిపోయి, నాలుగరిటిపళ్ళు తెచ్చుకుని – అహ అక్కడే వాటిని పుచ్చుకుని – ఇంత మజ్జిగ దాహం పుచ్చుకుంటే సరి – అనుకుని బయలుదేరాడు.

షావుకారు చెన్నయ్య దుకాణం – కుని – అరుగుమీద రోజులోచూసి, చిరా వ్రాసుకుంటున్నాడు. 'కూచో బావా' అన్నాడు. పళ్ళిచ్చాడు. 'పల్లెకోన బోయినావంట

– ఏవక్కడ యవ్వారం – ఏండేసుకొచ్చావ్?' అవి కదలేశాడు... వ్యవహారం పొక్తుపరచుకొచ్చానని చెప్పి...'నీ పద్దెంత'న్నాడు తాను –

'అరి వెర్రి బొమ్మిడా...నిన్నరాకపోతివి: దస్తంతా ఊరిమీద పరిచా...గల్లా ఖాళీగా ఉంద్రాదని–ఒక్క కరుకట్టెబెట్టా – లేదంటంబావోదు గనుక – ఓ రాక్యాపీ వేసి అది నీకు జమేస్తాలే...'

'బావా! – ఆ రూపాయితో ఎన్నిసార్లు బరికావో – నీ రొంటిసిరి, నాకంటేనుగావి – బద్దిరంగా నీవే అట్టిపెట్టుకో! ఆ గల్లాలోఉంటే పిల్లల్ని పెడుతుంది...! ఖర్చంతా నేనే పెట్టుకుంటున్నాలే –'

"మీ అయ్యమీ దొట్టు –"

"నీమీ దొట్టు –"

"అహ...ముందుకుదూకినా బొమ్మిడే దూకాలి గానీ, టోకరాబు లెక్క సేవోళ్ళం – మాకు తరమా – కూకున్న కాడినుంచి లెగవలేం! – ఇదిగో బావోయ్ – ఈ దెబ్బతో నీపేరు పదూళ్ళకు పాకుతుంది. ఎందుకు మొగ్గావో–ఎంతైనాకావి వెనకాడద్దు – ఫెళ్ళుమనేట్టుండాలి...సమయం వచ్చింది గనుక మంచినీళ్ళట్టు ఖర్చెట్టాలి – నేనున్నాను...! ఎందుకన్నా మంచిది – ఓ ఇన్నూరు దగ్గిరుంచుకోరాదూ...అప్పుడు అద్దద్దా అనడంకంటె – నీ సిత్తమొచ్చినప్పుడు, ఓ గీతగీకి సీటంటించి, యీడ పారేద్దువుగాని... మా సేనుపక్క సేనూ, నీవేడకు దోతవ్...ఉన్న పావలా పరకా ఊరిమీద పర్చుకుని నేనేడకు దోత! – ఏం?"

"అరి నీ యిల్లు దీసి మేడెయ్యా! – ఇంతకుముందేగా – సొమ్ము, వెందుకుందంటివి?–"

"అయితేమటుకు, నీకవసరం అంటే – అందులో, నీ పరువుతోకూడిన పనంటే, పుట్టించద్దా – మా అత్తమ్ముందే – దాన్దగ్గిర, దస్తుంది! కాతాలో కలపవే, అంటే, వడ్డీ దాహం – అణాకు, తక్కువ పలకనంటుంది – ఆ యిచ్చేదన్నా, కాగితం మీదివ్వదు – ఏదో శాల్తీపెట్టమంటుంది – దాంతో, పెద్ద గొడవచ్చి పోయిందనుకో – నీగ్గనక – దాని కాళ్ళట్టుకునన్నా, యిప్పిస్తా – ఓ పైసా, రాహితీచేయిస్తే ఏర్పాటుచెయ్యనా, బావా–"

"వద్దులే...మూడేళ్ళపంట మూలుగుతూంది, అంతగా కావల్సివచ్చి, కాకిచేత కబురంపానో–చిట్టూరి రాఘవయ్య కారుమీదేసి పంపుతాడు–"

"అదీ వాల్ రైటు–బావోయ్. మాటొచ్చింది గనుక అంటున్నాగాని, మరెక్క డనబోకు...మన రాగవయ్య – మనిషి మంచోడే–కావి, ఎఁర్రకోమటి!–ఎత్తరావి ఎత్తులకు బోతాడు...పది సంచులేగా, యీడయ్య, యిచ్చిపోతే! యీడేమో, పట్నాలు కొనేస్తననటడు–మా మేనమామ బొమ్మరదే కాడంటయ్యా, యీడు!–యీ మద్దిన, మరింతాశకుబోయి, దచ్చినాది కాగితాలు, దస్తులోలుకు–ఏదో దగదోలు చేస్తున్నాడంట – ఎప్పుడో తింటాడు–! బాబోయ్ ఆడికి, గల్లా తోలివెట్టినప్పుడు–అన్నీ, సిల్లరనోట్లే, బుచ్చుకో–ఏ పిక్కు, ఉండదు–మనోడివి గనుక, సెప్పాల్సొచ్చింది–ఎంతసెడ్డా, ఆడూ మంచోడే–కుడీ ఎడమా అంటూ, చూస్తాడులే–నీకు మట్టుకు, అట్లా సెయ్యడేమోలే!–"

"ఔనులే...చెన్నయ్యా! యింట్లో మజ్జిగేమున్నా ఉందా? – "

"ఓం–దానికేం బాగ్గెం...రెండు సత్తెప్పాళాలుంది. .పుచ్చుకుంటావా? అత్తమ్మోవ్! – ఓ అత్తమ్మా – ఓ గాజుగళాసెడి, చల్లనీళ్ళట్టుకురా..."

"అయ్యో నాయనా!–ఓ గెంటకు ముందొస్తే బాగుండిపోను! దీనికేం సెడుపుకాలం – సేటుకాలం, వచ్చిందో – పిల్లిమూతెట్టింది...గుంటలో బోసేసా...గొల్ల రత్నాంన్ని, కేకేసి, ఓ సోలెడు పాలుచ్చుకోనా?

ఒరెసెన్నాయ్–ఓ సెటాకు సక్కెర తూచియ్యరా...ఓ సిటికెడు కొసరెయ్యడం మర్చిబొయ్యేవు...అసలే, మతిమరుపోడివి...

అబ్బాయ్ లింగయ్యా! పల్లెకోన్నుంచి, సాన్ని రప్పిస్తున్నావంటగా –

రేపు మాపటికీ, గుళ్లో – మేళం అంటగా...

ఆడోళ్ళకీ సోటుంటుందా?...

ఎన్నడో...నాళంవోరింటో పెళ్ళిలో చూశా –

యిప్పటెక్కాళ్ళకు కట్టినట్టుంది...కిటకిటలాడిపోయారు – విచ్చుకాసు, విసిరేశార నుకో...ఎంత సొమ్ము ఎంత సొమ్ము...!

నా కోమారు సూపించవూ. .పదడుగులేస్తే కాళ్ళు గుదులు కడతాయ్...నేన్రా లేనుగాని...బాబ్బాబు... మనింటికాడికి–ఓపాలీ, వెంటబెట్టుకురావూ...పండుతాంబూల మిచ్చుకుంటా..."

"ఓపికచేసుకు నీవే రారాదూ – గుళ్లోకొచ్చిన పుణ్యమూ ఉంటుంది! చుట్టూ చెంగాయి మడతతీసి...ఉన్న సరుకు లెట్టుకురా...పదూళ్లజనం వస్తాంది...అందరిలో గమకంగా కనబడాలి...అదిగో చెన్నయ్య మేనత్తంటే...ఎత్తెడు బంగారం కనబడాలి..."

"ఆ...యిదోటి పెట్టావ్...మాయింట సింతపండుకట్టలేకాని, సిన్నంఎత్తు బంగార మెక్కడిది...ఉన్న పదోపాతికో, కొట్టుమీదుంది... ఏ రోజొచ్చిన సిల్లర, బొక్కడానికే సరిపాయె...మునుపు ఎప్పుడో పెట్టుకున్న ప్రాణం కాదూ...ఆ అలవాటు మానలేక... మాయ సరుకులు వేసుకుంటా...అమ్మితే అర్ధణా రాదూ...పోన్లే నీ మాటెందుకు కాదనాలి...ఓపాలి యింత సింతపండురాసి...అవే వేసుకొస్తా...తప్పకుండా వస్తాన్లే... అబ్బాయ్...పాల్లెక్క...పొద్దున్నే, పంపుతావని, దాంతోచెప్పినా...అణాకు, పద్దెందుకు కాని–మూడుపోస్తకాల కెక్కాలి...అవికూడా, రొక్కమే పంపుదూ..."

...అక్కడనుంచి, కదిలాడు: ఆలయానికి వచ్చాడు:

అక్కడ కోలాహలంగా ఉంది...ఓ చెంపనుంచి సున్నం కొట్టేస్తున్నారు...అక్కడే, మంటపంలో ఓ స్తంభాని కానుకొని కూచుని...ఎప్పుడో కునుకు తీశాడు ..ఖరాగా ఒక్కటే ఒక్క కునుకు. .

మళ్ళీ మామూలు వేళకు మెళకువ వచ్చింది. అనుష్ఠానం రవ్వంతా వేగిరం కానిచ్చుకుని...గుళ్లోకే పోయి కూర్చున్నాడు...బస్తీనుంచి సాయేబు పూలట్టుకు రావడంతో యిహ ఆ పనిలోపడి...ఆ పూటకు, అక్కడి పులగమే, యింత పుచ్చుకుని–నాలుగున్నర అయేసరికల్లా, ఆలయ ముఖమంటపం, పూలపందిరి చేశాడు..యీలోగా రోడ్డు మీద, అలంకారం యీవత్తూకూడా, పూర్తయింది...యిహ అప్పుడు కొంపకుబోయి,

మళ్లీస్నానంచేసి, రత్తమ్మ కట్టిబెట్టిన పంచెలచాపు కట్టుకుని, యిహా, స్టేషన్‌కు పోవాలి, అనుకొంటూండగా, కరణంగారొచ్చి.."కాబోయే మంత్రిగారు.. పేచీవేశాడు లింగయ్యా! ఎలాగూ, గుళ్ళోకి వెళుతున్నాం, గనుక, దేముడిముందు: నేను, ఖరారు చేయాలట.. నిన్ను గెలిపిస్తామని..! లేకపోతే, తను, రాసట్టేనట. , సమయంచూసి, కుతిక్కేశాడు· అసలాయన్ని కోరడం, మంది బుద్ధి తక్కువ - యిప్పుడేం చేద్దాం?" అన్నాడు

తాను - "యిప్పుడొదులుకుంటేమటుకు, బాగుండదు - అలాగే, చేతులో చెయ్యివేయ్ - మన గ్రామం, ఖరారే... యీ ఉత్సవం అయింతర్వాత, పొడుగువారి వాళ్ళతో, చల్లగా అంటించు-వీడిల్లాచేశాడని...అక్కడ ఒక్క ఓటుతెగదు! - ఎన్నికలు అయేదాకా, వూరుకుండి, అప్పుడు, మొగాన, అనేయొచ్చు...నాన్నా, తగిన శాస్తి చేశాంరా ..-అని..."

బాగుంది అన్నాడు కరణంగారు.

తాను స్టేషన్‌కు పోయినాడు...

రత్తమ్మా, అంకాలూ, దిగారు.

ఊళ్ళోకి, యధావిధిగా మేళతాళాల్తో - ఉత్సవంగా తీసుకువచ్చారు.."మాకు బస ఎక్కడయ్యా" అంది:

"మన యింట్లోనే..."

- తన యింటికి తీసుకువెళ్ళారు:

"రత్తమ్మా - ఎందుకూ! బ్రాహ్మణపుటక, పుట్టానేగాని - నా నోటికి శుద్ధీ - బుద్ధీ లేకపోయింది...నేనాడినవన్నీ, అబద్ధాలు!...నాకు పెళ్ళీ పేరంటమూ, లేదు. ఒంటిగట్టువాణ్ణి...నీ ఆదరణలో పడిపోయి, వచ్చేటప్పుడన్నా నీతో, నిజం చెప్పే ధైర్యం నాకు లేకపోయింది...నీ మొగం, చూడలేకపోతున్నాను...!" అన్నాడు:

అంకాలు నవ్వుతూ...

"అయ్యా, మీ మొగంచూడగానే మా రత్తాంకు అంతా అప్పుడే అర్థమయింది. మీరు వెళ్ళగానే నాతో అందిలెండి...వారు, మాపసందుగా, కవిత్వం చెప్పారురా, అని...మీరు, నిజంగా, గృహస్తే అయిఉంటే, మా యింటికి వచ్చి ఇంటిదగ్గిర, ఏ సుఖమూ లేదని యింటావిడను ఆడిపోసుకు నుండేవారు...అల్లా, పొగడ్త మొదలెట్టారు..చిక్కిపోయారు!" అన్నాడు.

రత్నమ్మ కూడా అతి ప్రసన్నంగా...

"మీరు కవిత్వం చెప్పి నాకు ఎంతో మేలుచేశారయ్యా!

నేను మా కులానకాక మీ కులాన పుట్టి, తగిన ఈడున మీ ఇంటికి కోడలినైవస్తే, ఎంత సుఖపడి ఉందునో అనిపించిందయ్యా!

మీ మాటలకు ముచ్చటపడి, మీ కలా సేవచేశాను.

మీ అమాయకత్వం చూసి, మీకు మ్రొక్కాను...

మనకు వచ్చే జన్మంటూ ఉంటే..."

...అలా అంటూ అంతలో మాటమార్చి "అంకాలూ, మనవాళ్ళ బండొచ్చిందేమో చూసిరా" అన్నది.

"అయ్యా! ఇంతదూరం వచ్చినందుకు, ఇంతమంది పెద్దలిక్కడ జేరుతున్నందుకు మా విద్య కొంత చూపించాలికదా! నేను గజ్జెకట్టేందుకు ఆ ఓపిక లేదు కట్టినా రక్తి కట్టదు.

మొన్నంటారా...అదేదో ఆవేశం.

తెచ్చుకుంటే వచ్చేదికాదు. దేవుడల్లె మీరొచ్చారు. ఒళ్ళు మరిచిపోయాను.

ఆ ఊళ్ళో ఆ ఊళ్ళో నా దగ్గిర విద్యచెప్పుకున్న నలుగురయిదుగురున్నారు. వాళ్ళు హంగుతో వస్తున్నారు. ఓ గంటసేపు గజ్జెకట్టిస్తాను. సభామర్యాదగా ఉంటుంది!"

తానూ అంకాలూపోయి, ఆ వచ్చినవాళ్ళకు గ్రంధాలయంలో విడిదిచ్చి, ఒక్క పావుగంటలో సిద్ధం కమ్మనీ, ఆలయానికి వచ్చేయమనీ చెప్పారు. తిరిగి ఇంటికివచ్చి రత్తమ్మను వెంటబెట్టుకుని ఆలయానికి బయలుదేరారు. రత్తమ్మ పెద్దముత్తయిదువకు మల్లె ఉంది. రత్తమ్మ సరసను తాను నడుస్తూంటే అవిడన్నట్టే నిజంగా తన కులంలోనే పుట్టి ఇద్దరూ ఓ ఇంటివారైయుంటే నిత్యమూ ఇలా సంజెవేళ ఆలయానికి వెళ్ళుతూంటే.. మరో జన్మంటూ ఉంటే...

తాము అందరూ ఆలయానికి చేరుకున్నారు.

అన్ని మర్యాదలూ సక్రమంగా మహావైభవంగా జరిగినవి. కాబోయే మంత్రి గంభీరోపన్యాసం ఇచ్చాడు. ఈ ఎన్నికలై తామందరూ పదవికివచ్చాకా, భారీఎత్తున ఓ పాఠశాలంటూ పెట్టి, దానికి ఈ రాకేందువదనగారిని ప్రధాన ఆచార్యాణిగా నియమించే ఉద్దేశ్యం తనకు గట్టిగా ఉందని వెల్లడించాడు అందరూ ఆమోదించారు.

కరణంగారు తడుముకోకుండా సమ్మానపత్రిక చదివారు.

తాను రత్తమ్మ మెళ్లో మాలవేశాడు అందరికీ పన్నీరు జల్లాడు.

రత్తమ్మ అతివినయంగా, అతి సరసంగా ఓ పదినిమిషాలు మాట్లాడింది:

"ఆనాడు క్షేత్రజ్ఞులవారు మధుర తంజావూరు ప్రభువులతో ఏమని సెలవిచ్చారంటే, ఎంతకాలం మీ ఉభయులూ ఇలా లలితకళను ఆరాధిస్తారో, అంతకాలం మీ రాజ్యం సుస్థిరం అవి మరచిపోయి కత్తులు దూశారో చరిత్రలో శిధిలాలుమాత్రం మిగులుతాయి.

చివరకు వారన్నట్టుగానే అయింది

అందరికీ తెలిసిందేకద! ఈనాడు ప్రభుత్వం చేసే ప్రజలూ మళ్ళా వెనుకటి మర్యాదలన్నీ • పునరుద్ధరించుదామనడం. అది వినేందుకే బహు ముద్దుగా ఉంది

కాని ఇలాంటి సత్కార్యాలు ఎన్నికల ఫలితాల మీద ఆధారపడటం చూడగా ఇది అయ్యేపని కాదేమో అనిపిస్తూంది.

నేడున్నవారు విశ్రాంతి తీసుకోవచ్చు.

వారిబదులు ఏ ఔరంగజేబులో రావచ్చు.

అప్పుడేమవుతుంది, ఇప్పుడిలా అంకురార్పణ జరిగిందన్న సంబరంపోయి, వాటి నామరూపాలే లేకుండాపోవచ్చు.

ఇందరు పెద్దలు ఇక్కడికి దయచేశారుగనుక..నాకు తోచింది మనవి చేస్తాను. లోపమేమన్నా ఉంటే అది నా బుద్ధిలోపం.

నేను అజ్ఞానురాల్ని, అక్షరజ్ఞానం లేనిదాన్ని.

రాజకీయాలంటే ముక్కూ మొగం తెలియనిదాన్ని.

మన్నించి నా మనవి ఆలకించండి!

మనలో ఎలాంటివారికైనా ఆలయం అంటే అతి పవిత్రం.

వాటిని మనం సర్కారు ఇలాకా చేశాం.

ఆలయ పెత్తనం సూటూ, బూటూ వేసుకున్నవారి పరంచేశాము.

ఏ నాటకమో, సినిమాలోలాగా టిక్కట్లు కొనుక్కుంటున్నాం. ఓళ్ళబంట్రోతులకు వణికిపోతున్నాం. ధర్మకర్తల్ని కోర్టలకెక్కిస్తున్నాం...దాన్నో ఉద్యోగంక్రిందకట్టి పూడదీయుచున్నాం.

ఇది ఎన్నడన్నా ఉందా?

ఆదాయప్పన్ను మినహాయింపు తప్ప దేవుడికి వెనకటి పరువుందా? ఇది మీకు బావుందా?

ఇన్ని వందల ఏళ్ళాయె. ఆలయాలు ప్రజలపరంగా ఉండలేదా.. పోనీండి, చేతులుదాటి పోయింది. మనమేం చేయలేం!

ఈ లలిత కళలన్నా ప్రజల్లో సర్వస్వామ్యాలతో నిలిచిపోతాయేమో అనుకుంటే, వాటికికూడా ఆలయాలకు పట్టిన యోగమే పట్టేట్టుంది. వాటిమీద సర్కారు ముద్ర పడ్డదో మరి మీకు ఆ రూపాన దక్కవ్.

అగ్రాసనంమీద ఉన్న పెద్దలు ఇంతకుముందు సెలవిచ్చింది తామందరూ ఆలకించారు. వారి సంకల్పం దొడ్డది.

కాని వారికి ఉత్సాహమే తప్ప, ఈ విద్యల విషయం రవంతకూడా ఆకళింపున్నట్టు నాకు తోచలేదు. వారికి మనవి చేసుకుంటాను. తమందరూకూడా చిత్తగించండి:

అయ్యా, కొన్ని విద్యలు, పెట్టుబడి అక్కరలేకుండా అభ్యసించవలసినవి, వినయంతోకాని సాధించరానివి, గురువు కృపఉంటేనేకాని రాణించలేనివి.

నాట్యం, సంగీతం ఇత్యాదులు అలాటివి అని పెద్దలంటారు!

వీటికి గురుకులవాసం పెద్దలేర్పరిచిన సంప్రదాయం.

గురువుమీద గురి, లక్ష్యం; విద్యార్థి అభివృద్ధి, విద్యపూర్తి అయిందని గురువు దీవించిన పిమ్మట – పట్టా ఇచ్చేది ప్రభుత్వం కారాదు...ప్రజలు!

ఆ బడిచదువు గుమస్తాలకు, వీళ్ళకుకాదు. ఈ శాస్త్రాలకు కాదు!

తమరు దయచేసి లలిత కళలకు బడీ పాఠశాలా అంటూ పెట్టించకండి. వాటిని ఇలాగే బతకనివ్వండి. చేతనైన పోషణ మీ చేలకు చేసుకోండి. శాసనసభలో కూర్చుండి, కళలజోలికిమటుకు రాకండి.

అభిలాష ఉన్న విద్యార్థి గురువును వెదుక్కుంటూ వెళతాడు.

భవనం మీద బోర్డుచూసి రాడు.

శిష్యులను వృద్ధిలోకి తీసుకురాదలచిన ఏ ఆచార్యుడూ మీ జీతాల బిల్లులో చేరడు.

మీరు నాతో ఏకీభవించకపోయినా, ఈ రవంత మేలు అయినా మీవంటి పెద్దలవల్ల కళలకు జరగాలని నా కోరిక."

రత్తమ్మ వాక్యాలు బహుసరసంగా ఉన్నాయి
సభవారూ అలాగే హర్షించారు
కాబోయే మంత్రిగారు కించిత్ చిరాకుపడి "బసకు వచ్చి వివరంగా చెప్పి ఒప్పిస్తానుగా" అన్నారు
"తప్పకుండా దయచేయాలి" అంది రత్తమ్మ.
ఆ తరువాత పొరుగూరునుంచి వచ్చిన పడుచులు నాట్యం చేశారు నాట్య విశేషాలూ, అవి అభ్యసించేందుకు పడవలసిన శ్రమ, ఇలాటి భోగట్టా అంతా రత్తమ్మ విన్నవించింది.
ఆ కలాపం ముగిసింది.
చెన్నయ్యగారి అత్తమ్మ...మెల్లిగా లేచి నిలుచుని..
"ఒసేవ్ అమ్మాయ్, ఇలా రావే!" అని రత్తమ్మను దగ్గిరకు పిలిచి.
"ఓసి నాతల్లి, దేవుడెంత తెలివిచ్చేడే నీకు" అని చెంపలంటి
ఒళ్ళోంచి ఓ కోకా రైకాతీసి "నలభై సంవత్సరాలనాడు కంచిలో కొన్నా. ఒక్కసారె కట్టుకున్నా నీవు కట్టుకోవే అమ్మా, నేను కట్టుకున్నట్టే ఉంటుంది" అంది. అందుకుని రత్తమ్మ ఆవిడకు మ్రొక్కింది.
"అమ్మాయ్, నాళంవారి లోగిలిలో అవాళ నీవు పాడావే..
జ్ఞాపకంలే...మూడు పుష్కరాలకుముందు
రాములవారిమీద పాటమ్మా.
ఆసి నా తల్లీ, ఆ అదే!
ఒక్కసారి అల్లా ఆడవే అమ్మా" అంది.
సభలో అందరూ నవ్వారు.
రత్తమ్మ అన్నదికదా. "పిన్నీ, నీవు అడిగావు కాని,
నాకు ఎంత వయసని.
నీ అంత.
చిన్నప్పుడూ, నీవూ చెమ్మచెక్కా, ఒప్పులకుప్పా ఆడావు.
ఇప్పుడాడమంటే ఆడగలవా?
నేనూ అంతే.
ఓ విద్యకో వయసు, ఓ వయసుకో ముచ్చట.
అప్పటిమాట నీకింకా జ్ఞాపకం ఉందంటే, నామీద ఇంత ఆపేక్ష ఉన్నవాళ్ళు ఇంకా దేశంలో ఉన్నారంటే నాకింతకంటె ఏంకావాలి పిన్నీ" అంది అత్తమ్మ పొంగిపోయి గట్టిగా కావలించుకుంది.

కరణంగారు తన ఏర్పాటు ప్రకారమే, అతిథులందరికీ పాటినూలుచీరెలూ, అంకాలు కో సేలంచాపూ, తాంబూలంతో ఇచ్చారు పొరుగూరివారికి, ఊరివారికి చక్రకేళీలు ఇచ్చారు.

వచ్చిన ముత్తయిదువ లందరూ రత్తమ్మకూ, ఆ పిల్లలకూ రైకల మడతలూ, కుంకుమభరిణెలూ ఇచ్చారు. ఎడపిల్లలచేత రత్తమ్మకు మ్రొక్కించారు. ఆవిడ కన్ను చెమ్మగిలింది.

నగా నాణెంలో నలుగురిలో వెనుకంజగా ఉన్న ఆడకూతుళ్ళని జేరబిలిచి తన మెళ్ళో ఉన్నవి తీసి వాళ్ళ మెళ్ళో వేసింది.

"అమ్మా, నేనివి మొయ్యలేకుండా ఉన్నానే మీరుంచుకోండమ్మా" అంది. "దేవుడి మొగంచూసి మీకిచ్చాను. అలాగే పుచ్చుకోవాలి" అంది. కరణమంతటి అసామీ.. ఆహా అనుకుని చెయ్యెత్తి మ్రొక్కాడు.

రత్తమ్మ అందరిదగ్గరా సెలవుపుచ్చుకుంది.

సభ సర్వసమ్మతంగా ముగిసింది

రత్తమ్మ బసకు వెళ్ళింది.

తానిక్కడ అందరినీ సాగనంపి ఇంటికి జేరుకునేప్పటికి –

పంచలో ఓ పదిమంది కూర్చుని ఆలకిస్తున్నారు. లోపలనుంచీ రత్తమ్మ గొంతు – తానువిన్న గొంతుకాదు – వినిపిస్తూంది.

సమీపంలో కాబోయే మంత్రిగారు కూర్చుని ఉన్నారు.

తాను గుమ్మంలోనే ఆగిపోయినాడు.

అప్పటికి ఎంతసేపటినుంచి దులుపుతూందో కాని –

"ఈ కళన్నమ్ముకుంటే పొట్టా గడవాలా.

గుడిసేసుకున్నాం. నీలాటివాళ్లే తడిక తోసుకొచ్చారు. కాసు వీసమిచ్చారు. బయట శ్రీరంగ నీతులు చెప్పారు.

మా బాగోగులు లోకం కనుక్కుందా?

మమ్మల్ని మనుష్యుల క్రింద జమకట్టిందా?

మరి ఇంతకాలం ఎలా బతికాం? మిమ్మల్ని నమ్ముకునికాదు, దేవుణ్ణి నమ్ముకుని! ఈవంకబెట్టి, ఓట్లకోసం వచ్చి ఏవో కూస్తావ్? ఛీ, పో.

మనిషి పశువల్లే మాజోలికొచ్చాడు.

కర్మంగనుక పడ్డాం.

మా విద్యల జోలికొచ్చావో చీలుస్తాం కళల నుద్ధరించేది నీవంటి చవటలుకాదు, దేవుడు, జ్ఞాపకం ఉంచుకో! మరెక్కడన్నా ఇలా అన్నావో బత్తె ఖర్చులెట్టుకొచ్చి ఓ గుక్క బట్టిస్తా.

ఇంకా అలా కూచుంటావేం? పోయిరా. పో!"

కాబోయే మంత్రిగారు జెర్రల్లె ప్రాకుతూ బయటికి వచ్చి తన్నుజూసి, "లింగయ్యా! అది తాగినట్టుందిరా" అంటూ, పదంగల కో అంగేశాడు.

తాను చరాచరా లోపలికి వెళ్ళి "సెబాస్, వాడు వట్టి అభాసుగాడులే, అలాగే వాగుతూంటాడు. ఇహ నోరెత్తడులే!" అన్నాడు. తనకూ ఆ వాలకంచూడగా అనుమానం గుప్పున వేసింది.

రత్తమ్మ చెంగు నోటికడ్డం పెట్టుకుని "ఎవరినిచూసే తీరున వారిని చూడవద్దా అయ్యా? మా పెంపకం అది కాదా" అంది! "మీ ఇంట్లో ఇలా చేశానని..."

తాను నవ్వి "ఇలా చేశావని ఆనందిస్తున్నాను రత్తమ్మా! నిజంగా నీవంటివాళ్ళ చెప్పుచేతుల్లో దేశం ఉంటే, ఇంత అరాచకం గాదు" అన్నాడు.

రత్తమ్మ నవ్వింది. మరికొంచెం దాహం పుచ్చుకుంది. తనకూ దాహమేసినట్లని పించింది కాని, చేయివెనకాడింది. అది గమనించి రత్తమ్మ ముక్కుమీద వ్రేలేసుకు మ్రొక్కింది. "అయ్యగారు మాకోసం ఎంతో అలసిపోయారు, ఇహ విశ్రమించండి" అంది.

తానూ అంకాలూ అరుగుమీద వచ్చి పడుకున్నారు.

తనకు నిద్రపడితే ఒట్టు!

వేళకు మేలుకున్నారు. బండికట్టుకు టేషన్‌కు వచ్చారు. బండి వచ్చింది. కదలబోతూంది. తానూ లోపలికి ఒక్క ఉరుకు ఉరికాడు. "రత్తమ్మా, ఈ జన్మకు కాశీకి పోయే ప్రాప్తంలేదు. మా ఇంట్లో ఉన్నంతసేపూ గంగ ఒడ్డున ఉన్నట్టనిపించింది! అక్కడే ఉండిపోదా మనిపించింది" అన్నాడు.

"నేనింతపుణ్యం చేసుకున్నా ననుకోలేదయ్యా!" రత్తమ్మ చేతులు ముకుళించి, శిరసు వంచింది.

"మీరుంటే మా ఇల్లు త్రివేణి సంగమం కాదాయా!" అన్నాడు అంకాలు.

బండి వడి అందుకుంది.

★ ★ ★

# గోరంతగొప్ప

మా ఊరికి, దేశంమీద, పేరుంది. మా దొడ్డ పేరుంది: కొందరు పెద్దలు ఊరువిడిచి దేశంమీదికిపోయి పేరు తెచ్చారు.

కొందరు పెద్దలుకానివాళ్ళు, ఎటూ పోనివాళ్ళు, పోలేనివాళ్ళు అక్కడే ఉండి, ఊరికి పెద్దరికం యిచ్చారు.

వాళ్లెవరు...శ్రీమంతులుకారు, జన్మంతా దరిద్రులు

సిరిరా, మోకాలొడ్డిన – వివేకులు.

ఓ మిరాయికొట్టు అసామీ, ఓ యిడ్లెన్నమ్ముకునే కోమటి, ఓ దూదేకుల సాయిబూ, ఓ ముసలి బసవన్నా, ఓ అంగవస్త్రం బ్రాహ్మడూ, ఓ పరువు వేశ్యా, ఓ కాపుకుర్రాడూ, బొమ్మలు చేసుకునే ఓ ముచ్చి.

మిరాయి కార్ఖానా అసామి–రామాంజయ్య.

గీరనామం పెట్టుకునేవాడు. ఎప్పుడూ నవ్వుతూ ఉండేవాడు.

ఆలయంలో స్వామివారిని, భక్తిశ్రద్ధలతో ముప్పొద్దులూ సేవించడం మానక పోయినా...మనుషులంటే మా భక్తి... వాళ్ళు తనకు ప్రత్యక్ష దైవాలుట. సరుకు, మహారుచిగా, శుచిగా, చేసేవాడు. దగ్గిరుండి చేయించేవాడు. చూలింతకు గాని, బాలెంతకుగాని, పడిలేచిన వాళ్ళకుగాని, పళ్ళు లేనివాళ్ళకుగాని, రామాంజయ్య తొక్కుడు లడ్డూ అంటే ప్రాణం. ఉన్నవాళ్ళు, కొనుక్కునేవాళ్ళు, శక్తిలేనివాళ్ళు, చేజాపేవాళ్ళు అందరికీ కడుపు నిండేది.

ఇంత వ్యాపారం జేస్తూంటే – అసామికేం మిగిలేది? పొట్ట గడిచేది! ఏడాదికోసారి సముద్ర స్నానాలప్పుడు ఓ పది కరుకులు మిగిలితే, అది – తనది కాదు. రంగడి సొత్తు...పుట్టినప్పుడు ఎలా పుట్టాను? ఆ రంగడు రమ్మంటే ఎలా పోతాను? నన్ను తలచుకోరా అని, పుటక యిచ్చాడు – నరులను సేవించరా, అని, ఈ దేహం ఇచ్చాడు – చాలు! – అనేవాడు. కాస్త తీరిక అయితే చాలు, పోయి, రంగనాయక స్వామి ఆలయం ముందు కూర్చునేవాడు.

అక్కడ ఓ బసవన్న ఉండేవాడు. ఆలయం ముందు ఎప్పుడూ, గస్తీ తిరుగుతూ ఉండేవాడు. చేత ఇంత మిరాయి పట్టుకెళ్ళి గంగడోలు నిమురుతూ, దానికి పెట్టేవాడు రామాంజయ్య.

రామాంజయ్యకు, ఒక్క కొడుకు. తండ్రంత కొడుకు పుట్టినా, పదిమంది బ్రాహ్మణుల పెట్టుండేవాడు. పసిపిల్లలంటే తగని ప్రాణం. దారివెంబడి పోతూంటే ... ఏ ఇంట్లోంచన్నా, పసిపిల్ల ఏడుపు వినబడితే చాలు, గబగబ లోపలికి వెళ్ళి, స్వతంత్రంగా, ఆ బిడ్డను ఎత్తుకుని, అటూ యిటూ తిప్పి పోరు మాన్పేవాడు.

వాడు, చేతిలోకి దీసుకుంటే సరి, ఎంత రాకాసి గంపైనా యిట్టే నవ్వేది "అలాగే నవ్వుతూ ఉండవే అక్కాయ్." అని, ఆ బిడ్డను తల్లి చేతికి యిచ్చేవాడు వాడికి, చిన్నగానీ, పెద్ద కానీ, ఒక్కటే వరుస. అన్నాయ్, అక్కాయ్..మరో పిలుపు పిలిచి ఎరుగడు.

మా ఊరి బజారుకు, పక్క గ్రామాలనుంచి, యిటు తూర్పు నుంచీ, అటు దక్షిణాన్నుంచీ, కూరల కావిళ్లూ, గంపలూ తెల్లారేసరికి వచ్చేవి ఆ మొగదలా, యీ మొగనూ, పోలీసు జవానులు, కాచుకుని ఉండి, కూరల వాళ్ళు అక్కడ చెరువు గట్టున – చద్దన్నాలు తినేప్పుడు, అడగడం, వాళ్లు గంపకో కాయ ఇవ్వడం మామూలు. ఇచ్చినందువల్ల, వాళ్ళకు ఏ బాధా లేదు; వాళ్ళకు వీళ్ళపోరూ లేదు. ఎంతకాలంనుంచో అలానే జరుగుతూ వస్తూంది. కాని, అధికారులు, ఎల్లకాలం ఒకళ్లే ఉండరుకదా! వెనుకటి హయాంలో అయితే, అక్కడివాళ్ళకు అక్కడే నౌకరీలు కావడం, చేసినన్నాళ్లూ చేసి, వాళ్లు అక్కడే పింఛను పుచ్చుకోవడం అంటూ ఉండేది తెల్లారి లేస్తే, తెలిసిన మొగాలే కనుక, ఏ రొష్టూ ఉండేదికాదు రాను రాను, ఆ పద్ధతి పోయి, – బదిలీలంటూ వచ్చి పొరుగూరి జనాభా చేరడంతో కొంచెం రద్దీ ఏర్పడ్డది. కొత్తగా వచ్చిన హెడ్డు తినమరిగినవాడు. అతడి చేతిక్రింద అలాటివాళ్లే తయారు కావడంతో, కాయా కసురుకు చేజాపడంపోయి, ధిమాకీగా, బేడా, పావలా నిలవేసి వసూలు చేయడం ఆరంభించారు. విసుక్కుంటూనో, నసుక్కుంటూనో వాళ్ళు యిస్తూనే వచ్చారు. అంతటితోన్నా వాళ్ళు వూరుకున్నారా? అది అలుసై గంపకింత, కావిడికింతా అంటూ, పన్ను వేయడం ప్రారంభించారు అందుకూ వాళ్ళు నోరెత్తలేదు. మన కర్మం గామోలు అనుకున్నారు, యిచ్చారు

అలా, యివ్వడమే తప్పయింది ఇవాళ యిచ్చుకోలేను బాబూ అంటే, చేయి చేసుకోవడం ప్రారంభించారు. వాళ్ళు అందుకూ పడ్డారు మరి, మొరెట్టుకునేందుకు దిక్కేడ?–

కార్ఖానాకు కావలసిన పచ్చిమిరపకాయలూ, అల్లం, కొతిమిరాకూ, వతనుగా, అక్కడికి మూడు కోసుల్లో ఉన్న ఉల్లిపాలెంనుంచి, కాపు మనిషి ముసలయ్య పట్టుకొచ్చేవాడు. ఆవాళ రాలేదు, మర్నాడు రాలేదు, ఏమా అని, రామాంజయ్య కొడుకు అక్కడకు వెళ్ళి చూడగా, ముసలయ్య మొగం అంతా వాచిపోయి, పడుకుని ఉన్నాడు. వీడిని చూసి, నా బతుకీకాడికి వచ్చింది రంగయ్యా! అని, వలవల్లాడినాడు నీకేం భయంలేదు, రేపు రా: నే నెదురొస్తాలే, అని చెప్పి చక్కా వచ్చాడు.

హెడ్డు స్టేషనుకు, ఓ సందు వెంబడివస్తాడు: వీడు, అక్కడ కాచాడు. మరియాదగానే అడిగాడు. ఇదేం మరియాదయ్యా! అని. హెడ్డు మొండిగా జవాబు చెప్పాడు...నోరెత్తితే, నిన్నూ తంతానన్నాడు వీడు అప్పటికీ నిదానించాడు: హెడ్డు అది చూచి రెచ్చిపోయి, వీడి కులాన్నీ, వీడి అబ్బనీ తిట్టాడు.

వీడిక ఉండబట్టలేకపోయినాడు. పట్టుకుని, ఏకీలు కాకీలు తీసి, బండమీద వేసి, మనిషిని సాయమిచ్చి, ఆస్పత్రికి పంపించాడు. అక్కడ, ఫలానావాడు పట్టుకు చిదగ్గొట్టాడని చెప్పడం నామోషీ అనిపించి, ఎద్దులు తరుముకొస్తే – వంతెనమీంచి పడ్డానని, నమోదు చేయించుకున్నాడు హెడ్డు.

రంగయ్య అక్కడనుంచి అటు పోయినాడు.

చెరువుగట్టున కావిడీ, గంపా దిగి ఉంది...జవాన్లూ ఉన్నారు: ఒకరో యిద్దరో. వీడు, కావిడిబద్ద తిరగేశాడు. అ డబ్బక్కడ పెట్టించాడు. ఎఱ్ఱటోపీవాడిక్కడకు వచ్చాడో, కోటప్పకొండ తిరణాళ్ళలో గోపిరెడ్డి ఏంజేశాడో...అదే యిక్కడా జరుగుతుందన్నాడు. పోయి మీ పెద్దతో చెప్పకోండన్నాడు.

రామాంజయ్యకు ఇది తెలిసింది. "ఛీ నీవేం మనిషివిరా..." అన్నాడు. వీడు వివరించి చెప్పాడు. "అలనా పాలనా జేసేందుకు ఆ రంగడుండలా! మద్దిన నీ వెవడివిరా...మ్మారుమనిషి...మనకు దేవుడుగాడ్రా? నిన్నిల్లాగే పెంచాన్రా నేను?" అన్నాడు, రామాంజయ్య. వీడు నోరెత్తలా.

జవాన్లు పోయి పెద్దతో మొరెట్టుకున్నారు. వీడిని ఏలాగైనా, లోపలికి తోయించేయాలనుకున్నారు. శివంగ సంబరాల్లో, పారువేట ఉత్సవంలో వీడిని పట్టేయచ్చనుకున్నారు...కాని, ఎందువల్లనో, ఎంత గాలించినా వీడక్కడ తగల్లా...యిది పనికాదూ, అనుకొన్నారు...

ఓనాడు, ఉదయం, రంగయ్య, రంగనాయకస్వామి ఆలయానికి పోతూండంగా, వీధిలో, ఓ అరుగుమీద, ఓ ఆడకూతురు...పిల్లను ఒళ్ళో పెట్టుకుని కూచుంది.. పిల్ల పోరెడుతూంది. రంగయ్య అక్కడకు ఉరికి బిడ్డనందుకున్నాడు –

రంగయ్యా...బిడ్డకు, వత్తులు ఒరుసుకుంటున్నాయి. పట్టుబలవంతాన తీశాను. అందుకూ యీ పోరు. నీవొచ్చావు గనుకకాని. మద్దివేళదాకా...కాళ్లా చేతులా నిలిచేది కాదు...పోతూపోతూ, కంసాలి పైడయ్యకు యీ వత్తులిచ్చి ఓ వీసం సాగ్గొట్టమందూ...మా మనిషొస్తాడని చెప్ప...అంది...

అలాగేపట్టుకు, ఇవతలకు రెండడుగులు వేయడం...ఆ ఆడకూతురు వెనుకనుంచి దొంగ దొంగ! – అని అరుచుకుంటూ వీధినిపడటం...జవాన్లువచ్చి కమ్ముకోవడం... రంగయ్య యింట్లో దొరపడి, తొట్టెలో బిడ్డచేతులవి ఊడబెరుక్కు పోతున్నాడని, ఆ ఆడకూతురు వాజ్మూలమివ్వడం...వెంటనే విచారణంటూ ఒహటి జరగడం... రంగయ్యకు, ఆరుమాసాలు కఠినశిక్ష పడటం – ఆ యిలాకావారి నిర్వాకంగావడంతో, నిముషంలో జరిగిపోయింది... ఊళ్లో అందరూ, ముక్కుమీద వేలేసుకున్నారు. రామాంజయ్య...రంగా! అన్నాడు:

రాజమహేంద్రవరం, తీసుకు వెళ్లేటప్పడైనా, – తండ్రినీ బిడ్డనూ చూసుకోని వ్వలేదు...యిలాకావారు:

ఆరుమాసాలూ గడిపి, తిరిగి వచ్చాడు...రంగయ్య: ఇంటికి రాలేదు: రంగడి గుడిలో కూర్చున్నాడు...ఆ పూట: రామాంజయ్య కోవెలకుపోయి, కొడుకును చూసి నవ్వాడు...నా మొగం చూడగానే సీతామ్మవారంటి ఆడకూతురికి, అబద్ద మాడాలనిపించింది...ఇక నా మొగం ఊళ్లో చూపించను. యీ బసవన్నతోపాటు, రంగణ్ణి నమ్ముకుని ఇక్కడే పండుంటా...వాడితోబాటు, నాకూ సందెపూట – యింత పడేస్తుండు...అన్నాడు:

కాని, అలా జరుగలేదు: యిలాకావారు ఉండనివ్వలేదు...మళ్ళీ ఏదో మీదవేసి, అక్కడికే పంపించారు...

అలా,...పదేళ్లు...రావడం, మళ్ళీ పోవడం...

అక్కడ, వాళ్ళు పెట్టిన తిండితో, కొట్టిన దెబ్బలతో మనిషి చివికిపోయి నాడు...ముప్పయి ఏళ్ళకే...అరవై దాటిన వృద్ధయినాడు...అంతలో యిలాకావారికీ, విసుగొచ్చిందేమో...ఆపై, వాడు భూమ్మీదున్న నాలుగేళ్ళూ... రంగయ్యజోలికి ఎవరూ రాలా—

యీలోపుగా, ఆ హెడ్డుగారు, మరో సాలుకు ఫించన్ పుచ్చుకుంటాడనగా, తలవని తలంపుగా, దారిని పోయేది తలకు చుట్టుకోవడం...ఉద్యోగం ఊడటం...జరిగింది...ఆ హెడ్డు...పిల్లాపాపా ఉన్నవాడు కావడంతో యిన్నాళ్ళూ రెండుచేతులా పోగుచేసినా, కార్యాలకంటూ కరమ్మతులకంటూ ఉన్నదీ – మన్నదీ అయిపోయి, రేపెల్లాగా, అనే స్థితికి వచ్చాడు.

ఆ సంగతి, తెలియడంతోనే, రామాంజయ్య హెడ్డు గారింటికి వెళ్ళాడు:

పనిపోయినా, ఖాళీచేసేందుకు, యిలాకావారు గడువియ్యబట్టి, హెడ్డు ఇంకా ఉన్న ఇంట్లోనే ఉంటున్నాడు:

రామాంజయ్యను చూశాడు: ఎగతాళి చేయడానికి వచ్చాడేమో ననుకుని, తాటి(ప్రమాణం లేచాడు:

ఆయన తొణకలేదు, బెణకలేదు: ఆ మంచంమీద హెడ్డుగారి పక్కనే కూర్చుని, "అయ్యా, వెంకటప్పయ్యా! మీమీద నాకు కోపంలేదు...గేలి చెయ్యరాలేదు: నా బిడ్డ బాగోగులు, ఆ రంగడివి...నీవుమటుకు ఏంజేశావ్...భద్రాద్రి రామదాసటూ...మా రంగయ్యటూ... మనిషికి మనిషి మేలుచేస్తాడుకాని, కీడుచేస్తాడా—! అలా అనుకుంటే తప్పుకాదా?...ఆ నౌకరీ, యింతకాలం చేశావ్...ఇంకెంత కాలం?...మానుకోవడం మంచిదే అయింది...నాకూ మనిషి అవసరం ఉంది: ఆ కార్ఖానా నీవు జూసుకుంటావని చేతులో చెయ్యేస్తే...నాకా చింత వదలిపోయి...హాయిగా గుళ్లో కూర్చుంటాను. నాకీసాయం చేసిపెడుదూ!—" అన్నాడు:

వెంకటప్పయ్య...శీతజ్వరం పీడిస్తున్న వాడికిమల్లే వణికిపోయి..."నీ కొడుకు నాకు బుద్ధి చెప్పాడు. నేను కచ్చకట్టాను. రంగయ్య బతుకలా చేశాను. నీవు కాదన్నా, అదంతే. కనకనే నా గతి యిలా అయింది, కావల్సిందే.

ఇంట కాచిపోసే దిక్కులేదు. వీడొక్కడున్నాడు. పింఛ నుచ్చుకుని ఏ కూతురి దగ్గరో పోయుందా మనుకున్నా... యిప్పుడు ఎలా పోను? కూతురు మనదైతే, అల్లుడు మనవాడా? డిస్మిసై వచ్చి మామ తన నెత్తికెక్కితే... ఆదరిస్తాడా?

పోనీ, పిల్లవాణ్ణి పంపేద్దామా అంటే వీణ్ణి మటుకూ తిన్నగా చూస్తారని నమ్మకం ఏమిటి?

నేనూ, వీడూ ఏం కావాలా అని, అదే దిగులు.

ఇహ నాకేం దిగులూ లేదు.

నా బిడ్డను నీకప్పగిస్తా. పెంచి పెద్దవాణ్ణిచెయ్. నా బుద్ధులు రాకుండాచెయ్. రామాంజయ్యా! నీకు నీ కొడుకును కాకుండా చేశాను. అయినా – నీవు దేవుడంటివాడివి...గనుక నా బిడ్డను బాగుచేస్తావు! –

నేనంటావా...నలుగురిలో ఎలా తల ఎత్తుకు తిరగమంటావ్!

నా పాపం నాకు తెలియదా? ఏ కాశో పోతాను.

నన్ను పోనీయ్..."అని బ్రతిమాలుకుని, ఒడ్డు నప్పగించి తనదారి తాను చూసుకున్నాడు వెంకటప్పయ్య.

రామాంజయ్య...అప్పయ్యకొడుకును. తన కొడుకులాగానే చూసుకున్నాడు రంగయ్య విడుదలైవచ్చి వాడిని తనతోడబుట్టినవాడే అన్నంత ఆపేక్షగానూ చూశాడు.

"అయ్యాయ్! మన రంగడేంజేశాడో నీకు ఎరుకలేదులే. ఇన్నాళ్ళా కోవెల్లో ఉన్నాడనుకుంటివా? లేదు...నాతోనే కదిలొచ్చి, యింతకాలం నాకు తోడున్నాడు...అన్నవేళా కంటిమీదుండేవాడు

ప్రజల్లో ఉంటే పదేళ్లే...అక్కడుంటే వెయ్యేళ్ళు వాణ్ణి కొలుచుకున్నట్టయుండయ్యా! వాడల్లా, పిలిస్తే పలికాడయ్యా!

నాలాటి నా అన్నలున్నారు. వాళ్ళకూ తోడుండు రంగా – అని మ్రొక్కుకున్నానయ్యా! నా మాట వాడు వింటాడో వినడో. నీవు చెప్పి చూడవయ్యా..." అన్నాడు, రంగయ్య యింటికి రాగానే రామాంజయ్యతో.

"ఎక్కడుండాలో వాడికి తెలియదట్రా అయ్యా! వాడికి మనిషిమీద ఉండదట్రా" అన్నాడు రామాంజయ్య.

రంగయ్య మళ్లీ ఎవరితో మాట్లాడలేదు. ఎప్పుడూ నవ్వుతూండేవాడు. ఎవరన్నా, ఎన్నడన్నా పలుకరిస్తే ఎగిరిగంతేసి "రంగా" అని పకపక లాడుతూ పరుగెత్తేవాడు.

రంగయ్యను యిలాకావారు రాజమహేంద్రం పంపిన మరుక్షణంలో బసవన్న అక్కడనుంచి లేచిపోయినాడు. చల్లబజారులో పడుకునేవాడు. ఊరంతా, ఏ వాడను చూసినా తానే అన్నట్టు తిరిగేవాడు. రంగయ్యలేని అన్నేళ్లూ అంతే.

రంగయ్య తిరిగి వచ్చాడు. యిద్దరూ కలిసి తిరిగేవారు. కలిసి రంగడి కోనేట్లో స్నానం చేసేవారు. పవలూ, రాత్రీ ఎప్పుడూ యిద్దరూ ఊరిమీదే ఉండేవారు.

అలా ఒక్క ఆర్నెల్లు జరిగింది. రంగయ్య ఆనాటి కానాడు శుష్కించిపోతున్నాడు, రామాంజయ్య యిహ పట్టలేక ముచ్చి బసవయ్య దగ్గరకు పరిగెత్తుకువెళ్ళి వెంటబెట్టుకు వచ్చాడు. బసవయ్యంటే ధన్వంతరే.

బసవయ్య వచ్చాడు – చూశాడు – నవ్వాడు. "రామాంజయ్యన్నా...రంగణ్ణే నమ్మాడు. ఆ రంగడే వీడికి ఔషధ మిస్తున్నాడు. త్వరలోనే భవరోగ విముక్తుణ్ణి చేస్తాడు" అన్నాడు. రంగయ్య, "రంగా" అనేందుకుకూడా ఓపికలేనివాడల్లా ఎగిరి గంతేసి, రంగా అని మూడు వాడలు వినబడేటట్టు పలికాడు.

మర్నాడు మామూలుగానే కోనేటికి స్నానానికి పోయినాడు. బసవన్న తోడున్నాడు. యిద్దరూ మునిగారు. బసవన్న ఒక్కడే పైకి లేచాడు. రంకెలు వేసుకుంటూ రామాంజయ్య దగ్గరకు వెళ్ళాడు, ఆయనకు అర్థమయింది.

రంగయ్య ఊరేగింపుగా, ఊరు విడిచిపోతుంటే, బసవన్న వెంట నడిచి రంగా, రంగా అని రంకెలు వేసుకుంటూ సాగనంపాడు.

బసవన్నకు ఆనాటినుంచీ ముసలితనం వచ్చింది. రామలింగేశ్వర ఆలయం ముందుకు, గడ్డిమోపులవాళ్ళు వస్తూ, వస్తూ ముందో పట్టెడు పరకలు వేసి వెళ్లేవారు. అవన్నీ ఒక మేటి అయేది. తినేందుకు చుట్టూ మేకలు జేరేవి... బసవన్నతో ఆడుకునేవి.

సర్వసాధారణంగా మా ఊరి పెద్దలు, దేశం తిరిగి వచ్చి అక్కడ ఎన్నడో ఒకనాడు బహిరంగసభ చేసేవారు. వారివెంట ఉండే అనుయాయిగణం ఓ పదో పరకో, – తప్పనిసరిగా వారూ, – బల్లా, కుర్చీ తెచ్చి వేసిన కూలీవాడూ, దీపాలు మోసుకొచ్చినవాళ్ళూ పోను...అన్నేళ్లూ అన్ని ఉపన్యాసాలూ శ్రద్ధగా ఆలకించింది..బసవన్న ఒక్కడే! స్వరాజ్యం వచ్చేముందే వారూ కైవల్యానికి పోయినారు.

రంగయ్యకు భవబంధ విమోచనం ప్రాప్తించిన మరునాడే రామాంజయ్య కార్ఖానా పనివాళ్ళకు పంచిపెట్టి వెంకటప్పయ్య కుమారుణ్ణి వాళ్లకు అప్పగింతపెట్టి కార్ఖానా అంటిపెట్టుకున్న కొబ్బరితోటలో తగుపాటి చెరువు తవ్వించి రంగడి విగ్రహం ముందుంచుకుని, అక్కడే ఉండేవాడు. రామాంజయ్య మరి మిరాయి చెయ్యలేదు...ఎవరికీ పెట్టాలేదు.

కాని, గ్రామంలో పిల్లలకు, ఆ కొరత లేకుండా తలారివారి చిన్నవాడు. వెన్నవంటి మిసమిసమిసవాడు... రంగయ్యలాగనే నవ్వేవాడు. గాలిలో గుప్పిటపట్టి నవ్వులూ, నాట్యాలూ చేస్తూ వెంటపడిన పిల్లలకు, తలో పట్టెడూ పటికబెల్లం ముక్కలిచ్చేవాడు.. వాడు, – ఆ రంగదాసు చిందులువేసిన చోట మోపెడు మల్లెపూలు రాలేవి...వాడు, శుక్లపక్షంలో వెన్నెల్లున్నట్టు ఉన్నాడు. వెన్నెలంత నవ్వు వెదజల్లాడు. అంతులేని ఆనందం అందరికీ మౌనంగా యిచ్చాడు. చంద్రరేఖల్లే అనంతాన కలిసిపోయి శాశ్వతుడైనాడు. వాడి పుణ్యాన మా గ్రామానికి యిప్పటికీ మల్లెలు పుష్కలం! మరి ఆ ఆనందం, అది, వాడి ఒక్కడి సొమ్మే!

కేవలం ఆ ఒక్కడి సొమ్మే కాదు, మరో దూదేకుల సాయేబు యిస్మాయిల్‌కు వారసత్వం వచ్చింది.

వాడు నిత్యమూ బైర్–బత్ బుజాన వేసుకుని ఆ వీధినే పోతుండేవాడు. కట్టు పొగరుబోతని ప్రతీతి. తనకంటికి ఆ యిల్లు నచ్చితేనే అడుగు పెట్టేవాడు. పరుపో దిండో కుట్టేవాడు. లేదో పిలిచిన అసామిని పట్టుకుని, పర్పామీద పడ్కుంటాప్–వాట్కి పర్పా ఉడాయిస్తుందిగాదూవయ్యా...సాపమీద పడ్కో అనేశేవాడు. ఒకనాడు, గోపాలదాసుగారు, అంటే ముట్నూరి గోపాలదాసుగారు, ఆలయంలోనుంచి వీధిమీదికి రావడం, – వీడటే రావడం జరిగింది. వీరు వాడివంక చూశారు – బహు అరాగా, వీడు మామూలు నిర్లక్ష్యంతో ఓ కన్నట్టు పారేసి, – ఏవండి పెద్దవారూ...మీకూ పర్పా కావాలా! అన్నాడు.

"నాకు పరుపెందుకు సాయేబూ, ఉన్న బలుపు చాలదూ అన్నారు వారు.

"యింతబందోబస్తీమీద ఉండి సాపమీద పడ్కుంటారా?–"

"నాకు, ఆ చాపమటుకెందుకూ, యీ నేల చాలదూ!

"అదేమిటయ్యా...మీకీ, సాప ఖరీద్ చేసేదాన్కి పైసా లేదా?"

"లేకేం, కావలసినంత ఉంది. అదుగో నా ఖజానా..." అని ఆలయంలో స్వామిని చూపించారు.

"అక్క బిరాయించినవార్కి మీరూ గులామిలా?"

"వారి గులాములకు గు లామును...అవును నాయనా, నా మాట నమ్మకపోతే అదిగో చూడు, వాడినే అడుగు, నిజం చెబుతాడు."

యిస్మాయిల్ భుజంమీద చేయివేసి గోపాలదాసుగారు వాడికి గోపాలస్వామిని చూపించారు. మౌనంగానే ఉపదేశం చేశారు.

అంతే. వాడు భుజాన ఉన్నవి అక్కడే జారవిడిచినాడు. పోయి ఆ ఆలయం అరుగుమీద కూర్చున్నాడు. తలవంచుకుని ఏడురోజులున్నాడు. ఎనిమిదోనాడు ఉదయం గోపాలదాసుగారు దయచేసి, వీడినిచూసి, దగ్గరగా నవ్వుకుంటూ స్వామికి అక్కడనుండే నమస్కరించి దారిని పోయినారు.

ఆ నవ్వుతో, యిస్మాయిల్, కదిలినాడు. అక్కడనుంచి లేచాడు. అక్షరం రానివాడు, అలా తలవంచుకుని నడుస్తూంటే వాడు పాడేపాటలు వినేందుకు ఎందరో వెంటబడేవారు. ఆ పాటలు యీ నాటికీ మా గ్రామంవారు పాడుకుంటూ ఉంటారు. నడుస్తూ నడుస్తూ ఏ యింటిముందో ఆగేవాడు. ఇంటియిల్లాలు ఒక్కముద్ద దోసిలిలోవేస్తే అది అక్కడే తినేవాడు. తిన్నగాపోయి బందరుకాలువ పాయ ఒడ్డున కూర్చునేవాడు.

వారిపాట విన్నవారందరూ, భక్తులైనారు...వెంట తిరిగినవారు పేత్తలైనారు – ఏటేటా వారిపేరున ఉత్సవాలు, మా గ్రామంలో జరుగుతూనే ఉంటవి.

అలాటివాడు కాదు, అంతవాడు కాదు, కోమటి సుబ్బయ్య. పొతకలాటివాడు, బొంగురుగొంతువాడు, గంటకోమాట మాట్లాడేవాడు. ఒంటెడు నామాలవాడు, మోపెడు తులసిపూసలవాడు. రామాంజయ్య కార్ఖానాలో, చిన్నప్పటినుంచీ పని చేసినవాడు రామా! అని మట్టుకు స్పష్టంగా ఉచ్చరించగలిగినవాడు.

చిన్న దుకాణం, పెద్దయెత్తున అమ్మకం...రాత్రి పదింటికి సాధువులందరూ చేరేవారు. గోడకానుకుని కూర్చుని ఆ తత్వాలన్నీ ఆనందంగా ఆలకించేవాడు. పదకొండు కాగానే చుట్టుప్రక్కల తిరుగుతూన్న, గోవులన్నీ వచ్చేవి. పెద్దపళ్లెముల నిండుగా అప్పుడువండి చల్లార్చిన సరుకు పట్టుకువచ్చి బహుశ్రద్ధగా వాటికి ఆరగింపు చేసేవాడు. నీరు పట్టేవాడు. "పోయిరండే తల్లులారా! యివేళ ఏంపెట్టానో, ఏం తిన్నారో రేపేలోపం రానీయను లెండమ్మా," అని మొక్కేవాడు. చేరిన సాధువులకు తుష్టిగా వడ్డించేవాడు. తలో యింత ముట్టచెప్పేవాడు. అమ్మిన అమ్మకంలో మర్నాడు కొనుగోలుకూ, రోజువారీ జీతాలకూ, యీ ధర్మాలకూ పోను, మిగిలింది రొండినపెట్టుకొని తిన్నగా ఓమైలు నడిచి ఏ అర్థరాత్రికో యింటికి చేరుకునేవాడు.

ఇల్లు అంటే తనదికాదు – తోబుట్టువుది. తనకు తానొక్కడే. అక్కడే స్నానంచేసి, ఉదయమేవచ్చి కన్యకా పరమేశ్వరికి నిన్న మిగిలిన సొమ్ము సమర్పించి, వచ్చి వ్యాపారం చేసుకునేవాడు...గోవులకూ గోసాయిలకూ – యిప్పటికీ అలా సాగించేవారున్నారా? లేరంటే అది అబద్ధం.

– ఈ బ్రతుకు అబద్ధం అనుకుంది, అలా తన వారితో అనేసింది, వాడలో పుట్టిన ఒక చిన్నది.

చిన్నదానితల్లి, జమీందారుల ప్రాపకానవుండి బిడ్డలకు మొగంవాచిపోయింది. ఎవరో ఒక సాధువొచ్చి విభూతిచ్చి మగపిల్లాడా, ఆడకూతురా? అనగా –

మొగపిల్లాణ్ణేం జేసుకోను? ఆడపిల్లయితే – అక్కరకొస్తుంది. అన్నదట! మొగపిల్లడైతే నీ కక్కరకు వచ్చేవాడు, ఆడకూతురు కలుగుతుంది, అది నీకు అందకుండాబోతుంది, అన్నాడు సాధువు. అంటే ఏ మహారాజుల కటాక్షమో ప్రసరించగా తనకందని ఫాయాకు పోతుందనుకుందా తల్లి.

పిల్లకి యీడొచ్చింది. ఒకరిద్దరు ఘరానావారు వచ్చారు. రానిచ్చింది. ఏమిబోధ చేసేదోకాని ఒక్క క్షణంలో యువతలకువచ్చి ఆ తల్లిముందు చెంపలేసుకుని, 'మేము అపచారం చేశాము. ఆమె మహాయోగిని!' అన్నారు. ఆ తల్లితోబాటు ఆ వాడా, ఆ వాడతోబాటు ఊరూ, అప్పుడు కన్నుదెరిచింది. జ్ఞానమాంబను గౌరవించింది. బెజవాడ కనకదుర్గ తన నీడను, ఆ జన్మకు సాఫల్యమిచ్చింది.

చిత్తగించారు...మా గ్రామం చరిత్రలోకి జొరబడవలసిన అగత్యం లేదు...ఈ గోరంత గొప్పే...మాకు ఎల్లకాలం చాలును!

★ ★ ★

# తపస్విలోకం

తీరా బయలుదేరబోతున్నాము——

నాటకం చూద్దామనే అపేక్షకన్న...నలుగురు స్నేహితులమూ కలిసి సరదాగా కౌముదీవిహారంచేసి.. ఏ తొలిజాముకో యింటికి జేరుకునే ఆచారక్రమానికి వన్నె తెచ్చేదే, ఆ జలసా.

ఫోర్డు నిండిపోయింది .'సెల్ఫు' నియోగాన, కొంతసేపు స్పందించి...విసుగుతో మౌనందాల్చింది మోటారు మారిస్‌దగ్గర నేను ఒక్కడనే..నిలుచుని...నిరీక్షిస్తున్నాను. మా రాజాబాబు యింకా కదిలి రాలేదు.

——జమీందారుడైనా..వాళ్ళపూర్వులు వెంకటాద్రినాయడికాలాన వీరరాహుత్తులైనా. బాబు, మా మిత్రమండలిచేత, "ధొరవారు" మర్యాద ఎన్నడూ ఆశించడు: పరిహాసానికి కాదు కాని, ఓ మాదిరి, ఆధునిక ఛోటా ఆనంద గజపతి ఆకారవైభవాన కాకపోయినా..అనుభవరాసిక్యంలో...

అవరోహణంలో అడుగుకు రెండు మూడు మెట్లు కమ్మేస్తూ...అమాయికపు పసిపిల్లవాడి బులబాటంతో, అక్కడ...మా ఉపాంతాన ఊడిపడి, బై సారిస్తూ..

"రెడీ" అన్నాడు నవ్వుముఖంతో బాబు. అప్రయత్నంగా ఆవహించిన ధూర్తవినయంతో, వినమ్రుడనై.. కారు తలుపుతీసి...

"దేవా!...ఇటు ..ఇటు" అన్నాను. ఆ ఉద్దండుడు, లోనికి విజయంచేసి...మెడ ఒరగా బిగదీసి... లేని గరి మీసం మెలివేస్తూ...వీధినాటకంలోని వీరపురుషావతారం లాగా.

"హే మంత్రిసత్తమా! మనము రథాధిరోహణముం జేసితిమికదా...మంచిది...మన రాజ్యంబున ఎల్లవారునూ సుఖులే...వర్షంబులు...అమ్మోయ్..."

——సీటు వెనుకనుంచి నెమ్మదిగా చెయిపోనిచ్చి కంఠజామంగా అన్చిన పిగరెట్.. చురుకు...పనిచేసింది... గమనించి...అందరూ విరగబడి....

...ఆ నవ్వు సందడిలోనే...టెలిగ్రాం వచ్చింది... చదివినక్షణంలోనూ కెలిడో స్కోప్‌లోలాగా... వన్నెలు తిరిగిపోయినవి...నవ్వువచ్చింది...కాగితంచేయి క్రిందకు దింపి...సదస్యులందరిని చూస్తూ..ఎవరితోనూ కాకుండా,

"బలే" అన్నాను. బాబు, కారులో నుంచి దిగి నా చేతిలోనుంచి.. దాన్ని కముచుకుని...ఒక్కసారలో చదివి...వికసించిన ముఖంతో...వెనుకకు విరుగుతూ...బిగ్గరగా..

"బల్...బలే..." అని కాగితం జేబులో పెట్టుకున్నాడు...అందరూ మమ్మల్ని కమ్ముకుని... అన్ని గొంతులతో...ఏకైకశ్రుతిలో...

"ఏమిటి?" అని గలభాగా అడిగారు.

"ఏమీలేదు". ఇదీ బాబు నిశ్చలమైన జవాబు.

"చెప్పవూ.. పోనీ...నీవైనా.."

"వీల్లేదు ." ఇది ఇద్దరమూ చూపులతో సం(ప్రదించుకున్న తరువాత..

"దాచుకోండి .ఇంతకూ విశేషము ఏమీలేదుకద..(ప్రమాదం ."

"చెప్పలేం ఉండవచ్చునేమో " ఈ కొంటెతనంలో మానసికంగా నాకూ భాగము వున్నది

"కారణం..."

"కార్య...కారణాలకి సంబంధం సంగతి... రేపెప్పుడైనా అన్నంభట్టు...కలలోకి వచ్చినప్పుడు . నిలవేసి కనుక్కోండి..."

"మరి.. (ప్రయాణం ఉందా లేదా?"

"ఓ...కాని, నాటకం మా(త్రం...మానేయాలి..."

"ఏం అంతేకాదూ" అనే (ప్రశ్న-చూపుకు "అవును". .మానితీరవలసిందే . ఇంతకన్నానా అని.. నా 'వాగ్లెస్'

"అయితే--మేమెవరం రాము "

"మన యిష్టమేఁ. చఢో. తేజ్ సే. దేర్ హోతీ..."

--ఏలూరులో బయలుదేరడమేకాని...ఆ వేసంగి వెన్నెలలో, బెజవాడ రావడానికి...ఎంతసేపు కావాలి?

## 2

– స్నేహితుడి ఆతిధ్యాన్ని స్వీకరించడం. మర్యాదకోసం కాకపోతే భోజనం...మాకు నైమిత్తికాలలోదికాదూ...బాబు సూట్ విడిచేశాడు ఇద్దరం గబగబ మేడదిగి వచ్చేశాం, మిగతావాళ్ళతో... "ఇప్పుడే...వెంటనే తిరిగివస్తాం వచ్చేదాకా ఎక్కడకూ కదలవద్దు." అని గట్టిగా చెప్పి..

మళ్ళీ అక్కడకు జేరుకునేటప్పటికి...పది దాటింది. హారన్ వేసి..అందరినీ కిందికి రప్పించి..ఎక్కడకో చెప్పకుండానే...తరలించాము...

అడుగుపెట్టామో లేదో..ప్లాట్ఫారంమీద.. మెయిల్ పరుగెత్తింది, ధన్ధనా... ఆగడానికి...

రెండు కంపార్ట్మెంటుల అవతల సెకండ్లుకాస్ కిటికీలోనుంచి తొంగి చూస్తూంది... అప్పుడే... ముత్యం..

నన్నుచూసి...నవ్వు మొగంతో చేయి విసిరింది... అందరమూ సమీపిస్తుండగా...

"హలో" అంది...నేను, నవ్వుతూ..

"నేర్చుకుపోయినావులే...పిల్లో...దిగు, (క్రిందికి..." అన్నాను.

"ఉహుఁ మీరు లోపలికి రండి.."

"మర్యాదయేనా...పెద్దలందరూ .నిన్ను చూడటానికి వచ్చి..ఇలా నిలుచుని... ఉండగా..."

"వారు కూడాను..."

"రారు...దేవిగారు...దిగిరాకూడదేం...?"

నావంక వేయిశరాలపెట్టి చురచుర చూసి..తప్పదనుకుని...తలుపుతీసుకుని... వచ్చింది

"అందిందా..టెలిగ్రాం?"

"ఆఁ"

"ఏలూరులో చూశాను... మీకోసం. ఊళ్లో ఉండరేమో అనుకున్నాను."

"నిజమేలే..నీవు ఏలూరులో వున్నప్పుడు..నే నిక్కడ ఉన్నాను."

"మరీ చోద్యం—మీది..."

"కావలసివుంటే మనవాళ్ళను అడుగు...ఆఁ .మరిచిపోయినాను. ఈమె–మిస్– లేక శ్రీమతి అని వేస్తున్నారా? ముక్తామణి...ఫిలిముల్లోంచి దిగి ..ఇక సిలవకుండా.. రుకాయి కిని కలకత్తానుంచి వచ్చేస్తూంది... వీరందరూ...ఫలానా.. ఫలానా...భాయీలోగ్! పృథక్ పృథక్‌గా కరగ్రహణం చేయండోయ్...కలియబడక...రాజాసాహెబ్..ఏడీ .ఇంతకుముందు ఇక్కడే ఉండాలే"

"ఏడీ, ఏడీ" అనుకుంటూ.. నిలుచున్న చోటునుంచి కదలకుండా అందరూ కలయదిరిగి చూశారు..

"వారు..ఎవరు?" అని అడిగింది ముత్యం

"మా...రాజాబాబు.. ఎరగవూ?"

"విన్నాను...వారుకూడా వచ్చారా?"

"అవును...ఎలా వెళ్ళాడో...వస్తాడు"

"ఇంకా .టైము. ఎంత ఉంది?"

"ఏం?"

"కాఫీ కావాలి..."

"కలకత్తా వెళ్ళినతరువాత కూడా...కాఫీ. ఊహుఁ టీ పుచ్చుకో..."

"సరే..."

"కూలీని పిలవనా?"

"ఏం?"

"నేను...ఇక్కడ దిగను...ఇంటిదగ్గర...అమ్మావాళ్లూ కనిపెట్టుకుని...ఉంటారు..."

"నేను ..ఆ పేనంటే...ఏమంటారు?"

"ఏమైనా...సరే . ఉండను?"

"ముమ్మాటికీ..."

"ఊహుఁ"

"నీ...యిష్టం..."

వెనుకనుంచి...అందుకని, ఆమెవారించే ప్రయత్నానికి పూనుకునే వ్యవధిలేకుండా...ఓ మోపెడుదండలు మెళ్లో వేశాను...మాలలు అందిచ్చిన మా డ్రైవరును చూసి తెల్లబోయి ఉలికిపడ్డ మిత్రబృందం అర్ధచంద్రాకృతిగా బారుతీరి...చప్పట్లు...హోరెత్తించింది. ముత్యం దిగ్భ్రమతో.. అలా... ఉండిపోయింది. కదలకుండా.

తొందరగా చేయిపట్టుకుని ఆదుర్దాతో "ఇక్కడ వద్దు. అరుగో జనం వచ్చేస్తు న్నారు.. మూసుతారు.. అర్---ఆర్---ల్కో వెళదాము----" అని అంగీకారానికి నిలువకుండానే బలవంతాన నడిపించుకుపోయినాను... స్నేహితులందరూ, ఇంకొకడిని చొరనీయకుండా కమ్ముకుని వచ్చారు . వెయిటరును పంపి--సామాగ్రి దింపి పోర్టర్లు వెయిటింగ్ రూమ్‌లో జేర్చే ఏర్పాటు చేశాను, ముత్యానికి తెలియకుండా.

టీ కప్పు నోటికి అందించుకోబోతూంది...రైలు కదిలింది. ఇక. ఆ పిల్ల పెంచిన రగడ. .వర్ణనాతీతం... ఖండితనాయిక ..ఫిల్ముపోజులు .మాకు పట్టరాని నవ్వూ.

బయటికి దోవతీయబోయింది. నేను అడ్డం వెళ్ళి...

"ఎక్కడికి" అన్నాను లాలనతోనే.

"నా యిష్టం"

"నేనూ రానా..."

"సంతోషించారు తెలివికి.. ఘనకార్యం చేశాం గదా మనమేనని పొంగు! నేను నడిచి అయినా వెళ్ళిపోతాను...తెనాలి"

"మరీ, మజా! నేనూ తయార్ . వెన్నెల్లో చేతులు కలుపుకుని. 'నీమీద గీతాలు ..నే పాడుకొనుచు...' ఊం...బయలుదేరు. ."

"మీరు. నాతో.. మాట్లాడవద్దు"

తల ఊగించాను

"బెడ్డింగ్ అవీ...ఏవీ?"

"అదిగో అక్కడ" అని మాటాడకుండానే నిర్దేశించాను. ఆమె వచ్చిన నవ్వును పొరలిపోనీయక.. అంతలో కోపంలోకి మార్చుకుని

"నేనూ. .అక్కడే వుంటాను" అంటూ ముందుకు పోబోయింది

రవివర్మ విశ్వామిత్రుడిలాగా...చెయి దర్వాజాకు అడ్డంవేసి "వద్దు; ఇప్పుడు ఈ సంగతి తెలిస్తే...ఇంత రాత్రివేళా ఇక్కడ ఊరంతా విరగబడిపోతుంది--నిన్ను చూడటానికని..."

"ఫరవాలేదు"

"అయితే--పిలుచుకువస్తాను----"

--ముత్యం, ఇక పెంకితనం చేయలేదు...తల వంచుకుని మావెంట వచ్చేసింది

## 3

కాని, మళ్ళీ యింకా పేచే...

ఏలాగైతేనేం... ధోకాయిచ్చి. ప్రయాణం మానిపించి, ముత్యాన్ని, బయటకు తీసుకువచ్చాము; ఇంకా మారాం చేస్తూనేవుంది కాని అదో సరసం. అని మాకు తెలుసును.

ఒక కారు వెళ్ళిపోయింది. మారిస్ మాత్రం వుంది మా సరసను కూర్చోడానికి ఒప్పుకోలేదు. డ్రైవరుపక్క కూర్చోడం, నామోషీ; అయినా తప్పిందికాదు. పంతం నెగ్గించుకునేందుకు ..ఆముదం తాగబోయే కుర్రవాడిలాగా, అంతలో మళ్ళా...ప్రణయకోపం కులికే, సులోచనలాగా ఎక్కి...ఒదిగి కూర్చుంది...

"ఇంకా...కృష్ణ ..రాలేదేం"

చాలా జోరుగా వెళుతూన్నది, కారు ఓహో, మరచిపోయినాం..తెవాళే అది చెప్పాంకాదూ బయలుదేరుతూ?...సమాధానం చెప్పడం ఎందుకని ఊరుకుని.. మళ్ళా, మనసుమార్చుకుని, ప్రమాదంలేకుండా, కోమటిసాక్ష్యం పంపిణీమీద..

"వస్తుంది" అన్నాను.

"యారు? .."తల కొంచెం మావైపు మళ్ళించి ధీమాగా అడినాడు డ్రైవరు...ముత్యం మావంక చూసింది నిష్ఠురంగా...

"ఏయ్ ..డ్రైవర్.." నేను తీవ్రంగా పిలిచాను. అతడు, తేలికగా...ఊదినట్లు– "ఎన్నా .సార్?" అన్నాడు. నేను యింకా, సీరియస్‌గానే చూస్తున్నాను. గమనిస్తూన్న ముత్యంముఖాన విజయభావం తాండవించినది...

"సిగరెట్" అని మీదనుంచి విసిరివేశాను...లైటర్ అందిచ్చాను...అగ్నిహోత్రులందరి అనుష్ఠాన పటుత్వాన...కారు, ఒక్కక్షణంలో ధూమధామమైంది...

"ఏయ్..." ముత్యం పిలుపు.. ఎంత దౌర్జన్యంగా ఉంది! డ్రైవరు ..ధూమకేశాన్ని ఆమెదిక్కుకే ప్రసరించి...తల నిలువుగా ఆడిస్తూ...

"ఓయ్.." అన్నాడు...

"ఆపు

—అర్థంకానట్టు.. వినిపించుకుని, ఊరుకున్నాడు..

"స్టాప్"

"ఎందుకూ...ముత్యం?" నేను ముందరికి వాలి అడిగాను...

"ఆపమనండి"

"ఏం..."

"ఏం ..ఏమిటి...పట్టి పొగరుమోతులాగున్నాడు...పొగ నామీదికే వదులుతున్నాడు..."

"పొరబాటు"

"అయినా.. బ్రతకనియ్యదలచుకోలేదూ...కారు దేనికో కొడతాడు.."

"ఫరవాలేదు అతడు సిద్ధహస్తుడు...!"

"ఆ...మీకుదొరికే రకాలందరూ ఇంతే.."

"అవును. మరి, నిత్యమూ, కొల్ కొత్తా...అనాలి కాదూ. నుంచి, ముత్యాలు రాలుతాయా... మర్యాదస్తుడే.. రాజా...గారి డ్రైవరు"

"మీ మాటలు నమ్మాలిసిందే...ఎవరైతేనేం...ఆపమనండి..."

"పోనిద్దూ"

"ఆపుతారా...స్క్రీమ్ చెయ్యనా..."

"ఏం లాభం... మాకు ఎవరికీ ఇక్కడ రికార్డింగ్ చేతరాదు..." ముత్యాన్ని ఎలాగైతేనేం నవ్వించాను. అక్కడితో అందరం సరదాలో పడిపోయినాం... సంభాషణ చాలావరకూ నవ్వుల కలగలుపున ఇంగ్లీషులో నడిచినా, ముత్యం కూడా చొరవగా కలిపించుకుని, మామీద, విశేషించి, ఆ అరవడ్రైవరుమీదా వాగ్బాణాలు ప్రయోగిస్తూ...ఆనందమయి అయిపోయింది... అతడు, ధోరణిపోలికను, అర్థంచేసుకున్నట్టు కోపం అభినయించినా...మరీ, నిర్లక్ష్యంగా విరుచుకుపడటం మొదలు

పెట్టింది... ఆమె మాటల చెలగాటానికి. మనసులో మండిపోతున్నాడని తెలుసును మాకు; కానీ, అలాటి అవకాశం. వ్యర్థం చేస్తామా?

కారు ఆగింది గేటుదగ్గర, డ్రైవరు, చప్పున దిగి తలుపుతీసి, ముత్యం అడుగు కిందపెడుతూండగా సెల్యూట్ చేశాడు. ఆమె, సుల్తానాలాగా, తల కొంచెం ఓరగా పైకి విసిరి.. సినిమా ఊగుతో, మందగమనంతో . రెండు అడుగులు వేసి...ఆగి..

"ఎక్కడికి.. వచ్చాం?" అన్నది నా వైపు తిరిగి అమాయికంగా.. ఆశ్చర్యపడుతున్న దానిలాగా.

"ఇక్కడికే" అన్నాను కొంటెగా..

"చూశారా..." ఆ చూపులో. 'నాకు తెలుసును మీరందరూ ఇలా చేస్తారని నమ్మిరావడం నాదే పొరబాటు... కానీండి. చూద్దాం.. నా సంగతి మీకు తెలియదు...' క్రోధం మొదలుకొని, కిలికించితంలో ఇమిడిన భావాలన్నీ ఒక్క మారు, మెరసినవి...

"రా, లోపలికి వెళుదాము".. చెయి ఆసరాయిచ్చి తీసుకువెళ్ళాను. 'పెట్రో మేక్సు' మూలాన బాగా వెలుతురుగా వుంది.. కూర్చునివున్న మిత్రులు స్వాగతం యిచ్చారు, లేచి నిలుచుని.. ముత్యం...నలువంకలా కలయజూసి దిగ్భ్రమతో..

"ఇది.. ఏ ఊరు?" అన్నది... నెమ్మదిగా.

"ఏ వూరు అయితేనేం ఇది టి.బి. కదా .రేపు.. తెనాలి."

కారు, పార్కుచేసి డ్రైవరూ, మిగతా యిద్దరు స్నేహితులూ, సందడిగా మాట్లాడుకుంటూ, మెట్లుయెక్కి వస్తున్నారు

"అ౦. రాజాబాబు వస్తున్నాడు." అన్నాడు. ఒకడు అందరం గుమ్మంవేపు చూశాం.. మిత్రద్వయం ముందుఅడుగుగా వచ్చి మాతో కలిసి అర్ధవలయాకారాన నిలిచింది.. డ్రైవరు.. కూడా వెంటవచ్చి..

—కుర్చీలో కూర్చున్నాడు ఠీవిగా..తలకుచుట్టిన తువాలు తీసుకుంటూ. అందరం... మాతోబాటు అతడూ .నవ్వుతున్నాం, కోలాహలంగా. ముత్యంతప్ప ..

.. అప్పటికి అర్థమయింది ఆ అమ్మాయికి.. బెదరుతూ, ముందుకు వచ్చి ..చేతులు జోడించి...

"క్షమించాలి...మీరు ఎవరో...తెలియక ."

రాజా, నవ్వుతూనే, ఆమె చెయ్యి ఒడిసిపట్టుకుని, పక్కకుర్చీలోకి లాక్కుని...

"ఏం. .కూర్చుంటావా...డ్రైవరుపక్క "అని అడిగాడు, వంచిన ముఖం తన చేతితో పైకి ఎత్తుతూ... ముత్యం మరీ సిగ్గుపడ్డది...

"ఎంత ఉత్తమనాయికవయినా.. ప్రథమంలో అందంగాని...తీరా. ఇప్పుడా. .సిగ్గు.."

సిగ్గు పోవడంచేతనే మాతో కలిసి నవ్వేసింది...

కాఫీ తాగుదామని కూర్చున్నాం... రాజా, కప్పు అందుకుని, ఏదో ఆలోచిస్తూ...ముత్యాన్ని మమ్మల్ని అందరినీ...వరుసగా.. చూసి..

"అసలు...శాస్త్రప్రకారం...పరమాన్నం ఉండాలి కదూ.." అన్నాడు..

"అలాగైతే...తరువాత..తలుపుదగ్గర పాటలో..." మావా డింకో దండుకున్నాడు.. ముత్యం మరీ కులికింది.

"ఆc..ఇక కాస్సేపు అయితే మేలుకొలుపులే పాడవచ్చును" అన్నాను వాచీవంక చూసి .

రాజా, నిద్రాభారాన్ని అభినయిస్తూ..

"కావచ్చును...మరి ఏం చెయ్యను భాయీ!... జ్వలతి ప్రదీప స్నక్షీజనః పశ్యతి కాతుకేన..." అన్నాడు చిరునవ్వుతో...

"ముహూర్త మాత్రం కురుకాంత ధైర్యం.." అని మన తరఫు జవాబు

"ఉహుc .గె. ..టౌట్ .యూ...సిల్లీ" కోరికలు తీరిపోయిన పందు ముత్తైదువులు లాగా..మేము, నవ్వుకుంటూ వెనుదిరిగి చూడకుండా...వచ్చి...చాలా దూరంగా .. విశ్రమించాం.

★ ★ ★

# ఔను నిజం

కప్పునిండా ఉన్నది టీ; స్పూన్ రవంత అలికిడికే పొరలి సాసర్‌లోకి పాళంగా ఒలికిపోయేటంత నిండా.

ఆవిరి తెరలు అతినాజూకైన తీవెలుగా చిరుగా మెలిపడుతూ అజంతా అల్లికల అందాలలోకి సాగేయత్నంతో...

బల్లమీద తలవంచి — కప్పు అంచున పెదవులు ఆనించి. పీల్చి...చురుకు తగిలినచోట నాలికతో సంబాళించుకుని...ఊపిరి గుక్కపట్టి, తగనిప్రయత్నంతో.. "భాయీ! అనుకున్నంత పనీ జరిగింది.. చివరకు.." అని పళ్లసందులనుంచి ఊదాడు, శేఖరం.

సర్దుకు కూర్చుందామని, కొంచెం మసలేటప్పటికి.. తనవి పొచ్చిన దక్షిణ నాయిక అయి...మన కుర్చీ.. కొరకొరలాడింది.. "ఎవరు అనుకున్నంత?", అన్నాను. ప్రశ్నలాగా కాకుండా.

అందుకు ఏమీ సమాధానం చెప్పలేక... ఊహాల కోసం చూపులతో నాలుగు మూలలా వెదకి... అనవసరంగా గొంతు కొరబారించుకుని... సవరించుకునే రొదలో కలిపి... "మేమిద్దరం పెళ్ళిచేసుకుందా మనుకుంటున్నాం.."అన్నాడు.

"నాకు తెలుసును"

"అని నాకు తెలియదే!"

"ఎవరిలోపం?...మరి ఇన్నాళ్లూ. నాకళ్ళకు మసగగా...కలువరేకులూ, చిగురు టాకులూ మెసలలేదు కాదోయ్... మన చూపు. దేవరుకులాగా మందగించలేదని మనవి... అని తప్పుగా అర్థం చేసుకోమోక...వయసులో నీకన్న పెద్దవాడను కనుక...సూచనలన్నీ కొంచెం త్వరగా పసికట్టానని భావార్థం ..శుభం..."

"ఆ అమ్మాయి..."

"ఎవరో తెలుసునులే...ఇలా పిలు...ఓమారు చేయి అందించి...ఉలిక్కిపడక...అదుగో ఆచివర నిలుచుని నీకోసం వెదుకుతూంది; ఊహుఁ, చేయి విసరడం లాయకీ కాదు... చేయి పట్టుకుని నడిపించుకుని రా..."

అతడు తిరిగి వచ్చేలోపల...నేను బయటకు దూసుకున్నాను. ఇంకోగంటలో బ్లూమౌంటెన్ ఎక్స్‌ప్రెస్ కదులుతుంది; మళ్ళా రెండు నెలలదాకా తిరిగి రానుకదా.

## 2

రెండుగుక్కలకే కప్పు ఖాళీ అయిపోయింది. మరగ కాగిన పాలమీగడ అటూ ఇటూ పైఅంచులను అక్కడక్కడ అవరించి ఉన్నది. వంచినతలకు నిలువుబారున సిగరెట్‌పొగ రాజుతూ ఉన్నది.

"అనుకున్నంత పనీ అయింది" అన్నాడు శేఖరం కొంచెం కటువుగా

"ఎవరు .."

"నీవు...నేను గ్రహించాను. మేమిద్దరం మళ్ళా.. మొదట మనం హోటలులో కూర్చున్నచోటికి వచ్చేటప్పటికి. నీవు మాయంకావడం అప్పుడు కష్టం వేసిందనుకోగాని...గమనించి సరిగా నడుచుకుంటే ఈ కటకట తప్పేదేమో..."

"ఏమో?"

"ఏమో?...ఎలా ఆమెను వరించానో.. ఎందుకు నీ సహవాసంచేస్తూకూడా మేలుకోలేకపోయినానో... ఏమో?"

"ఏమో..."

"ఏమో కామోలుననుకునే...ఎంతకైనా...చేసినది తప్పుకాదని మనసును మోసగించుకుంటున్నాను. హానీమూన్ కు ..మసూరి వెళ్ళాము. ఆ నందనభోగం...అదే మొదలూ ఆఖరూ...అంత హృదయమిచ్చి పిలుచుకున్న ఆనందానికి.."

"కష్టపడుతున్నానని చెప్పడానికి...కవిత్వంలోకి దించే ముచ్చట మనకు పూర్వాశ్రమంలో తీరిపోయింది.. కాస్సేపు పత్రికావిలేఖరిపాత్రను ధరించి.. నీకు యిష్టం వుంటే ..అసలు గొడవ ఏమో చెప్పు."

"అదే తెలియకుండా ఉంది... ఆ అడ్డంకి తీరేఅంతవరకూ ఆమె కనపడకుండా ఒక నిమిషం వుండలేకపోయేవాడిని... ఇప్పుడు క్షణం నిలవలేను . కారణం తెలియదు... మే మిద్దరమూ పోట్లాడుకోము.. మనసిచ్చి మాటా మాటా అడుకోము."

"బాగానే వుంది..."

"ఏమీ బాగాలేదనే నేను యిందాకనుంచీ మొరపెట్టుకుంటూన్నది. బోనులోపడ్డ చిట్టెలుక ఎదురుగుండా పిల్లి కాపలావుంటే ఎలా అటుమటించుతుందో...అలా.. నేను ఎటు మెసలినా... ఏపనిచేసినా...ఆమెచూపులు నా వెన్నువెంట...నాకు తెలియకుండా.. ఏ అపార్థం బయటకు లాగుతూన్నవో అనే ఆరాటం..."

"నాయకుడు అనుకూలుడైనప్పుడు..."

"అందువల్లనే...యీ రగడ పెరుగుతూందేమో ననుకుంటా ఒక్కొక్కప్పుడు. ఎంతదాకా వచ్చిందంటే... ఆమె నన్ను యిలా చిక్కి శల్యమయ్యేటట్టు చేస్తూన్నదని...ద్వేషించడంకూడా మొదలుపెడుతూన్నానేమో...నన్ను నే నెరగకుండానే..."

"చనవుగా దగ్గిరకు వెళితే..."

"బలవంతంగా బందాలు వేసి...కముచుకుంటూన్నదనే...యింతబాధ. నన్ను ఏం చేయమంటావు?"

"నన్ను ఓపూట టీకి పిలవరాదూ?"

"పిలిచే తాహతు తప్పిపోయిందని తెలుసుకుని...ఎందుకు బాబా... ఈ దీనుణ్ణి యింకా నొప్పించడం?...ఇప్పుడల్లా...పిలిచేవేళకు...ఆమె కోరినరీతిగా...ఎదుటపడి... పురివిప్పి నాట్యం చేయడమే...యీ సాలభంజిక...కాని...నిన్ను నేను పిలువకపోనులే...ఎన్నటికైనా..."

# 3

యిద్దరికీ అందుబాటుగా టీపాట్ ఉన్నది... రెండో తడవ నిండిన కప్పులు. సమపాళంగా సగంవరకూ తరిగి ఉన్నవి...

"అనుకున్నంతా...అయింది..." మళ్ళా చాలా ఉత్సాహంతో ఆ మాటే రెట్టిస్తున్నాడు శేఖరం. "నేను...అలా అనుకోడానికి యిన్ని నెలలు పట్టినా ఆచరించే సత్తా అబ్బడానికి యింకా యింతకాలం అయినా. యిప్పటికి...లోపం అంతా మనలోనే ఉన్నది అని గ్రహించాను."

"రైట్..."

"అవును భాయీ! నా ఆశలకు...అప్పట్లో అంతులేకుండా చేసుకున్నందువల్ల యిన్ని అగచాట్లు రాకతప్పలేదు. మంజరి...హంసగమనంతో నేలమీద నడిస్తే అందం తక్కువౌతుందనా...ఆకాశంలోకి ఆ అమాయకురాలిని విసిరివేస్తే అంత అవకాశంలో రేగే ఆశలకు అంతు ఏమిటి? అక్కడనుంచి... అలింగనంకోసం ఆహ్వానించాలని కలవరింత..."

"గాలిపడగకు దారం వదిలినకొద్దీ...గాలి పోసుకుంటుంది...గిరికీకొడుతూంటే కళ్ళు అప్పగించి చూస్తుంటే.. కాలు ఓచోట నిలవదు.. మెడా చేయీ బెణకక మానవు.."

"అవును...అందులో హోరుగాలిలో అంత ఎగువకు పోనీయకూడదు. ధూకుడు ఎక్కువై తెగిపోతే... పడగ...ఎక్కడో చిక్కుకుని పాడైపోతుంది . దారం లుంగచుట్టుకు ..చేతికి చివరకు ఏమీ మిగలదు."

"అలా అయేటంతవరకూ వచ్చింది... కాని, ఎవరో వెన్ను చరచినట్లుగా...ఎంతలో మెళుకువ వచ్చిందనుకున్నావు?...కళ్ళు తెరచినా...ఇంకా సాగిపోతూనే ఉంది, ఆ విచ్చుకత్తుల బరాబరి.. కావ్యం..కామిని"

"ఎవరికి జయం?"

"ఎవరిత్రోవ వారిదైనతరువాత కాని...ఆ హోరు తగ్గలేదు .నేను..ఎంత "

"అమాయకుడివి అయితే... కవివి కానేకావు; అర్భకుడివి. ఒక్కటేమాట. కావ్యం కావాలా... అందులో రసాల అలలమీద తేలిపోతూ ఊగడానికి హాయిగా...వెన్నెలా, కోయిలయీలా...మావిచిడా... మెదిపి పుంజచేసి...కామినిగానిచ్చి...ఎగరవేయి...ఎటు దూసుకున్నా...మనసు దానితో... పరుగెత్తుతుంది. కలసి మెలసి.. కాంతతో కాపురం చేయాలనుకుంటే...ఆమె చాయలకు... కావ్యాలాపాలను రానీయమోక. దేనికీ.. దాని హద్దులు ఉన్నాయి..! ఎరిగి ఉపయోగించుకోటంలోవుంది, శిల్పం. పుస్తకాలలో ..చిత్రించే దేవీమూర్తి విషయంలో...పూజ్యభావం. దాసభావం .."

"అంతేనా..ఏరికోరివరించిన అమ్మాయిలో ఆ హంశలన్నీ అద్దించుకుని..."

"ఉబ్బిపోదామనుకోవడంకన్న మరో పొరబాటు లేదేమోనని..అనుభవంమీద చెప్తున్నాను సుమా! మనలోవున్న 'మెసొకిజం'..ఈ జబ్బుకు కారణం. పుచ్చె విడిపోయేటట్టు...చేతిసత్తువకొద్దీ నెత్తిన ఒక పెట్టుపెట్టి...జుట్టుపట్టుకు చరచరా లాక్కునివెళ్లి ..ఏ గుహలోనో... గృహిణిని ఏర్పాటుచేసుకున్న ఆదిమూర్తులకన్న..మనకేం సౌఖ్యముంది నిజానికి? వాళ్ళ కావ్యాత్మలముందు మన అలసార్భటులు ఏ మూలకు? ఆడది...స్త్రీ అనికూడా అనక్కరలేదు...గౌరవించినా, కామించినా...ఏమైనా...ఆమె ..అంతవరకే..."

"మరి, మన స్మృతులు.."

"మనవైతే . యింతకాలం నిలిచేవికావు. మనువు చెప్పాడని.. మనం చేతులు జోడించడం."

"గాధ చాలా పెరుగుతూన్నది---"

"పెరిగింది గనుకనే.. యింతవరకూ సాగింది నీకు తెలిసిరావాలనే నేను ఇంతవరకూ మెదలకుండా వూరుకున్నది. నీవే కాదు. కవి అనేవాడు ఎవడు సుఖపడుతున్నాడు? . అది ముమ్మాటికీ వాడిలోపమేననుకో."

"నిజమే. కాని తరచినకొద్దీ అయోమయంగా ఉంటుంది"

"అదే . కవిత్వానికి దారి. మళ్ళా మొదటికిరా. నీ కళ్ళ ముందర దేవి మూర్తులు ఎప్పుడూ మెలగుతూండాలనీ... వాళ్లు అందీ అందకుండా ఉండాలనీ... అందరూ వచ్చి... ఆ అమ్మాయిలో గూడుకట్టుకోవాలనీ... ఎందుకోయి కవిననుకుని అంత అహంకారం? నిన్ను చేసుకుని...నీ మామూలు సుఖదుఃఖాలలో భాగస్వామిని కావాలసిన పిల్లవంక...అర్థంచేసుకో. వీలులేని ..అనిమేషదృష్టి లెందుకోయ్?.. అస లక్కడ..నీ ఉబలాటమేకాని...అంతకన్న సరుకు ఎక్కువలేదోయ్! భగవంతుడు, దయతలచి పశుపక్షి గణానికి మెదడు తక్కువచేయబట్టికాని...అవికూడా ఆడజాతిని దేవీమూర్తుల క్రింద మార్చి ఆకాశంలోకి వదిలితే...రంగా. ఆ కోలాహలం యిక చెప్పనా.."

"ఇంతటితో దయతలచి వదులుదూ"

"వదలకుండా...చక్కని సంసారివి అవుతావా?... అమరధామం పొలిమేరల్లో ఉంది కనుక.. ఇంతదాకా బుద్ధి...అరవహోటలులో టీ ఇప్పించవలసి వస్తూంది. ఇక ఎన్నడైనా. మీ యింటికి విందనే!"

"కటువుగా లేదూ...అలా విసరడం..."

"కావ్య–కషాయిత అయిన కామినికూడా అంతేనని మనవి చేయడానికే ప్రభూ! తల నెరపు చూపినప్పటినుంచే...కావ్యాతపం..కామినీలోకం దేవీశీతలాన్ని ఊదరగా చెరిగేసింది.. ఆదరణ రెచ్చిపోయి.. ఎవరికి ఎవరు చిక్కాలో తెలియకుండా.. చిక్కి పొలిపోయి ఎక్కడో చూసే.... గుణబద్ధ ప్రణయాలు... కాస్సేపైనాలేకుండా... టీ త్రాగి. .ఎంతకాలమైంది–"

* * *

# పంచసాయకం

ఆ మాట వినేటప్పటికి - నాకు ఎక్కడ లేని నవ్వొచ్చింది

తాను, మీగడతరక లంటుకున్న మీసాలు దువ్వుకుంటూ చేసిన వ్యాఖ్యానానికి, నేను కూడా పార్థించుతున్నానని ఆ అసామీ యింకా సకిలిస్తూనే ఉన్నాడు.

పొగలువెళ్ళే కాఫీ, హాలంతా మారుమోగేటట్టుగా జుర్రుతూ, అనవసరంగా, అయ్యరుమ 'ఏడయ్యా! ఆయన కనపడడేం?' అని అడిగాడు. అరవసోదరునికి అది అర్థం కాక, ఆ సందడిలో, నోరు తెరిపిలేక 'ఎవరు' అని గాలిలో తలత్రిప్పతో ప్రశ్నచుట్టాడు. 'ఆయ నయ్యా - పంతులు' అని వివరించాడు ఆ కాఫీ - పాయి. విని, కొంచెం వికటంగా పెదవి విరిచాడు అయ్యరు. ఆ చేదు మ్రింగి, అసామీ.. హోటల్లో అప్పుడున్న వారందరికీ ఆ హాలాహలంలో పాలు పంచడం చూస్తూ—

అప్పుడు - నేను ఫక్కున నవ్వింది.

అందులో ఉన్న వెన్నెల ఆ అంధుల కళ్ళపడదు - అందుకని కాదు - నేను నవ్వడం: అతని మాటలు తలచుకుని—

అతడు - ఎవరో అందరికీ తెలియవలసిన అగత్యం ఏముంది? 'పంతులూ' అని పిలిస్తే 'ఆఁ' అని మారుపలికి, అడగటం తడవుగా అమృతతుల్యమైన కాఫీ తయారుచేసి యిస్తూన్నప్పుడు.

అసహ్యంగా ఉంటాడూ - తలమాసి గడ్డం పెరిగి? - అతనితో మాత్రం ఏం?

అతి కటువుగా మాటాడుతాడూ? - అందుకనే నాకు అతనితో అంత స్నేహం అయింది.

అవాళ పంతులు కనబడలేదు - అడిగితే, అయిదు నిమిషాలు నసిగి కాని, అయ్యరు అసలు సంగతి చెప్పలేదు.

— ఆ వార్డులో... అటువైపునుంచి డాక్టరు అప్పుడే వస్తున్నాడు అక్కడే ఎదురపడి — ఎవరో సిస్టరు నన్ను అతడున్న చోటికి తీసుకువెళ్ళింది.

'ఏం తమ్ముడూ?' - నేను - ఆత డంత చనువు తీసుకున్నా ఏమీ అనుకోలేదు.

'పంతులూ - ఇవాళ కాఫీ ఏమి బాగుండలేదు'

'అవును బాబూ - అందరూ, పంచదార ఎక్కువ కలుపుతారు, చేదు చస్తుంది' ఆ మాటలూ అర్థంకాలేదు అప్పుడు. అతడు ఎందుకలా కళ్ళతో నవ్వుతున్నాడో అసలు తెలియలేదు.

'అదికాదు భాయీ — తమాషాచూడు — వెనుక, చాలా సంవత్సరాలక్రితం, పంతులుకు ఇలాగే, పవళింపు సేవ జరిగినపుడు — బ్రహ్మాండ వైభవం! ఎలా ఉన్నానో కనుక్కుని పోదామని, గడియ కొకసారైనా అధమం, గాజుల జత నా

ముందు గలగలలాడేది... మళ్ళా ఇన్నాళ్ళకు తలవని తలంపుగా మనకు ఈ స్థితి సమకూరడం. చూడటానికి మగవాడా రావడం అందుకు నన్ను ఒప్పించక—'

–కొంచెం అయాసపడ్డాడు. లోపల నెత్తురు కమ్మి నుదుటిమీద నరాలు ఉబ్బినాయి తేలినవి. కళ్ళుమూసుకుని రవంతసేపు ఊరుకుని, మళ్ళా అందుకున్నాడు:

'ఎవరూలేరు కావలసినదికూడా ఏమీలేదు – నేను ఏమైతే మాత్రం ఏం '

తలవేపున వున్న చార్టువంక చూచాను, మళ్ళా ఉష్ణం పెరిగే వేళ అయిందేమోనని...

'అదంతా ఆస్పత్రివాళ్ళ హంగామాకాని ఆ గీతల ప్రకారం ఎక్కి దిగుతుందంటావా? – మన గీత వాళ్ళకు ఏం తెలుసూ, అనుభవించిన నాకే క్షుణ్ణంగా తెలుసు—'

'మెదలకుండా పడుకో, విశ్రాంతిగా మళ్ళా రేపు వస్తాను.'

'మళ్ళా నీవు రావలసిన అవసరం ఉండదులే. నన్ను మాట్లాడనివ్వు మాటలన్నీ విని – మనసులో ఏమన్నా అనుకో – 'నలుగురు కూర్చుని నవ్వేటప్పుడు నా పేరొక పరి తలవండీ' – ఏం ఉలికిపడుతున్నావు? – కాఫీ అందిస్తే అంత క్రిందమెట్టుమీద ఉన్న జీవికి...కావ్యాలాపాలేమిటనా... ఏమో ఊహించుకో

ఏమిటనా – పోనీలే...చెపుతాను విను

ఎనిమిది ఏళ్ళు నిండీనిండని పిల్లను. చిన్నప్పుడు నాకు పెళ్ళిచేశారు. ఆ రోజు మొదలనుకో. అంత పసివయసునుంచే, అమితమైన గౌరవం, అనురాగం కలిగింది, ఆడవాళ్ళ మీద నాకు

అప్ప చెల్లెళ్ళు ఎవరూ లేరు — మనది వెనుకాముందూ అతి నిష్పూచిపుట్టుకలో అమ్మ నేను భూమిమీదపడినప్పటి నుంచీ లేదు. అలా, తోడూ నీడా లేకపోవడం – ఆ లోపం, ఆ అమ్మాయివచ్చి తీర్చడానికి పూనుకొన్న తరువాతకాని తెలిసి రాలేదు.

అచ్ఛమైన చీకటిలో ముద్దకట్టుకు బిగిసిపోయివుండి, అదే ఆనందావధి అనుకున్న అమాయకుడికి ఆ పసివయసుది వెన్నెలకు విలువకట్టడం ఎలాగో నేర్పిందంటే అంతకుమించే నేర్పరితనం అతి అరుదు కాదా భాయ్!

పదిహేడు ఏళ్ళు దాటకుండానే...నా వెన్నెలంతా పండబారిపోయింది. కలసి మెలసి ఈడుజోడుగా పెరిగాం. కాపురమునకు వచ్చే వయసుకు కరవైపోయింది కన్నతండ్రి...గుండె నిలుపుకోలేక నన్ను ఒంటరిగా భూమిమీద వదిలేశాడు

అందుకు నా క్షేమాత్రమూ – అంతగా విచారం వేయలేదు – ఎందుచేతనో – కాని, తెగిన గాలిపడగ అలా గాలిలో తేలుతూ పోయి, ఎక్కడ వాలుతుందో – ఏ ముళ్ళ పొదమీదనో – అవును, ఎందుకో తెలియకపోయినా, ఏ వైపునో ఎగురుతూండవలసిందేగా—

మరీ, కవిత్వం అవుతూందికాదూ, ఓ మెట్టు దిగుతాను. అలా, ఒంటరిగా ఎవరూ లేకుండా మిగిలానా, ఎంత కాలమో, ఏజోలికీ పోకుండానే గడిపాను, నెలలపాటు. ఒక్కొక్క తడవ, కాలు గడపదాటనీయకుండా. అవును అది గొప్పయింట పుట్టబట్టికాదూ—ఆ అలవాటు—

..అదీ –– క్రమంగా అలవాటైంది మొదటిసారి, కాలు జారడం మాత్రమే జ్ఞాపకం ఉన్నదికాని, ఆ విషయంలో అప్పుడు – ప్రజ్ఞకాదు పరాక్రమం కాదు, జయించుకువచ్చింది

జయించింది ఎవరు – నేను కాదు ..అలా తీయని మాటలు, ఆ అమ్మాయిలాగానే చూపులు. అందుకోసమని.. అందని మానిపండులాగా నటించిన ఆ మేడిపండును అందుకునేందుకు చేయి జాపి . మోసపోయింది.

ఆ తరువాతకూడా...ఆశపడలేదు విశేషం. .అసహ్యమూ అనిపించలేదు. అది ఏంకావాలో తెలియని లోపం.. ఇప్పటికీ తెలియడంలేదులే నిజానికి!

–అప్పుడు గట్టిదెబ్బే తగిలింది. కాని ఆటలో అరటి పండులాగా తోచింది, నా ప్రాణానికి... అర్థంకాకనే!

––కాశ్మీరంనుంచి, కన్యాకుమారిదాకా...ఆ ఆటే ఆ పాటే. .చాలా అన్యాయం కాదూ?––నేను అంటున్నది సరిగా అర్థమౌతూన్నదా లేదా?––ఇంకా విప్పిచెపుతాను.

నేను ఎంతమాత్రమూ అమాయకుణ్ణికాను – అప్పటికే కాదు, ఇప్పుడు...ఇంత ఆరమగ్గిన తరువాత–

నాకు అర్థంకాకపోవడం నా లోపమే అనుకోవాలా? – చిన్నతనంలో నా సావాసగత్తెగా ఉండీ.. అంతకు మిక్కిలి నాకు కోరిక ఏమీ అలవాటు చేయకుండానే అలా మాయమైపోయిన ఆ అమ్మాయి... అనురాగాన్ని మించి నేను – ఎదుగలేదు...ఆడతనం – అంతవరకే నాకు మనసుకు నచ్చేటట్టు అక్కరకు వచ్చింది – అంతకు మించకుండా – నేను: మించితే – లోకమేను .

ఇంతకు పూర్వమే చెప్పానుకాదూ – 'సేతు శీతనగ మధ్యోర్వి' యావత్తూ – మన ప్రణయ – జయకాండ, నడచిందని; అతి సైంటిఫిక్‌గా ఆమూలాగ్రం పరిశీలించాను బాబా! ఇంపీరియల్ గెజిటీర్...కన్నింగ్ హామ్ పరిశోధనలు జోడించుకుని...అసలు సిసలైన అంగవంగాది యాభైయారు రాజ్యాలూ గాలించి చూశాననుకో – ఒక్క పాటలీపుత్రం మినహా – ముఖ్య రాజధానులన్నిటా ఎక్కని గడపలేదు... పదహారు సంవత్సరాలు ఏకధారగా అయిదులక్షల రూపాయలు..ఆ ఆనందాన్ని పసికట్టడం కోసం హాయిగా ఆహుతిచేశాను...అతిశయోక్తి అనేది...అసలు యీ ప్రబంధంలో ఎక్కడా తగలదని నమ్మాలి––

ఎన్నైనాచెప్పు...ఎన్ని ఆటలన్నాఆడు...ఎంతంత చెలగాటానికైనా...ఏ దేశంలోనైనా ఆ జాతి... సై... కాని అంతతో ఆగిపోతుందా... ఆఖరుకు – అది . అందుకోసమే యీ రహదారులన్నీ అని అచ్చుపోసేటప్పుడే బ్రహ్మ ....అలా మదించాడంటావా? నేను నమ్మను... అందుకోసమేనా...కాకపోతే ఆడజాతంటూ అవసరంలేదా? ––

అవసరం తీర్చుకుని – బయటపడి అంతతో మరచి పోవడంలోనే ...అనుభవానికి పరమావధి ఇమిడి ఉన్నట్టయితే చీకటిలో. .తలుపులు మూసుకుని తప్పిదంచేయడానికే నిర్మించిన ఈ జంతుజాలం వెన్నెల అంటే అంత పడిచావడం యెందుకు!

వెన్నెలకోసమేనోయ్ నేను వెదకింది. చీకటిలో బ్రతుకంతా చిందులు త్రొక్కింది!

ఏమో నాకు...ఎంత అనుభవమైనా, ఏమాత్రమూ అర్థంకాదు. ఏం కోరాను? హాయిగా ఆటలుపాటలై అందాలు నిలిచే అమాయక అసంసర్గ ప్రణయం...ఏం

దొరికింది, నిలువెల్లా.. విషం దహించుకుపోతాను. కాని తపించలేక పోయినాను. పోనీలే సాధనకు అంతేమిటని"

*　　　*　　　*　　　*

అంతసేపూ. ఎంతసేపైందో నాకు తెలియలేదు. డాక్టరువచ్చి .నే నింకా అక్కడే ఉండటం వింతగాచూసి. .అయాసం ఉబుకుతూన్న అతనివంకచూసి. గంభీర ముద్రతో నాకు సెలవుయిచ్చాడు.. మరునాడు అక్కడికి వెళదామనుకుంటూండగా, ఏదో అవాంతరం వచ్చింది అలా రెండు మూడురోజులు గడిచినవి ఇక ఆ పైన వెళ్ళినా ఎవరికోసం——

అతడు చెప్పినదాంట్లో అబద్ధము ఏమన్నా ఉన్నదా, అంతా నిజమేనా?

అయితే నిజానికి నిజస్వరూపం ఇంత బీభత్సంగా ఉంటుందా? నాకు అర్థంకాలేదంటే ఆశ్చర్యమేముంది? ఆతనికి...ఆతడు ఎంతవరకూ అంతుచిక్కాడు?

అర్ధణాకాఫీ...అరగంటసేపు...అదీ యిదీ కావాలని కొసరి పెట్టించుకుని..అంతలో కడుపునించుకునే ఆ వాజలకు.. పంతులు అంత తేలికగా అర్థమయేవాడా? .

అందుకోసం .అన్నాళ్ళకు ..ఆతని ప్రశంసవచ్చి.. ఆ జవాబులు చూసి..నే నలా ఫక్కున నవ్వింది!

* * *

# కణ్వాశ్రమం

"అబ్బాయ్ "

"ఏమె నాయనా.."

"కొంప నట్టేట్లో కలిసిపోయిందిరా ఏంరాత, బ్రహ్మరాత ఉలకవు, పలకవు, నిన్ను కాదన్నట్లు అలా, బుద్ధావతారంలాగా మెదలకుండా దిక్కులుచూస్తూ ఊరుకుంటావేమిరా? నీకు చీమకుట్టినంతైనా లేదేంరా?"

"లేకేమమ్మా, చీమలేమిటి, చెవిక్రింద జెర్రులు పుట్ట పెడితివి; పనసంతా ఏకరువుపెట్టడం అయిందా, ఇంకా ఏమన్నా కురదలా వున్నదా?.. ఉంటే, ఊం కానీయ్ మాంచి శ్రుతితో ఎత్తుకున్నావు!"

"కానీ—ఇంతకు ఇంతా ఈ జన్మలోనే అనుభవిస్తున్నా, ఇంకా బుద్ధిరాదాయెను; ఇంతేలే ఇహ.."

"అంతేలే.. పెద్దదానవు, కన్నతల్లివి, నీ దీవన ఊరికే పోతుందా? . నా కోరికా అదే!"

"ఎందుకుపోతుంది? నీ బుద్ధి ఎన్నడైతే ఇలా పెడతలబట్టిందో, ఆనాడే నాకు కానివాడ వైనావని ఓ శోకం పెట్టి ఊరుకుంటేనో, నా చేసిన చేతంతా గంగలో కలిసింది నీ నిర్వాహకత్వానికి, సంబరాలుపడుతూ, చంకలు గుద్దుకుంటూనే ఉన్నాను — నీవు చెడేదికాకుండా, నిక్షేపాలకుప్ప – పండంటిపిల్లను పాడుచేస్తివికదరా —"

"నీవు బాగుచేయడంలేదమ్మా పోనీ—"

"అన్నీ చేశాను. ఒహాటే తరువాయి; ఈ యింటికి నిప్పుపెట్టి, లోతు చూసుకుని పెద్ద కృష్ణలో దిగుతాను–"

"నీ దయ—"

"దయా దగబోలూను కూతురు తగులుకుపోయినా–"

"అలా దోవలోకి రా, మరి; అదాసంగతి? ఇందాకటినుంచీ, ఈ మహదాశీర్వచనం కాకుండా, అక్కడనుంచే ఎత్తుకుంటే కథ, మనయిద్దరికీ యీ హైరానంతా తప్పేదా? పోనీలే — దానికేంలే, లేచిపోయిందీ?"

"ఆహాఁ—ఢంకామీద దెబ్బతీసి.."

"బజాయించే సత్తువ పసిది దానికెక్కడిదమ్మా— ఎవరితో—"

"ఎవరున్నారు...ఆ యింటి కెదురుగుండాచచ్చిన వాడితోనే! అంతకన్న ప్రయోజకు లెవరు యీ వాడకట్టున? అమ్మశక్తి ఆ జగజ్జంత్రి దేశ దేశాలా అందరికొంపలూ తీసి ఈ పట్నం పావనం చేయడానికి యిక్కడ వెలిసింది. కొడుకును అచ్చుపోసి వదిలింది వూరిమీదికి. అయినా ఎందుకులే ఇంతకూ మన బంగారం మంచిది కానప్పుడు — ఇంకొకరి ననవలసిన పనిలేదు. తోడివాళ్ళలాగా లక్షణంగా పెళ్ళీ

పెటాకులూ ఏడ్పి, మొగుడిచాటున పడివుండే, మానవతి అనిపించి నుదుట రాయలేదు ఛీ – కులనాపకురాలు బిడ్డలు పుట్టగానే [illegible]

"ఈ మాటలన్నీ అనడం. నీ విలా ఆడిపోసుకోవడం మన [illegible]

"ఇంకోళ్ళనీ – ఇంకోళ్ళనీ అనడానికి, నే నేమంత కండకావరం, మదమత్సరంతో పడిపోతున్నానటరా? మానానికి మగ్గుతూ ఇదవుతుంటేనే ఇంతింత మాత్రంగా ఉంది—భూదేవికి భారంగా యీ మొండిజీవాన్ని— 'పో వేదంచా, నీకర్మం ఇంతే'నని ఇక్కడ పారేసి, ఆ మహారాజు పుణ్యాత్ములు కనుక వెళ్ళిపోయినారు. నా రాత ఇలా భగ్గుమన్నది. ఏం చేతునురా తండ్రీ!—ఈ నింద ఎలా భరించేదిరా?—""

"నీ వెందుకమ్మా భరించడం?—నీ కూతురా, నా కూతురా?—"

"నా కూతురైతేను యిలా వూరుకునేదాన్నా...పొత్తిళ్ళలోనాన్నే గొంతునులిమి పారేసేదాన్ని—"

"నా కా దివ్యదృష్టిలేదు ..అంత సాహసములేదు."

"నీవా – నీకా... నీ తీరు ఒహాటి తిన్నగా మండింది కనుక యివి తక్కువైనాయని ఏడుపా? నిప్పంటి వంశంలో – చెడబుట్టారురా—"

"ఈ భాగోతం చాలించవమ్మా తల్లీ, ఇంతటితో నీకూ నీ పెద్దలకూ వెయ్యేట దణ్ణాలు – ఎక్కడకు లేచిపోయిందంటావు?"

"ఎక్కడికా – నడి గోదావరిలోకి – ఎక్కడికైతేనేం, తెగిన గాలి పడగ –"

"ఎప్పుడు వెళ్ళింది?"

"ఏమో, కన్నానబోయి కన్నానవచ్చే నేర్చుంది దానికి, ఎప్పుడు దూసుకుందో? ఎన్నాళ్ళనుంచి ఈ ఆలోచన చేస్తూందో, పన్నాగం పన్నుతూందో? వీధిపాచి చేయడానికి, కోడికూయగానే లేచి యివతలకు వచ్చాను. మంచువాడగ్గిర పక్క మీద పిల్లలేదు ఇదేమో అనుకుంటూనే, ఒకవేళేమన్నా నీదగ్గర కూర్చుని చదువు ఏడుస్తూందేమో అనుకున్నాను— ఈ చదువులే కొంపకు యిన్ని తిప్పలు తీసుకువచ్చినాయి;– లోకంకళ్ళు మూస్తామటరా, అప్పటికప్పుడే గుప్పుమన్నది. పువ్వు పుట్టగానే పరిమళించదూ? – నన్ను చూపించి, మన పక్కయింటి భడవా ఉందే – దాసీదానితో గుసగుసలు మొదలుపెట్టింది. ఎదుటింటి గంగానమ్మ లోపల లోపల పిసుక్కుంటూ మొగుడు వెధవాయకు ఏదో నూరిపోస్తూంది. కొంపమీదకు దండోరా పంపుతుంది కాబోలు! రానీ— 'పెళ్ళాన్ని వంచుకోలేని చెవలవాజమ్మా! తగుదునమ్మా అంటూ ఏ ముఖంపెట్టుకుని నా గడప తొక్కావురా?' – అని బిందెనిండా ఒత్తుగా కలిపి నెత్తిన దిమ్మరిస్తాను. – తాట ఒలిపిస్తాను – ముండ ఏలుతున్నదిరా, రాజ్యం?—"

"మన వియ్యంకుడికే — యీ మర్యాదలన్నీ?"

"వియ్యంకుడా? వీడి నెత్తురు కళ్ళ జూడకుండా వదులుతావురా? — పౌరుషం లేక బ్రతికేమిరా? ఎలా పుట్టావురా– ఆ సింహంకడుపున, ఇంత వెన్నుపాముచచ్చిన వెధవ్వు! వీడు – వియ్యంకుడా? వాడు–అల్లుడా? ఊహూఁ – నీకు యిష్టమేనా, కూతురు దేశంమీద తగులుకుపోవడం?–"

"ఆహాఁ--"

"విచారం లేదురా?"

"లేదమ్మా--"

"పిల్లప్ప తప్పుచ్చి పోతూందిరా! అన్నీ ఉడిగి, నేడో రేపో అంటూ సిద్ధంగా వాళ్ళ జాబొస్తే నాకే నవనాడులా కుంగుకుపోతుంటే; కన్నకడుపు, నీకు ఉండపటురా, తండ్రీ! - ఎలా పుట్టిందిరా దీనికి యీ బుద్ధి -- కాగడావేసి గాలించినా, ఇరుపొర్కాల్లా, మన వంగసాల్లో ఎన్నడూ యిటువంటిది లేదే? - ఇంతదూ, ఏకాలానికి ఏం రాసున్నదో తెలియదుకదా? -- ఊరుకో నాయనా, విచారపడిమాత్రం ఏంచేస్తాము? - చెయిజారిపోయిన తరువాత--"

"నేను అందుకు కాదమ్మా ఇదవడం -- నాతో చెప్పి వెళ్ళింది కాదే అని--"

"చెబితే--?"

"రాజాంగంగా పంపించేవాడిని; నా ముచ్చట తీర్చి, నా కూతురూ నా అంతదైందిరదా అని సంబరపడి, దీవించే వాడిని 'సుఖంగా వెళ్ళు తల్లీ' - అని -"

"పోరి - నీ ముచ్చట ముక్కలుగానూ, ఇదెక్కడ కొయ్యమతంరా నీది? ఇదా నీవు చెప్పిన చదువు - నీ పెంపకం ఇదా? అంతముక్కువున్న వాడివైతే - నడివీధిలో గడిసె వేయించి, గుమ్మంముందు కాపలా కూర్చోలేకపోయినావూ? - చిన్నతనంలో పెళ్ళాం పోగానే 'మళ్ళా ఓయింటివాడవు అవరా' అని శతవిధాల పోరినా - ఎవరు చెప్పినా వినకుండా - ఆ పసిగుడ్డును పెంచి పెద్దదాన్ని చేయడమే తప్పు - 'నా కోరికలన్నీ తీరిపోయినాయి. ఇంతవరకూ అనుభవించిన భోగం ఇక యీ జన్మానికి ఎక్కీదక్కీ. ..' అని వేదాంతం పేలగొడితివే? మళ్ళా ఈ కాలానికి భీష్ములవారు అవతరించారుగదా అని మురిసిపోతిని గదరా - ఇదా అయ్య, నీవు తలపెట్టింది--?"

"తలపెట్టడానికేంలే -- తరించాను ఎంత సుకృతం అమ్మా!"

"పచ్చికలి -- భగ్గున తగులడుతూంది."

"పరమాత్ముని లీల--"

"ఛీ -- అప్రాచ్యుడా."

"అదే -- దీవన అమ్మా..."

## 2

"నాన్నా!"

"ఏం తల్లీ... మూడు నెలలకా ఈ ముసలిపాపమూట జాపకం రావడం మీకు -- పోరుపట్టి మారాం చేస్తాడేమోనని - అవ్వదగ్గిరవదిలేసి మీ దోవను మీరు చక్కాపోయారు కదా - ఆవిడకు నా ముద్దూ మురిపం ఏం చూపించను--"

"నాన్నా - నామీద కోపమా?"

"కాదమ్మా -- ఎంతకసి అనుకున్నావు మీమీద-- తగని ఉక్రోశంగా ఉంది. నన్ను తీసుకెళ్ళకుండా బెంగుళూరు వెళితే--"

"నాన్నా - నన్ను క్షమించవా?"

"ఊహూఁ— అవాళ తెల్లవారగానే ఆ ప్రబుద్ధుడు మీ మామగారు వచ్చి నా ఎదుట ఓ అరగంట భరతాభినయం చేశాడమ్మా — తెలియనివాడు. రాముడిలా అని నేను మామూలుగా మాటాడుతూంటే – అది క్రమంగా వాదాలలోకి దిగింది. ధోరణి ముదిరి, రామలీలగా మారేదేకాని .. యీలోపుగా నాకు అసలు కేసు అర్థం అయింది; నా లెక్చరు అంతా వింటాడు తల ఊపించి ఒప్పుకుంటాడు. అలా ఎవరికి వారు ఏరికోరి వరించి..ఎవరితో చెప్పకుండా, గాంధర్వంలోకి నడవడమే ఉత్తమమంటాడు..నా అంతవాడి కూతురిని..నీ అంత అందగత్తెను, మొగ్గవాడిని చేపట్టడం తన పిల్లవాడి అదృష్టమే అంటాడు.కాని..అన్నీ అంటూనే ఇంకా మెదడును బొబ్బట్లమడత వేసి ఆ సందున ఏదో దాస్తున్నాడు. చెప్పించేటప్పటికి, తాతలు..మీ తాతలుకాదు. మా తాతలు.. దిగివచ్చారు... "

"ఏమన్నారు.."

"అన్నమాటకు నాకు కోపం రాలేదమ్మా. విని, నీవు నవ్వుతానంటే చెప్పుతాను..."

"సై—"

"తనముచ్చట తీరాలన్నాడు..'రైటో' అన్నాను.."

"ఏమని ."

"పాపం.. ఆ అమాయకుడేం కొండమీది కోతిని క్రిందకు దించమనలేదమ్మా. జానెడు కాగితంమీద. కలంతో కరపిరలాడించి.. కన్ను సలుపుకోమన్నాడు. కందుతుంది "

"నాకు అర్థమయిందిలే."

"కాలేదులే...అసలు మజా ఇంకావుంది. నేనే గమ్మత్తుచేశాను గాంధర్వమైనా కట్నం యివ్వక తప్పదని నసిగాడా. నేను సంతకంచేసి కలం చెక్‌బుక్ ఆయనకు అందించాను. ఆ ధీరుడు అటుచూసి, యిటుచూసి..పళ్ళు బిగబట్టి అయిదువేలు వేసుకున్నాడమ్మా..."

"అన్యాయం—"

"కాదూమరి, అమాత్రం ఇంగితం ఉండవద్దూ... రవ్వలదుద్దులు చేయించుకుంటూ – రాగితో గూడుకట్టమంటూ పురమాయించే అవివేకం — ఎవరికైనా అసహ్యం వేస్తుంది. నిజంగా నాకు కోపం వచ్చింది. చెప్పొద్దూ! అది చించేశాను..."

"మంచిపని చేశావు."

"ఆహా, మరి అలా వదిలిపెట్టి ఊరుకుంటానా లేకపోతే. పదిహేను వేలకు దమ్మిడీ తక్కువపుచ్చుకుంటే అది నీకు ఇన్సల్టు కాదమ్మా. "

"ఇదా ఘనకార్యం..."

"కాదు...బెట్టుచేసి చివరకు తీసుకున్నాడనుకో...అప్పుడు, పని పట్టించాను దిమ్మతిరిగిపోయిందిలే.. కిక్కురుమన్నాడనుకున్నావా... నేను మెదలనిచ్చానా అసలు? – బావగారి వరుస బలేబాగా వినియోగించుకున్నాను – 'వెర్రివాడా, ఇంత ఘనకార్యం చేసి యిలువరుస నిలిపింది నా కూతురుకాని నీ కొమరుడు కాదోయ్! రివాజు ప్రకారం అయితే, కొనేవాడు మణిని వెతుక్కుంటూ రావాలి – అదీ సబబు; జరిగిందేమిటో తెలుసునా . కాశీమజిలీలు చదివావు కదూ, ఏదో రాజకూతురు, కాలవలో స్నానం చేస్తూంటే ఒడ్డున విడిచిన కంఠహారాన్ని గద్ద తన్నుకుపోయింది .

నీను పిల్లవాడి ఎదుటవాడివచ్చి తెచ్చిపెట్టి సాటుసారి కాంపౌండుతో వసూలు చేయడానికే ఎందు కొడుకువాడా? కాదుమ కూర్చుంటివి -- నీది అదీ ధ్యాస. మనసుకునా అమ్మాయిని, లేదు తాన్నై అనుపుగా ఒక యింటేది కావాలి – అంతేకాని, మన పెద్ద పేరుగా తెమిగా కాని ఆఫీసుకితో పిలాయించకూడదు. అద్దరి నీవు -- ఇక్కడి నేను మధ్య పెస్టేంటిమేటిలో మునుకలు వేస్తూ మీవాడు ఉక్కిరిబిక్కిరి అవుతాడే కాని, ఒడ్డున ఎక్కలేదు. అమ్మాయి చేయి అందించింది – అవునుమరి. 'కాంతుడు సిద్ధిరి కాణ్నై కాంతయు అట్లయిన'.. ఆ వరుని రానీకుండా చూశావా, చేసింది కొరవ... అలా వెల తెలా బోతావేం. శహబాస్ అనక !! ఇలా తుఫాను లేపేశావమ్మా – ఇక అక్కడ నిలిస్తే ఒట్టు! తోకముడుచుకుని అదే పోడు. మూడురోజుల దాకా తలచుకు – తలచుకు నవ్వుకున్నాను. ఆయనమీద కోపం అంతా పోయిందమ్మా – అమాయకుడు – క్షమించాను"

"ఏది, నన్ను..?"

"ఉహూఁ. ఇంకాక చెప్పలేదూ. ముసలివాణ్ణి అయిపోతానా నేడో రేపో ..ఇంతమందినీ క్షమించే ఓపిక లేదు నాకు..అదేపననుకున్నావా ఏం చేతనైతే. అదుగో వరండాలో కూర్చుని. తన్ను మరచిపోయినావేమోనని బెంగతో తొంగిచూస్తున్నాడే... ఆ దీనుణ్ణి.. . చెవులు మెలేసి. ఖైదీలాగా నాముందు తీసుకువచ్చి నిలుపు..చేతనైతే.తలవత్తి గర్వంగా చిరుమీసం మెలివేసి. తన ధన్య -- వాదాన్ని ఆలపించమను..అప్పుడు మీ యిద్దరినీ... దీవించుతాను. ఊఁ..అయిదు నిమిషాలకన్న ఎక్కువధి యివ్వను. చలో..!"

"నాన్నా."

"-- నా దగ్గిర ఇలా ముద్దులుకుడుస్తూంటే నీ నాథుండు చూశావా నన్ను పిలిపించావా అంటే అన్నీ యిలాటి గ్రాంధిక ప్రయోగాలేచేసి. కసితీర్చుకుంటూ పోనీలే దీవన... తీరుబడిగా జరగాలిసింది కనుక -- వాయిదా వేద్దాం. నన్నిక కదపమోక. ఆ రణగొణధ్వనంతా అతని చెవిదగ్గిర. .అలా తోటలోతిరుగుతూ నీ యిష్టంవచ్చి నంతసేపు చెయ్యి. నే నివాళ యీ కథ పూర్తిచేసి పంపకపోతే. ..ఇంకా ఏమన్నా వుందా, సుందరం! తెలుగుదేశం యావత్తూ, కేవలం తల్లక్రిందులౌతుంది–"

★ ★ ★

# ఇదీ - కథ

"ఏంమామా! యీ నెల అంతా మనకు అఖండ రాజయోగం. జన్మలగ్నానికి ఫలితం శత్రునాశనం అని కూడా అన్నాడండోయ్! ఇడుగో, వెళ్ళి, ఆ .కొడుకున్నాడే, వాడితో 'ఖబడ్దార్' నీ గుండెల్లో నిద్రపోతా'నని చెప్పివస్తా - శుభం---"

రోజూ, నాకు ఆ పనస వినడం అలవాటైపోయింది కాని అప్పుడే రైలు దిగివచ్చిన ఆ స్నేహితుడికి అందులో వున్న గుండెకోత ఏం తెలుస్తుంది? 'ఏమిటి ఆ వాలకం, ఎవరు ఆ మనిషి, ఏమిటి ఆ మాటలకు అర్థం?' అనుకుని తెల్లపోతూ, ఏమీ అడగలేక, ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు.

అతన్ని సముదాయించటానికని, మళ్ళా ఓ మారు ఆ కథ అంతా ఏకరువు పెట్టాలి--

-- పాపం, అతడు చాలా మంచివాడోయ్, నోట్లో నాలుకలేనంతటి అమాయకుడు నలుగురికీ తలలో నాలుకలాగా మెలగుతూ, ఒక జోలీ శొంఠీ అక్కరలేకుండా, పదిమంది సంపన్న గృహస్థుల యిళ్ళల్లో పౌరోహిత్యం చేసుకుంటూ, నాలుగు డబ్బులు కూడవేసుకుంటూ, ఓ యింటివాడై యింటిపట్టున సుఖంగా కాలక్షేపం చేస్తూండేవాడు

--నిజంగా అవసరం ఏమీలేదు సుమా? అదివరకు ఎన్నడూ అలాటి వెర్రిమొర్రి నమ్మకాలు ఉన్నాయో, లేవో కూడాను. కుడిచికూర్చుని ఊరక ఉండలేనట్టుగా, రామన్న ఊళ్ళోకి ఎవడో కొత్త జోస్యుడు దిగేటప్పటికి, తన జాతకం చూపించుకున్నాడు. అక్కడితో మునిగింది.

ఆ అప్రాచ్యుడు - వాడెవడో బిళ్ళకుడుముల్లాగా రెండు రూపాయలు చేతులో వేయించుకుని -- ద్వికళత్ర యోగం ఉన్నదని చెప్పాడు. రామన్న నిలువునా నీళ్ళు కారిపోడూ!

ఇక, అక్కడనుంచీ చూసుకో, కాలుకాలిన పిల్లిలాగా, తందనాలు తొక్కడం మొదలు! పోనీ ఎవరితోనైనా మనసువిప్పి, 'ఇలాటి ఆపద వచ్చేట్టుంది, ఏమిటి ఉపాయం?' అని అడిగినా బాగుండిపోను, రండాగర్భంచేసి కప్పి పెట్టాడు నాలుక దాటిందంటే నాలుగు వాడలూ దాటి, తన యిల్లాలి చెవిని ఎక్కడ పడుతుందో, ఆ వార్త వినగానే ఆ అమ్మాయి అప్పుడే గుటుక్కుమంటుందేమోనని, నోరునొక్కుకుని - సొంతవైద్యం మొదలుపెట్టాడు.

హరిః ఓం అంటూ ఆదిలోనే పెద్ద హంసపాదు వచ్చింది. పిసలైన శ్రోత్రియుడు, పరాయి ఆడదానికేసి కన్నెత్తి చూడటమన్నా అలవాటు లేనివాడు, చూస్తూ చూస్తూ ఒక్కసారిగా, - ఎంత తెగించినా - గంగలో ఎలా ఉరుకుతాడు?

అందువల్ల, నాలుగురోజులు నానామారాముళ్ళూపడి, ఏలాగైనా, తనయింట దీపం నిలుపుకోవాలని, - కొంచెం గడుసుదిగా అనుకుని - ఓ పన్నాగంలోకి దిగాడు.

అంతవరకూ చక్కని అనుకూల దాంపత్యం, చిలకాగోరింకలాగా చూడముచ్చట అయ్యేది ఉభయులకూ. ఒక్కసారిగా కటికకోరంటికంలోకి దిగి, ఆమెవంకన్నా చూడకుండా, కాల్చుకుతినడం ప్రారంభించాడు కొంతకాలమైనా అలా అంటిముట్ట కుండా, పరాయిదానికన్నాకూడా కనాకష్టంగా చూస్తే - తన గుండెలు ఎంత కుమిలిపోయినా - తన భార్య బ్రతికి బాగుంటుంది కదా అని ఆ బ్రాహ్మణుడి ఆశ.

అది - ఆ చిన్నదానికి ఏం అర్థమౌతుంది? మొదటి రోజు కసిరి కరవవచ్చినట్టుగా మీదకువస్తే, చెంపకు చారెడు కళ్ళుచేసుకుని బెదిరిపోయినా, అప్పటి కేలాగో - ఏదో చిరాకుగా వుండి అలా మండిపడుతున్నాడని - సమాధానపరచుకుని ఊరుకుంది; కాని, రోజూ ఎప్పటికప్పుడు అదే తంతు అయేటప్పటికి బెంగతో, పాడలిపోయి మంచం ఎక్కింది.

అక్కడితోనైనా, కళ్ళు తెరచి, రామన్న పిచ్చి వేషం వేయకుండావుంటే బాగుండిపోనేమో? ఏంచేశాడనుకున్నావు? ఆ ఉపశాంతికి గ్రహచారం లొంగకపోగా, నెత్తి అణచడానికి కూర్చున్నట్టుంది అందుకనే, నిక్షేపంలాంటిది అలా లోజెడిపోతూన్నది ఇక తామసించకూడదు, అని నడుం కట్టుకుని - లోతుగా మునిగాడు

అవును మరి, ఇక ఊరుకుంటాడా? పరమేశ్వరుడి మీద భారం వేసి, పదిరోజులు ఉద్గురుడుచుకుని, చివరకు సాహసించి, పళ్ళబిగివిని, ఏలాగైతేనేం, పనిచేసే మంగాయ్ అని వుందిలే - అసక చూపిస్తానుండు-దానిమీద చేయివేసాడు. అవును అంతకన్న ఎక్కడికి వెతుక్కుంటూపోతాడు? అలాటి కార్యకలాపాలనికి మార్పేదో పడమర ఏదో అదివర కెన్నడయినా ఎరుగున్న పాపాన పోయివుంటేనా? అందుబాటులో వున్నది -- అది వాడి పూర్వసుకృతంకొద్దీ - అందింది

ఇక పీడ వదలిపోయిందికదా అని ఎగిరి గంతులు వేశాడంటే నమ్ము.

మూడునాళ్ళ పట్టపగలు - ఏలాగో మొక్కు తీర్చుకుని బయటపడ్డాడనుకో, అసలు రెపరెప అంతా అందుకు కాదుగా - మంచిరోజు చూసి - మళ్ళా యింట్లో మంచం దులిపాడు.

ఒకరోజు, రెండురోజులు - ఆ అమ్మాయి ఏమాత్రమూ తేరుకోకపోవడం అలా ఉండగా, మరీ, కారు కమ్ముకుని, దిగనాసిల్లిపోయింది అప్పటికైనా మేలుకున్నాడా! తగిన ఉపశాంతి జరిగింది కదా - అనేధైర్యంతో దానంతట అదే, భారకంతగ్గి లేచి తిరుగుతుందని - జబ్బు ఒకట్లైతే - వైద్యం ఒకటిగా లంకణాలుకట్టి మాడ్చి చివరకు, అత్తవారికి కబురుచేశాడు.

మామగారు వచ్చీరావడంతోనే వైద్యుణ్ణి పిలుచుకువచ్చి చూపించాడు. అతడు ఆయనను చాటుకుతోసుకు వెళ్ళి, ఏం చెప్పాడో! ఆయన, రామన్నతో మళ్ళా పలువిప్పకుండా, తన భార్యచేత చెప్పించి, ఇక అక్కడ గంగ ముట్టకుండా, ఆ పూటే కూతురిని, తన ఊరు తీసుకువెళ్ళిపోయినాడు

--వారంరోజులు అయినా, అక్కడనుంచీ ఏ కబురూలేదు. మనసుపట్టలేక, రామన్న తానుకూడా రైలు ఎక్కాడు. గుమ్మంలో అడుగువేసేటప్పటికి ఏలాగు

ఉన్నదిటాస్థితి – ఇల్లంతా అలగలు బొంగోలు అప్పుడో కాస్సేపో --

అంత గంగిగోగోవులాంటి సాధువు – అమాంతం ఆ మామగారి మీద విరుచుకుపడ్డాడు, 'అంత ముంచుకువచ్చినా తనకు కబురెందుకు చేయలేదని. ఆయన ఉగ్రుడైపోయి, 'చేసిన నిర్వాకం చాలక ఏ ముఖం పెట్టుకు నా గడప త్రొక్కుతావని కబురుచేస్తాను?' అనగానే, రామన్న పళ్లు పట్టి, గుక్కిళ్లు కుక్కుకుంటూ, – భార్య మంచం దగ్గరకు వెళ్ళాడు చుట్టూ ఎవరెవరో కూర్చుని ఉన్నారు ఎవరూ వైదొలగి అతన్ని దగ్గరకు వెళ్ళనీయలేదు. అంత దూరంగా అలా నిలుచున్నాడు.

—తల్లివంక చూస్తూన్నది అంతసేపూ -- అలికిడికి కాబోలు నెమ్మదిగా మెడ అతడు ఉన్నవేపు తిప్పి – పెనిమిటి కంటపడగానే – అంత నీరసంలోనూ మెడవిరుగుతుందేమో అన్నంత దుడుకుగా తల విసిరితిప్పుకొని – విపరీతంగా మూలిగింది అందరూ, అతనివేపు తిరిగి – బాణాలలాటి చూపులతో గ్రుచ్చి గ్రుచ్చి అక్కడనుంచి తరిమేశారు.

—రామన్న వచ్చేసిన తరువాత ఒక గంట మాత్రం ఆమెకు ఊపిరి ఉన్నదట–

అంతటితో పోయిందనుకున్నావా? ఆ వరసవరుస– రామన్న మూడు నెలలు ఆస్పత్రిలో ఉండి -- మళ్ళా తల్లి కడుపున పుట్టాడనుకో: అతడి పాపం–కొంచెం ఆలస్యంగా ఫలించింది–అప్పట్లో రాలిపోయినా–అదృష్టవంతుడే

—ఒకరిని ఓ మాట అనడు పలుకడు ఎప్పుడూ ఒకటే ధోరణి 'గ్రహబలం' అలా అనుకోవడమే ఆ వెర్రికి బలం అసలుసంగతే గ్రహించే మతి ఉంటేనా – అసలు గుండెలాడేవా?

ఇప్పుడు ఇదోమాదిరి – ఏ పత్రికో చదివి – పంచాంగం చూసో – నెలవారీ, రోజువారీ ఫలితాలు కట్టుకోవడం -- అది ఇంటింటా చెప్పిరావడం ' విన్నావుకదూ 'శత్రునాశనం' అట. శత్రువు ఎవరో తెలుసునా, ఆ. కొడుకన్నాడు' -- మామగారు

ఇదీ--కథ.

★ ★ ★

# హంసధ్వని

'ఏంరా మామా! ఇక రేపటినుంచి పదిహేను రోజులదాకా కాలేజీముఖం చూడనక్కరలేదు కదా!... సెలవుల్లో ఏంచేద్దాం..' అన్నాను.

'చేయడమేమిటోయ్!.... కళ్ళు మూసుకు తెరిచేటప్పటికి మళ్ళా బడీ...మనం వాటంతట అవే రెక్కలు గట్టుకు మేఘాలమీద ఎగిరిపోతాయి. నీకేం ఆ దిగులక్కరలేదు ఏలా గడుస్తాయా అని.' రంగశాయి. చులకనగా సమాధానం యిచ్చాడు.. తల ఎత్తకుండా... కలం ఆపకుండా...

'ఇక...సంక్రాంతిపండుగలని... దేవరవారికి తెలుసునా?..' మంగయ్య – తల ఊగించినట్లుగా (మంగయ్య అంటే...మా లాడ్జి ఆసామి) తల ఎగురవేసి..నాకు నవ్వు తెప్పించి.

'అవునురా..అందరూ. అంటే నీవు సహా.. మూటాముల్లే కట్టుకుని అత్తవారిళ్ళకు బయలుదేరుతారు. ఆ సరదా...నాకూ ఉండేదికాని.. ఒంటికి సరిపడలా. ఖాయిలాచేసింది. అప్పటినుంచీ.. గప్ చిప్...' అని కళ్ళతో నవ్వాడు

'నీ పెళ్ళిఅయి... రెండేళ్ళేగా...'

'ఆఁ...ఆ యేడాదిలోనే...యీ ముచ్చట.'

'అంటే...'

'అందుల కొక్క గాథ కలదు.. అది ఇప్పుడు తెమలదు..' శుకసప్తతి పద్యాన్ని చెడగొడుతున్నాడు.

'టూకీగా చెప్పరా...రేపు నే నుండను..'

'అదృష్టవంతుడివి సోదరా!. .పోయి, హాయిగా, కాటూరిరాయని తేటగీతల్లో అర్థమంతా అనుభవించి మరీ రా లేనివాళ్ళకు ఏలాగూ లేనేలేదు!'

'లేకపోవడమేమిటి, నీ ముఖం.. అత్తవారింటికి కొత్తల్లుడు వెళితే.. నెత్తిన పెట్టుకుంటారు, కాని...'

'పెట్టుకునేవారే. .కాని...'

'అనగా...'

'కథ చెప్పవలసివస్తుంది ఖబడ్దార్–'

'చెప్పవోయ్, అయితే...ఎందుకన్నా మంచిది... మనం ఆ పనిమీదనే గనుక, వెళ్ళేది...'

'నీకు అంత అతితెలివికిపోవడం ఎక్కడ చాతనవుతుందిలే.. అయినా, విను.. విన్నందువల్ల నీకు మహోపచ్చేదీలేదు..'

'నీకు పోయేదీలేదు'

'ఇదివరకే పోయిందనే...యిందాక విన్నవించుకున్నది అవును, పోక ఏం చేస్తుంది..'

'హరిః ఓం-పండుగకు తప్పకుండా రావాలనీ... యీ ఉత్తరమే టెలిగ్రాముక్రింద భావించవలసిందనీ... మా మామగారు అప్పటికి నెలరోజులనుంచీ.. ఉత్తరంమీద ఉత్తరం, ప్రతి ఉత్తరంలోనూ యిలాగే నాకూ పోస్టువాళ్ళకీ కూడా విసుగువచ్చేట్టుగా రాశాడు...ఆయనకన్న మనకిక్కడ ఎక్కువ ఆదుర్దాగా ఉంది...

ఎప్పుడు సెలవులు వస్తాయా అని...ఇంక కొన్ని ఘడియల్లో, తినబోయే వాడికి... ముందుగా రుచుల జాబితా యివ్వడం ఎందుకూ? - సరిగ్గా...నీవు యిప్పుడు...ఏమేమని మనసులో అనుకుంటున్నావో...అంతకు వేయిరేట్లుగా ఉవ్విళ్ళూ రానినుకో...అవునోయీ...అదే, తొలిసారి పండుగకు...అత్తవారింటికంటూ వెళ్ళడం.

'తప్పకుండా రాగలవాడను' అని ఒకసారికి ముమ్మారు వ్రాశాను. అంతకూ నమ్మకంలేకనో ఏమో ఏమని విన్నపాలంపుకున్నాడో, మా నాన్న పనివేళా నన్ను ప్రయాణం చేయడానికి తయారైనాడు యిక్కడికి. అమ్మా వాళ్ళూ అక్కడనుంచీ అలాగే యకాయకీ మేము వచ్చేనాటికి అక్కడికి జేరుకుంటారట. సరే అంటే సరేనన్నాను...

కానీ అనుకున్ననాటికి బయలుదేరడం పడింది కాదు. ఆ నెపం కాలేజీ వాళ్ళమీద వేశానులే. ప్రైవేటు క్లాసులు యిత్యాది కారణాలు చెప్పినా మా నాన్న చేత, వాళ్ళనో లక్ష తిట్టించాను. యిద్దరమూ రాకపోతే అక్కడ అటూ అత్తవారూ, అమ్మవాళ్ళూ ఏమన్నా అనుకుంటారు. గనుక నీవు ముందు అనుకున్నట్టుగా బయలుదేరు. వెళ్ళేటప్పుడు 'నా సూట్ కేస్ వగయిరాలు కూడా తీసుకు వెళ్ళావా అంటే నాకు అట్టే బాదరబందీ ఉండదు. యిక్కడ బడి అయిపోవడంతోనే తక్షణం రైలెక్కుతాను' అని గంట సేపు స్పష్టిచెప్పి ఏలాగైతేనేం ఆయనను ఒప్పించి పంపించాను. దవనం, మరువం, పెద్ద చామంతి. ఇంకా ఈలాటి దినుసులన్నీ ఓ బండెడు సామానుకైతే చెప్పి అవిమాత్రం తప్పకుండా, వచ్చేటప్పుడు తీసుకురమ్మని మరీ మరీ నాతో చెప్పి మా నాన్న బయలుదేరి వెళ్ళిపోయినాడు. అసలు మనం ప్రయాణం మానడానికి ముఖ్యహేతువు. చదువూకాదు, పాడూకాదు. మరునాడు రుషియా ఓపెరా కంపెనీ దిగుతూంది. ఉండి చూద్దామని, అందుకనీ! అసలు సంగతి చెపుతే, అయన ఒప్పుకునేవాడంటావా? —

'ఒక్కమారే, సీజనుకు అంతా టిక్కెట్టు కొనేశాను. చేతులో పైసా ఆడుతున్నదిగా. ఆ వారడి, దవనం మరువం యిత్యాదులలో తగ్గించవచ్చు. చాలా సరదాగా గడిచినవి ఆ నాలుగు రోజులూ...

'కావలసినవన్నీ మా నాన్న చెప్పినంత భారీగా కాకుండా, దగ్గిరఉన్న డబ్బుకు సరిపోయేటట్టుగా ముక్తసరిగా కొని పార్శెలు చేయించాను. పేసింజరులో నేను రికామీగా చేతులు ఝూడించుకుంటూ అత్తవారి ఊరులో దిగాను.

'దిగటంతోనే అటూయిటూ చూశాను, ఎవరన్నా వచ్చారేమోనని, ఎక్కడా నాలుగుమూలలా, ఎరుగున్న మొగం ఒక్కటీ కనిపించలేదు.

'అసలు మా మామగారే నన్ను రిసీవ్ చేయడానికి తప్పకుండా రారా అనుకున్నాను. ఆయన రాకపోవడంతో కొంతవరకూ ఆశాభంగం అయింది. తాను రావడానికి ఏ సందర్భముచేతనైనా వీలు లేకపోవచ్చును. కాని ఎవరో ఒకరిని పంపడానికేం? ఊరికి వచ్చినవాడు, యింటికి రాకపోతాడా, అనే ధీమాతో వున్నారు

గదా సరి. కానీ, వీళ్ళపని పడదాం అని అల్లుడితనంలో నాకు ఆవేశము ఎత్తుకువచ్చింది అసలు వెళ్ళకుండా మానేసి ఆపూట హోటలులో భోజనంచేసి తిరుగుబండి యెక్కి కూర్చుందాము అనుకుంటే అందుకు రెండు ముఖ్య అవాంతరాలు వచ్చినాయి. ఒకటి : మన చేతిలో మళ్ళా తిరిగి యిక్కడకు జేరుకునేందుకు చాలేటంత డబ్బులేదు ఇంకొకటి · మా నాన్న ఊరుకోడు

'అందుచేత, సాపుగా ఎగవేయడం అనే ఉద్దేశ్యము ఉపసంహరించుకుని చాలా ఆలస్యంగా, భోజనాలవేళ మీరిపోయిన తరువాత అక్కడకు జేరుకుంటే అప్పుడు వాళ్ళు మళ్ళా వంటచేసి పెట్టవలసివస్తుంది ఆ మాత్రం శిక్షతో ప్రస్తుతం పోనిద్దామనుకున్నాను. 'యిప్పుడెలా వచ్చావు. రైలేం లేదే' అని అక్కడ ఎవరో ఒకరు అడుగక మానరు. సరే, మనం జవాబు చెపుతాము, 'రావడం ఉదయానే వచ్చాను కాని, యిల్లుకనుక్కోవడం చెడ్డ గగనమైపోయింది. తిరిగీ తిరిగీ ఎందరిని అడిగినా ఎవరూ సరిగా చెప్పందే.' దాంతో అందరూ 'అయ్యో-పాపం!' అనకతప్పదు. మామగారికి, యిందులో అర్థం నసాళానికి తగిలి చేసిన పొరపాటుకు, తప్పక నాలుక కొరుక్కుంటాడు. ఈ తఫాకు యింతటితో వదిలిపెడదాం అని నిశ్చయంచేసుకుని మళ్ళా ఇంకోసారి కాఫీ, యిడ్లెన్నూ మేసి పత్రికలు కొనుక్కుని చదువుకుంటూ వెయిటింగ్ రూములో పడుకుని ఏ రెండు గంటలకో నింపాదిగా బయలుదేరవచ్చును కదా అని బుక్‌స్టాల్ దగ్గిరకు వెళ్ళాను.

'అక్కడ ఒక అమ్మాయి నిలుచుని డి.యం.సి. పుస్తకాలు తిరగవేస్తూన్నది అమ్మాయి అంటే ఏ పన్నెండేళ్ళో ఉంటాయి. అయితే పిల్ల మాంచి ఏపుమీద గుమ్మటంలాగా ఎదిగివస్తూంది. ఏడాదికో, రెండేళ్ళకో ఇక చేసుకున్నవాడి పంట పండుతుంది. నాజూకుగా, బొద్దుగా చాలా అందంగా ఉంది. అంతకన్నా జుట్టు నొక్కులు నొక్కులుగా... ముఖ్యంగా ఆ చిన్నదాని జడ చూచి నేను ఆవేపు పరకాయించి చూశాను. మన గాలీ, నీడా సోకి ప్రక్కన ఎవరా అని కాబోలు నావేపు తిరిగి చూసింది. చదువుకుంటూన్న కుర్రది గనుక చటుక్కున ఒళ్ళు కుదించుకోవడం, సిగ్గుపడి ఎగిరి గంతువేయడం – యిలాంటి మామూలీ చేష్టలు ఏమీ చేయకుండా నిదానంగా కొనుక్కునేవి కొనుక్కుని ఊరికేనే నావంక మరోమారు చూసి వెళ్ళిపోతూన్నది

'నాకు ఎలాంటి దురభిప్రాయమూ లేదు సుమా! పసి పిందె అని ముందుగానే విన్నవించుకుంటినిగా! ఉట్టి బులభాటంతో పుస్తకాలు అమ్మే అతడిని, 'ఎవరు ఆ అమ్మాయి—' అని విచారించాను. ఆ సోదరుడు, వేరే అర్థంచేసుకుని నామీద కొరకొరలాడి చిల్లర నాముందుకు నిర్లక్ష్యంగా విసిరివేశాడు మళ్ళా కదలించితే, మర్యాద దక్కేట్టు లేదు. ఎందుకు ఏదో చిల్లరమాట పడటం, మనం ఏ పాపమూ పుణ్యమూ ఎరుగకపోయినా పత్రికలూ, పుస్తకమూ చంకను పెట్టుకుని చిల్లర పక్కజేబులో వేసుకుని అక్కడనుంచి కదిలాను

"తీరుబడిగా ప్లాట్ ఫారం కొలత వేయడం మొదలుపెడితే దానితో కొంత పొద్దుపోతుంది. కూర్చుని చదవటం అంటే ఎంతసేపని చదువుతాం కనుక అందులో ఎప్పుడూ, చదువుకూ మనకూ సగం ఎరికే ఆయెను! – మాంచి

గమకంగా ఉండే బొమ్మలు ఎగాదిగా చూడటం, తరువాత పుస్తకం పత్రికా మూల పారవేయడం నీకు తెలియని దేమున్నది మన విషయం.

"ఆ పిల్ల వెళ్ళిపోయిందనుకున్నాను కాని లేదోయ్, షెడ్ లోపల జీడిపప్పులు బేరమాడుతూంది. నాకు నోరు పురపురలాడింది. కొని, జేబులనిండా పోసుకున్నాను. ఒక్కొక్క పలుకే తింటూ గోడలమీద ఉన్న నిలివెడేసి ప్రకటన బొమ్మలు చూస్తూ అక్కడే నిలుచున్నాను..

"ఆ అమ్మాయిలో యిందాకటికన్న ఎందుచేతనో కొంచెం కులుకు ఎక్కువయిందోయ్. నేను కనిపెడుతూనే ఉన్నానులే, చూపు ఊరికే అటూయిటూ కొండాడుతూందన్నమాటే కాని, మన ధ్యాస అంతా అటు వేపే ఉంది. అంటే, వేరే మరేం లేదు. ఆ పిల్ల ఎందుచేతనో అంతగా నన్ను ఆకర్షించుతూంది...

"నడుస్తూంది. నేనూ...

"అలా అనుసరించడంలో కూడా మరో ఉద్దేశమేమీ లేదు. వట్టి సరదా. ఆ అమ్మాయి డి.యం.సి. పుస్తకాలు కొనుక్కుని వస్తూంది. నేనుకూడా అనుసరించాను మరో ఉద్దేశ్యమేమీ లేదు మనకారువాళ్ళకి అది మామూలేకదా..

"జీరాడే పావడా చెప్పుకాలికి బందాలుపడింది కాబోలు, నడక బెసకటంలో పుస్తకాలు క్రిందపడి చేతిపొట్లంలో జీడిపప్పులు చెల్లాచెదరైపోయినాయి పాపం, ఆ అమ్మాయివి...

"అప్పుడు మనకు, అనుకోకుండా అదృష్టం కలసి వచ్చింది. ఆమెకన్న ముందుగా నేను అవన్నీ తీసి, దుమ్ము దులిపి – అంటే, పుస్తకాలే, జీడిపలుకులు అలాగే వదిలివేశాను — ఆమెకు అందిచ్చి .. ఒక్క అంగలో ఒక్క నిమిషంలో యింత నిర్వాహకం చేశాననుకో. మరి మీ మిత్రుడేం సామాన్యుడనుకున్నావా ఏమిటి?

షివల్ రీ---

కృతజ్ఞత--

"ఏవీ కావు. నేను సంకోచించకుండా వెంట నడవడానికీ ఆ అమ్మాయి నవ్వుమొగం చేసుకోవడానికీ సందు చేసుకోవడం మనసు సరిపెట్టుకోవడం తప్ప మరేమీ కాదు.

"ఎంతసేపు? – ఎంత దూరం మౌనంగా అలాగా నడవడం...

"ఏలా మాటలలోకి దించడం..."

"ఊళ్లోకి ఎంతదూరం ఉంటుంది. ఆ కనపడే పెద్ద మేడ ఏమిటి? రోడ్లు అన్నీ యిలాగే ఉంటాయా దుమ్ము కొట్టుకుంటూ? నిన్న ఇక్కడ ఏమన్నా చినుకుపడ్డదా? నేను బయలుదేరేవేళకు మదరాసులో కారుమబ్బులూ కుంభవృష్టీ, అవును అక్కడనుంచే రావడం లా చదువుతున్నాను. పరీక్ష లయిపోయిన తరువాత ఏమీ చేయాలని లేదు. అవసరంలేదు సంపాదించాలని. ఆఁ ఫరవాలేదు. భాగ్యవంతులమంటే లక్షలు మూలగటంలేదు కాని..

"పెళ్ళి యింకా కాలేదు. చేసుకోవాలనే ఇష్టం లేదు. ఇప్పుడప్పుడే. ఏమిటో అసలు యిలా పూర్వకాలపు రకంగా ఎక్కడనుంచో ముక్కూ మొగం ఎరుగని ఎవతెనో తీసుకువచ్చి, పెద్దవాళ్ళు మెడకు తగిలించితే మెదలకుండా అదే రంభ

అనుకుంటూ, పిల్లలను కంటూ, యింట్లో పడివుండటం ఇలాటి వేషాలేమీ మనదగ్గిర సాగవు. మావాళ్ళకు కూడా నేనంటే హడలు నా దగ్గిర అవేమీ ఎత్తరు

"ఇలాగే ఒక ఓటేమిటి? నోటికి వచ్చినట్లుగా వాగాననుకో కోతలు కోయడంలో, అబద్ధాలాడటంలో నేనేమీ వెనుదీయలేదు. మరి, ఆ సందర్భము అలాటిది!

"ఏలాగో అలా మాటాడించడానికి అని అంటీముట్టని ప్రశ్నలు ఊరు భోగట్టాకు సంబంధించినవి రెండు మూడు మచ్చుకు వేసిచూసి, ఆ అమ్మాయి బెరుకులేకుండా జవాబు చెపుతూంటే ధైర్యంగా ఆమె నన్ను తిరిగి ప్రశ్నించుతూన్నదన్న స్పృహ కూడా లేకుండానే అడిగినదానికి అడిగేదే తడవుగా ఉన్నవీ లేనివీ

"ఆc, పెళ్ళి కాలేదని ఎందుకు అన్నానంటే అయిందని ఒప్పుకోవడం ఎందుచేతనో నామర్దాగా తోచింది ఇంతకూ కీలకం ఏమిటంటే, ఆ అమ్మాయితో మాటాడుతూన్న కొద్దీ మాటలు మొదలుపెట్టినప్పటినుంచీ ఆ పిల్ల సానిపాప అయివుంటుందనిపించింది. వేషం ఒక్కటేకాదు. కులాసాగా డీ అంటే డీ అని జవాబు చెప్పే ఆ ధోరణీ, కులుకూ, వయసుకుమించిన తెలివిచిమ్మే ఆ కళ్ళూ వేయేళ్ళు తపసు చేసినా మనవాళ్ళకు అబ్బుతాయా? అందుకు వాళ్ళే పెట్టిపుట్టారు. అందులోనూ చదువుకుంటూన్నదానిలాగాకూడా ఉన్నదా – ఇకనేం!

"చాలాదూరం నడిచాము అప్పుడు అనిపించలేదులే ఎంతసేపటినుంచి నడుస్తూన్నదీని! నా జేబుల్లో జీడిపప్పులుకూడా చాలాభాగం అయిపోయినవి మాటలసందునే ఎప్పుడో యాదాలాభంగా 'యింద' అని యివ్వడం మొదలు పెట్టివుంటాను. దోవపొడుగునా ఇద్దరమూ, బొక్కుతున్నామన్నమాట!

"అంతసేపటినుంచి చూస్తూండటం, సరసను – చెట్టా పట్టాలు వేసుకోవడం మినహాగా, రాచుకుంటూ – నడవడం, సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఉండటం, ఇన్ని కారణాలమీద ఆ అమ్మాయి సహవాసం ముచ్చటగా నాకు ఉన్నదనుకోవడంలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. పైగా, నాకన్న ఎక్కువ చొరవ – మనం ఎంతగానో నేర్చుకోవలసివున్న మరియాద! – వదలబుద్ధిపుట్టటంలేదు.

"వాళ్ళయింటికి వెళితే!... అప్పుడు తోచింది ఆ ఆలోచన నా అదృష్టం బాగుండి, ఆ అమ్మాయికి ఓ అక్కయ్య అంటూవుండి – ఎందుకు వుండదు? ఉంటుంది. యింతకన్న లేక, యింతకూ వాసి తక్కువ అయినా కొత్త వయసులో రంభను మించేట్టు ఉండితీరాలి! – నాకు, అంతకన్న ఏంకావాలి?

"పండుగ! – అత్తవారియిల్లు – యిల్లాలు! అవన్నీ మనసులోనుంచి తుడిచి వేసుకుపోయినవి. చౌడప్ప చెప్పినట్లు పండుగదినము అలా రాజరంగేళీగా మనకు ఆ ఊరిలో అయే యోగం వుండగా అత్తవారిల్లూ – కొత్త బట్టలూ – చచ్చు సంభావన దక్కకపోతేనేం! – ఏమంటావు?

"ఏంరా? యిది కలా, కథా? ఊపిరి వదలడంకోసమనిగాని నేను ఆ ప్రశ్న వేయడానికి అవసరం ఎంత మాత్రమున్నూ అప్పుడు లేదు

"కథకాదు ప్రభూ! వ్యథ" అని అక్షరాలు నొక్కుతూ జవాబు చెప్పాడు రంగశాయి – ఆలోచనాభారంతోలాగు, తల, మెడతోసహా ఒకవైపు ఒరగనిచ్చి వాడు చూడకుండా వాడివైపే నిదానించి చూశాను, రెప్పలమీదుగా. అప్పుడు తల ఎత్తి

ఉలికిపడేటట్టు చూస్తూ "తరువాత ఏం జరిగిందో చెప్పనా?" – అన్నాను. రంగశాయి సైఁ అన్నాడు

"సరే, ఆ ప్రకారంబున ఉభయులూ కలసినడుస్తున్నారు మాటల మెలికలతో మనసులో సమాధానాలు ఒడిసిపట్టే అతి నేర్పుతో తనకు కావలసిన కూపీ అంతా తీశాడు, ఆ ప్రచండుడు; ఆ అమ్మాయికి ఒక అక్క వున్నమాట నిజమే. ఆ అక్క, తాను ఊహించినదానికన్నకూడాను ఎన్నోరెట్లు చక్కనిచుక్క అయినమాటా నిజమే. చాలా చాలా తెలివీ చదువూ వాటినిమించిన సరదా, కలుపుగోలుతనమూ, ఏవంగుణవిశేషణ విశిష్టగా అప్పుడే కాగి తేరుకుని ఘుమాయింపుమీద వున్న ఆ అవునేతిలో ఇక ఈ రొట్టె విరిగిపడటమే అవశిష్టం. ఇదంతా, వాకబుచేయడం అయినమీదట నాయకుడు చేరుకున్న నిశ్చయము – అంతవరకూ కరెక్టేనా?"

"అవునో కాదో ఆఖరుకు చెపుతాను, సొంతం అల్లు–"

"అల్లికే అయితే యింత పలచగానే! – అసలు కథగనుక మెరుగుతీసుకురావడానికి కృషి లేకుండా – నడిపేస్తున్నాను."

"నీ చిత్తం – సాగదీయక త్వరలో తెముల్చు"

"జీ, హుకుం అయితే అక్కడక్కడ చుక్కలు పెట్టేస్తాను – అఁ, ఎందాకా వచ్చామూ?"

"నేను, మధ్యమధ్య జ్ఞాపకం చేయవలసివస్తూంటే యీ మాత్రానికేనా, తగుదునంటూ అడ్డంకొట్టింది – నడవడంలేదని ఒప్పుకోరాదూ పెద్దమనిషి తరహాగా?–"

"అభ్యంతరం ఏమీ లేదుకాని, పాడుచేస్తావని భయం, నీకు వదిలిపెడితే! –నిన్ను ఒక ఊపు ఊపి చూద్దామని కాని యీమాత్రానికే తడుముకునే బాపతా, మన తాహతు నీకు తెలియదూ. అలనాటి సుబ్బన్న దీక్షితులకు, కరెంట్ అపరావతారాన్ని అనేమాట మరచిపోకూడదు మరి. స్వోత్కర్ష ఎందుకుగాని అవలి కథాక్రమం బెట్టిదనిన .

"ఇద్దరూ, వాళ్ళ యింటివేపే వెళ్ళారు. దోవలు చీలిపోయి, ఎవరి దోవవారు కావలసివచ్చే విషయం ముందుగానే గ్రహించి నీవు మరికాసిని అబద్ధాలు ఆడి తనకు ఆ ఊరు కొత్త, ఫలాని చోటికి అప్పుడే వెళ్ళాలంటూ అగత్యం లేకపోవడం యిత్యాదులు.. 'అలా అయితే మాయింటికి ఎందుకు రాకూడదూ' అని ఆ అమ్మాయిచేత అడిగించుకుని, మొగమాటపడినట్లు నటించి కొంత నాటకం జరిగినమీదట వాళ్ళని పావనం చేయడానికి అన్నట్లు – ఒప్పుకొని కలలమీద కలలు దొంతర పేర్చుకుంటూ గుమ్మం ఎక్కేటప్పటికి యెదురుగుండా వచ్చి, – ప్రత్యుత్థానం చేసింది ఎవరు? – మీ మామగారు: ఆ జీడిపప్పు భాగస్వామిని మీ పినమామగారి కూతురు అదీ జరిగిన ప్రమాదం. మీ మామగారు ఆ ఊరికి ఎదిలీ అయిన తరువాత అదేనాయెను నీవు వెళ్ళడం. ఎక్కడ ఉన్నారో తెలియదు ఁ మీ మరదలు కుర్రదాన్ని నీ పెళ్ళప్పుడు చూచావు– అంతే. ఆడపిల్లలు నిముషంలో యిట్టే అనవాలుపట్ట వీలులేకుండా ఎదుక్కువస్తారాయెను. అందువల్ల నీవు అన్ని కారణాలు అలా కలసివచ్చినందువల్ల దెబ్బతిన్నావుకాని, లేకపోతేనా? అప్పటికైనా చెక్కు చెదరినట్లు అగుపించావా? – వాళ్ళలో వాళ్ళు గుసగుసలు

పోవడం, నిన్ను చూడనట్లుగా ముసిముసిగా నవ్వడమేకాని, మొగంమీద అడగడానికి – నీవు చేసిన అపరాధం ఏముందని, నిజానికి? – మీ మామగారు నీ రసజ్ఞతకు పొంగిపోయి ఉండాలి. కాని, నీకే ఉండటానికి మొగం చెల్లక, అప్పుడే తిరిగి వెళితే బాగుండదు గనుక, ఆరోజంతా బలవంతాన ముళ్ళమీద ఉన్నట్టు ఏలాగో గడిపి – పరీక్ష ప్రశ్నలు అందరికీ ముందే తెలిసిపోయినట్లు అధికారులకు అనుమానం తోచడంచేత మళ్ళా పరీక్ష చేయదలచుకున్నారని నీకు అతిరహస్యంగా అప్పుడొకడు అతివాస్తవికంగా కబురు అపూటే చెప్పాడని, అందుకని తక్షణం వెళ్ళిపోయి కంటిమీద రెప్ప వేయకుండా అంతా చదివితేనేతప్ప – గట్టెక్కడం కష్టమనీ మీ నాన్ననూ, మామగారినీ నమ్మించి – మీ నాన్న అప్పటికే వచ్చి వుండాలనే సంగతి నేను మరచిపోయినా అనుకున్నావు గాబోలు, లేదోయ్ సోదరా! యిక తోక మడతపెట్టావు. పండుగసరదామీద సంకురమయ్య ఆయేడు అవిధంగా స్వారి చేశాడు – నీ కుళ్ళు బయటపడుతూన్నందుకు నీకు కష్టం తోచవచ్చునుగాని నేను, నిజమని నమ్మినదానిని దాచకుండా చెప్పాను – సారీ –"

తలయెత్తి రంగశాయివంక చూడగానే మనసు చివుక్కుమన్నది పాపం, వాడి మొగం చిన్నబోయింది. అతి తెలివి ఎందుకు పోయినానా అని తగని కష్టం వేసింది. 'ఏంరా మామా' అని బెదురుతూ భయంతో పలుకరించాను వాడు నావంక చురచురచూసి పకాలుమని పగులబడ్డాడు – "సారీ, నీవుచేసిన ఘనకార్యానికి మాలావుకథ అల్లా"నని నేను – "సారీయా?, నీ మొగంలాగున్నది యింత చచ్చుగానా – యీమాత్రానికి అయితే చలించేవాడినా – ఎన్ని గమ్మత్తులు చేసే వాడిని! అదికాదు – ఆ అమ్మాయి వెంట, లాషాలాగా తగులుకుని వాళ్ళయింటికి వెళ్ళాను. అంతవరకూ నీ ఊహ నిజమే, అంతే

"నేను అనుకున్నది నిజం. వాళ్లు చాలా మర్యాదలు చేశారు. ఆ అమ్మాయి అక్కయ్య చాలా బాగుంది. ఆవాళ అక్కడే ఉండిపోయాను. తెల్లవారేటప్పటికి ఒళ్ళంతా పళ్ళికలు, గంగాజలం అనుకుని కళ్ళుమూసుకుని కాలకూటంలో నిలువునా మునిగాను. ఏమనుకుంటేమాత్రం ఎవరిని ఏమన్నా ఏం ప్రయోజనం? – కుట్టిన తేలు గుణవంతురాలు.

"సానివాడనుంచి సరాసరి – బండిలోపడి ఏలా హాస్పిటలు జేరుకున్నానో పరమాత్ముడికి ఎరుక. దగ్గరవున్న పైసా బహకొద్ది – ఊరులోనో ఎవరిముక్కూ మొగమూ ఎరుగను. ఉన్నస్థితి అదీ అయినా అధైర్యపడినందువల్ల ఒరిగేది ఏమీలేదుగనుక ఆలాగే మొండివేసి ఓమూల ఒళ్ళు తెలియనంత ఊష్ణం సలుపూ పోటూ నిండుగా మునిగి ఉన్నాను:

"నాపాలిటి దేవుడల్లే అక్కడ డాక్టరువాళ్ళ తమ్ముడూ నేనూ చిన్నప్పుడు చదువుకున్నాం. ఆయన క్రొత్తగా అక్కడకు బదిలీఅయి వచ్చాడట: నన్ను చాలా ఆదరించి చివాట్లు పెట్టి ఎంత గొడవచేస్తాడో అని బహు భయపడ్డాను సుమా! ఏం ఫరవాలేదని నాలుగోనాటికల్లా యింజక్షన్లతో ఆ ఉధృతం తగ్గించేశాడు..."

"వెంటనే తిరిగి యిక్కడకు వచ్చేశావు."

"అంతేనా? మధ్య యింకా ఉంది: రెండురోజులైన తరువాత అవాళ మధ్యాహ్నం వార్డుబాయ్ వచ్చి 'మీవాళ్ళు చూడటానికి వస్తున్నారు' అన్నాడు వినీ వినడంతోనే

పడుకున్నవాడినల్లా అపాళంగా అలాగే నిలువెత్తున ఎగిరిపడ్డానంటే నమ్మక మా వాళ్ళకు ఎలా తెలిసింది? యింకేముంది, కొంపమునిగింది. గజగజలాడిపోతూ అప్రయత్నంగా 'ఎవరు' అన్నాను. అర్థంకాలేదు. నాభార్య, బొడ్డూడని పిల్ల యింకా – ఒంటరిగా వాళ్ళవాళ్ళు యిక్కడి పంపిస్తారా? – పోనీ, మన ప్రయోజకత్వం తెలుసుకుని అభినందంచడానికి తెగించి, వచ్చిందేమో అనుకుంటే తెలుగు పిల్ల కేమిటే అంత తెలివితేటలూ చొరవానా? – ఎన్నిమాట్లు పురంవెయ్యాలి! నేను అనుకున్నదాంట్లో సబబు విశేషం లేదు కాని అప్పట్లో ఆ ఒడిదుడుకు తగిలేటప్పటికి మెదడు అలా పనిచేయడం మొదలుపెట్టింది – సరే, వచ్చినవారు ఎవరైతేనేం – కాళ్ళబడ్డపాము కరవక మానదు కదా – పులినోటిలో తల యిరికి ఉన్నప్పుడు పుట్రకు వెరపు ఎందుకూ? వస్తారు, చూస్తారు – చూడనీ! అని గుండెకు నిబ్బరం తెచ్చుకుని ఊరుకున్నాను.

"ఎవరనుకున్నావు వచ్చింది? – ఎవరో చెప్పుకో – ఎవరూకారు. మనం గంగలో దిగడానికి కారణభూతయైన ఆ 'కళ్యాణ కల్పతరువు' – నదురూబెదురూ లేకుండా, ఏమొగం పెట్టుకుని వచ్చింది? – ఏమని వచ్చింది?

"ఎలా ఉంది" – దగ్గిరకువచ్చి – కుర్చీ మంచం ఒరకు లాక్కుని కూర్చుని తలనిమురుతూ అడిగింది. – నాకు ఒళ్ళు భగభగలాడింది

"దివ్యంగా ఉంది" అని విషంగా అన్నాను కళ్యాణి సిగ్గులేకుండా నవ్వింది–చెంప పగిలేట్లు కొట్టడానికి – లేవడానికి శక్తిలేక ఊరుకుని అక్కసుతో మూలిగాను. ఎన్ని విధాలో పలుకరించింది. నేను బెల్లంకొట్టిన రాయిలాగా తామసం దిగమ్రింగుకుంటూ పళ్లుబిగించి, కళ్ళుమూసుకుని అటుతిరిగి పడుకున్నాను ఎందుచేతనంటే, విన్న కొద్దీ, మనసులో సలుపు ఊ౦ – మెలిక వేస్తూంది పట్టలేక నోరువిప్పితే మన సంగతి ఇంకా నలుగురుకి తెలిసి మనపని ఉన్నదానికి ఉపరి మరీ ఖరాబు అవుతుందని – శక్తికి మించినంతగాకూడా తమాయించుకుని యిక కట్టలు తెగిపోతవని ఆ భూతం అక్కడినుంచి వదిలిపోతుందేమోనని అలా అటుతిరిగి పడుకునే – 'సిగ్గులేదా' అన్నాను – అంతటితో రోషంవచ్చి అయినా వదిలిపోతుంది కదా అని. కాని అచ్చుమయిన సాని అంతమాత్రానికే లొంగుతుందా?

"సిగ్గు–ఎవరికి?" గద్దించినందుకుకాదు, వెక్కిరింతగా అడిగిందని రోషం ఎక్కింది నాకు. 'ఫో' అని ఉరిమాను. 'ఫోసు' అని ఆ స్థాయిలోనే ఆమె జవాబుయిచ్చింది – కింకర్తవ్యం?

"పొమ్మంటే పోయేదాన్నయితే – యీ ఛాయలకే అసలు రానేగాను. అసురుసురనడం – అందరి గృహస్తులకూ పరిపాటే. ఆలనా పాలనా చేసేందుకు నాలాటిది దొరకడం అదృష్టమనుకుని కళ్ళనద్దుకోక కస్సుమంటారేం? – బొట్టూ కాటుకాపెట్టి పిలిచావా ఓమారువచ్చి మా యిల్లు పావనం చేసి పొమ్మని? – యిప్పుడైనా పొమ్మంటానా – రమ్మంటాను గాని!"

"వచ్చినందుకు బుద్ధివచ్చింది–––" అన్నాను – ఆమె అందుకూ నవ్వుతూనే "బుద్ధికి బుద్ధంటూ వుంటేనా రావడానికీ, పోవడానికీని? – మాటకు మాటపలకడం నేర్చారుగాని రద్దికెక్కకుండా మరియాదగా మాన్పుకోవడం నేర్చరో? – మా దొడ్డసరసులు! మారాంచేయకుండా సాయంకాలం వచ్చేసేయండి. మా చెల్లాయిని

పంపుతాను. అదేసరి, మీకు ముక్కుకు తాడుపోసి లాక్కువచ్చి నాగదిలో కట్టే స్తుంది--"

అని వెళ్ళిపోయింది. ప్రభూ! యీ సోదరుడు అలాగే సాయంకాలము అక్కడికి జేరుకున్నాడు. అవును, కాదు అనడం మరి, మనచేతుల్లో ఉంటేనా? అదీగాకుండా అసలుకారణం మనకు నోటిపురపుర యింకా తీరలేదు

సరే. మకాం అక్కడ, మందు హాస్పిటలులో, పదిహేనురోజులున్నాననుకుంటాను అలా. మళ్ళీ ఖాయిలా చేయలేదా అనేనా నీ అనుమానం? - మంచి ప్రశ్నే! ఎందుకు చేస్తుంది? - మన జాగ్రత్తలో మనం ఉంటూంటే చేసినామాత్రం ఏం? మనసంత పరవశం చేసుకునేటప్పుడు, మళ్ళా ఒళ్ళు చివుక్కుమన్నా - ఖాతర్ చేయం!

సెలవుల దోవను సెలవులు అయిపోయినాయి యిక విధిలేక బండీయెక్కి కాలేజీ ముఖమైనాను - అవాంతరాలన్నీ గడచి అన్నీ బాగానే వున్నాయి. కాని రైలు కదలిన తరువాత ఎందుకో స్టేషనుకు వచ్చాడు కాబోలు - మా మామగారికంట నేను, నాకంట ఆయన పడ్డాము. గుర్తుపట్టి కేక వేశాడు నేను కిటికీలోనుంచి తలకాయ లోపలికి లాక్కున్నాను దాని పుణ్యమా అంటూ వెంటనే బండీ దౌడుపుచ్చుకున్నది అప్పటికి ఆ గండం గడచింది కదా అని గుండెలు కుదుటపడి, అమ్మయ్య అనుకున్నాను బండికి భత్యం ఎక్కడిదని ప్రశ్నించబోకు అక్కడే అరువుపెట్టాను అని విశదమయ్యే ఉండాలి. ఈరోజుకు మనం వెనుకటి బాపతు ఆ చిరాకు కొంతబాకీ

ఆ దెబ్బ దెబ్బ, ఆరునెలలు యింటికి వెళ్ళలేదు ఇక చూసుకో అటూ యిటూ, మామగారూ, నాన్నా చెక్కుతూ ఉత్తరాలు వ్రాశారు అన్నిటికి ఒక్కటే సమాధానం మనదగ్గిరనుంచి, మౌనం. యీలోపల వియ్యంకులు ఇద్దరు ఒకరిమీద ఒకరు కత్తులు నూరుకున్నారు. ఉన్నవాడు ఊరుకోకుండా, మా మామగారు "అల్లుడికి మేము ఏం అపరాధం చేశామని అంత ఆగ్రహం? యీ ఊరువచ్చి మా యింటికి రాకుండా పోవడం? పండుగకు మీరందరూ దయచేసినందుకు మాకు బ్రహ్మానందమే అయినా, అల్లుడు రానికొరత, మనం ఉభయులమూ ఫీల్ అయినాము. ఎందుకు రాలేదో కారణం అప్పుడు మీరు చెప్పకపోయినా యిప్పటికైనా మీకు తెలిసి ఉంటుందనుకుంటాను" అని మూడురావుల గ్రంధం పెంచి వ్రాశారు. దానితో మానాన్నకు రేగింది నామీద నేరారోపణ చేసినట్లు ఆయన ఎంచుకుని, మనం చేసిన నిర్వాహకం ఆయనకు తెలియదు కాదూ, లడాయికి లంకించుకున్నాడు. కొన్నాళ్ళు అలా పోస్టుద్వారా సంగ్రామం జరిగి, తరువాత దానంతట అదే చల్లారిందనుకో - నేను ఆ ప్రాంతాలకి ఆ రోజుల్లో వెళ్ళనేలేదనీ మామగారుచూడటం పొరబాటుకొద్దీ ఎవరినో నన్ను అనుకునివుంటారని, మా నాన్నను యింటికి వెళ్ళినప్పుడు నమ్మించడం పెద్ద కష్టంకాలేదు.

అంతటితో కథ పూర్తి అయిందనుకుంటున్నావేమో - మా పినమామగారు వేయిళ్ళ పూజారి. గ్రేట్ వార్‌కు పూర్వం కళ్యాణి తల్లికి ఆయన కన్నెరికం పెట్టాడట, ఆ ఎరికమీద అప్పుడప్పుడు ఆయన వాళ్ళయింటికి పోయిరావడం కద్దు. అక్కడ మన ఛాయాచిత్రం ఆ దేవుడు సందర్శించడం కలిగింది గడుసుతనంగా

కళ్యాణి నేమీ అడగకుండా ముసలి సరసిని కదలేసి యావత్తూ కనుక్కుని సమగ్రంగా అన్నగారికి నివేదించాడు మళ్ళా పెద్ద రసికుడని పేరు చూడబోతే యిదీ ప్రయోజకత్వం! అయన విని ఊరుకోకుండా కళ్యాణి యింటికెళ్ళి కరవవచ్చినట్లు నానా హంగామా చేశాడుట మొదట మా బంధుత్వాన్నిబట్టి చాలా మరియాదగానే మాట్లాడిందట కాని అయినకాడికి అయన రెచ్చిపోవడం చూసి – "మీరెన్నన్నా అనండి ఆయన్ను నా యింట్లో కట్టేసుకున్నాను వస్తే నాకోసం వస్తారు కాని మీ కోసం కాదు ఇహ" అని ఆయనకన్న పెద్ద గొంతు చేసుకున్నదట: "నా పిల్లదాని కాపురం తీసేస్తున్నావు దాని ఉసురు నీకు తగులుతుంది" అని మా మామగారంటే, కళ్యాణి "అది మా యింటా వంటా లేదు. మా యింటికి వచ్చినవాళ్ళు ఎవరు చెడిపోయినారు? – మీ తమ్ముడు మహారాజులాగా లేడా? నేనన్నది మీకు అర్థంకాక, సానికదా అని తేలికగా అనేశారు. అది కూడదు సుమండీ! నా అభిప్రాయం మీ పిల్లది కాపురానికి ఆయనదగ్గిరకే వెళుతుంది అని" యిత్యాదయః దానితో పచ్చివెలక్కాయ గొంతునపడినట్లు జవాబు చెప్పడం చేతకాక మదీయ శ్వశురుండు – గృహోభిముఖుండైనాడు

ఇదంతా కళ్యాణి నాకు వ్రాసింది నేను శహబాస్ అంటూ నీవుచేసింది నాకు నచ్చింది అని జవాబు వ్రాశాను అసలు ఆ ఫోటో మాగృహిణికి బహూకరించవలెనని పట్టుకు వెళ్ళింది. సద్వినియోగమే జరిగిందనుకో. కాని దాని ఆధారాన ఉత్తరకాండ నడవడం – – మొదట్లో కొంచెం కష్టం వేసింది యిప్పుడా? యిప్పుడా చీకూచింతా యేమీలేదు. ఒక్కటే రంధి అయన ఆ ఊరునుంచి బదిలీ అయితేనేగాని నన్ను పండుగకు పిలవడు. వస్తే అక్కడ చిక్కుబడి బయటకు రానని ఆయనకు భయం. నా అంతట నేను వెళితేనో అంటే, తాను నిమిత్తం కాకుండా వుంటే ఎవరిపాపం వారిది అలా సర్దుకుపోగలడులే. వేదాంతి కాద్దోగొప్పో – ఏం ఎలావుంది?"

"నమ్మశక్యంగాకుండా ఉంది"

"నాకూ అలాగే ఉంటుంది, యిప్పుడు తలుచుకుంటుంటే"

"అయితే నిజం. మరి. ఆ తరువాత––"

"తమామ్ –– షుద్"

★ ★ ★

# కైంకర్యమ్

వెంకటస్వామి ఎన్నడో నా చిన్నతనంలో గోదావరి జిల్లానుంచి, మా ఊరు తమలపాకులబేరానికి వచ్చాడు. క్రమంగా, నోటిమంచితనాన, – చేతిమంచితనాన అక్కడే స్థిరపడిపోయి, మాంచి ప్రయోజకుడై వ్యాపారం, వచ్చినప్పటికన్న చాలా భారీ ఎత్తున సాగించుతున్నాడు.

అది, పేరుకు కిళ్లీ కొట్టేకాని, సబ్బులూ, తలనూనెలూ, ఆడవాళ్ళ అల్లిక సూదులూ, ఇలా ఒకటేమిటి ఛప్పన్న పదార్థాలూ దొరుకుతాయి; ఊళ్ళో ఏ కారుకు ఆ కారు ఏదో రూపేణా ఆ దుకాణంతో అవసరం ఉండనే ఉంటుంది అక్కడ దొరికే సోడా ఊరుమొత్తంమీద ఎక్కడా దొరకదు ఇక వెంకటస్వామి కిళ్లీ అంటే, జగత్ప్రసిద్ధి – కాంగ్రెస్ మంత్రుల్లో కొంతమంది అక్కడికి విచ్చేసినప్పుడు, దాన్ని సేవించడమూ, స్వదస్తూరిన యోగ్యతాపత్రాలు ప్రసాదించడమూకూడా జరిగింది. వాటన్నింటికీ చక్కని ఫ్రేములు కట్టించి, నలుగురికంటా పడేటట్టు కొట్లో అమర్చాడు.

వెంకటస్వామి, పచ్చి కాంగ్రెస్ వాది. ఖద్దర్ తప్ప మరోటి ఏదీ కట్టడు. కట్టకపోవడమే కాదు – కొట్లో అవసరాలకన్నా మరో గుడ్డ వాడడు – తమలపాకులు తుడవటానికీ, కొట్లో దుమ్ము దులపడానికీ – ఎందుకైనా శుద్ధఖద్దరే!

ప్రొద్దున్నే కొట్టు తెరిచీ తెరవడంతోనే మహాత్ముడి బొమ్మకు హారతి ఎత్తుతాడు! తతిమ్మా ప్రముఖ దేశనాయకుల పటాలకీ యథాశక్తి చెయిచూపించి, ఒకటో అరో పువ్వు ప్రతిపటం నెత్తినా గుచ్చుతాడు. ఆ కలాపం అంతా అయితేనేగాని బేరం యివ్వడు.

ఎక్కడ కాంగ్రెస్ మీటింగైనా నడుంకట్టుకు ఉరుకుతాడు. కాంగ్రెస్‌వారు చందాకంటూవస్తే తృణమోపణమో సమర్పించుకోకుండా ఉండడు వెంకటస్వామి. అంతేకాదు, మంచిమనిషి, మర్యాదస్థుడు.

ఇలాంటివాడిని – ఉన్నట్టుండి పోలీసులు అరెస్టుచేసి తీసుకుపోయినారనీ, కొట్టంతా సోదాచేసి కొంత దొంగ దినుసుకూడా పట్టుకున్నారనీ – ఓనాడు తెల్లవారేసరికి ఊరంతా గప్‌మన్నది. ఎవరికీ నమ్మశక్యంకాకుండా ఉన్నది

నిషేధం అమలులోకి వచ్చినప్పటినుంచీ, అక్కడక్కడ సోడాకాయల ధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. కొన్ని దుకాణాల్లో, వాడికఅయినవాళ్ళకు గుట్టుచప్పుడు కాకుండా, మాంచి ఘాటైన రూపాయిసోడాలు దొరుకుతున్నాయి అలాటివి అడపాడడపా గుట్టుబెడిసి బట్టయలౌతున్నాయ్. కాని, – వెంకటస్వామి ఏమిటీ, – ఇందుకు ఒడిగట్టడమేమిటి? – ఉన్నట్టుండి ఇంతకాలంనుంచీ లేనిది, ఇప్పుడీ పాపిష్టి సంపాదనకు అవసరం ఏంవచ్చింది?? – ఉన్న సంపాదన అతనికి ఎక్క

దక్క కాగా, ఏదో దానం – ధర్మం అంటూకూడా చేస్తూంటాడే! – ఎందుకు ఇలా విపరీతబుద్ధి పుట్టింది?

రిమాండ్‌లో ఉండగా ఎందరో ఎన్నివిధాలో కదిపి చూశారు, మనిషి ఏమన్నా బయట పడతాడేమోనని! ఊహూఁ, వెంకటస్వామి, చిరునవ్వుతప్ప, ఎవరడిగినా ఏమీ సమాధానం ఇవ్వలేదు.

మేజస్ట్రేటుదగ్గిర కేసు విచారణకు వచ్చింది. ఆపూట ఊరుఊరంతా అక్కడేవుంది. ఇప్పుడన్నా వెంకటస్వామి ఏదోఒక సమాధానం చెప్పి తీరవలసిందేగా!––

ఆ కోర్టులో, న్యాయపీఠం వేసుకున్న అధికారి మొదలు, హాజరు అరిచే డవాలీవరకూ, అందరూ వెంకటస్వామి కొట్లో తరుచు దాహం తీర్చుకునేవారే – తాంబూలం పుచ్చుకునేవారే – ఇచ్చింది పుచ్చుకుని, కొసరు అడిగి నములుతూ, – పలుకరించి లోకాభిరామాయణంలోకి దిగేవారే – అందరికీ వెంకటస్వామి కావలసినవాడే, – తల్లోనాలికే!––

నేరం రుజువు అయేవరకూ, ముద్దాయి పెద్దమనిషి క్రిందే జమ – అని ధర్మకాండ సుళుసూత్రాలలో ఒకటిట! – బోను దగ్గిరకు జేర్చేటంతవరకూ, అందరూ వెంకటస్వామిని మర్యాదగానే చూస్తున్నారు. బోనెక్కి వాజ్మూలం యిస్తూన్న నిషేధపు – ఇన్స్పెక్టరు సయితం, నిందితుడిని ఉదాహరించడంలో మాట ఏమాత్రమూ పొల్లుపోకుండానే తన భోగట్టా యావత్తూ బోర్డువారికి శ్రుతపరిచాడు––

మేజస్ట్రేట్ అంతా విని, – వెంకటస్వామిని పరకాయించి ––

"చెప్పినదంతా విన్నావుకదా, ఇందుకు ఏమంటావ్?" అని బ్రతిమాలుకున్నట్టు అడిగాడు వెంకటస్వామి చిరునవ్వుతో, పెదవి విప్పకుండా ఊరుకున్నాడు.

"మద్యపాన నిషేధ చట్టం క్రింద నీవు నేరం చేసినట్టు సాక్ష్యం అంతా విన్నావుకదా. నీవు చెప్పవలసినది ఏమన్నా వుంటే నిర్భయంగా చెప్పకోవచ్చు–"

ఇందుకూ వెంకటస్వామి ఏమీ మాట్లాడలేదు.

"నీవు ఇలా మౌనంగా వుండటం నేరాన్ని అంగీకరించినట్టు పరిగణింపబడుతుంది. నీవు మనవి చేసుకోలేకపోతే నీ తరఫున వాదించేందుకు ఎవరికైనా వకాల్తా యివ్వు. వాయిదా యిస్తాను–"

మేజస్ట్రేట్ ఇంకా సాయలాపాయలాగానే చెపుతున్నాడు – చిరాకుపడుతున్నా––

"నాకు వకీలెందుకండీ! – నేను వాదించేదేముంది బాబూ – మీ సమక్షంలో నాకు అన్యాయం ఎందుకు జరుగుతుంది? – కేసు తప్పొప్పులన్నీ పరిశీలించి – తప్ప రుజువైతే దండించండి ––" వెంకటస్వామి యిలా అనేటప్పటికీ కోర్టు యావత్తూ ఒక్కుమ్మడిగా తెప్పరిల్లింది – అందరికీ ఎందుచేతనో వల్లమాలిన ధైర్యం వచ్చింది.

మేజస్ట్రేట్ కూడా అతిప్రసన్నంగా "నేను అడిగే ప్రశ్నలకి సమాధానం చెప్ప వెంకటస్వామీ!" అంటూ ప్రశ్నించినట్టు పలుకరించాడు.

వెంకటస్వామి, వినయంగా, తలయొగ్గి – "అలాగే బాబూ – సెలవియ్యండి!" అన్నాడు.

ప్రశ్నలూ జవాబులూ ప్రారంభమైనాయి––

"ఈ సీసాలన్నీ నీవేనా? —"

"అవును!"

"దొంగ సారాయి వ్యాపారం నేరమని నీకు తెలుసును గదా!"

"తెలియకేం బాబూ! – మునుపైనా, ప్రభుత్వానికి చెల్లించే ముడుపు ఎగవేసి దొంగవ్యాపారం చేయడం నేరమే – ఇప్పుడు దొరతనంగానైనా అమ్మడానికి వీల్లేదాయెను!—"

"నీకు ఈ సరుకు ఎక్కడిది?"

"సొంతం బాబూ! – నేనే బట్టీ పెడుతున్నాను. మరొకరికి ఆ వాటం చేతకాదు. మనదగ్గిర ఏసరుకూ నాసిది ఉండదు కదా!—"

విన్నవాళ్ళందరికీ వెంకటస్వామికి తప్పక మతిపోయి ఉండాలని నికరం అయింది ఎన్నడూ ఏ అవకరానికీ పోని మనిషి, ఇప్పుడు ఇందులోకి దిగడమేమిటి? – లోకం పొరజూసి, అనువుగా మెలగనేర్చిన మనిషి, గుంజాటనలేకుండా చేసిన అపరాధం ముక్కుకు సూటిగా ఒప్పేసుకోవడం ఏమిటి? – ఎంత తెలివిమాలినవాడైనా, వెనుకా ముందూ పొలజూడకుండా ఇలాంటివాటికి దిగడే, – దిగినా లక్షకాపులు ఉంచుకుని కంఠంమీదికి తెచ్చుకోకుండా మెలుగుతాడే! – ఇతగాడు ఇలా ఈ ఊబిలో దిగబడిపోయినాడేం!—

ప్రతివాడికీ, తల తీసేసినంత పని అయింది. 'ఇన్నాళ్ళనుంచి, కళ్ళుమూసుకుని నేను మడిగట్టుకున్న వాణ్ణి నమ్మారు కదా, – చూసుకోండి మీ తెలివి ఎలా తెల్లవారిందో!—' అని ప్రతివాణ్ణీ. వెంకటస్వామి కంట్లో వేలుపెట్టి పొడిచినట్లు అనిపించి, ఎవడి తెలివతక్కువకు వాడే మనసులో కత్తి నూరుకున్నాడు కోర్టును కమ్మిన మొత్తంచూపులు రంపకోతగా వెంకటస్వామిని రాచుకుంటున్నాయ్ – అతడు మాత్రం, ఎప్పటి నవ్వే నవ్వుతున్నాడు.

ఆ నవ్వు, – మునుపైతే, మామూలుమర్యాదలో జమ. ఇప్పుడు, – ఇన్నాళ్ళనుంచీ చులాగ్గా అందరినీ వట్టి వెధవాయలక్రింద కట్టి, చలాయించుకుపోయిన దేవాంతకంగా అసలు గుట్టు వెళ్ళబోసుకుంటూంది

కోర్టు ఒక్క నిమిషంసేపు పరమ నిశ్శబ్దంగా ఉంది. మేజస్ట్రేట్ శిక్షవిధించడానికి, – కాగితంమీద పెట్టింది చదవడానికి, గొంతు సవరించుకున్నాడు ప్రాసిక్యూషన్ తతంగం నెగ్గించిన ఇన్స్పెక్టరుకు, జయించామన్న సంతోషమూ, – ఇదే మొదటి కేసూ, పట్టుబడ్డాడు మన వెంకటస్వామి అనే విచారమూ – నవ్వాలో ఉసూరుమనాలో తెలియని తికమకగా ఉంది

"..ఫలానా సెక్షన్, ఇన్నో క్లాజు దాఖలా నీవు నేరము చేసినట్టు రుజువైనందునా,—" మేజస్ట్రేట్ గొంతున పచ్చి వెలగకాయ చిక్కుకున్నట్టు మాటలు కొరబోతున్నాడు

"అయ్యా! – నాదో మనవి ఉంది!" వెంకటస్వామి కాంగ్రెస్‌కు జయ్‌కొట్టే గొంతు ఎత్తాడు. మేజస్ట్రేట్ చేతనున్న దండశాసనం మేజామీదకు ఆన్చి, సులోచనాలు ఎగసన త్రోసుకుని, – యిటుచూసి, – మౌనంగా పరికించాడు – ఇన్స్పెక్టరు, ఉలికిపడి, యాదాలాపంగా లేచి నిలుచుని, ఎదుటి అధికారి కంటబడ్డప్పుడు సలాంకొట్టే సన్నాహమల్లే కాళ్ళు ధట్టించి – అంతలో తెప్పరిల్లి, నిలుచున్నది తాను కాదన్నట్టు

చదికిలపడ్డాడు కోర్టు అంతటా మాటలు స్ఫుటంగా వినరావడం లేదు. కాని, అందరూ కలిసి గబగబా కూడబలుక్కుంటూన్నట్టు చెవికి అందని ఏదో రొదగా వుంది. వెంకటస్వామి మాటలతో, మళ్ళీ మౌనం కమ్మేసుకున్నది

'నేను చేసిన నేరమేమిటో – సెలవిస్తారా?'

కోర్టు యావత్తూ ఆశ్చర్యపడ్డది ఉన్నట్టు ఉండి, అంతా అయిపోయిన తరువాత యిప్పుడు అడ్డుపేచీ గుప్పించాడేం?– ఈ తెలివి, ముందరే ఏమైంది?

'చేసింది చాలక మళ్ళీ ఓట్రిస్తావేం నువ్వు, దొంగసారా అమ్మడంలేదూ?–' మేజస్ట్రేట్ కుటుంబకలహంలో పాల్గొంటూన్నట్టు గొంతు ఎత్తాడు.

'అవి, ఎవరన్నారు బాబూ?'

'రుజువైందిగా!'

'ఎలా బాబూ! – అది సారా అని రుజువెలా?–'

మేజస్ట్రేట్ ఏం మాట్లాడలేదు. ఇన్స్పెక్టరు ఉరికినట్టు లేచి నిలుచున్నాడు.

'అది సారాయే సార్!' అని ఘోషించాడు.

'ఏమిటి నిదర్శనం బాబూ! మాగిన వాసన వస్తూందనా? – కొన్ని చవకరకం సెంట్లు చెడిపోతే – అలాగ్గానే ఉంటాయి బాబూ, మీకుగాని, మేజస్ట్రేట్ వారికిగాని, ఆ సరుకుగుణం కనిపెట్టే అభ్యాసం ఉన్నట్టూ నేను ఎన్నడూ వినలేదు. పాతకాపు కెవరికన్నా పట్టి చూడండి. అవునంటే – నేను అనేది ఏముందీ!'

కోర్టు మొత్తంమీద, త్రాగుతానని ముందుకు వచ్చినవాడు ఒక్కడు లేడు. పోలీసుశాఖ ఊరంతా గాలించి ఎవరినో ఓ తలకుమాసినవాడిని బ్రతిమాలుకుని ఓ గంటసేపటికి హాజరుపెట్టింది. వాడు ఓ సీసా గుటగుటా త్రాగి – 'ఉహుం–ఇది సారా కాదు. ఇంత నిప్పంటి సరుకు కల్తీ లేకుండా నేను పుట్టి బుద్ధెరిగిన తరువాత చూడలేదు – కడుపులో చల్లగా ఉంది. నిదరొస్తుంది–' ఇలా అంటూనే వాడు తూలుతూ తూగుతూ, అక్కడే నిద్రపోయినాడు. బండనిద్రపోతున్నాడు. ఎంత కొట్టుకున్నా లేవడు. వాడిని అలాగే ఆస్పత్రికి పంపించివేశారు.

అది సారా కాకపోతే, – మరో యింగ్లీషు పేరున్న పదార్థం ఏమున్నానా? –అది అలవాటున్న పెద్దమనుషులు గొంతారా పరీక్షచేసి, – ఉండవలసిన సద్గుణములన్నీ ఉన్నాయి కాని – ఇదమిత్థమని మటుకు ఖండితంగా చెప్పలేమన్నారు.

ఇలా కాగా కాగా, చేసేదిలేక, విచారణ వాయిదా వేసి, – మిగిలిన ఒక్క సీసా పరిశోధననిమిత్తం ప్రభుత్వమువారి నిపుణుడికి పట్నం పంపించివేశారు.

వెంకటస్వామిని జామీనుమీద విడుదల చేద్దామా వద్దా అనే ఆలోచనలో ఉంటూండగా మూడోనాటికల్లా పట్నంనుంచి మేజస్ట్రేట్‌కు తంతి వచ్చింది. కేసు కేంద్ర ప్రభుత్వానికి వప్పగించేయడమైందని – కనుక విచారణ యావత్తూ బర్తరఫు చేసి, సదరు నిందితుడిని కఠిన నిర్బంధంలో ఉంచవలసిందనీ – ఎవరితోనూ మాట్లాడనియ్యవద్దనీ––

ఈ ఉత్తరువులు యిక్కడి అధికారులకు ఎవరికీ అర్థం కాలేదు వివరణకోసం పైకి మనవి చేసుకున్నారు – జవాబు లేదు. కాని మూడోనాటికల్లా అటు

# దీక్ష

"కవర్డ్ — యూ..డర్టీ కవర్డ్—"

—కలత నిదురలో వెన్ను చరచినట్లుగా అయి, ఉలిక్కిపడుతూ, పక్కమీదనుంచి క్రిందకు దొర్లి, లేచి కూర్చుని, మూసిన కనులతోనే కలలో మెరసిన దీనపుచూపులను మనసులో తాండవించుకుంటూ మళ్ళా పారాయణకు ఉపక్రమించాడు. కవర్డ్...

అవే!..అవే నీరోడేకన్నులు..అవే పరివేదనతో బ్రతిమాలేచూపులు 'నన్ను మరచి పోకండి' అని, పాలిపోయిన పెదవులమీద, మందారమాలలైన పలుకులు. కనుమూసినప్పటినుంచీ అదే కల!

తెలుసును....ఉభయలకున్నూ, ఈ జన్మకు తిరిగి కలుసుకోవడం వుండదేమోనని తెలుసును... అశుభసూచనలతో గుండె వుండివుండి ఝల్లుమంటూంది మరునాడు ఉదయం బయలుదేరుతుందనగా.. తెల్లవార్లూ, బాల, మంచాన్ని ఆనుకుని కటిక నేలమీద కూర్చుని. 'నన్ను పంపమోకండీ! నాకేమో భయంగా, తగనిదిగులుగా ఉంది; ఏమైనాసరే, మీ దగ్గరనుంచి పంపేయకండి' అని ఎంత వేడుకుంది. బండి ఎక్కేటప్పుడు.. ఎలా విలపించింది. .కడసారి ..ఏలా చూసింది!

ధైర్యంచేసి...తండ్రిమాటకు ఎదురు ఆడి భార్యను పంపకుండా నిలుపుకునే సాహసం, అప్పుడు లేకపోయింది! తరువాత. ఎన్నిసార్లు ప్రయాణమైనా ఆయన అనుగ్రహించి పైసారాల్చందే...ఎక్కడికి కదలడం? ..ఉత్తరం వ్రాయడానికి అణాడబ్బులకు గతిలేనివాడికి...ఊరి ప్రయాణానికి..

చివరకు...జబ్బుచేసిందని, టెలిగ్రాం వచ్చినా, అప్పుడయినా, ఆ ధన—కిరాతుడి గుండె కరగిందా? డబ్బేప్రాణం. పాతబాకీ వసూలుచేసుకోవడం ముఖ్యం కాని ప్రాణం ఎక్కువా? —పోయిందని. సుఖప్రసవం కాలేక, ఎంతో కష్టపడిపోయిందని తెలిసిన తరువాత కూడా, ఏమనుకున్నాడు.. చీలికలు వాలికలైన పాతపంచ పారేసేటప్పుడు పడే బాధంతయినా ఆయనకు లేకపోయిందే? . కోడలు పోయిందనికాదు ఇక వియ్యాలవారిదగ్గరనుంచి డబ్బుగుంజడానికి వీలులేకుండాపోయిందని .విచారం!

కిరాతుడు...ఆయనకడుపున పుట్టికూడా ఆ బండతనం మనసు — రాయి — తనం, తనకు ఎందుకు అబ్బిందికాదు? వెధవడబ్బుకోసం .ఆయన, ఎన్ని ప్రాణాలైనా దిగదుడిచి బలివేస్తాడే.. ప్రాణానికి ప్రాణమైన— బాలను కాపాడుకునేందుకు... ఆ తండ్రికి కొడుకు...తానేం చేయగలిగాడు?..ఏమీ చేతకాని. తెగతెంపులు లేని . కవర్డ్

ఎల్లకాలమూ, అలా పరాన్నభోజనం చేస్తూ...భూభారం వృద్ధిచేస్తూ .కన్నవారి వంటయింటి కుందేలుగా...జీవనం చేసేవాడేమో? కాని గొర్రెను మేపి మేపి, కసాయివాడికి అప్పజెప్పకుండా ఊరుకునే కరుణాళువా ఆ తండ్రి! పుట్టగానే,

తల్లికరవైన, ఆ పసిపాపసంగతి యిక తలచుకూడదూ?. మళ్ళా కొత్తపెళ్ళికొడుకు కావాలీ?–

అయేవాడేమో –– ఏమో, తండ్రిమాటను. కాదనే నిబ్బరం ఎక్కడ ఏడ్చింది? కాని. ఆమె కన్నులు . బాల చివరసారి చూసిన చూపు...

ఎదిరించి ఆ పంచక్రింద ఒక క్షణం నిలువలేదు .. తండ్రి చిట్టెడుపుప్పు పోదక్కనియ్యడు .. పోట్లాడుతూనే... అక్కడనే వుండగల తాహతు.. తనపిల్లను తెచ్చి పెంచుకుంటూ . తనకు రావలసినదేమో నిలవేసి గుంజుకుని.. ఆ యింటిపట్టునే ..ఆ పోరులోనే కాలక్షేపం చేయగల తాహతు లేదు

కట్టుబట్టలతో .ఎవరితోనూ చెప్పకుండా, ఎక్కడికి వెళ్ళుతూన్నదీ తెలియనీకుండా.. చేత కానీలేకుండా. .నానాబాధలూపడి, పట్నం చేరుకుని... తిండికి మాడి, తలదాచుకునే చోటులేక, ఆదరించే దిక్కులేక, మలమల మాడిపోయి, ఇన్నాళ్ళకు, ఓపూట కడుపునిండే కొలువుకు కుదిరి. కాలం ఏలాగో గడుపుకుంటున్నాడు.

సుఖపడాలని కోరికలేదు అంతకన్న మంచి ఉద్యోగం...వుండటానికి వసతీ దొరకాలనీ విద్యకు తగినలాభ్యకలగాలనీ ఆపేక్ష లేదు. అవకతవక జీవితంవల్ల పడినకష్టాలు .మరచిపోవాలనీ లేదు

కవర్డ్––

నమ్మిన అమాయకురాలిని రక్షించుకోలేకపోయినాడు వెళ్ళకపోతే, బ్రతికేదేమో! రమ్మని ఎన్ని ఉత్తరాలు వ్రాసినా, తండ్రికి ఝడిసి, వెళ్ళి చూడనన్నా లేకపోయినాడు. తండ్రి కారాలూ మిరియాలు నూరుతాడని కరువుదీర ఏడువనన్నా లేకపోయినాడు...ఆ యింట్లో––కవర్డ్ – ఎందుకు వచ్చిన ఏళ్ళు . ఎందుకువచ్చిన చదువు...

ఇక్కడ ఒక సుఖం. .తండ్రిభయం లేదు.. ఎప్పుడూ బాలను తలచుకోవచ్చును.. కలలో .ఆమె చూపులు మననం చేసుకుంటూ దద్దరిల్లిపోవచ్చును.

ఎవరితోనూ స్నేహంలేదు. ఏ జోక్యానికీ పోవడంలేదు. అనుభవంవల్ల పరిపాటి అయిపోయి.. మరపువచ్చి నప్పుడల్లా...బాలచూపులు మెలకువతెప్పించాలి...కవర్డ్–అని జ్ఞాపకం చేయాలి!

––మనసులో కణకణలాడుతూన్న అధీర భారంతో కళ్ళు జేగురుముద్దలైపోయినవి. ములుగర్రతో పొడిచినట్టు శీతాకాలం సూర్యకిరణాలు...తలుపులూడిపోయిన కిటికీ గుండా చొరుచుకువచ్చి రెప్పలమీద కుమ్ముతూన్నవి. అల్లార్చి .చూపు తెమల్చుకుని.. అరచేతులతో కనులద్దుకుని .. కర్మసాక్షికి అంజలిపట్టి, పక్కను మోచేతుల మీద ఆనిన ఊపులో లేచి నిలుచుని...లుంగీ బంధించుకుని.. లోకంలోకి దిగిపోయినాడు.

స్టవ్ రగిల్చి...స్నానం అదీ చేసి వచ్చేశాడు పాలు అందుకుని...కాఫీచేసుకు త్రాగి.. సిగరెట్ కోసం వెదికి...ఖాళీపెట్టెను మూలకు విసిరికొట్టి... దిగివెళ్ళి తెచ్చుకునేందుకు ఓపిక చాలక రాత్రి చూడటం మరచిపోయిన పత్రిక చేతపుచ్చుకుని తిరగవేస్తూ...కుర్చీలో జార్లపడినాడు. తిరగపడి, ఒళ్లో పరచుకుపోయిన 'హిందూ' వెనకపీటి అంతా. .మోపెడేసి పూలదండలతో, భుజాలు రాచుకుంటూ ఎగుడు

దిగుడుగా నిలుచున్న...నూతన దంపతులమయం అవి, కళ్ళకు ముళ్ళులాగా గుచ్చుకోగా, పేజీ, గొగ్గిఅంచు గుప్పెటలో పట్టి..చీల్చేస్తూ...అలాటి ప్రచురానందం... గడ్డకట్టుకు పోయిన తనగుండెల్లో త్రెళ్ళించిన అసహ్యా—వేదనా—ఉన్మాదానికి...తెప్పరిల్లిన మన సులో మెరుపులాగా...నవ్వు తెచ్చుకున్నాడు...ఆలోచనలమీదుగా.. దండలు ఎడాపెడా వేసుకుని, బొమ్మముఖంలో, నందనవనీ విహారసుఖం చిందించుకునే...వివాహ ——వీరుడు...తరువాత...జీవితం, ఏ కారణంవల్ల...ఏలా దగ్ధమైపోయినా...ఆ కుములు ధైర్యంగా లోకానికి...ప్రకటించలేడేం? అవును. ఒళ్ళంతా సంసారం. ముళ్ళుగా గుచ్చుకుపోయిన మీదట చెంపల్లో, కావాలని తెచ్చిపెట్టుకునే రోజా రేకల మెరమెచ్చు లెలా నిలుస్తవి? అదంతా... కలలు కలలని తెలుసుకోనీయని ..పీడకల...

—ఇంకా కల అనుకుంటూనే ఉన్నాడు...ఎదురుగుండా.. తనహోదాకు తగిన యిగి లింపుతో...తన పైఅధికారి...అయనపక్కను...చేత పూలకొన్కతో సిగ్గుదిగ్రమింగుకు నేకళ్లు, ఓరచూపులకు మళ్ళించే. ..అయన కూతురు...

మూకాభినయంలో...భావప్రకటనం...అతనిమీద అంతసేపటినుంచీ పనిచేయకపోవ డంవల్ల...సకిలింపు మోతాదు పెద్దదిచేసి...'హలో' అని అతడు తెలివితెచ్చుకుని ఉచిత మర్యాదచేసేలోపుగా... స్థూలకాయం...ఉన్న ఖాళీకుర్చీలో దించేశాడు.

అతడు లేచి నిలుచుండగానే...ఆ అమ్మాయి పూలు దోయిలించి...అర్పించేభంగి మంలో అందించింది... వాటిని, మర్యాదగా మేజామీదకు...గుప్పిటవిడిచి...అయనజాపిన సిగరెట్ ఆప్యాయంగా...తీసుకున్నాడు.

ఒకదమ్ము...అతడికళ్ళల్లో...వాళ్ళు అప్పుడు అలా దయచేయడం ఎందుకా అనే ఆశ్చర్యం ఊదినవి: ఆయన చూపులు ఆ రాకకు భారతగాధ అంత వెనుక అండ ఉన్నదనే...గాంభీర్యం తట్టించినవి.

రెండోదమ్ము.. అతడికవళికలో...ముదిరిపోతూన్న...అర్థం—కాని—తనం: ఆయన మౌనంలో...ఇక నోరు విప్పవలెననే. .ఆలోచన...నిశ్చయం:

—కాడలాగా పేరుకున్నకొడి, కుర్చీ చేతికి చూపెట్టి...రాలుస్తూ. .అయన తెలివి తేటలుగా...

"వీరపూజ...చేయడానికి వచ్చాం" అని మీసాలు సర్దుకున్నాడు.

"ప్రాణదానం చేసినందుకు..." వాక్యం సగంలో వీణె ముక్తాయించినట్టూ...చిరు నవ్వు...చూపులకు అంది పుచ్చుకోనిచ్చింది...

అలా తెల్లబోతూ...తండ్రిముఖంమీదనుంచి...కూతురివంకకు చూపు తిప్పుకుని... అప్పుడు పోల్చుకుని...అంతటితో ఆ నాటకం అర్థంఅయి. .బిగ్గరగా నవ్వుతూ...

"చేయి పట్టుకుని...అంత మోటగా లాగినందుకు దండించడానికి...మీ తండ్రిగారిని తీసుకురావాలిసింది కాని... ఈ పూలపూజ లేమిటి?..."అని చల్లనిగాలి చిగురించిన కొంటెతనం ఆమెమీదికి విసిరాడు.

"అంతకన్న ఏం చేయగలం?...నీవు దేవుడులాగా...తోడుపడి రక్షించకపోతే, అమ్మాయి అక్కునా – అక్కునా కారుక్రింద పడిపోయేదేనా...ఏం ప్రత్యుపకారం చేసి నీ రుణం తీర్చుగోలను..."అని ఆయన...ప్రాధేయపు—జవాబు.

"నేను ఆ సంగతే మరచిపోయినాను...మీ అమ్మాయిని.. మీ మాటలధోరణివల్ల

పోట్లాడమేకాని . ఒంటరిగా కనపడితే గుర్తుపట్టలేకపోయేవాడినే. అయినా ఏం ఘనకార్యం అని మనిషైనవాడు ఆమాత్రం..."

"ఊఁ. ఏదీ ఒక్కడిని చూపించు, ఎవడికివాడు తన పుచ్చె కాచుకోవడమేకాని . ప్రాణానికి తెగించి ."

"తెగించడాని కేముందీ?"

"ఇలా తేల్చేయడం.. నీ వీరహృదయానికి. వినయానికి లక్షణం."

"నన్ను పొగడకండి."

"పొగడటమా? కృతజ్ఞతను. తెలుపుకోవడం."

"అర్థమైందా?"

"కాదనడం. నీతరమా?"

.. కోటీ ఎక్కడమేతప్ప.. మాటల ప్రయోజనం కనిపించనందువల్ల.. వాళ్ళను కరువుదీరా అభినందించనిచ్చి...సాగనంపి. .తలుపుగడియ బిగించి. నిట్టూర్పు సగం విడువకముందే, మళ్ళా ఎవరో వచ్చినట్టు. తలుపు ధణల్ మంది: తీయగా . బొమ్మతీసి పత్రికలకు అమ్ముకునే అయ్యర్.

అంతసేపూ—మర్యాదకోసం అరికాలిక్రింద అణచిపెట్టినమంట ఒక్కమారు నెత్తికి ఎగదట్టింది: రెండుచేతులతో ఆగంతుకుడి రెండు చెవులూ పట్టుకుని. వెను కకు త్రిప్పి ..'ఇక్కడనుంచి మీ ఆఫీసుదాకా. ఎన్ని అడుగులో లెక్కపెట్టుకుంటూ వెళ్ళి మొత్తం ఎంతో ఉత్తరం వ్రాయి మెడ మెదిల్చావా.. మళ్ళా అడుగు వెనక్కు వేశావా.. నీ ఊపిరి తీశాననుకో..' అని ఖంగ్ మనేటట్టుగా ఉరిమి మేడ అదిరేటట్టు తలుపువేసుకున్నాడు. .వెంటనే కుర్చీలోపడి–విషం త్రేణుపులుగా .నవ్వు నురగలు గ్రక్కుతున్నాడు . 'వీరుడు'.. ఓహో

ఉదయాన్నే ఎత్తుకున్న మైకం. ఎండకాస్తూన్నంతసేపూ .తరగనేలేదు: నాలుగు గంటలు దాటినతరువాత.. భోజనం చేయలేదన్న సంగతి జ్ఞాపకంవచ్చి...నిలిచిపోయి. .హో టలుకు పోయి .. ఆత్మారాధాన సుష్టుగా చేసుకుని కాఫీకమ్మదనానికి. .నిలువెల్లాకమ్ము కుంటూన్న ఖులాసాలో... గుమ్మం దిగగానే ఆ అమ్మాయి. కారులో ఎదురుగా ఉంది చూసి గిరుక్కున పాన్‌షాపులో కల్పించుకుని...జనసమూహంలో కలిసిపోదామని చూశాడు కాని .'ఆమెను ఇప్పుడు ఏమరించడం నీతరము కా'దని మనసు నచ్చచెప్పినందువల్ల ..పళ్ళుబిగివిని...సమీపించాడు. డ్రైవర్ తలుపు తీసి ఉంచాడు ఆమె చేయి చాచి మనసుతో. .లోపలికి లాగేసింది ..

బాణవేగంతో...ఎన్నేరు చేరుకుంది కారు. కుదిలింపులకుకూడా ..చలించకుండా .. వీసపాలైనా శరీరాన్ని జరగనీయకుండా. .కూర్చున్నాడు. ఇసుక గుట్టలుగా పేరుకున్న చోటికి. .ఇద్దరూ... మౌనంతో...నడచిపోయినారు

'మూగనోము ..మూకన్న మగవాళ్ళుపడితేనే, ముచ్చటగా ఉంటుందిలాగుంది' అని స్వగతానికి ప్రకాశం యిచ్చింది. అతడు వంచినతల ఎత్తిచూసి ఊరుకున్నాడు ఎన్నో మాటలు చెప్పింది... ఎన్నో రకాలుగా కిలకిలలాడింది· ఎన్నో విధాల నోరూరించాలని.. సిగ్గుగా. .నిర్భయంగా .. ప్రయత్నించింది...మౌనాన్ని ఇక సహించలేని చొరవలో ..మీదకు వాలింది.

——హుంకరించాడు..మెడకు చేతులు మెలివేసింది విడిపించుకోబోయినాడు. ముఖానికీ, ముఖానికీ తేనెచినుకంత ఎడమన్నాలేదు విదిలించుకుంటేనేగాని. వీడి ఈవలపడలేదు

"ఒళ్లు మరచిపోకు." అతనికళ్ళు ..ఎక్కడో చూస్తున్నవి మంటల్లో

'పోను కాని, మిమ్మల్ని మరవలేను.'

'నీవు ..ఎవరు?'

'విడదీసుకున్న —— మీ కౌగిలి నడగండి'

'వెఱ్ఱిదానా!'

'అలా చేసింది...మీరే'

'నేను చేసినదేమిటో నీ కేం తెలుసు..'

——ఒక దమ్ములో...తన పూర్వగాథకు, ఆమెమనసు విరిగేటంత విషపుపూత పూసి .భార్యను మ్రింగివేసిన పరమకిరాతుణ్ణి అని నమ్మించాలని ప్రయత్నంచేశాడు· ఆమె...పెదవులు వడకుతూండగా...విని. విని కన్నీరు రెప్పలతో అప్పళించుకుని. చాలా జాలిగా,

'ఎంత బాధపడ్డారండీ?'...అంది మారనిమనసుతో

'బాధ..పెట్టాను.'

'నేను. నమ్మను'

'పోనీ'

'...పోనీయను'

——ఆ రంపకోతభరించలేక...నిబ్బరంగా .సంభాషణ చంద్రోదయంమీదికి త్రిప్పి ప్రొద్దుపోతూన్నదని జ్ఞాపకం తెప్పించి, ఆమె ఎటు అనుకునేందుకూ పాలుపోనీకుండా యింటికి మళ్ళించాడు: కారు పరుగుతీస్తూన్నంతసేపూ, ఎలాగా ఇంకా రంధి పెరగనీక తప్పించుకోవడం అనే ఆలోచనలో పరధ్యానంగా ఉండి, ఊళ్ళోకి రాగానే...దోవపోయే ఎవడి వంకనో..స్నేహితుడని చూపిస్తూ .అతనితో పని ఉందని.. ఆగేలోపల క్రిందికి దుమికేసి...మందిలో కలిసిపోయి యింటికి చేరుకున్నాడు

అలవాటు ప్రకారం పేపరు కొని పట్టుకుతెచ్చుకోవడం మరచిపోలేదని అప్పటికి స్పృహ తెలిసి. పేజీ తిరగవేయగానే. కొట్టొచ్చే అక్షరాల్లో..తను చేసిన ఘనకార్యం ప్రశంస ..ఆఫీసుగ్రూప్‌లోనుంచి.. సంగ్రహించిన...తన బొమ్మ!

అంతవరకూ చించి ఆ పేలికతో సిగరెట్ ముట్టించుకుని...జారవిడిస్తే నిశ్శేషం కాదేమోనని. వేళ్ళు కాలేదాకా...రేజా మిగలకుండా. నుసి కంటచూసి విడిచాడు.

——క్రిందపడివున్న కవరు చించి చూశాడు· దానిలో 'మేము తెలుగులో మొదటి స్టంట్‌పిక్చర్ తీయ సంకల్పించాము అందుకు, మీలాటి వీరులు, మాతో కలిసి పనిచేయడానికి అంగీకరించితే – ఇక అపై అక్షరం చూడకుండా .నలిపేశాడు. వరాలు ఇవ్వడానికి చేతగాని దేవతలు.. వంచనలకు మాత్రం ముందంజ. కళ్లుమూసుకుపోయినలోకం ..ఏపాట పాడినా..'బాల' తనకళ్ళల్లో మెదులుతూంటే చాలును...గుండె చిఱెం కరగకుండా నిలవడానికి.

రెండు రోజులు గడిచినవి. ఆఫీసునుంచి.. ఎందుకు రాలేదో అని కనుక్కొని పోవడానికి వచ్చిన జవానుచేతికి రిజైన్ చేసినట్టు వ్రాసియిచ్చి పంపేశాడు. ఆ అమ్మాయి.. రెండుమూడుసార్లు వచ్చి.. చనవుచేసుకోవాలని...మీద మీదకు వస్తే... ఆమెకూరిమినంతా...దూదిపింజెలాగా ఎగరగొట్టాడు.. కాని, మనసు మార్చుకోదని తెలుసు...తన మనసు ఈ జన్మకు సుఖలాలనలలోకి మారకూడదని... తెలుసు..ఇక చేయవలసింది?

ఒంట్లో త్రాణ లేకపోయినా...ధూకుడుగా..దిగి, వీధిలోకి వచ్చి...వచ్చే ట్రాం ముందర...

కళ్ళకు కమ్మినచీకటి విడిపోయేటప్పటికి...డైనమోరూమ్‌లాగా ఉన్నతల.. తలగడల మీద నిలువలేకుండా ఉంది చీకటిచారికలలోనుంచి...ఆ అమ్మాయి ముఖం...ఆదుర్దా ఓడుతూ...గోడమీది కేలెండరులో... అవాళటికి...పదోనాటితేదీ...కొట్టొచ్చినట్టు...

పోలీసు జరీచారల తలపాగా రాయడికంఠం...'మీ సాహసానికి ధన్యవాదాలు...మీరలా ప్రాణానికి తెగించి...ట్రామ్‌కు అడ్డపడకపోతే...ఆ ఖూనీదారు తప్పించుకునేవాడే—'

పట్టుతప్పి పడివున్న దేహం..మనసును ఆ వీరకళంకం తమాయించుకో మని... హెచ్చరించినట్లై త్రుళ్ళిపడటంలో కుట్టు చెదిరి.. పిగిలి...నల్లనికాలువ...మొగం కమ్ముకుంటూంది. బాధను గుర్తించడానికి తడుముకునేచేయి కళ్ళకు నెత్తురుపూసింది. చుట్టుప్రక్కల గడబిడ...మళ్ళా చీకటి.

చీకటిలో...వెన్నెల గూటిలో..నేరం మరచిపోయి.. చిరునవ్వే..బాల..చిక్కిశల్యమై... బాధలు కరగించిన రూపం . విరిసిపోతూ.. మెదడుకు.. అమృతస్నానంతో... తాపంఆర్పేసి..

—తలపులో వెన్నెల వెలుగు కన్నులలోకి..జీవచైతన్యజ్యోతిగా తరలించుకుంటూ రెప్పలు ఆర్పడంలో... నెలమారిన తేదీల గడులుకాగితం..'గడచిన నెలను కాలంలోకి తోసేశాను..ఇప్పుడు నీకు కావలసింది...నేను' అన్నట్టు కొత్తనెత్తురు రంగు అంకెలతో..గాలికి .రెపరెపలాడుతూ.. ఆకర్షించిన చూపు . వాలుకోవడం...ఉద్రేకం నిరంతర సేవాజాగరణంలో చివికి .దోహదమైపోగా లేదీగె సాగిన . ప్రేమవల్లరి పోలికల కళ్ళతో. కాచుకుని ఉన్న..ఆ అమ్మాయి కవళికలో ఏకమూర్తిగా . పెనవేసుకుపోతూ బాల .అందుబాటుచేసి...తా నందనిదై పోవడం

గుండె సారించే ..కవర్డ్...శైవసామ్యాన. కంఠగతంగా కుదించుకుని.. పరీక్షాధికారి... ప్రత్యేకం పగబట్టి ఫెయిల్ చేశాడని తెలుసుకున్నప్పుడు... క్షాత్రంలో బడి చదువు మానివేసి . పంతం విద్యాస్పర్ధతో చెల్లించుకోవాలనుకునే ఫస్టుబాయ్‌లాగా...పై అంతస్తుకు.. ఉద్ధరించుకోవాలని...

—నరబలం మిగిలిపోయినచేయి...ఆమెవైపుకు...సాగనిచ్చాడు ..గుప్‌మన్న దీపం మెఱుపున. అతని కనుగొలుకుల్లో కుదురుకున్న.. నీటిబిందువులతొణికిసకు. చేతికి చేయి కౌగిలిగా యిచ్చి వీరగంధానులేపనంగా పులకలైపోతూన్న..ఆ అమ్మాయిలో... సుమంగళ—కెశికి జలదరించింది

★ ★ ★

# గుణసంధి

అ–ను–బంధం అని, బిగ్గరగా పణుక్కుంటున్నట్లు గొణుగుతున్నాడు నేస్తం

ఆ ఊరివాడిని కాబట్టి, అభిమానం కొద్దీ. 'కృష్ణాపత్రిక సారస్వతానుబంధం' అని నేను కలగంటున్నట్టు అర్థం చేసుకున్నాను

'కాదోయీ..ఋణానుబంధం..' ఇదీ వాడి సొద

"ఎక్కడో–ఏకడనో, పట్టిల్లోపుట్టి – పెరిగిన బందరులో, పద్దువ్రాసి కొనుక్కున్న ఉత్తరీయం, అలహాబాదులో ఆ చలిలో గజగజలాడే ముసలిబడుగు అవస్థకు గుండె కరగి...రైలు కదులుతూండగా అలా కిటికీలోంచి గిరేవాటువేశాను... ఎక్కడికెక్కడో చూశావా..యింతకూ అది వాడికి ప్రాప్తం .

ఇత్యాదయః..

అవును–భాయీ–గా తల ఊగించుతూ, దానబ్బగా, నా కథ అల్లాను...

"దోవవెంట పోతూవుంటే. కానీ దొరికింది కానీ దొరికితే, కలిసివస్తుందని నానుడి. కానీ చూద్దాం.. పార్కు మలుపులో కానీ–కానీ లాటరీ పరుచుకు కూర్చుంటే, బిళ్లేరీ అద్దంమీద దాన్ని కాచాను; కాచి–కాచి, కలకాలం ఉసూరుమనేట్టు, అర్ధరూపాయి, వాడిదగ్గర దోచాను

(చెప్పడం మరచిపోయినట్లున్నాను–యిందాకటినుంచీ ఇదంతా జరుగుతూన్నది... ఎక్కడోకాదు, మన బెజవాడలో.)

అప్పటికి రెండున్నర అయింది. మధ్యాహ్నం. ఆదివారం పగలుసినిమాకు ఆ కాస్త ఖర్చు పెట్టేస్తే .ఆ దోషం అంతటితో తీరిపోతుందనుకున్నాను

కాఫీ–గీఫీ.. కాసిని సిగరెట్లూ .అనుకోనిచ్చే తరగతికి డబ్బులు మిగుల్చుకుంటే చాలు.

. త్రోవలో ఆడుతూ–పాడుతూ నేను అక్కడికి చేరుకునేటప్పటికే ఆట మొదలు వేశారు.

అవాళా యింకా, విప్రనారాయణే! అదివరకు దాన్ని కచ్చా – పచ్చాగా అయిదారుసార్లు, సగం– సగం చూశాను అరవచింతామణేమోకదా అనుకొని పరుగెత్తాను సుమా... తారీఖుతడిసి సిసలుగా కనబడటంలేదు (అది రేపటినుంచి) – అన్నాడు, కన్నంఅవతలవాడు

ఇవతల నేనుతప్ప ఇంకో పిట్ట మిగలలేదు. యింతలో, వాన తగులుకున్నది.

ఆడవాళ్ళ గేటుమీద అర్చితప్ప .ఆ బారు–బారునా, ఎక్కడా అచ్ఛాదన లేదు...అక్కడే నక్కాను

నాపక్కను, ఓ కుర్రవాడు, చిరుగుల బనీనంతా తడిసి ముద్దయి, తలుపు రెక్కనానుకొని యీదురుకు గజ–గజలాడుతున్నాడు.

గేటులో ఉండే రకమేమో అనుకున్నాను కాదన్నాడు చేసోడే బాపతేమో అనుకున్నాను; ఉహూ అన్నాడు. అన్నా, వాళ్ళూ అందరూ ముందు లోపలికి వెళ్ళిపోతే, తాను ఒక్కడూ వెనకపడి మిగిలిపోయినా నన్నాడు ఎల్లా లోపలికిపోవడం? డబ్బులు వాళ్ళదగ్గిర వున్నాయి. టిక్కెట్టు లేనిదే గేటుదగ్గిర, లోపలికి పోనీయరు ఎల్లా లోపలికి వెళ్ళడం? ..

అవును పాపం, టిక్కెట్టు లేకుండా లోపలికి పోలేడు

ఆ కాసిని డబ్బులూ పెట్టి టిక్కెట్టుకొని, అది వాడి చేతులో పెట్టి, ఉడాయించమన్నాను. అంత వానలోనూ తడుస్తూ నేను యింటికి వచ్చాను

చూడు ఎక్కడి కెక్కడ?...

ఎవరో పసివాడో పెద్దవాడో. పారేసుకున్న కానీ..

ఎందరి కాన్లో దులిపి నాకు కట్టబెట్టాడు, లాటరీవాడు

నేను అది మూటకట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి ..హస్తార్పితంగా అందులో కొంత. ఆ పసివాడిపరంగా దరిసించాను ఎక్కడి కెక్కడ?. "

—'ఆ కుర్రవాడి మాటలన్నీ నిజమని నమ్మావ్?'

'లేదోయ్ అవన్నీ అబద్ధాలని వాడి మొఖమే అంటూంది'

'అయితే, మరి '

...వాడు అనుకోని పని మనం చేస్తే .ఆ హాయికి ఖరీదులేదు"

..'వానలో తడవకపోతే, వెలిసేదాకా ఆగితే ఏం ముంచుకుపోయిందో .?'— అంతా విన్నతరువాత యీ సందేహం రాకతప్పదు

'ఏమో, అప్పు డలా తోచిందికాదు'

'అవునులే అంతటి ఘనకార్యం చేసినప్పుడు...అమాత్రం ఆవేశం..అపాటి ఒళ్ళు తెలియకపోవడం లేకపోతే, ఎల్లా? ఆ హుషారులో. ఆకాశంమీద నడిచావనుకుంటాను!. .ఏం?'

ఉహూ. అడుగుతీసి అడుగు వేయలేకపోయినాను; అందుకే తడిసి ముప్పందుమైంది!

'ఎందుచేతనో?...'

'ఆఁ. ముక్తసరిగా టిక్కెట్టు మాత్రమే కొని యిచ్చాను కాని..పైనో అర్ధణా అణా కొనుక్కు తినమని యిచ్చేపాటి తెలివీ, తెగువా లేకపోయింది కదా యీ ఆలోచన పోయేప్పటికల్లా, నామీద నాకే ఎంత అసహ్యం వేసిందనుకున్నావ్!'

'ఔనులే పాపం నీ ఔదార్యం ఎవరెరుగలు? కాని నీ జేబు ఆ తరుణంలో పూర్తిగా ఖాళీ అన్నసంగతి. .నీకు గుర్తులేకపోయినా ..మేము గ్రహించుగోగలము. .'

'ఛస్ .నీ విషపు ఆలోచనతో కథ కాస్తా చెడిపోయింది...'

'కాదోయ్...ఇది కథే అయితే ఓ కొలిక్కి వచ్చి పకడ్‌గా రక్తికట్టింది ..'

(సాగదీసిన కొద్దీ...బిగిసి పీటముడి పడుతుంది.. ఇద్దరమూ కథల కామరాజులమే...)

★ ★ ★

# మత్తకోకిల

ఆ అమ్మాయి, రోజూ సరిగా అదేవేళకు అక్కడకు వస్తుంది గోదావరి అలలమీద గాలిబంతులులాగా ఎగరేసుకుంటూ వెన్నెల చారికలు చీకటిదొంతరలను తరమడం మొదలుపెట్టగానే, మోడైపోయిన చెట్టు, ఉగ్గంవేరుమీదనుంచి, మోపినతల ఎత్తి, నేలను ఆసరాతీసుకుని లేచి, వంతెనమీదనుంచి వచ్చే రైలు పొల్లుకూతలో కలిపి, ఇగుర్చుకుపోయిన గుండెలు విచ్చేటంత కేకపెట్టి, బావురుమనడం, ఇంటిగుమ్మం ఎక్కేలోపల సముదాయించుకుంటుంది. పవలల్లా ఇంటినిపడి వేయి వెర్రులు ఎత్తినదానిలాగా తిరుగుతుంది మౌనంగా సమాధిలో పడిపోయినట్టు సాలభంజికలాగా వ్రాలిపోతుంది. మూసినకన్ను సూర్యుడు క్రుంకుతూండగా ఏనుగంత సత్తువతో .గోదావరిగట్టుకు .ఎండిన మ్రాని మొదలుకు..

ఎందుకు వెళుతుందో తెలియదు ఏమి కావాలి? ఏం హాయి అనుభవించాలి? --- ఆమెకు కావలసినవాళ్ళే అర్థం తెములుచ్చుకోలేక ఆ ప్రశ్నలు వేసుకోవడం మానుకున్నారు. ఎక్కడకు వెళుతుందో, ఎప్పుడు వస్తుందో, గమనించరు. ఏమీ అనరు కలకలలాడే ముఖాలతో కాని, అవసరంవచ్చినపుడన్నా పలుకరించరు

ఆమె మానాన ఆమె బ్రతికి బాగుంటే చాలు. ఇష్టంవచ్చినట్టుగా ఉండటానికి ఎవరూ ఏ అభ్యంతరమూ చెప్పరు. కానిపనేమీ చేస్తూన్నదనికాదు వాళ్ళవాళ్ళ ఆవేదన. ఎంతటి అకృత్యమైనా చేసి, ఆమె మళ్ళా బాహ్యస్మృతి తెప్పించుకుంటే, అదే చాలు.

పడుచుపిల్ల .నోరూరించగల వయసులోఉన్న సంపన్నులపడుచు ఒంటరిగా వేళగాని వేళ, దొరికినప్పుడు, ఎంత సౌమ్యుడికైనా, నాడి కదను త్రొక్కుతుంది. ఒకరిద్దరు, మీదుగా రాచుకుపోవడం, చేతికి చేయికలిపి నిలవేయడం--- ఇలాటి సన్నాహాలు చేసి చూశారు కాని, దారుమూర్తిలాగా స్పర్శను గమనించకుండా అడుగు నిలపకుండా, ఏ విధమైన ఖంగారూ లేకుండా పోయే అమ్మాయి. ప్రాణంమీద ఆశ ఉన్నవాడెవడూ, ఆమె జోలికిరావడం మానివేయడంలో ఆశ్చర్యం ఏమీలేదు

'ఎవరమ్మా నీవు?' – ఎంతమంది ఎన్ని చోట్ల ఎన్ని వేళల్లో ఆ ప్రశ్న ఎన్ని గొంతులతో అడిగారు? చెవికెక్కిందా? ఇదీ వానిలోనే జమ.

'ఎవ రా కూర్చున్నది?'--- రెండోనాడు ప్రశ్నలో క్రమం మారింది కాని, ఆమెవాలకం అంతమాత్రాన వినపడలేదు.

'ఎవరంటే. .మాట్లాడవేం?'– రెండు రోజులనుంచీ ఓపికగా చూస్తున్నాడు, ఆ షికారీ. లంకలలోకి పిట్టలవేటకు తెప్ప వేసుకు వెళ్ళి ఆకాశం ఎర్రపడినతర్వాత నీటి వాలున ఒడ్డుకుచేర్చి వెన్నెల వచ్చేదాకా తెడ్డుతో అలలు రేపుతూ, అనంతంలోకి చూస్తూ కూర్చుని ఉంటాడు ఆ వయసుకాడు. ఎగువను గట్టుమీద పడుచు మెసలడం

సడికట్టాడు. పలుకరింపులు వినిపించుకోకపోవడం మూలాన ఎవరో జగజంతకదా అని ఏనాటి కానాడు, నావలో అడుగు కారులో పెట్టేటప్పటికే మరచిపోయేవాడు. ఒకనాడు, రెన్నాళ్ళు ఇక కథ కొంచెం ముదరనిద్దామనే ఉత్సాహం వేసింది దగ్గరకు వెళ్ళాడు. వెన్నెల విచ్చగానే, చంద్రబింబంకన్న మెరిసింది ఆమె ముఖం. సూదివార ఎడంలేకుండా పూసుకుని నిలుచున్నాడు ఆమె చలించలేదు. వల్లమాలిన చొరవచేసి, పెదవి ఎంగిలి చేశాడు. ముదురుపాకం హల్వాముక్కలాగా అధరం పలుమొనకు ఎదురుతిరిగి గంటును కోరుకుంది చురుకుకు, ఆమె కళ్ళల్లోకి జీవం కమ్ముకువచ్చింది చేరలకు మీరిపోయినది అతనిమీదుగా గోదావరిలోకి చూసింది.

'రావూ అలలలోనుంచి ఇంకా లేచి రావేం?'

అతనికి అర్థంకాలేదు. తన భయం మాపుకునేందుకు ఆమెను సందిటపట్టుకున్నాడు.

'నీలాగే నేనూ మునిగిపోతున్నాను.'

ఈ కేకలతో, ఆ సాహసికి వణుకుపుట్టుకువచ్చింది కాని గంద్రగోళంగా ఆమె విషాద – గాథ అర్థం అయింది.

'మాయమౌతావా...మునిగిన చోటుకూడా దాచేసుకుంటున్నావా?'

ధైర్యంవచ్చి. ముద్దులలో ఆమెకు ఊపిరి బెసగకుండా చేశాడు. వాడిన తామర తూడులాగా అయిపోయి, వాలిపోతే... చెట్టుమొదలు జారవిడిచి కారుదగ్గరకు పరుగెత్తాడు.

ఆ మరునాడు... నీటిమీదుగా కాకుండా.. కారులో యకాయకిని... గట్టుదగ్గరకు వచ్చేశాడు. చెట్టు.. ఆ మోడులేదు. నరుకులైన, తుండ్లరాసి చెల్లాచెదురుగా పడి ఉంది ఆ అమ్మాయీ లేదు.

మనసు నిలువక...ఎక్కడికీ పోవాలనే ఆలోచన లేకుండానే గట్టుపుచ్చుకుని ఎగువ ఎక్కుతున్నాడు; దూరాన... ఆమెజాడ కనిపించింది. బెదురుగా వెళ్ళాడు చెంగున లేడిపిల్లలాగా ఆతని కౌగిటిలోకి దుమికి,

'వెన్నెల వచ్చినా...ఎంతసేపని నీకోసం వెదకాలి?' అన్నది.

'చీకటి అంటే నాకు భయం.'

'నాకూ భయమే.'

'వద్దు. నీకు కావాలంటే నక్షత్రాలు చిదిపి దీపం పెడుతాను మసకన్నమాట కనిపించదు.'

'సై'

ఇద్దరూ చెట్టాపట్టాలు వేసుకుని, చిన్నపిల్లలులాగా గంతులు వేస్తూ పరుగెత్తారు. ఆమె నవ్వు తెరలు తెరలుగా పొర్లి. కారు హారన్‌లో లయించింది. గట్టుమీదికి ఐమూలగా చాలాదూరంవరకూ కారు జంటదీపాలు చీకటిని చీల్చి చెండాడడానికి వెదకుతూ దౌడుతీస్తూన్నవి. దీపమాలికలాగా వంతెనమీదనుంచి రైలు రంయిన పరుగెత్తింది గోదావరిలో ఉద్ధోలంగా లేచిన కెరటం ఒడ్డుకు రాకుండానే చదునై వెన్నెలలో విరిగినంతమేరా ఒడిదుడుకులతో మిలమిలలాడింది.

★ ★ ★

# వింతభావాలు

అది అతనికి మామూలయిపోయింది. ఏమీ తోచనప్పుడల్లా వచ్చి కూర్చుని కవ్వించి పోట్లాడి పోతూంటాడు.

కాని అతనితో కబుర్లువేయడమంటే నా కమిత కులాసా. అతను చెప్పే వేమీ – చేసేవేమీకాని – నాకు నచ్చవు. ఆ సంగతి అతనికీ బాగా తెలుసును. అయినా ఎప్పుడో ఓమారైనా మాట్లాడకుండా– పోట్లాడకుండా–రోజు గడిచేది కాదు. అందుచేతనేమోకూడాను–మా కిద్దరికీ అంతస్నేహం.

మామూలు వేళకే, మామూలుకన్నా మరీ చక్కగా వేషం వేసుకుని, ప్రత్యక్షమైనాడు సుందరం దూరాన్నుంచే నా చేతులోపుస్తకం కనిపెట్టి తమాషాగా, చిరునవ్వుతో నావైపే చూస్తూ వస్తున్నాడు నేనూ అది గ్రహించి, శాకుంతలం మూసేసి, సిగరెట్టు ముట్టించుకుని తయారుగా ఉన్నాను;

—మళ్ళా మొదలూ!

కోటిమీద కోటి ఎక్కి వస్తున్నాడు. అతని ధోరణంతా వింతగా ఉన్నది

"అవును, ఆలాగేఉంటుంది అర్థంగాకపోతే" అని ఈసడించాడు సుందరం

నా కక్కడితో హుషారెక్కింది; ఇక ఊరుకోదలచలేదు.

"అయితే, కవిత్వానికీ, వేషానికీ సంబంధ మేముందీ?" అని నే నందుకున్నాను.

"తెలియకపోతే అలా అడుగు–దోవలోకిరా– ఏముందా? సోమయాజులుగారికీ శాలువకూ ఏం బాంధవ్యముందో, అంతకన్న–"

"అంటే?"

"ఏ పాటకి తగిన ఆట ఆ పాటకి అమరాలన్న మాట చూళ్లేదూ? తత్వాలు వ్రాసిన బ్రహ్మంగారూ, సిద్ధయ్యగారూ సన్యాసులయినారు శృంగారం కురిపించిన సూరన్నగారు–"

"మహారసికులనే – కదూ, నీ వనబోయేదీ?"

"అవును. ఆలోచన వరకే కాకుండా – అనుభవంలోకి తెచ్చుకున్న రసికత్వం కూడాను వారిది."

"అనుభవం లేకపోతేనేం – ఊహించకూడదూ?"

సుందరం నవ్వాడు. నాకు అది పిచ్చి ప్రశ్నేమో ననిపించింది.

"సరే, అనుగుణ్యమైన సంస్కారం అవసరమని – పోనీ – ఒప్పుకుంటాను. మరి ప్రత్యేకమైన నేపథ్యం ఎందుకూ?"

"అవసరమే! – తన నమ్మకానికి, ఇతరులను నమ్మించడానికీ: రంభతో ఇంటర్వ్యూ ఆసించపోయే అవధాన్లగారు, వేసమంతా దిగవిడిచి, గావంచాతో

బయలుదేరుతాడేమో కనుక్కో – పేస్‌పోర్టు కావద్దూ? అందుకనే కవితా కన్యకు ప్రియులమవుదామనుకునే మాదృశులు–"

"అదేమిటోయ్ – నీవు కవివికావూ? – కవికన్నకూతురు కవికి ఏమవుతుంది?"

"ఆఁ – ఏమవుతుందా? వాణి బ్రహ్మకు ఏమవుతుందో – నిమ్మళంమీద అది అవుతుంది; అవన్నీ పూర్వపు మాటలోయ్ – ఇప్పటిరకాలందరూ, పెంచుకునేబాపతుకాదు."

"సరే పెంచుకోండి, ఏమన్నా చేసుకోండి – మీరు చెడ్డది కాకుండా కవిత్వాన్ని ఓ కన్నెను చేసి, దాన్ని చెడగొడుతున్నారు"

"అక్కడే మళ్ళా పొరబడుతున్నావు – అందరికీ తలో కన్నెనూ – అసలు పిల్ల ఒక్కతే; ఆమెను ఏ మహానుభావుడో ఎవరికీ తెలియకుండా రైలెక్కిస్తాడు. మిగతా దండంతా, ఆ అమ్మాయికి పింతల్లి పెత్తల్లి బిడ్డలోయ్ – ఎవరైతేనేం – రక్తస్పర్శ ఉంటేసరి"

"కనుక?"

"ఇంతదూరం వచ్చినా మళ్ళా మొదటికేనా?— తీరుబడిగా ఆలోచించుకో నిమ్మళంమీద నీకే అర్థం అవుతుంది – 'శృంగారిచేత్' మొదలైన వాక్యాలన్నీ సరిగా అర్థంచేసుకోకుండా ఎందుకూ వాడిస్తావూ?"

సుందరం అంతటితో అనుగ్రహించి విడిచిపెట్టాడు – అతను వెళ్ళిపోయిన చాలాసేపటిదాకా నవ్వుకుంటూనే ఉన్నాను.

చిన్నప్పటినుంచే ఎరుగున్నాను సుందరాన్ని .ఎప్పుడూ ఇంతే. అన్నీ విపరీతం ఆలోచనలు. కొత్తగా మాట్లాడేవాడుమాత్రం కొంతసేపు ఉక్కిరిబిక్కిరవుతాడు – ఓమాదిరిగా ఎరుగున్నవాడు "క్రాక్" ఏమోననుకొని జాలిపడతాడు; ఏమైతేనేం, మొత్తంమీద చాలా చురుకైనవాడు – అక్కరకు రావలసినవాడు.

ఉన్నట్టుగా ఉండి – కవికి ప్రత్యేకంగా ఓ వేషముండాలని సుందరానికి సూచించింది. వెంటనే వెనుకటి ఫక్కీ అంతా మార్చేసి క్రొత్తపద్ధతిని తయారయినాడు. అసలే చక్కనివాడు; అంతకన్నా చక్కగా అలంకరించుకునేవాడు – అతను దోవను పోతూంటే చూసి, మెచ్చుకుని, – "ఇట్టి మనోహరాంగు డొక డెందయినన్ కలడేని" అన్న పద్యం భావాన్ని స్మరించని – పడుచుపిల్ల లుండరనుకుంటాను.

సుందరానికి లక్షణవతియైన భార్య ఉంది; అనుభవించడానికి కావలసినంత ఆస్తి ఉంది; హాయిగా తిని, ఇంటి పట్టున కడుపులో పాలు కదలకుండా కూర్చోక ఏమిటా ఈ వేషాలన్నీ అని ఒక్కొక్కప్పుడు నాకు కోపం వచ్చేది; కాని ఏంలాభం? నాచేత నేమవుతుందీ? అతను తనకు తోచినంత తాను చేయడమేకాని.

ఇంకొకరు ఏమనుకున్నా – ఏం చెప్పినా – లక్ష్యం చేసేవాడుకాదు: వినేవాడుకాదు.

## 2

అప్పటికి అరగంటనుంచే కనిపెడుతున్నాను; సుందరం అలాగే కదలకుండా – నిల్చునే ఉన్నాడు.

నాకు కనబడి వారం అయింది అప్పటికి. ఎక్కడికన్నా వెళ్ళాడేమో ననుకున్నాను; నాకోసమే వస్తూ--

అక్కడ ఆగిపోయి ఉంటాడు - అందులో ఆశ్చర్యమేమీ లేదు. సుందరం ప్రకృతి దేవత సౌందర్యాన్ని ఉపాసించే జట్టులో ఒకడు; - ఒక్కొక్కనాడు అన్నమాటకూడా మరచి పోయి, ఆకాశంలో మబ్బు బాగుందనుకుంటూనో, నక్షత్రాలు మినుకుమినుకుమనుకుంటున్న వనుకుంటూనో, నిలుచున్న చోటనే రెప్ప వేయకుండా రాత్రంతా గడిపేవాడు.

వెన్నెల బాగా వచ్చింది. చందమామ నాకే చూడటానికి చాలా ముచ్చటగా ఉన్నాడు - పరివేషం మరీ అద్భుతంగా ఉంది; మేఘాలన్నీ బాలచంద్రుడు తాకుతాడేమోనని పతివ్రతలలాగా పరుగెత్తుతున్నాయి కొబ్బరి చెట్లు చెయితాకినా కొంతవాసేనని - కొనలుచాచి అందుకోవలెనని తంటాలుపడుతున్నాయి - ఆ మనోహరదృశ్యాన్నంతా చూస్తూ, తలన్నా తిప్పకుండా అక్కడే నిలుచున్నాడు సుందరం.

ఆ - మనోహరదృశ్యం--

అద్దాలతలుపులమీద ఆమెనీడ పడుతుంది - మేడమీంచి గ్రామఫోను వినబడుతుంది

చూసినకొద్దీ నాకు అనుమానంగానే ఉంది - కాని, ఏమో - ఎటు చెప్పడానికీ వీలులేదు.

ఫోను పాట చాలించింది - లోపల దీపకాంతికూడా తగ్గింది

--రోమియో జూలియట్‌లో సీను సాక్షాత్కరించింది

తెల్లనిచీరె కట్టుకుని, వెన్నెల్లోకూడా తళతళలాడిపోతూ - ఆమె బాల్కనీలోకి వచ్చి నిలుచున్నది.

ఇక చూడనక్కరలేకుండానే సంగతేమో తెలిసిపోయింది: ఏముందీ, సుందరం పైకి ఎక్కి వెళ్ళి--

కాదు, నేనే పొరబడ్డాను సుందరం నిలుచున్న చోటినుంచి కదలలేదు ఆమెమాత్రం - రెండునిమిషాలు ఆలా నిలుచుని, తరువాత లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నది.

దీపం సాఫుగా ఆరిపోయింది.

సుందరం అక్కడనుంచి బయలుదేరాడు. మొదట, తిరిగి వెళ్ళిపోవాలనుకున్నాడు కాబోలు, ఇంటిదోవబట్టాడు, కాని మళ్ళా ఏమాలోచించుకున్నాడో, చప్టాన వెనుకకు తిరిగి, తిన్నగా మాయింటికి వచ్చేశాడు.

నేను అతడు రావడం కనిపెట్టి ఏమీ ఎరుగనట్లుగా సిగరెట్టుకాల్చుకుంటూ కూర్చున్నాను - మధ్యమధ్య కూనిరాగంలో, 'మేరే మౌలా బులాలో ' అనుకుంటూ-

--నన్ను పలుకరించలేదు! వచ్చి ఎదురుగా కుర్చీలో కూలబడి, చేజాచి, బల్లమీద 'శ్వేతకాష్ఠం' ఒకటి అందుకున్నాడు - నేను చూస్తూ ఊరుకున్నాను

'ఎక్కడనుంచి మొదలుపెట్టనూ, కథ?' అని అతనే ఎత్తుకున్నాడు కొంతసేపటికి.

నేను దానికి జవాబు చెప్పకుండా -

"ఈ మధ్య నీవు ప్రకృతిని ఉపాసించడం మానేసి-" అని ఆగాను

"అవునోయి – ప్రకృతిని కొన్నాళ్ళదాకా మరచిపోవాలిసివచ్చింది – చైతన్యాన్ని.."
నాకు నవ్వువచ్చింది.
"సరేలే – కథ నీవు చెప్పాలీ? – నేను గ్రహించలేనూ?" అన్నాను.
"అందుకనే నేను చెప్పేది. నీవు తిన్నగా చూస్తేకదూ సరిగా గ్రహించేది!"
"తిన్నగానే చూశాను – కాని నీవనేదేమో మాత్రం గ్రహించలేను."
"పోనీ, అక్కడికి కొంతనయమే – వింటాలే"
నేను తల ఊపాను
"ఆ–అనసూయకీ – నాకూ స్నేహంలేదు – తెలిసిందా?"
"అంటే?"
"నీవు చూసిందాన్నిబట్టి – నిన్ను నేను చూశానులే – నీ వేమి అనుకుంటున్నావో, అది కాదంటున్నాను––"
నే నేమీ మాట్లాడలేదు.
"క్రిందటి మంగళవారంనాడు – మీ యింట్లోనే భోజనం చేశాను – జ్ఞాపకం ఉందికదూ? ప్రొద్దుపోయేదాకా 'హిందూ' చదువుకుంటూ కూర్చున్నాను. నీవు అప్పుడే నిద్రపోయినావు––
––పడుకున్నవాడిని లేపడం ఎందుకని, నీతో చెప్పకుండానే వెళ్ళిపోయినాను అప్పటికి పన్నెండు దాటింది.
ఎవరో పెళ్ళివారు – అక్కడ ఆగారు. కాన్సర్టు "వేణుగానలోలా–" మా షోగ్గా వాయిస్తున్నారు. వినడంతోనే నిద్రంతా అమాంతంగా మాయమయింది నాకు. అక్కడనుంచి కదలడానికి మనసు ఒప్పింది గాదు.
పైకి – ఊరికేనే చూశాను. అనసూయ నిలుచుని ఉంది.
అదివరకు చాలాసార్లు చూశాను. కాని ఎన్నడూ అంత అందంగా కనబడలేదు. చూపు మరల్చనేలేకపోయినాను. చూసినవాళ్ళేమనుకుంటారో అన్న తలపే లేకపోయింది.
నేను తెలివి తెచ్చుకునేటప్పటికి – పెండ్లివారు చాలాదూరం సాగిపోయినారు. రోడ్డు మీదకూడా ఎవరూ లేరు.
కాని ఆమె ఇంకా అక్కడనే నిలుచున్నది.
తలచుకుంటే నాకే సిగ్గువేసింది. ఆమె నన్ను కనిపెట్టే ఉంటుంది. ఏమనుకుందో!
ఇక అక్కడ నిలువలేకపోయినాను. ఇంటికి ఎట్లా వెళ్ళానో నాకే తెలియదు – ఎట్లా తెల్లవారిందో!
మరచిపోదామనుకున్నాను. ఆలాటి పాపపుతలపులు చేరనీయరాదనుకున్నాను – కాని, నా మనసు నా వశం మీరిపోయింది. ఆమెను చూడకుండా – ఆమెను తలచుకోకుండా – ఉండడం దుర్లభమనిపించింది.
బయటికి రావడానికి చాలా సిగ్గువేసింది – ఎవరికన్నా తెలిసిందేమో – ఏమనుకుంటారోనని చాలా తపించాను
కాని, నా వశము కాకపోయింది. ఇంట్లో కూర్చోలేకపోయినాను. పవలల్లా ఏలాగో వేగిరించి, చీకటిపడగానే వచ్చి అక్కడే నిలుచుంటున్నాను.

క్రమంగా నాకు తగనిధైర్యం వస్తూంది ఎవరన్నా లక్ష్యంలేకుండా పోతూంది – ఆమె – ఆమె తప్ప లోకమేలేదు నా కిప్పుడు–"

నే నాతని మాటకు అడ్డురాకుండా, వింటూ కూర్చున్నాను విన్నకొద్దీ – ఆతని ఉద్రేకాన్ని చూసినకొద్దీ – భయం వేసింది.

'ఏమంటావు?" అని అడిగాడు సుందరం.

"ఏమంటాను – నీవు చేస్తున్నపని అంత బాగుండదేమో––"

"ఎవరికి?"

"లోకానికి"

"నీక్కూడానా?"

"నామాట కేంలే"

"నేను అడిగేది నీమాటే"

ఇక తప్పించుకోడానికి వీలులేకపోయింది. చూస్తూ ఊరుకోలేకపోయినాను––

"సుందరం – నా అభిప్రాయంమాత్రం––"

"నేను తప్పుచేస్తున్నాననేనా? –" అని ఆతడు అందుకున్నాడు

"అవును."

"అయితే ప్రయోజనంలేదు. నీవు – అర్థంచేసుకోలేవు"

"ఈ పట్టున నీకు అర్థంకానివి – నీవు గ్రహించనివి కొన్ని విషయాలున్నాయి – తెలుసునా?"

"ఏమో, నాకు మాత్రం తెలియదు – తెలియనక్కరలేదు – కాని, నా ప్రేమా – నా ఆవేదన సంగతి నీ కెల్లా తెలుస్తుంది?"

నేను నిజమేనని తల ఊపాను.

తరువాత ఎవరమూ ఏమీ మాట్లాడలేదు.

## 3

రామమూర్తిగారు పడుచుదనంలో చాలా చక్కగా ఉండేవాడట – కాని, నే నెరిగినప్పటినుంచీ అలాగే ఉన్నాడు – పిలకజుట్టు, సగం నెరిసినగడ్డం – ముడతలుపడ్డ మొగం – ఏమో, అప్పటి ఆకారాన్ని చూచి ఊహించనైనా లేకపోయేవాణ్ణి. వయసులోఉన్నప్పుడు ఎట్లా ఉండేవాడో!

మావైపునుంచే రోజూ కారులో కోర్టుకి వెళ్ళేవాడు. ఆయన్ని చూడటం వ్యవధానంగానే మా ముసలమ్మ – 'ఎల్లా ఉండేవాడనుకున్నావు? సరిగా దొరలాగా, – ఆ మీసాలూ' ఆ నుదురూ, నల్లలాంకోటూ, జరీతలగుడ్డ పెట్టుకుని నడుస్తూంటే, వీధంతా కలకలలాడిపోయేది – ఈ నాటి మాటా – ఇప్పటికి ముప్పై ఏండ్ల కిందట – అప్పుడు మీ తాతయ్య సబుకోర్టులో పనిచేస్తూండేవాళ్ళు – నీవేం ఎరుగున్నావు, మీ అమ్మే చంటిపిల్ల..'– అని ఆయన్ని ప్రశంసించడం మొదలుపెట్టి, సొంతకథలోకి దించేది. నేను విసుపుకుని అక్కడనుండి లేచిపోయేవాణ్ణి.

అనసూయ అయినయింటిపిల్ల. చాలా చక్కందీ, చదువుకున్నదీ. ఆ అమ్మాయికీ, రామమూర్తిగారికీ అధమం మూడు పుష్కరాలన్నా తేడా ఉండవచ్చు వయసులో.

——లోకంలో పాతకథే, రామమూర్తిగారికి మొదటి భార్య వియోగం కలిగిన తరువాత, చాలాకాలం ఒంటరిగానే ఉండిపోయినాడు. ఏ కాశో లేచిపోతాడేమో ననుకునేవాళ్ళకూడాను. కాని ఉన్నట్లుగాఉండి ఎవరికీ తెలియకుండానే, ఇట్టి పడుచుభార్యను సంపాదించుకువచ్చాడు.

అనసూయను వీధిమొగం చూడనీయడనీ, చాలా కోరంటికం పెడతాడనీ, కొడతాడనీ – పడుచుభార్యలున్న ముసలివాళ్ళకబ్బే దుర్బుద్ధులన్నీ ఉన్నాయనీ – అందరూ చెప్పుకునేవారు.

రూపాన్ని కాకుండా, గుణాన్ని వరించే పిల్లలు కూడా ఈ కాలంలో ఉన్నారని నమ్మేరకం కాదు నేను. అయినా, అనసూయవిషయంలో ఏమనుకోవడానికీ పాలుపోలేదు. అప్పటివరకూ పొల్లుమాటబడకుండా, మానవతిగానే కాపురంచేస్తున్నది.

నే నామెను ఎన్నడూ సరిగా చూడనన్నాలేదు. అసలు ఆ అమ్మాయి సాధారణంగా కనబడదుకూడాను. మా యింటికి దగ్గరనేకనుక, ఎన్నడన్నా, ఏడుపుమాత్రం వినిపించేది రామమూర్తిగారు – ఆ కిరాతుడు – ఆ అమ్మాయిని తరుచు హింసించేవాడు.

సుందరంగాథ విన్నప్పటినుంచీ, నాకూ ఆమె అంటే కులాసాపుట్టింది – 'న పరిహార్యే వస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే' – మావాడికికూడా మనసు మారిందంటే, ఆమె సామాన్యురాలై ఉండదన్నమాటే కాదూ?

సుందరం, స్త్రీజనం విషయంలో అసలు చాలా జాగ్రత్తగా ఉంటాడు – ఆపట్ల మాత్రం చంచలుడుకాడు. అతడు అనసూయను వరించాడంటే – నాకు ఆశ్చర్యం వేసింది మొదట.

కాని సందేహమేమీలేదు. నిజంగా సుందరం వంటివాడికి తగిందే. ఆమెకూ అతనే తగినవాడు – ఈయుగంలో వీలులేదు కనుకగాని – ఏ హంసో మధ్య రాయబారం నడుపుతే ఎంతో త్వరగా తేలిపోయేదికదా – ఏదోఒకటి అనిపించేది.

నే నాతనికి సహాయముచేయదలచలేదు... వారించదలచనూలేదు – చూసి సంతోషిద్దా మనుకున్నాను.

* * *

అకాల జలదోదయమయింది.

సుందరం పరుగెత్తుకుంటూ – నిజంగా పరుగుతోనే వచ్చాడు. వేసవిలోకన్నా ఎక్కువగా ఎండవేస్తూంది. నేనూ అప్పుడే కాఫీపుచ్చుకుని – నిద్రపోవాలనుకుంటున్నాను.

అమాంతం వచ్చి వెన్నుమీద చరిచాడు మత్తంతా వదిలిపోయి లేచి కూర్చున్నాను. అంతమాత్రం కూర్చోకుండా – ఒకచోట నిలవకుండానే——

"లేవోయి – షర్టువేసుకుని బయలుదేరు, – త్వరగా – లే – అలా చూస్తావేం"——

అని గబగబ నన్ను హెచ్చరించి, ఉత్తరీయము, షర్టు తీసుకొనివచ్చి నామీద పడవేశాడు.

"ఏమిటీ హడావుడి?" అని నేను చాలా తీరుబడిగా అడిగాను, అతని తొందరంతా లెక్కపెట్టకుండా.

"కాదు – దోవలో చెపుతాను...ముందు బయలుదేరు."

"సంగతేమో తెలియందే కదలను. అసలు ఇంకోరైతే, ఇప్పుడు లోనికి రానిచ్చే వాణ్ణేకాదు. ఏమిటి ఎండవేళ నన్ను కాస్సేపు పడుకోనీయకుండా."

"ఎప్పుడూ నీతో ఇంతేనోయ్" అని దిక్కుమొగం వేసి, కూర్చున్నాడు సుందరం.

కొంచెంసేపు తలవంచుకుని ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఊరుకుని –

"రామమూర్తి – రమ్మన్నాడోయి మన్ని" అన్నాడు చప్పున తలఎత్తి నావైపు చూస్తూ.

"ఏమిటీ?"

సుందరం మళ్ళా చెప్పాడు

"నిజంగానా?"

"ఇంకా నమ్మకపోవడమేనా?"

"సరే వెళుదామా?"

"తప్పకుండా – నీదే అలస్యం."

––"కారణం ఏమిటో?"

"ఏమయినా, నాకు లక్ష్యంలేదు – అనసూయ.."

"కనిపెట్టాడా?"

"ఎన్నడో కనిపెట్టాలిసింది. అది అతనిపొరబాటే"

"దుర్మార్గుడు: మనం కాస్త జాగ్రత్తగా..."

"అయితే లెక్క ఏమిటోయి – ఆతనితో చెప్పే అనసూయను – లాక్కుంటాను."

"అన్యాయమేమో"

"అతనుచేసేదానికంటేనా?"

––ఇద్దరమూ వెళ్ళి రామమూర్తి లైబ్రరీలో కూర్చున్నాము. లోపలికి కబురు పంపించాము.

నే నదివరలో ఎన్నడూ లోపలికి వెళ్ళలేదు. ఆయనకు అంత మంచి లైబ్రరీ ఉన్నదని కలలోనన్నా అనుకోలేదు. పాతవకీళ్ళ దగ్గర ఉండే సరంజామా అనుకున్నాను గాని – చూసేటప్పటికి నాకు, తలతిరిగిపోయింది – పేరున్న ఆధునికుల గ్రంధాలన్నీ మంచి ప్రతులు, ముద్దులు మూటగడుతూ అలమారలనిండా ఉన్నాయి––

లోపలికి రమ్మని నౌకరు వచ్చి చెప్పాడు. సుందరం నేనూ – లోపలికి వెళ్ళాము.

డ్రాయింగురూము – ఫోటోగ్రాపులలోనే కాని ప్రత్యక్షంగా ఎన్నడూ అలాటిది చూడలేదు – ఎంతో బాగుంది – నాకు లోపలికి వెళ్ళడానికి అదేదో అనిపించింది.

రామమూర్తిగారు ఛెస్టరుఫీల్డుతో కూర్చొని ఉన్నాడు. ప్రక్కన ట్రేలో కాఫీ సామగ్రి అంతా ఉన్నది.

మమ్మల్ని చూసి, లేచి ఎదురుగుండా వచ్చాడు సబహుమానంగా లోపలికి తీసుకునివెళ్ళి కూర్చొబెట్టి తానుకూడా మాకు ఎదురుగా కూర్చున్నాడు, చేతులో పుస్తకం ప్రక్కన పెట్టేసి.

అందరమూ కాఫీ పుచ్చుకున్నాము.

అంతవరకూ సుందరం ఏమీ మాట్లాడలేదు నేనూ ఏమనడానికి తోచక ఊరుకునే ఉన్నాను రామమూర్తిగారే మాట్లాడుతున్నారు ఏదో ఆమాటలూ – ఈమాటలూను.

ఆయనమొగం, వాలకం చూస్తే మోసమేమీ స్ఫురించలేదు. కాని నా కాయన ఎదుట ముండ్లమీద కూర్చున్నట్లుగా ఉంది ఎప్పుడు బయటపడదామా అనుకుంటూ, విధిలేక తప్పనిసరిగా కూర్చున్నాను.

"అనసూయా!"

రామమూర్తిగారు నెమ్మదిగా పిలిచారు. నాకు గుండెలు ఆగిపోతాయేమోనని పించింది నిలువున నీరైనాను సుందరంస్థితి గమనించడమేలేదు.

గాజులచప్పుడు వినబడ్డది. గుమ్మానికి అడ్డమున్న తెర తొలగించుకుని అనసూయ లోపలికి –

—రాలేదు. ముందరికి అడుగు వేయబోతూ, మమ్మల్ని చూసి, చప్పున లోపలికి పోయింది.

"ఫరవాలేదు – రా"

ఆమె తలవంచుకుని వచ్చి దూరంగా నిలవబడినది. నాకు నిజంగా భయం వేస్తూంది ఆమె మొగంలోమాత్రం ఆశ్చర్యం కనబడుతూంది

రామమూర్తిగారు లేచి నిలుచున్నారు. అనసూయ ఆయనచాటుగా ఉంది. మాకు కనిపించడంలేదు.

"కష్టమనుకోకుండా పిలువగానే వచ్చారు. కృతజ్ఞుణ్ణి" అని రామమూర్తిగారు ఎత్తుకున్నారు.

నాకు ఏం జవాబు చెప్పాలో తోచలేదు. అసలు అవసరం లేదేమో కూడాను. మాట్లాడకుండానే కూర్చున్నాం.

"సుందరంగారూ, మిమ్మల్ని నేను చిన్నప్పటినుంచీ ఎరుగున్నాను. మీ నాయనగారికీ నాకూ, ఒకప్పుడు స్నేహంకూడా ఉండేది."

సుందరం తెల్లబోయి ఆయనవైపే చూస్తున్నాడు.

"—మీకన్న వయస్సు చెల్లినవాడిని గనుక, రెండు ముక్కలు వేదాంతం మాట్లాడుతాను. విసుపుకోబోకండీ – మానవుడికి ఆయుఃప్రమాణము శతాధికం అని నిర్ణయం ఉన్నా, విధి దుర్విజ్ఞేయం కాదండీ – శంకరుడు జీవనం విద్యుచ్చిరమనే అన్నాడు. అనుభవం విషయంలో లోకాయతికులమతమే నాకు నచ్చిందండీ – ఏమంటారు?—"

మేమేమీ అనలేదు. ఆయనే అందుకున్నాడు —

"ఇక మామూలు ధోరణిలోకి వస్తాను: – కులాసా రెండు విధాలని నా ఊహ – సొంతం పరకీయం – అని అంటే తాననుభవించడం, ఎవరినన్నా చూసి ఆనందించడం. ఎవరి అదృష్టాన్నిబట్టి ఎవరికివారికి – ఏదో, ఈ రెండు రకాల్లో ఒకటి—"

సుందరం రెండుమూడుసార్లు మాటకు అడ్డం రాబోయినాడు. కాని రామమూర్తి గారు మాట చొరనీయలేదు. ఇక ప్రయోజనంలేదని, మాట అందుకోడానికి ప్రయత్నం

మానేసి అభినయంతో, తన అభిప్రాయం తెలియజెప్పాలని తంటాలుపడుతున్నాడు. ఆయన అది గ్రహించాడు కాబోలు చిరునవ్వుతో—

"నాయనా, తొందరపడకోయ్! నీకు నాలో మూడవపాలువయస్సుందీ? - వస్తున్నానుకదూ?" అన్నాడు.

నా కిక ఆబిగిని కూర్చోడం దుర్భరమయిపోయింది. అప్పటికి పదినిమిషాలనుండీ వింటూన్నా, కనిబెడుతున్నా, మాటల ధోరణేమిటో, మనసులో ఏముందో - ఏమీ గోచరించనే లేదు. ఆయన సమక్షంలో ఉండటమే యాతనగా ఉంది ఆ చూపు-

ఆ చూపు తమాషాగా ఉంది. కాని అర్థం అయేటట్టుమాత్రంలేదు మా ప్రజ్ఞలన్నీ మా అధీనం దాటిపోతూన్నాయి

—అది అంతకన్నా చిత్రంగా ఉంది! - ఇప్పుడు గాంభీర్యం ఉట్టిపడుతూంది ఆ ముఖకవళికలో, ఆ - ధీరుడు ఓ మాదిరిగా, దుర్నిరీక్షుడుగా ఉన్నాడు - మారిపోయినాడు.

"అనసూయను నీవు ప్రేమిస్తున్నావుకాదూ?"

పిడుగుపడింది. - కాని ఆయన చలించలేదే!

"అడుగనక్కరలేదు - నీకు - ఆ..మె...మీద చాలా ప్రేమఉంది - నాకు తెలుసును"

అగ్నిపర్వతం అడుగంటా కదిలిపోతూంది: - తప్తధాతు ప్రవాహం ముంచుకు వస్తూంది.

—సుందరం కూర్చున్నచోటనుంచి లేచి - ఎగిరి - నిలుచున్నాడు - వణకిపోతున్నాడు కళ్ళు, భావకవిత్వ - రాగాన్ని క్రక్కుతున్నాయి

"రామమూర్తిగారూ - నేను అనసూయను....అనసూయ నాది - నాకు కావాలి.... ఆ బంగారుబొమ్మను—మీరు - మీరు - ఆమెకు మీరు తగరు - ఆమె జీవితాన్ని పాడుచేస్తున్నారు. ఆ లావణ్యరాశి - ఆ..."

రామమూర్తిగారు ఈ ధూకుడు చూసి, చకితుడైనాకాలేదు. చిరునవ్వు - నిజంగానే - చిరునవ్వు నవ్వాడు——

"అవునోయి - ఆమె నీకు కావాలి; నేను సంతోషంగా అనసూయను, ఆమె ప్రేమను ఆశ్వీరచనపురస్సరంగా నీ కిచ్చివేస్తాను. హృదయపూర్వకంగా ఆమెను ఆమెవరించిన అదృష్టశాలిదగ్గరకు బ్రహ్మరథంపట్టి తీసుకుని వెళుతాను. నీవు పోషించనక్కరలేదు. నాకు కలిగినదంతా ఆమెదే. ఇప్పుడే ఆమెకు యిచ్చివేస్తాను ప్రేమేకాదూ, నీవు కోరేదీ, నీకు కావలసిందీ——"

విన్నాం - ఈ మాటలన్నీ విన్నాం. కాని అప్పటి మా స్థితి ఏలా తెలియజేయడం?

నీలాంబుదాలమాటునుంచి తొణుకుతూఉన్న విద్యుద్వల్లి తెర తొలగించుకుని మా కళ్ళయెదుట మెరిసింది.

చెంగున ముందరికి దుమికింది. అప్పటికి మేం అనసూయమాటే మరచిపోయినాం రామమూర్తిగారుకూడా.

ఆయనకూడా ఈధోరణిలో ఆమెను గమనించడమే లేదు. అమాంతం, ముందుకు ఉరికి ఎదుట నిలువబడేటప్పటికి, ఎంత నిగ్రహమున్నా మాలాగే ఆయనా ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటీ ఆగడం?"

ఎవ్వరమూ మాట్లాడలేదు. మెదలవన్నా లేదు.

"అనసూయా!"

రామమూర్తిగారు చాలా ఆశ్చర్యపడుతున్నారు ఇక అనసూయో–

ఆ చూపులు, ఆ చూపులకి అర్థం తెలియడంలేదు కాని, ఆమెకళ్ళ యెదుటపడుటకన్న ఏమైపోయినా బాగుండుననిపిస్తూంది. ఆ కోపం – ఆ విషాదం.

"అభిమానం లేదూ? మీ భార్యను పరుడెవ్వడో మెచ్చుకున్నాడని, ఆ – ఆతనికి దానం చేస్తారా? పశువుల్లో పక్షుల్లోకూడా లేదే ఇంత ధర్మబుద్ధి?"

రామమూర్తిగారు అనసూయను తేరిబారచూశాడు–

"వెళ్ళవా? – నీ జీవితాన్నంతా వ్యర్థం చేసుకుంటావా? – నీవు సుఖపడటమే నేను కోరేది – నీమీద ప్రేమ" –

అనసూయ అడుపులిలాగా గర్జించింది–

"నామీద – ప్రేమ – అవును, నిజంగానే – నా మీద మీకు ప్రేమ – దయ – ఆపేక్ష – ఎన్ని ఉన్నాయి! – పశువధ చేసేవాళ్ళన్నా, ఆ ప్రాణిమీద కనికరిస్తారు – మీ కా మాత్రమన్నా జాలిలేదే?"

రామమూర్తిగారు తెల తెలబోయినారు –

"అనసూయా – పొరబడ్డానా?" అని సంశయిస్తూ ప్రశ్నించాడు.

"మీరు తప్పుచేశారని – ఈ దాసి అనగలదా, అనడానికి అధికారముందా? – కాని, ఇంతకాలమున్నా, నా మనస్సు కనిపెట్టలేకపోయినారు కదా?"

"నీవు – ఈ – ఈయనను –"

"అవును. .మీ మాటలన్నీ విన్నతర్వాత సంగతంతా తెలిసింది. నాకు తెలియకుండానే నన్ను ఇమిడ్చి ఎంత కథ అల్లారు."

"ఏమిటి?"

"వీరు – ఎవరూ?"

అని మమ్ముల్ను చూపించి అడిగింది – నేనూ సుందరం తెల్లబోయినాము. మేము ఎవరమోకూడా అనసూయకి తెలియదా?

కాని రామమూర్తిగారికి కోపం వచ్చింది. ఆయనకు అనసూయమాటలు అర్థంకావటంలేదు కాబోలు!

"ఏంవేషాలూ – ఎవరో తెలియకుండానే – ఆయన్ని –"

అనసూయ నవ్వింది.

"ప్రేమించావనేనా, మీ రగడబోయేది?"

"అవును" – అని రామమూర్తిగారు తల ఊగించారు.

మళ్ళా – ఈ మారు బిగ్గరగానే – నవ్వేసింది అనసూయ.

"అయితే – నేను ప్రేమించానా? – ఎవరినీ?"

"ఎరుగవా?"

"మీకు – తెలియదా?"

"తెలుసును. నేను – చూశాను ఆ వెన్నెల రాత్రుల్లో అతనికోసం నీవు – నీకోసం అతడూ – పరితపించడం–"

రామమూర్తిగారు ఉగ్రుడైపోయినాడు. మనసులో దాచలేక, కథంతా చెప్పేశాడు – నిత్యమూ సుందరం – అనసూయకోసం నిరీక్షించడం – ఆమె అతనికి కనబడటం ..

ఇంకా ఏవేవో మాటలన్నాడు – వింతవ్యాఖ్యానాలు చేశాడు – ఆ శాంతమంతా ఎక్కడికో పోయిందో!

అనసూయ అంతా విన్నది –

–– "అలాగేం – ఒకరిని మించిన వారొకరూ – మీరు ఆయన్ని చూశారు. ఆయన – నన్ను చూశారు కారూ– సరే, అంతవరకూ మీ కథ బాగానే ఉంది – ఒప్పుకుందాం కాని మిమ్మల్ని ఇద్దర్నీ – నేను చూడలేదే?–"

–– ఇక ఎవరేం మాట్లాడతారు?

––"చూడకపోవడం నాది పొరబాటే – లేకపోతే ఇంతకథ ఏలా జరుగనూ అయ్యో, వృధాగా ఎంత కష్టపడ్డారూ? నన్ను అడుగలేకపోయినారా? నా – నామీదనా మీ కపనమ్మకం? అంత విశ్వాసం లేకపోయిందా?

"అవును, ఏలా అడుగుతారు ..అబద్ధం చెపుతానేమోననుకున్నారు కాదూ? మీతో – మీతో అబద్ధమాడుతానని, మిమ్మల్ని మోసం – మీకు ద్రోహం చేస్తానని ఏలా అనుకున్నారూ? అంతమాత్రం నన్ను నమ్మలేకపోయినారా? అబ్బ! మీది ఎంత రాతిగుండె!

"మీ ఎదుటబడి ఇతరులున్నప్పుడు ఇంత నదురూ బెదురూలేకుండా మాట్లాడటం తప్పే. నాకూ తెలుసును. కాని, స్త్రీకి ఇంతకన్న గొప్ప పరీక్ష ఏముంది? మీ వంశ గౌరవం, మీ ప్రతిష్ఠ, నన్ను కన్నవారి మర్యాద నేను కాపాడుకోవద్దూ––

"మీకు తెలుసును కాదా – భోజనం అయినతర్వాత నిద్రపోకముందు కాస్సేపు చల్లగాలిలో తిరిగే అలవాటు నాకుందని? నేను కాపురానికి వచ్చినప్పటినుంచీ మీరు చూస్తూనే వున్నారు. చిన్నప్పటినుంచీకూడా అంతే కావలిస్తే మావాళ్ళని కనుక్కోండి.

"చక్కగా వెన్నెల ఉంది, చంద్రుడూ, నక్షత్రాలూ మెరుస్తూ కనబడుతూంటే – క్రింద రోడ్డూ – రోడ్డుమీదపోయే మనుష్యులనీ చూడటానికి – ఎవరికి మనసొప్పుతుందండీ? నా ధ్యానంలో నేనుంటే – పాపం – ఆయన నన్ను చూసి ఉంటాడు:

"వీరి వేషం, వైఖరీ చూస్తే కవిత్వం చెప్పేవారిలాగా కనబడుతున్నారే – మీరూ ఓపికలేక బయటికి అనకపోయినా – మనసులోఉందికాదూ మీకూను ఆ ధోరణి – కనుక ఇది మీరుభయులూ కలిసి చేసిన వంచనా?

"–మా నాన్న అనేవాడులేండి – 'నిరంకుశాః కవయః' అని – మా చిన్నతనంలో సరిగా అర్థం చేసుకోలేక, ఈ కవులందరూ, సరిగా అంకుశంపెట్టి పొడిచి, మంచిదోవలోకి తీసుకువచ్చేవాడు లేక ఈలా చెడిపోతున్నారనుకునే వాళ్ళం–కాని బుద్ధితెలిసినకొద్దీ, ఈ అమాయకపు ఊహలే నిజం అవుతున్నాయే? – మీరందరూ, నిజంచేస్తున్నారే?

"మీ ఆలోచనలో మంచి చెడ్డలు మీకు తెలియాలి కాని అందరూ, మీలాగానే అనుకొని అందరూ మీ అందుబాటులో వారనుకుని–వృధాగా కష్టపెట్టకండి – మీరూ కష్టపడకండి"

వింటున్న కొద్దీ, కాళిదాసు శకుంతలచేత చెప్పించిన లెక్చరు, దీనిముందర చాలా నీరసంగా కనబడ్డది – నిజంగానే, చక్కనివాళ్ళకు కోపంకూడా అదోమాదిరి అందమే

అనసూయ, ఈ మాటలన్నీ రామమూర్తిగారికి ఎదురై అన్నది ఇక చాలించి, మమ్మల్ని రక్షిస్తుందేమో ననుకున్నాం – నేనుమాత్రం, నా జన్మనూ–దానికి కారకులనూ, మా వంశానికి మూలపురుషులనూ, బాలారిష్టాలన్నీ తప్పించి ఇందాకా బ్రదుకనిచ్చిన దైవాలనీ – ఎంత తిట్టానో తిడుతున్నానో – ఎవరికెరుక?

కాని, మా కంతటితో తప్పించుకుని బయటపడే భాగ్యంలేదు రామమూర్తిగారి దిక్కునుండి మావైపుకు తిరిగింది ఆ తుపాను. ఒక్కటే విసురు––

"అయ్యో! మీ రెవరో ఎరుగను – క్షమించండి. కాని, మీ తోబుట్టువునే, ఆ మాదిరిగా – చూడటానికి మీ మనసు ఒప్పదనుకుంటాను – కాదూ?" అని అన్నది మృదుమధురస్వరంతో – ఎంతో నెమ్మదిగా.

ఆ దెబ్బతో మా యుద్ధరిపనీ ఆఖరయిపోయింది. సుందరం, నేనూ – ఏలా వచ్చి బయటపడ్డామో తెలియదు.

నేను కాస్త వెనుకపడ్డాననుకుంటాను. రామమూర్తిగారు అనసూయయెదుట సాంజలియై క్షమార్పణ వేడటం, ఆమె ఆయన్ని తగని ప్రేమతో వారించడం చూశాను చూచాయగా.

సుందరం ఈ మధ్య అసలే కనబడటం మానేశాడు వేసవికి ఊటీ వెళ్ళాడేమో!

ఆమాటే – ఆ అమ్మాయిమాటే – ఆమె అన్నమాటే ఎప్పుడూ తలుపుకువస్తూంటుంది. తలచుకున్నప్పుడల్లా నవ్వుకుంటాను. నిజమే – ఒకరిని మించినవారొకరూ!

★ ★ ★

# పంచచామరం

కడుపునిండిన.. బేరం!

--నిండుకుండ..అప్పుడే తొణకడానికి ప్రారంభించింది. ఒళ్ళుపొగరుకాకపోతే.. చూస్తేనే.. కడుపు నిండుతుందా?--

నిజంగా..ఆ అమ్మాయి అలానే ఉంది; అయితే మాత్రం? – ఎంత ఒంటరిగా కూర్చుని ఉంటేనేం.. ఎగాదిగా చూస్తూ.. ఎదురుగా దీపస్తంభాన్ని అనుకొని చదికిలబడటం నాకు అప్పుడు అదేం పోయేకాలం?

ఏ రైలుకు వెళుతుందో?..

ఎటువెళ్ళినా. ఇంకా అరగంటదాకా ఎక్కడికీ బండిలేదుగదా?..ఇంతలో, కలిసి రావాలికాని .ఎంత గ్రంధం నడవకూడదు?--ఏమో తీరా, పాకానపడబోయే సరికి, అంతవరదాకా...అలా ఓచోట కూలేసి ఏ రాజ్యాలో ఏలబోయిన – ఆ ఘనుడు.. మెడను త్రాడుబిగించిన ఎవరో ఆ వెధవాయ – తీరా తగుదునని ఆ సమయానికి అక్కడకు తయారైతే మనం యిక అటూయిటూ మెసలడానికి ఏ మాత్రమూ వీలుండదు మన వేషాలేమీ సాగవు అనవసరంగా సిద్ధాన్నం ఆ కాస్తా చెడి ఊరుకుంటుంది.

అయినా, అందాకావచ్చినతరువాత.అప్పటిసంగతి చూసుకోవచ్చును. యిక యధావిధిగా కార్యక్రమానికి ఉపక్రమించవచ్చును.

ఎంతసేపు చూస్తూ కూర్చున్నా, బాగానే ఉంటుంది యింకా యింకా చూడాలనే ఉంటుంది.

నేను క్రీనీడలో ఉంటిని; వెలుతురు అంతా ఆ అమ్మాయిమీదకే ఉరుకుతూంది.

నా మనసు...

నే నలా...జపంచేస్తూ కదలక మెదలక ఎంతసేపు కూర్చున్నా, ఏం లాభం? – అక్కడ.. ఆ రవంత దూరంలో తనకోసం ఒకడు తపించిపోతున్నాడని ఆమెకు ఆ ప్రాంతాల మనిషి అలికిడి అయినా. ఎలాగో తెలియాలి కాదూ, ముందు!

అందరికీ. తెలిసిన చిట్కా... గొంతుసవరించుకోవడం; నా శాయశక్తులా. ఎన్ని మాదిరులలోనో.. ఎన్నిస్థాయిలకో...ఆపకుండా దగ్గాను: జర్మనుభాష నేర్చుకుంటూన్నప్పటి కొరమారడం పంపిణీమీదనే. శబ్దించాను. ఊహుఁ .తననికాదన్నట్టు తిరిగిచూడనన్నా చూడకుండా-- ఆ అమ్మాయి అదివరకు చూసేవైపే. చూస్తున్నది–

అంతేనేమో ఎన్నటికీ రివాజు! వినిపించకుండా ఉంటుందా..నేను అంత సేపటినుంచీ అన్ని రకాలుగా గొంతుచించుకుంటూంటే? – పోనీ...అందులో ఏదో విశేషం ఉందని గ్రహించగల తాహతు లేకపోవచ్చును – కాని.. ఎవరో

పాపం .ఎంత బాధపడుతున్నాడో అని సామాన్యంగా అందరూ జబ్బువాడికేసి చూపించే. .జాలి. అందుకని అయినా.. నావంక తిరగవచ్చునే?

ఎందుకైనా మంచిది అని – కొంచెం ముందుకు జరిగాను...యిక మసలోపంలేదు... కనుముక్కుతీరు...నా నొక్కుల క్రాఫింగు యిత్యాదులు వెలుతురులో. .స్పష్టంగా కనబడి తీరక తప్పదు–ఆమె, మెడనరాలు కొంచెం సడలించి యిటుచూసేపక్షంలో–

–'ఆ అమ్మాయి నావంక తిరిగిచూడాలి' – అనేది మాత్రంచేసి ..దానికో వేయి వారువాల వేగం కలిపించి. .మనసును మెలివేసి...కనుమూసి కనుతెరచేటంతకాలంలో లక్షసారులు జపించాను... ఆమీద కొసరుగా పోనీ, పాపం అని మళ్ళా ఒకసారి. సత్తువకొద్దీ సకిలించాను–యింతకాండ జరిగినా.. యింకా, వేసినచోటే ఉన్నాను

తరువాత – ఎత్తు .

––అవైపునుంచి వెళుతూన్న కూలీకుర్రవాడిని పిలిచి, 'ఆమె, ఏరైలుకు వెళుతుందో కనుక్కో, వెంట ఎవరూలేకుండా, ఒంటరిగా వచ్చినట్టుంది, పాపం! టిక్కెట్టు ఏమన్నా తెచ్చిపెట్టాలో – ఏమో.. అడుగు. .'అని ఆమెదగ్గరకు తోలాను. వాడు ..అక్కడకు వెళ్ళి నేను అడగమన్నదంతా – అక్షరం తప్పకుండా. నాకు వినపడేందుకు, బిగ్గరగా – ఒకసారికి నాలుగుసార్లు అడిగాడు చివరకు, వాడికే విసుగువచ్చినట్టుగా ఉంది. తిరిగివచ్చి ..చప్పరించి పెదవి విరిచాడు: నేను – పరధ్యానంగా తలఊగించాను – (అంటే. అక్కడ మళ్ళా కొంత లౌక్యం ఉంది: మనం ఏమాత్రమన్నా ఆదుర్దా కనబరుస్తే ..యిదేదో వ్యవహారం గదా అని వాడు పసిపట్టి, అటోయిటో తేలేదాకా అక్కడే తారటలాడుతుంటాడు వాడిముడుపేదో వాడికి చెల్లినా .ఎక్కైనా...ఆవిషయం ఆ మరునిమిషంలో **అలా అలా** నాలుగుమూలలా ప్రాకి .అందరూ మనవంక అదోమాదిరిగా చూడటం..ఈగొడవేదీ లేకుండా...'ఏదో దయదలచి ఆడకూతురు ఒంటరిగా ఉన్నది కదా అని. కనుక్కోమన్నారే కాని, అయ్యగారికి అంతకన్న వేరే అభిప్రాయం ఏమీలేదు–' అని వాడనుకునేట్టుగా మనం అభినయించితే ఉత్తరత్ర ఏ చిక్కూ ఉండదు: అదీ సంగతి)–

అక్కడితో, ఆ అశకాస్తా మాయమైంది. ఇంక అనంతర కరణీయం బెయ్యది?

ఏదీ పాలుపోక...మళ్ళా మొదటికే వచ్చాను. అలా కూర్చుని, అదేపనిగా, ఏమిచేయడమా అని ఒకటే ఆలోచన.

అదేవరుసను 'కనబడ్డ అందరిచేత – అతి తెలివిగా రాయబారాలు నడిపాను: పళ్ళు అమ్మేవాడు – సోడా సాయెబు, బిస్కత్తులూ, నాన్‌రొట్టె ముసలివాడు – ఒకరేమిటి అందరినీ...నాకు అందుబాటులో వున్నవాళ్ళందరినీ...'అదిగో ఆ అమ్మాయి. అవి కావాలంటూంది, కనుక్కో'మని అక్కడికి తోలడం, వాళ్ళు తీరా అందాకా వెళ్ళి...ఆమెనడిగి...నేను పంపించానని నావంక చూపించి...ఏమాటా రాకపోతే...ఎంతసేపక్కడ అవతల బేరం చెడగొట్టుకుంటూ అలా నిలుచుంటారు గనుక...ఎగువకు వెళ్ళిపోవటం. యీలా, పుణ్యకాలం కాస్తా గడచిపోతూంది.

టిక్కెట్టు కలెక్టరు వచ్చి. తలుపులు తెరిచాడు ప్రయాణీకులు ఒక్కొక్కరే యివతలకు వస్తున్నారు. ఇంకా కొంచెంసేపటికి...అంతటా మనుష్యులే అవుతారు

– అప్పుడు మన ఆట లిక సాగవు – యీలోగానే ఏమన్నా—

ఆమెకు కనబడేటట్లుగా.. నాలుగుసార్లు అటూ యిటూ ఆమెముందునుంచే పచారుచేశాను.

ఆమెను నేనైతే పరకాయించిచూడటానికి బాగా వీలుచిక్కింది కాని ఆ అమ్మాయి. నావంక ఒక్కమారైనా చూడందే

'అంత కొమ్మెక్కి కూర్చునేందు కేం – ఆకాశంనుంచి దిగివచ్చిందా, అబ్బో! చాలాదాకా ఉన్నదే...' అనుకుని విసుపుతో..అటు వెళ్ళి టీత్రాగి, త్రాగుతూ మళ్ళా ఆలోచించాను.

ఎవ రా అమ్మాయి?

మనవైపులపడుచులాగా లేదు. కాని చూడటానికి మా మజాగా ఉన్నది–

ఆమెకు.. అటూ యిటూ చూసే అలవాటన్నా లేదా.. లేకపోతే అదంతా మన అదృష్టమా?

ఒకవేళ ఆ అమ్మాయి అటువంటిది కాదేమో?— ఊహుఁ – అటువంటి వారంటూ ప్రత్యేకం ఉంటారా? – ఆ సమయం అంటూవచ్చి అన్నీ అలా ఒనగూడాలి కాని... అంతకుముందంతా అవనీ, కాకపోనీ...దిగడం .మూడునిముషాలు పట్టదు..అందుకు సరిఅయినవాడు దొరకాలి.. కాని

కాని...అవన్నీ మనం ఎదుకు కాకూడదు? – ఎందులో అయినా లోటా – అందం చందం...

ఏమిటో అన్నీ అర్థంలేకుండా – తలా తోకా కనబడని వెధవ ఊహలు: ఒకదానికొకదానికి సంబంధంలేదు... సబబూలేదు: కాని, ఆ వేడిమీద అవన్నీ తోచుతాయా? ఎదురుగా ఉన్నది – రంభ! ఏలా స్వర్గానికి ఎగబ్రాకటం? అంత వరకే!

అక్కడ... ఆ అమ్మాయిదగ్గర... చుట్టూ ఎవరో మనుష్యులు నిలుచున్నారు దిగ్గరగా మాటలు వినబడుతూన్నవి; యిందాకటంతచేరువకు వెళ్ళకుండా, కొంచెం అవతలగా నిలుచుని, ఏమిటా అని చూస్తున్నాను... ఆ అమ్మాయిదగ్గిర ఉన్న బట్టల మూటమీద ఒరిగి పడుకుని.. వెక్కి వెక్కి ఏడుస్తూన్నట్టుగా పక్క లెగురటం. కనిపిస్తూంది; ఎవరో, ముసలాయన దగ్గిరగా గొంతుకూర్చుని, సముదాయింపుగా ఏదో చెపుతున్నాడు... ఎవరికితోచిన మాటలు వారంటూన్నారు చుట్టూ ఉన్నవాళ్ళు—

"—బంగారంవంటి పిల్ల

"అలాంటివాడు, మరి పెళ్ళి ఎందుకుచేసుకోవాలి—

"—దీనిగొంతుకోయడానికి!

"—పాపం రంభలాగుంది! వాడికళ్ళకు యిది బాగుండలేదు – వెధవ–!

"—ఎక్కడిదేశం, ఎక్కడికెక్కడ! అడవిలో దించేసి వాడిత్రోవ వాడు చూసుకున్నాడు. ఆ చాకలిదానిమాత్రం చేయలేదు కాబోలు చేసుకున్న పెళ్ళాం—

"ఎందుకు చేస్తుందయ్యా...కండకావరం యిప్పుడదేమీ కనబడనీయదు. అది రేపు ఈపాటికి యింకోడిని తగులుకుపోతే...అప్పుడు ఎక్కడెక్కడ అని వెదక్కుంటూ మళ్ళా పెళ్ళాం కావాలని తయారవుతాడు."

"–పెళ్ళాం కావాలీ? – అసలు యిలాటి వెధవకు పిల్లనిచ్చినవాళ్ళని పాత చెప్పొకటి పుచ్చుకుని, ఆ చెంపా యీ చెంపా వాయించాలి ముందు – ఎన్నడూ యిలాటిపని చేసి ..అక్కానా అక్కానా అమాయకురాలి గొంతు కోయవుకదా – కోయవుగందా – అని"

"–వాడిని .కనబడితే..నిలువునా చీల్చినా పాపంలేదు–"

"–ఆc – ఇహ ఒకటే కనబడటం –మళ్ళా ఏముఖం పెట్టుకుని వస్తాడు: ఎక్కడో కుళ్ళి కుతమారి.."

"ఆ అమ్మాయిపని అన్నిందాలా అధోగతి అయింది. దేశంకాని దేశం. మన మాటా మన మంచీ లేకపోయెను యింతకూ ఆ పుణ్యాత్ముడెవరో కాని. యిన్నాళ్ళనుంచీ యింట్లోఉండి.. అద్దె ఎగవేసి.. అసలు శాస్త్రీ మాయమైనా – ఆ దండుగకు తోడు...యిప్పుడు బోలెడంత పోసి టిక్కెట్టు కొనియిచ్చి .చెంగునకట్టుకు, దోవలో వాడుకోమని, గుప్పెడు రూపాయలు, బతిమాలి, చేతిలో పెట్టాడయ్యా! కడుపున పుట్టిన బిడ్డకోసమన్నా మన మంత తాపత్రయపడం... పాపం! ఆ అమ్మాయికన్న ఎక్కువగా కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నాడు...'అమ్మా, యిన్నాళ్ళనుంచీ మా యింట్లో పిల్లలాగా ఉన్నావు.. వెళుతున్నావా' అని. 'నీ కేం భయంలేదమ్మా .త్రోవపొడుగునా... ఎవరో ఒకరు నీకు సాయంగా ఉండి..నీ పుట్టింటికి జేరేదాకా...ఆ ఏర్పాట్లన్నీ నేను చేశాను సుఖంగా వెళ్ళిరా మా తల్లీ..'అని .చూస్తూంటే నాకే ఏడుపు వచ్చింది––"

"అవును, ఎవరో ఒకరన్నా ఊరికి అలాటి ధర్మరాజులుండబట్టే.. పచ్చికలి యింకా భగ్గుమనకుండా లోకం యింతమాత్రంగానన్నా ఉంది ."

"––లేకపోతే అందరూ ఆ మొగుడిలాటి పనికిమాలినవెధవలే అయితే .ఆడ వాళ్ళందరూ ఇక కట్టకట్టుకుని ఏ గంగలోనన్నా దిగవచ్చు––"

అవన్నీ – చుట్టూ నిలుచుని యింతదాకా చోద్యంగా చూస్తూన్నవాళ్ళు అనుకుంటూన్న మాటలు – వింటూంటే... వింటున్నకొద్దీ...నేను చేసిన దారుణం...తలకెక్కిపోతూంది ..

––చేసుకున్న మొగాడు మోసంచేసి...పొట్టచేతబట్టుకుని...యింతదూరం వచ్చి. యీ అధ్వాన్నపడవిలో పారేసి ..అతీగతీచూడకుండాపోతే.. పుట్టెడుదుఃఖంతో రాయై.. కదల మెదలకుండా... ఆ అమ్మాయి అక్కడ పడిఉంటే...నేను చూసి లొట్టలువేశాను...!

ఏమేమో చేదామని చూశాను...కాదూ, నేను...మీసంఉన్న మగవాడిని...పెద్ద మనిషిని... నలుగురిలో మెలగనేర్చినవాడిని...

అవతల...ఆడది––

నేను––మగవాడిని...ఛీ..

తెగ్గోస్తే...కోసే కత్తికికూడా...నా పాపం చుట్టుకోదూ. నిజానికి .ఏమిటి నా ఊహ... ఏంచేదామని...కాస్సేపు ఆ పిల్లతో...కళ్ళతో చెలగాటమాడి...రైల్లో ఎక్కేదాకా చూసి...చూసి, ఏదో ఘనకార్యంచేసినవాడిలాగా యింటిదాకా...కూనిరాగంతీసుకుంటూ నడిచి ..అనవసరంగా.. ఆ ప్రస్తావన క్లబ్బులో..తీసుకువచ్చి... అక్కడ మన ప్రతాపం అందరితో చెప్పి. అంతేనా..

పోనీ, మాటవరుసకు...ఆ అమ్మాయి..నా అంత సుందరుణ్ణి ఎన్నడూ కలలోనైనా చూడనంత తలకుమాసినదై –సైఁ – అన్నదంటే మాత్రం అప్పుడు అమాంతం అపాళాన రైలుఎక్కి... అంత తాహతు ఉందా? – ఉహూఁ –

గడుసరిదై – మామూలు ధోరణిలోనే ఉండి..మనవాలకం చూసి కంతుమని లేచినట్టాయెనా..యిక మళ్ళా మరునాడు ఊళ్ళో తల ఎత్తుకు తిరగవీలుందా–

అ చేసుకున్న వెధవకన్న నే నేం మెరుగు?––

యీలాంటి వెధవలు (మన్నికూడా కలుపుకుని) ఉండబట్టే...యిలా తగులబడు తూంది; యింకా తగులబడుతుంది––

––రైలు ఏనాడో వెళ్ళిపోయింది..

దోవపొడుగునా. నన్ను నేను దులుపుకుంటూ. ఎన్ని గుణపాఠాలో నేర్చుకుంటూ... అంతకుపూర్వం నేర్చుకుని మూలపడవేసినవి మళ్ళా నెమరుకు తెచ్చుకుంటూ..క్రమంగా నేను–నాలోకి – నాలోనుంచి ప్రపంచంలోకి. ప్రపంచంమీదనుంచి పరమాత్మ మీదకి...అక్కడనుంచి మళ్ళా ఒక్క విసరున ఆత్మమీదకీ..పుణ్యం–పాపం...చీకటిలో – వేదాంతమార్గాలన్నీ గుర్తులు పెట్టుకుంటూ, పట్టాలవెంబడి నడచి.. రోడ్డుఎక్కి మళ్ళా వెలుతురులోకి వచ్చాను..

సోడా ఫౌంటెన్‌దగ్గిర..డ్రింక్ మీద డ్రింకు...కడుపునిలువునా చల్లబడి గుక్కమీద గుక్క.. సిగరెట్‌తో కళ్ళలోకి తెలివివచ్చి..ప్రొద్దుపోతున్నదికదా అని...సత్తువతో కాలుసాగించుతూ.

అ మేడముందు...పున్నాగచెట్టునీడను, గేటును అనుకుని క్రీనీడలో తెల్లచీరె.. తళుక్కుమని చూచాయగా కమ్మలూ...తలలో మల్లెపూలున్నట్టుగా గురుతూ – అంతదూరాన్నుంచే కంటికి తగిలేటప్పటికి...

అలవాటుచొప్పున...

అంతామరచిపోయి..

ఆమె ఎవరో...అక్కడనుంచే కదిలిన తరువాత... వెలుతురులోకి వస్తే...ముఖమన్నా కనబడుతుందికదా అని..

వెధవ అలవాటుచొప్పున – అక్కడ ఆగాను ఓ క్షణం

★ ★ ★

# నేతి నేతి

తాతగారు రావడం చూసి, అతడు లేచి నిలుచుని నమస్కారంచేశాడు. ఆశ్వీరదించి, పక్క కుర్చీలో కూర్చుని 'అగ్గిపెట్టె అందుకోరా ఓమారు–' అంటే, తీసుకురావడానికని నేను లోపలికి వెళ్ళి పెట్టినచోట కనబడకపోతే, వెదుకుతున్నాను పట్టుకునివచ్చేలోపల తాతగారు అతడితో పరిచయంచేసుకుని సంభాషణలోకి దిగారు

'...చాలా సంతోషం బాబూ...నిన్ను చూడటానికి ముచ్చటగా ఉంది. యింత చిన్నతనంలోనే ఫలానా విశ్వవిద్యాలయంలో ఆంధ్రశాఖకు ప్రధాన ఆచార్యుడవైనావంటే..'

నేనుకూడా ఉత్సాహంకొద్దీ ఆ ప్రశంసా — ప్రవాహానికి అడ్డం ఈది... 'అవునండీ...అవునండీ— మా కందరికీ గర్వం యీతన్ని చూసుకుంటూంటే: ఫాయా ఒక్కటే కాదు, ఆంధ్ర సారస్వతంమీద — అథారిటీ' అన్నాను అతడు ముసిముసిగా..'ఏమిటోలెండి తమవంటి పెద్దలచలువ! నామీద అభిమానం కొద్దీ మనవాడు అనడంకాని...మీలాటి యోధులముందు మేము లెక్కా జమా' అని వినయించాడు

'మా చదువూ మేమే చెప్పాలి! చదువుకన్న సందేహాలే ఎక్కువ ఈనాటికీ తీరవు – పెద్దవాడిని... చనవుతీసుకుని అడుగుతున్నాను మరి ప్రయాగ బాపన్న చదువుకున్నవాడూ, కర్మిష్ఠీ అని ప్రతీతి ఉన్నదికదా! అక్కడే పడిఉండి, ఆ మాలకూడు తింటూండకపోతే...దేశం గొడ్డుపోయిందా? — మొఖాసా విడిచిపెట్టిపోతే, యింకోచోట ఆశ్రయం దొరికేది కాదా? – శొంఠి సుబ్బన్నంటావూ... వైదికపుముండావాడని అనుకోవడమేకాని — కాస్తో కూస్తో డొక్కశుద్ధిఅయినా...పక్కతాళంబ్రతుకు! భీమరాజు ఏలా అంటే అలా ఆడేవాడు. అగ్నీ వాయువూలాగా ఆ యిద్దరూ ఏకం అయేటప్పటికీ — అంతా ఓ కొలిక్కి తీసుకువచ్చారు. అంతేకాదూ?—'

తాతగారు..అంత ఘరానా పెద్దమనిషి మరొకడిని పరుషవాక్యం అనడం. నేను యించుమించు ఎన్నడూ వినలేదనే చెప్పవచ్చు: ఆయన వాకబులో అనంతకోటిస్కాండల్సు తాండవిస్తున్నా. అంగటిదాటవు మరి. ఏమిటి ఆ ధోరణి..ఎవరు వాళ్లు-

—నాలాగానే అతడూ తెల్లబోయి చూస్తూ ఊరుకున్నాడు.

'తెలియక అడుగుతున్నాను...నీవు అలా ఊరుకోవడం భావ్యంకాదు', అని తాతగారు వదలకుండా హెచ్చరించారు.

"నాకు తెలియదండీ అసలు వా రెవరో" అని అతడు చిన్న బుచ్చుకుంటూ కష్టంగా చెప్పాడు.

"తెలియదనడం నీ వినయాన్ని తెలియజేస్తుంది. అంతే; అది నిజమవుతుందా?"

"ప్రమాణపూర్తిగా.."

"వద్దు బాబూ! అంతమాట అనకూడదు అబద్ధ మాడవలసినంత అవసరం నీకు ఏమివచ్చింది? చూడు, వయసులో నీకన్న పెద్దవాడినా ఏదో ఉత్సాహంకొద్దీ ప్రసంగంలోకి దించింది నిన్ను కించపరచవలెనని ఎంతమాత్రమున్నూ కాదు సుమా! నాయనా..మంచిది: మీయిద్దరూ ఖులాసాగా మాట్లాడుకోండి ." అంటూ తాతగారు చుట్ట కిటికీలోంచి బయటకు గిరవాటు వేసి, ఖాండ్రిస్తూ లోపలికి వెళ్ళిపోయినాడు – మంచినీళ్ళు పుక్కిలించడానికి –

––రంగం చెడింది; ఇక నేను కూర్చోమన్నా లాభం లేదు కనుక..అతడు వెళుతానని లేవగానే నేనూ సరేనని గుమ్మందాకా వెళ్ళి..'సాయంకాలము పార్కుకు పెందరాడే వస్తాను. అక్కడనుంచి పిక్చరుకు వెళుదాము..' అంటూ ఉత్సాహంగా మాట్లాడి...దిగాలుపడి, జవాబు చెప్పకుండా, మరియాదకు తలఊపి అతడు వెళ్ళిపోతూంటే – చూస్తూంటే నాకు చాలా కష్టంవేసి. అక్కడే ఆలాగే నిలుచునిపోయినాను...

"వీడి తస్సాగొయ్యా..ద్రావిడుడంటే ఏలాగైనా ఉద్దండుడే..."

తాతగారు – మళ్ళా ఏమిటి ఆ ధోరణి? నావెనకాలనే నిలుచున్నాడని తెలిసికూడా నేను ఆయనకేసి తిరగలేదు. తిరిగితే తిక్కమీద..ఏం తూలనాడుతానో అని అమిత భయం వేసింది .ఆయనమీద అందాకా నాకు అంతగౌరవం

కాని, ఆయనేం ఊరుకున్నారా? – "వెంకట శాస్త్రుల్ల కుటుంబంకూడా అంతదాకా నూజివీడులోనే ఉండేది కాదూ? పిల్ల లెంతమంది? – అల్లుడు పట్టి బడుద్దాయి, సత్రాలల్లో రాళ్ళుకొట్టేరకం.. అంతేకాదూ?.."

నాకు...యిహ మండిపోయింది.

"ఏమిటండీ?" అని కొంచెం దురుసుగానే అడిగాను. యిద్దరం ముఖాముఖి కాక తప్పింది కాదు – ఆ ధూకుడుకు.

"అదేనండీ...నేను యిందాకటినుంచీ అంటూన్నదేనండీ..నిజమేనా అండీ " ఆయన కనుబొమలు చిట్లించి మాట్లాడుతున్నా – కొంటెతనమే కాని. కోపం కాదని తెలుసును; నేను ఏంచేసినా కోప్పడడు చిన్నప్పుడు నాకు యిచ్చిన వరాలలో అది ఒకటి – అందుకని ఆ ఘట్టంలో నేను నవ్వక తప్పదు...

"ఏదీ ఒక సిగరెట్"...నలభై యేళ్ళనుంచి ఏకబిగిని చుట్టకాలుస్తూన్న, వ్రత శీలి...తాతగారు సిగరెట్ కాలుస్తాననడం...ఏమో అంతా విచిత్రంగా ఉంది – అది వరకల్లా అయితే, ఆయన మొదలుపెట్టిన అల్లరికి అపాటికి అప్పుడే నాకు అంతుచిక్కేది...కలిసి తరువాత కాండ నడిపేవాళ్ళం. కాని .

––తెలివితక్కువగా అంతలో బయటపడటం ఎందుకని.. యిచ్చాను. యిద్దరం ముట్టించాము – రెండు దమ్ములలోనే ఆయన చిగురుకులాగి రాల్చేశారు. మనది యింకా కాలుతూనే ఉంది––

"ఇలా ఉండాలి" అన్నారు––

"ఏది?"

"ఏదైనా కానీ...పైకి మాంచిపసందుగా - నాజూకుగా - ముట్టుకుంటే రాలిపోతూ - పట్టుబడితే కాలిపోతూ, ఆఖరైతేనేగాని అరకపోవడం. అది నిజంగా సుగుణంకాదూ?-"

అవిడ పుణ్యమా అంటూ అమ్మమ్మ యింతలో లోపలనుంచి, మడికట్టుకోమని పిలవడానికని వచ్చి... వింటూ నిలుచుని...నవ్వుతూ-

"బాగానే ఉంది, ఆనాటికానాడు మరీ పసిపాపలవుతున్నారా ఏం..." అన్నది - అయన నిదానంగా ఆమెను ఎగాదిగా చూసి - "వారకన్యక యారీతి వలచుటవే" అంటూ తాకేటంత దగ్గరగా వెళ్ళేటప్పటికి ఆమె కంగారుగా ఒక్క అంగలో లోపలికి పోయింది--

"అదేమిటండీ...మడిగట్టుకున్నది...అందులో యివాళ శనివారంకూడానూ."

"అదేనోయ్ పండిత్‌జీ నేను అన్నది - ఆమె శనివారకన్యక...యీ సరసము లాడేటందుకు సమయాసమయముల పాటింపు మనకు అంతగా లేకపోయినా...యీ చేష్టలకు మురిసి, నేను పసివాడిలాగా చెయిచేసుకుంటే నీకే యిబ్బందిసుమా అని హెచ్చరించడమే. యిన్నాళ్ళ నుంచీ కాపురం చేస్తున్న అవ్వను పట్టుకు యిప్పుడు వసంతాలాడించటంకాదు; కన్యక అని గౌరవించడం - దుర్గిలాగా. ..దుర్గి అంటే పురుషోత్తం మేనకోడలనుకునేవు. .అసలు దుర్గి...ఆ హంశ ఆవహింపజేయడం... సమ్‌ఝా?"

"బహుత్"

"శహబాస్... ఆంధ్రసారస్వత - బోధనస్వాములకన్న...నీవే మెరుగు..."

"అతను పాపం చిన్నబుచ్చుకున్నాడండీ" అని అంతలో మూడ్ మార్చుకుని... యింతకుముందు జరిగిన కలాపం అంతా ఒక్కసారి ఉప్పెనలాగా జ్ఞాపకంరాగా...మూతిముడుచుకోబోయినాను - తాతగారు జంకకుండా--

"చిన్నబుచ్చుకుంటేకాదు. .దేశానికి ఒరిగేదేంలేదు..చిన్న జీతం పుచ్చుకోమను - అదీ మరియాద"

"అతను చాలా మరియాదస్తుడండీ"

"నిజంగా?"

"నిజం"

"అయితే నిఘంటువు తీయి చూదాము. పోనీ, నీవు చూడు...చదువురాని సరస్వతి అనే అర్థం ఉన్నదేమో...విశ్వవిద్యాలయంవారు అచ్చువేయించినదే అయితే, ఆ నిర్వచనం ఉందనుకుంటాను .."

"మీకు అతనిమీద అంత కోపం ఎందుకో నాకు అర్థం కావడంలేదు--"

"అతనిమీద కాదు...యీతనిమీద కాదు.. అసలు అజ్ఞానమంటే అందరికీ సహజంగా ఉండే మంటే!"

"అలా ఎందుకు అభిప్రాయపడుతున్నారో"

"పడేసింది. .మీ మిత్రుడు...ఆ ప్రధానాచార్య మహాశయుడే...నీవు చెప్పావు...నీ మాటమీద నమ్మకం ఉన్నది. .నీమాటేమిటి, విద్యాధికారులకే నమ్మకం కుదిరినప్పుడు.. అతడి కూలంకష పాండిత్యాన్ని నేను శంకించడం మరియాదా? - లేదు, శంకించనేలేదు; కాని...అంతస్థాయికి నేను అందుకోగలసత్తా లేదు

చూడు...అందుకని.. లఘువుగానే ధోరణి ప్రారంభించానా..మరి, బెల్లంకొట్టినరాయిలాగా ఊరుకోవడం ..తెలియదనడం. నేను ఏమనుకోవాలి?——"

"నాకు అర్థంకాలేదు ."

"అవసరంలేదు... అభిరుచి ఉన్నదేకాని, అంత పండితుడవనే అహం ఉందా నీకు? పైగా సైన్సు వాడివి; సైన్సుకూ సారస్వతానికీ సగానికిమించిన ఎరిక ఉండనక్కరలేదు—— ఉన్నా దోషం లేదనుకో కాని. ఓపిక ఉండాలి అందుకు. మీ నెచ్చెలికి...ఓపిక...జ్ఞాపకం.. అవి రెండూకూడా ఒంటికి పడవనుకుంటాను——"

"మీకు – మా ఉభయులతరుపునా ఒక్క పేద్దనమస్కారం యింతటితో విడిచిపెట్టండి——"

"విడిచిపెట్టడం అంటే యిదివరకల్లా పట్టుకుకూర్చున్నాను గనుకనా. విషయం వచ్చింది కనుక... విడువదలచుకోలేదు; అమాయకపు బ్రాహ్మణుడు అయన...వెనుకటికి...రాజమండ్రిలో హిందీ అంటూ వచ్చి, తెలుగు మీదఎక్కి తొక్కుతూన్నదని వాపోయినాడు... కాని, యీలాటివాళ్ళు తెలుక్కి పెద్దపీట వేయించుకోవటంవల్ల.. భాషకూ పాండిత్యానికీ పాపం బద్దలూ చెక్కలూ అవుతూన్నదని గురితించినట్లు లేదు ..ఎందుకులే అనుకోవడం ..మనవల్లమాత్రం ఏమవుతుంది?——"

"అంతేలెండి"

"అని ఊరుకుందాం; సరేకాని, ఒక్క చిన్న అనుమానం...అది మీ మిత్రుడు తీరిస్తే... యింతసేపునుంచీ అనుకున్నది అంతా మరచిపోతాను చాలా తేలికవిషయం – తెలియకుండా ఉండటానికే వీలులేదు; ఏమంటే – మోడేరాయలకూతురు నిద్రపోతున్నప్పుడు – తెలియకుండా ఎవడో చీకట్లోనే చిందువేసిపోయినాడట.. ఏమిటి కారణం? – అంతే – ఏం?"

"యిందాకటివాటి తాతలాగా ఉంది."

"అయితే – కాలేజీమానేసి...మడిగట్టుకు యింట్లో కూర్చుని, శుద్ధనిర్గుణ కందార్థదరువులు – సాగించమను– ఉచ్ఛనీచాలుఉన్న సారస్వతులకు అదే శిక్ష"——

——భోజనం వేళ అయింది.

★ ★ ★

# ఖుషీ

బ్రహ్మచర్యంలోనుంచి – ఒక్కసారిగా – డబుల్ ప్రమోషన్ అయింది.

ఎందుచేతనో, రామమూర్తి వానప్రస్థుడుగా మారిపోయి – దీక్ష నిలుపుకుంటున్నాడు.

అందరికీ, ఇది చాలా విపరీతంగా కనబడుతూంది. కాని, ఎవరికివారు ఏదో సమాధానం ఊహించుకుని సరిపెట్టుకోవడమేకాని, నిజానికి ఏం జరిగిందో, అలా అతడు – తాత్కాలికంగానన్నా – మారిపోవలసివచ్చిందో, నాకూ, మా శర్మకూ తప్ప...తెలియదు.

ట్రిప్లికేన్‌లో, మా లాడ్జిలోనే రామమూర్తికూడా ఉండేవాడు, లా చదువుతూ. అసలు శ్రద్ధగా కాలేజీకి వెళ్ళేవాళ్ళకే మధ్యాహ్నం అంతా తీరుబడి – వెళ్ళనక్కరలేకుండానే, ప్రాక్సీగా అటెండెన్సు పడిపోవటంవల్ల, రామమూర్తికి రోజంతా తీరికే.

మనసులో నిలిచిపోయి, తీరనికోరికలన్నీ, కలలో పిలువకుండానే సాక్షాత్కారించేవి. తెల్లవార్లూ కలతనిద్దురతో – చాలా ప్రొద్దెక్కిన తరువాతకాని మేల్కొంచేవాడు కాడు అందరూ కాలేజీకి బయలుదేరేవేళకు కాఫీకోసం వెతుక్కుంటూ పోయేవాడు భోజనం – ఏ ఒంటిగంటకో కేవలం పోస్టులో ఉత్తరం వేసినట్టు మొక్కుతీర్చుకోవటం మాత్రమే.

మూడు, మూడున్నరవరకూ, ఏలాగో గడిపేవాడు చిడిముడిపాటుతో నిదురరాదు–ఉబుసుపోదు; ఏ పుస్తకం చదవాలనీకూడా మనసులేదు; కొంచెంసేపు మాత్రం సినిమా మాగజీన్లు తిరగవేసి, బొమ్మలు చూసీచూడనట్లు చూసి, విసుగుతో ఓ మూలకు గిరాటు వేసేవాడు. ఆవేళకే సరిగా సిగరెట్లుకూడా అయిపోయేవి. వెళ్ళి తెచ్చుకునేందుకు ఓపిక లేదు. ఇన్ని అవస్థలతో – ఏలాగో టైమ్ అయేది.

ఇకమీద, రామమూర్తికి నిముషం తీరిక ఉండేది కాదు. టాయ్‌లెట్ చేసుకుని, సూట్ వేసుకుని, క్రాప్ నొక్కులు చేతితో సరిజేసుకుంటూ మేడమీద వరండాలోనికి వచ్చి నిలుచునేవాడు అటూ ఇటూ చూస్తూ.

ఎదటి మేడగుమ్మంలో, వచ్చేపోయేవారినందరినీ, కరవుమెరసిపోయే కన్నులతో చూస్తూ నిలువబడివుండే మహారాష్ట్ర ప్రౌఢ, రామమూర్తినీడ చూచాయగా కనబడగానే, చురచురచూసి, లోపలిపోయి, కటకటాలతలుపు ధనాయించి వేసుకునేది. మావాడు గొంతుసవరించుకుని, ఎత్తుకుంటూన్న సంగీతానికి బ్రేక్ పడి, అపశ్రుతితో ఈలగా మారిపోయేది. రోజూ అలా మామూలేగనుక, ఏమీ అనుకోకుండా లోపలికి వచ్చేసి, చెదరిన ఒకటి రెండు ముంగురులు సరిగా అమర్చుకుని, రిస్టువాచివంక నిదానించి చూసి, క్రిందకి వచ్చేసేవాడు.

రోడ్డుమీద – చక్కనివాళ్ళు ఎవరైనా కనబడేటంతవరకూ ఆగి, వాళ్ళని అనుసరించి బీచికి పోయేవాడు. రెస్టారెంటులో టీ పుచ్చుకుని, ఆరని అగ్నిహోత్రంతో సమిధెకు సమిధె ఆసలాయిస్తూ, ఒక్కమారి, వ్యాయంసి వరకూ తిరిగి వచ్చేవాడు. సంజెపడటంతోనే బయలుదేరి గృహోన్ముఖులైన తమిళాంగనలను యథాశక్తి కొంతదూరంవరకూ సాగనంపి వచ్చి, బస్‌స్టాండ్ దగ్గర కాపలా వేసేవాడు

అనువైనవాళ్ళు ఎక్కిన బస్‌లో తానూ జొరబడి, వాళ్ళను అనుసరించి పోయి ఇంటికి జేరుకునేంతవరకూ తచ్చాడి, లోపలికివెళ్ళి తలుపు వేసుకున్న చప్పుడైన తరువాత .ఇంటిమొగమయ్యేవాడు.

కొంచెం ఆలస్యంఅయితే హోటల్లో శివరాత్రే. నాయర్ కడెలో పలాచని పాలుతాగి, బిస్కట్లు తిని, వచ్చేసేవాడు. తీరా వచ్చిన తరువాత – మేమెవరమూ, మేలుకుని ఉన్నా, కొంటెతనానకి – పలికేవాళ్ళంకాదు, తలుపు తీసేవాళ్ళంకాదు. ధణధణకు వీధివారందరూ లేచినా, మా తలుపు అలాగే ఉండేది. ఏమనుకునేవాడో ఒక్కొక్కప్పుడు మాకే జాలివేసేది – తిరిగి బీచికి పోయి, తలకు కర్చీఫ్‌కట్టుకుని పడుకుని, చలికి బిగిసి అవస్థపడి తూర్పు తెలవారే వేళకు, తెల్లవార్లూ రమాకుమారుణ్ణి పాదదాసునిగా ఏలుకుని అవక్రవిక్రమం నెరపిన వీరపురుషావతారం పోజులో తయారయే వాడు లాడ్జికి—

పొరబాటున, కదిలించామో, అరేబియన్ నైట్సులో కథ ఒకటి తయారుచేసి చెప్పేవాడు. మేము నమ్మడంలేదు, వెక్కిరిస్తున్నామన్నా ఖాతర్ చేస్తేగా? కథ ముగిసిన తరవాత నిద్ర –

ఇదీ రామమూర్తి దినచర్య – ఎఫ్.ఎల్..పరీక్షలు దగ్గరకువచ్చినాయి – రోమన్ లా పేరు ఎత్తితే మండిపడేవాడు. కాని, కామినీప్రశంస లేనిదే క్షణం జరుగదు.

## 2

—మేము ఎంత ఒత్తుకుని వైదొలగి నడుస్తున్నా – ఒక్కతె అయినా ఒత్తిగిలి దోవ ఈయడంలేదు.

గంగకు ఇద్దరి ఐనా ఫరవాలేదనే సంప్రదాయంవాడిని గనుక, ఇక అక్కడే ఆగిపోదామన్నాను కాని శర్మ ఉహుఁ అని ముందుకు అడుగు వేస్తూనే ఉన్నాడు; కాని, దారి తీయడానికి – ఆ స్త్రీజనంలో – వాడికి సాధ్యంకాలేదు

పార్థసారధి బ్రహ్మోత్సవం ఆఖరిరోజు – వీధుల్లో మెసలడానికి వీలులేనంత సమ్మర్దంగా ఉన్నది.

—మా వీధుల్లో ఉండే తెలుగు కుర్రవాళ్ళ ముఖాలు నడనడాన, దవనమూ చేమంతులూ విరిసిన తురుములచాటునుంచి కనబడుతున్నాయి ప్రసన్నంగా.

రామమూర్తికి ఇంటివద్దనుంచి టెలిగ్రాం వచ్చింది—– ఎందుకో తొందరగా రమ్మని – అతడు, మాకు యీ వారం రోజులనుంచీ కనబడుటలేదు.

నేను వద్దని వారిస్తూ ఉన్నా శర్మ, రామమూర్తిని వెదికి తీసుకురావాలనేవంకబెట్టి బయలుదేరాడు –– అసలు లోపల వాడికి తహతహలాడుతూంది – ఎప్పుడు వెళ్ళి ఆ జనం కిటకిటలో కలిసిపోదామా అని. – నేనూ బతిమాలించుకుని, బింకం చెడకుండా వెంట నడిచాను.

శర్మ ఆకారవైఖరినీ, దీర్ఘ కాయాన్నీ చూసి ఎవరూ తప్పుకోవడంలేదు. బలవంతాన రెండడుగులు వేసి, స్టీమ్ అయిపోయిన రోడ్‌రోలర్‌లాగా చప్పబడి ఆగిపోయినాడు. నా వైపు చూసేసరికి నేను నవ్వుతున్నాను. అంతలో ఎక్కడ లేని రోషం వచ్చేసింది వాడికి –

మాంచి ఆలోచన చేశాడు – మళ్ళా వెనుకకు వచ్చి, జపాన్ బెలూన్ బూరా ఒకటి కొన్నాడు పూరించి, గోళాన్ని పెద్దదిచేసి, దాన్ని – మోతతో, తప్పుకోని పుణ్యాంగనల చెంపలకు తాకిస్తూ – వాళ్ళు ఉలికిపడి తిట్టుకుంటూ తప్పుకోగా – ఏలాగో – ఆలయప్రాంతంవరకూ రహదారి చేశాడు.

ఒక్కక్షణం ఆగి కలయచూశాము–రామమూర్తి కనబడలేదు. కాని – మన తెలుగువాళ్ళు అసాధ్యులు– అప్పుడే ఎప్పుడు కనిపెట్టారో–అందరూ తలోబూరా పూరించి, కామినీచక్రాన్నంతా కలగుండు పెట్టేస్తున్నారు

––శర్మకు ఉక్రోషంవచ్చి – 'ఇంతే వెధవాయలు!– ఎవరన్నా ఏంచేస్తే – దాన్ని కాపీకొట్టడమే' అని తెలుగు జాతిని అంతా దూయబట్టుకుని, నిర్వేదంతో సత్తువకొద్దీ పూరించేటప్పటికీ, బుడగ, చిన్న సైజు ఫిరంగీలాగ మోగింది మళ్ళా ఒకటి కొనిద్దామనిపించింది. కాని, వాడిని చూడబోతే దుర్నిరీక్ష్యుడుగా ఉన్నాడు. ఆ పట్టున ఎన్ని అయినా ఆగేటట్టులేవు––

విసివి, వేసారి తిరిగి వచ్చేస్తూ – కార్‌స్ట్రీట్ మొగదల, గుంపుజేరితే, అందుకు వెళ్ళాము – ఏమిటో విశేషమని – చాలామంది అర్ధచంద్రాకృతిగా కమ్ముకుని నిలుచుని తగవు తీరుస్తున్నారు. ఒక ఆమె, ఊరికే లెక్చర్ కొడుతూంది– ఎవరికి తోచినది వారంటున్నారు – మధ్య – తెల్లమొఖం వేసుకు, బిక్కపోయి చూస్తూ చెదిరిన క్రాపింగుతో – రామమూర్తి!–

ఏముందీ – మామూలు విశేషమే – మనవాడి రసపిపాస అతిగా వెళ్ళింది – ఎవరో అమ్మాయిని కటాక్షవీక్షణంతో సత్కరించాడు – వెంటనున్న ముసలమ్మ గదమాయిస్తూంది!

శర్మ అమాంతం తోసుకువెళ్ళి, ముందుకు – ఏమిటీ గలభా అని కలయజూసి అడిగాడు – రామమూర్తి శర్మను ఎరగనట్లు నటించాడు.

అందరి సమాధానాలహోరులో అసలుసంగతి ఏమిటో తెలియలేదు. శర్మ రామమూర్తి చేయిపట్టుకున్నాడు ఆ ముసలమ్మ అడ్డంవచ్చి – 'ఆహాఁ–నాన్ యారో తేరీమా – అఁ– అంద పరువు నమ్మకిట్టవేహోదు–స్టేషన్‌కు..' అని గదమాయిస్తూండగానే, శర్మ హుంకరించి వృద్ధాకరగ్రహణం చేసి "స్టేషన్‌కు–వా" అని లాగాడు

పాచిక పారింది–అందరూ గడబిడగా ఎవరిత్రోవను వాళ్ళు తప్పుకుని – ముసలమ్మనూ–ఆ ముగ్ధాంగననూ బలవంతాన నడిపించుకునిపోయినారు––

––ఇంటికి వచ్చేవరకూ, ఎవరమూ మాట్లాడలేదు. తలుపుతీసి, స్విచ్ వేశాను. రామమూర్తి ఈజీ చైరులో ఉన్న పుస్తకాలు తీసి క్రిందకు విసరివేసి కూలబడ్డాడు. పరధ్యానంగా, వాడిజేబులోనుంచి సిగరెట్టు అందుకుని, ముట్టిస్తూ, శర్మ ఓమారు అతనివేపు పరకాయించిచూసి – 'ఏమి టా గలభా?' అన్నాడు.

రామమూర్తి చూసి ఊరుకున్నాడు. శర్మ ప్రశ్నలపరంపర కురిపించాడు. చివరకు గత్యంతరములేక, జవాబు చెప్పక విధిలేక, నిదానించి, కుర్చీలోంచి లేచి, పక్కమీద వాలుతూ—

'మన్మధుని అమోఘ ప్రభావంరా భాయీ!' అని గర్వంగా చిరునవ్వు నవ్వాడు

శర్మ ముందుకు ఉరికి, పక్క అంచున నిలుచుని చురచుర చూస్తూ,

'ఒరేయ్! వాడిబాబు ఇంకోడున్నాడు ఇన్స్పెక్టరు సింగ్ – ఆ తడాఖా తడివితే తెలిసేది–ఊహుఁ–పిచ్చి వేషాలు...'

...ఉక్కబోస్తున్నా లెక్క సేయకుండా, రామమూర్తి ముసుగుబిగించాడు——

## 3

——అప్పటికి మూడోమాటు...చదవడం——

'తేనెసోనలాని ఉబుసు
పోని కొదమ షట్పదాళి
గానమాధురి——
సగము విరిసె తొలివలపుల
నిగారించు విరి చేడెల
మొగమాటము——
జిలిబిలిగా మలసిన వె
న్నెల నెలరేకల వెలసిన
చెలిమి..
మధుమాస యామినీ
మాధవుని——ప్రియకామినీ
ఇన్ని హొయలతో——
ఇన్ని వగలతో
ఎన్న డెన్నడని
ఎదురుచూసి——మురిసి...
చిగురుకు——
తొగరాయనితో
మొగమాటము
తగవేసమ్మా!' •

——ఆవేళ రేడియోలో మంచి ప్రోగ్రాము ఉన్నది.

——అప్పటికే ఆలస్యమైంది. ఇక బయలుదేరుదామనుకుంటూంటే, రామమూర్తి నిలవేశాడు.

పద్యాలు వ్రాయడం – మాకు యిష్టమున్నా లేకపోయినా పంతంకొద్దీ వినిపించడం – అతనికి పరిపాటే కాని, యీ ధోరణి అదోరకంగా ఉన్నది

'ఏలా ఉంది?' అని మళ్ళా నిక్కచ్చిగా అడిగాడు;

'. ఇంకా టీ పడలేదుకాదూ, కొంచెం తల దిమ్ముగా ఉంది' అని పెంకెగా జవాబు చెప్పాను, కోపం వచ్చిఅయినా వదులుతాడేమోనని——

కాని, ఇదేం లక్ష్యం చేయకుండా, తాపీగా ––

"అదికాదోయ్–పద్యం .?"

'ఆఁ – బాగానే ఉంది.'

"అలా అంటే కాదు – నీకు సరిగా ఎలా తోచిందో చెప్పాలి."

"చెప్పలేను బాబూ. ఇక చంపకు"

"దీన్ని – దీన్ని ఒక పనిపట్టి వ్రాశాను–"

"అలాగేం?"

"నిజంగానే – మరి ఎందుకో – ఊహించుకో–"

"రామ్మూర్తీ .నీకు కోపంవస్తేనేంగాని, ఎందుకు వ్రాశావో చెప్పనా ."

"ఓ"

"     పొగరెక్కి.. ఏమిటి ఊరికే సతాయించడం"

––అంతటితో వదులుతాడనుకున్నాను – ఉహూ... నావెంట వచ్చేశాడు తిన్నగా – టీ పుచ్చుకున్నాడు... సరసను నడుస్తున్నాడు – ప్రెసిడెన్సీ కాలేజీదాకా వచ్చాక – చప్పున ఆగి–

"చెప్పనా?" అన్నాడు.

ఏమిటో తెలియకపోయినా, నేను తల ఊపాను...

'–– ఆ అమ్మాయి, ఇలియట్స్ రోడ్డులో ఉంటుందోయ్.. చాలా చక్కనిది––'

'కావచ్చును––'

'మాటకు అడ్డం రామోక – నిజంగానే చాలా అందంగా ఉంటుంది వారం రోజులనుంచీ చూస్తున్నాను .'

'ఇంటిదాకా సాగనంపడంలేదూ?'

'చాల్లే – నీ మాటలు – సరేగాని, వాళ్ళయింటిరోడ్డుకేసి రెండుమూడుసార్లు వెళ్ళాను – కనిపించింది – మేడమీద పోర్టికోలో నిలుచుని – అదేదో తమాషాగా, పిలుస్తున్నట్లుగా చూస్తుందోయ్ – నాకు ఏమీ తోచడంలేదు––'

'పిలిచిందని నమ్మకముంటే––'

'సందేహంలేదు – మనసుకి అలాగే తడుతూంది.'

'అలాగైతే తిన్నగా వెళ్ళిపోరాదూ '

'అంతకన్న ఇంకో ఎత్తువేశాను ఆ అమ్మాయి సంగీతం పాడుతుంది రోజూ, బాగా చీకటిపడినతరువాత – వాళ్ళ ఇంటి ఎదుట – మైదానంలో కూర్చుని, ఈ పాట పాడేస్తాను, అప్పుడన్నా నా ఆవేదన – నా మనసులో కోరిక, అర్థం చేసుకోలేదూ – మందలింపు గ్రహించలేదూ '

'అయితే, ఇంతకూ తెలుగు వచ్చునో, రాదో?'

'వచ్చును – సర్వర్‌తో తెలుగున మాట్లాడటం విన్నాను – నామీద మనసుందోయ్ ఆ అమ్మాయికి..'

'అయితే భావకవిత్వ మెందుకు – డైరెక్టుమెథడ్ అప్లైచేయి తిన్నగా వెళ్ళిపో...'

"అచ్ఛా "

––రోడ్డుదాటి సైడ్ వాక్ మీదికి వచ్చాము – రామమూర్తి దిక్కులు చూస్తున్నాడు.

"రార మా యింటిదాకా.." అని రేడియోలో పాట వినవస్తోంది

——నా చేయి గట్టిగా నొక్కి..'అదుగో ఆ అమ్మాయే! – చూడు! ' అని చాలా ఆదుర్దాతో, రహస్యంలాగా చెప్పాడు

——మాకు చాలా సమీపాన, కారుతలుపుమీద అని, ఓరగా నిలుచుని ఆ అమ్మాయి... నదురుబెదురూ లేకుండా....చూపులతో ఆహ్వానిస్తోంది..

'ఊఁ...వెళ్లు' అన్నాను.

'నీవుకూడా – రా..'

'బలే...'

"కాదు, నేను చెబుతానుకాదూ...ఎంతో దూరం లేదు ."

మావాడి తడబాటు గమనించినట్టుగా ఉన్నది కాబోలు..కారు ఎక్కకుండా దిగి..నడక సాగించింది

మేము సరే, వెనకాల...

——వాళ్ళయింటివద్దకు వచ్చేశాం..ఆమె గేటుతీసుకుని, లోపలకు వెళ్ళుతూ.. వెనుదిరిగి..మళ్ళా ఆహ్వానించింది మౌనంగా

కదనుతొక్కుతూ, నవోఢలాగా రామమూర్తి– అతన్ని నడిపించుకుంటూ నేను .

——తిన్నగా లోపలకు వెళ్ళకుండా...తోటలో. మందార – గుబురుదగ్గర నిలుచుని ఉన్నది.. నేను వెనుకకు తగ్గాను .

మళ్ళా .మళ్ళా.. దగ్గరకురమ్మని సైగ చేసింది..రామమూర్తి..ఏలాగైతేనేం. ఎదటికి పోయి... నిలుచున్నాడు...

'ఎందుకూ.. అంత సిగ్గు!' అని అడిగేసింది మనవాడు..

'ఈలా...రండి .రా.. ఇక్కడికి '

నేనూ అనుకోలేదు, అలా జరుగుతుందని.

ఆమె, తానే రామమూర్తిని సమీపించింది. అల్లరి కుఱ్ఱవాణ్ణి దండించే అయ్యవారిపోజుతో...

చెవితమ్మె పట్టుకుని నులేసి...

'అందమైన ఆడపిల్ల కనబడగానే..ఈలా తిరగడానికేనా, చదువుమీద వంక బెట్టి ఇక్కడకు చేరుకునేది... నీలాటి తెలుగుకుఱ్ఱవాళ్ళు?...వారంరోజులనుంచీ చూస్తున్నాను...బీచికి వచ్చిన ప్రతిపిల్లనూ... చూపులతో కబళిస్తున్నావు.

'...ఇక ఎన్నడూ..ఈలా చేయక...ఏం...'

——ఆమె వయ్యారంగా విసిరినా, చేయి, ఛళ్ళుమని మోగింది రామమూర్తి చెంపమీద... ఖంగారుపడిపోయినాడు...నాకూ, ఏమిచేయడానికి తోచలేదు

"క్షమించండి.. మీ ఎదట ..మీ స్నేహితుణ్ణి అవమానించినందుకు; కాని, మీరు చూడాలనే..."

"బలేదాన"వని మెచ్చుకున్న చూపుతో, ఆ అమ్మాయి కరస్పర్శచేసి . తిరిగి, తలవంచుకుని.. లోలోన నవ్వుకుంటూ ——రామమూర్తిమాటే మరచిపోయి. బయటకు వచ్చేశాను...

—జయ . విజయీభవ.. అని, ఎదురుగా శర్మ ..ఎక్కడనుంచి ఊడిపడ్డాడో నవ్వుతూ దోవకు అడ్డంగా నిలుచుని ఉన్నాడు .

రామమూర్తి. .త్రుళ్ళిపడిపోయినాడు .

*　　　　*　　　　*

రామమూర్తి అప్పటినుంచీ, దీక్ష మొదలు...బీచి చాయలకన్నా వెళ్ళటంలేదు .చెదిరిన క్రాప్ సరిచేయడం లేదు.

చదువు సాగకపోయినా. .వేళకు భోజనంచేసి .. ఇంటిపట్టున నిద్రపోతున్నాడు

కాని . ఇది ఈలా సాగుతుందని...నాకు ఏమాత్రమూ నమ్మకంలేదు ..మళ్ళా .

—ఐనా... అంతదాకావస్తే .అప్పుడు చూసుకోవచ్చు.

★ ★ ★

# తమసః పరస్తాత్

మనసు ఏమీ బాగుండలేదు – మబ్బువేస్తే బాగుండును అనుకున్నాను: పెళ్ళుమంది వెన్నెల...

కళ్ళు కుట్టుతున్నాయి: కంకంటి పాపరాజును కప్పుకున్నాను..నందనవనంలో, పదితలలరాయుడు కోడై కొక్కిరించాడు...

..ఎన్నడో మరిచిపోదామనుకున్న...పాడుకధ. నిలవేసి వెక్కిరించడం మొదలుపెట్టుతూంది: కక్కేస్తాను.

– చిన్నది ..

...పదిహేడేళ్ళది...

ఆ ఊరూ, అలదానిపేరూ, మీకు అనవసరం లెద్దురూ ..

అవాళ...ఇవాళ వెన్నెలే:

––అక్కడ అన్నాళ్ళుగా ఉంటున్నందుకు...తిన్న తిండి బాగా వంటపట్టింది.

..ఉన్నవాడిని ఊరుకోకుండా, నిన్న కనుచీకటివేళ అలా కులుకుతూ పోతూంటే .. చూశాను.

ఇవాళ ఉదయం, మసక – మసకలో, తెల – తెలవారుతూండగా, ఇటే, నక్కి – నలిగిరావడం.. చూశాను

తిరిగి – తిరిగి చూశాను.

మళ్ళీ నిన్నటివేళకు కాపువేశాను నిలవేశాను.

ఒక్కనిమిషం..యుగమైౖ నిశ్శబ్దం ..

“ఎవడీ సైతాన్?” అనుకుంటున్నాయి, ఆ కనుకొలుకులు...

..“ఎందు కంత హైరాను, భాయీ?” అంటున్నాడు గజగజలాడే మనలో కామయ్య..

గాజులు పప్పు – పప్పై కంకణ రేకలు జేగురుంచినవి..

...మబ్బేస్తే ఎంత బాగుండును, అని మనసులో అనుకుందామనుకుంటూండగానే, వెన్నెల మరింత దుమ్మెత్తి పోస్తూంది...

ఎవరో వస్తూన్నట్టుంది...

“ఎవరు వారు?.. ఎవ రక్కడ?”

..ఓస్...ఎవరో అనుకుంటిని ఆ వచ్చేది, రాఘవయ్య ప్రతిరోజూ, తెల్లవారుజామున, ఆ భక్తుడి గొంతుకలో, మా వీధి పొడుగునా. కృష్ణకర్ణామృతశ్లోకాలు శోకిస్తాయి.

––మాట అనుకోలేదు; పాటకదా పోనీ మనకెందుకు అనుకున్నాను.

ప్రకృతి ఒక్కొక్కనాడు, ఒళ్ళుపొగరెక్కి ఒకటో తరగతి వాచకంలాగా. అతి తేలికపారాలు చదువుతుంది. మనమందరమూ శుంఠలమనుకుని .ఎంతసేపటి నుంచో...ఎందుకో కిటికీదగ్గర నిలుచున్నాను..సప్తద్వీపాల్లో, అలాగే, నాలాగే ఎందరునిలుచున్నారో, ఆవేళప్పుడు.. అర్థంలేకుండా.

ఎండతోబాటు, చరచరా నవ్వువచ్చింది..చిన్నప్పుడు దిద్దిన ఓనమాలై...ఆ కథ...ఖజానాలో పడిపోయింది...

—ఆ అమ్మాయి రోజూ అదేవేళకు అలాగే నలిగి..నడచిపోతూండేదా? ఏమో! ..ఎన్నాళ్ళనాటి ముచ్చటో...ఇప్పుడు—

—కంకంటి పాపరాజు, గభాలున క్రిందికి దొర్లి, బారసాచుకు ఆవులించాడు. వెన్నుచరిచి...లేని దుమ్ము దులిపి..'ఆ మూల అణగీ మణగీ పరుండు బాబూ' అని బలవంతంగా బుజ్జగించాను...

...మనసు, మరీ అసహ్యంగా...కందింది.

★ ★ ★

# అర్థ-నారి

స్నానానికని పరికరాలన్నీ పట్టుకుని, మెట్లు దిగుతున్నాను. దిగువను, కులాయిదగ్గిర, మా తాయారమ్మ ఎవరిమీదనో గొంతుచించుకుంటూంది:

తెల్లవారగానే ఎవరా, అక్షింతలు వేయించుకునేందుకు అప్పుడే తయారైనారు అనుకుంటూ, యింకో రెండు మెట్లుదిగి, పక్కనున్న కటకటాలలోనుంచి, ఆవారకు పరకాయించాను.

గుమ్మంలో – ఆ మనిషి, నదురూబెదురూ లేకుండా, అంటూన్నది తన్ను కాదన్నట్టు నిలుచుని ఉంది. తాయారమ్మ కుళాయి మొగదలనుంచి, ముఖం కండలు చించుకుంటూ, మీదికి లంఘించబోతూంది.

—'ఎత్తింది ఆడజన్మ కాదటే!...'

'సిగ్గు ఉండక్కర్లా?—'

'ఫో ...... ..........'

'పోనేం' అంటూ చేతిలోవున్న చెంబుకాస్తా ఆ మనిషిమీదికి గిరవాటు వేసింది.

అవతలమనిషి, తొణకకుండా అది అందిపుచ్చుకుని మళ్ళిపోతూంది. దాని, ఓ గాయిత్యం చూసి, అరచుకుంటూ 'దొంగ – దొంగ–' అని పొలికేకలతో ఊరూ – నాడూ ఏకంచేస్తూ, తాయారమ్మ వీధిలో పోయి పడ్డది.

వాళ్ళనడుమను, నలుగురూ పోగైనారు. తలొకడూ తలోమాదిరిగానూ నిలవేసి గద్దిస్తున్నారు...... పట్టపవలే యింటో జొరబడి, దోచుకుపోతూందని.

'లేదూ! – ఆ తల్లి, నా మీదికి బిచ్చం పారేసింది. పుచ్చుకుపోతున్నాను–' అంటూంది ఆ మనిషి.

తాయారమ్మ అందరిలోనూ, ముక్కుమీద వేలేసుకుంది—

'పామ్మని గిరవాటువేస్తే...'

'—వేసింది బిచ్చమనుకుని పుచ్చుకున్నా అమ్మా...'

మేమందరం పకాల్మన్నాము.

"వేసే తల్లులందరూ...యింతే, యిలా మొగాన విసిరేస్తారు బాబూ – నూటికో కోటికో ఓ తల్లి యిందవే అమ్మీ అంటూ, జాలితలుస్తుంది కాని.."

—నా మనసు జివ్వుమన్నది.

ఒక్కరూ తన్ను వెనకేసుకురాకుండా, బెల్లంకొట్టిన రాళ్ళల్లే ఉండటం చూసి, తాయారమ్మ నిప్పులేకుండానే తగులడిపోతూంది...

"ఏమిట్రా చూసేది – సిగ్గుమాలినకుంకల్లారా!– ఆడది గుడ్డ ఊడదీసుకువస్తే ఏమిట్రా చూసేది" అని, చుట్టూ నుంచున్న కుర్రాళ్ళనందర్నీ కసరి, దానిచేతుల్లోంచి ఆ చెంబు ఊడలాక్కుని, ఏడుపు మొగంతో యింట్లోకి పారిపోయింది.

అందరూ, ఎవరిగుమ్మాల్లోకి వాళ్ళు పోయినారు. ఆ మనిషొక్కతే మిగిలింది... నేనుకూడా అక్కడ అందాకటినుంచీ నిలుచున్నామన్న సంగతి అప్పుడు నాకు తెలిసొచ్చింది. దాని ఒంటిమీద నా రెండు గ్రుడ్లూ సిగ్గుమాలి పొరలాడుతున్నాయ్!...

"పో బాబూ, మొండి మొలేసుకొచ్చింది మొగాళ్ళ కోసం కాదు. నీ మానాన నీవు పో!––"

కత్తివాటంగా, అని చీరముడుత రవంత క్రిందికి లాక్కుంది. నేను మేకపోతల్లే గొంతు గొణుక్కుంటూ, మామూలుగా లాల్చీ – జేబు వ్రేళ్ళాడే అంతమేరా తడుముకున్నాను.

"అబ్బో! దిగివచ్చాడు, ధర్మరాజు!"

దానిమాటల్లో, ఎంత మంట ఉందని? ఎందుకూ యీ బసివికి నా మీద యింత కోపం? – పుణ్యానికిపోతే పాపం ఎదురైనట్లు – పోనీ పాపం! అని దానిస్థితికి జాలిపడి–

ఇన్నిముక్కలూ పట్టుకు తిట్టేశాను. విని, విని, చివరకు, అది ఛర్ర్‌మంది...

"వయసూ, వళ్లూ అమ్ముడుపోకుండా అడుక్కుతింటున్నామనేనా – మా రాజా యీ ఆగ్రహం అంతా... అంటూ మెత్తని కత్తికోతగా – రెప్పవాల్చకుండా అడిగింది..

నేను, గుక్కతిప్పుకోలేక, ఒక్క అంగలో యింట్లోకి దూకి, మెట్లన్నీ ప్రాకి – దిండుతోబాటు గోడకి కూలబడ్డాను. సబ్బుపెట్టె అదిరిపడి...బావురుమంది స్నానానికని క్రిందకు వచ్చినవాడికి.. దాని విసురుకు మళ్ళా ఎప్పటిచోటికే వచ్చిపడ్డానా?–

చట్టుకు సత్తువ తెచ్చుకుని ..బొాసెపట్టుమీద, లేచి కూర్చుంటున్నాను గుమ్మంమీద అది నిలుచుని ఉంది.

'ఏం బాబూ..నేను జ్ఞాపకం రాలేదా?' – అంటూ అడుగు లోపలికి వేసింది...

నాకు – యింకా జ్ఞప్తికి రాలేదు.

"నేను – సీతాయినయ్యా! పదేళ్ళక్రితం – నేనూ – మా అమ్మా, మీ పాదాలకడ బ్రతికేవాళ్ళం..."

ఆఁ – అదా యిది!* – పనిచేస్తూ చేస్తూనే ఒకనాడు ఉన్నట్టుండి, చెప్పకుండా యిద్దరూ మాయమైనారు వాకబు చేశాను. కాని ఎటుపోయినారో ఎవళ్లూ చెప్పలేదు. సరే, వీళ్ళ సంగతి ఎన్నాళ్ళు జ్ఞాపకం ఉంటుంది? అప్పుడే మరచిపోయినాను. – ఇది ఇంత పెరిగి పెద్దదైందా? – దీని అమ్మ ఏమైనట్టు? – బాగుందా?

నా మనసులో సందేహాలు అన్నింటికీ అది జవాబులు చెప్పుతూంది––

––"ఆవాళ, మాపటేల – సందుమలుపులో, నా చెయ్యిచ్చుకున్నారా? – అదిరిపోయి బేవురుమన్నాను కదూ? అప్పుడెప్పుడో చేసిన పాడుపనికి, యిప్పుడు సిగ్గెందుకులెండి – చేయిగుంజుకుని ఆపళాన పోయి, మా అమ్మమీద పడి, చెప్పడానికి

జివ్వొచ్చిపోయి, ఎలాగో మొత్తుకున్నాను. మా అమ్మ బెంబేలుపడిపోయి – నెత్తినోరూ కొట్టుకున్నది – అవాళనుంచే మీ యింట్లో పని మానిపించింది. మళ్ళా జీతం అడిగేందుకైనా, మీ యింటి చాయలకు రాలేదు మేము. మా అమ్మంటే – మంచి నీతైన మనిషి బాబూ!

కొన్నాళ్ళు రోజులు ఎల్లాగో వెళ్ళమారించుకున్నాం. మా అమ్మకు ఆనాటికి ఆనాటికి కొనఊపిరిపడుతూంది. నా రెక్కలే మా యిద్దరికీ కాచిపోయాలి పడుచుపిల్లలంటే – పనీపాటా చేయడానికి రమ్మని ఎవళ్ళుపడితే వాళ్ళు పిలుస్తారు. కాని, రెక్కల కష్టంతో పోనిస్తారా – అడిగినదానికల్లా అచ్చుకుంటేనే, ఆ నెలకు జీతం ముట్టజెప్పేది.

అలా బ్రదుకుదామంటే, నాకు తగనిరోత – మా అమ్మకు అంతకంటే చీదర.

అడుక్కుతిందామని, ఊరిమీదపడ్డాం. కాని ఏం లాభం – ఎంత గొంతుచించుకున్నా పూటకు చేరెడుగింజలు జోలెలో రాలేవుకావు – ఏ మొగాణ్ణి దేవురించినా కన్ను గొట్టి నిదానించేవాడేకాని, కనికరించి ఓ కానిడబ్బు మా మొగాన కొట్టేవాడుకాదు. ఏ అమ్మలక్కను బ్రతిమాలినా ఏతల్లి కాతల్లి ఇల్లా 'ఎత్తుకు తినకపోతే, దుక్కలాగా ఉన్నావ్, ఎక్కడన్నా పనీ పాటా చేసుకోరాదుటే!' అని కసిరికొట్టేది.

ఏమిటి – వయసులో ఆడదిచేసే పనీ పాటా? – లోకంసంగతి నీకు ఎరుకలేని దేమిటి బాబూ...

నన్ను అమ్ముకునన్నా నన్ను కన్నదాన్ని పోషించుకుందామనుకున్నా – నిబ్బరం తెచ్చుకుని బయలుదేరేదాన్ని కాని, మొగాడికన్ను మా పాపిష్టిది బాబూ – కన్ను మీద వొరిగేసరికల్లా కాళ్ళు గజగజలాడేవి. ఛీ అనుకుని మళ్ళిపోయేదాన్ని ––

పట్టపగలే దొంగతనం మొదలెట్టా. పట్టుబడ్డా – కొట్లో కూచున్నా. ఒకసారి కాదు, యిప్పటికి ముమ్మారైంది..

ఇలా తిరుగుతూవుంటా మళ్ళా జైలుకు వెళ్ళేదాకా...

ఆడకూతురికి – జాలిపుట్టించడం మా సులువయ్యా! ఇలా ఒళ్ళుకనబడేట్టు, చాలీచాలంది ఓ చింకిచుట్టుకుని, దిక్కుమొగంవేసుకుని, సాటి ఆడకూతుర్ని "తల్లీ, మొలచుట్టూ బట్టలేక, ఇలా మానానికి బ్రుగ్గిపోతున్నా మాయమ్మా"– అని అరిచానా అంటే, ఆ యిల్లాలు, తన గుట్టంతా బట్టబయలైనట్టు కంపరం ఎత్తిపోయి, తన మొగుడి కంట నేను పడకుండా ఏదో పాత కోకొకటి నా మొగాన కొట్టి తరిమేస్తుంది. అది, మారుబేరానికి అమ్ముకుంటే – మా ముసిల్దీ నేనూ, వారం రోజులు కడుపునిండా ముప్పొద్దులూ బువ్వతింటాం.

వచ్చిన వీధికి మళ్ళీ రాను. అడిగిన తల్లిని మళ్ళీ అడగను – ఎత్తుకు తినేందుకు ఎన్ని వాడలైనా ఉన్నాయికదండీ! –– ఏం, మా బ్రతుకు బాగుండలా?'

నా మెదడంతా కరిగి కళ్ళల్లో పేరుకుపోయింది

"ఓసి నీ బ్రతుకు బండలుకానూ – గదిలో రేవిణీ వేశావుటే" అని అరుచుకుంటూ, తాయారమ్మ అక్కడికి గంతువేసింది. కాకపోతే, దాన్ని జుట్టుపట్టుకు క్రిందికి ఈడుస్తానన్నది. మళ్ళీ చూడబోతే గడ్డాలూ మీసాలూ వచ్చిన పెద్దమనిషిని నాకు బుద్ధి ఉండక్కర్లేదా...అంది. పట్టపగలే, అందరూ చూస్తూండగానే భార్లాగా

ఇలా చేస్తావా అంది. నలుగురిని పోగుచేసి నాకు బుద్ధిచెప్పిస్తానంది.. తక్షణం గది ఖాళీచేసేయమంది నేను వింటూ, ఇల్లరికపు అల్లుడికిమల్లే గ్రుక్కమింగి ఊరుకున్నాను.

"మళ్ళీ యీ జాడ నెప్పుడన్నా వస్తే చూసిపోతాలే బాబూ ." అంటూ అది, చెక్కు చెదరకుండా మెట్లుదిగి పోతూంది కడసారిమెట్టుదగ్గిర ఆగి, "యీ యిల్లాలితో ఎలా వేగుతున్నావు మారాజా!" అని నవ్వుకుంటూ పోయింది

ఏదో యింట్లో అద్దెకు ఉన్న పరాయివాణ్ణి అయిపోయినాను. కాని, నిజంగా కట్టుకున్న మొగుణ్ణే అయితే, దానిచేత అంత మాటపడి తాయారమ్మ నన్ను బ్రతుకనిచ్చేదా? గదితలుపు గడియ, ఎంత బందోబస్తుగా ఉన్నా – ఆ చేతికీ – నోటికీ అడ్డంవచ్చేదా? పాయె – పో!

సీతాయ్‌బ్రతుకు చివరకు ఇలా అయిందా? ఎలా తెలవారుతుందో – దేశంలో ఎంతమంది పడుచులు... ఇలాగే సీతాయ్‌లు అయిపోతున్నారో!

హూఁ — ఇలాంటి చరిత్రాత్మకములైన చచ్చు ప్రశ్నలు లక్షాతొంభై, తెలుగువాణ్ణి కనుక పరాఖత్‌గా నాకు నేను వేసుకోగలను. ఎందుచేతనా, వాటికి జవాబు చెప్పుకునే బాధ్యత, నాకూ, నా జాతికీ – వేదకాలంనుంచీ లేదు!

★ ★ ★

# సాని - పాప

"పుచ్చుకోకపోతే, నన్ను చంపుకుతిన్నట్టే."

"అందుకైనా.. ఇక సందులేదు"

"ఓయబ్బ, ఇదేనా మరి, మీ సరసం చౌదరిగారూ! ఈ మాత్రానికే పడవ ఒడ్డిగిలితే, ఇక ఈ ప్రేమసముద్రంలో ఎలా తేలి ఆడుతుంది, ఎన్ని తుపానులు ఎంత అల్లకల్లోలం. ."

"నీ మాటలు నాకు బోధపడవు...మాటలకేంగాని ఏదీ సవితాదేవిలాగా ఒక్కమారు నవ్వు, మొన్న నవ్వినట్టు."

"మిమ్మల్ని చూసి నవ్వితే నాకేం లాభం? పైగా మీరు ఊరుకుంటారు గనుకనా"

"నీ తోడు ..ఊరుకోకపోతే."

"అవును, అది నాకూ తెలుసును. నవ్వితే నోటి ముత్యాలు రాలుతాయా, అవి తేరగా ఏరుకుని... ఇంకో వగలమారిని చూచుకోవచ్చునని కాదూ మీ పన్నాగం .."

"కాదు ఖరీదు యిచ్చుకోగలను."

"ఎంత ధీమా!"

"అన్నమాట తప్పుతాననుకుంటావా ఏమిటి... అదిగో...ఆ. .గాంధీగారిమీద ఒట్టువేసుకోనా, ఇక నా జన్మంతా నీది, అలా...అలాగే...ఇంకా నవ్వు...నీవు వెక్కిరించినా చక్కని చుక్కవే."

"ఓహో ..నేర్చుకు వచ్చారే మాటలు...రైల్లో, బేరంచేసి ఓ బేడ నవల వల్లెవేసు కువచ్చినట్టుందే..... మీతో నేను ఇచ్చకాలు చెపుతూ మేలుకు కూర్చోలేనమ్మ...కళ్ళు కూరుకువస్తూాంటే. .మీకేం... పోతరించి...మీకు అలవాటే."

ఆ మిసమిసలాడే పసిడిబొమ్మ తేనెలధారలుచిందే చురకత్తి, నాగులకోడేలు గూడుకట్టుకున్న దొంతరమల్లె పొద. రోజారేకుల నాజూకులు నిగారించే కమ్మని చెక్కిళ్ళూ తీయని పెదవీ, వెన్నెల లొలికించే చూపులూ.. అన్నీ అబద్ధాలు...నిలువెల్లా విషం

## 2

'మాటైనా ఆడకూడదా...కోకిలా'

'ఇచ్చేమాటలేమైనా పడి మూలుగుతున్నాయా'

'అంతేనా?'

'ఆహో, ఆ మూలిగేదేమిటో...యిక యింటికిపోయి. .మీ యిల్లాలుముందరే కానిస్తే...పాపం యింతకాలంనుంచీ ఘనకార్యాలుచేసి అలిసివచ్చాడుగదా అని నెత్తిన పెట్టుకుంటుంది.'

'నీవు ఎన్నైనా అను...నిన్ను విడిచి బ్రదుకలేను'

'ఎవరు బ్రదుకమన్నారు?'

'ముదురుతుందే'

'ముదరందే నదురూబెదురూ పోతుందా...పోతేగాని నీలాటి సరసులకు వచ్చు తానా?...ముందునడు.'

'నీవు రాక్షసివి...నన్ను ఫకీరునిచేసి...కుళ్ళించి...'

"ఫో...అంత బుద్ధే ఉంటే...ఒళ్ళు బాగుచేసుకుని... కాంగ్రెసులో కలు!'

ఆమె పణ్యవయోవిలాసజ్వాలల్లో ఎన్ని శలభాలకు రెక్కలు కూకటితో రగుల్చు కుపోయినవి: ఎన్ని కుర్రవిటకీటకములు ఆహుతిఅయి రూపుమాసిపోయినవి?...ఆ ప్రళయాలను తలచుకున్నప్పుడల్లా అమెకు ఎంతగానో ఒళ్ళు పొంగిపోతుంది. అబద్ధపు వలపునటనలకు అంతలేసి ఖరీదులు పెట్టడానికి పోటీలుపడే రసికాపసదులతో లోకం ముదురుగుతూన్నంతవరకూ, ఆ కార్యదీక్షకు ఏమీ అడ్డంకి వుండదు. రాయి అయిపోయిగుండె, జాలికి కరుగదు.

# 3

"అమ్మా!"

"ఏమమ్మ!"

"మొగవాడు అబిస్సైపోయినాడు. పిల్లలకి నాకూ తల దాచుకునే దిక్కులేదు. నిన్న టేలనుంచీ ఏ తల్లికీ దయకలుగలేదు...మాయమ్మా...లక్ష్మీదేవి..."

"దేవి అయితే వరాలిస్తుంది...పుచ్చుకుంటావా...ఇంద...నువ్వూ నీపిల్లలూ సుఖంగా బ్రతకండి పో..."

"కూటికి లేనిదాన్ని...నేను ఇదేంచేసుకోనమ్మా... దొంగనని పట్టుకుంటే...నా పిల్లలు అల్లాడిపోయి..."

"రామాయ్...దీనివెంట వెళ్ళి...డబ్బుచేసి పెట్టవే... కమీషను కొట్టావా...జాగ్రత్త!... ఫొండి."

"మాతల్లీ – నీయిల్లు వెయ్యిళ్ళై...నీకడుపున"

"ఆపైన నోరెత్తావా...పళ్ళురాలుతాయి ఫో"

"అయ్యా! దయచేయండి......ఏంకావాలి?"

"మీ సాహాయ్యం!"

"సెలవీయండి."

"నేను...దేశసేవకుణ్ణి...కళావంతుల సంఘసంస్కరణంకోసం నా జీవితమంతా వినియోగపరుస్తున్నాను. వారు..."

"...పెద్దలై పింఛను తీసుకున్నట్టున్నారు. మరి మీకు జీతమెంత...ఖాయం నౌకరీయేనా?"

"అమ్మాయీ, మేము అల్లరిచిల్లర వాళ్ళము కాము. పెద్దమనుష్యులతో ఎలా మసులుకోవాలో నీకు తెలిసినట్లు లేదు. అది నీ దోషంకాదులే...నీ వృత్తి అలాంటిది...నీ పెంపకమలాటిది... ఇప్పటికన్నా కళ్ళు తెరుచుకుని..."

"మీరు...నోరు...దయఉంచి మూసుకుని"

"హ్హఁ.."

"ఆహాఁ వచ్చిన తోవను దయచేయండి. మా గుమ్మం త్రొక్కిన దోషం పోవడానికి స్నానంచేసి జపం చేసుకోండి. అంతకూ చాలకపోతే...రామకోటి రాసుకోండి"

"నీలాటివాళ్ళు ఉండబట్టే...మీకులం ఇంత అధోగతిలో ఉంది.."

"నాలాటివాళ్ళే లేకపోతే...మరి మీ ఉద్యోగాలూ ఉండవ్వూ. ఇక సెలవిప్పించండి...సరసు లొచ్చేవేళ అయింది. ఇదిగో చూడండి బాబూ! మరచాను, మమ్మల్ని బ్రతిమాలుకోకపోతే...కల్లుపాకలదగ్గరగా, సీమసరుకు దుకాణాల దగ్గిరాలాగా పికెటింగ్ చేయరాదండీ...'ఇల్లు ఒళ్ళూ గుల్లచేసే'...అని పాటలు పాడుతూ; అది యింకా లాభమేమో! అయినా చిన్నదాన్నో పెద్దదాన్నో చెప్పాను; ఆలోచించి మీ మనసు కెలా నచ్చితే...అలా చేయండి."

అమృతమూ హాలాహలము ఏకోదరభ్రాంతిగా కావ్యభావనలో సహించే లోకమే ఆ అమ్మాయిలో మంచితనాన్ని, లేతహృదయంలో జాలిని...ఊహించుకోనైనా లేదు. అదే ఆమెకు కావలసింది.

తల్లి, చిన్నతనం ముమ్మరంలో ముందు వెనుక లాలోచించకుండా వేసిన తప్పటడుగుకు తలదాచుకునేందుకు చోటులేకుండా చేసిన లోకం తనమీద స్వార్థంతో జాలిదలచి ఉద్ధరించుదామని దరిజేరబోతే, ఊరుకుని సమ్మతించే అలసురాలా? పగకు మారుపగ ఇలా ఊపిరి ఉన్నంతవరకూ తీర్చుకుంటూ ఉండవలసిందే!

## 4

"ఏమిటి నావంక అలా చూస్తారు?"

"కళ్ళు నీమీదనుంచి తిరుగవు"

"ఒళ్ళు అంత దగ్గిరలేకపోతే"

"నిన్ను చూస్తూ కూడా నన్ను నేను మరచిపోలేకపోతే..."

బాబూరావు వాళ్ళగుమ్మం మొదటిసారి ఎక్కడం ఆమెకు జన్మంతా జ్ఞాపకం ఉంటుంది. తెల్లబోతున్న చూపులతో, అహ్వానాన్ని వెదుక్కుంటూ దోవవెంట పచారు చేస్తూన్న పిల్లవాడిని, దాసీ చేయివిసరి పిలవడం, తనకు మరో కొత్తమిడత చేజిక్కిందని సైగచేయడం, తాను అనుభవంలో ఆర్జించుకున్న మాయలన్నీ చూపులలోకి కుదించుకుంటూ ప్రేమఖుషీ నిషా హుషారు గిలిగింతలకు చిరునవ్వులో ఇంకా ఎక్కువ విషం మెదుపుకుని, చాచిన చేతులతో కులుకుగా ఎదుటికి వచ్చి..ఆ అబ్బాయి అమాయికపు కవలిక చూసి, ఆశ్చర్యంతో బ్రమాసైపోవడం.. అపూర్వమైన ఆరాత్రి... అనుభవానికి తొందరలాడని అనుభవం పుల్కరింతలే మబ్బులు క్రిక్కిరిసిన జీవితాకాశంలో వెనుకపడి మిగిలిపోయిన మెరుపుతీవలు:

వాలుజడమీద చంద్రవంకగా తీర్చుకున్న మల్లెదండ వాడకుండా, గులాబీ తుంపురులతో పక్క చెల్లాచెదరుకాకుండా అసహ్యంతో అలసి నిదురకు వాలనిది జన్మకు ఆ ఒక్కనాడే!

"—ఏమిటి నావంక అలా చూస్తారు?"

"మాటాడకు"

"పోనీ పాట పాడుతాను"

"సహించలేను."

"చేదా?"

"కాదు...రెక్కలమీద ప్రేమ, కోయిలకు ఉంటే అంతులేని ఆకాశానికి దూసుకుంటూ ఎగిరిపోవాలిగాని...ఏ మావి కూననో ఆశ్రయించుకుని కూ అనడం..."

"ఏమీ అర్థంకావడంలేదు."

"కాదు. దేవీమూర్తివిగా...మౌనందార్చితేనేకాని. .నిన్ను నేను అర్థంచేసుకోలేను.."

కోకిలకు అతని వాలకంలో. .అర్థంకాని మాటలు విసిరేందుకు అండగా వీడకుండా ఉండే చాంచల్య మేమాత్రమూ గోచరించకపోవడం ఏమీ కోరుకొనకపోవడం మరీ ఆశ్చర్యంగా ఉంది. ఏంకావాలో తెలుసుకోలేని ఆ అమాయకుడు ఎందుకు తనకోసం రావాలి? కళ్ళతో సౌందర్యాన్ని ఎంత జూరుకున్నా కామదేవుని బాణాలకి కడుపు నిండుతుందా?

ప్రొద్దు పొడవకముందే మెళుకువ వచ్చింది కాని, అంతకుముందే ఆతడు లేచి వెళ్ళిపోయి ఉండాలి. తలగడా నలిగిపోయి ఉన్న. సోఫావంక, తెరిపినిపడని కళ్ళతో...కొత్తవింతను చూచే అబ్బురంతో చూస్తూ...అలవాటు చొప్పన పక్క తలగడక్రిందకు చేయి పోనిచ్చింది. చేయి లాక్కుంటే ఒక "పచ్చనోటు" .కుబేరుడికి మతిపోయినా అంత ఔదార్యం ఉండకూడదే – ఆ సామాన్యుడి అభిప్రాయం ఏమిటి? –– ఆలోచన తెగక తలగడ ముద్దగాబట్టి. హూనంహూనం చేస్తోండగా అతడు వ్రాసిపెట్టిపోయిన చీటి కనబడ్డది· "నీ రుణం ఏలా తీర్చుకోను? మనవి చేసుకునేందుకు దేవీ సాన్నిధ్యానికి మళ్ళా సాయంకాలము వస్తాను – బాబూరావు"

రోజల్లా మనసు మనసులో లేదు. ఇంకా నిదురో, మేలుకుని ఉండటమో అర్థంకావడంలేదు. ఆదివరకు అసలు ఎన్నడూ అంతబాధపడలేదు మళ్ళా సాయంకాలము వస్తాడు – ఎందుకు?

గడియారం నాలుగు కొట్టడానికని గొంతుసవరించుకోబోతూన్నది వీధిలో, కారు, రెండురకాలుగా గుక్కగా హారన్ మోగింది కాఫీకప్పుమీదనుంచి పెదవి కదల్చకుండానే చూపులు పైకి ఎత్తి 'ఎవడో, పట్టపగలే. కారు కూతల రాయడు. పోయి కనుక్కో, ఇక్కడ ఏం దాచబెట్టాడో' అని రామాయిని తరిమింది. అది వేగిరంగా తొట్రుపడుతూ తిరిగివచ్చి 'ఎవరో పెద్దమనిషిలాగానే ఉన్నాడు ఇది నీ కివ్వమని చెప్పాడు. లోపలికి రమ్మన్నా కనక నడవాలో పచారుచేస్తున్నాడు' అని గబగబాలాడుతూ విజిటింగ్ కార్డు అందిచ్చింది. కోకిల ఒక్కమారు దానివేపు పరకాయించి, రమ్మని చెప్పమన్నట్టు తల ఊగించగా దాసీ, అతన్ని ప్రవేశపెట్టింది.

"––––అలా దయచేయండి. అక్కడ కాదు. సోఫా మీదనే. . నేనా. .పెద్దల ఎదుట కూర్చునే అలవాటు లేదు. కాఫీ తెప్పించుతునా? పోనీండి తమ అనుగ్రహం. సీతాకళ్యాణం ఫిలింతీద్దామనా మీరు తలపెట్టింది. మళ్ళానా? ఆహా, రామాయణం ఎంతమంది మళ్ళామళ్ళా వ్రాయడంలేదు! అటు పేరూ, ఇటు డబ్బూకూడా వస్తాయంటే సిరిరామోకాలొడ్డటం, అందులో మాకులంలోనేనా – ఏమిటీ మీరూ

మాకులమా – మీకు తెలియనిది ఏముంది చెప్పండి? ఇంతకు పూర్వం దాసి ఆనూ జానూ తెలిసి తెరమీదకు ఎక్కి ఉంటే ఇంతకాకపోతే ఇంత అని బేరానికి దిగుదును. మీరు తోడబుట్టినవానివంటివారు గనుక, అన్నా ఫరవాలేదు, – సరసు డొచ్చాడంటే తెల్లవార్లు గడుపుతాననో, ఓ ప్రొద్దు వేళకు వెళ్ళిపోతాననో అంటే, అవతలవాడి ఉమ్మసునుబట్టి, ఇంతకు తక్కువైతే ఇక్కడ వీలుండదు అని నిష్కర్షగా మొగమాటంవిడిచి చెప్పడమంటే, ఉగ్గుపాలతో నేర్చిన విద్యగనుక అది చేతనవునుకాని...అవునులెండి, ఎటువంటివాళ్ళైనా ఉంటారు – ఇంతకూ, తేల్చి చెప్పడమా అంటే, కానీండి, ఆలోచించి వెనుకనుంచి కబురుచేస్తాను. ఇంకా వ్యవధి ఉందిగా."

డైరెక్టరు, తాను వేసిన ప్రశ్నలకు, ఆ అమ్మాయి చేత యిలా పలికించి, 'నీలాటి వాళ్ళను లక్షమందిని చూశాను, నీ వేషాలు నాదగ్గిరనా? వచ్చి అడగగానే ఎక్కడలేనిపోదా వచ్చి కళ్ళుముచ్చెనగుంటలో ఉన్నట్టు మాట్లాడుతారు. తరువాత దాసీదాని వేషానికైనా తయారు...' యింత మనసులో అనుకుని, అనుకున్నంతకు రెట్టింపు చూపుల్లో చురచురలాడించి, తొణకని నిండుకుండలాగా నిష్క్రమించాడు. వెళ్ళబోయేవాడిదగ్గిర చిరునవ్వుతో సెలవుపుచ్చుకుని, వెనుకతిరగగానే, ముఖంలో నిర్లక్ష్యం చిట్లించుకుని, నడచిన కథను మనసులోనుంచి దులిపివేసుకున్నట్లు తల రవంత విదిల్చి, కోకిల అద్దంముందుకు జరిగి తన్నుతాను మనసులో వెక్కిరించుకుంటూన్నట్టు "పతివ్రతవేషం నీకు బాగా ఒప్పుతుంది..." అన్న డైరెక్టరు ప్రశంసను జ్ఞాపకం తెచ్చుకుంటూ, వెనుక గుమ్మంలో బాబూరావు నిలుచుని తనవంకే పరకాయించి చూస్తూన్నట్టు అద్దంలో పోల్చుకుని, చప్పున ఇటు తిరిగి అతనిని ఎదుర్కొన్నది.

ఇద్దరూ, కట్టలుపడ్డ ప్రవాహాలలాగా, ఉద్రేకాన్నీ ఉద్వేగాన్నీ నిలవతొక్కుకుని అడుగు కదల్చకుండా కట్టుబడిపోయినారు. సంభాషణ మొదలువేయడానికి ఎత్తు తెమలక కృతాద్యవస్థలో అతడున్నాడని గ్రహించి, కోకిల...ఆ మౌనానికి చక్కిలిగింతగా.."స్వాగతం" అని నవ్వులో నవ్వించింది. బాబూరావు, ఆ శైత్యోపచారానికి తెప్పరిల్లి చొరవగా ఆమెచేతిని అందుకని, తనసరసకు, సోఫాలోకి లాక్కుంటూ, ఒక మూలకు కూలబడి...

"నాథునికి...అనికూడా కలిపితే నా మనసుకు ఎంత బాధ తప్పిపోయేది" అంటూ కోకిలను కళ్ళతో కబళించుకుంటూన్నట్టు చూసి, రెండో చేయికూడా, ఖాళీచేత ఒడుసుకుని ..

"అదృష్టవంతుణ్ణి గనుకనే అశరీరవాణి, నీనోట అలా పలికించింది కాదా, కోకిలా?" అని, వచ్చే జవాబేమో ముందేతెలిసిన తృప్తితో ప్రశ్నించాడు.

"కాదు, సశరీరవాణి పలికింది. అదృష్టానికీ యింకొకరిమీద ఆధారపడటం అవసరమైతే..."

"పడటం...ఎవరిమీద?"

"అదే నేను అడిగేది"

"అడిగితేనేకాని..."

"అమ్మైనా పెట్టదు."

"మారాం చేయలేకపోవడం పిల్లవాడిలోపం"

"చెవులు మెలివేసి, ఇక ఎన్నటికీ అలా చేయుననిపించలేకపోతే ..తల్లిది ఆ లోపం"

"మనపిల్లలు అంత దుడుకువాళ్ళుకారు."

"మన...పిల్లలు!"

"ఏం...ఊరుకుంటామా? అందరు దంపతులలాగే మనం"

"దంపతులు..."

"అవును"

"కా–దు"

బాబూరావు తలకుతగని బరువు మోస్తూన్నవాడిలాగా అలసంగా అక్కడనుండిలేచి, అటూ యిటూ పచారు చేస్తూ, ఆలోచనతో ఆగిపోతూ, ఎదుటి సోఫాలో కూర్చుని పోయి, పరధ్యానంలోనే, పక్కను అనుకుని ఉన్న తంబుర తీగెలన్నీ ఏకధాటిని రంయ్‌మనిపిస్తూ, ఆ హోరులో, శ్రుతికాని గొంతుతో...

"కోకిలా! నిన్ను నేను పెండ్లి చేసుకుంటాను" అని గుక్క విడవకుండా చెప్పి...ఆయాసం దిగమింగుకుంటూండగానే, ఆ అమ్మాయి, ఎదురుదెబ్బతిన్న పాముపిల్లలాగా, కూర్చున్నచోటనుంచి ఉవ్వెత్తుగా ఎగిరిపడి...బుసగా–

"నన్నా?" అని కవ్వించింది.

"అవును" – జవాబుకు ఆమె మనస్సు. అతని కళ్ళలో తూగిపోయే అ కృత్రిమ – వాంఛను గుర్తించుకుని, ఎండపొడ తెరదీసినప్పుడు మంచుయిగిరిన మందారమొగ్గలాగా చెమ్మగిలింది. కాని అతనిభార్య అతనిపిల్లలకు యీ శరీరంతో...తల్లికావడం...ఉహు .

"వీల్లేదు"

"ఏదుచేతనో?"

"నేను మీకు తగను"

'ఆ మాట నే ననవలసింది కాదు-'

"నా సంగతి ఇంకా తెలియకనా?"

"తెలుసుకో అవసరం లేక"

"మరి, లోకం...నమ్మటంలేదా"

"అబద్ధాలా?"

"కాదు, నా విషయంలో అంతా నిజం"

"నమ్మను"

"నేను చెపుతూన్నా!"

"ఈ విషయంలో...ఉహుం––నాకళ్ళు, నామనసు అవి నాతో అబద్ధమాడుతాయా?"

––కోకిల కళ్ళురెప్పలు పిగిలిపోయేటంతగా పెద్దవై, క్షణంలో కుదించుకుపోయినవి. నిద్రలోలాగా తానుగాక ఎవరో మాటాడుతూన్నట్లు...

"నిజం చెప్పనా?" అని పలుకులు దమ్ముగా తూలించింది. బాబూరావు అంకురించే ఉత్సాహంతోడుగా అలా తల పైకెత్తుతూ కళ్ళు ఆమెముఖానికి అప్పగించాడు.

"నాకు నీమీద ప్రేమలేదు."

—అతని ఎడమకనురెప్ప సుడిగాలిలో చిక్కుకున్న రావాకు అవుతూంది.

"నీ డబ్బు లాగడానికి కాకపోతే...నీవు ఎదటపడటమే సహించలేను."

అతని క్రింది పెదవి దడదడలాడి...కంఠం గాలిపీల్చే కోడెనాగై ఉబ్బితబ్బిసలాడింది

"నీవంటే నాకు ఎంత అసహ్యమో తెలుసుకుంటే ఇక్కడ అసలు నిలువలేవు."

గొంతులో తొక్కిసలాడుతూన్న ఆవేదన...బిగబట్టిన పండ్లకు తగిలి...బైరులో మేకుదిగినంతగా మ్రోగింది.

"నిన్నా...పెండ్లి చేసుకోవాలా.. పశువా!"

వేసవి ఎండకు పైపూతమాటీలు కరిగి గాలి బుస్సుమనిపోయే బంతి...బాబూరావు తాటఅయిపోతూ... అక్కడనుంచి జారిపోయినాడు.

కోకిల కళ్ళలో కణకణలు ఊదరగా మిణుగురులైనవి. జడతో, తలను వెనుకకు విరుచుకుంటూ... అద్దంలో...ఎదుటపడ్డ దైన్యమూర్తిని...'ఎన్ని అబద్దాలు... అవును...నిజంచెప్పి...ఎందుకు అతనిబ్రతుకు పెద్ద అబద్ధం చేయడంనే...' అని పరామర్శించింది...వెక్కిరించింది.

ఆ మైకం తెముల్చుకుని...మళ్ళా మామూలు మనిషి అయిపోయింది.

* * *

# కాముని - పున్నమి

స్వస్తిశ్రీ మన్మథనామ సంవత్సర మాఘ శుద్ధ పంచమీ–లక్ష్మీవారం ఉదయం, జాముప్రొద్దు ఎక్కే వేళకు, – కోటలో ఏడేడు తరాలనాడు, వెలసి, మరకతపీఠాన కొలువుదీరి, క్రమముతప్పక, తమ వంగడానికి వన్నె వాసీ తెచ్చిన పెద్దలందరూ, సేవించుకున్న ఇలవేలుపు – శివకామ సుందరీ అమ్మవారికి, —

నూట ఒక్క చామంతులూ, ఇన్నూరు సంపెంగలూ, మున్నూరు కమలాలూ – మల్లీ – జాజీ – మందార – మాచిపత్రి, – మారేడు – తులసిదళాలు, దానిమ్మ దాసాని మొగ్గలూ – గుచ్చి ఎత్తి, పన్నీరు చిలికి, భమిడిపళ్ళెంలో ఉవ్వెత్తుగా అమర్చిన దినుసూ – ఉపకరణములుగా, –

వెయ్యిన్ని – నూట ఎనిమిది నామాలూ నోరారా తలచుకుంటూ ఆ తల్లిని పూజించుకున్నవారై – గోరువెచ్చని హైయంగవీనమూ, – జుంటితేనె, కండచక్కెర, – ఉక్కెర, అనబాలు, – నానబాలూ – అంబకు ఆరగింపుగా, సన్నిధిని సమర్పించినవారై, – కప్పురపు నివాళి ఎత్తి, నుదురు నేలకు సోకంగ సాగిలపడి మ్రొక్కి –

– ఆనందవర్ధన మహారాజులు, – అరమోడ్పు కనులతో, – లేచి, నిలుచుని, – మరియొకపరి, కైమోడ్పులిచ్చి, అడుగుతీసి అడుగువేయగా – నగరి కొలువుచేసే మందగమనల్లో, యిద్దరు హంసగమనలు, కైదండలీయగా, ఒక కలవాణి బిరుదు – బింకములు, గానాన తానాన పలుకగా వాలుగంటి హెచ్చరికలు శాయంగ – గుములుగుములుగా హెగ్గడికత్తెలు మునుముందు అగురుధూపము వారబట్టగా పూజామందిరము గడచి, – ముత్యాల చవికెలో, కొలువు దీరిన రీవితో తామొక్కరే సుఖాసీనులై ఉన్న తరుణాన –

వేయి పున్నముల వెన్నెలలు సోకగా, పండిన మనసై పండిన వయసై, పడుచు నడకలు ఏమారని, ముదిసీముదియని సొవిదల్లుడు, – చేరవచ్చి, – చేరువకాక, ఒకింత ఓరనునిలిచి, – ఏలినవాడా! అని పలుకరించి, – మనవి కలదయా – ఆలకించేవా? – అన్నవాడై, – తానెత్తి పెంచిన అల్లారు పాపడు, – తన కన్నులు చల్లగా, వైరుల పరాజితులచేయువలంతి అయిన చిరునవ్వు అలవరచుకొని అంతవాడైన, వీర విక్రముడు – ప్రజలకు కన్నవారిని మరపించే మన్నన నేర్చిన ప్రభువు, – తన కంటిమీద చూపునిలిపి తల ఊపగా, –

ఏమని విన్నవించినా డంటేనూ –

—బహుపరాకయ్యా, పున్నెముల ప్రోవా! మన యిలువాసికి వన్నె తేగల బాలాకుమారుడు –

అలనాడు – మల్లెలకోనలో, తీయమామిడి నీడను, దేవరచిత్తముగా నడచుకొన్న,

కులమున్న కన్నె కోమలి, పూవుల పొత్తిళ్ళలో, చివురాకు తీరున పెంచిన పసికందు–

దేవర కనులు నిండ – విందుగా రూపొందిన తీయవిలుకాడు, – నీవు కన్న చిన్నవాడు –

యీనాడు, – తెలవారకముందే, తనకుతానై నిదుర మేల్కొని, – పరిచారకులను, దరికిరానీక – అరతు లందుకొనక – కైవారములు ఆలకింపక – సామాన్య పౌరునివలె మెలగుతున్నవాడయా!–

—ఆలకించగా — ఆలకించగా – మహారాజుకన్నులు, వెన్నెలలు వేధించే జక్కవకవ అయి–

ఠీవి సడలి – మమకారమే శోకమై ఆవరించగా, –

మౌనంగా హుంకరించి – దిటవు తెచ్చుకొన్నవాడై – చిరునవ్వుతో – చేరువను నిలిచిన ముదుసలితో, జాలిగా ఏమని పలికినాడంటేను —

భద్రా! – యిది, మనము అనుకున్నదే కదా!–

బిడ్డను మరచే తల్లి ఉంటుందా? –

పరుసవేది మొలిచిన – పచ్చపట్టులో,

నా బ్రతుకు బంగారము చేసిన – లేమ – తన పంతము విడువలేదయా! – మనము యిక వంటరివారమే!–

మహారాజు యీ తీరున పనవి – పనవి – వాపోయే తీరున పలుకంగా, – భద్రుడు తనలో తాను– పూరీడు రెక్కలల్లే – గజగజలాడిపోతున్నాడు ఏలనంటేను – అప్పటి కథ – ఆకళింపుకు వచ్చింది – దాని వైనం ఏమంటేను –

ఇదిగో – యీ మారాజు నూనూగుమీసం వచ్చీరాని ప్రాయాన – అయేడు – కాముని పున్నమినాడు – రేయి దోరకెక్కిన వేళకు – కులమింటి కన్నెలందరూ – నగరికి కన్నువేటు దూరాన – లాగిలీవాక, తీరాన్ని, యిలకరించుకునిఉన్న నగరేశ్వరుడి తోటలో – ఆటపాటల్లో వేడుక లౌతుండగా – తనకూ ముచ్చటై – తానొక్కడూ కదలిపోయి – మల్లెల గుబురులో పొంచి ఉండి – తరిపి కోయిల లొక్క మొయిని – గుమిగా, గుమ్మని – కమ్మని కూతవేసినట్లున్న ఆ పాటల – పదాల పొంకం, ఆలకించుతూ – మెరుపు తేలని మెరుపులల్లే – వయ్యారంపోతూన్న కన్నెపిల్లల బింకానికి, కన్నులప్పగించి – తన్ను మరచిన తావిమైకాన ఉన్నవాడు కద!–

అలా–తూలక, తూలక సోలుతూన్న చిన్నవానిచేతికి ఏ రెమ్మ తాకెనో – ఏ ముల్లు సోకెనో, – మూగపోయిన గొంతు ఉలికిపడంగా – గొంతువిని – కొమరైన కన్నెలందరూ, కమ్ముకుని – అరచేత గంటులున్నచోటు కంటతడిమి చూసి, – ఏ కన్నె కాకన్నె మనసార చేతికందిన విరులు దూసుకురాంగా – పుప్పొడి చల్లి – చిదిమిన పూవులు అదిమి, ఆ పైన, కప్పురపు అనంటిపొర చుట్టి, సోకీసోకని లగువున, బిగుతు తెలియకుండా చేతికి, కట్టుకట్టి – "హాయె పో – హాయె పో॰" – అని, కిలకిల మంతిరించి – "మా మంతనాలు ఆలకించను – పొంచివచ్చిన తేరకాడా! తిరిగి కోటకు దయసేయవయ్యా మమ్మేలినవారి కన్నవాడా!" అని, మందలించినటులుగా, ఆ కన్నెలందరూ అజ్ఞపెట్టంగా–

యీ చిన్నవాడు – కారణం తెలియని వేదనతో – నిదుర కంటికిరాని అసురుసురులతో – పరుండిన పానుపుమీదకు చిలకే వెన్నెల మాసి, – తొలికోడి

కూసి – తూరుపున వన్నెలు తేలి వెలుగుపొడిచే పొద్దువరకూ, అలాగే వేగిరించి—

తెలతెలవారెనని – పొనుపుదిగి – కనులకు చేతులద్దుకుని – శమనంగా – తన చేతి రేకలు చూడ, ఆ వంక పరకాయించంగా—

అరచేత, అప్పటి కప్పుడు మొలిచినట్టుండెనే – ఆ కన్నెమోము!–కట్టు తొలగినచోట గాయంలేదు– గాటున్న ఆనవాలులేదు! – లేకపోంగా—

మల్లెరేకలు కనులై, గొజ్జంగి రేకలు పెదవులై, ఆ రేకల హత్తుకున్న జాజి మొగ్గలు చిరునగవై – వైనం తెలియని – కలలోనైనా తా నెన్నెడూ తలచని, చిన్నదాని మోము, రూపొంది పొటకరించంగా—

చిన్నవాడు – తేరి చూడగా —

ఆ కన్నులు కదలినట్టుండె – ఆ పెదవులు పలికినట్టుండె ఆ రూపం, చూడగా చూడగా – తన్ను నిలువనీయనట్టుండె– అదేమో, అర్థం కాని, ఆలాపన ఎత్తి పెంచినవాడని, తనతోనన్నా చెప్పలేదు – చెయ్యలేదు.

—ఎప్పుడు కదిలినాడో తెలియదు – ఎటు పోతున్నాడో లెక్కలేదు 'కోటకు ఎంత దూరమైనాడో ఎరికలేదు–

అలా; పోంగా, పోంగా – పొద్దు నడినెత్తి కెక్కింది– నడవంగా నడవంగా వాటారింది. అప్పుడే చినవాడికి అలసటాయెనేమో – దగా దప్పిగా తోచెనేమో. పడిన అడుగు అక్కడనే మోపి, ఆవంక యీవంక కలయజూడగా—

అల్లంత మేరనూ, దారీ తీరూ లేని – అయోమయపు అడవైపోయె–

తాను ఎటు పోవాలి—

అరచేత ఉట్టిపడుతూన్న ఆ చిన్నదానివంక, – అదేపనిగా చూడంగా – కోయిల కూత పదేపదే విన్నంత మైకం వచ్చి,– ఒళ్ళు తెలియనట్టు అయిపోయి, – అంతకుముందెన్నడూ లేనంత తెలివివచ్చి, ఒళ్ళు తేలికపడగా—

అడుగు ముందుకు వేశాడు.

అడుగు పడీపడంగనే – కన్నెదర కమ్ముకున్న పచ్చపట్టు గాలిలో పాముకుబుసం అల్లె, – కదలి, – అంతమేరా వెల్లని వెలుగు పరచుకుంది – వెలుగు అంచున – పచ్చని పసిమి, రేకలువిరిసే కమలమల్లే, నయారంగా ఒళ్ళు విరుచుకుని – కంటికి అనే చిన్నదై – ఆ చిన్నది తనకు సరసనై – చేత చేయందుకుని – మరోచేత, చెంపనిమిరి – 'వచ్చావా చిన్నవాడా!' అని పలుకరించగా – యీ చిన్నవాడికి ఆ కన్నెతీరుచూసి, కళాకాంతులు చూసి – మారుపలికేందుకు మాట రాదాయెనే!–

ఆ చిన్నవాని అలవిమాలిన ఆరాటంచూసి ఆ కన్నె ఏమన్నదంటేనూ—

'పట్టంకట్టుకున్న మారాజు, పరువుగా పెంచిన చినవాడా – యింక నీ బతుకు యీనీడనుంది. మునుపున్న ఉనికి కన్నవోరీ బుద్దులూ – కోటలో సుద్దాలు, యీదకు రాని పట్టుకు, పట్టుకొచ్చినాను.

నే నెవరనుకుంటివి – యీ కన్నెకు యీ ఉమ్మసు ఏడదనుకుంటివా!

నాలుగుసేతుల దేవర, నారాయణమూర్తి, తాను నరుడై, తల సింగమై యీ భూమీమ్మీదికొచ్చి, రక్కసుల చిన్నవాణ్ణి రచ్చించి వరాలిచ్చి – తానేమైనా డనుకున్నవు యీ కోన కొచ్చినాడు.

ఆ మొగంచూసి, ఆ మోరచూసి—మాయా మరమం లేక, యీడ బదుకుతూాండిన గూడెం మూక, సెల్లాసెదరైంది. సెదరక నిలిపింది, సిన్నదొక్కతే!

నదురూ బెదురూలేక అట్టనే నిలిసిన సినదాని వైనం చూసి – సింగం దేవర గాండ్రించె – సిన్నది నవ్వుకునె—

అట్టే తనకు తాను నవ్వుతూ కులుకుతూ ఉండిన సినదాని ఉల్లాసం సూడగా – దేవరకు ఉడుకొచ్చి ఊగ్రమొచ్చి ఒక్క ఉరుకురికి – మరింతగా, బొబ్బపెట్టగా – ఆ చిన్నది అంతంతగా పకాలుమనె – సిరినవ్వు సికసికలాడుతూాండగా, తా నేమన్నదంటేను——

"అయ్య సామీ! – సేతికి సత్తువున్న మొనగోళ్ళందరి సేత, కవ్వం దిప్పించి – సంద్రంకాడ, సల్లగా, నీవు ఆడకూతురివై ఆడినావంటనే–సింగమల్లె మీదికొచ్చినావు కాని, నీ మెయిని యింక ఆ కులుకు మాయలా! – అదిసూసి నవ్వుకుంటేని – దేవరా!–"

ఆ పలుకు వినంగనే – అంతలేసి సింగానికి నవ్వు ముంచుకొచ్చిందట.

మా కన్నెకోసం – తానూ మనిషైనాడట

నిన్ను కన్నవారికి ఓలియిచ్చి, నీకు మనసు యిచ్చుకుంటానే సింగారీ! అని – దేవర వేడుకోలుసేసుకోంగా – మా కన్ని ఏలా పలికిందంటే!

'ఓరయ్యలూ – సెంగట మొలిసిన సివురును – సేతికందిన పూవును నాకు ఓలి ఏలనయ్యా!–

మంచి ముత్యాన్ని కాను, మాణిక్యాన్ని కాను; మంచు చినుకంటి మువ్వపుదాన్ని.

వెలలేనిదాన్ని వేడుకైనదాన్ని – నరుడిబుద్ధి మాని నన్నేలుకో దేవరా!–' అని సేతికి సేయి అందీయగా, – ఆ అయ్య పట్టిన సేయి – పైడి వన్నె తేలింది. ఆ సేయి సోకిన పసిరిక – పరుసవేది అయింది

ఆ అవ్వ సలువను – దేవర సలువను, మా కోనలో – మనిషికీ మానుకీ ఆ వన్నె దక్కింది.

సింగందేవర కోనయ్యా మాది

ఆ దేవర కొమాళ్ళ కోవయ్యా మాది."

——ఇలా పలికి–పలికి, ఆ చిన్నది, పలుకు మాని, నా మాట – సత్తెమే – అన్న చూపు చూసింది చిన్నవాడి వంక

ఔను సత్తెమే! దూరపు కొండల్లో, చెప్పనలవికాని దూరాన కోన ఉంది. దారీ తెన్నూ లేని ఆ కోనలో – ఆకాశాన్ని రాపాడే మానుల నీడలో – ఎండ కన్నెరగకుండా–బంగారువన్నెజాతి, ఆదికాలంనుంచీ బతుకుతూాందని–కథగా ఎన్నడో విన్నాడు చిన్నవాడు – ఔనా కాదా, అని శంకించకుండా–అందరూ నమ్మినట్టే తానూ నమ్మాడు

కాని – బుద్దెరిగినంతలో – ఏ నరుడికీ ఆ కోన అంతూ అనవాలూ చిక్కలేదు. తనకే ఆ అదృష్టం దక్కింది – ఎందుకు?

"ఎందుకంటవా – ఏలనంటావా!–"

యెనకటి ముచ్చట సొంతంగా యినుకో సినవోడా!–

ఆ మెయిని సింగందేవర – మా కులానికైన సినదాని సేయందుకున్నా డంటినే––

ఒకరి నోరు సల్లంగ యెన్నెల సూపులు సూసుకుంటు ఎన్నో పొద్దులు – మసులుకోంగా – ఆ సినదానికి నెలమసలింది.

ఓపలేని మా సినదాన్ని చూసి, సింగం దేవర ఏమన్నడంటవ్!–

కోనకైన కూనా – ని న్నిడిసి పోలేను, తామర గద్దె మీద కొలువుండే కళ్యాణి – కన్నవాడనుకున్నవాడు – మంచు కొండమీది తెల్లనిదేవర, బేసికంట – సెగలూ పొగలూ చిమ్మగా రూపు లేకపోయె – దేవరనై ఉండి – దుఃఖం భరించలేను నరుణ్ణై అయితినిగదా – నన్ను ఈ నీడనే – నిన్నూ, నీవు లాలించి ఉయ్యాలలూచే పసికందునూ సూసుకుంటూ ఉండనీ–

అప్పుడా సిన్నది, ఏమన్నదంటే –

దేవుడే నరుడైతే – నరులేం కావాల దేవరా! – నిన్ను కొలుసుకునేవారెందరో, తలుసుకునేవారెందరో – సిరి 'దేవమ్మ సరసనుండి, సేయెత్తి మొక్కించుకునే స్వామీ – ఈ సెంచుల పిల్లకు నీ విచ్చిన వరం సాలును – ఇంక నీ లోకం నీది –" అని బాసచేసినట్లు పలికింది.

అంతటిదేవరా – అలిమాట కాదనలేదు ఓ పున్నమి పొద్దున సివురాకు పొత్తిళ్ళలో పరుండబెట్టి – బాలుణ్ణి అందించింది, సిన్నది, దేవరకు!–

"కామన్నా!" అని బిడ్డకు పేరెట్టుకున్నడు దేవర – "నాకు మారుగా కొలువుండి, కో నేలుకో! –" అని దీవనె లిచ్చి––

"కోనలో పుటకెత్తిన పడుచుకు యిదే వరం – ఏలుకునేవాడు – నాలాగే వెదుక్కుంటూ రావాలి! – వనరైన వాడికి – కనువేదురు కమ్మించే శక్తి – కన్నెల కుండేను – వయసొచ్చి, వల్లమాలినతనంవచ్చి, కాముని పున్నమనాడు – కన్నె, మనసోయి తలచుకుంటే, రాసిపెట్టినవాడు – కాలు నిలువక కదలి వచ్చేనే చినదానా–" అని మా సినదాన్ని లాలించి, సింగం దేవర – తాను మాయమౌతూ – తన రూపు కెంపు శిలమీద, తీరిచి పోయినాడయా!–

"ఆనాటి కీనాడు – కోనలో కులాన పుట్టిన కన్నెను నేను – నిన్న రేయి, – వెన్నెల రాంగనే, – ఆ వెలుగు సూసి, ఓపలేని మైకమాయె – జుంటితేనె ముంచెత్తినట్టు నిలువెల్ల తీయనాయె – మనసు సల్లని మగతాయె – సెక్కిలి మల్లెగుబురుమీద వాలిపోయె, – కానరాకుండా, నీ సేయి, సెంపలు రాపాడె – తేరి చూడంగ నా మోము, నీ చేత సిక్కిన భ్రమతలాయె – యీ సినదానికి సంబరమాయె –

సింగందేవరా! – అని ఒక్కమారనుకుంటి – రాసి పెట్టినవోణ్ణి రప్పించమంటి – రానేవచ్చేవని కాసుకుని ఉంటినయ్యా–

కాలు నిలువక, యీ కన్నె కోసంవచ్చిన సామీ, మా కులం ఏలే దేవర తోడితెచ్చిన సామీ – నిన్ను కంటకట్టేసుకున్న––"

"సాహో! సింగందేవరా!" అని ఎలుగెత్తి కుయివెట్టి, గోముగా, ఆ చిన్నది, – మారాజు బిడ్డను కమ్ముకున్నది––

ఆ చిన్నదానికూతురు, కోన నాలుగు చెరగులా మార్మోగింది భూదేవి పురుడూ పుణ్యాన పుట్టినట్లు, – చెంచులు పిక్కటిల్లుకొచ్చినారు

వచ్చిన మూకలో, – అందరికన్నా – మరో బార ఎత్తూ, – అంతకు తగిన ఏపూ ఉన్న మానిసి, – అడుగు ముందుకు వేసి, చినవాడి నడుం పిడికిటపట్టి, – బాలాకుమారుణ్ణి అరచేత నుంచుకోంగా, – ఆ చిన్నది, ముందు పల్లిటీలు కొడుతూ దారితీయంగా, – దండు నడకసాగించి––

అలా సాగి పోగా పోగా, – ఎండపొడలేని కీకారణ్యమైన, కన్నుపొడుచుకున్నా కానరాని చీకట్లై – మరింత నడకసాగగా, – చీకటి కెంపుదేరగా ––

ఎదర – ఏడు మర్రులు ఏకమూను కట్టిన తావున – ఏకాండంగా ధగధగమంటూ సింగందేవర! – ఎన్ని నిలువు లెత్తునో, ఏకశిలగా కెంపులుదేరే రూపాన కొలువున్నాడు; ఆ దేవరను కమ్ముకుని అగ్గిశిఖ,– వేయినాలుకలుగా భగభగమంటూంది – మణులూ మాణిక్యాలూ మెరుపులు సోనకట్టినట్టు––

దేవర, పదిబారలుండంగనే పల్లటీలు కొడుతూన్న చిన్నది – తా నాగింది – దండును ఆపింది

ఎగిసి నిలుచుని – చేతులెత్తి ఝళిపించి "సీకటికి వెలుగిచ్చే సింగందేవరా! కోటలో పండిన పైడిపండు, కొలుసుకోవచ్చింది – అరగించేవా – ఆదరించేవా – సెలవీయి స్వామీ –" అని వేడుకున్నదాయెను

అరచేత, చిన్నవాణ్ణి నిలుపుకున్న గండు – చెండు నెగరేసినట్టు, చినవాణ్ణి విసరగా – ఆచేత – ఆచేత అనుతూ–చినవాడు, దేవరకు నిలివెదు దూరానికి చేరుకోంగా––

చినవాణ్ణి దేవరముంగల నిలిపి, ఎత్తి మోసిన గండడు – మలిచేతికి మెలేసిన విచ్చుకత్తితీసి – చినదానికి అందీయగా – చిన్నది, ఏమని పలికింది–!

'సింగందేవర–మారుపలకరా సినవాడా!'

సెబ్బర – నీదో, నాదో!

మన బుద్ధి – రగతంతో శుద్ధికావాలి.

నిన్నొడిసి నన్నొడుసుకోవాలి.

అడుగు ముందుకెయ్––'

మారాజు బిడ్డ – జంకూ గొంకూ లేకుండా అడుగు ముందుకు వేశాడు.

'బతుకుమీద బ్రమత లేదా!– కన్న మారాజుల కడసారి కంట సూసుకోవాలని ఆబలేదా–ఈ గండం తప్పితే కలకాలం బాగుండేనని ఊహ లేదా?'

ఆనందవర్ధనుడు, నిర్భయంగా, చిరునవ్వుతో తల ఊగించాడు

'నీవు పుటక ఎత్తిం దెందుకు?'

'సుఖపడేందుకు.'

'బతుకే అంతమౌతూండె – సుగమేడిది?'

"నిన్ను చూస్తూ కన్ను మూయడం సుఖం కాదా ?– కోటలో పుట్టాను కోటలో పెరిగాను. చిన్ననాడు, దాదులాడించారు – యిన్నాళ్ళూ పరిచారకు లాడించారు. లోకం చూడలేదు; ఏది మంచో, ఏది చెడ్డో నాకేం తెలుసు–

మా రాజు బిడ్డనే - కాని, కాలుదీసి కాలుపెట్టేందుకన్నా - పరిచారకులమీద ఆధారపడి బ్రతికాను, అది సుఖమా?

ఏది సుఖం - ఏది దుఃఖం? - నాకు తెలియదు - ఎవరూ చెప్పలేదు--

నీ కళ్ళలోకి చూడటం సుఖం అని తెలిసింది.

నిన్ను చూడలేకపోతే - అదే దుఃఖం అని యిప్పుడు, యికముందు, అర్థం అవుతూంది.

కోరకముందే కరుణించిన దేవరను - మరోవరం అడగలేను--

ఈ జన్మకు ఈ క్షణమే సుఖం!

చాలు' బతుకంతమైతేనేం? -

తెగెయ్!-'

మారాజు బిడ్డ, ఇలా అనీ అనంగనే, ఆ చిన్నదాని చేతిలో వాలు, మెరుపల్లె మెరిసింది - రాచబిడ్డకు, కుడి చెంపను గీరగా నెత్తురు చిమ్మింది

మరోసారి - వాలు తళుక్కుమని ఝళికింది - ఆ చిన్నదాని చెక్కిలి నెత్తురోడింది

చేతనున్న వాలు, భగ భగ - మంటల్లోకి విసిరేసి - ఆ చెంపకు యీ చెంప ఆనించి, చిన్న దేమన్నదంటేను:

"అన్నెము పున్నెమయింది - ఆశ మారాకేసింది-"

సేవున్న తీవె సిగిరించింది-

కోనకొచ్చిన కూనా - నాపలుకు నీ గొంతు పలికింది

రగతానికి రగతానికి సుట్టరికమయింది.

బతుకు లేకమయినాయి...

ఇంక నీ మెచ్చుకో లేమి - దేవరా!

* * *

"కంటివా - సినవోడా - సింగందేవర కీ బకితి సాలలా - యీ సాలలా - అరగింపవుదాము ముందు

నీ వురికేవా - నన్నురకమంటవా!'

చినవాడు, పకపక నవ్వాడు

"పుటుకతో వచ్చిన బుద్ధి మారదే చిన్నదానా- మారాజు బిడ్డను కానా, - ముందు నే నురికేను!"

అనడమే తడవుగా - కనులన్నా మూయకుండా - గగ్గురుపడకుండా - సింగమంత సత్తువతో - 'చేదుకో దేవరా!' అని బొబ్బపెట్టి - చినవాడు మంటల్లోకి ఉరికాడు.

అప్పుడు కమ్మిన మైకం - ఎన్నో యుగాలకు బలవంతాన కన్ను తెరిపించింది.

అలా, కన్ను తెరిచిన చిన్నవాడి మొగాన్ని - చిన్నదాని రెండు కళ్ళూ కావిలించుకున్నాయి

మంట లేమాయె?

మంటలు కావవి – మాణిక్యపు తీగెలు! సింగం దేవర వెలసిన పొద్దున – ఆ సామి పాదాలకడ మొలిచినాయి చేయెత్తి మొక్కుకుంటున్నట్టు – ఎదుగూ ఒదుగూ లేని బతుకై అలా రెపరెప – ధగధగలాడుతుంటాయి ఉరకమని, ఆ చిన్నది ఆనపెట్టింది, చిన్నవాడి నిబ్బరానికి గురుతు ఎరిగేందుకట.

చినవాడిని అరచేత మోసి తెచ్చిన గండడు, ముందడుగుగా – మూక అక్కడకు చేరుకుంది. గండడు అన్నాడు కదా!–

రాస కులాన పుట్టిన మచ్చ – రగతం సిమ్మగా తుడుసుకుపోయె

ఆనవాలు కానరాని కోన కొచ్చిన సినవాడా! – మా సినదానికోసం – దేవరకు నిన్ను నీవు యిచ్చుకున్నావ్ – ఈ నీడను నీ బతుక్కు దేవర ముగుదలైంది! – కూననేలుకో!

నిన్ను కన్నోరి కంటికి దూరం కావాలి; నీవు కన్నోడు మా కంటికి సల్లన కావాలి!

అని పలికి – ఆ మూక కోనలో కలిసిపోయింది.

ఆనాడు కాముని పున్నమ

ఎన్ని పున్నము లాయెనో యాదమాలి యెరకమాలి –– అక్కడా చిన్నవాడు – చిన్నదానిమీద మమతగా ఉండగా––

ఓ పున్నమినాడు – పసికందు కేరుమన్నాడు–

తీయమావి నీడనుంచి – తేనెతో పెంచి – పరుసవేది పట్టున – పసిమి నీ రెండలో గారాబం చేయగా – పసికందుకు బంగరు రంగు నిలిచి – పలుకరించంగా కిలకిలలాడి – చూపుకు చూపానించే చురుకొచ్చి – నేరుపొచ్చి నేవళ మొచ్చి – అలా పదిపున్నములు గడువంగా–

––పసికందు, బాలుడాయెనని, చెంచులు, సంబరాన దేవరకు బాలుణ్ణి – కంట దీవించమని – కొలుచుకుని సంబరంచేసి – పసివాణ్ణి – దేవరముంగల వదలగా––

పారాడే బాలుడు – అంతలో లేచి నిలుచుని – దేవర వంక చూసి – అడుగు యీవలకు వేసి – కన్ను వాడిమీదికి తడబడగా––

––చిన్నది, కెవ్వు మన్నది––

"తలచరాని శకునమైంది చినవాడా – నా మనసులో బెరుకు నిజమైంది నీకు నీ అయ్యమీద భ్రమత పోలేదు కన్న మారాజును మరచిపోలేదు. దేవరకు నిన్ని చ్చుకుని, నన్నుచ్చుకుని – లోకం మరిచావనకుంటిని – అది దబ్బర – నీ ఊహా, నీవు కన్నవాడు కంట కట్టినాడు.

ఎల్లకాలం ఎన్నెల్లో నన్ను సూసుకుంట వనుకుంటిని–

అది నీ సేత కాలే!–

కోనకొచ్చిన సామి – సిరిదేవమ్మనే మరిచి, యీడనుండి పోదుననెనే – ఆ సామి, కోరి తెచ్చిన సినవోడా! యిన్ని పున్నము లీడను జోడుండినా, అయ్యమీద చూపు మాయలేదే! – దేవర వరమిచ్చినా నరుడు – నరుడే – పరుసవేది – సోకినా భ్రమత భ్రమతే – మనకూ,

అంతే రాత!–

ఇంక నీదారి నీదైంది సినవోడా!"– అని ఆ చిన్నది కంట ముత్యాలు రాల్చింది.

చినవాడికి నోటమాట రాంగనే --

"లేమా!" అని వాపోతూ - "ఖా కలిమి కలకాలమనుకున్నాను! కలకున్న విలువలేదే - నన్ను చిన్నచూపు చూడకే - నిన్ను విడిచి బ్రతుకలేనే--" అనగా--

--"నాకు పుట్టిన బుద్ధి కాదిది సినవాడా!- కోనలో సత్తెమది ఈడ మసలేవోరికి దేవరే తండ్రి - నీ మనసు ఆ కట్టు తప్పింది-

మనకు రుణం తీరింది

నిన్నిడిసి బతకడం నాకు సుగమా?

కాని - దేవర సత్తెమింతే. యింక నోరెత్తరాదు.

అల్లదుగో - ఆ సుక్క నడినెత్తికి రాంగనే - నీ వీడ నుండవు

నీ కోటలో ఉండేవు.

నే నేమౌత నంటివా - పండు పండిన అరటిమాను నరుడైతే నరుకుతడు - నారాయుడు, మొలకెత్తిస్తడు--

కోనలో కనుతెరచిన బాలాకుమారుడికి తోడయే కన్నె - యీడనే పుట్టి పెరగాలి

నాకు తోడుగా బుట్టినవోడు - నా అన్న తమ్ముడు - యీడకు కూతందని దూరాన సిలకలకోనలో గూడెం ఏలుతుండడు - మా అన్న యింటకట్టిన ఊగూగులో ఆడకూతురు 'కేరు' మనంగనే దేవరకు మొక్కులిచ్చి మనబిడ్డను నీకాడకంపేను. సాకాలి నీవు. ఈడ సినదానికి వయసొచ్చిన పున్నమికి - మన బాలుడికి కానరాని మరులెత్తి మరలి వచ్చేను రాంగనే దేవరకన్నెదర, సినదాన్ని తానేలుకోంగా - మన బాలుడు ఉగ్గు తాగినచోట - పసికందు కేరింత లాడగా - అప్పుడు, - నిన్ను నేను తలుచుకుంట - కలుసుకుంట-

ఆ గడియకు కాసుకుమందాం సినవాడా!-

కోటకు జేరంగనే కోనేడనున్నదని ఆరాతీసేవు!

అంతుసిక్కదు

దూరానుంటి మనుకోకు. కంటనీరెట్టకు. కాసుకుంటాను సినవాడా!-" అన్నది

చినవాడి కనులు మసకలు కమ్మి - కనులు తెరిపినిపడంగా - తాను ఎక్కడ ఉన్నాడు - అనాడు నిదురలేక - నిదురలేచిన పానుపుమీద!

*    *    *    *

మహారాజు ఆనందవర్ధనుడు కోటకు తిరిగి చేరుకోంగనే మొదట కంట జూచింది భద్రుణ్ణి. యింతకాలమేమైనావని అడుగలేదు - ఆనాడు మాయమై, యీనాడు సాక్షాత్కరించినందుకు ఆశ్చర్యపడలేదు ఆ ముదుసలి-

"నాయనగా రెక్కడ?" అన్నాడు ఆనందవర్ధనుడు

"ఏదో కీకారణ్యంలో తపస్సులో ఉన్నారు"

"ఉన్నతావు తెలుసునా?"

"తెలియరాదని కట్టడిచేశాడు మహారాజు"

"కారణం--"

"నీకు తెలియాలి, దైవానికి తెలియాలి!"

"ఔను, దైవానికే తెలియాలి"

తన కథ భద్రుడికి చెప్పాడు ఆనందవర్ధనుడు; తప్పనిసరిగా సింహాసనం ఎక్కాడు; కాని, – రాజ్యం తాను చేయలేదు. ధర్మం నాలుగుపాదాలమీద తనంతట తాను నడుస్తూంది. రాజ్యంలో అర్తులెవరూ లేరు: మహారాజు తప్ప.

ఎప్పుడూ, పరధ్యానంగా, – ఉండేవాడు కాని, – పరాకన్నది లేదు చెక్కిలిమీది గేరను తడుముకుంటూ తలపోసుకుంటూ ఉండేవాడు.

అలా ఉండగా ఉండగా, – పున్నములు గడవంగా – కాముని పున్నమి–ముమ్మారు గడచిరాంగా,–

నిదురోయే మారాజుపక్కను బాలుడు కేరింతలాడగా – ఆ బాలుణ్ణి – తానెత్తి పెంచినాడు భద్రుడు.

*　　　*　　　*

"భద్రా! మన కిక ఒంటరితనం తప్పదు" అని మహారాజు అనంగనే భద్రుడు విచారించాడు, సంతోషించాడు. మహారాజు వెనువెంట తానూ చిరంజీవి మందిరానికి తరలిపోయినాడు.

చిరంజీవి నరకేసరి – కదలితే అందాలు వేయిందాలుగా మెరిసే రూపసి, – తానైన పదింపదిగ కంట జూస్తే దృష్టి తగులునేమో, – అని, కనుచాటుచేసి పెంచిన బాలుడు, – ఎండకన్నెరుగని బాలాకుమారుడు లేమ కన్నవాడు, – తన ఒంటరితనానికి తరణోపాయమైనవాడు –

తండ్రిని చూసి, నమస్కరించడం చేతకాక, అలవాటులేక కౌగలించుకున్నాడు.

తండ్రీ – కుమారుడూ ఒకరినొకరు తనివితీరా, చూసుకున్నారు.

"ఏమయా నాన్నా!––"

"తీరు తెన్నూ, తెలియని ఆవేదన నాన్నా!––"

"అనగా?"

"అర్థంకాని ఆనందం–"

"మంచిదే – నాయనా, నీకు అర్థంకానిది – నాకు అర్థం అయింది–నీకు యీ కోటలో నిలువ మనసు లేకుండా ఉంది కాదూ––"

"అనిపిస్తూంది – కాని అలా అని చెప్పలేను––"

"చెప్పనక్కరలేదు – నేను చెప్పినట్టు విను. నీవు యీ కోటలో ఉండనక్కరలేదు – విడిచి పోవచ్చును––"

"మనస్ఫూర్తిగానే అంటున్నారా––?"

"ప్రశ్నిస్తున్నది నీవేనా?––"

'నే–నే!'

––! "నేనే" అని పలికిందెవరు? – లేమ!

మహారాజు మౌనంగా మ్రాన్పడి – కరడుకట్టిన చిరునవ్వై నిలుచున్నాడు – 'లేమా! కన్నవాణ్ణి చూసి, నన్ను మరచేవుసుమా! క్షణం యుగమౌతుందని గురుతుంచుకో' అని మనసులో పలవరించాడు––

కుమార కేసరి – నిదుర మేల్కొనినట్లు తెప్పరిల్లి తండ్రికి నమస్కారంచేసి, – అడుగు ముందుకు వేశాడు.

భద్రుడి మొగంలోకి నవ్వి – తా–తా–అన్నాడు

మహారాజు కన్ను మసకవేసింది. భద్రుడికి లోకం కనుపడలేదు

ఆనాటికి మరునాడు, కాదు, ఏనాడో ఎవరి కెరుక ––

దూరదూరపు రాజ్యాలనుంచి దూతలొచ్చినారు––

కుమారుడికి కన్నె నిచ్చేనని ఒకరాజు; వియ్యానికి సమ్మతించకపోతే, – విరుచుకుపడి, పరగణాను నాశనంచేసేనని మరొకరాజు, వర్తమానం పంపినారు.

మహారాజు నవ్వి – "వియ్యమందేందుకు నేను కాను – సింగం దేవర. ఆ సామికి వర్తమానం పంపించండి–" అని బదులు పలికి పంపివేసి, – రాజ్యాన్ని ప్రజలకు అప్పగించి – కోటను, నిలువ నీడలేనివారి కిచ్చి, – నిలువ ఉన్న విలువలేని మణిమాణిక్యాలు – ఘంటాపథంలో రాసులు పోయించి – తనకు తాను మిగిలి – భద్రుడొక్కడూ వెంట రా–లాగిలీతీరాన ఉన్న ఉద్యానవనంలో తానానాడు నిలుచున్న మల్లెపట్టున ఉనికి ఏర్పరచుకుని, – పవలు ఒడలెరుగక, – రాత్రి నిదురలేక, – ఎన్నోపున్నములుండగా –

ఆ రేయి కాముని పున్నమి

కారు కమ్మింది వెన్నెల – కనుమేరకు అందని దూరాన, గగనాన బంగరు రంగు తేరింది – ఆ రంగు మొయిలల్లే తేలుకుంటూ ముంచుకు వస్తూంది – గాలాడకపోయినా తీవెలు కదలినాయి.

వసంతవేళ కాకపోయినా కోయిల కూసింది

పసికందు కేరింత – మనసుకు వినిపించింది

లేమ – నవ్వింది.

మహారాజు ఆనందవర్ధనుడు – నవ్వులో కలసిపోయినాడు

నిదుర మానుకున్న భద్రుడికి ఆ రేయి వల్లమాలిన నిదురపట్టింది

ఉలికిపడి – మెలకువరాగా – ఏడీ మహారాజు–?

ఆకాశంలో జేగురు కమ్మింది. ఓ చుక్కను మరో చుక్క ఒరుసుకుంది – తేలిపోతూన్న మొయిలు సింగమల్లే జటలు విదిలించింది.

భద్రుడు – సింగందేవరను తలచి చేయెత్తి మొక్కి 'సత్తెం అంటే నీదే దేవరా!' – అని – గొణుక్కుంటూ మారాజు ఎల్లవేళలా కూర్చునేపట్టున దోసెడు జాజులు చల్లాడు 'మరల రానక్కరలేదు – కాముని పున్నమి – వచ్చినా, మా కక్కరలేదు. కోనలో వెలుగు కోవెలో ఉండనీ–' అని కొలుచుకున్నాడు.

★ ★ ★

# ప్రబంధము

సెలవలు ఇవ్వగానే ఇద్దరమూ కలసి బయలుదేరాము.

శంకరానికీ నాకూ ప్రాణస్నేహం. ఏ పొరపొచ్చెమూ లేకుండా తోడునీడగా, జీవికాజీవులము అయి మెలగుతూన్నాము హోస్టలులో కూడా, వార్డెనుతో పోట్లాడి ఒకే గదిలో ఇద్దరమూ ఉండే ఏర్పాటు చేయించుకున్నాము.

—మొదట, బెంగుళూరులో వెకేషన్ గడిపేద్దామనుకున్నాము. నాకు, గోమరేశ్వరుణ్ణి, బేలూరి దేవాలయ శిల్ప సౌభాగ్యాన్ని దర్శించి రావలెనని ఎంతో ఉబలాటంగా ఉంది. పనిలోపనిగా మైసూరువెళ్ళి, సంస్కృతగ్రంథాలు కూడా కొని తెచ్చుకోవచ్చునుగదా అనుకున్నాను. శంకరానికి యకాయకిని పూనాకొట్టేసి ప్రభాత్‌నగర్‌లో ప్రదక్షిణాలు చేస్తూ ఉందామని...అసలు అతనికి అదీ మనసులో ఊహ: కాని, నాకు సంగతి తెలుసును కాదూ, కర్మంచాలక ఏ శాంతా ఆప్టే అయినా కంటపడటం సంభవించిందో, ఇక మళ్ళా ఇంతలో తిరుగురైలు ఎక్కించడం నా తరంగాదు. అందుకని ఆ ప్రయాణం పడగొట్టేశాను

సంగీత సప్తాహం జరుగుతున్నది కదా, పోనీ పట్నంలోనే దిగబడిపోయి, తమిళగానవాహినిలో మునకలు వేయకూడదా అని, ఇంకో ఆలోచన చెప్పాడు. నాకు అదీ నచ్చలేదు. ముచ్చటకైనా మన గాయకులలో ఒక్కడినైనా వాళ్ళు కచేరీకి పిలవనప్పుడు, ముడుపు దర్శించుకుని మనం ఆ అరవపాద వినడానికి ఎందుకు తయారు కావలెనని, ఆంధ్రాభిమానం మస్కాతో ఆ ధోరణీ మాన్పించాను

ఇంటికి వెళ్ళడం ఇద్దరికీ మనస్కరించలేదు. తర్జన భర్జనలమీద ఏలాగైతేనేం చివరకు కూడబలుక్కుని, ఒకమాటమీదకువచ్చి మాతామహస్థానానికి ప్రయాణమైనాం.

మా తాతగారి ఊరూ, శంకరంతల్లి పుట్టిల్లూ ఒకటే. ఆ యింటికీ ఈ యింటికి ఒక అరమైలుదూరం ఉండవచ్చును మా యిద్దరికే స్నేహంకానీ, ఉభయకుటుంబాలకూ విశేష పరిచయం లేదు.

—రైలుదిగి శంకరం వాళ్ళవాళ్ళయింటికి వెళ్ళిపోయినాడు తిన్నగా. సాయంకాలము కాని తిరిగి కలుసుకోలేదు. ఆనాడే అతని తాత ముత్తవ లిద్దరూ ఇంటికి మనమణ్ణి కాపలాపెట్టేసి రామేశ్వరం వెళ్ళిపోయినారుట, వారం పదిరోజులలో అల్లా తిరిగివస్తామని – మళ్ళా కాలేజీ తెరిచే వేళకు శంకరం బయలుదేరడానికి ఇబ్బంది రాకుండా.

మాయింటికివచ్చి నాతో బాటు భోజనం చేస్తూ ఉండవచ్చుననీ, తాతగారు చాలా సౌమ్యులూ సరసులున్నూ గనుక అన్యథా భావించకపోవడం అటుండగా, నీవు ఒంటరిగా చేయికాల్చుకుంటూ ఉండటం చూసికూడా, చేతిలో గరిటె

లాక్కు_ని గిరవాటువేసి, మనయింటికి తీసుకువచ్చి నీతోబాటు మడిగట్టించకుండా చూస్తూ ఊరుకున్నావా, గృహస్థధర్మంలో అది చాలా తప్పుకాదా అని చాలా నొచ్చుకుంటాడనీ ఎన్నో విధాల చెప్పిచూశాను కాని ఒప్పించలేకపోయినాను

మొదట రెండుమూడురోజులు అసలు కనిపించడమే మానివేశాడు చూసిచూసి ఇది పనిగాదనుకుని, ఏలాగైతేనేం మెడలువిరిచి, కాఫీకన్నా నాదగ్గరకు వచ్చేటట్టు బ్రతిమాలి, అతనిచేత పట్టుబలవంతాన తల ఊపించాను అప్పటినుంచీ ఉదయం, సాయంకాలం వస్తూండేవాడు అదైనా తాతగారికంటబడకుండా కనబడితే ఆయన నిలవేసి మొహమాట పెడతాడేమోనని భయం

వారంరోజులు గడిచిపోయినవి, ఏ విశేషమూ లేకుండా. ఇక కథ మొదలూ – శంకరం అసలే రసావేశందారుడు. అందులో కవి అంతకన్నా ప్రాచీన ప్రబంధ మర్యాదలూ, ఆ వైభవాలూ అంటే చెవి తెగ్గోసుకునే ఛాందసస్వభావం కలవాడు· ఒంటరితనం, విహరించుతూ ఊహలు రేగించుకునేందుకు ఆవరణలో నందనాన్ని మించే వనం – ఇక చూసుకో, ఏదో మునగకుండా ఏలా ఉంటుంది?

చెప్పుకునేందుకు, నాకన్న అప్తులెవరూ లేరు ఓ పట్టాన మనసువిడిచి ఇంకొకరితో చెప్పేందుకూ బిడియము చెప్పందీ, మనస్సులో బాధ వెలిబుచ్చుకోందీ వీలులేదు. పనస, నాదగ్గర ప్రారంభించాడు. ఆరోజు కారోజు వేదన పెరుగుతూంది పనేమీ జరగదు. గొంతెమ్మకోరికలతో కలవరిస్తూన్నాడా అని విన్నకొద్దీ ఒక్కొక్కప్పుడు నాకు కోపం వస్తూండేది. చెప్పి చెప్పి, కుమిలిపోతూ, చాలా ఖిన్నుడై వంచిన తల ఎత్తకుండా గంటలాది కూర్చుంటాడు అతనిస్థితీ, అదుర్దా, పడుతూన్న వేదనా చూసినకొద్దీ జాలివేస్తుంది. కాని ఏం చెయ్యగలం? మనకు కేవలం అననుభూతమైన, అపరిచితమైన విషయం!

––అదివరకల్లా చాలా తగ్గుశ్రుతిలో గుసగుసగా ప్రసంగించేవాడల్లా, ఆవాళ ఎందుచేతనో రెచ్చిపోయి, ఊరూ నాడూ ఏకమయేటంత గొంతుకతో ఎత్తుకున్నాడు ఉపన్యాసం. నేను తెల్లబోతూ నోరుమెదల్పకుండా ఎవరన్నా వినిపోయేరు నెమ్మదిగా మాట్లాడమని అదమాయించకుండా, ఏమిటి ఇలా అయిపోతున్నాడేమా అని ధ్యానంతో, పరధ్యానంతో వింటూ కూర్చున్నాను. కొంతసేపటికి, అలా పియానోస్థాయిలో ఎత్తుకున్నవాడల్లా చలవలు కమ్ముతూండగా, ధర్మామీటర్ క్రుంగుకుపోతూన్నట్టు హార్మోనియమ్ మధ్యమములోకీ వయోలిన్ మంద్రంలోకీ దిగిపోయి కంజీరా, గమకపు ముక్తాయింపు కడాపటి ఫుణుకుడు దెబ్బతో రపీమని ఆగిపోయి, నిరీహతో "వెళ్ళివస్తానోయి" అంటూ లేవడానికి ప్రయత్నం చేశాడు నాకు ఏమని జవాబు చెప్పడానికీ వెళ్ళమనడానికీ మనసొచ్చింది కాదు

"పోనీ ఎక్కడికన్నా షికారు బయలుదేరుదామా?" అన్నాను కొంచెం హుషారుగా – ఆ వాలకం ఒక్కక్షణమైనా మరపించుదామని. కాని నఞర్థద్యోతకంగా తల ఊగించి ఏదో ఆలోచించుకుంటూనే, నిలుపుచూపులతో లేచి వెళ్ళిపోయినాడు

నాకు మనస్సు నీరైపోయింది కదలడానికి బుద్ధి పుట్టింది కాదు కోటు చిరాకుతో ఊడబెరికి, వంకెకు విసిరేసి, దమ్ము ఆరకుండా సిగరెట్టుమీద సిగరెట్టు నోరు బెరడెక్కేదాకా ఊదేసి అంతవరకున్నూ మహామజాగా నడుస్తూన్న నవలపేజీ

తిరగక, టీమీదకన్నా మనసుపోక, రాత్రంతా నానాగందరగోళపడి ఉలికులికిపడుతూ శంకరం మీద – కునికినప్పుడల్లా పీడకలలుకంటూ, కన్ను మూసీమూయక, పొద్దుపొడవగానే పక్కమీదనుంచి లేచి అమ్మమ్మను ఉరుకులూ పరుగులూ ఎత్తించి కాఫీ కాయించి, తాతగారు నిదురలేవకముందే ధనస్సు చేసేశాను. సైకిలు వేసుకుని, మళ్ళా భోజనం వేళదాకా చాంద్రాయణం చేసి మనసు సాఫీచేసుకువద్దామని తయారీగా, కిటికీ అడ్డుకమ్మి గాడిమీద అద్దంనిలిపి షేవ్ చేసుకుంటూ బుగ్గలు పూరించడానికి వీలైనపుడల్లా వంటబట్టివున్న ఇంగ్లీషుట్యూనులో యేదో ఒక బార్ ఈలతీస్తూ ఉదయించడానికి మెరుగెక్కుతూన్న వెలుగుముద్దను చూస్తూ పక్కకన్నా మరలకుండా నిటారుగా ఉన్నాను.

"ఎవరా కవికుమారుడు?"

—తాతగారు, గుమ్మానికి చేరగిలపడి జంధ్యపు పోగులు కొనగోటితో హటాహుటి మీటి సరిజేసుకుంటూ, అదోరకం కొంటెనవ్వుతో నిలుచుని ఉన్నాడు. నేను ఆయనకు జవాబు చెప్పకుండా, వెనుకకు తిరిగి చూడకుండా, రేజర్‌ను చెంపలమీద స్వారిచేయించుకుంటూ, మాట వినిపించనట్టు ఊరుకున్నాను. హెచ్చరికలుగా అంగవస్త్రం పింజెవిప్పి ఝాడించాడు. అప్పటికీ వినిపించుకోకపోవడం చూసి, నాకు దగ్గరగా వచ్చేసి .

"ఎవరుబాబూ ఆ పుంభావ సరస్వతి?" అని ప్రశ్న మెలివేశాడు. ఈలోపుగా గడ్డం నున్ననైపోయింది క్రీమ్ రాచుకుంటూన్నాను ఇంతకుపూర్వంలాగా నోరుమెదపలేనసే వంకపెట్టి మౌనంగా నెట్టుకురావడానికి వీలులేదు.

"నా స్నేహితుడు" అన్నాను విధిలేక – ఏదోమాట చెప్పాలికదా అని. అయన ఇందులో చెణుకు గ్రహించలేదనా? కాని, ఆ మెట్టువిడిచి పైకోటిలో..

"అవునులే – ఏమిటి విశేషం?"

ఆ ప్రశ్నకు అర్థములేదన్నట్టు ఆయనవంక చూడబోయినాను గాని, వేయబోయే పేచీ ముందుగానే గ్రహించి, కాపుమీద ఉండే పహిల్వానులాగా చూపు కలపకుండా,

"మరి, అలా ఉన్నాడేం?" అని రెట్టించాడు.

"ఎలా?"

"అమావాస్య ప్రేయసీమీది అనురాగాన్ని ఛందోబద్ధంచేసే కవికిశోరంలాగా!"

ఆ ఏత్తిపొడుపు, మాటలలో కోరదనం నన్ను పరాకు పెట్టేసినవి చెప్పకూడదన్న మాట మరచిపోయి, మనసు విడిచి...

"పాపం! ఏంచేస్తాడు? అతని జీవితాకాశాన్ని విషాద మేఘము లలముకున్నవి" అని, తెలివితక్కువ గడుసురకంగా సమాధానమిచ్చాను. తాతగారు వింటూ కనులర మోడ్చి కలకలా విప్పి..

"అలాగేం? పద్యాలు వ్రాసేది – అయితే, అతడా!"

"నీ వేళాకోళానికేమిలే"

"కాదురా నాయనా. అతనికి వచ్చిన విపత్తు ఏమిటి? కాస్త నా చెవినికూడా పడవెయ్యరాదూ? ఎంత అరసికుణ్ణయినా.."

మాట మళిపేయడం చేతగాక తప్పించుకుని బయటపడి అందకుండా పోదామన్ని, నేను – నా వెంటపడి వదలకుండా తాతగారు!

"ఊరుకో. అతను వస్తున్నాడు. వింటే బాగుండదు."

కిటికీగుండా దూరాన్నే, రోడ్డు మొగదల కనిపించాడు శంకరం. మా యింటికే వస్తూన్నాడు. తాతగారు దండకాన్ని అక్కడకు త్రెంచేసి ఆప్యాయంగా నా దగ్గరకు వచ్చి భుజం మీదుగా ఉటారించి చూసి తల ఊపుతూ నవ్వు బిగబట్టి పచారుచేయడం మొదలుపెట్టారు. గబగబ ఎదురువెళ్ళి అతన్ని లోపలికి తీసుకువచ్చాను నేను

"రావోయి, ఇలా కూర్చో" అని ఆయన చొరుచుకు వచ్చి సప్రశ్రయంగా పలుకరించి ఆసీనుణ్ణి చేసి తానుకూడా మాసరసను కుర్చీ ఉపధానంతో దులుపుకుని కూర్చున్నాడు.

"ఇప్పుడే చెపుతూన్నాడు, మనవాడు నీ విషయం!"

శంకరం గాభరాతో నావైపు చూశాడు. "ఎంతో నీదగ్గర వెళ్ళబుచ్చుకుంటే, ఇలా వంచనచేస్తావా? ఇది నీకు న్యాయమేనా?" అనే నిష్ఠురం అభివ్యక్తమౌతూన్నది అతని చూపులో.

"నేను చెప్పలేదు. కాని ఈ దేవాంతకుడు ఏలాగో కనిపెట్టేశాడు. మించివచ్చింది కనుక, అయినా, ఈయనకు తెలిసినా ఏమీ ప్రమాదంలేదులే" – ఈ భావపరంపర తిరుగు చూపులో గుప్పించాను.

తాతగారు మా సైగలకని కాబోలు ఒక నిమిషం వ్యవధియిచ్చి...

"ఏమిటోయ్ విశేషం?" అని సూటిగా అడిగేశాడు శంకరాన్ని నాకు మతిబోయి, తెగింపుగా 'ఫరవాలేదు చెప్పేసెయ్యి' అని కడకంటి కదలికతో హుషారు అందించాను. అక్కడితో శంకరం భావతరంగిణికి వరదలై పోయినవి.

తటాపటాయించి, దిటవుతెచ్చుకుని, అవ్యక్తంగా "నేను...నా...జీవితం..." గాద్గది కానికి అడ్డుతగిలి ఆయన పకాలున నవ్వుతూ–

"నాకు తెలుసులేనోయ్. అదో ఆకాశం, అందులో అకాలంలో విషాదమేఘాలూ. ఈ సరంజామాకేంగాని – ఇంతకూ ఆ అమ్మాయి ఎవరు?"

గుళ్ళబారుగా అడిగిన ప్రశ్నకు సాఫీగా జవాబుచెప్పలేక, అదిరిపోయినాడు.

"ఆ అమ్మాయిని.... నేను... మనసారా.."

"వరించి ప్రేమిస్తున్నావు, సరేనా: ఇందులో కొత్త ఏముందీ, ఆదికాలాన్నుంచీ వస్తున్న కథేకాదూ? ఎవరు బాబూ, ఆ భాగ్యవతి?"

"పద్మావతి"

"ఓహో! గీతగోవిందం తాలూకా?"

అందరమూ నవ్వేశాము. తాతగారు మళ్ళా అందుకొని–

"అదికాదోయ్ – నా అభిప్రాయం. ఇప్పటి మనవాళ్ళమనసులో నాయికలకన్న – ఎంత పాత బంగారమైనా జయదేవుడి అనంగ సర్వస్వం కొంచెం మెరుగెక్కువే కాదా అని."

"కాదు తాతయ్యా, ఈ అమ్మాయి.."

"ఎవరో బయటపెట్టకపోతే నాకు ఎలా తెలుస్తుంది చెప్పు? మాహయాంలో గనక అయినా, పదహారేళ్ళు దాటిన పడుచుపిల్లల జాబితా యావత్తూ జిహ్వాగ్రాన నిరంతరం అలా తాండవిస్తూ ఉండవలసిందే! ఇప్పుడు ఇంకా కొంచెం వివరాలు తెలిస్తేగాని అందుకునే స్థితిలో లేం కాదూ?"

"చయనులుగారి మేనకోడలు"

"శహబాస్. ఇక కథ సాగనీ. అయితే పూర్వరంగం ఎంతవరకూ నడిచింది?"

"ఆ అమ్మాయికి నామీద చాలా ఇష్టమండీ."

"అలాగే. మరి అభ్యంతరం ఏముందీ?"

"కాని, ధైర్యంచేసి పలుకరించలేకుండా ఉన్నాను."

"ఏమిటో అంతా కొత్తగా ఉందోయ్ నాకు తెలియక అడుగుతాను – నీవు ఎలా గ్రహించగలిగావంట, ఆ చిన్నదానికి నీమీద మమత ఉందని?"

"ఒక్క చూపులో తెలియదూ?"

"ఆహాఁ, నిరభ్యంతరంగా! ఇక ఆలస్యందేనికీ?"

"తాతగారూ! మన్నించండి, స్వోత్కర్ష చేసుకుంటూన్నందుకు: ఆ అమ్మాయి దివ్యప్రణయైకరూపిణి, ఆమె ప్రేమచంద్రికలలో నా కావ్యవాణి పులకించాలి."

మాయలోకం కలత లెరుగలేని అమాయక అర్భకుడై పోయినాడు తాతగారు చూపులలో.

"ప్రబంధనాయికలాగున్నదే" అని ఊదాడు.

"విద్యావతి నా వేదనను గ్రహించి అనుతాప పడగల ప్రౌఢ ఎన్నడు ఈ దీనుణ్ణి అనుగ్రహిస్తుందో కదా!"

"సరే కాని – అనుగ్రహించడం అంటే అంతసులువుగా జరిగేపనా బాబూ, యీ కలికాలంలో. ప్రేమగీతాలేమైనా వ్రాశావా?"

"అహో! వెన్నెల విరిసిపోతూన్న నిశాప్రశాంత సమయాల్లో రాళ్లరగించే ఫణితితో ఆమె యింటి ఎదుటి పచ్చిక బయలున విడిసి పఠించాను"

"చెప్పవేం, మరి"

చాలాసేపు ఆలోచించారు తాతగారు. ఆలోచనలో నుంచి ఓ పట్టున గుక్కతిప్పుకుంటూ, ప్రసన్నభావంతో శంకరాన్ని తనవెంట రమ్మని పిలుచుకుని వీధిలోకి వెళ్ళిపోయినారు.

ఆ మరునాడు సాయంకాలం టీ నింపి, జీవజ్యోతిని ప్రజ్వలించుకుని శంకరం ఏమైనాడో, ఉదయంకూడా కనబడలేదు కదా, పోయి కలుసుకుందామని బయలు దేరబోయే సమయానికి, "నేనూ వస్తూన్నాను ఆగ"మని కొంచెంసేపు నిలిపివేశారు తాతగారు. స్థవిర రమాకుమారుడిలాగా వీలైనంత జాగ్రత్తగా అలంకరించుకున్నాడు. ఉపానహద్వయికి పాదానుసంధానంచేసి, పాలకర్ర చేతనందుకుని, నేను "ఎక్కడిదాకా" అని అడిగినమాటకు జవాబివ్వకుండానే పయనం సాగించాడు.

సన్నని వెన్నెల వచ్చింది. నేను దిక్కులు చూడకుండా తలవంచుకొని, తాతగారివెంట నడిటాను. శంకరం యింటి చాయలకు వచ్చాము. లోపలికి పోకుండా అక్కడే ఆగిపోయినాము. రవంతసేపటికి వీధిచివరను పద్మావతి కనుపించింది.

తిన్నగా, బెదరకుండా, సిగ్గుపడకుండా మాదగ్గరకు వచ్చేసింది. నేను బిత్తరపోయి నాను. తాతగారు ఆ అమ్మాయిని కనుసైగతోనే కుశల ప్రశ్నచేసి, వెళ్ళిపోయిన తరువాత నావైపు తిరిగి...

"నవ్వకుండా చూడగలిగితే రా" అన్నాడు నాకు అర్థం అయీ, కాక ఊరుకున్నాను.

"నవ్వవు కదూ?"

ధైర్యం చాలకపోయినా విధివతుగా తల ఊపవలసి వచ్చింది. కాని అంతలో తెంపు చేసుకుని,

"తప్పకాదూ" అని అక్షరమక్షరం తేల్చి, జంకుతూ అడిగాను అయన నవ్వుతూ

"యాన్యస్మాకగ్ం సుచరితాని

తాని త్వయా సేవితవ్యాని" అంటూ స్వరయుతంగా లాలనతో ఆజ్ఞాపించి "నవ్వేవుసుమా, కూడ" దని ముక్కుమీద వేలువేసుకుచూపి, నా చేయి పట్టుకొని రెండోచేత్తో తలుపుత్రోసి లోపలకు ప్రవేశించాడు.

హాలులోనుంచి తిన్నగా వసారావైపు వెళ్ళి సరాసరి తోటగుమ్మం సమీపించాము. తాతగారు నన్ను అక్కడ నిలిపి 'తలుపు నెమ్మదిగా చప్పుడు చేయకుండా సందుచేసి, తొంగిచూస్తాండు. నవ్వేవా, ఏమాత్రమైనా అలికిడి అయిందో వృధాగా సిద్ధాన్నం చెడిపోతుంది సుమా' అని గట్టిగా హెచ్చరించి ఇంకోవేపు వెళ్ళాడు

తలుపుదాకా పోయి, సందేహించి, వెనక్కు తగ్గి మళ్ళా, మనసు కుదురుపరచుకొని, ఏమైనా సరేనని తలుపు సద్దుచేయకుండా ఓ రెక్క నొక్కిపట్టి, గడియ ఆడకుండా అందుకుని లాగేను.

చూశాను, చూస్తూన్నాననే స్పృహకూడా లేకుండా అయిపోయి, నవ్వుకున్నానో ఏమో జ్ఞాపకం లేదు ప్రభూ! ఆ దృశ్యం వర్ణనాతీతం

నా చూపు యెదురుగా కుడివైపున పదిగజాల దూరాన ఒత్తుగా పొదరిల్లుగా తీగెలల్లుకునిపోయిన జాజిపందిరినీడను సుసజ్జితమైన పూలపాన్పు. కొంచెం ఎడంగా పెద్ద మేజామీద పూర్వకాలపు శోభనం గదుల్లో తారసపడే అనవసరపు సామాగ్రి, నేలజారుగా మోపెడేసి పూలతో రెండు దండలు

అవతలగా, కటిక నేలమీద ఎలమావిగుబురుక్రింద చెల్లాచెదురుగా పోగుపడిఉన్న రకరకాల పూలరాశిమీద ఆపసోపాలుపడుతూ, దొర్లుతూ, లేచి కూర్చుంటూ మన్మథోపాలంభన పద్యపాదాలు అపశ్రుతిలో పలవరిస్తూ శంకరం! కుంభకోణం మంచి గంధం ఒళ్ళంతా పట్టించుకున్నాడేమో, మొదటి కోటింగ్ అయిన పులివేషగాడిలాగున్నాడు. ఈ స్థితిలో మరో మూలనుంచి ఆ అమ్మాయి ఆ ప్రాంతానికి వస్తూన్నది మందగమనంతో. నునుసిగ్గుతళుకుతో అడుగులు తడబడుతూండగా వచ్చి కొంచెందూరాన నిలుచున్నది

శంకరం పద్మావతిని చూడగానే, స్ప్రింగులమీద కాలువేసినట్టు ఎగిరి నిలుచున్నాడు. నిలువకుండానే చేతులు చాపి, ప్రణయసంబోధనలు సమాసాలుగా కురిపిస్తూ ఆమె చాయలకు పరుగుతీస్తూ ఉద్వేగం ముమ్మరమై దోవబెడిసి, మేజామీదుగా బోల్తాకొట్టేశాడు.

ఆ అమ్మాయి పకాలున నవ్వేసింది నవ్వులో లయలు తేలుస్తూ "అయం ముహూర్త స్సుముహూర్తోస్తు" అని సాగతీస్తూ తాతగారుకూడా దయచేశారు

శంకరం పడ్డపాటు అంతకుముందు చూడనట్టుగాచూసి ఆగి ఆతురత చూపుతూ దగ్గిరికి వచ్చి "అదేమిటోయ్" అంటూ చేయి ఆసరాతో లేవదీసి నిలిపించి అంటుకున్న పూలరేకలు దులుపుతూ పరకాయిస్తూ..

"నిజంగా వసంతుడిలాగున్నావు తండ్రీ" అని అభినందించడం నెపంగా పద్మావతి మరీ విరగబడిపోయింది.

"ఇదుగో నీ ప్రేమనిధానం. ఈమె పల్లవ కోమల పాణిని" అంటూ సిగ్గునటనలు పోతూన్న ఆ అమ్మాయి పిడికిలి విడిపించి పట్టుకువచ్చి శంకరం చేతికి కలిపాడు. ఆతడు పేదబాపడు పెన్నిధినిలాగా ఒడుసుకోవడంలో వేళ్ళు నలిగినవి కాబోలు పద్మావతి కెక్కురుమని ఒక్క గుంజు గుంజింది నాయకుడు నాయిక పాదతలాన కూలబడిపోయినాడు - ఒళ్ళు మరచిపోయి కళ్ళు అక్కడ అప్పగించేసి ఉన్నానేమో తగునా అన్న విచారణే లేకుండా చిన్నతనపు అలవాటు ఎరువు తెచ్చుకుని తర్జని మడిమతో నాలుక మడతవేసి గింగురులుగా ఈలలు కొట్టేశాను విని దద్దరిల్లుతూ ఉరికి అక్కడినుంచి దౌడు అందుకున్నాడు శంకరం. తాతగారూ పద్మావతీ కరువుదీరా నవ్వుకున్నారు. నవ్వుకుంటూ నడచివచ్చి తలుపునెట్టారు "ఇక వెళుదామా" అన్నారు ఆయన

మాతో కొంతదూరం కలిసివచ్చి, దోవలో విడిపోయింది పద్మావతి. ఆమె వెళ్ళిపోయినతరువాత నేను ధూకుడుగా "ఏమిటి తాతయ్యా! ఈ ఆగడం?" అన్నాను

"ఈలా కూర్చుందాం కాస్సేపు" అని ఆయన రోడ్డు పక్కన మఱ్ఱినీడను బైఠాయించాడు నేనూ చతికిలబడ్డాను.

"సిగరెట్ ముట్టించు" ముట్టించి మళ్ళా ప్రశ్నించాను

"ఏమిటా? శృంగారం అందులో విరహం"

"నీకు న్యాయమేనా?"

"నాకు చేతనైన సాహాయ్యం చేశాను. నీవూ చూస్తూనే ఉంటివికదూ దూతీధర్మం."

"ఇక మళ్ళా తలఎత్తుకు తిరుగుతాడా? నాతో మాట్లాడతాడా, జన్మకి! నీవు పెద్దవాడవుకదా అని.."

"అనే నేనూ చిలుకకు చెప్పినట్టు చెప్పి చూశాను. ఉహుఁ. తల్లిగర్భంలోనుంచే మేహనాడి స్తంభించిపోయిన ఈ వీళ్ళు ఎందుకు పనికివస్తారండీ ఎంతసేపూ నిషామీద నిద్ర చంపుకుని పద్యాలు పేని. ప్రియురాలు కావాలేం వీళ్ళకి? కలలో అయినా ఆడపిల్ల మీదచెయివేసిందంటే కంగారుపడుతూ మంచంమీదనుంచి క్రిందకు దొర్లేరకాలు."

"అయితే, ఆ అమ్మాయికి శంకరంమీద..."

"పిచ్చి పిల్ల, మోజుగానే ఉందోయ్. ఈ మూగనోమురాయడు పలికితేనా దోవపోతూ ఆమెవంక చూస్తేనా? లోపలికి రావచ్చును అనే సూచనతో, ఓ మారు

మీ కవికుమారుడు దోవను వస్తూంటే వెనుకకు తగ్గి గేటులోపల నిలుచున్నదట సాభిప్రాయంగా. చూడకుండా పోతూంటే వినిపించాలని గేటు కమ్మీమీద టెలిగ్రాం కొట్టిందట. ఏం ప్రయోజనం? ఎందుకువచ్చిన చదువులు?"

"మరి, నీవైతే ఏం చేసేవాడవో?"

"సరి, మనవిషయమైతే గ్రంధం ఇంతవరకూ వచ్చేదా? ఆహ్వానించిన తరువాత కూడా ఇంకా ఊరుకోవడమే? ఒకవేళ, అంత అవసరంవస్తే, ఆ అమ్మాయి రాలుగాయితనానికి గేటు బంద్‌చేసినా, ప్రహరీపెంచి కట్టించినా అవి లంఘించలేకపోతే ఎందుకొచ్చినట్టోయ్? – తాను విరహంలో మునిగి తేలుతూంటే, నాయిక అభిసారికా వేషంతో తనదగ్గిరికి వెదుక్కుంటూవచ్చి ఏమిటోయ్ వీడి ముఖం కోరికలు! శుకసందేశాలూ మొదలైన కాండ యావత్తూ యధావిధిగా జరిగించాలని అనుకున్నాను గాని, యెందుకులే అని టూకీగానే పోనిచ్చేశాను ఈ దెబ్బతో దిమ్మతిరిగి పోతుందిలే."

"ఇక ఆ అమ్మాయి శంకరానికి దక్కుతుందా?"

"దక్కించుకునే తాహతు ఉంటే సరి. అయినా మనవాడు ప్రత్యక్ష ప్రమాణాన్ని లక్ష్యం చెయ్యడు కాదూ?– పోనీ, ఈ వేడి ఇలాగే నిలిచిపోతే వెచ్చవెచ్చగా పద్యాలన్నా వ్రాసుకుంటూ ఉంటాడు సంపుటంలావున తయారైన తరువాత అచ్చువేసి పద్మావతికి అంకితం ఇచ్చుకుంటాడు. అయ్యాపన అంతవరకే ఔనా?"

"అంతే నంటావా?"

"కాక మరి. సరేగాని, అయితే ఇంతకూ దేవరవారికి ఆ చాయల ఆశేమైనా ఉందా ఏం?"

★ ★ ★

# అబ్బాయి - నాన్న

"చెప్పండి...మరి!"

"ఏమిటి?"

"చందమామను...చంద్రుణ్ణి, మామ అని అందుకు పిలవడం?"

"ఏమో"

"ఓస్ ఇంతేనా. "

"ఐతే, చెప్పనా "

"ఆఁ."

"నీవు ఒప్పుకుంటావా?"

"ముందు చెప్పండి గెలువలేక ."

"నీలాటి చక్కని చుక్కలు కూతుళ్ళుండటంచేత "

"సంతోషించారు తెలివికి, తమరెవరో అప్పుడు?"

"మేం లక్ష్మీపుత్రులం!"

"ఓహో.. అదా సంగతి! రోజా తోటలో పూలన్నీ మాయమౌతూంటే ఏమై పోతున్నాయా అనుకుంటున్నా ఎవరిమీద ప్రయోగించడానికేం బాణాసంచాంతా?"

"అదికాదండి నాకు తెలుసులే దేవిగారికి తల జార, దండలు అమరటంలేదని గునుపు "

"పోనీ తీసుకోండి మీ క్రాపింగు లో..కి. "

"నవ్వు ఆలాగే నవ్వితే నేనూరుకోను.."

"ఐతే కోపం తెప్పించుకుంటా .ఇదుగో, బుంగమూతి పెడుతున్నా వచ్చేసింది . ఉహుఁ"

"ఇదుగో...ఓయ్!...ఊ! పలకవ్వూ? ఏమిటి నిజంగా కోపం వచ్చినట్లేనా? ఉహుఁ! అలా అయితే నేను వప్పుకోను అన్నింటికి ఓమాదిరిగానే తల ఊగిస్తే ఏలా? కోపం రాలేదా? వచ్చిందా? వచ్చిందీ? సై. ఇక కాచుకో, చక్కిలిగింతపెట్టనా-- నవ్వకూడదు–ఏం సరేనా?"

*  *  *  *

"ఏమి టా కిచకిచలు? ఇంకా మేలుకునే ఉన్నార్రా?"

"వినబడుతూనేఉందిలే నవ్వు. మీరు మాట్లాడకపోయినా--"

"ఇక చాలించండి, ప్రొద్దుపోయింది అమ్మాయి! ఇక పడుకో అమ్మా!

ఓపలేనిపిల్లవు. ఒళ్ళు భారకిస్తుంది వాడికేంలే? అలవాటేగా తెల్లవార్లూ మేలుకోవడం!"

*　　*　　*　　*

"చెపుతే విన నేర్పులే దేంచేతునమ్మా? వాడు వాడే; అది అదే ఇదుగోన్రా! ఇక నేనూరుకోను."

"...మరే...అమ్మమ్మా..."

"కాదండీ...అమ్మమ్మగారూ.. ఈయనే..."

"చూడవే...న...వ్వి...స్తూం...ది.. నే ..ను..."

*　　*　　*　　*

"మీ యిష్టం మీది నాయనా ఉండండి, మెట్లగదిలోకి వెళ్ళి పెద్దమీట వేసేస్తా...దీపాలున్నంతవరకూ—"

*　　*　　*　　*

"అమ్మమ్మా! వెన్నెల్లో నీ మనుమరాలే ."

"ఊఁ! అఘోరించండి.. మీ యిల్లు బంగారంగానూ"

## 2

"చూడండి. "

—మిమ్మల్నే. "

—అక్కడకాదు—ఈలా రండి.."

—అబ్బ! రండి...ఇంతలో మరేం అరిగిపోరు ."

—ఓ! పిలిచినకొద్దీ బిగింపు ఎక్కువౌతూందేం? మిమ్మల్ని ఎవరూ కొరుక్కు తినరులెండి—రద్దురూ..."

"ఎందుకూ?"

"...అలా చూడరేం. పాప పిలుస్తున్నాడు .."

"ఆ.. నీ అంతవాడే. తక్కువా ఏం?"

"కాదండీ...మీ అంతవాడు. మీ గుణాలన్నీ అప్పుడే అబ్బినాయ్. అనుక్షణం అనుసరించి ఉండాలికద.. ఓస్!...లేదమ్మ! మా నాన్న! మా బంగారుతండ్రి! నిన్ను కాదమ్మ! అబ్బ! ఎంత రోషమొచ్చిందో! ఒక్కమారు తీసుకోండి ఏలా చేతులు చాస్తున్నాడో..."

—కే. అ వు ... కే...వు .. కే.. వుం .గా అ .

"పోనీలెండి...తెలియడంలా? వాడిభాషలో 'నన్నెత్తుకోవు? ..'అని ఏలా పిలుస్తున్నాడో ."

"...ఇంతమాత్రం కవిత్వం నాకూ చేతనవును 'నీవు పనికిరావు ..అమ్మ'వుకావు అంటున్నాడు, సరేనా..."

"మహా నేర్చారులెండి మాటలు. "

"మాట..."

". . . ..... .."

"పాపని. అమ్మమ్మకు యిచ్చి—"

—ఏం?

—వినిపించలా?

—ఏమిటి?

"నాకు తెలియదు బాబూ! ఆవిడకిస్తే వాడూరుకోడు...పనివేళప్పుడు—"

"అలాగైతే ."

"వాణ్ణి చూడండి ఉహూఁ అంటున్నాడు వల్లకాదు.."

"ఉహూ...నేనూ అంటా వల్ల కాదని..."

"మీ అమ్మమ్మదగ్గర పోయి కూర్చుంటా!!"

## 3

"అమ్మాయ్!...అదేమిటే? అలా మాటిమాటికీ తొట్టె కుదుపుతూంటే మళ్ళా మేలుకుంటున్నాడు? అసలే కొంటెకోణంగి. పోనీ, కాస్సేపు కాళ్ళమీద వేసుకుని చిచ్చిగొట్టు .అంత ఎగరేయకు, ఉలికిపడతాడు. ఒక్క పావుగంట ఆడించు. నేను మడివిడిచి ఇవతలకు వచ్చి తీసుకుంటా—..."

* * * *

"ఇంకా, పడుకోలా వాడు?"

"ఉహూఁ. ష్. బిగ్గరగా అనకండి...ఇప్పుడే కాస్త కునుకుతున్నాడు.. మళ్ళా లేస్తే నన్ను వేపుకుతింటాడు ."

"వీడొకడు. దొరికాడు "

"... .. ...... ..."

"నిజంగానే వెన్నెలరాత్రుల్లో ఎంత హాయిగా ఉండేవాళ్ళం? ఇప్పుడు —"

"అఁ మీకు ఎప్పుడూ అదే రంధి. "

"అవును. నా ఆనందానికి అనుభవానికి అడ్డం గొట్టడానికి పుట్టాడు, వీడు.."

"ఏమిటా మాటలు?—"

"ఏమిటా.. నీతో మాట్లాడటానికైనా నాకు ఇప్పుడు స్వతంత్రంలేదు బిగ్గరగా పిలువకూడదు. అబ్బాయి ఉలికిపడతాడు. బిగ్గరగా నడవకూడదు ఆయన మేలుకుంటాడు. నీవు నాతో కాస్సేపు తీరికగా ఉండకూడదు. ఆ మహారాజాధిరాజు పోరు మొదలెడుతాడు. ఐతే, నేను ఇక ఇంట్లోనూ ఉండకూడదు, అలాగైతే?"

"ఎక్కడ నేర్చుకున్నారు ఈ పారమంతా? మీకే ఉన్నారా మహా పిల్లలు? గారికి తిరిగివచ్చి కబుర్లు చెప్పడానికే మీకు యింత కష్టమైతే, అస్తమానం కనిపెట్టుకుని కూర్చునేదానికి నాకు ఏలా ఉంటుంది? ఐనా మనపిల్లవాడికి మనం చేసుకోవడం అబ్బురమా? ఒకరికి మెప్పా? వాడుమాత్రం అందరిపిల్లలలాగా విసిగిస్తాడా?"

"వెనుక వేసుకువస్తున్నావ్! అవును, నీకు వాడితోనే లోకం. నా మాట—"

"ఆ...మీ మాట...మీరు చెప్పేమాట ఏమిటో నాకు తెలుసు కొత్తా?"

"ఊc వీడిమూలానే నాకు నీవు దూరమౌతున్నావ్ ఐనావు ఎందుకు పుట్టాలీ. .వీడు?"

*　　　*　　　*

"వింటున్నా మీ చిలుకపలుకులు, మహా లక్షణంగా ఉన్నాయ్. "

"కాదే అమ్మమ్మా!.."

"చూడండి! వాళ్ళఅబ్బాయితో యుద్ధంచేస్తున్నారు"

"అవును వాడు ఎందుకుపుట్టాలి?.."

"ఆలాగేం? నాగన్నా! నీవు ఎందుకుపుట్టావు?"

"మా అమ్మ కన్నది "

"మీ అమ్మ కంటే మాత్రం, నువ్వు ఎందుకు పుట్టడానికి ఒప్పుకున్నావూ? నిన్ను కాకపోతే ఇంకొకడ్ని కనేది. కడుపుతూన్నమ్మ కనక మానుతుందా? వండుకున్నమ్మ తినక మానుతుందా?"

"ఏం...?"

"జవాబు చెప్పవేం? ఇందాకనుంచీ నోరులేని పసికుంక వాడిమీద ఎగిరావ్.. చెప్పమరి?"

*　　　*　　　*　　　*

"మీరూ. .మీ వేషాలూనూ. ఎత్తుకో .ఓమారు ఎత్తుకు తిప్పు ఎందరు ఎత్తుకోందీ ఇంతవాడవైనావ్? నేనూ బతికుంటే చూడకపోతానటలే? వాడూ రేపు ఈపాటికి బతికి బట్టకడితే వాడి పెళ్ళాందగ్గిరా ఈలాగే ధీమాకులు చేస్తాడు అప్పుడు మనవణ్ణి నీవే ఎత్తుకు మోయాలి చాల్లే;– ఇక ఈలా తే ఈ నిమిషానికే పండుతండ్రిని పిసిగేశావ్ ఈకాలంవాళ్ళకు ఏదీ తెలియదు. అదేంలోకమో? పోన్లే నాయనా! నీవు నాదగ్గిరే పడుకుందువుకాని మీ అమ్మను నాయన్నీ గంతులేసుకోమను. ఇదుగోనే అమ్మాయి ! నవ్వొస్తే ఆపుకోవాలికాని – విరగబడుతూ, పరిగెత్తితే ఎలాగే? ఒక్కమారు వీణ్ణి తీసుకో.."

★ ★ ★

# కన్నె గులాబీలు

కమ్ముకుని వికసించిన గులాబీపూలు, ఎవరన్నా కోసుకుంటారేమోనని, ఎత్తుగా ఉన్న గోడమీదుగా కొమ్మలెవరికి అందవు. యౌవనపు ముమ్మరంతో చూసినవారిని సొమ్మసిల్లచేసే ఆ కొమ్మకూడా ఎంద రెన్నివిధముల ఉవ్విళ్ళూరినా ఎవరికీ అందదు.

వెన్నెల రాత్రుల్లో చంద్రశిలా సవిధ సీమను తరంగితమయే గీతికారసవాహినికోసం చాలామంది కాచుకునీ ఉంటారు. హాయిగా పాట విని, ఆ నవమోహిని పొరబాటుననైనా కనబడుతుందేమోనని ఎత్తిన తలలు వంచకుండా చూసిచూసి, భగ్నహృదయాలతో తిరిగిపోతూంటారు. కాని, ఆ అమ్మాయితో స్నేహం. దర్శనం .

*　　*　　*　　*

సుందరం మదరాసు ఎందుకు వచ్చాడో అతనికే తెలియదు బయలుదేరినది అసలు ఎక్కడికో తెలియదు. కాని, చల్లగాలికి బీచివద్దకు చేరుకున్న తర్వాతనైనా రేడియో అవలంబనాన బొంగురు గొంతుతో అరవపాట వినబడేదాకా, తాను చివరకు అక్కడ తేలాననే విమర్శనే లేదు. చిత్రశోభలులేని సామాన్య సంసారికజీవనం అతనికి నచ్చలేదు. కాంచన సమృద్ధి కలిగిన, కాంతాసమ్మితత్వము కలలోనైనా అనుభవించని యోగంచేత అర్థంచేసుకోలేని ఆవేదనతో సంతోషం తెప్పించుకోవాలని .దాన్ని వెదుక్కుంటూ, దోవ తెలియకుండా తిరుగుతున్నాడు.

పట్నంగూడా పాతబడిపోయింది నాలుగురోజుల్లోనే అతనికి ఏమీ తోచదు కాలం గడవడానికి మార్గాలు కనిపించడం లేదు స్నేహితులమాట ఎత్తటంతోనే ఎక్కడలేని విసుపూ వచ్చేది. ఏదైనా రచించడానికి యత్నంచేసినా మరల చదువుకునేటప్పటికి రసవిహీనంగా, జీవకళ కొరవడినట్టుగా తోచి, నిస్పృహతో వ్రాసినవాటిని చించివేసేవాడు.

తోడివారందరూ ఎందుకు...ఎలా, సంతోషంగా ఉండగలరో అతనికి అర్థమయ్యేదికాదు. తనకు ఏమి కావలెనో దేనిని అన్వేషించుచున్నాడో తెలియదు ఎరుగున్నవాళ్ళు ఈ విపరీతపు ఆవేదనను ప్రవర్తనను చూసి, కవికి అలవడే లక్షణాలలో అది ఒకటని, లక్ష్యపెట్టకుండా ఊరుకునేవారు. క్రమంగా ఎవరిసహచర్యాన్ని యిచ్చగింపకుండా ఒంటరిగా షికారు బయలుదేరటం మొదలుపెట్టాడు.; కాని ఏమీ లాభం కనిపించటంలేదు. పార్థసారధి దర్శనంకోసం శుక్రవారంనాడు తయారయ్యే తమిళాంగనా పద్మవ్యూహాన్ని బలవంతాన ఛేదించుకుంటూ వెళ్ళే అవసరాల్లోనైనా అల్లుకుపోయిన అంత అందముకూడా, అతనిని లాలసుని చేసేదికాదు. వాల్చూపులూ, చిరునగవులూ లక్ష్యపెట్టడం అలవాటైందికాదు.

*　　*　　*　　*

మంచుతెరలు ఇంకా కమ్ముకుని ఉండటంచేత ఎండ బాగా పురివిప్పలేదు

సుందరం మైలాపూరులో ఆ – వీధినే నడచివెళుతున్నాడు. అక్కడికి ఆ మేడప్రాంతాలకి వచ్చేటప్పటికి కొంచెం నెమ్మదిగా అడుగు వేశాడు,– సమీపించి, ఆ చక్కదనాన్ని చూస్తూ సాపుగా ఆగిపోయినాడు.

కనపడ్డవి హిమానీ సంస్పర్శచేత రసార్ద్రములైన గులాబీపూలు.

అవి పలుకరించినట్లుగా అయింది అతనికి ప్రహరీ వద్దకు వెళ్ళాడు బరువుగా ఉండడంచేత కొమ్మలు అందుబాటులోనే ఉన్నవి పూలని – చూసి సంతోషిస్తూ నిలబడినాడు.

పూలదొంతరల మీదుగా – మేడమీద – ఆ అమ్మాయి.. కనబడ్డది.

ఆ దృష్టితోనే ఆ పిల్లవంక చూసి, అక్కడ నిలువకుండా నడచిపోయినాడు

మరునాడు... ఆ వేళకే.. అక్కడికి వచ్చి, గులాబీల చిరునగవును గమనించాడు ఊరుకోలేక, వాటిని కోమలంగా స్పృశించి, పరవశుడైనాడు. ఆ అమ్మాయి అందుబాటుగానే కనబడ్డది కాని, చేయి చెప్పినమాట వినలేదు . ముందుకు సాగలేదు.

నవోదయముతో కోరికలు విజృంభించినవి. తనవి– తనకోసమే వికసించినవి – తనకు కావాలి అనుకున్నాడు; పూసిన పూలన్నీ. మొగ్గలను మాత్రము కనికరించి విడిచాడు.

కనబడకుండానే ఆ అమ్మాయి తోటలోనుంచి తీయని గొంతుతో "ఎవరు అలా కొమ్మలు లాగేది?" అని కసిరినట్టుగా అడిగింది

అతడు ఆనవాలుపట్టి పులకితుడైనాడు జవాబు ఏమీ చెప్పకముందే, ఏమి చెప్పాలో తెలియకముందే... ఆ అమ్మాయి కనిపించింది. గ్రీన్‌హౌస్ తిన్నెమీద నిలుచుని ఉన్నది. మొగం మాత్రము అగుపడుతూన్నది.

"ఎవరు... నీ . మీరు?"

సుందరం కొంచెం తటపటాయించి, "నే.....ను" అన్నాడు.

ఆ అమ్మాయి, చిరునగవుతో చూసి . చూస్తూ ఊరుకున్నది..

"పూలు... కోసుకోవచ్చునా?" అని అతడు సిగ్గుపడుతూ ప్రశ్నించాడు.

నవ్వుతూ... ఆతనివంక చూస్తూనే "మొగ్గలు . కూడా కావలిసుంటే " అని తనలోతాను నవ్వుకున్నది ఆమె.

సుందరం అమాయకంగా నవ్వుతూ గోడమీదికి ఎగువకు చేజాపి–

"ఇవి... మీరు . తీసుకోండి" – అని కోసిన పూలను అందీయబోయినాడు.

ఆమె వద్దని సైగతో బదులు చెప్పింది. చిన్నబోయి తరువాత కథ ఎలా నడపాలో తెలియక చూస్తూ నిలువబడిపోయినాడు ఏమీ మాటాడలేదు అమ్మాయి రోషంతో అభిమానంతో వెనుదిరిగి నాలుగు అడుగులువేసి. ఇక మనస్సు పట్టలేక మళ్ళా అక్కడికే తిరిగివచ్చాడు.

ఇంకా అలాగే నిలువబడివున్నది ఆతని రాక చూసి బహూళార్థసంభరితమైన అపాంగవీక్షణ కటాక్షముతో దిగిపోయింది.

"వెన్నెల వస్తేనేకాని జాజులు..వికసించవు.." అని ఆ అమ్మాయి పలుకులే విస్పష్టంగా వినపడ్డాయి

*　　　*　　　*　　　*

ఆ రోజంతా ఏలా గడిచిపోయిందో సుందరానికే తెలియదు చంద్రుడికన్న తాను ముందుగా బయలుదేరడానికి పంతము పట్టినట్లు సహనమునేమాటే లేకపోయింది. కాని, మామరాకతోకాని మనసులోని కోరికలు తీర్చేందుకు మాకుమారుడుకూడా అయత్తుడు కాడు గాదూ?

ఎవరినీ లక్ష్యం సేయనట్లు యకాయకిని రాచబాటను నిర్భయముగా తోటలో ప్రవేశించాడు సుందరం. ఎవరినీ కన్మొరగి రానవసరములేని వైఖరిలో ఆమె సమీపించింది.

ఎవరు ముందు కౌగలించుకున్నారో, ఎంతసేపలా ఉండిపోయినారో...ఎవరికీ తెలియదు. కాని ఆ అనుభవానంద సముద్రంలో రేకలుగా విడిపోతూ, గులాబీలన్నీ సన్నజాజుల సైదోడున అవాఙ్మధురధోరణిలో అబ్బ! అనినట్లయింది. విడని కౌగిలిని, విడువజాలని హృదయంతో, విడిపించుకుంటూ, ఆ అమ్మాయికూడా "అబ్బ" అన్నది. అంతచక్కగా అనగలిగిన పెదవులను అతడు సత్కరించాడు.

"నేను..నీతో...మాటాడను" అన్నది ఆ అమ్మాయి

సుందరం మరీ దగ్గరగా కదలి "పోనీలే.."అన్నాడు చిన్నపిల్లల మారాంలాగా – "నా.. పూలన్నీ.." అని ఆ భంగిమం నిలుపలేక నవ్వేసింది.

"మరి...ఎందుకు మాటాడావు?"

ఇద్దరూ ఒకరినిచూసి ఒకరు..ఒకమారే కలసి నవ్వుకున్నారు

తమ చెలిమి నభిలషించలేదని కలువరిస్తూన్న జాజులతో తన నెచ్చెలివేణిని అలంకరించాడు. ఎంతో వెదికి మారుమూలల ఆకులమాటున అణగిమణగి సిగ్గుపడుతూన్న ఒకటిరెండు అరవిచ్చిన గులాబీల జన్మకూడా సార్థకం చేశాడు.

కాని, ఆ ప్రణయ సమ్మోహనంలో ఎంతకాలము అవి రేకలువిడకుండా నిలువగలవని చందమామ సర్వజ్ఞుడులాగా నవ్వుతూన్నాడు.

*　　　*　　　*　　　*

వెన్నెల పక్షపాతం వహించిన దోషాన సన్నగిలిపోయే రోజులు వచ్చినవి. మంచుచమకులతో ముత్తెపుతళుకు మాసిపోయిన తరువాత విరికన్నెలకుకూడా తొలిప్రాయము విరిసిపోయినది. గులాబీలకు మొదటి పరువము లేదు.

సుందరం రచనల్లో నవచైతన్యధుని పరవళ్ళుకొడుతూన్నది. కావ్యాత్మ అతని ఆలోచనలన్నీ సొంతం చేసుకుని మనసుజోలికి మరి వేనినీ రానీయడంలేదు.

మరచిపోలేదు..లేదు; కాని మళ్ళా, ఆ అమ్మాయికోసం కలువరించే అలసత్వం దరిజేరడంలేదు. ఆ సంతోషమంతా సంతోషముగానే ఆగిపోయింది...

ఆమెగీతికాలాపాల్లో మును మొలవని రసాంకురములు తలచూపుతున్నవి; కాని ఆతని చెలిమికి నిలుకడ తీసుకుని వచ్చే కవళికలు లేవు తళుక్కుమని మెరసి నిలువకుండా మాయమయే చిన్నెలు లేవు అందరికీ ఆప్యాయంగా కనబడుతుంది; కాని అశలూరించదు.

ఒకరినొకరు విడువమనుకుంటూనే విడజాలకుండానే – విడిపోయినారు

* *

గులాబీలు వృంతాల్ని వీడకుండానే వయస్సు కొనసాగించుకుని విడివిడిగా రేకలుగా రాలిపడుతూ జీవనసంధ్యను సమాచీనముగా చేసుకుంటున్న అనుభవజ్ఞులలో అప్పుడప్పుడు తాత్కాలిక విభ్రమాన్ని ప్రవర్తిలజేస్తూంటాయి. అవికూడా ఎప్పటిలాగానే అందవు...అందుకోనీయవు––అలా ఉండిపోవాలిసిందే.

★ ★ ★

# రాగమయి

చిన్నతనంలో, అనుకోకుండానే కామన్నకు ఓ గండం తప్పింది.

చిన్నతనం అంటే, మరీ అంత బొడ్డూడని పసితనం కాదు. పది పదిహేనేళ్ళు ఉంటాయి, అభం శుభం అంటే కొంతవరకూ చూచాయగా తెలిసివస్తున్న యీడు.

వేసవిసెలవల్లో తాతగారి ఊరు వెళ్ళాడు కొన్నాళ్ళకు, – యిల్లు, యింటిల్లిపాదీ తీర్థానికి వెడుతూ, వీడికి కాలిమీద గడ్డో – గనుపో లేచి, పోటూ సలుపూ, – ముక్కూ మూలుగూమీద ఉంటే, – దిగవిడిచి వెళ్ళారు. వాళ్ళు తిరిగివచ్చేదాకా – ఆ నాలుగురోజులపాటూ, పక్క పున్నమ్మగారియింట్లో భోంచేయమన్నారు.

వీడికి నిజానికి మరేం సుస్తీలేదు; తీర్థంపట్టుకు అగమ్మకాకిలాగా తిరిగితే, కాలు బరువు చెయ్యొచ్చు – ఒళ్ళు మరింత భారకించవచ్చు; అయినా – అక్కడ కొత్తగా చూసే చోద్యాలంటూ ఏముంటాయి గనుక! – ఏయేడు చూసినా, ఆవేళకు, అవే– రంకులరాట్నాలు, అవే నక్కపల్లి దుకాణాలు – అదే సరుకుల వేట్లాట. సరిగా సమయానికి దానిపుణ్యమా అంటూ కురుపంటూ లేవడంకూడా మేలే! – ఊళ్ళోకి కొత్తగా డేరా సినిమా వచ్చింది ఈ నాలుగురోజులపాటూ, రోజుకు రెండాటలు మక్తా పుచ్చుకోవచ్చును. ఇంట్లో అందరూ ఉంటే, – పూటపూట ఈ ఆట లెక్కడ సాగుతాయి?

పున్నమ్మగారంటే – తాతగారికి ఏదో ఒకటో రెండో వేళ్ళువిడిచిన చుట్టం. ఆవిడకూతురు అదెమ్మ; ఆ యింటికల్లా వీళ్ళు యిద్దరే తను ఎరుగున్నప్పటినుంచీ, అలాగే వండుకు తింటూ, ఏదో కృష్ణా, రామా అనుకుంటూ కాలం వెళ్ళబుచ్చు కుంటున్నారు. ఆ యింటి మండిగానికేతప్ప, యింట్లోవాళ్ళకు కుంకుమా పసుపూ నిండుకున్నాయి. వాళ్లకు తగని ఆచారం.

అప్పటికీ, అదెమ్మ చాలా అందంగా ఉంటుంది. ఆ కళ్ళు, కాటుక పెట్టుకున్నట్టే ఉంటాయి. ఆ పెదవులు తాంబూలం వేసుకున్నట్టే ఉంటాయి ఆ నడకా, ఆ నవ్వూ, బ్రతుకంతటా ఏ క్షణానా కంటతడిపెట్టనట్టుగానే ఉంటాయి. మనిషి ఎప్పుడూ మడిగానే – మైలపడకుండా అంగ చూసి వేస్తున్నట్టు నరాలబిగివిగా, బెదురుబెదురుగా ఉంటుంది.

అదెమ్మ వడ్డనలో, ఆకలిపెరిగే సుళు – సూత్రం ఏదోఉంది. కామన్న తిండివేళకు సర్వసాధారణంగా మూలగటం అలవాటైనవాడు పిలిపించుకోకుండానే వచ్చి పీట వాల్చుకు కూర్చోడం, పెట్టింది తినడం, మారు వడ్డించుకోవడం – ఇదంతా వీడికే ఆశ్చర్యంగా ఉంది

ఇక తెల్లవారితే రేపు, తీర్థానికి వెళ్ళినవాళ్ళు తిరిగి వస్తారనగా – పట్టుబలవంతాన కామన్నకు శుభ్రంగా తలంటి పోసింది. పండుగ అని నచ్చచెప్పి, కొత్తబట్టలు

కట్టబెట్టింది. పంచభక్ష్య పరమాన్నాలతో రాజాన్నం పెట్టింది. తీరా, వడ్డనంతా కానిచ్చి, కరగబెట్టిన నేతిగిన్నె పట్టుకువస్తూ, ఉన్నట్టుండి చటాలున గిన్నె – గిన్నె నేలమీద విసిరికొట్టి, తన్నుతాను తిట్టుకుంటూ, వలవలా ఏడ్చుకుంటూ, ఒక్క అంగలో పెరట్లోకి పోయిపడ్డది.

కామన్నకు యీ రభస ఏమాత్రమూ అర్థంకాలేదు. "ఏమిటి – ఏమిటి?!?" అంటూ అదుర్దాగా విస్తరివదలిపెట్టి లేవబోయినాడు. "ఏంలేదులే, దాని ఖర్మం అంతే; నువ్వుకూచో!" అని విసిరికొట్టింది పున్నమ్మ. ఇంత పేరిననేయి ముద్ద పట్టుకువచ్చి, మొగానకొట్టినట్టు విస్తరిలోకి విదిల్చి, చెర్నాకోల పుచ్చుకు నిలుచున్నట్టు నిలుచుని, మింగుడు పడేయించింది. కామన్న మిర్రి– మిర్రి చూస్తూ ఆ యింతా ముక్కా – నోటా కొట్టుకుని, అపోశనంపట్టుమీదనే లేచి మూతితుడుచుకుని, వెళ్ళిపోతూ, – "వెళుతున్నా!"నని కేక వేశాడు. పున్నమ్మ రొండిని చేతులు పెట్టుకుని నిలుచుని, ఏగాదిగా చూసినట్టు తలఆడించి, "వెళ్ళిరా నాయనా, నీ యమ్మకడుపుచల్లగా!"అంటూ గొణుక్కుంది. కామన్నకు ఆ విసురూ, యీ దీవెనా రెండూ ఒకయిందానే అనిపించినాయి. మళ్ళీ ఆ రాత్రికి భోజనానికి వెళ్ళకుండా ఆకలి లేదని ఎగవేశాడు. మర్నాడు వాళ్ళవాళ్లు తిరిగి రానేవచ్చారు.

నాలుగురోజులు పోయినాక, ఆదెమ్మ కనిపించింది. సర్వసాధారణంగా ఎప్పుడూ నవ్వుతూన్నట్లు ఉండే మనిషి, – అదేమో కామన్న కంటపడగానే రుంజుకుంటూ మొగం అవతలకు తిప్పుకుని వెళ్లిపోయింది.

కామన్న రమారమి ముక్కుపచ్చలు ఆరుతూన్న ఘటమే కనుక, ఇదంతా ఓరకంగా అర్థంచేసుకున్నాడు. తలంటిపోసి కొత్తచాపు కట్టబెట్టి, అదంతా అందుకే, చెప్పక చెప్పడమే అనుకున్నాడు. పోనీ, ఆనాడు ఆ అవాంతరం వచ్చినా, తరువాత, ఇంకో నెల్లాళ్ళపాటు ఉన్నాడు కదా; అంతలో ఆదెమ్మకు విరక్తి, వేదాంతం మళ్ళిందో ఏమో, ఏదీ ఇదమిత్థమని తెలియలేదు.

తరువాత, వీణ్ణర్థానికి తెలిసివచ్చింది; ఆదెమ్మ ఎవ్వరికో అన్నంలో మందుపెట్టిందనీ, పట్టుపడ్డదనీ, ఆ గుప్పుమనడం భరించలేక, ఊరి పెద్దచెరువులో ఓ అర్ధరాత్రివేళ – హారోమ్మన్నదనీ.

కథేమిటో అందరూ చెప్పుకోగా తెలిసింది; జన్మ ప్రారబ్ధంకొద్దీ, తలచెడ్డమనిషి ఎవరైనాసరే, అంటే ఇంకా 'గ్రాయకం' రాకముందే ఆ అవాంతరం జరిగి, చేసుకున్న వాడు ఎలా ఉండేవాడోఅయినా జ్ఞాపకం లేనిమనిషి – వచ్చే జన్మలో అయినా, నిండు పునిస్త్రీతనం కావాలనుకుంటే , కంటికి నదురైన యోగ్యుణ్ణి చూసి, వాడికి పెళ్ళికొడుకల్లే సకలోపచారాలుచేసి, అన్నంలో విషంపెట్టి, ఎదట ఉండి తినిపిస్తే – వాడు ఆపళాన కళ్ళుమూసుకుని, వచ్చే జన్మలో ఈ మనిషికి ధవుడైపోతాడని, ఓ ఆనవాయితీ ఉంది. ఆదెమ్మ అలాగే చేసింది, పట్టుబడిపోయింది.

ఆ తాకిడి కామన్నకు తగలాలిసిందేకద–అలా అవాంతరం రాకపోతే.

భోజనం అయేదాకా ఎదుట ఉండేందుకు వీలులేక పోవడంతో – అవాళ వీడు బ్రతికి బయటపడ్డాడు.

అదెమ్మ అలా అయిపోయిందని విన్నప్పుడు కామన్నకు జాలివేసింది. అసహ్యం వేసింది రోషం పుట్టుకొచ్చింది – వచ్చే జన్మదాకా అంగలార్చడం ఎందుకు, కళ్ళ ఎదుట ఉన్నప్పుడు మొగమాటపెడితే కాదనేవాడా? అసలు ఆ తతంగం అంతా అందుకే అనుకున్నాడు కదా!

అదంతా ఎప్పుడో పదేళ్ళక్రితం జరిగిపోయింది ఆ మాటే అడుగున పడిపోయింది.

నాటికినేడు, మళ్ళీ అంతకుమించిన విడ్డూరం పుట్టుకువచ్చింది!

ఉన్నట్టుండి, ఓనాడు, సూర్యోదయం వేళకు, గుమ్మంలోకి ఎవరో పెద్దమనిషి, పదేళ్ళ ఆడపిల్లను వెంటబెట్టుకువచ్చాడు.

వచ్చినవారి ముక్కూ_మొగం ఎరుగకపోయినా, కామన్న తండ్రి ప్రత్యుత్థానంచేసి, "వచ్చినపనేమో సెలవియ్యండి!" అనే చూపుతో ఎదురుగుండా కూర్చున్నాడు.

ఆ పెద్దమనిషి గొంతు ఓపట్టాన తెముల్చుకుని, విలవిల్లాడుతున్న పిల్లి కూనను చేజార్చినట్టు – "ఇది మా అమ్మాయ్!" అన్నాడు.

అంటూండగానే, కామన్న ఆ చాయలకు వెళ్ళడమేమిటి, ఆ చిన్నది అటు ఒక్క చూపు చూసి, వల్లమాలిన ఆవేశంతో, గంగవెర్రిగా, "అదుగో, నాన్నా! ఆయనే!" అని కేకవేయడం, "ఆయనే!" అని తలవంచుకుని తగనిసిగ్గుగా గొణుక్కుని ఆవంక చూసీచూడనట్టు – చూడటం, పిల్లతండ్రీ పిల్లవాడితండ్రీ ఎవరిధోరణిలో వారు, ఉలిక్కిపడటం, ఇంత గజిబిజీ, రెప్పపాటులో జరిగింది.

కామన్న గ్రుక్కిటమింగి, "ఆ!" అని మౌనంగా అడుగు వెనక్కు వేశాడు. ఇదేదో చాడీ అనుకున్నాడు. ఆ చిన్నది తనమీద ఏదో అభాండంగా తండ్రిని వెంటబెట్టుకుని యాగీకి వచ్చిందనుకున్నాడు తండ్రి ధూకుడుగా వెనకాముందూ ఆలోచించని చేతి దుడుసుతనం తలచుకుని మనసులో వెన్నుకప్పుకున్నాడు.

"రా నాయనా! ఇలా వచ్చి కూర్చో!" అని పిల్లదాని తండ్రి ఆపేక్షగా పలుకరించి, కూచోమని సరసకు చేజాపి సైగచేశాడు. కామన్న వచ్చి నిలువుగుడ్లతో ముళ్ళమీద కూర్చున్నట్టు ఓవాటంగా చదికిలపడ్డాడు.

"ఈ చిన్నది నా కుమార్తె నాయనా!" — కళ్ళల్లో పెట్టుకుని ఎంతో అల్లారుముద్దుగా పెంచుకుంటూన్నట్టు పంచప్రాణాలూ కన్నకూతురిమీదనే. పెట్టుకున్నట్టు, ఆ కూన సుఖపడటమే కుటుంబం యావత్తూకు మనుగడ అయినట్టు, పిల్లదానితల గారాబంగా పుణికాడు.

అంతటితో కామన్న మనస్సు కుదుటపడ్డది. ఇదేదో మామూలుగా వచ్చే సవాలక్ష పెళ్ళి సంబంధాల్లో ఒకటికదా అనుకుని, ఏమాత్రం ధరపెడతాడో అని వచ్చిన ఆయనవంక పరకాయించాడు.

కామన్న అబ్బ, బాసెపట్టు నిదానంగా అమర్చుకుని ఎన్నో మీనమేషాలు గుణించుకుంటూన్న బిగివిలో కళ్లు గట్టిగా మూసుకుని, విధిలేక ఏదో తేల్చుకున్నట్టు నిట్టూర్పు విడిచి, 'ఈ ఏటికి తలపెట్టలేదండి!' అని, తనలోతాను గొణుక్కున్నట్టు అనేశాడు.

పిల్లదానితండ్రి ఎంతో ప్రాధేయపడే ధోరణిలో అంజలించి, 'తమ రిలా అనడం, భావ్యమేనా బావగారూ – మా స్థితిగతులు మనవి చేసుకునేందుకైనా అనుజ్ఞ యిప్పించండి. తరువాత తమకే విశదమౌతుంది' అని కళ్ళనీళ్ళపర్యంతం అయినాడు.

ఇంటియజమాని మాట వినిపించుకోకుండా 'యిప్పుడే వస్తాను!' అంటూ లేచి లోపలికి వెళ్ళాడు. కామన్న కూడా ఇదే సందనుకుని, అక్కడనుంచి లేచిపోదామనుకున్నాడు. ఆ చిన్నది వెక్కి వెక్కి ఏడుస్తూ, వీడిదగ్గరగా జరిగి మొగంలో మొగం పెట్టి పెద్ద ఏడుపుగా "నేనే" అన్నది. కామన్న ఉలిక్కిపడి లేచి నిలుచున్నాడు. చిన్నదీ ఉవ్వెత్తునా ఎగిరి, కామన్న మెడ పెనవేసుకుని, "నేనే–నన్ను గుర్తుపట్టలేదూ? ఆదెమ్మనయ్యా!" అంది; మళ్ళీ బావురుమంది

కామయ్యకు దయ్యంపట్టినంత పనైంది. విలవిలలాడిపోయినాడు పొలికేకలు పెడుతూ విదిలించుకుంటున్నాడు. తండ్రి చిన్నదానిని విడిపించాలని బుజ్జగింపుగా పెనుగులాడుతున్నాడు. చిన్నది రవంతఅయినా లొంగకుండా అలాగే కంఠం బిగించి, శ్రుతి హెచ్చించి, తన పేరు పారాయణ చేస్తూన్నది

ఈ గంద్రగోళానికి ఇల్లు ఇంటిల్లిపాదీ సావడిలోకి వచ్చిపడ్డది ఎవళ్ళకీ ఈ శివాలేమిటో అర్థంకాలేదు. ఇంటికైన మామ్మ, కామన్నను ఒడేసి, చిన్నదాని కౌగిల్లోంచి లాక్కొని, అక్కున అదుముకుంది. పట్టు బెడిసిపోగానే చిన్నది శోషవచ్చినట్టు వాలిపోయింది. చిన్నదాని తండ్రి నవనాడులూ కుంగిపోతూన్నట్టు చదికిలబడ్డాడు.

ఇంటిల్లిపాదీ నోటికివచ్చినట్టు అన్నారు. ఇంటియజమాని కొట్టొచ్చినంత పనిచేశాడు అక్కడికి వాడకట్టు యావత్తూ మూగింది.

అలా మూగినవాళ్ళందరూ చిన్నదాని తండ్రిని కాకిని పొడిచినట్టు పొడిచారు సంగతేమిటో తెలుసుకోకుండానే, కామన్న తండ్రి అడ్డమైనతిట్లు తిడుతూంటే వాళ్ళూ అందుకున్నారు. పాపం, ఆ మానవుడు అన్నింటికీ ఒడిపట్టి మెడపట్టుకు గెంటినా అక్కడే నిలుచుని అసలు విషయము ఏమిటో విన్నవించుకున్నాడు.

"ఈ చిన్నది నా కుమార్తె. లేకలేక పుట్టింది మాకు దైవం ఇచ్చినంతలో ఎంతో అబ్బనాకారంగా పెరిగింది.

ఇప్పటికి మూడురోజులనాడు, ఏదో మాటవరుసగా నేనూ మా అమ్మా దీనికి పెళ్ళి సంబంధాలసంగతి కూడబలుక్కున్నాము. అది, విన్నది

వినీవినడంతోనే అపళాన నా తల్లికి వెయ్యి శివాలు ఎత్తినట్లయింది తానెవరో తన పేరేమిటో చెప్పకువచ్చింది.

క్రిందటి జన్మలోనే తనకు పెనిమిటి ఫలానా చిన్నవాడని నిర్ణయం చేసుకున్నానన్నది. అప్పుడు దైవం తిన్నగా చూడనందువల్లనే, మళ్ళీ ఈ జన్మ ఎత్తానన్నది తానిక మా ఇంట్లో ఒక్క క్షణం ఉండను. తీసుకవెళ్ళి అత్తయింట దిగవిడిచిరమ్మన్నది

ఊరూనాడూ పోగైంది. భూత ఆవేశము అనుకుని, తగిన శాంతి చేయించవలెనని చూశాము కాని, లొంగకపోగా, వచ్చినమంత్రవేత్తను పట్టుకుని నానాదులుపులూ దులిపింది. కొట్టొచ్చినంతపని చేసింది.

కేవలం గ్రహబాధ కాకపోవచ్చును. ఇదొకరకం ఉన్మాదం కాకూడదా అనుకుని, పట్నంలో మిషన్ ఆసుపత్రిలో ఉన్న తెల్లడాక్టరుకు చూపించాను

ఆయన యిలాంటిది సంభవమే నన్నాడు. వెనుకటి జన్మలో తీరనికోరికనే ఏకాగ్రంగా మననం చేసుకుంటూ దేహత్యాగం చేసిన మనిషి, ఆ వ్యక్తతతో మళ్ళీ జన్మ ఎత్తడం అంటూ కద్దన్నాడు. చిన్నదానికోరిక చెల్లించడంకన్న మరో గత్యంతరం లేదన్నాడు. యకాయకీ బయలుదేరి వచ్చేశాము"

పోగైనవారందరూ కాశీమజిలీకథ విన్నట్టు చెవులు దోరకించుకుని విన్నారు. "సృష్టిలో ఎన్నివింతలైనా ఉంటాయ్!" అని కొందరూ, "కాలంకొద్దీ-మనుష్యులబుద్ధి కొద్దీ ఎన్నివింతలైనా పుడతాయ్" అని కొందరూ, లోకాభిరామాయణంగా గొణుక్కుని, యవ్వరికీ యద్విధమైన సలహా ఇచ్చేందుకు పాలుబోక ఎటువచ్చినవారు అటు తప్పుకుపోయినారు.

**కామన్న విన్నపాలు:**

మళ్ళీ యథాప్రకారం మేమే మిగిలాము. ఇప్పటికి అయిన రగడేమో చాలును, ఇంకా వీధి గుమ్మంలో రాద్ధాంతం ఎందుకని, ఆ పిల్లదాన్నీ, తండ్రినీ మావాళ్ళు యింట్లోకి తీసుకువచ్చారు. ఇంటికి వచ్చిన బంధువులకు చేసే మర్యాదలన్నీ చేశారు. "సరే, అలాగే నాయనా! రాసి పెట్టి ఉంటే, తప్పుతుంది గనుకనా, మేమూ ఇక్కడ కొంచెం నిదానంగా కాళ్ళూ చేతులూ కూడదీసుకుని వెనుకనుంచి కబురుచేస్తాం.. ఏదో మరొకరోజు చూచుకుని శుభం అనుకుందురుగాని!" అని యింటికైన మామ్మ, వచ్చిన పెద్దమనిషికి నచ్చచెప్పి, పిల్లతో చలగాటమాడి సాగనంపింది

ఇహ అక్కడనుంచీ యింట్లో రోజు రోజూ గూడుపురానీ సాగుతూంది. మామ్మ, నాన్న, అమ్మ – నాకు కనుచూపుమేరలోనే నిరంతరం ఏవో చెవులు కొరుక్కుంటున్నారు. ఏవేవో భోగట్టాలు చేస్తున్నారు.

పర్యాయతీని తేలిందేమంటే, ఈ సంబంధం మా వాళ్ళందరికీ ఘట్టిగా నచ్చింది. కారణం, పిల్లదాని రూపురేఖలు, ఆ ఆరాటం – కేవలం అవే అనడానికి వీలులేదు. తండ్రికి ఈ చిన్నది ఒక్కతే సంతానం. ఇక కని పెంచే యోగ్యత లేదు. పుష్కలంగా కలిగిన కుటుంబం కాబట్టి, ఉత్తరత్ర ఆ పిల్లదానికే అది యావత్తూ సంక్రమిస్తుంది చేసుకున్నవాడిపంట పండుతుంది–

ఈ కారణం అందరికి సబబుగానే ఉండవచ్చును కాని, నాకుమాత్రం అరికాలుమంటగా ఉంది.

లోకంలో రివాజు ప్రకారం అయితే, ఫలానివారి అబ్బాయికి, ఫలానాయింటి పిల్లను యిస్తామని రాయబారాలు నడవటం, ఉభయుల తరఫున పెద్దలు ఆర్షేయ పౌరుషేయములు ఎంచుకునేసందర్భంలోనే, అలవోకగా, అతి చాకచక్యంగా, యిచ్చిపుచ్చుకోవలసిన మొత్తాలు, ఇందులో ఎప్పుడూ పెళ్ళికొడుకువారి బెట్టు అంటూ ఉండనే ఉంది.

కాని ప్రస్తుత సందర్భంలో మటుకు ఆ ఆడెమ్మ పెళ్ళికొడుకూ, నేను పెళ్ళికూతురూ పద్ధతిగా ఉంది. అందరూ కలసి, నన్నా రాక్షసికి కట్టబెట్టేట్టు ఉన్నారు.

వీళ్ళందరూ డబ్బు ఎరమీద, అసలు అక్రమం మరచిపోయినట్టున్నారు.

అదెమ్మ తనకు వచ్చే జన్మలో పునిస్త్రీతనంకోసం నన్ను ఆహుతిచేయాలని చూసిందికదా? అప్పటికి నేను తప్పించుకున్నాను. ఆ తరువాత యిలాటి అఘాయిత్యమే మరోడిమీద చేయబోయి, అది బెడిసి తానే హరోమ్మంది.

ఇలాంటి మనిషి, నేను తనకు హక్కుభుక్తమైనట్టు ఈ జన్మమెత్తడ మెందుకు? నామీద ఇలాస్వారి చేయడానికి తరలిరావడమెందుకు?

ఈ గొడవేమీ తలపెట్టకుండా, అన్ని సంబంధాలతోబాటూ ఇదీ వచ్చినట్లయితే, పర్యవసానం ఎలా ఉండేదో కాని, ఇంత రగడై, ఇలా బజారున పడిపోయిన తరువాత నేను మొగ్గానో, ఇక నా ఊరూ పేరూ అన్నీ మటుమాయమైపోయి 'ఎవడయ్యా ఇతగాడూ?' అంటే 'అదెమ్మ మొగుడూ!' అనేది ముద్రశుద్ధిగా పడిపోతుంది. కనుక ఏమైనా ఈ సంబంధంమటుకు చేసుకోనని మొరాయించాను.

మా వాళ్ళు నాకన్న మొండివాళ్ళు కొన్ని విషయాల్లో – అయినా, పరమలౌక్యులు కావడం మూలాన ఇప్పట్టున ఢీ అంటే ఢీ అనడం కార్యసాధకం కాదని నన్ను ఒడుపుగా దువ్వడం ప్రారంభించారు.

మామ్మ భూతదయనుగురించి భారతంలోనుంచీ భాగవతంలోనుంచీ పద్యాలు ఏకధారగా ఏకరువుపెట్టి, పిల్లదానికి నేనేతప్ప అన్యథా శరణంనాస్తి గనుక, జాలిదలచి చేసుకోకపోతే బ్రతికేదిలేదుకనుక ఎలా అయినా ఒప్పుకోవడం ఉభయకుటుంబాలకూ శ్రేయస్కరం అంటూ చెప్పీ చెప్పనట్టు తనలోతాను రాపాడుకుంటూ ఉంటుంది

నాన్న అంతకన్న ఉద్దండంగా వ్యయప్రయాసలకు వెనుదీయకుండా, పట్నానికి ప్రయాణమైపోయి, అక్కడ పడిగాపులు పడివుండి నందికేశ్వరనాడిలో నాతాలూకు అన్ని స్థానాల భోగట్టా వెరసికట్టుగా కనుక్కువచ్చాడు.

అందులో – పెళ్ళాం పేరాలో – ఆ ప్రమథనాధుడు గుదిగుచ్చిన పొడుపుకథలన్నీ చిక్కుతీసుకుని తెములుచ్చుకు సరి పెట్టుకుంటూ రాగా, అవన్నీ వెరసి, అదెమ్మ పరిపూర్ణ నామంగా తయారై కూర్చున్నాయ్. మా వాళ్ళందరూ 'రాసి పెట్టి ఉండగా ఇహ తప్పుతుందా?' అని నిబ్బరం చేసుకున్నారు.

నేను యింకొక్కసారి, ఓపికమేరకు మొండికి వేసి చూశాను చింతామణినాటకం పదేపదే చూసినవాణ్ణి కావడంచేత – అందులో చింతామణిచేత చచ్చి స్వర్గాన ఉన్న ఆ పంతులుగారు వేయించిన నోటిలెక్కల పంపిణీలో కొన్ని పేజీలు నాన్నమీద ప్రయోగించాను. ఆయన సజావుగా సమాధానం చెప్పడానికి పూనుకోకుండా, పైపెచ్చు తన్నడానికి సిద్ధమైనాడు. అంతటితో, ఆ అస్త్రం ఉపసంహరించుకుని, – యథాశక్తి జబ్బుపడ్డాను. ఆ రూపేణా తక్షణం తాంబూలాలు పుచ్చుకోవడం వాయిదాపడ్డది.

ఈ లోపుగా మా భవిష్యత్ మామగారి వద్దనుండి ఎప్పు డెప్పుడంటూ ఒకటి రెండు ఉత్తరాలు వచ్చినాయి. నాకు, యిలా ఉన్నట్టుండి ఖాయిలా చేసిందని తెలియడంతోనే, ఆ యింటినుంచి పిన్నా పెద్దా వచ్చి యోగక్షేమం విచారించిపోయినారు. మొత్తానికి మా అమ్మకడుపుచల్లగా వైద్యుడూ, ఇరుగుపొరుగు అమ్మలక్కలూ అంచనావేసినదానికన్నా వేగిరం కోలుకున్నాను.

నాకు పథ్యపానాలు గట్టిగా వంటబట్టిన తరువాత మా నాన్న మంచిరోజు చూసుకుని, అయినవారిని వెంటతీసుకుని, – శుభం అనుకుని రావడానికి తర్లి వెళ్ళాడు

వాళ్ళు అటు బయలుదేరినప్పటినుంచీ, నాకు మళ్ళీ నీరసంగా, పైత్యవికారంగా, గుండెల్లో గబుక్ – గబుక్‌గా ఉంది. ఇన్నాళ్ళూ జ్వరం సందడిలో యీ మాట పట్టించుకోకుండా గడచిపోయింది. ఇహ ముంచుకు వచ్చిపడేట్టుంది! మళ్లీ వంటికి కాకతగిలిన చిహ్నాలు అప్పుడే గోచరిస్తున్నాయ్; ఇంతలో – ఉదయాన్నే దిలబిల్లాడుతూ, తర్లిపోయిన మా బలగం, – అపరాహ్ణం వేళకు, ధుమధుమలాడుతూ అభోజనంగా యిల్లు చేరుకుంది.

నాన్న మండిపడుతూ నూతిదగ్గరకు వెళ్ళి, పెద్ద బిందెకు ఉచ్చుపెట్టి లాగుతూ, బిందె సొట్టలుపడేటట్టు గుంజుతూ – కృష్ణకు వరదవచ్చినట్టు గుక్కతిప్పకోకుండా తిట్టేస్తున్నాడు. తతిమ్మా పెద్దమనుషులూ, మామ్మా, తీరా యింటివసారాలో రేవిణీవేసి, యిల్లెగిరిపోయేట్లు కబుర్లు చెప్పకుంటున్నారు. అసలుసంగతి ఏమన్నా ఆకళింపు అవుతుందేమోనని, కాలుగాలిన పిల్లిలాగా, ఆ పంచనుంచి యీ పంచకు తిరిగి, చివరకు ఏమిటని నాన్ననే అడిగేశాను.

'ఏమిటంటావేంరా, సిగ్గులేక?' అని నామీద ఆయన తాటిప్రమాణం ఎగిరాడు. 'నీ పెళ్ళానికి పెళ్ళి చేశాడు– ఆ ఫుండాఖోర్'–నన్ను తిట్టినట్టు చెప్పాడు ఇహ అక్కడ ఒక్క క్షణం నిలుచుంటే ఎగిరి మీదపడి కుతికపట్టుకుంటాడేమోనని గగ్గోలుగా, అంతలో సంతోషంగా, యింట్లోకి ఉరికాను.

రెండురోజులపాటు ఓపిగ్గా శాపనార్థాలన్నీ, పోగుచేసి కుప్పవేయగా, నూర్చిన గల్లా ఏమిటంటే – ఆడపెళ్ళివారి ఊరు పోవడానికి, మనవాళ్ళు జంక్షన్‌లో బండి మారాలి. వీళ్ళు ఆ స్టేషన్‌లో దిగేసరికల్లా అటునుంచి వచ్చిన బండిలోంచి, ఆడపెళ్ళివారు దిగారు, – ఆదెమ్మకు పెళ్ళి అయింది.. అత్తవారింటికి మనుగుడుపులకు వెళ్ళుతూన్నది!

మావాళ్ళకు, ముఖ్యంగా మా నాన్నకు ఇలా తటస్థపడటంతోనే కళ్ళు బైర్లుకమ్మినవి. నడిప్లాట్‌ఫారంమీద రామ రావణ యుద్ధం జరిగేస్థితికి వచ్చింది. చేతులూ, జుట్లూ పట్టుకొనేంతవరకూ రాకుండా ఎవరిదోవను వాళ్ళను సర్ది పంపించేశారు. మావాళ్ళు, పుల్లాయి వేమవరంవతుగా తిరిగివచ్చారు.

ఈ పెళ్ళి ఈ తీరుగా కావడంలో, పెద్ద తికమకగాని చిదంబర రహస్యంగాని అంటూ ఏంలేదు.

అందరమూ చివరకు ఆదెమ్మతోసహా ఒక్క చిన్న విషయం విస్మరించాము. ఆదెమ్మకు యథాశాస్త్రీయంగా పుస్తెకట్టి, విధవనుకావించి చన్న ధవుడొకడుండేవాడని!

అతడు ఆదెమ్మ మేనత్తకొడుకుగా జన్మఎత్తి అన్నాళ్ళూ ఊరుకుని చివరకు తన నిజస్థితి బయటపెట్టాడు. తానంటూ ఉండగా తన భార్యను మరొకడికి కన్యాదానం చేయడం ఘోరమని మేనమామకు నచ్చచెప్పాడు. నలుగురిచేత చెప్పించాడు. ఆదెమ్మకూడా ఓ ధోరణిలో సంసారే కనుక, పూర్వజన్మ స్మృతుల తాలూకు తాపత్రయాలను అన్నింటినీ ఉపసంహరించుకుని అవ్వాని శిరస్సునే తలంబ్రాలు జారవిడిచింది.

ఇలా చివరకు పరిణమించినందుకు ఆ కుటుంబంలో అటూ ఇటూ అందరూ సంతోషించారు.

మా కెంత గుర్రుగా ఉంటేనేం - మేము అడివి ఉసిరికకాయలలాటి పరాయివాళ్ళమేనాయెను... మాకూ వాళ్ళకూ ఘటన అంటూ లేదేమో!

మా నాన్న అభిప్రాయం - ఆ పిల్లవాడితండ్రి దేవాంతకుడు, అదెమ్మనెత్తి అడచడానికి అయినసంబంధం చేజారిపోకుండా ఉండటానికీ యీ పన్నాగం పన్నాడూ అని.

అయితే కానూవచ్చు! - అయినా, ఇలా జరగడం అన్ని విధాలా మంచిదే. నేనుగనుక ఆ చిన్నదాన్ని కట్టుకోవడం అంటూ - తటస్థించిన పక్షంలో వేసీ వేయకుండా కలిసి వచ్చిందని మావాళ్ళకు సంబరం ఉండేది తప్ప, నాకు యావజ్జీవమూ ఆవిడ పూర్వజన్మ తాలూకు ధవుడు ఒకడో అరో గుండెల్లో మెలుగుతూండేవాడేగద! ఈ ఇంతకూ మా ఇద్దరికీ యీ గండం తప్పింది.

నాది మాత్రం ఇదే దీవన - ఈ జన్మలోనైనా సౌభాగ్యవతి అదెమ్మ అఘాయిత్యాలు తలపెట్టవలసిన అగత్యం అంటూ రాకుండా పదికాలాలపాటు వర్ధిల్లాలని.

* * *



కలా – నిజమా? కవులకల్పనలోనివా – వాస్తవంగా ఈలాటి ఘోరాలు జరుగుతాయా? విధికి అంత ఓర్వలేనితనం ఎందుకో?

*　　　*　　　*

మామూలుకన్నా కొంచెం ఆలస్యంగా నిద్రలేచాడు. బద్ధకంతీరేదాకా పక్కదిగకుండానే రాత్రి మొదలువేసిన నవలను ఆఖరుచేశాడు. అద్దం దగ్గర నిలుచుని క్రాప్ సరిచేసుకుని, తన అందాన్ని చూసి మురుస్తూ...ముసిముసినవ్వుతో చిత్రమూర్తిగా ఉన్నా, నవకాలు చిందిస్తూఉన్న హైమ ఫోటోగ్రాపును చాలాసేపు సాకూతంగా వీక్షించాడు.. "ఎన్నాళ్ళయింది వెళ్ళి – ఎప్పుడు వస్తుందో? ఈ అడుపడుచుల మొరాయింపులకు అంతు ఉంటేనా? పుట్టింట్లో విందులు కుడుస్తూ కూర్చుంటే 'ఇయం గేహే లక్ష్మీ' అని నమ్ముకుని అసపడుతూండేవాళ్ళపని మరి ఇంతేనా? చెపుతూంటాను, కథ వ్రాసిపెట్టమంటే ఏవో సాకులు చెప్పి తప్పించుకునే ఆలసత్వం అంతా ఎక్కడికి పోయింది? ఎగ్జిబిషన్‌కోసం వాళ్ళ అమ్మ ఏవో కుడుతూంటే, తనుకూడా అది పోయేదాకా అక్కడే ఉండాలేం?...నడుము వాల్చకుండా రోజూ పొద్దస్తమానమూ కూచుంటున్నామంటే నా కేమన్నా ఒరికిందా ఇక్కడ?...నా జేబురుమాళ్ళకు పోగులుతీసి అంచులు కుట్టిపెడతానని ఇక్కడికి ఎన్ని వాయిదాలయినాయి? ప్రైజు వస్తుందిట. నేనున్నాను చాలదూ?...వాళ్ళనాన్న చవుకగా ఐదువందలకి దొరికానని కొని ఇచ్చాడుగా! అబ్బ! ఈ పెళ్ళాలన్నవాళ్ళు ఎప్పుడూ ఇంతే..."

మెట్లుదిగి వస్తున్నాడు అంతలో ఆగిపోయి కలకంటున్నానా అని భ్రాంతితో హర్షవిస్ఫారితనయనాలతో చూసినాడు. నిజమే, హైమ – కటకటాలను అనుకుని నిలుచుని ఉన్నది.

మెట్లు లెక్కపెట్టుకుంటూ దిక్కులు చూస్తూ తాపీగా దిగే అలవాటు ఆ నిమిషాన మాయమైపోయింది. ఒక్క చెంగున ఆమెవద్దకు దూకేశాడు వరదరాజు. హైమ, అతని ఆవేగాన్ని గమనించి కొంచెం వైదొలగింది

"నిజమేనా?"

"ఏమిటి?" అని హైమ అమాయికంగా చూస్తూ, ఏమీ తెలియనిదానిలాగాఅడిగింది.

"నిజంగా...నీవు–నీవేనా కనబడుతూంది?"

హైమ నవ్వింది.

"నిద్రలేవగానే ఎవరిమొగము–నా ముఖమే కాదూ చూసుకుంది? మంచిదేనన్న మాట––"

"ఇప్పుడేనా నిద్రలేవడం?"

"కాదు, చాలాసేపయింది...కాని—"

"ఇంతసేపటిదాకా ఏం చేస్తున్నారూ మరి క్రిందికి రాకుండా?"

"కలగంటున్నాను. తమదర్శనభాగ్యం ఇంత త్వరగా ఈలా తలవనితలంపుగా—"

"చాల్లెండి..మరీ నేర్చుకుంటున్నారు..."

"నేర్పడానికి నీవు దగ్గరలేందేనా?"

"అన్ని ఉత్తరాలు వ్రాయకపోతే మీరు రాలేకపోయినారూ? సెలవరోజున వస్తే మనం ఇద్దరం కలిసి వచ్చేసేవాళ్ళం కాదూ?"

"నేను వస్తే...మరి రాణీగారికి తీరా దయవస్తుందో - రాదో, అసలు దర్శనమే కరవౌతుందేమోనని భయపడ్డాను."

"ఈ రలాయింపులకేం లెండి, బయలుదేరడానికి బద్ధకమనరాదూ?"

"పోనీ దయతలచి నీవే రావా అని—"

"అవును, ఈ మొగవాళ్ళమతమే ఇది. ఎవరికోసం వస్తుంది అని దిలాసా. పంపించి, తిరిగి మొగమైనా చూడరమ్మా... ఈ జాతిలక్షణమే ఇది."

వరద, మారుమాట చెప్పకుండా లోపలికి వెళ్ళిపోయినాడు. స్నానాదికములు పూర్తిచేసుకుని వచ్చి హాల్లో కూర్చున్నాడు. హైమ వేషం మార్చేసుకుని సరిగపని చేసిన రాజ్‌పుటానా సిల్కుచీరె కట్టుకుని వచ్చి అతని సరసను నిలుచున్నది.

"మోహినిలాగా ఉన్నావు..."

హైమ చిరునగవుతో అతని ముంగురులు సరిచేస్తూ "నాకు తెలుసులెండి మీ యెత్తు. అమృతదానం- కాఫీ...కోసం ఇన్ని వగలా?"

కాఫీ కప్పుల్లో పోసింది. అతడు చూసి ఊరుకున్నాడు.

"తాగండి."

వరద, పసిపిల్లవాడిలాగా మారాంచేస్తూ బుంగమూతితో "భోజ్యేషు మాతా..." అని హైమవంక చూసి నవ్వాడు. ప్రేమ వెల్లివిరుస్తూఉన్న చూపులతో ఆమె కాఫీ అతనినోటికి అందించింది. అవకాశాన్ని పురస్కరించుకుని అతడు హైమను దగ్గరకు లాక్కున్నాడు.

"ఊఁ ఊఁ- ఉండండి - చూడండి మరి, చీరంతా కాఫీ తొణికింది.. ఇంతే మీరు ఎప్పుడూను..."

"పోనీలే, నాకేగా ఫైను...చెల్లారాంషాపును మళ్ళా ఒకమారు తాము పవిత్రం చేయాలిసిన అవసరం కలిగిందన్నమాట. ధన్యుణ్ణి..."

"ఈ మారే, లేత ఊదాలో కొనండి. ఎంబ్రాయిడరీలో చక్కని సన్నఅంచులవి వస్తున్నాయి..."

"జో హుకుం"

హైమ అతని బుగ్గలు సాగదీస్తూ "అంత నవ్వుగా ఉందేం? చెపుతానుండండి మీ పని నా సంగతి అసలు మీరు—"

"మళ్ళా దేవిగారు పుట్టింటికి ప్రయాణం—"

"ఆఁ! అదేపని!...మీరు కావలిస్తే వెళ్ళండి...అత్తవారియింటికి..."

కాఫీ తాగడం అయింది. వరద కుర్చీలోనుంచి లేచాడు. సిగరెట్టు ముట్టించవలెనని ఆపేక్షపడి, మళ్ళా మానివేసి, నిలుచుని, హైమ భుజములమీద చేతులు వేసి, ఆమె చక్కదనాన్ని చూస్తూ "నీకు కోపం వస్తే తాళుకోలేను బాబూ! నాకు భయం వేసుకొస్తున్నది. నీవు మీవాళ్ళయింటికి ప్రయాణం కట్టావా అంటే—" అని ఆగాడు.

హైమ అతన్ని కౌగలించుకుని సిగ్గుతో – విలాసంగా గాద్గదికంతో — "మిమ్మల్ని...విడిచి ఉండలేను...నేను అడిగినా, మావాళ్ళయింటికి పంపకండి" అని దీనంగా చూసింది.

అతడు "ఆఁ! అంతా నిజమే!" అని ఎకసక్కెము చేసినట్లు నటించాడు.

హైమ చెంపమీద చిన్న జెల్లా యిచ్చి లోపలికి పారిపోయింది. వరద సూట్ వేసుకుని కారులో కాలేజీకి వెళ్ళిపోయినాడు.

వికసించినవి జాజి
విరులు నీ వేణిలో
ప్రకటించినవి వలపు
సుకుమార తనువల్లి...ఇక
నవలెత్తినవి భావ
నా నవ్య మాధురి
నవనవోదయ
నాలసవిలాస
అళికుమారీ గీతి
కా లాలితమ్ములై
అలయించినవి మల్లి
కా మందహాసాలు...

వెన్నెలలేని లోపం తీర్చడానికి 'వెలుగుదీపాలు' తంటాలుపడుతున్నాయి. హైమ, డ్రెసింగ్ టేబిల్ దగ్గర నిలుచుని తలలో పూలదండ సరిజేసుకుంటున్నది. 'మొగవాళ్ళు ఎంతకైనా తగుదురు. ఎంత నిబ్బరం! నాకోసం ఎంత ఉబలాటపడుతున్నా – తపిస్తున్నా — ఎదుట పడేటప్పటికి ఎందుకో అంత అభిమానం, ఆ దర్జా? అనిపించలేకపోయినానుగా ఆయనచేత...నానోటివెంటే చెప్పించారు. కానీ, ఇంటికి రానీ, భోజనం అయిన తరువాత ని–ద్ర–పో–తా–ను. ఊహుఁ...! సినిమాకు వెళ్దామని పట్టుబడతాను. నా కసితీరా —ఏం—నన్ను విడిచి ఉండలేనని అనకూడదేం?'

చీకటిపడింది బాగా. కారుచప్పుడౌతుందేమోనని హైమ చెవి ఒగ్గి ఏ ధ్వని అయినా వింటూంది. "అబ్బ – ఇవాళ కూడా ఆలస్యమేనా? రెండు నెలలకి – ఈ రాత్రి;– ఇంకెంత సేపటికి వస్తారో? ఇవిగో ఈ కొత్తపుస్తకాల దొంతర్లన్నీ మళ్ళా వచ్చిపడ్డాయి. మా అమ్మే! చదవనిస్తాననుకుంటున్నారు కాబోలు! అన్నీ దాచేయాలి. ఎప్పుడూ చదువేనా?...ఈ సిల్కుషర్టులు ఎప్పుడు కుట్టించుకున్నారో? బాగున్నాయి...ఇవాళ ఇదే తొడుక్కోమంటా. మా నాన్న పెట్టిన పంచల మీదికి ఇవి చాలా చక్కగా ఉంటాయి. ఆ!...ఇదుగో, అసలుసంగతే మరచిపోయినానేం?

చాలా ఈ సిగరెట్లన్నీని? కాల్చి పొగ నామీదికి ఊదుతారు బాబోయ్...! అవి ఉన్నంతసేపూ నేనైనా కనబడతానా? సొరుగులో పెట్టి తాళం వేశేస్తా. ఎప్పుడన్నా ముచ్చటగా నే నిచ్చినప్పుడు కాని, ఎప్పుడూ అగ్నిహోత్రాలేనా?"

ఇంకా కొంచెం పొద్దుపోయింది. మామూలువేళకూడా దాటిపోతూంది...

"రావలసిందే ఈపాటికి...ఎక్కడ ఇంతసేపు ఏంచేస్తున్నారో? అదా సంగతి...పెందరాడే వచ్చేస్తే నాకోసం పరిగెత్తుకునివచ్చారని ఉడికిస్తానని – ఎక్కడో తిరుగుతూ ఉండాలి... ఏం? అంత నదురేం? అబ్బ! ఈలాగైతే నే నుండలేను రేపణ్ణుంచీ కారువెళ్ళేటప్పుడు నేనుకూడా బయలుదేరుతా. అక్కడనుంచి అలాగే షికారుకొట్టి ఇంటికి చేరుకోవచ్చును. అంతే, ఇకనుంచి ఆ పనే చేయాలి"

ఫోను మ్రోగింది.

హైమ, వినికూడా విసుపుతో ఊరుకుంది; కాని అవతలవాళ్లు వదిలిపెట్టలేదు...రింగ్ చేస్తూనే ఉన్నారు... "ఎవరో బాబూ! వేళకు సరిగా సిద్ధమైనారు. ఎవరన్నా పిలిచారంటే ఈయన ఇల్లూవాకిలీ వదిలీ, పరుగెత్తుతారు. ఈవేళే – ఈ రాత్రే ఏమంతపని ముంచుకుపోతోందో? నేను పలకను. ఎంతసేపని పిలుస్తారో చూస్తాను."

ఆగిపోయింది.

"..అమ్మయ్య!...గండం గడిచింది...ఎనిమిది దాటుతూంది. ఇంకా రాలేదేమో? ఈపాటికి వస్తూండాలి. రానీ, పనిపట్టిస్తా. మరీ బొత్తిగా భయంలేక చెడిపోతున్నారు. చక్కగా అలంకరించుకుని ఎప్పుడు వస్తారో అని ఎదురుచూస్తూంటే, తమ చిత్తం వచ్చినప్పుడు దయచేస్తారేం?"

మళ్ళా...ఫోను.

అవతలవాళ్ళను మనసులోనే మ్రింగేసే కోపంతో హైమ రిశీవరును అందుకుని పరధ్యానంగా––

"హలో!" అన్నది.

"జనరల్ – హాస్పిటల్"

"ఆ హాఁ"

"డాక్టర్ రామునీమీనన్ మాట్లాడుతున్నది; ప్రొఫెసర్ వరదరాజాకు – ప్రాణాపాయ–"

"ఏమిటి, – ఏమిటి మీ రంటున్నది..ఆఁ"

"కారు ట్రాముతో కొట్టుకున్నది..."

"ఆఁ! ఆఁ! ఎలా ఉన్నారు? చెప్పండి. ఎలా –– ఉన్నా–రు–?"

"స్పృహలేదు. వారి స్నేహితు –– భార్యను రమ్మనండి."

★ ★ ★

# చిత్రశాల

"వాణీ!"

...పలుకదు; ఎన్ని సారులు పిలిచినా, తల ఎత్తి అతని వైపైనా చూడదు; కొంచెంసేపు ఆమెను చూస్తూ, అలాగే నిలుచుని ఖిన్నుడై తిరిగి వెళ్ళిపోతాడు.

చంద్రవాణి తోడివారందరికన్నా చాలా చక్కనిది. ఆ యీడు పిల్లలందరూ ఆమెతో తిరిగే వారందరూ బాగానే ఉంటారు. కాని అంత నోరూరించే రూపము మరెవ్వరికీ లేదు.

కాలేజీ విడిచిపెట్టడం వ్యవధానంగా శివస్వామి వాణి స్కూలు దగ్గర కాపలావేసే వాడు. బద్ధకంగా ఉంటే బడి అయినా మానుకునేవాడు కాని, నాలుగు వేసేటప్పటికల్లా చక్కగా క్రాఫ్‌దువ్వుకుని— సిల్కుషర్టువేసుకుని– సిగరెట్టు కాల్చుకుంటూ–'మీనాక్షి కాలేజీ' దగ్గర ప్రత్యక్షమయేవాడు.

మొదటి రోజుల్లో, వెంట ఎప్పుడూ ఎవరో ఒకరు తీయకుండా ఉంటూండటంచేత వీలులేక, సిగ్గుపడి తనవంక చూడటంలేదేమో ననుకునేవాడు. కొన్నాళ్ళుపోయిన తరువాత–తలచుకుంటేనే మతి అంతా చెడిపోయేది! – మరి ఏ ధన్యాత్ముడైనా, ఆమె యవ్వనాన్ని ధన్యం చేస్తున్నాడేమోనని అనుమానపడి, అనవసరంగా అసూయపడేవాడు. తాను మనసులో భావించుకున్న, ఆ ప్రియుడు, ఆమెను పరీరంభంచేసుకుంటూన్న దృశ్యాన్ని పదేపదే ఊహించుకుంటూ, నిద్రలేకుండా అనేకరాత్రులు గడిపేవాడు.

ఎరుగున్నంతవరకూ, స్నేహితులందరికీ కాలేజీ వదలిపెట్టగానే, ఎవరిపని వారి కుండేది. కాంపౌండు దాటేదాకా కబుర్లు చెప్పుకుంటూ వచ్చి, రోడ్డుమీద కాలుపెట్టగానే ఎవరిదోవను వాళ్ళు చల్లగా సద్దుకునేవాళ్ళు. ఎన్నడూ కూడబలుకకపోయినా, ఎవరిమేటుకు వారికి తెలుసును, మిగతావాళ్ళ పనులేమిటో!

అందరూ అదృష్టవంతులే! శివస్వామికి మాత్రం ఆ భాగ్యం అబ్బలేదు. లేతవయసులో, నవనవలాడుతూ, సామ్రాజ్యాన్నంతా ఏకచ్ఛత్రంగా ఏలడానికి తగిన వాడనీ, – ఏలుతున్నాడనీ, చూసిన వాళ్ళందరూ అనుకుంటుంటే నిజంగా ఒక పదహారేండ్ల చామనచాయ పిల్లకోసం కలువరిస్తూ ఆమెతోడి చెలిమికి తలక్రిందుగా తపస్సు చేస్తున్నాడు.

అతని వయసూ, వలపూ వ్యర్థమయిపోతున్నాయి. ఆమె అతన్ని గమనించడ మన్నాలేదు. చెలులందరితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ – శివస్వామికి మాత్రం పెడమోమై – నిత్యమూ అతని ఎదుటనుంచే షికారుపోయేది. స్వామి ఆమెను వెంబడించిపోయి, తిరిగి వెళ్ళేవరకూ ఆ ప్రాంతాల్లోనే ఉండి, మామూలు వేళకే, మామూలుకన్నా ఎక్కువ విచారంతోనే యింటికి వెళ్ళిపోయేవాడు.

తానై పలుకరిస్తుందేమోనని ఎంతో ఆశతో ఉన్నాడు. పోనీ, అంతకు నోచుకోక పోయినా, ఓమారు సవిలాసంగా తనవంక చూసినా చాలు, ధన్యుణ్ణవుతాననే స్థితిలోకి వచ్చాడు. కాని, వాణికి జాలన్నా లేదు.

గాంధర్వవిధిని తన్ను వరించడానికి వాణికి ఏమైనా అభ్యంతరం ఉందేమోనని చాలా రోజులదాకా సంశయించాడు స్వామి. మంచివంశంలో పుట్టి, అదుపు ఆజ్ఞలలో పెరిగిన పిల్లగనుక, స్వతంత్రించడానికి భయపడి, 'పెద్దలున్నారు, వారెఱిగి పెండ్లి సేయగలరు. వేగిరపాటెంతవల'దటంచు సందేశమేమైనా పంపిస్తుందేమోనని కనిపెట్టుకుని కూర్చున్నాడు. మళ్ళా, అదీ కాదేమో!

ఆమె ఉపేక్షచేసినకొద్దీ స్వామికి మరీ ఆవేశం హెచ్చిపోతూంది. ఏలాగైనాసరే, వాణిని తనదాన్నిగా చేసుకోవాలిసిందే!

ఎన్నాళ్ళు ఓపికపట్టి చూసినా, ఎంత ఉవ్విళ్ళూరినా, ఏమీ ప్రయోజనం కనబడటంలేదు. సాహసం చేయాలి. మరోవిధాన వాణి వశమయేటట్టులేదు. ఆమెను చూసినకొద్దీ స్వామికి రకరకాల ఆలోచనలు తోచేవి – షికారు పోతూంటే, దారి కడ్డుతగిలి, అనుగ్రహిస్తేకాని వీలులేదని – అందరి ఎదుటా – బ్రతిమాలాలనో, – ఏ సినీమాకో, నాటకానికో వచ్చినప్పుడు అమాంతం కారులో వేసుకుని చక్కాపోవాలనో – ఈ మాదిరిగానే కాని, ఎందుచేతనో ఏవీ క్రియారూపాన పరిణమించలేదు.

ఎన్నటికీ వాణి కనికరించదేమో, – జన్మంతా ఆమె లేకుండానే గడుప వలసివస్తుందేమో, అని తలచిన మాత్రాన్న తగని దిగులుగా ఉండేది స్వామికి.

చివరకు, ఓనాడు. ఏమైనాసరే, ఎలాగైనా ఆమెను పలకరించి, ఆమెతో మాట్లాడితీరాలని నిశ్చయించుకుని బయలుదేరాడు. దోవలో, తనకు సాయమై ఆమెను ఒనగూర్చమని వసంత మాధవులను మనసులో వేడుకున్నాడు...వాణికన్న క్షణం ముందుగనే, తడబడే పాదాలతో, 'న్యూ షాలిమర్' ఉద్యానం ప్రవేశించి, ఆమె రోజూ కూర్చునే చలువరాతిమంటపానికి సమీపాన్నే, ఆమె ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ ఉన్నాడు.

హంసలుకూడా చూసి నేర్చుకోదగిన వయ్యారి నడకలతో వాణి ప్రవేశించింది. వాయల్ లేత ఊదా సిల్కు చీర కట్టుకుని, ముదురురంగులో, చమ్కీ పనిచేసిన శాటిన్ బాడీస్ తొడుక్కున్నది. ఒంటిన ఏవో రెండుమూడు నగలున్నా, ఆ అందంలో కలిసిపోయి కనిపించడంలేదు. అడుగడుగుకీ చక్కదనం ఒలికిస్తూ వచ్చి అక్కడనే కూర్చుంది.

ఆమె సౌందర్యాన్నంతా అనిమేషనయనాలతో చూరగొంటూ 'అలరెడు ఱెప్పలల్లార్చినయందాక ననిమిష కన్యకాదనగ తరమె?' అని అనుకున్నాడు స్వామి.

సమీపించాడు. ఏలాగో ధైర్యము తెచ్చుకుని, 'వాణీ!' అని పిలిచాడు. ఆ ఉద్రేకంలో, ఆలోచించనన్నాలేదు. ఆమె పరాభవిస్తుందేమోనని అయినా వెనుదీయలేదు. ఒకసారి — కోపంగానైనాసరే – ఆమె మాటాడితే, రతనాలవంటి ఆ పలువరుస కనబడనిస్తే, అంతేచాలు అతనికి.

ఆ ప్రాంతాల్లో వాళ్ళిద్దరూ తప్ప ఎవ్వరూ లేదు. ఉన్నా అప్పటిస్థితిలో లక్ష్యం చేసేవాడేకాదు స్వామి. వాణి మారుపలికితే, కౌగిటిలో అదుముకుని, జన్మసార్థకంచేసుకోవలెనని ఆమె అంగీకారంకోసం తహతహపడుతున్నాడు.

భాషను రసానికి తగినట్టుగా నడిపిస్తూ, తన కథనంతా వినిపించాడు వాణికి. చివరకు ప్రేమలేకపోయినా, తన అవస్థ చూసిఅయినా కనికరించమన్నాడు.

స్వామి ఆమెదగ్గర భక్తుడిలాగా చాలాసేపు దోసిలొగ్గి నిలుచున్నాడు. వాణి, అంతా విని, వినిపించుకోకుండా లేచిపోయింది.

నిత్యమూ ఆమె స్వామి కన్నులకఅవుదీరా కనబడేది; దగ్గర జేరనిచ్చేది. మనసులో కోరికలన్నీ తెలియజెప్పనిచ్చేది కాని, మారుపలుకదు; ఎన్నిసార్లు పిలిచినా తల ఎత్తి అతని వైపేనా చూడదు.

## 2

"ఉహుఁ...అలాకాదు...సరిగా నిలుచోలేవూ...ఇంకా కొంచెం తల పైకి ఎత్తాలి... ఎవరిమీద ఆ కోపం?...ఏమి టా పోజు, ఎందుకు వచ్చిందిరా దేవుడా, ఎప్పుడు తప్పించుకుని బయటపడుదామా అని ప్రాణాలు బిగపట్టుకుని నిలుచున్నమాదిరిగా ఉంటావేం? ముఖంలో కాస్త ప్రసన్నభావం కనపడనీయి."

...నవ్వింది.

"ఎన్నిమాట్లు చెప్పను. ఎందుకూ అలా ఎవరినో వెక్కిరిస్తున్నట్లుగా నవ్వు తావు...పోనీలే, కాని...అబ్బ! అదుగో మళ్ళా అంతా చెడగొట్టావు. నీవు నవ్వావద్దు, కోపగించనూవద్దు, సాఫీగా, ఈ ధోరణంతా మరచిపోయి, ఏదో ఆలోచిస్తున్న దానిలాగా ఉండూ...ఊఁ...నావైపు చూస్తావేం?"

......మళ్ళా నవ్వింది.

"మళ్ళా మొదలా? అప్పుడే ఆ గులాబీలన్నీ తుంచేశావూ? అదేమిటి, లోలాకు మెలితిరిగింది? పైటమీది అంచంతా మణిగిపోయి...మహా అందంగా ఉన్నావులే! చెప్పినట్లుగా వింటావా లేదా? లేకపోతే, నీ సావాసము ఉండను...తెలిసిందా...ఏం?"

......మాట్లాడదు.

"నన్ను విసిగించడమే నీకు ముఖ్యమా? — చక్కనిదాన్నని ఎందుకూ నీ కింత గర్వం?...అమ్మ! ఇప్పటికి ఏలాగైతేనేం, మనసు కుదిరిందీ...ఇంకా కొంచెం ముందుకు రా...మరీ అంత వెలుతురులోకి వద్దు. సూర్యకాంతి ముఖంమీదమాత్రం పడేటట్లు...అదుగో, అలాగే ఉండు."

శ్రీమాన్ చాలా వృద్ధిలోకివస్తూన్న చిత్రకారుడు. ఖండాంతరాల్లో ప్రముఖు లందరూ ఆతని చిత్రాల్ని చాలా ప్రశంసించారు. ఒకటి రెండు అంతర్జాతీయ చిత్రకళా ప్రదర్శనాల్లో ఆతనికే ఉత్తమ సత్కారం జరిగింది. చక్కగా చదువుకున్నవాడు — చాలా అందగాడు.

శివస్వామికీ ఆతనికీ ఎంతో స్నేహం. చిన్నతనంనుంచీ, చాలాకాలందాకా కలిసి

చదువుకున్నారు. తరువాతకూడా కలిసి తిరుగుతూండేవారు ఇద్దరూను. శ్రీమాన్‌కు స్వామి అంటే చాలా అభిమానమూ, గౌరవమూను

*                *                *                *

నీళ్ళల్లో తిరుగుతూన్న హంసపిల్లలతో ఆడుకుంటూ, వాణి ఫౌంటెన్ ఒడ్డున నిలుచున్నది. ఆ మనోహరమూర్తిని రత్నావళికి లక్ష్యంగా చేసుకొని చిత్రించడానికి యత్నిస్తున్నాడు – సమీపంలో శ్రీమాన్.

కొంచెందూరంలో, ఓ జూకామల్లెబవర్ చాటుగా, వీరిరువురినీ, రెప్పవేయకుండా కనిపెడుతూ నిలుచున్నాడు స్వామి.

అప్పటికి వారంరోజులనుంచీ ఆ కథ జరుగుతున్నది.

శివస్వామి చాలా మారిపోయినాడు. కాని, అదేమో వాణిలోకూడా ఏదో మార్పు కనబడుతూనే ఉంది. ఒక్కొక్కప్పుడు ఆమె ఆకర్ణాంతవిశాలలోచనాలు అతన్ని సవిలాసంగా సత్కరించేవి. మరొకప్పుడు దైన్యానికి తావులయేవి ఈ విభ్రమాలన్నిటికీ లొంగి అతడు వివశుడయిపోతూండేవాడు.

శ్రీమాన్‌కు తానే వాణిని ఒకటి రెండుసార్లు చూపించాడు. అప్పటి మాటలలోనైనా, తాను వలచినపిల్ల అనే ఉత్సాహమేతప్ప వేరే లక్ష్య మామెయందు ఉన్నట్లు తోచలేదు స్వామికి. శ్రీమాన్ ఎన్నడూ తానై వాణినిగూర్చి ప్రశంసించ లేదు స్వామితో.

వాళ్ళిద్దరికీ ఏలా అంతస్నేహం? అతనిదగ్గర వాణి చాలా చనువుగా ఉంటూందే? అతన్ని వరిం.. ఉహూ‌ః...కాదు. వాణి అంత అన్యాయం చేస్తుందా... ఏమో? ఇంతకూ శ్రీమాన్ ధన్యుడు.

"స్వామీ!"

అతనికి ఏమీ గోచరించడంలేదు. తానొకటి తలచితే దైవ...కాదు...వాణి మరొకటి తలస్తూంది. ఆమె ఆలోచించి చేసినపనే ఇది. లేకపోతే ఆ... ..

కోమలం – వాణీ అంత చక్కంది కాకపోయినా, ఆమెకు ఎంతో తీసిపోయింది కాదు. వాణిని చూచినకళ్ళతో అయితే ఏమోకాని, ఎంత రసికుడికైనా ఆమెమీంచి మనసు మరల్చుకోడానికి చేతనవుతుందా?

వాణి శ్రీమాన్‌తో మాటలాడుతూందనే, స్వామి ఎంతో వేదనపడుతున్నాడు. అది చాలనట్లు, కోమలం అతన్ని మరీ కష్టపెడుతూంది.

నిత్యమూ అతనున్న తావు వెదుక్కుంటూ వచ్చేది కోమలం. ఇక నిలువనిచ్చేదికాదు. "తనంత తా వలచి వచ్చిన" కాంతను ఛులకనచేయడం మంచిది కాదనేపంథాలో మాట్లాడేది ఎంతసేపైనా. కాని స్వామికి ఆమె చెంతనున్నదనే స్పృహ అయినా ఉండేదికాదు. ఆమెను పలుకరించికాని, ఆమెతో మాట్లాడికాని ఎరుగడు తానున్నంతసేపు, ఆమెకూడా విడువకుండా అక్కడనే ఉండి వెళ్ళిపోయేది;– మరునాడు మళ్ళా మామూలుగానే ఇరువురూ తారసిల్లేవారు.

వాణి, శ్రీమాన్ చాలా త్వరగా వెళ్ళిపోయేవారు. స్వామి ఎంతోసేపటికి తెలివి తెచ్చుకుని ఉస్సురనుకుంటూ కాలు సాగించేవాడు. నిత్యమూ అంతే.

బయలుదేరేటప్పుడు చాలా ఉత్సాహంగా ఉండేవాడు. అనాడైనా వాణి ఒంటరిగా వస్తుందేమో – శ్రీమాన్‌తో ఎందుచేతనన్నా పోట్లాడి మాటలాడటం మానేసిందేమో – నిజంగా శ్రీమాన్ మీద, తా ననుకున్నట్లుగా ఆమెకు మనసులేదేమో... ఏమో, ఈలాగే చాలా అనుకునేవాడు.

కాని, మామూలుమాదిరిగానే, వాళ్ళిద్దరూ కనబడేవారు. మరికొంత సేపటికి కోమలం ప్రత్యక్షమయేది.

## 3

"చివురాకు చెలిచేత
పిలువ నంపింది
సరికన్నె ప్రాయాన
విరజాజిమొగ్గ
ఏవేళకయినాను ఎదురుచూసేవా
పోవాలి ననుబాసి తీవ జవరాల.
తేటవెన్నెలమీద
తేలి వచ్చింది
చాటుగా మాటుగా
చామంతిరెమ్మ...
నీహారగిరి హిమా
నీ చర్చతోను
జోహారులన్నదీ
జాకా చమేలి...
శరదంబువాహాల
జతచేసుకుంది
మరచిపోయేనని
మందారమాల
కోయిలల కందని వి
హాయస పథాల
సాయమౌతానంది
సంపంగిరెమ్మ...ఏవేళ...

* * * *

"నన్నిక్కడ నిలువనీయవా?"
"నేను పలుకరిస్తే మారుపలుకవా?"
"కోమలం!"
"స్వామీ!"
"నేను నిన్ను ప్రేమించలేను"
"నేను...మరి...నిన్ను ప్రేమించకుండా ఉండలేను"
"ఎంత చక్కగా పాడింది...ఎవరో ఆ...అమ్మాయి"

"ఎంత చక్కగా ఉంది...వాణికాక మరెవరో ఆ...అమ్మాయి!"
"ఎవరు?"
"కనపడటం లేదు...వాణీ...శ్రీ..."
"నాతో మాటాడవద్దు"
"నీవు నేను మాట్లాడితే వినవద్దు"
"అసాధ్యురాలవు!"
"నీకు ఎలా తెలుసు?"

*　　*　　*　　*

సంజెలో లేమావి
కొంజివురుచాయలో
మంజుల ముఖాబ్జ సష
మా విలాసాలలో...
　　నీ చాయలే దోచునే...
చేతిలో జాజి తొలి
పూతలో కోయిలల
కూతలో గొజ్జంగి
లేత తళ్తళలలో...
　　నీ వలపులే నిలుచునే...
వగరులో షట్పదుల
పొగరులో కరవీర-
తొగరులో తొగకన్నె
నిగనిగన్నిగలలో...
　　నీ హొయల్ తలసూపునే...

*　　*　　*　　*

"కలువలన్నీ ఎందుకూ ఆ చంద్రుణ్ణి చూసి అలా నవ్వుతూంటాయి?"
"చక్కనివాడని."
"ఊహూఁ"
"చక్కలిగింత పెడుతాడని."
"బలే బాగుంది. వీలాగూ గిలిగింతలతో నవ్విస్తాడని, తామే ముందు నవ్వేస్తున్నాయా?...అయినా చెప్పకోచూద్దాం మరి?"
"...................."
"ఎందుకో చెప్పనా, 'పాపం...ముద్దొస్తూంటాను కదా నన్నుచూసి ఈ కన్నెలందరూ, విరగబడిపోతారు, అనే దిలాసాతో, ముసిముసినగవులతో ఉదయిస్తున్నాడు కాని, అదేమిటి? ఆ మొగాన...మచ్చ...మచ్చ...ఆ సంగతి మరచిపోయినాడా?- అని నవ్వుకుంటున్నాయి."
"కలకలలాడుతుంటాడు...రాజుకే వంకబెడుతున్నావూ?"

"కిలకిలా నవ్వుతూంటవి, కలువలన్నీ అందుకనే?"

"పోనిద్దూ. అద్దంలో చూసుకునిరావడం మరచిపోయి ఉంటాడు."

"అతనా మరచిపోయేది. మరి...అలాగయితే కనపడ్డ సరస్సులో అల్లా ఎందుకు ప్రతిబింబిస్తూంటాడు. రాత్రంతా అక్కడనుంచి కదలడేం?"

"అందంసంగతి తెలియక."

"ఊ...అర్థం తెలియకకాదేం"

"చంద్రుడికా కళంకదోషం!" అన్నది గీర్వాణి.

"అందుకనే...శ్రీమాన్ కుడిచెంపకా అంత బ్లాపాచ్" అన్నది...చం...ద్ర...వా...ణి...

## 4

—మహారాజు దుష్యంతుడు కణ్వపుత్రిని గాంధర్వ విధిని పరిగ్రహించాలనీ, లేకపోతే నిలువలేనని అనుకున్నాడు. నిశ్చయించుకున్నాడు – తరువాత ఓ నిమిషానికి, కలకంరవధూ కలకంర మాధురితో 'కింశీతలైః' అన్నదాని తెలుగు ఎత్తుకుని ఆ అమ్మాయిచేతకూడా అంతకన్న పక్కా గడుసుగా వీదో మారుపలికించాడు...చివరకు వీలాగో ఒప్పించాడు.

మళ్ళా ఎన్నాళ్ళు జరిగాయో...శకుంతలను కడుపులో ఉన్న కొడుకుతో కూడా మాలినీతీరాన్నుంచి పంపించివేసేటప్పుడు, ముసలి మహర్షి పడుచుగొంతులో గాద్గదికం స్పష్టముగా వినిపించింది...

.....ఎత్తినప్పటినుంచీ, ఎప్పుడు పడుదామా అని కాచుకొనియున్న యవనిక, దాని పుణ్యాన చివరకు గౌరవంగా సోలింది.

* * * *

"జయము జయము మహారాజునకు" అన్నది కులుకుతూ రమణ.

"సంతోషించాంలే, తెలివికి" అని సవిలాసంగా మారుబలికింది, ఓ చిన్న చపేటంతో సత్కరించి... కుచ్చుతలపాగ తీసివేస్తూ కోమలం.

"చాలా బాగుంది కోమలం! వేషం చాలా చక్కగా వేసుకున్నావు. కాని అదేమిటి? మా అన్నయ్యమీసం పెట్టావేం? మహారాజాయెను. ఇంకా పేద్ద మీసాలుండొద్దూ?"

"నీకేం తెలుసు. ఈ మీసాలకే భయపడి, వరించకుండా శకుంతల తప్పించుకుని పారిపోతుందనుకున్నాడు ఈ దుష్యంతుడు."

"భయపడకేం శకుంతల! ఆశ్రమంలో నిలివెడేసి గడ్డాల ఋషులనందర్నీ చూస్తూ...అమెకు కొత్తా?"

"కొత్తదికాదూ చిన్నమీసం, నున్ననిగడ్డం"

"అలాగేం"

"కాకపోతే మీ అన్నయ్యమీసమేం...ఇది...పోనీ మీ అన్నయ్యనే అనుకో. అదుగో, మీ వదినె వస్తూంది చూడు. అంతా అయిపోయినా, ఆ వయ్యారం, ఆ నడక మానలేదింకా చూడు."

"ఏం, రమణా! ఇందాకనుంచీ కనబడలేదేం" అని అడిగింది చమ్కీపనిచేసిన "స్తనవల్కలం" సడలించుకుంటూ, సగము తీసివేసిన శకుంతలవేషంతో ప్రవేశించి వాణీ.

"అవును, ఏలా కనబడుతాను. నీకు దుష్యంతుడిమీదనేగా దృష్టంతా."

"అతను మీ అన్నే అయినప్పుడు నీ కింత ఉలుకెందుకూ?" అని అందుకున్నది కోమలం.

వాణి కోమలంవంక బెదురుతూ చూసింది కోమలం కనుసైగతో ఆమెకు తెలియజెప్పింది.

"చాలా చక్కగా చేశావు వాణీ! అందరూ ఎంతో మెచ్చుకున్నారు" అని అభినందించింది రమణ.

"అందరూ...ఎవరు?"

"ఎవరా?...వచ్చినవాళ్ళందరూ...ఎరుగున్నవాళ్లు ఎరుగనివాళ్లూకూడా...మా నాన్న గారు నిజంగా సంభ్రమం పట్టలేకపోయినారు. ఇక నేనా .నా సంగతి సరేకదా...బ్రహ్మదేవుడు.. అ ముసలాడు మతిబోయి నన్ను ఆడదాన్నిగా చేశాడని అంతసేపూ తిడుతూనే ఉన్నా; నేనే మొగవాణ్ణయితేనా?"

"ఊఁ"

"అమాంతం స్టేజిలోకి దూకి నిన్ను ఎత్తుకుని పారిపోయి ఉందును."

"నిజంగా అంత బాగుందా? అయితే బాగున్నది నేనా, నా వేసమా?"

"రెండూను...కాని ఏం లాభం?"

"చాల్లే రమణా! ఎవరన్నా చూస్తే నీవు నన్ను మోహించావనుకుంటారు"

"నిన్నా...నిన్ను మోహించని దెవ్వడు వాణీ."

* * * *

"అన్నయ్యా! నీ కళ్లేవీ?" అన్నది రమణ.

"ఏం" అన్నాడు స్వామి మసులుతూ ఆమెవైపైనా తిరుగకుండా.

"మరి నా కళ్ళు చూశావా?"

"ఏం, నీ కళ్ళకేం, బాగానే ఉన్నాయి" అని చాలా అమాయికంగా, తెలివి తక్కువగా బదులుపలికాడు స్వామి.

"అదికాదోయ్ తాతయ్యా! నా కళ్ళు చేసుకున్న పుణ్యం నీ కళ్ళు చేసుకోలేదుకదా, అని అన్నాను. అదీ తేడా."

"ఏమి టా విశేషం?"

"వాణి...ఎరుగున్నావుకదూ వాణిని...శకుంతల వేషం వేసింది...ఇవాళ మా కాలేజీ అనివర్సరీ తెలుసును కాదూ. ఎంత బాగుందనుకున్నావు.. ఎందుకూ చూడని జన్మ!"

స్వామి మనసులో కోరికలన్నీ ఓమారి దూకుడుగా ముందుకు దూకినాయి. కాని ఆ సంచలనం అవంతైనా బయటపడనీయకుండ సంయమనం చేసుకొని, శాంతం, ప్రసన్నభావం అభినయిస్తూ,

"అలాగేం. నాకు తెలిసిందికాదే. లేకపోతే నేనుకూడా వచ్చేవాడినే!" అన్నాడు

"నీలాటివాళ్ళను రానియ్యరుకాదూ."

"ఎందుచేతనో?"

"ఆఁ. ఏముంది? తలా మీసం నెరవలేదు కనుక."

స్వామి కొంచెం ఆగి ఏమో ఆలోచించాడు.

"దుష్యంతు డెవరు?"

"కోమలం. నీ వెరుగవనుకుంటాను. నీ అంత పొడుగ్గా చాలా అందంగానే ఉంటుంది ఆ అమ్మాయి కూడా..."

—కోమలాన్ని తా నెరుగడుకాదూ! వాణి నంతకన్నా ఎరుగడు! రమణ ఎంత అమాయకురాలు! తోడివారందరికీ ఎంతకాలంనుంచో తెలిసి ఉన్న ఆ విషయం కూడా అమెకు తెలియదే!

"నే నన్నానుకూడాను నవ్వుతూ, కోమలతో, ఆ మీసం సరిగ్గా నీ మీసంలా ఉన్నదని. నిజంగా చూసి అలా చేసినట్టున్నది" అని మళ్ళా అందుకుంది రమణ.

"వాణి ఏమన్నది?"

"ఏమనడమేమిటి?"

"నా మాట వచ్చింది కాదూ—" పొరబాటున తప్పి జారి అనేశాడు. తరువాత నాలుక ఎంత కరుచుకున్నా ఏమి లాభం? కాని రమణకు అదికూడా అర్థమయినట్లు లేదు.

"నీ మాట వచ్చినా ఏముంటుంది? నిన్ను ఎరుగదు కాదూ!" తరువాత స్వామి ఏమీ మాటాడలేదు. అతడు వింటున్నాడో, లేదో అయినా గమనించకుండా రమణ, గబగబ కొంచెంసేపు అమాటా ఈమాటా చెప్పి లోపలికి వెళ్ళిపోయింది.

* * * *

"ప్రొద్దుపోతుంది, ఇప్పుడెక్కడికి స్వామీ?"

లోపలనుంచి ఎవరో ప్రశ్నించారు. అతడు మారుపలుకలేదు. పెడల్ మీద ఓ కాలు వేశాడు.

"భోజనం చేయవా మరి? — చేసి పోరాదూ?"

వెనుకనుంచి సగంసగం వినపడ్డాయి ఆ మాటలు గాలిలోంచి స్వామికి అప్పుడే రోడ్డుమీదికి వచ్చేస్తున్నాడు.

ఉండుండి, రెండు మూడుసార్లు పెద్ద జ్యోతులు అతని ముందర నాట్యమాడి మాయమయినాయి. రోల్ ఫిల్ములాగా రోడ్డు చుట్టుకుపోతూంది. చివరకు అయిపోయింది.

బయలుదేరినప్పటినుంచీ, ఆ స్పృహలేకుండానే, స్వామి తిన్నగా కాలేజీ హాస్టలు బయట ఆవరణవద్దకు వచ్చి ఆగిపోయినాడు. అప్పుడు తెలిసింది, అతనికి తా నెక్కడ ఉన్నదీని.

## 5

ఆలకిస్తున్నాడు. ఆలకించినకొద్దీ మైమరచి ఆనందమయుడైపోతున్నాడు. ఎన్నిమార్లు విన్నా తనివితీరటం లేదు. కర్తవ్యాన్ని నిర్ణయించుకోలేకనూకాదు, కాలు సాగకనూకాదు.

ఎందుకో ఏమోకాని, అచోటనే ఆగిపోయి, అలాగే నిలువబడిపోయినాడు స్వామి. పాడుతూన్న ఆ మోహనాంగి పాట చాలించలేదు. మళ్ళామళ్ళా ఆ ఫణతే ఎత్తుకుని,

ఆడూకుంటానోయ్, పాట
పాడూకుంటానోయ్,
ఆడీ, పాడీ, అలసీఐనా,
ఈడేనంటానోయ్, నీకూ...
జోడేనంటానోయ్...ఏమోయ్
ఆడూకుంటానోయ్.

ఈమారు ఇక ఆలోచించలేదు. ప్రాకారలంఘనంచేసి లోపల ప్రవేశించాడు. ముందు మందారచెట్లు ఒత్తుగా పెరిగి, అడ్డమున్నాయి. వాటికవతలనుంచే మళ్లా...

వావీ చూశానోయ్, మోవీ
కావీ చూశానోయ్,
కావీ కన్న సొంపు నీ మై
తావే నంటానోయ్....ఏమోయ్
......ఆడూకుంటానోయ్

ఈ చరణం వినిపించింది.

చప్పుడు చేయకుండా, చెట్లమాటునుంచి తొంగి చూశాడు. చాలా సమీపంలోనే వాణీ, కోమలం, మరెవరో ఇంకో అమ్మాయి ఉన్నారు. ఆ యిద్దరూ కూర్చుని ఉన్నారు. వాణి వారి చేరువనే జాజిపొదమీదికి ఓ చెయిజాపి నిలుచుని పాడుతూంది.

దగ్గరకు వెళ్ళాడు. కౌగలించుకుని గబగబ ముద్దిడుకున్నాడు స్వామి ఆమెను. సమయముజూచి, 'అనసూయా ప్రియంవదలు' నిష్క్రమించారు.

వాణి నవ్వుతూ అలాగే నిలువబడి ఉన్నది.

... ... ... ...

'అమ్మ! ఇప్పటికి నా కసితీరింది' అన్నాడు స్వామి.

వాణి సాభిప్రాయంగా స్వామివంక చూసి, సిగ్గుపడి, చిరునవ్వుతో తలవాల్చింది.

"ఇకనైనా నీ మౌనవ్రతం చాలిస్తావా?"

వాణి 'అవు'నని తలఊపింది.

"ఇంతకాలంనుంచీ నీ నోటిమాట వినడానికే నోచలేదు నేను. పలికితే నోటిముత్యాలు రాలిపోతవా?"

"... ... ..."

"నీతోడి వాళ్ళందరితోనూ అంత చనువుగా, కులాసాగా తిరుగుతూండేదానిని నామీద నీకు ఎందుకూ అంత నిర్దయ? ఎంత పలుకరించినా ఎన్నడైనా మారు పలికావా?"

"... ... ..."

"నిజమే, నాదే అపరాధం కావచ్చును. నీవు మెచ్చుకొనేటట్టుగా, నీ సరసత్వానికి, చక్కదనానికి సరిపోయేటట్లుగా నేను, పిలువలేకపోయినానేమో! నామీద, నా స్థితి మీద జాలన్నా లేకపోయిందా నీకు?"

వాణి నవ్వుతూంది ఆ నవ్వును అర్థం చేసుకోలేక స్వామి మళ్ళా ఏదో వేదనపడుతున్నాడు. ఆమె నవ్వుతూనే – అతని మాటలన్నీ వింటూనే, ఏదోవైపు తెప్పవేయకుండా చూస్తూంది. క్రమంగా స్వామికూడా, ఆ సంగతి ఏలాగో గ్రహించి, తానుకూడా ఆమెచూస్తూన్నవైపే, ఏమిటో తెలియకుండానే చూస్తున్నాడు.

చాలాసమీపంలో గులాబీపొద ఉన్నది. దానినిండా విచ్చినవి, అరవిచ్చినవి, చాలా ఉన్నవి పూలు. ఒక గుండు తుమ్మెద ఎక్కడనుంచో వచ్చింది ఆవేళ, తిన్నగా, ఓ చక్కని గులాబీదగ్గరకు వెళ్ళి కావలసినంత మధువు గ్రోలి, తన స్తోత్రను సంగీతం పాడుకుంటూ చక్కగా వెళ్ళిపోతూంది. అదీ దృశ్యము.

"సృష్టిలో చిత్రాలు చాలా ఉంటాయి" అన్నాడు స్వామి చివరకు, చాలా తెలివితక్కువగా.

"అవును, చూసి నేర్చుకోవలసినవి కూడా చాలా ఉంటాయి" అన్నది వాణి అతనివంక చూడకుండానే.

స్వామి మనోవీధిని పేద్ద మెరుపుమెరసి, వెనుకటి సంశయాంధకారాన్నంతా పటాపంచలుచేసింది. కలలో కష్టాలు అనుభవించి, మహారాజయోగంలో మేలుకునే వాడిలాగా, స్వామి అంతకాలానికి, అప్పటికి మేలుకున్నాడు.

"నిజమేకాదూ!" అన్నాడు ఆమెకళ్ళల్లోకి చూస్తూ కౌగిలివీడకుండానే.

వాణి స్వామికీ మరీదగ్గరగా జరిగి, అతనికౌగిలిలో అణగిపోతూంది.

"అవును. గులాబీకి ఏమి స్వాతంత్ర్యమున్నది?" అన్నది చెంపలమీదిగంట్లు తడవిచూసుకుంటూ.

"మధుపకుమారుడిదేనా, ఇన్నాళ్ళనుంచీ అపరాధం!"

"కాదా మరి! ప్రేమమధువుతో, ప్రణయమధువుతో పూర్ణంగా ఉబికిపోతూన్న గులాబీకన్నెను పలుకరించాలని, పలుకరించితే మూరాడదని అనుకోడం అతని తప్పుకాదు? అంతప్రేమతో పొంగిపోతూ, అతడెన్నడు దరిజేరుతాడా అని కలువరిస్తూంటే, దూరాన్నుంచి పలుకరించి పలుకలేదని, ఖిన్నుడై తిరిగిపోతాడా? అతని కంతమాత్రం తెలియదూ, కుసుమసుకుమారి తనకోసం తపించి వాడిపోతుందని."

స్వామి నూతనోత్సాహముతో, ఆమెవంక వింతగా చూస్తూ, ఆమెమాటలన్నీ ఆలకిస్తున్నాడు. వాణి అతని అమాయకత్వానికి నవ్వి, అతన్ని చేరదీసి ముద్దిడుకున్నది.

"సృష్టిక్రమం తారుమారవుతున్నది గులాబీదగ్గరనా మొకరితుమ్మెద పారం చదువుకునేది?" అన్నది వాణి.

"నేను సాహసంచేయలేకపోయినాను వాణీ! నాతో మాటాడకపోతే, నామీద నీకు ప్రేమ లేదనుకుని, విచారపడి ఊరుకునేవాణ్ణి."

"సాహసం ఎందుకూ? అంతమాత్రం కనిపెట్టలేక పోయినావు. కోమలాన్ని చూసి అయినా నేర్చుకోలేకపోయినావే!"

స్వామి కొంచెం కోపంగా ఊరుకున్నాడు.

"అదుగో అంతలోనే మళ్ళా అలుకా! కాదు స్వామీ! కోమలాన్ని నీకు పారం చెప్పమని నేనే పంపించాను. అప్పటికయినా నీవు ఆలోచించలేకపోయినావు. గ్రహించలేకనేపోయినావుకదా! కోమలం నిన్ను పలుకరించినట్లు నీవు నన్ను అనాడే..."

వాణి సిగ్గుపడి ఆమీద మాటాడలేకపోయింది. అతని పెదవులకందకుండా, తనముఖం తిప్పేసుకుంది. స్వామి బలవంతాన ఆమెముఖాన్ని తనవైపుకు తీసుకుని చాలాసేపు ముద్దిడుకున్నాడు.

—ఈల వినపడ్డది. వాణి తటాలున అతని ఒడిలోనుంచి లేచి, అతని నక్కడే ఉండమని చెప్పి, పరుగెత్తుకుని వెళ్ళింది. మళ్ళా వెంటనే తిరిగివచ్చి, ఆతన్ని కౌగలించి,

"ఇంక నీవు వెళ్ళిపో. మా వార్డెను పిలుస్తూంది. నేను వెళ్ళాలి –" అన్నది.

స్వామి ఆమెను వదలలేకపోయినాడు.

"అబ్బ! వెళ్ళిపో" అని ఆతన్ని ముద్దిడుకుని, 'రేపు నాలుగుగంటలకు న్యూషాలిమర్' అని అక్కడనుంచి గబగబ వెళ్ళిపోయింది.

స్వామి అమితోత్సాహంతో ఒక్క ఉదుటున కాంపొండువాలు దూకి ఈవలకు వచ్చేశాడు.

"... ... ..."

—శ్రీమాన్ చాలా అశ్చర్యపడ్డాడు. తలుపుతీయడంతోనే శివస్వామి, ఆతని చాటున ఒదిగి సిగ్గుపడుతూ వాణి, ఆతని స్టూడియోలో ప్రవేశించారు. స్వామి ఆతన్ని కోపంగా చూసి, "—చేతనయితే వత్సరాజునుకూడా చిత్రించు" అన్నాడు.

శ్రీమాన్ ఓ నిమిషం ఆతనివంక చూసి, తరువాత ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగా నవ్వాడు.

"అది చాలా పాతకథ...స్వామీ! వత్సరాజును చాలాకాలం క్రిందనే చిత్రించి...చుకొన్నాను. మా సాగరికను నీవు చూడలేదు కాబోలు!"

అని అక్కడనున్న తెర అవలకు జరిపాడు. ఎదురుగుండా ఈజెల్ మీద సగము తయారయిన బొమ్మ ఉన్నది. కొంచెం ప్రక్కన నవ్వుతూ కోమలం కూర్చుని ఉన్నది.

"రత్నావళి"

అని నవ్వి శ్రీమాన్ కోమలాన్ని చూపించాడు.

"వత్సరాజు తన్ను చూపించుకున్నాడు."

కోమలం పరుగెత్తుకుని వచ్చింది. వాణి ఆమెను కౌగలించుకున్నది. ఇద్దరూ నవ్వుకున్నాను.

శ్రీమాన్ నవ్వుతూనే "కోమలం! టీ పెట్టు. వాళ్ళిద్దరు" – అని స్వామి, వాణినీ కనుసైగతో చూసి – "కూడా ఉంటారు" అన్నాడు..

వాణి నవ్వుతూ, కోమలంతోకూడా లోపలికి వెళ్ళిపోయింది.

స్వామి దగ్గరున్న కుర్చీలో కూర్చుని, నవ్వుమొగంతోనే శ్రీమాన్ దగ్గరనుంచి అడిగి తీసుకుని సిగరెట్టు ముట్టించాడు....

★ ★ ★

# కులాసా

"బాగాలేదు. వేషమంతా మార్చాలిసిందే - ఎన్ని మాట్లు చెప్పను, నీకు కర్నాటచీరెలు బాగుండవని? మొన్న తెప్పించిన లేత గులాబీచీరె కట్టుకోరాదూ!"

"పోనీలేద్దురూ, ఏలా ఉంటేనేం. వియ్యమందబోతున్నానా? ఇట్టి పేరంటము వెళ్ళి రావడానికి ఇవి చాలవ్వూ?"

"ఓ - చాలకేం. అయినా రెండో మూడో రంగులు తక్కువ - లేకపోతే ఇంద్రచాపంలాగా మెరిసిపోయేదానవే! ఇంతకూ ఏలాటివాళ్ళు ఏమాదిరి చీరెలు కట్టుకోవాలో ఎవరి బుద్ధికి వాళ్ళకి తెలియాలి. ఎంతకాలం - అదికాదు, ఇది - అని దిద్దిచెపుతూంటారు, ఎవరుమాత్రం? - ఎవరి అందం—"

"నే నేది చేసినా అంతేలెండి. మీ రవునన్న దెప్పుడు? నేను అందరికి మల్లే అందగత్తెనుకాదు గనుకనే, మీ రీసడించటం - కానీలేండి. ఏంచేస్తాం—"

"ఉన్నమాటకు ఉలుకెందుకూ? నీకు తోచినంతేకాని ఒకరు చెపితే వినడమంటూ ఎన్నడైనా ఉన్నదా? ఇప్పుడు కొత్తఏమిటీ, మామూలేకాదూ!"

"అప్పు డామాత్రం తెలిసింది కాదేం ఎందుకు కొన్నారూ?"

"నీకు తెలియదూ - ఎందుకంటే, నీ—"

"అవును,. నా పోరుపడలేక కొన్నారు. అంతేనా? సరేలెండి; ఏమీతోచనప్పుడల్లా కవ్వించి కజ్జా ఆడుతూంటారు."

"కాదు, సరసమాడుతూంటాను."

"సరసాలకి నేనేం సానిదానిననుకున్నారా?"

"ఆఁ - పొరబాటే, మరచిపోయి అన్నా - మీ నాన్న ఆ శ్రోత్రియపు ముండాకొడుకు - భువనేశ్వరం దగ్గరే కూర్చోపెట్టి పెంచాడాయెను మిమ్మల్ని! మీ దగ్గర ఆఁ - అంటే తప్పు, నారాయణ అంటే బూతుమాట. సరసాలుకావులే, మీ భాషలో ఆషామాషీలంటారే అవి–"

"అనండి. ఆడపిల్లల్ని కన్నందుకు మా నాన్న యీ మాటలన్నీ మీచేత పడాల్సిందే. 'అమ్మా, మంచిగా ఉండు' అని చెప్పాడు కాని, ఆయన మాకు కానిపోనివేమీ నేర్పలేదే - చచ్చి స్వర్గాన ఉన్నవాడిని ఇంకా సాధివ్వడం ఎందుకండీ?"

"ఎంత ఘనకార్యం చేశాడని - మిమ్మల్ని కన్నందుకేనా ఆయన స్వర్గానికి వెళ్ళటం?"

"కాదు: మీవంటివారు ఆయనకు అల్లుడై నిత్యమూ దీవించుతూండటముచేత!"

"నిజమే. కాకపోతే! మనకు పిల్లలు పుట్టిన తర్వాత కూడా, ఇంకా. 'మీ నాన్న అట్లాంటివాడు - నా కానాడు అది బెట్టలేదు - అవాళ నన్నట్లా అన్నాడు...' అని దెప్పుతూండటమేనా?"

"లేకపోతే మనిద్దరికీ తెలిసిన విషయాలు వేరే ఏమున్నాయి? కాళిదాసు కవిత్వాన్ని గురించి మాట్లాడమన్నావా? కాంటినెంటల్ రినైజాన్స్‌మీద దబాయించమన్నావా? నీకు ఏది అర్థమౌతుందో ఆ సంగతే ఎత్తుకోవాలి మరి."

"మీ కాళిదాసులూ, కవిత్వాలూ మా కెందుకు లెండి. ఏదో ఈలాగే ఇంత కుంకంరాచుకొని బ్రతికితే అదేచాలు. అయినా, ఏటిలోకీడ్చి కోటిలోకి లాగుతారేం: నా చీరె బాగుండకపోవడానికి – మా నాన్నకు...నాకు చదువు రాక పోవడానికీ...ఎక్కడికెక్కడ కలిపారండీ?"

"అదే కాలక్షేపం చేయడం అంటే. పోట్లాడానన్న పేరు నా కెందుకుగాని, నీ యిష్టం వచ్చిన చీరెలు కట్టుకో–"

"మీ శాణాతనం మీరూను: మీమాట వినలేదని అనిపించుకోడం నాకుమాత్రం ఎందుకూ, మీరు చెప్పిన మాదిరిగానే నడుచుకుంటాను: చెప్పండి మరి..."

"చెప్పడం ఎందుకూ...ఇంద, చదువుకో..."

"ఏదీ...టెలిగ్రాములాగున్నదే...ఏం వేషాలూ, వేళాకోళాలూనండీ! నాకే ఇంగ్లీషు వస్తే నేనిలా ఎందుకుండేదాన్ని... ఎక్కడనించి వచ్చిందేమిటి?"

"అయినా చెప్పకో చూతాం?"

"అబ్బ! ఏం విసిగిస్తారండి. చెప్పకపోతే మానెలెండి. నాలుగు వేస్తున్నారు...వెళ్ళాలి."

"వినకుండానే"

"మీరు ఏవేళకూ తేల్చకపోతే మరి ఎలా?"

"కమలం వస్తూంది: నాలుగున్నరకి స్టేషనుకు వెళ్ళాలి."

"నిజంగానా?"

"నా మాట నమ్మకపోతే చదువుకోరాదూ?"

"నామీదే ఆపేక్షవుండి నేనే చదువుకోవాలె అంటే తెలుగులోనే ఇయ్యకుండా, ఇంగ్లీషులో ఎందుకిస్తుంది? నా చెల్లెలికి గూడా నన్ను చూస్తే పరిహాసమే."

"పాపం! కమలం అంతదూరం ఆలోచించి ఉండదు. ఇంతకూ చిన్నపిల్లకాదూ? – అయితే, ఏమిటి నీవు స్టేషనుకు వస్తావా, రావా?"

"మీ యిష్టం."

"నా యిష్టమేమిటి...వచ్చేది మీ చెల్లెలేకాదూ?"

"రావటం మీయింటికి కాదూ!"

"అవును, మాయింటికేలే; మీయింటికి కూడా వచ్చి చూసిపొమ్మని చెప్పడానికన్నా, నీవుకూడా రావచ్చును కాదూ?"

"చాల్లెండి, మీ మాటలూ...మీరూను–"

## 2

కమలం విశాఖపట్నంలో యం.బి. చదువుతూన్నది.

శేఖరం పెండ్లినాటికే పది పదకొండేళ్ళ పిల్ల. గుమ్మటంలాగా, ఆకుపచ్చని దక్షిణాది పరికిణీ కట్టుకొని, జఫర్ షర్టు తొడుక్కొని, "బావా! గుడ్‌మార్నింగ్" అంటూ అల్లరి చేస్తూ ఉండేది. ధర్డుఫారం చదువుతూన్నదేమో, క్లాసులో

నేర్చుకున్న ఇంగ్లీషంతా బావమీద ప్రయోగించి, అతన్ని నిలువనిచ్చేదిగాదు. శేఖరానికి చెల్లెళ్ళు లేరు. అందుచేత కమలం అంత చనువుగా ఉండటం అతనికి చాలా సరదాగా ఉండేది. ఎప్పుడూ ఇద్దరూ ఒచోట కూర్చుని పోట్లాడుకుంటూండేవాళ్ళు చిన్న పిల్లల్లాగా. పెళ్ళి అయినప్పటినుంచీ వెయ్యి మార్లన్నా జల్లాలు తిని ఉంటాడేమో శేఖరం మరదలుచేత.

లక్ష్మి కాపురానికి వచ్చి నాలుగేళ్ళు దాటుతోంది. భార్య ఈడేరిన తరువాత అత్తవారింటికి తరుచు వెళ్ళటం మానివేశాడు శేఖరం. భార్య వచ్చినతరువాత వెళ్ళాలిసిన అవుసరమే లేకపోయింది. ప్రాక్టీసు బాగా పెరగడం మొదలు పెట్టిన తరువాత ఊరుకదలటానికి వీలే ఉండేదికాదు. ఏడాది కోమాగు పుట్టింటికి వెళ్ళినప్పుడన్నా లక్ష్మి చెల్లెలిని చూసేది; శేఖరం మాత్రం మరదలిని చూసి ఎన్నాళ్ళయిందో!

ఉత్తరం మాత్రం తప్పకుండా వ్రాస్తూండేది బావకు కమలం. 'నన్నుబట్టే ఆయనకదా, నా కెందుకు వ్రాయదూ' అని లక్ష్మికి కోపంగా ఉండేది. శేఖరం వల్ల ఆ విశేషం చూచాయగా తెలుసుకొని, "నీవు వివాహితవు. ఇంకొకరిదానవు. అందుచేత నీ క్షేమసమాచారాలు నీ భర్తద్వారా నేను తెలుసుకోవడం మంచిదికాని, నేను నీకు ఉత్తరం వ్రాయడంకాని, నీవు స్వతంత్రించి నాకు జవాబు వ్రాయడంకాని అంత మంచిదికాదు" అని కమలం ఆమెకు వ్రాసింది. అప్పటినుంచీ లక్ష్మి ఆ మాటే ఎత్తేదికాదు. కాని తనకు చదువు రాదు; కమలానికి వచ్చునుకదా అని ఉడికిలుతూండేది.

కమలందగ్గరనుంచి టెలిగ్రాం చూసుకొని, శేఖరం పొంగిపోయినాడు. తాను కాపురం పెట్టిన తరువాత అదే ఆమె మొదటిసారి రావడం. వస్తానని ముందుగానన్నా తెలియజేయకుండా, బయలుదేరుతూ వైరిచ్చింది. అందుచేత అయత్నితోపనతమైన ఆ కులాసా అతన్ని వివశుణ్ణిగా చేసేసింది.

సెంట్రలులోకి జేరుకునేటప్పటికి-పాసెంజరుకూడా వచ్చేసింది. లక్ష్మిని గబగబా నడిపించుకుంటూ శేఖరం ఎగువకు పోతున్నాడు. పది అడుగులు వేసేటప్పటికి, ఒక సెకండ్లుక్లాసుబండిలోనుంచి వెనుకపాళాన "హలో!" అన్న ప్రత్యభిజ్ఞాపురస్సరంగా శేఖరం భుజాన ఛెళ్ళున దెబ్బపడ్డది: తిరిగి చూశా..డు. లక్ష్మికూడా నవ్వుమొగంతో సమీపించింది. ఐడియల్ మెడికల్ స్టూడెంట్ వేషంలో కమలం క్రిందికి దిగింది.

శేఖరంకరస్పర్శన మాచరించి, వామకరంతో "ఏం అక్కయ్యా!" అని లక్ష్మిభుజం తట్టింది. ఆమె ఏమీ మాటాడలేదు. తలత్రిప్పి ఊరుకున్నది.

"ఏం బావా!...ఎట్లా ఉన్నావ్?...మునుపటికన్నా బలిసావే" అని అడిగింది ఆంగ్లంలో, అతనిచేయి విడువకుండానే.

"నిజమే, కొంచెం లావుపారాను. నీవు రావడం మటుకు చాలా సంతోషం....బావను మరచిపోదామనుకుంటున్నావేమో అనుకున్నాం లక్ష్మి నేనూను, నీవు ఎన్ని మార్లు రమ్మన్నా రాకపోవడంచేత...కాదూ లక్ష్మీ?" అని అతడు ఆంధ్రంలో అడిగాడు.

"అదంతా ఎందుకులెండి, ఇప్పుడన్నా వచ్చింది చాలు."

" కాదు అక్కయ్యా! నాకుమాత్రం మిమ్మల్ని చూడాలని ఉ... మా. రావడానికి వీలులేకపోతూ వచ్చింది. మాకు తలవనితలంపుగా ఈ వారం సెలవు వచ్చింది.

ఎట్లాగా గడిపేది అనుకుంటూఉంటే, మా యింటిపక్క శర్మగారు గూడూరు ప్రయాణం గట్టారు. సరేకదా అని నేనుకూడా వచ్చాను."

"రాక రాక వచ్చినందుకు పదిరోజులేనా ఉండేది? నెల్లాళ్ళయినా ఉండకుండా ఎట్లా వెళుతావో చూస్తాను"

"మళ్ళా పోట్లాట మొదలుపెట్టావూ? అలాగయితే నేను నీతో మాట్లాడనే మాట్లాడను."

"నీవు మాట్లాడేదేమిటి? నేను మాట్లాడించనూ?"

ముగ్గురూ నవ్వుకున్నారు. పోర్టరు సామాను కారులో పెట్టాడు. శేఖరం భార్యను ఎక్కించి కమలానికికూడా చేయి అసరా యిచ్చాడు; కమలం సవిలాసంగా చేయి త్రోసివేసి, "పెళ్ళికూతురులాగా– ముందు నీ వెక్కి కూర్చుందూ–"నే నెక్కగలనులే! అన్నది నవ్వుతూ.

శేఖరం స్టార్టు చేశాడు: కమలం అతని ప్రక్కనే కూర్చున్నది.

మౌంటురోడ్డు సమీపిస్తూండగా కమలం, శేఖరం రెండునిమిషాలు ఇంగ్లీషులో మాట్లాడుకున్నారు. తరువాత కమలం–సిగరెట్టు–శేఖరం దగ్గరనుంచి తీసుకొని – ముట్టించింది.

లక్ష్మి అంతవరకు బయటకుచూస్తూ – కమలాన్ని గమనించలేదు. ఘ్రాణం తన పనిని తాను నెరవేర్చేటప్పటికల్లా చకితయై తిన్నగా తిరిగింది. మనసులో ఏమనుకుందో తెలియదు; కాని కోపంతో జేవురించిన ముఖంతో కమలం మెడవంపుమీద పైట చెంగు పుచ్చుకొని లాగి, 'అదేం పని?' అన్నది.

కమలం సావకాశంగా వెనుకకు తిరిగి, "చదువుకున్నదాన్ని కదూ?" అని మామూలువైపుగా కూర్చున్నది.

శేఖరం నవ్వి సిగరెట్టు వెలిగించాడు.

## 3

"జయ బృందావన జయ నరలీలా
  జయ గోవర్ధన చేతనశీలా"

పంచమిరాత్రి, పండువెన్నెల, పాలసముద్రం అతి వేలమై, లోకాన్నంతా ముంచివేసి, లోకాలోకాన్ని ఒరుసుకపోతూన్న భ్రమకల్పించి "ఈశా వాస్య మిదం సర్వం" అన్న ఉపనిషద్వాక్యాన్ని తమాషాగా జ్ఞాపకం చేస్తూంది.

వెన్నెలచాయ చీర కట్టుకుని, వెన్నెట్లో మెరసిపోతూ కమలం విరియబూసిన నిత్యకళ్యాణి పొదసమీపాన ఇసుకలో కూర్చుని గిరీశబాబుగీతం పాడుతూంది.

కాశ్మీరసిల్కులాంటి నులిమంచుతెరలు చందమామను కమ్మేస్తున్నాయి. అతని కరస్పర్శ కమలానికి క్రమంగా అసహ్యామైపోతోంది.

పాట చాలించి, లేచి నిల్చుని, బాగా విరిసిన పువ్వులు కోసుకుంటూన్నది.

కుహూమని కోకిల పొగరుబోతుతనంగా కూసింది. చివురాకు చెలులందరూ చకితలై, లతాంత సంతానాన్ని చోటుచేసుకొని దాక్కుంటున్నారు. విరికన్నెలు అందని నాథునికోసం ఆసపడి, తమ జీవితానికి అడవినికాచిన వెన్నెలను తోడురమ్మంటున్నారు.

"కమలం!"

కొంచెం దూరంలో, పాలరాతి బెక్కామీద, వెన్నెలలో కలకలలాడుతూ శేఖరం కూర్చుని ఉన్నాడు. ఎంతసేపయిందో వచ్చి! ఆమె అతన్ని అంతవరకూ చూడనే లేదు.

"అబ్బ! ఎవరో అనుకున్నాను;...కాదులే, నీ వేననుకున్నా, కాని వస్తావనుకోలేదులే..."

"వచ్చాను—నీవు పాడుతున్నావని..."

"అలాగా – వినడానికా? – నన్ను చూడడానికేమో ననుకున్నా – అయితే, సమీపానికి దయచేయి; ఇంకా బాగా వినపబడుతుంది."

"అంత చక్కగా పాడటం ఎక్కడ నేర్చుకున్నావు?"

"నీ వీలాటి అర్థంకాని ప్రశ్నలు వేయడమో?"

"మరి పాడవూ?"

"ఏమంత అవుసరం? – నీకు అంత వినాలని ఉంటే నేను పాడేటప్పుడు, చాటుగుండా వచ్చి విను!–"

"నేను పాడించనా, నీచేత?"

"నీ చేతనవుతుందా—ఆఁ— తెలిసిందిలే, పాడుతా; లేకపోతే ఈ కోపమంతా మా లక్ష్మిమీద చూపిస్తావేమో! ఆడపిల్ల నిచ్చుకున్నందుకు నీకు సలాం చేస్తూ ఉండాలి నాయనా! – బావా, బలే వాడవయ్యా!...నాచేత పాడిస్తావేం—అవునులే భాగవతంలో ఉందికాదూ, 'పాడించెడువాడు రామభద్రుండట' అని?, నీవు మాత్రం సామాన్యుడవా? ఆయన రామభద్రుడైతే, ఈయన బావభద్రుడు – ఏం పాడమన్నావు?"

"నేనేం చెప్పగలను? – విని ఆనందించడమే నాచేతనైనది."

"అంటే రసికుడవన్నమాట."

"ఇంచుమించు అంతే."

"అంతే అయితే – రసికుడంటే, మా సాంప్రదాయంలో శుద్ధ చవట అని అర్థం – వంటచేతగానివాళ్ళు రుచిచూసి చెపుతామని బయలుదేరినట్లు – పైగా అదో గొప్పగా చెప్పకోవడం కూడానా?"

"కమలం, భగవంతుడికి ఇంత పక్షపాతం ఎందుకూ? ఎక్కడాలేని తెలివి, ఎవరికీ లేని చక్కదనమూ నీకొక్కరితెకే కట్టబెట్టాలేం?"

"నేను నీతో మాట్లాడలేను! – ఓడిపోయినాను అన్నదానికి కవిత్వపుధోరణా ఏం ఇది. ఎంత గడుసువాడవూ! బావా!"

"నవీన జలధర – శ్యామసుందర
మదనమోహన ధామ
న–య–న ఖంజన– హృదయరంజన
గోపినీవల్లభ శ్యామ"

కమల బ్రహ్మానందంగా పాడింది. శేఖరం మంత్రబద్ధుడులాగా చేష్టలుడిగి కూర్చున్నాడు. ఎంతోసేపు ఆ ఆవేశం తగ్గలేదు. ఒకరినొకరు నిశ్చలనయనాలతో చూసుకుంటూ, పెదవి కదల్చకుండా, చిత్రప్రతిమల్లాగా ఉండిపోయినారు.

"అమ్మా, అదుగోనే పిన్ని – నాన్న కూడాను."

ఉమాబాల దోవతీస్తూండగా లక్ష్మి ప్రత్యక్షమైంది అక్కడ.

ఒక నిమేసం దూరానే నిలుచుని వారివైపు చూసింది. అమరారామంమీద విసువుపుట్టి, కులాసాగా బయలుదేరి భూమినవతరించిన దివ్యులులాగా మెరిసిపోతున్నారు.

ఉమాబాల పరుగెత్తుకునివెళ్ళి కమలం ధ్యానానికి భంగం కలిగించింది. శేఖరం యోగనిద్రచాలించిన మహర్షి లాగా, శాంతంగా, అక్కడనుంచి లేచి వెళ్ళిపోయినాడు.

"దా, మనంకూడా వెళుదాం. చలిగా ఉంది" అని లక్ష్మి కూతురిచేయి పట్టుకుంది.

"నేను పిన్నితో వస్తాను."

"ఇప్పుడప్పుడే రాదమ్మా!...మనం ముందర పోదాం రా"

"నేనూ వస్తున్నాను...నా కిక్కడేంపనుంది" అని ఆశ్చర్యపడుతూ అన్నది కమలం.

"చూశావు – అమ్మా! నే చెప్పలా – పిన్నితో వస్తానని" అని ఉమాబాల సంబరంతో అన్నది.

"అలాగా... నాకు అంతమాత్రం తోచనేలేదే... చలిలో సంగీతం సాధన చేస్తారంటారుకాదూ – అందుచేత ఇంకా చలిముదిరేదాకా కూర్చుంటుందేమో ననుకున్నా."

"అయితే అక్కయ్యా, సంగీతానికి చలా, ఛలికి సంగీతమా, ముదరడం?"

ఉమాబాల ఏమో తెలిసిందానిలాగా నవ్వుతూ గంతులు వెయ్యటం మొదలు పెట్టింది.

"అలా చూడుమరి, ఆ గులాబీచెట్టు కడుపారా కన్నవేకదా – ఆ రెండు పుష్పాలున్నూ...ఒకదాన్ని, మిసమిసలాడే పడుచుపిల్ల తలలో పెట్టుకుంటుంది, రెండవది – దేవతార్చనలోకి జేరుకుంటుంది. జాతి ఒకటైతేనేం, గీత ఒకటి కాదుకదా!"

## 4

"శుద్ధదండుగ. బాగుండదని తెలిస్తే అసలు వెళ్ళకుండా ఉండేవాళ్ళమే" అని విసువుకున్నది, షూజ్ తీసివేస్తూ కమలం.

"కలగన్నామా ఏం! బొమ్మలూ అవీ చాలా బాగానే ఉన్నాయి... ఏదో ఒక మార్గం, డబ్బు ఖర్చుపెట్టడానికి––" అని చాలా అమాయికంగా లక్ష్మి అందుకొన్నది. కమలం వినిపించుకోకుండా,

"ఏమో నా కేమీ నచ్చలేదు బావా! రోజ్‌బ్లాసమ్‌కు అంత గొప్పపేరుందే; మరి అలా చేసిందేం?"

"పేరుకేముందిలే! తెచ్చుకుంటే అదే వస్తుంది... పేరు రావడ మెంత, పోవడ మెంత– కాని యీ సంవత్సరం ఈ మాదిరి ఫిల్ము చూడలేదు. ఇవాళ ఎవరి మొగం చూసి లేచానో–" అని కునికిపాట్లుపడుతూ జవాబు చెప్పాడు శేఖరం.

"ఉమను పడుకోబెట్టి వస్తా"నని లక్ష్మి లోపలికి వెళ్ళిపోయింది. శేఖరానికి నిద్రపట్టింది.

ఎంతసేపటికో!...దేవేంద్రుడు రాళ్ళవాన కురిపిస్తున్నట్లుగా కలగని, అదిరిపడి మేల్కొంచాడు శేఖరం. తాను మొదట పడుకున్న చోటనే ఉన్నాడు – ఏమో? ఏంతెలియలేదు. పెద్ద మోతమాత్రము వినబడుతూంది – మరికొంతసేపటికి

తెలివితెచ్చుకుని కలయచూచాడు. కమలం రేడియో దగ్గర కూర్చుని, తనవైపు చూస్తూ బిగ్గరగా నవ్వుతూంది.

"తమాషాగానేఉంది నిన్ను చూస్తోంటే. పిలుస్తే పలుకుతుందిలాగుండే నిద్ర నీకు - ఇందాకనుంచీ కనిపెడుతూనేఉన్నా, దొంగనిద్రపోతున్నావేమోనని...."

"ఎందుకు లేపావు కమలం?"

"లేకపోతే అప్పుడే నిద్ర ఏమిటి నాయనమ్మలాగా? - కళ్ళు తెరుచుకుని కూర్చో, బొంబే స్విచ్చాన్ చేశాను - ఇవాళ మంచి ప్రోగ్రాము ఉంది."

"పోనిద్దూ—"

"వీల్లేదు...రావాలి."

శేఖరం పూర్తిగా మేలుకొని రేడియోదగ్గరగా కుర్చీలాగి కూర్చున్నాడు.

ఐ లవ్ యు ఇన్ వైలెట్...అన్న నాట్యగీతం ప్రారంభం అయింది. కమలం నవ్వుమొగంతో వింటూంది. శేఖరం కమలంవంక కరువుదీరా చూస్తున్నాడు.

"కమాన్...లెట్ అజ్ డాన్స్..." నాగస్వరంవిన్న నాగబాలలాగ కమలం ఆవేశంతో నాట్యోన్ముఖియై నిలుచున్నది. శేఖరంకూడా ఆమెను అనుకరించాడు.

లక్ష్మి ఆ రంగమంతా తెల్లబోయి చూస్తూ నిలుచున్నది. కమలం ఆమెను చూసిందో లేదో కాని, నాట్యం చాలించలేదు.

"అమ్మా! ఎంతదానవే!"

శేఖరం భ్రాంతుడైనాడు. అంతవరకూ లక్ష్మికూడా అక్కడ నిలుచునిఉన్నదని అతనికి తెలియనేలేదు. ఏదో అపరాధంచేసినవాడిలాగా తలవంచుకుని, పోయి సోఫాలో కూర్చున్నాడు.

కమలం నవ్వింది.

"అక్కయ్యా, బావ చాలా బాగానే డాన్సు చేస్తాడే- ఏమోననుకున్నా ఇదివరదాకా. నీవు కాపురానికి వెళ్ళిన తరువాత ఆటాపాటా మానిపించి, భగవద్గీత చేతికిచ్చావేమో ననుకున్నా. ఇక పరవాలే!"

లక్ష్మి వినిపించుకోకుండా శేఖరంవంక కోపంగా చూసింది. అతను అక్కడనుంచి లేచి లోపలికి వెళ్ళిపోయినాడు.

"కాఫీ చేసుకు త్రాగుదామా? ఏమిటి - మాట్లాడవేం?-" అని కమలం చాలా అమాయికంగా అడుగుతూ లక్ష్మిచేయి పట్టుకున్నది.

మోటుగా చేయి విదిలించి. "ఏమిటి ఈ అగడం? ఇది సంసారుల ఇల్లనుకున్నావా, మరి—" కమలం లక్ష్మి మాటకు అడ్డంవచ్చి, "నీకు కోపం వచ్చిందా అక్కయ్యా?" అన్నది.

"కోపమా - నాకు కడుపునిండినట్లుగా ఉంది నిన్ను చూస్తే. పరువూ, ప్రతిష్ఠా - ఇంతకూ, వంశానికి..."

"ఆఁ" అని గర్జించింది కమలం.

"-ఏమిటి. ఒళ్ళు తెలిసే మాట్లాడుతున్నావా?...ఇదివరకు నీవు తెలివితక్కువ దానవే అనుకునేదాన్ని - చేతగానితనంకూడా బలిసిందే! - ఎరక్కపోయివచ్చాను. తగినట్లుగానే గౌరవించావు."

"నిజమే, నిన్నురమ్మనడం నాదే తప్పు."

"నీవు రమ్మంటే వచ్చాననుకున్నావా?"

"ఎందుకనుకుంటాను? నాకు తెలియవూ మీ వేషాలన్నీ? -- ఎవరిమీద ప్రేమఉందో వారికోసం వచ్చావు"

"అవును"

"కాక! నీకు నదురూబెదురూ ఎందుకు? - నాన్న చూస్తే సంతోషించి చంకలు కొట్టుకునేవాడు - నిన్ను కన్నందుకు ఆయన అటు ఏడుతరాలు, ఇటు ఏడుతరాలవారూ తరించారు."

"నిజంగానా? - ఏమో అందరితోబాటు నేనూ అనుకున్నాను కాని, నాలో ఇంత మహత్తు ఉందని నా కింతవరకు తెలియదే!...నాన్నైనా ఎన్నడూ చెప్పలేదే!--"

"నీతో మాట్లాడడమే పొరబాటు-" అని లక్ష్మి లోపలికి వెళ్ళిపోబోయింది. కమలం వెళ్ళి ఆమె చెంగుపట్టుకుని ఆపి, పొగరుబోతు గుర్రాన్నిలాగా, సావధానంగా వెనుకకు నడిపించుకునివచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

తాను గ్రామఫోనుబల్ల నానుకుని నిలుచున్నది.

"మేమిద్దరమూ సంతోషంగా నాట్యంచేశామనేనా, నీకు కోపం? - చేతగాకపోవడం నీదిలోపం - తెలిసిందా?-"

"నేను కులస్త్రీని"

"అవును, అక్షరాలా అంతే, - మాళవిక ఎవరు?"

"నేను నీతో వాదించను."

"అక్కర్లేదు, నేను చెప్పేదీ అర్థంచేసుకో. శేఖరం బావే గోష్పాదమంత జుట్టుంచుకుని, జంధ్యాలు పేనుకుంటూ, వేదం వల్లించే అవధాన్లుగారయితే, నీ వేషం అప్పటికి రంచన్‌గా సరిపోయేది. అతను కులాసాగా కాలం గడుపుదామనుకునేవాడూ, నీవు సోమిదేవమ్మలాగా వంటయిల్లు పట్టుకుని వదలనంటావు. మరి నీ ప్రవర్తన అతనికి బాగుంటుందేమో ఎన్నడైనా విచారించావూ?"

"పోనీ, ఇక నిన్నుచూసి నేర్చుకుంటాలే"

"నేను చెప్పేది అదే. సహధర్మిణీ హితచర్య అంతా నీకు కంఠతః వచ్చునుకదా! భర్త అందరికన్నా ఎక్కువ అని మనవాళ్ళే చెప్పారాయెను; నీవు దాని రూఢార్థము తీసుకుని నోరులేని రాతిదేవుళ్ళతోబాటుగానే మీ ఆయన్నూ చూస్తున్నావు. నీ ఆదరణా, భక్తీ ఎవరికి కావాలి? - బావ ఇంగితమెరిగి, నీవు అతనికి అనుకూలంగా నడుచుకోవాలి గాని"

"నా కా వేషాలు చేతకావు"

"కాకపోవడం ఎవరితప్పు - నేర్చుకో"

లక్ష్మి మాట్లాడలేదు.

"తరువాత...అంత చిడిముడిపాటు పనికిరాదు; నీ సొంత చెల్లెలినే ఇంత కఠినంగా అన్నదానవూ, రేపు ఎవరినైనా అంతే చేసేదానవేకదూ? మగవాడితో ఆడది మాట్లాడటమే దోసమూ? ఇంత తెలివితక్కువతనమైతే ఎట్లా?

"అదికాదు కమలం!" అంటూ లక్ష్మి శాంతంగా ఏదో చెప్పవచ్చింది. కమల ఆమెమాట చొరనీయకుండా–

"నే నెందుకు వచ్చానంటే మిమ్మల్ని ఇద్దర్నీ చూసిపోదామని – తెలిసిందా?.... మీ ఇద్దరిమీదా ఉంది నాకు ప్రేమ – నీవు నా సోదరివని నీమీద, అతడు నీ పతి అని – నీ సర్వస్వమని అతనిమీద. అదిగాకుండా నీమీద వట్టి ప్రేమే నాకు; అతన్ని చూస్తే చాలా సరదా. నీవు గూడా అతన్ని సంతోషపెట్టగలిగితే, అప్పుడు మీ యిద్దర్నీ సమానంగానే చూస్తాను – ఈ పారం చెప్పడానికే నేను వచ్చింది కూడానూ"అన్నది.

★ ★ ★

# ఖుదావంద్

లక్ష్మీకాంతం పారిపోయివచ్చి, మా యింట్లో దాక్కున్నాడు..

పారిపోయి వచ్చాడంటే... వెంట ఎవరో తరుముకు వస్తూంటే, నురుగులు గ్రక్కుతూ పరిగెత్తుకుంటూ వచ్చాడని కాదు: దాక్కోడమంటే, ఎంత వెదికినా కనపడని ఏదో చీకటిగుయ్యారంలో నక్కి కూర్చోవడమూకాదు .

—నిదానంగా నడిచివచ్చాడు...దొరకొడుకెవరురా అన్నట్టు ఒళ్ళువిరుచుకు కుర్చీలో పడుకున్నాడు...

అయినా నాకు అలా అనిపించింది...వాడి నీడగా కొండంత భయం, పర్వతమంత ఆవేదనా కనిపించింది....

'ఏంరా?...' అని మౌనంగా కుశలప్రశ్న చేశాను...

'నేను తాగితే ఏం ఫరవాలేదుకదా!' అన్నాడు ఒపట్టాన .ఎవరినో అడుగుతూన్నట్టు...

'ఎవరికీ ఫరవా?'

'నీకు' అని మనసులో పలకడానికి నావంక చూపు గిర్రునతిప్పి . 'నీకు అభ్యంతరము ఏమీ ఉండదుకదా?' అని గొణుక్కున్నాడు.

'లేళ్ళు, పులులూ కలిసి పూరి మేసే పుణ్యభూమి యీ ఆశ్రమం అన్నసంగతి మరచిపోతే ఎలా? – మహారాజుగా సేవించు. నన్నుమటుకు సహపంక్తికి బలవంతపెట్టక: నే నిప్పుడే భోజనం చేశాను...'అని హెచ్చరించాను..

లక్ష్మీకాంతం...జేబులోంచి మందుసరంజామా తీసి... గంగతో అపవిత్రంచేయకుండా... దాహంపుచ్చుకున్నాడు.

మొగం జ్వరపు–మొగంపడ్డది...కళ్ళు మెరుస్తున్నాయి..అలా సిగరెట్టు కాలుస్తూ కాళ్ళూ, చేతులు చాచుకొని ఒక నిమిషం పడుకున్నాడు: "వడకొడుతూవుంది గదూ" అని, వట్టివేళ్ళ తెరలు దించి...నీటిజల్లు తిప్పాను .

"పోయిందిరా..."

రొదగా నిట్టూర్చాడనుకున్నాను మొదట. మాట కదా అని మనసుకు తట్టింది.

ఎవరు?...ఎక్కడికి?...ఎందుకు?...ఈ మూడింటిలో ఏదో ఒక్కటయినా, మాట ధోరణిని అడగవలసిన ప్రశ్న... అడుగుదామనుకున్నాను కానీ, అడగకపోయినా జవాబు వాడంతట వాడే ఏలాగు చెపుతాడుకదా అనిపించి.. విని ఊరుకున్నాను.

'శకుంతల లేచిపోయిందిరా అంటూంటే... మాట్లాడవేం?" అని వాడు దండించాడు...

శకుంతల అంటే...నాకు అర్థంకాలేదు.

"నామూలానే లేచిపోయింది..." అదేశ్రుతిలో అన్నాడు...

"నీతోనే ఎందుకు లేచిపోలేదు?" అని కొంటె విసురొకటి విసరమంది మనసు. కాని, వాడిలో ఆ బాధను చూసి, నా నోటికి జాలేసింది.

"అలాగా–పాపం" లాగా తల ఊగించాను.

"ఎవడితోనో ఊరు పేరూ లేనివాణ్ణి తీసుకొని ఎక్కడికో లేచిపోయింది..."

...లేచిపోయేముందు, నాయకుడిపేరు ప్రఖ్యాతులు ఆలోచించవలసిన అగత్యం ఏమిటో నాకు ఎంత మాత్రము బోధపడలేదు. ఇదేమన్నా పెండ్లి సంబంధమా ఆర్షేయ పౌరుషేయములు నిదానంగా విచారించడానికి? ఇంకొక విషయం కూడాను– ఇందులో వీడినిర్వాహకం కొంత ఉందంటున్నాడుగా, మరి, ఈ నిక్షేపరాయుడు ఒరిగించిందేమిటి? ..తనచేతిమీదుగా ఈ సత్కార్యము జరుగుతూన్నప్పుడు, తాను, అంతమాత్రము మంచిచెడ్డలు ఆలోచించనక్కరలా?. .ఏమిటో అంతాగమ్యంగా ఉంది...

"మరి నా పెళ్ళాం ఎందుకు.."

......ఎందుకు లేచిపోలేదు?...అంటాడనుకున్నాను... వాక్యం సగంలో త్రుంచేసి నిద్రపోయాడు.

.. ...నిద్రపట్టింది కాబోలు అనుకుంటూండేలోపుగానే...నిద్రలోమునిగి తేలి బడలిక తీరినవాడిలాగా... ఒక్క నిమిషంలో తెరిపిగా మేలుకున్నాడు.

"ఏంరా, ఈ కోతిమొగాన్ని చూసి, కళ్ళున్నదెవతన్నా ముచ్చటపడుతుం దటరా?–" వాడు ధూకుడుగా అడిగాడన్నమాటేకాని, అందులో కొంత యదార్థం లేకపోలేదు. లక్ష్మీకాంతాన్ని, పరాకున అయినా, అందగాడనుకునేందుకు వీలులేదు...

"శకుంతల మధురమీనాక్షిలాగా కలకలలాడుతూ ఉంటుందిరా. నేను ఎంత పుణ్యం చేసుకోబట్టో 'అన్నయ్యా' అని పిలిచేదిరా...నాతో అరమరికలేకుండా వుండేదిరా.."

ఓహో ఇప్పుడు అర్థమయింది: శకుంతలంటే మనవాడి యింటికి ఎదురుగుండా మేడలో క్రింది భాగంలో ఉంటున్నాడే...తాసీల్దారుకూతురు. పిల్ల చాలా అందంగా వుంటుంది...చిదిపి దీపం పెట్టవచ్చు! అవును, నేను ఒకటి రెండుసార్లు చూసిన జ్ఞాపకంకూడాను...

"అన్నయ్యా అనే మాటకు ఎన్ని అర్థాలుంటాయిరా? – నీవే చెప్పు"...

—ఏం చెప్పను? అందరికీ తెలిసిన ఆ ఒక్క అర్థమే నాకూ తెలుసును...ఈ నా అజ్ఞానాన్ని నా గ్రుడ్డు మిటకరించినవి...

——"అన్నయ్యా" అంటే 'బావా' అనీ, 'మామా!' అని అనుకోవచ్చునా? – చెల్లీ అని పిలుస్తూ, చాటునా మాటునా పెళ్ళాంగా వాడుకోవచ్చునా..మనిషైనవాడు ఎవడన్నా అలా గడ్డితింటాడా? ...పోనీ, మొగవాడు ఏ కోటిమందిలోనో ఒకడు పశువౌతాడనుకో...అప్పుడు మాత్రం – అదెలా పరిపాటి అవుతుంది?...వాడు వర్ధిపశువుకాక మనిషెలా అవుతాడు?..."

"అవును. నీవంటూన్నదంతా నిజమే"నని తల ఊగించాను.

"నా పెళ్ళాం నన్ను శుద్ధపశువుకింద కట్టింది...

"శకుంతలను నేను ప్రేమిస్తున్నానని అనుక్షణమూ అభినందించడం మొదలు పెట్టిందిరా. అలాటి పాపపుమాట లనవద్దని ఎన్నో విధాల బ్రతిమాలుకున్నాను:

ఉహూఁ...తల్లికి పెళ్ళానికి తేడా తెలియని మనిషి — ఊఁ..మనిషా, అదికూడా ఒక మనిషేనా?...

"నన్ను తిట్టి దుమ్మెత్తిపోసినా అంత బాధపడేవాణ్ణి కాదేమో: నేను చెప్పేస్తున్నది ఏదో ఘనకార్యమని... నేనుకాగా అంత ప్రయోజకుణ్ణి కాగలిగానని, ఆవిడ అంటున్నప్పుడల్లా నా గుండెల్లో శూలాలు నాటుకునేవి.

"నామీద ఎక్కడలేని దయ, ఆపేక్ష యింటావిడకు పుట్టుకువచ్చినవి.. దయతో చంపడం అని ఇంగ్లీషువాళ్ళు అనే మాటలో హాలాహలం నాకు నరనరాల ప్రాకిపోయింది — శకుంతలకు మా ఆవిడ అభాయిత్యం ఎక్కడ తెలుస్తుందో..ఆ అమాయకురాలి మనసు ఎక్కడ చివుక్కుమంటుందో అని నాకు వెర్రెత్తిపోవడం మొదలుపెట్టింది.

"కానీ, నేను ఏం చెయను? ఈ పాపపుమాట ఆ అమ్మాయి చెవిని పడకుండా చేయటం ఎలా? ఏమీ పాలు పోయింది...కాదు...తెంచుకు ఎక్కడికన్నా పారిపోతే?...ఇహ మా ఆవిడనోటికి హద్దూపద్దూ ఉండదు...పారిపోకుండా, ఇంటినే అంటిపట్టుకుంటే...ఏ నిమిషాన ఏం మునుగుతుందో?

"శకుంతలను, మా యింటికి రావద్దని చెప్పుదునా? అయితే, కారణం ఏమనాలి?–

..."నీవు ఒక్కటి అడగవచ్చును...నీ పెళ్ళాంనోటికి బుద్ధి చెప్పలేకపోయినావా అని. అదీ ఆలోచించాను: నాకు తామసం లేకపోలేదు—నన్ను చూసి ఇకిలిస్తూ మా గృహలక్ష్మి ఓ వెకిలిమాట కూసినప్పుడల్లా, ఆ పళ్ళన్నీ ఒక్క వరుసన రాలేట్టు కొడదామా అనిపించేది...కానీ చేయి లేచేదికాదు.. .ఏం చెయ్యను, అది నా దౌర్భాగ్యం...పెళ్ళాన్ని కొట్టడం ఎప్పుడూ అలవాటులేదు...చూసన్నా ఉండకపోతిని...మా నాన్న అమ్మమీద ఎన్నడూ చేయి చేసుకున్న పాపాన పోలేదు..

"ఆవాళ శ్రావణమంగళవారం. శకుంతల తలంటి పోసుకున్న నునుపుతో, కొత్తచీరా, రెవికా కట్టుకుని...కలకల్లాడుతూ, వాడకట్టుకు పేరంటానికి వెడుతూ, మా గుమ్మంలోకి వచ్చింది. ఏం వదినా అని మా ఆవిడనికూడా రమ్మని కేక వేసింది. ఆవిడ చీరసింగారింపు ఇంకా తెమలలేదు కాబోలు, లోపలికివచ్చి ..నేనుకూర్చున్నగదిలోకి తొంగిచూసి, వచ్చి కూర్చుని...ఏదో పత్రికలో బొమ్మలు చూస్తున్నది.

"ఇహ కాస్సేపటికి...మా ఆవిడ అక్కడకు వచ్చింది. వస్తూనే విషపుచూపొకటి చూసింది: ఆ వాలకం నేను చూశాను కానీ, శకుంతల బొమ్మలధ్యానంలో వుండి, గమనించలేదు.

"పోనీ, అంతటితో పోనియ్యవచ్చునా, లోపలకు వచ్చిందల్లా, గుమ్మం అవతలకు ఎగిరిగంతువేసి – ఆ విసురులోనే తలుపు చెళ్ళున వేసింది...

"శకుంతల వులికిపడి, తలఎత్తింది. ఏమిటని ఆ చూపులు నన్ను ప్రశ్నించినవి నేను అర్థంకానట్టు. ..చూసీ చూడనట్టు ఊరుకోగా,

"ఏమిటది?" అని పలికింది.

"ఏం లేదు, ఎక్కడినుంచో గాలివచ్చి..?"

"నాలుగుగోడలసందునా గాలి ఎల్లా విసురుతుంది?"

"విసరదు --- మసలుతుంది."

"మసలేగాలికి అంత అదరిపాటుతనం వుండదు."

"ఐదవతనంతోపాటు అదరిపాటుతనమూను..."

"ఐదువరాలిచ్చిన ఆ ఐదువరాలి పేరేమిర.."

(శకుంతల ఎంతో బాగా పాడుతుందని చెప్పడం మరచిపోయినాను)

"శకుంతలతో యతికి - ప్రతిగా ఇలా కొంటెగా మాట్లాడటం చాలా సరదాగానేవుంది. ఆ పిల్లదానికి అసలు కుళ్ళు ఎక్కడ అర్థమయిందోనని దిగులుగానూ ఉంది.

"నా గంద్రగోళం ఏమీ గమనించకుండా, శకుంతల సారంగపాణిచరణాన్ని మరో రెండుసార్లు సాగదీసి...

"తలుపుదగ్గిర నిలవేసి బ్రతిమాలితేగాని చెప్పవల్లే ఉంది..." అని నవ్వుతూ మూరాంచేసే పోణిమిలో నా చెయ్యిపట్టుకుని గుమ్మందగ్గిరకు లాక్కువస్తూంది. ఇద్దరము వెక వెక - పక పక లాడుతున్నాము...

"గుమ్మం రెండు రెక్కలూ దూదిపింజలులాగా చెరో చెంపకు ఎగిరిపడి, పుస్తీలను బాదుకుని లబ-లబలాడినవి...

"నమిలి మింగేసేటట్టు మా ఆవిడ కణకణలాడుతూ నిలుచుంది, ఎదురుగుండా..."

"మాటలతో అయితే, ఎంతసేపు తర్జనభర్జన జరిగేదో, అవును కాదూలు ఎన్ని ఆవృతులు తిరిగేవో, ఎన్ని తిట్లు ఒట్లు గాలిలో కలసిపోయేవో, సర్వత్రా ఎంత హైరాను చెలరేగేదో?...

"కాని మాటలకు అలవికానిశక్తి, ఒదుగు మౌనానికి ఉంది..మాటలు అర్థంలో ఆవగింజంత పాలును పలుకుతవి- మౌనం కొండంతదాన్ని ముక్తసరిగా ఉద్ఘోషిస్తుంది..."

"రెప్పపాటంతటిలో - పొంగి పొరలిన మౌనం. శకుంతలకు సంగతి అంతా విప్పి చెప్పింది...

"వదినా!...అన్నది, కలలలో మూలిగినట్లు...శకుంతల.

"చెల్లాయి" - అన్నాయి, నవ్వుగా మా ఆవిడ పాపపు పెదవులు...నా తల పాతాళంలోకి క్రుంగిపోయింది...

"ఎన్ని యుగాలకో, నేను మళ్ళా తెప్పరిల్లి, తలఎత్తి చూసేటప్పటికి...మా ఆవిడ మొగమే చూశాను: శకుంతల...లేదు.

"పొరపాటున తలుపు తోశానండి" అన్నది ఆ ఇల్లాలు. నా బాధ పరమాత్ముడికైనా అర్థంకాదు... నదురూ బెదురూ లేకుండా అన్న ఒక్కముక్క నన్ను రాక్షసుణ్ణి చేసింది. మెడ నులిమేస్తే - మెదడును కసకస నమిలి తినేస్తే - ఏంచేస్తేమటుకు ఏం లాభం? - ఏం చేసినా ఒక్కటేగా అయేది? - చచ్చి ఊరుకుంటుంది. కానీ, రౌరవంలోకి శాశ్వతంగా ఈ అబద్ధాన్ని వెంటపెట్టుకుపోతుంది...ఆ రాకాసిని హతమార్చడానికి భయపడ్డాను--

"శకుంతల నా కంటికి అగుపించలేదు.

"నిన్న ఎవడినో తీసుకుని లేచిపోయింది-

"ఈ శుభవర్తమానం మా ఆవిడనోటిమీదగానే తెలిసింది--

"శకుంతల మా ఆవిడకు ఉత్తరం వ్రాసిందిరా: అందులో పంక్తులు చింతనిప్పులయి మండుతున్నాయిరా...

"వదినా, అన్నయ్యను వరించాననుకున్నావు కాదూ?– నీకు అలా రాసిపెట్టిందిగాని, అలాటి కోతిమొగాన్ని కట్టుకోవలసినకర్మ నాకేంపట్టిందమ్మా? ఏరి కోరి నా యిష్టం వచ్చినవాడితో నేను లేచిపోతున్నాను

"నీతో మాట్లాడటమంటే సరదా; నీతో సరసమాడటమంటే సరదా, నీవంటే నాకు తగనిసరదా–

"నీవు ఏమనుకొనిపోతావో అని, నీ మనసు ఎక్కడ నొచ్చుతుందో అని. నీకోసం, ఆయన్ని అన్నయ్యా అని పలుకరించేదాన్నికానీ, మీ ఆయనంటే నాకు తగని రోతసుమీ! ఉన్నమాట అన్నందుకు ఉలికిపడ్డావా వదినా?"

"ఈ ఉత్తరం చదివి మా ఆవిడ ఏనుగునెక్కిందిరా! నా విషయంలో లేనిపోనివన్నీ అనుకున్నందుకు ఎంతో కించపడ్డదిరా–మా కౌగిలింతలో నలిగి మన్మధుడిదుంప తెగిపోయిందిరా–

"ఏమీ అనలేక...ఏమీ చేయలేక, ఆ బాహుపంజరంలోంచి ఎలాగో తప్పించుకువచ్చి యిక్కడ పడ్డారా–"

––లక్ష్మీకాంతం అయోమయంగా నిట్టూర్చి... పక్కకుదరనివాడిలాగా కుర్చీలో కొంతసేపు యాతనగా అటూయిటూ మసిలాడు. గాజుకుప్పెలో కురుదలతీర్థాన్ని సేవించాడు...క్రమంగా మొగంలో వేడి–ఎరుపు దిగిపోయింది: మనిషి తేరుకున్నాడు

"శకుంతల నాకోసం ఎంత త్యాగం చేసిందో చూశావా?" అన్నాడు స్వగతంగా.

"నా కాపురం చెడిపోతుందేమోనని, తన పరువును, తనవాళ్ళపరువును నట్టేటకలిపింది. ఇలా చేయకుండా, ఇంటిపట్టునే ఉండి, ఎన్ని ప్రమాణాలు చేసినా, మా ఆవిడ...నమ్మదని శకుంతలకు తెలుసును. కానీ, ఎంతపని చేసిందిరా, వెర్రిపిల్ల! నా కాపురం తగులడిపోతేమాత్రమేం, వెయ్యేళ్ళు వర్ధిల్లాలిసిన బంగారుతల్లి..."

"ఇదంతా మీ ఆవిడమీద అభిమానమేమో..."

"ఆc...వల్లకాదు: ఆవిడంటే శకుంతలకు తగని అసహ్యం...నాకోసమని ఆవిడని మెచ్చుకుంటూ ఆ అబద్ధాలన్నీ వ్రాసింది...సరేకాని, ఇప్పుడు ఏమిటి చేయటం?.."

లక్ష్మీకాంతం ఉరిమిచూస్తూ ప్రశ్నించాడు, పదేపదే ఏం చెయ్యమనడానికి నాకేమీ పాలుపోలేదు... సలహా ఇవ్వకుండా ఊరుకునేందుకు అంతకన్నా వీలులేదు ఆ స్థితిలో.

"ఇంటికిమాత్రం వెళ్ళను ఇహ, ఏమయినాసరే. మా ఆవిడ భూతంలా పట్టుకుంటుంది. అది పతివ్రతకావడంకూడా నా ప్రాణానికే వచ్చింది ఎర్రగా బుర్రగా ఉన్నవాణ్ణి ఎవడినన్నా తీసుకొని లేచిపోదేం?"

నాకు నవ్వువచ్చింది. కానీ, వాడిబాధ అర్థమైంది...

"పోనీ, అలా సలహాయివ్వరాదూ?" అన్నాను... ఆలోచన చెపుతూన్నట్టు.

"చెపితే నవ్వుతుందిరా..." వాడి అవస్థకు తగనిజాలి వేస్తూంది. అమాయకుడికి అతి తెలివితేటలు వున్న పిల్లను యిచ్చి పెళ్ళిచేయడం ఎంత అనర్థమో నాకు ఇప్పుడు బోధపడింది...

"ఏంరా, పాపపరిహారార్థం...నేను చెప్పినపని చేస్తావా?" అన్నాను: వాడు ఎగిరిగంతేసినంత అప్రమత్తుడయినాడు.

"ఎవరితెనన్నా కుర్రదాన్ని వెంటవేసుకొని కొన్నాళ్ళపాటు తీర్థయాత్రచేసిరా..."

...నేను వెక్కిరిస్తున్నాననుకున్నాడు...

"నిజంగానే చెపుతున్నాను భాయీ; శకుంతలకు అపచారం చేశాననుకుంటున్నావు కానీ, నీ స్థితి మరీ శోచనీయమన్న సంగతి మరచిపోతున్నావు మీ ఆవిడ దృష్టిలో నీవో పసిపాపవు: పిల్లాడిని గారాబం చేసినట్టు చేస్తూంది: తల్లిలాగ పెంచుతూంది. నీ యిల్లాలు నిన్ను వల్లుతూంది— ఇది నీ మగసిరికి పరువా? శకుంతలకు ఏదో నీవల్ల అపచారం జరిగిందనుకుంటున్నావు. కాని, నీవు ఎంత అర్భకుడివైపోతున్నావో ఆలోచించడంలేదు...మడిగట్టుకుకూర్చున్న మగవాడిమీద ఆడదానికి మమత ఉండదురా – మొగుడు కొరగానివాడయితే, ఇక ఆ యిల్లాలి ఆనందానికి పట్ట పగ్గాలుండవు. తనకు దక్కక పోతున్నాడనే బాధతో ఆమె మైమరచి పులకరించుతుంది. తన కాగిలిలోకి లాక్కునేందుకు మన్మధుడూ, వసంతమాధవులూ ప్రసాదించిన వలలన్నీ పన్నుతుంది...ప్రేమిస్తుంది.

"శకుంతలకు వున్న తెగింపైనా నీకు లేకపోతే ఎలా?–లే, ప్రయాణంకట్టు!"

ఆకు నందకుండా, పోకను పొందకుండా, కోమటి పురాణంలాగా దీర్ఘోపన్యాసం చేశాను... లక్ష్మీకాంతం నాకు గుడ్లువప్పగించి చూస్తూ కూర్చున్నాడు.

"అయితే, యింతకూ నన్ను ఏం చెయ్యమంటావు?" అన్నాడు, ఎప్పటికో తెప్ప '"

"ఏం చేసినాసరే...కానీ, యిలా హాలాహలం మ్రింగుతూ కాలం గడపటం మాత్రం వద్దు..."

"త్రాగకపోతే, శకుంతల జ్ఞాపకం వస్తుంది...త్రాగితే...మా ఆవిడ చేసిన ద్రోహం జ్ఞాపకం వస్తుంది...త్రాగి మరచిపోదామనుకున్నాను...అదీ సాగడంలేదు..."

"త్రాగుదామనేసంగతి మరచిపో..అప్పుడు ఇద్దరూ జ్ఞాపకంరారు..."

"మా ఆవిడ నన్ను మరచిపోయినా బాగుండును.."

"నిన్ను మరచిపోతే, ప్రొద్దుపోవడం ఎలా?... ఎక్కడున్నా వెదుక్కుంటూ వస్తుంది..."

"అవును, అది అంతదీ ఔను"

...నేను 'అలాగా' అని తలఊగించాను.

—సంజెవేళ అవుతూంది: ఇద్దరమూ అవీ యివీ తిని కాఫీపుచ్చుకుంటున్నాము. లక్ష్మీకాంతంభార్య లోపలికి చక్కావచ్చింది. ఆవిడను చూసీచూడటంతోనే మన ధీరుడు కుర్చీతో సహా గజగజలాడిపోయినాడు. కేవలం పిల్లి అయిపోయినాడు

—"సినీమాకు వెళదాం, రండి" అన్నది కోమల స్వనంతో, పల్లెటూరి బడిపంతులు అదమాయింపుతో.

"నాకు...ఒంట్లో ఏమీ బాగుండలేదు...." అన్నాడు నీరసంగా.

"మరి ..బీచికి పోదామా?"

"నాకు...మనసేమీ బాగుండలేదు."

"అలాగా?..అయ్యో పాపం! అలా అయితే ఎక్కడికీ వద్దు, యింటికే పోదాం."

"...నీవు వెళ్ళు: నేను కొంచెంసేపుండి.."

——చేయి అందిచ్చి, పసివాడినిలాగా పొదివిపట్టుకుని నిలవేసింది; వెళ్ళివస్తామని నాతో చెప్పి, మెల్లిగా సందిట నడిపించుకుంటూ వెళ్ళి, కారులో కూర్చోవేసింది... డ్రైవరులో, ఫలానా సినీమాకు పోనీమంది.

...మలుపుతిరిగి మాయమయేదాకా కారువెన్ను పరధ్యానంతో పరకాయించిచూస్తూ... మెట్లమీదనే అలా నిలవబడిపోయిఉండి, లోపలికి వెళ్ళిపోయినాను

...ఖాళీసీసాలు, గ్లాసులూ ఉగ్గుగిన్నెలులాగ తోచినవి వాడు ఇందాకటినుంచి కూర్చున్న కుర్చీ ఉయ్యాల్లై...పొత్తిళ్ళలో పట్టుకుని, ఉంగా-ఉంగా అంటూ, కాళ్ళూ చేతులూ తొట్టెగిలకలకు వేసి కొట్టుకుంటూ, తల్లి ఆశాశపెట్టే గిలకపండు అందుకునేందుకు వంకరచేతులు పిడికిళ్ళతో జాపే ఆముదపు గుడ్డలులాగా. కందగడ్డలాగా ఉన్నాడు లక్ష్మీకాంతం...అవును, కొన్ని జీవితాలకు ఎప్పటికీ పురుడు వెళ్ళదు.

——మొన్న ఈనడుమ ఎప్పుడో...ఆల్బర్ట్ హాలులో భరతనాట్యం చూస్తూంటే... అవతల ఆ చివర కూర్చునిఉన్నారు...దంపతులు. ఇద్దరూ చిలకాగోరింకలలాగ నవ్వుతూ తుళ్ళుతూ కిక్కిరిసికూర్చుని తదేకదీక్షతో ప్రదర్శనంలో నిమగ్నులైనారు...

లక్ష్మీకాంతాన్ని చూసి, ఎక్కడ జాలిపడతానో అని.. భయమేసింది ..

★ ★ ★

# తార్కికరక్ష

డాక్టరు, కథలాగా చెపుతున్నాడు.

ఏ కులం అయితేనేం?... ఏ వర్ణంవారిలో అయినా అంత ఆసాములున్నారు. అంతకు మిన్నగా మెదడులేని సాములున్నారు. అదుగో అప్పుడే అంచనా వేస్తున్నావు నాకు తెలుసునే... యింతకూ ఆ కాళ్ళకూరి రాయడు చేశాడు ఆ జాతిని అంత చులకనగా...నీవు ఎవరని అనుకున్నా...నేను చెప్పే కథకు ఏం లోపం రాదు...

వేసీ వేయకుండా ఉన్నస్థితి...పెద్ద ఖాతా: ఆయనకు అల్లారుముద్దుగా...పోనీ కాకిపిల్ల కాకికే ననుకో...లేక లేక ఒక్కడు...ఒక్కడంటే ఒక్కడు. కట్టుకుపోయినంత ఆస్తి–బొడ్డూడక ముందే పెళ్ళికూడా కాక తప్పదు కదా?– అయినందువల్ల మునిగిపోయిందేమీ లేదనుకో – అవతలా ఎత్తుకెత్తు ఖరానాదారులే: అక్కడ ఒక్కతే పిల్ల...వియ్యం సరిగ్గానే కుదిరింది.

అన్నీ అంత సలక్షణంగా ఉండి...మరి కన్నులు ఉన్నందుకు ఏమిటి ఫలం? – ఏమిటంటావు...చక్కగా చిలకా గోరింకల్లాగ కొడుకూ కోడలూ నిద్రకళ్ళతో మేడ దిగి వస్తూంటే...తెల్లవారి లేవగానే చూస్తే... యింకా అంతకన్న జన్మకు ఏం కావాలి?

ఏం తెగులా వాళ్ళకు?...ఒళ్ళుపొగరు కాకపోతే నిద్రలేవగానే మొగం కడుక్కుని క్రిందకు దిగలేరూ?

'నీ మొగంలే...నీ అంత ఆలోచన వాళ్ళకులేక...'– 'అవును: మరచిపోయినా నులే...వాళ్ళకుకూడా మెదడు ఉంటుందనుకుని...' – 'మూాయవోయ్ భాయ్! ఉండబట్టే...యింత కాండ నడిచిందనుకోరాదూ?'

ఏం జరిగిందనుకున్నావు ఏమిటి?–

ఆ ఆసామీకి...అంటే, పిల్లవాడి తండ్రికి అన్నమాట...గుడినీ గుళ్ళోలింగాన్నీ గుటకాయస్వాహా అందామన్నంత దెత్తి: అయినా, ఎంత ఉన్నా అవతల కలిసిరాబో తూంటే అదేం చేదా, విషమా వద్దనుకునేందుకు...అందులో అతడికా?...అవతల సరే, ఒక్కతేపిల్లని ముందే విన్నవిస్తిని కదా... దాని కడుపున దైవం రక్షించి ఒక్క కాయకాస్తే...యిక కోటలో పాగావేసినట్లే...అక్కడిది ఒక్కరేజా ఎటూ బెసగదు: కాకపోతేనో అంటే ఎందువల్లనైతేనేం...ఏ నాలుగు సంవత్సరాలదాకానో, ఫలించక పోవడమే సంభవించే పక్షంలో గట్టి చిక్కురాక తప్పదు. పిల్లదాని మేనమామకు పెళ్ళియీాడు వచ్చే కూతురు ఉంది: ఎక్కడనుంచన్నా ఓ పిల్లవాడిని తెచ్చి ఆ యింట్లోపడేసి వాడిచేత కూతురికి ముడేయించుదామమని శకుని పన్నాగాలు పన్నుతున్నాడు. కనే పెంచే యోగం లేకపోయినా...ఆ యిల్లాలు కాదని గట్టిగా ఎల్లా అనగలదు?...అన్నకూతురు కోడలు అయితే...అక్కరలేదు తోసి రాజంటుందా?–

ఆయన అటూ కాదు యిటూ కాదు: అదే వచ్చిన చిక్కు, తీరా భార్యపోరు పడలేకనైతేనే అనుకో...సరే అంటే... కూతురికి సగం యిచ్చినా తలిమ్మా సగం పరాయియైపోవడంలే?– సగం అయితే ఎవరికి కావాలి?– అంతా ముద్ద ముద్దగా వచ్చిందంటే అరానా ఘరానా–

పిల్ల వ్యక్తురాలు అయిందన్న ఖబురు తెలిసినప్పటినుంచీ...మామగారు పెద్ద డైలమాలో పడ్డాడు...తోచిన దేవుళ్ళకల్లా మొక్కుతున్నాడు – పిల్లవాడికి సందులేకుండా అలవైన చోటల్లా రక్షలూ రాలుగాయలు కట్టించాడు. ఏ ఒక్క రాయైనా గురికి తగలకబోతుందా అని...ఎందుకీ ప్రయత్నం యీవత్తూ? కోడలు కాపురానికి వచ్చీ రావడం తడవుగా మనమడు కడుపునబడేటందుకు!

అలా దైవంమీద భారంవేసి ఊరుకున్నా ఏలా ఉండేదో? – అతి ఆశకు పోయి...దేశమంతా గొడ్డుబోయినట్లు – మన శాస్త్రులను 'యింకా ఏంచేస్తే బాగుంటుంది?'– అని అడిగాడు: అంతటితో... మునిగింది.

ఆ మహానుభావుడు చెప్పిన సలహా ఏమి టనుకున్నావు...'ఎందుకైనా మంచిది, కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు– మనవాడి నిర్వాహకంలో ఈషత్తు లోపం ఉన్నా– మనం కనుక్కోలేకపోవచ్చును– కాని ఫలం శూన్యం–అందువల్ల, యింకా నాలుగునెలలు వ్యవధి మెలికలాంటి సానికూతురును ఏదో ఓ ధరకు సగటు మొత్తంమీద కంట్రాక్టు మాట్లాడి అక్కడ మీ వాడిని చదవేద్దాము. తిరుగుడులన్నీ అప్పటికి క్షుణ్ణంగా తేల్తాయి: యిక మనం నిశ్చింతగా ఉండవచ్చును...' అని నచ్చజెప్పి – ఏడి తస్సాదియ్యా – అన్నంతా జరిగించాడు–

సరే–నాలుగు నెలలపాటు – శాంత లేదూ...మద్దెల సుబ్బన్న రెండో కూతురు...అది!... దానికి వచ్చిందంతా నూరిపోసింది. తరువాత ఏమైతేనేం దాని ముండామోసిరి–ఏనాడో వాడు సుకృతం జేసుకున్నాడు గనుకనే ఆ గడప ఎక్కడం ప్రాప్తమైందనుకో!–ఆహా...కుర్రాడైనా అప్పుడే అంత ఎన్నికలోకి వచ్చింది–సొమ్ము గుంజలేదా అంటావా–సొమ్ము...వాడి తాతగాడిసొమ్మా...! అక్కడ కలసివచ్చే లప్ప! తాహాతుకొద్దీ తైలం–అస్తాం తావతు...అది వీళ్ళను ఏమాత్రమూ వంచనవేసి గుంజకపోగా...పిల్లవాడికే ఎరఎక్కి...దోసిళ్ళాది వాళ్ళయింట కుమ్మరించాడు – పాపం కాబోయే పెళ్ళికొడుకును తరఫీయతుచేయడానికి అది పడిన పాటుకు ఏమిచ్చినా రుణం తీర్చుకోలేరనే అనాలి:

ఇలా సర్వవిధములా...సంసిద్ధులైనారు...పెళ్ళికొడుకువారు.

సుముహూర్తము–

మాంచి...క్రోనోమీటర్ జాతిలోది – కరుకైన గడియారం పిల్లవాడికి చేతికి కట్టారు. ఒక్క సెకను అటూ యిటూ వారగాకుండా...సరిగా వేళచూసి ఓపికపడితే ఆ క్షణంనుంచీ లెక్కవేసుకోగా పదోనెలలో పిల్లవాడు...పిల్లవాడితండ్రి కాకబోయేపక్షంలో...అన్ని సంవత్సరాలూ కష్టపడి కాశీలో నేర్చిన విద్య అంతా... ఒక్కగంతులో తిరిగి వెళ్ళి గంగలో కలిపి వస్తానని కార్తాంతికుడు...మీసంమీద చెయి వేసుకున్నంత భరవసాతో శాసనంగా చెప్పాడు: వియ్యంకుడికి కొండలపెట్టుగా ఉంది ధైర్యం. హాయిగా విందుగుడిచి...ఫలప్రదానాలూ, పాలు త్రావించడాలూ ఆ

వేడుకలలోనుంచి తెరపిచేసుకుని బయలుదేరినతరువాత – భార్యా తానూ...ఎన్నాళ్ళ క్రిందనో ఉడిగిపోయిన పోడుములన్నీ సంతోషం సత్తాకొద్దీ వాడుకచేద్దామని ఉబలాటపడి...ముసలినిద్దురపోయినారు:

కోడికూసే మామూలు వేళకే మేలుకుని...వియ్యాలవారింటికి వెళ్ళాడు...తెల్లవారింది–

కొత్త పెళ్ళికూతురు – గుమ్మానికి ఎదురుగా లోపలి నడవలో కూర్చుని...బోలుగా ఉన్న పెద్ద పొట్లాంలోంచి బూందీపలుకులు వెదుక్కు తింటూ...చూసి, లేచి లోపలికి ఒక్క గంతువేసింది.

పిల్లవాడు యింకా గదివిడిచి రాలేదని ఎదురై వియ్యంకుడు చెప్పాడు ..ఒకరినిచూసి ఒకరు కోరగా – నవ్వుకుని...ఆ మాటా యీమాటాలోకి దిగారు. కాఫీ ఫలహారం – భోజనాలూ...

ఆవాళ ఉదయమే...నఖశిఖపర్యంతమూ ఎగాదిగా...తూచాతప్పకుండా పరీక్షవేసిన ఘనాపాఠీ... పెళ్ళికూతురు ఎదుటనే నలుగురు అమ్మలక్కలతోనూ పెదవి విరిచింది. అల్లుడు మేధకుడు కనుక అంతగా తొందరపడలేదో ఏమో అనుకునీ.. మళ్ళా ఎవరికివారు సర్దిచెప్పుకుంటూన్నారు...ఆవాళ... మరునాడు...ముసుగులో గుద్దులాట ఎక్కువౌతూంది కాని, పొక్కడానికి వీలుపడకుండా... ముందున్నదేమో ముసళ్ళ పండుగ–అని కొంత చోద్యంగా ఆదుర్దాగా కనిపెట్టుకుని వున్నారు – ఏం లాభం? పిల్ల చెక్కు చెదరందే!

వియ్యంకుడిదాకా పాకలేదు – పిల్లదాన్ని యింటికి తెచ్చుకున్నారు...రకరకాల మిరాయీలతో తెప్పతేలించి...మూడు నిద్దురలూ కాగా...పుట్టింటివారు తీసుకు వెళ్ళారు...వైశాఖంలో కాపురానికి తీసుకవస్తే...సూడిదలూ...ఆ హంగామా.. తొలిచూలు గనక ముచ్చటకాదూ...అందులో ఆ రవంతమీద అంతా ఆధారపడి ఉన్నప్పుడు...

పిల్లది... వెలుపల ఉన్నదని తెలిసేటప్పటికి మామగారికి...కొడుకును నమిలి మింగేద్దా మన్నంత కోపం వచ్చింది. తన కడుపున అలాటి అప్రయోజకుడు ఏలా పుట్టాడా అని కన్నవారిని ఉన్నవారినీ అందరినీ కలేసి అహోరాత్రము ఏకదిగిని మనసులో తూర్పారబడుతూన్నాడు. ఎంత ఖర్చుచేశాడు, ఎన్ని ఆలోచనలు చేశాడు... అంతా బూడిదలోపోసిన పన్నీరేనా? – తోటివాళ్ళందరూ చూపించకముందే అందుకుపోతూంటే ..ఎందుకు, ఏమన్నా ఏం ఫలం? – దక్కించుకునే వ్రాతలేదేమో ఆ దౌర్భాగ్యుడికి...

కాని... అప్పుడే నిలవేసి అడగడానికి వల్లకాదు – యింకా కొద్దిరోజులు ఓపికపడితే... అప్పుడు నిలవేసి "అబ్బీ! ఏమిరా?" అని అమీ తుమీ తేల్చుకోవచ్చును. అని తనకుతానే సమాధానపడి అక్కసు అంతా దిగమింగుకుని ఊరుకున్నాడు – కనిపెట్టి చూస్తున్నాడు: ఒకందుకు మెరుగే! ఊళ్ళోసంబంధం అయినందుకు రోజూ పిల్లవాడు నాగా లేకుండా సంజెబడకముందే భోజనంచేసి అత్తవారింటికి వెళ్ళి తెల్లవారి వస్తూంటాడు. చూడగా చూడగా...వాడూ ప్రయత్నలోపము చేస్తూన్నట్టు తోచదు... ఇంతకు ఏమికానున్నదో–

ఒక రోజున వియ్యంకులిద్దరూ బజారులో కలుసుకున్నారు. ఓహో అంటే ఓహో – ఉభయకుశలోపరి–

"మా అల్లుడు ఊళ్ళో లేడా?" అన్నాడు అవతల ఆయన...ఇవతల యిక్కడ గుండె ఎందుకో గతుక్కుమని "ఏం, అలా అడుగుతున్నారు బావగారు" అని నవ్వబోయినాడు. "ఏమీలేదు, చూసి చాలారోజులైంది – పోనీ మా వల్ల ఏమన్నా అపరాధం ఉన్నా – మాకోసం రాకబోతే మానె – తన సొత్తు ఉన్నదికదా–" వింటూన్న కొద్దీ చూచాయగా ఏదో మునిగిందని గోచరించినా దేవాంతకపు చెయ్యి గనుక అప్పుడేమీ వెలితిబడకుండా "ఏమిటోలెండి...చిన్న తనమా, బిడియపడుతున్నాడేమో; నేను కనుక్కుంటానుగా. మీవల్ల అపరాధమా? ఎంతమాట!– మీరొకటీ నేనొకటీనా...మీరేమీ మనసులో ఆలాటివి పెట్టుకునేరు గనుక.." అని సర్దిచెప్పి కణకణలాడుతూ యింటివేపుకు వురికాడు.

తీర్చిదిద్దుకుని...వెళ్ళిపోబోతున్నాడు, దీపాలు పెట్టారో లేదో అప్పుడే కొడుకు. ఆ కోపంలో, అదివరకున్న అపేక్ష అంతఃకరణలన్నీ, ఒక్కమారు తుడిచిపెట్టుకుపోయి, ఆ నిమిషంలో వాడి ముఖం కోతిగానూ, వాడు సర్వవిధములా శుద్ధ వెధవగానూ తోచింది. రేగింది చూసుకో.. హడలగొట్టేసి నిజమేమిటో నిలుచున్న పాళాన కక్కించాడు. విని, నిలుచున్నచోటే కూలబడ్డాడు. నసాళానికి అంటిందనుకో.

ఏమిటనుకుంటావు? – పిల్లవాడు రోజూ నిదురచేసేది ఎక్కడో తెలుసునా? – అత్తవారింట కాదు. అల సానిదాని–

అక్కడ కాదు వచ్చిపడ్డది చిక్కు! అభం శుభం తెలియకముందు పట్టుబలవంతాన పిల్లవాడికి ఒక ఒరవడిపెడితే ఆ ఓం నమశివాయే ఒంటపట్టిపోయింది– ఇక లక్ష చెప్పు వేయి చెప్పు యింకోటి ఎక్కదు.

వ్యాఖ్యానిస్తాను: పిల్లవాడు అన్ని విధాలా మాంచి పకడులోనే ఉన్నాడు – అలాటి లోప మేమీలేదు. ఒక్కటే ముఖ్యలోపం–పెరిగి పెద్దవాడై–రెక్కలు వచ్చేదాకా వాడి మానాన వాడిని విడిచిపెట్టకుండా – మెడలూ నడుమూ బలవంతాన విరిపించినందువల్ల ప్రమాదం జరగవలసింది. కాని ఆలాటిది గడచాడు. అయితే పులిమీద–పుట్ర పంజాయించింది. సెక్సు–అంటే వాడికి సంబంధించినంతవరకు సుబ్బన్న పుత్రిక–అనంగ సర్వస్వం అని మనోవాక్కాయాల –గాయంగా రూఢిపడిపోయిన ఒరవడి, ఒక్క పెళ్ళాన్నే కాదు, రంభను తీసుకువచ్చి దాఖలుచేసుకో...కుఛ్ నహీ హోతీ...హోసక్తీ.

ఇందాకా గ్రంథం పెరిగిన తరువాత, ఏమిచేయడం అని నా సలహాకోసం వచ్చాడు: కాళ్ళావేళ్ళా పడి బ్రతిమాలాడు. ఎంతైనా యిచ్చుకుంటాను, కావాలంటే ముందే పుచ్చుకోమన్నాడు. ఎలాగైనా పిల్లవాడి మనసు, ఒళ్లు పెళ్ళాంవేపుకు మళ్ళించి–"

'ఇదీ కథ' అన్నట్టు, డాక్టరు సిగరెట్ ముట్టించుకుంటూ వంచిన తల ఎత్తకుండానే పొగమీదుగా కనుబొమలు ఎగురవేశాడు–నేను, పొగ గుక్కపట్టి...సిగరెట్ నేలవేసి కాలనురాస్తూ, గిరగిరగా–రింగులు చుట్టించాను.

"ఏమిటిచేయడం?" అన్నాడు డాక్టర్.

"చేయడానికి చాలా ఉన్నాయి ఏది వీలవుతుందా అనే ఆలోచనేకాని---"

"అంటే .."

"అయితే అక్కరలేదులే...మెదడు అనవసరంగా వేడెక్కించుకోబోకు. మనం యింతకుపూర్వమే ఆ ఆలోచనలన్నీ చేయడం. ఏదీ చేయడానికి వీలులేకపోవడం చేసినా ప్రయోజనం కనిపించకపోవడం... అంతకాండా జరిపే ఊరుకున్నాము: – అంటే, నేనూ ఆయనాను"

"ఏం చేశారో సెలవియ్యి"

"చేయడం నేను కాదులే...మనది సలహామటుకే. అవతల, బంద్ అయితే, ఏలా ఉంటుందోనని – ఇకనుంచి నీ గడప తొక్కనీయవద్దని – అక్కడ కట్టుదిట్టంచేసి – అయినా సానిదాని నిజాయితీ ఏమిటి.. ఎన్ని దోవలుంటాయి రప్పించుకునేందుకు అని...పిల్లవాడితండ్రి ఒక్క మండలందాకా.. శాంతను వెంటతీసుకువెళ్ళి మదరాసులో కాపురం పెట్టాడు: ఉన్న ఊరులో అయితే.. ఎప్పుడూ సానికొంపలో పడి ఉండటానికి వీలులేని ఘరానాతనం ఒకటాయెను. అక్కడైతే ఎవరు చూడవస్తారు?–ఇక్కడ యీలోపుగా పిల్లవాడి మనసు మారగూడదూ?– సరే, అది ఫెయిల్ అయింది పెళ్ళికొడుకు, యింటిదగ్గర మడిగట్టుకు అలాగే కూర్చున్నాడు కాని. వీసం ఎత్తు మారలేదు.

'కడుపు ఫలించడం కదా కావలసింది, సైన్సుచూపిన దోవను ఏదన్నా సదుపాయం చేదాం అనుకుంటే అక్కడ ఒక ప్రతిబంధం ఏర్పడ్డది మనం తెలివితేటలన్నీ వినియోగించి పిల్లదాన్ని ఒప్పించినా తీరా పిల్లవాడు భారసాల పీటలమీద కూర్చోకపోతే? – అందుకని ముందే వాడిని కదలేశాం---అనుకున్నంతపనీ అయింది. వాడూ మొత్తంమీద రాటుదేరాడు–నేను చెప్పిందంతా విని "ఏమండీ నా ప్రమేయం లేకుండా నా పెళ్ళాం నీళ్ళాడితే–పక్క నే నెందుకండీ – మీరంటూన్నారే ఆ టెస్ట్ ట్యూబ్ కే పీట వేయండి" అన్నాడు తిప్పికొట్టాడు కదా అని ముఖం జేవురించుకున్నాను. కాని మనసులో 'శహబాస్' అన్నాను–

తండ్రి కత్తులు నూరడం మొదలుపెట్టాడు: వాడిని వెళ్ళగొడతానన్నాడు –– పైసా దక్కనీయనన్నాడు – – చూసుకో వాడిని ఏం చేస్తానో, అని నిమిషానికి నిలివెడెత్తుగా ఎగిరాడు: కాని, నేను నిదానంగా సర్ది చెప్పాను – "నీవు మెదలకుండా చూస్తూ ఊరుకుండటం మేలు. అలా కాకుండా హంగామా చేశావా అంటే –– నలుగురికీ యీ విషయం తెలిస్తే ఎదురు నీ నెత్తిమీదికే తెచ్చుకుంటావు. అతి ఆశకుపోయి బంగారంలాటి కొడుకును చెడగొట్టావు అని పొక్కిపోతే యిక పైసాకు చెలామణీకావు. తలఎత్తుకుని తిరగడానికి వీలుండదు: యిప్పుడు---యిహా ఎప్పుడూ నీ మానాన నీవు ఉంటివాయెనా – నీవు యిచ్చినా ఇవ్వకపోయినా – అవతల సగం ఏలాగూ రానేవస్తుంది కదా, దానితో వాడు సుఖంగా ఉంటాడు. ఎవడెవరి గీతలో ఎలా ఉంటే –– అలా జరుగుతుంది –– మనం కేవలమూ నిమిత్త మాత్రం..." యిలా కొంత వేదాంతమూ కొంత లౌక్యమూ కలిపి – అవతలవాడికి ఊపిరాడకుండా దంచి మొత్తంమీద సరేననిపించాను – యిప్పుడు అతడు పిల్లవాడి జోలికిపోడు: కోడలు – నట్టింట నలుగురిపెట్టు బంగారప్పు బరువుతో – మెలుగుతూ ఉంటుంది – లక్ష్మి ఓడిపోతూ. కొడుకు సానివాడలో

అవిచ్ఛిన్నంగా సంసారం సాగిస్తూ ఉన్నాడు – హాయిగా వెళ్ళిపోతున్నాయి రోజులు..."

"కథ కంచికి వెళ్ళినట్టేనా?" –

"పంచారించిన నీ..." డాక్టరు ఎదురుగుండా గోడమీద ఉన్న గా్రెడెజ్ కేలెండరు బొమ్మవేపు అభినయిస్తూ పద్యపాదంలో అరపాదము కూనిగాలాగి–"చుట్టూ కంచె వేసేశాం కాదూ చేనుకి —అప్పుడే ఎక్కడకు వెళుతుంది?" అంటే ఏమిటని నీవు అడగబోతున్నావని నాకు తెలుసులే–నీకు ఆ ఆయాసం లేకుండా నేనే చెప్తాను కాచుకో. అసలు నేను చెప్పనే అక్కరలేదు – యింత ఒళ్ళువిరుచుకుని కష్టపడినందువల్ల మనవాడికి ఏం లాభించింది? అని ఆలోచించినట్లయితే – బాగుండిపోను: పోనీ;

"తండ్రికీ కొడుకుకు పొత్తు కుదిరించానుకాని – ఆయన కడుపులో మంట ఓపట్టున చల్లారుతుందా? – యిప్పుడు ప్రయత్నం ఏమంటే – ఆయన ఏలాగైనా మళ్ళా ఓ కొడుకుని కని – వాడిద్వారా – పెరిగి పెద్దవాడైన తరువాత – ముచ్చటలన్నీ పూర్తిగా తీర్చుకోవాలి – అందాకా నిద్రపట్టదు. మరి యీ వయసులో పునఃపూనుకోవాలంటే – పుష్టి కట్టాలికదా. ప్రస్తుతం అందులో నిమగ్నుడనై ఉన్నాను. డబ్బు మంచినీళ్ళలాగా ఖర్చు అవుతూన్నది... అపురూప – దినుసులన్నీ మందుల్లో ఒంటపట్టిస్తున్నాను – నేడో రేపో మళ్ళా బాలకుమారుడిలాగా నున్నగా తయారవుతాడు చూడు–"

ఆహాఁ... "మీ జాతి చేతపడితే నున్నబడక తప్పదు. ఆ పాపిష్టి ద్రవ్యంలో కొంతపెట్టి – కారు కొనుక్కో."

"కారుకోసం–యింత తంటాలుపడాలా? మేడ వేయిస్తానోయి–అప్పుడే అయిం దనుకున్నావా? ముసలమ్మకు గూడా మెరుగుపెట్టవద్దూ? – యిప్పుడే ఆ మాట ఎత్తితే రెండు మోతాదులకు ఒకటే బిల్లు గిట్టుతుంది. తదనంతరంబైతేనో కారెందుకు ప్లేనే కొనేస్తాను. కొంచెం ఓపికపట్టు" – డాక్టరు మీసం అనవాలు అంత మేర మెల్లిగా తడుముకుని–నవ్వి నా కొకటి తా నొకటీ సిగరెట్

"రాబందులు నయంరా మీకన్న – ఎముకలన్నా మిగులుస్తాయి."

"కాల్షియమ్ అమ్ముకోడం, చేతగాక! కథలు వ్రాయడం, కబుర్లు చెప్పడం అనుకున్నావా ఏం? – వైద్యం అంటే."

"కాదు. అంతకన్నా ఘనమయిందే లేతసొరకాయలు విధీవిరామమూ లేకుండా ఫరఫరా తెగ్గొయ్యడం."

డాక్టరు నవ్వుతున్నాడు!

* * *

# జీ...హాఁ

సినిమా అయిపోయింది. అయిపోతుండగానే అకాశ గంట గణ-గణలాడటం మొదలుపెట్టింది. ఈలోపుగానే హాల్లో ముప్పాతిక మూడుపాళ్ళు జనాభా, తొక్కుకుంటూ, త్రోసుకుంటూ, బల్లలక్రిందా, బూడ్సులకాళ్ళక్రిందా వ్రేళ్ళుపడి కయిఁక్ మంటూ, బయటపడ్డది.. గడ్డునిదురులోనే ఉండి...భుజాన వేసుకునేందుకు అలవికాకుండా నిక్కుతూ నీలుగుతూన్న పిల్లలని కూడా, తల్లులు ఎలాగో గదమాయించి సందిటపట్టుకునో, వీలైనంతవరకూ చంకను వేసుకునో, ఎలాగో అలా జేరవేస్తున్నారు. మొదటినుంచీ కునికిపాట్లతో కూర్చున్న ముసలమ్మలందరూ, ఒక్కసారి ఫెళ్ళున ఆవలించి మేలిముసుగు సవరించుకుంటూ మెట్లు దిగుతూన్నారు...ఆద్యంతాలూ, ఫిలిం తెగినప్పుడల్లా చేగోడీ-సోడా గానంచేసిన ఛోక్రాలందరూ, దుకాణదారుడికి లెక్కచెప్పి డబ్బు వప్పగించుతూన్నారు...హాలు తలుపులు ఓ చెంపనుంచి దబా దబా మూసుకువస్తున్నవి...

సీతాపతికిమాత్రం, ఇంకా మెలకువరాలేదు. నిద్ర అనుకుంటున్నారా? దీపాలు ఆరిపోయినప్పటినుంచీ రెప్పంటూ వాల్చాడా? ఎత్తిన తలదించాడా? ఉహుఁ--

తెర తెల్లబడిపోయినా, సీతాపతి కళ్ళముందు ఇంకా...ఆ పిల్లది మెసులుతూనే ఉంది; నవ్విస్తూంది; నటిస్తూంది-

ఎవరూ లేచి వెళ్ళిపొమ్మనలేదు...కాని, రొద చల్లారిన తరువాత ఉరిమే నిశ్శబ్దం, అతణ్ణే అక్కడ కూచోనిచ్చిందికాదు.

దుకాణం దగ్గిరకు వెళ్ళాడు. ఒకటి రెండు సోడాలు త్రాగాడు. సిగరెట్లు వగయిరా కొనుక్కున్నాడు... రూపాయియిచ్చి చిల్లర సరిగా లెక్కచూసి పుచ్చుకున్నాడు. సిగరెట్టే పెదవులకు అంటించుకుని, ముట్టించేందుకు అగ్గిపుల్లే గీచాడు...ఇవన్నీ తెలిసే చేశాడా? కావాలని అనుకుని చేశాడా? -- ధ్యాస ఎక్కడుంది...?

సోడాదుకాణం గోడను ఉన్న పాతకేలెండరుమీద ఆ అమ్మాయి ఉంది....లైమ్‌జూస్ సీసా నిమ్మగుత్తుల లేబిల్‌మీద ఆ అమ్మాయి ఉంది...అగ్గిపెట్టిమీది మూడు-మామిళ్ళమీద ఆ అమ్మాయి ఉంది... ఆ పిల్లది, సీతాపతి కనుపాపైపోయింది.

రోడ్డంతా...ఆ అమ్మాయి, యిందాకటినుంచీ పదకొండువేల అడుగునా తిరిగిన తోటలూ పేటలూ...

ఒళ్ళు తెలియనిస్థితిలో ఉన్నట్లు, సీతాపతికి తెలియదు. నడవగా నడవగా, సందులూ గొందులూ తిరిగి... ఇల్లు దానంతట అదే వచ్చేసింది; ఇల్లాలు గుమ్మంలో నిలుచుని ఉంది... సద్దూ సందడీ చూసి, యీపాటికి ఆయన కూడా వస్తూ ఉంటారు కదా అని.

అల్లంతదూరాన మనిషిని చూసి, ఆవిడ మండిగందాటి లోపలికివెళ్ళి నిలుచుంది. చూసిచూసి ఇంకా రారేమా అని తొంగిచూసేటప్పటికి..ఏడీ... నడక యిల్లు దాటేసింది...

ఇల్లాలు గబాగబా రెండు అడుగులువేసి కలుసుకుని... రెక్కపుచ్చుకుంది. సీతాపతి ఎగాదిగా చూసి, అమె నడిపించినట్లు వెనక్కు తిరిగి వచ్చేశాడు

హాల్లో దీపం జ్యోతిలాగా వెలుగుతూంది. సీతాపతి కళ్ళు జిగాల్‌మన్నవి.. రెప్పలు దబదబా అల్లార్చుతూ...'మంజరీ' అని...

ఇల్లాలు పలుకదు...

'మంజరీ' అని మనసుతో– మనసంతా పిలుస్తూ... చెక్కిలిమీదికి చెయి జాచుతున్నాడు...ఇల్లాలు, ఉలకదు.

'మంజరి...మంజరీ' అని పేరుతో పేరును హెచ్చవేసి, నవ్వి...అమాంతం కౌగలించుకో బోయే హంగామా చేసింది, ఇల్లాలు. సీతాపతికి, కళ్ళు తెరిపినపడి...మనసులో తిప్పింది. పెద్ద పాటుపడ్డవాడి నిస్త్రాణ వచ్చింది....

'––ప్చ్‌––పెళ్ళాం...' అని తనమీద తాను, తగని జాలిగా గొణుక్కున్నాడు.

'హయ్యో–పాపం, అలాగా?' అని కొంటెగా విచారపడబోయింది ఇల్లాలు.

––సీతాపతి ఒళ్ళు సలసలలాడుతూంది...కళ్ళు మూతపడలేనంత కాకగా ఉంది...పక్క కుదరక తెగ మసులుతూన్నాడు...ఒకటే మూలుగు!

...సిగరెట్లు కాల్చి కాల్చి పైత్యానపడిన ప్రాణమేమో, యాక అదే కలవరింతలు, అదే ధోరణి!... ఇల్లాలు, కళ్ళలో వత్తులు వేసుకుని, తెల్లవార్లూ పక్కను కూర్చుని...,ముదాయింపుగా వెన్నురాస్తూ.. చిచ్చికొడుతూంది

తెల్లవార్లూ ఒకటే వేగి – వేగి, ఎలాగో తెల్లవారింది: ఎక్కుడేకాని, దిగుడు లేకపోయెనే: వడ్లగింజపడితే పేలగింజ అయేటట్టుంది... ఇక, అయినట్లే...

ఉన్నట్టే ఉండి, అట్టే ఛప్పున దిగజారి ఊరుకుంది జ్వరం; ముచ్చెమటలూ పోసినవి – నీరసంలోకి దించింది... ఆపసోపాలు, కళ్ళు మూతలుపడటం...

పట్టుబలవంతానా ధారకంచేసింది ఇల్లాలు' ఆ కాస్త జావ మ్రింగుడుపడిన కాస్సేపటికి తెరిపినిపడ్డాడు సీతాపతి: వార్త ప్రకారం, తలగడక్రింద తడుముకుని, వణికేచేతుల్తో సిగరెట్ వెలిగించాడు...

సీతాపతి జాడలన్నీ అద్దంలో కనిపెట్టుతూంది ఇల్లాలు.

...దగ్గాడు, మూలిగాడు..దగ్గూ మూలుగూ కలిపాడు...రాగవరుసలో కొరబో నిచ్చుకున్నాడు.. ఊహూ, ఇల్లాలు–ఇటు తిరిగి చూడలేదు...

'పిలిస్తే పలికే దిక్కు కూడా లేదు....' ఓపిక వున్నంత బిగ్గరగా కొరకొరలాడాడు. ఇల్లాలు, కుంయ్ – కంయ్ మనలేదు.

'నిన్నే మహాప్రభో!...నీకే మనవిచేసేది...' సీతాపతికి అంతకన్న హాములు చేసేందుకు సత్తువ రాకపోయింది.

'చిత్తం – చెయ్యండి...నేను ఏమన్నా కాదంటున్నానా?...'ఇల్లాలు, అద్దానికి జవాబు చెప్పింది.

'అవును, ఎందుకు అంటావ్వూ?!'... ఎదురుగుండా కూర్చున్న కుర్చీని గదమాయించాడు.

'ఏమిటా గద్దరితనం?...' ఇల్లాలు బల్లమీది సెల్యూలాయిడ్ పాపాయి చెవిపట్టుకు ఆడించింది... సీతాపతి కేఁవ్వురుమన్నాడు...'ఉంగపడతా నుండమ్మ!' అనుకుంటూ, ఇల్లాలు, కాఫీ— కషాయం సీతాపతిచేత గళ–గళ త్రాగించింది...'ఏనుగు తిన్నా వెలక్కాయ జీర్ణం... కాముడు తిన్నా కజ్జూరపండు జీర్ణం...మా అబ్బాయి తిన్నా...'

...చక్కిలిగిలికి ఉక్కిరిబిక్కిరై చేయి విడిపించుకుని...తుమ్మెద ఝుమ్ తప్పించుకునే కణ్వపుత్రిక భంగిమాలై గిర–గిరగా ఉబ్బి తబ్బిబ్బులైంది...ఇల్లాలు.

చిలిపి–పాపాయి చిరునవ్వు పెదవులమీద పొదువుకొని...అల్లా హాయిగా మళ్ళా నిద్రపోయినాడు, సీతాపతి...నిదుర మదరించి;

—అచ్చంగా అసుర–సంధ్యవేళ: 'అబ్బాయి కిదేఁనిదురమ్మా—అడ్డాల పాపలకు అదుపూ ఆజ్ఞా లేకపోతేసరి, గారాబం మీరిపోతూంది—'

...కలలకోసం మొగం వాచిపోయిన కళ్ళు, తెరిపినిపడేందుకు రెప–రెపలాడుతూన్నవి – పులి వచ్చిందంటే...' కళ్ళమీద కిల–కిలగా ఉఫ్ మన్నది ఇల్లాలు: 'కౌగిలి క్రిక్కిరిసికొంటూ' 'ఛలి'గా వణకడం బాగుండదా!' అనుకుంటున్నాడు సీతాపతి...

'ఇలవేలుపులు ఊరుకోరు...' ఇల్లాలి మనసు ఇలా ఎదురుతిరిగి...సంజెదీపం వెలిగింది.

ఎంతో లాలనగా బ్రతిమాలింది, సీతాపతి వాలకం.

'అమ్మా, ఆశేఁ...' అనేంత ఓరలైనవి ఇల్లాలి చూపులు..

—సీతాపతికి, లేనిసత్తువ వచ్చింది. మనసులోకి కలుక్కున, ఎక్కడనుంచో మళ్ళీ ఆ అమ్మాయి ఊడిపడింది: ఇల్లాలు కళ్ళకు కనిపించలేదు. అక్కసుకొద్దీ దభాలున వేసిన వీధి తలుపు చప్పుడన్నా వినిపించలేదు.

తాను నడుస్తూన్నాడో, రోడ్డున పరుగెత్తుతున్నాడో, సీతాపతికి అర్థంకావడంలేదు. కళ్ళముందునుంచి అందరూ రంయ్న పోతున్నారు...తిన్నగా పరకాయించి చూసే మందగింపు లేదు... అల్లంత ఉవ్వెత్తుగా గాలిలో నలుమూలలా, రకరకాల స్థాయిలో, ఆ అమ్మాయి నవ్వులు... ఏ తల్లో చూసినా ఆ అమ్మాయి దిద్దుకున్నట్టుగా పువ్వులు...అంతా అఁ...అ...మయం;

...పొంగి బల్లమీదపడ్డ సోడాలనురుగు–తడి మాయమౌతుంది—ఫ్లాస్కు దోసిమం టూన్నది...సిగరెట్ గుక్క గుక్కకూ మొదలంటా రగిలే కెంపు .కళ్ళ జేవురింతకు హడలి, ఒళ్ళు దగ్గిరపెట్టుకుని పొగ లూరుస్తూన్నది. నిలువెల్లా గోరువెచ్చని సలుపు, నీలుగుతూంది.

నిట్టనిలువున నిలుచోబోయినాడు. ఎదురుగుండా, బల్లమీద అద్దం తలతిరగబోయి — ఒరిగింది. ఒళ్ళు రావాకులాగా తేలి...మనసు, ఏ ఆలోచనా పెరగకుండా, ఓక్షణం దుబ్బేసిపోయి, మరుక్షణంలో అద్దమైపోయింది...పక్క గదిలో, ఖడ్గ–త్రిశూలాల ఘర్షణ అలికిడిగా వినబడుతూంది...లోపల ఎవరో పెదవులు బిగించి విరగబడుతున్నారు.

—ఎవరా తొంగిచూసింది?...ఏమో ఎవరో జాడా లేదు.

లేకేం...అదుగో తలుపువారను చీరె అంచు...కొట్టొచ్చినట్టు...ఎవరో...పక్కకు తప్పుకుంది... మళ్ళా ధళుక్‌మంది...

ఎవరో...? అజ కనుక్కుంటే? ...ఊహూ, కాళ్ళక్రింద నేల, తందనాలయేట్టుంది...

ఆలోచనలకూ...చూపులకూ అర్థం పొసగడం లేదేం?...రెప్పలు వాలలేవేం?... మనసు అల్లార్చలేనేం? నాకు నేను స్వాధీనం కాకపోతే...పొరబాటున ఎవరికన్నా చిక్కుతానేమో...అది మరీ, మరీ మొండిచిక్కు...

ఎక్కిళ్ళు వచ్చేట్టుగా ఉంది గొంతులో...కడుపు నిండుగా ఉంది...ఏమిటో—ఏమిటోగా ఉంది...

బలంగా, తలా, మొగం నిమురుకున్నాడు: మెడ నరాలమీదనుంచి కణతలవారగా, కళ్ళచుట్టూ, బొటనవ్రేళ్ళతో వికటిగివిని మాలీస్ చేసుకున్నాడు... "నాపేరు సీతాపతి" అని ఖచ్చితంగా అనుకున్నాడు...

ఆ అమ్మాయి తలుపురెక్కను ఆనుకుని, సిగలో పూలు సరిజేసుకుంటూంది. ఓరచూపులు చూస్తూంది... బొటనవ్రేలితో నేలరాస్తూంది...

—తన్ను కాదనుకున్నాడు సీతాపతి.

...కూనిరాగం సణుగుతూంది...స్థాయిని బెదరిస్తూంది-గొంతు సవరించుకుంటూంది.

—సీతాపతికి చీమకుట్టినట్టన్నాలేదు.

...యకాయకి చేరువకువచ్చేసి బల్ల అంచుని చేతులు ఆన్చి, కొంచెం ముందుకువంగి పలువరస కనపడీ కనపడనట్లుగా క్రింది పెదవి వెక్కిరింపుగా వంచింది....

—సీతాపతి చూపులు మారలేదు.

రీవిగా కుర్చీలో కూర్చుని...అతికొంటెగా, సిగరెట్ ముట్టించి...పొగ నిలువునిటారుగా గింగిరాలుగా ఊదింది. సిగరెట్ కమిచి పట్టుకున్న రెండు వ్రేళ్ళూ అతని పెదవుల దాపుకు చాచింది...

సీతాపతి నిదానంగా ఒకటికి రెండుసార్లు నుదురూ కణతలూ చిట్లించాడు. కళ్ళు బరువుగా అల్లార్చాడు. అవాళ ఎప్పుడో పోసుకున్న తలంటిలో కుంకుళ్ళనురుగు, ఇప్పుడు కళ్ళల్లోకి పోతూంది...తల తేలికనుపడుతూంది...మరీ తేలిక అవుతూంది. ఒక్కసారి ఒళ్ళు జివ్వుమన్నది... నరాలు, వాటంతట అవి ఎక్కడికక్కడ సర్దుకున్నవి.

—ఆ అమ్మాయి...

...అవును పాపం, ఆ అమ్మాయి...ఇదుగో యింద...

పచ్చకాగితం ఉండకట్టి గుమ్మంలోకి విసిరేశాడు...

ఛ్...ఛ్...ఉస్సో...

తర్జనితో...ముమ్మారు గాలిని నెట్టాడు...ఆ అమ్మాయి మొరగకుండా వెళ్ళిపోతూ, కోపం సత్తువకొద్దీ గది తలుపుమీద చూపింది...

...జుట్టు కొంచెం చెరిగినట్టు నివేదించడానికి అద్దం వినయంగా వంగింది.

—రెండు కప్పుల కాఫీ...తలవంచుకు త్రాగేశాడు... మూడు, నాలుగు వ్రేళ్ళు తడిచేసుకుని పెదవులు తుడుచుకున్నాడు...ఆకలేస్తూందనుకున్నాడు...

—మొదటిఆట సినీమా వదిలేశారే అప్పుడే?...పది దాటిందన్నమాట...మొగ వాళ్ళకన్న ఆడవాళ్ళే తెగబడుతున్నారే...అంత బాగుందన్నమాట...

హాలుదగ్గిర, అబ్బో ఎంత తొక్కిసలాట?...అందరికీ అందేవేగా టిక్కెట్లు,– కొంచెం ముందూ వెనకా!...

నెత్తిమీదనుంచి కంఠందాకా, కైవారంగా అన్నీ దీపాలే!...హన్ని దీపాల్లో ఆ ఏనుగంతమొగం... పాపం తెరమీద ఏదో పొందికగానే ఉంది. కొంతవరకూ...

ఒక్కటే రిక్షా...ఒంటరిగా, ఖాళీగా పడిఉంది... సిమెంట్ రోడ్డేమో, యింటి గుమ్మంలో దిగుదామన్నా...ఆ జోరు, మరో నాలుగు అడుగులు వేయించింది....

—ఇల్లాలు, వడియా లెలా వేయించిందో...అన్నీ మాడి బొగ్గులు: ఒళ్ళు దగ్గిరలేనప్పుడు, వాటిజోలికే పోకుండా ఉండటం మంచిది.

...ఏదో ఆలోచిస్తూంది మనసు: కుర్చీ కచ్చగా ఊపుతూంది...అవును నోరు శహబాసుగా పండింది...

బద్దకంగా ఆవులించాడు: సిగరెట్ కొడిని, గోటి మీటుతో అదల్చాడు...కుర్చీని ఊతంగా ఊగిస్తూన్నాడు.

ఇల్లాలు, పక్కగదిలో లైట్ వేసింది. ఇక్కడ దీపం టక్‌న ఆరిపోయింది.

—"...ఇంతప్రొద్దెక్కినా, ఇదేం నిద్ర?...ఇదేం లోకం?...మరీ కొరకరానికొయ్య అయిపోతూందేం?..." అత్తగారు క్రింద సాధిస్తూంది.

నవ్వు దాచేసుకున్న మొగంతో, ఇల్లాలు చెక్కిళ్ళు అద్దుకు దిద్దుకుంటూంది...అద్దం నిర్మొగమాటంగా, గోరంతలు కొండంతలుచేసి, గుట్టుచిక్కించుకు విసిగిస్తూంది.

...సరసనుకూర్చుని, మీదకు ఓ చెంపగా ఒరిగి...గాజులజతలు ఒరసుకు కందిన చోటల్లా... వెన్నున కెంపులు వేలితో మీటుతూంది...అక్కడక్కడ అవి గిలిగింతలుగా రెచ్చిపోగా...

సీతాపతి, నిదుర తెలియకుండానే మూలిగి, నీలిగి, మరీ ఐమూలగా పక్కదున్నేశాడు. ఎండ చురాచురా మీదపడేట్టు, ఎదటిపక్కకిటికీ ఛార్లగా తెరిచేసి, రెక్కలకు కొక్కేలు తగిలించి...ఇల్లాలు, క్రిందికి వెళ్ళిపోయింది...ఒకసారి వెనుదిరిగి చూసి...

పిచ్చికలు, గదంతా గంద్రగోళంగా...కిచకిచలాడేస్తూన్నవి. సీతాపతి...సమంగా పక్కకు ఒత్తిగిలి, నిద్రపోతున్నాడు, ఒక్క గుక్కను.

—బారలవారిగా ఎక్కిపోతూంది పొద్దు: ఆ చెట్టు మీద, ఈ పుట్టమీద, మిగిలిన నీడమరకలన్నీ సాపుగా ఫెళ – ఫెళగా ఆరిపోయినవి....ఎండ గుచ్చుకుంటూంది...

—గ్రామోఫోన్‌ముల్లు ఒత్తి రాపాడుతూంది...పాటమీది కుక్కపిల్ల గిర–గిర వానా–వానా–వాలప్ప...

కలలలో మురిపించి,
కానరావేమోయి
నిలువనీయని వలపు
నీ పాల బడెనోయి...

— సీతాపతికి, లీలగా వినిపిస్తూంది...వరుస...
పసిపూపప్రాయాన

పసివాడలేనోయి
మిసిమి బంగరుచాయ
మేను సగమౌనోయి
మొగమాటమై, చెలిమి
నగుబాటు లాయెనని:
సిగలోని మాలతుల
సిగ్గుచిమిడిందోయి...
నీలాల హొరుమంజి
నివురు లేలినవోయి;
జాలి–మాలిమి జన్మ–
జన్మాల వలదోయి...
రికార్డ్ బోర్లబొక్కలైంది...
ఒంటరిగా బృందావనవీధుల
ఉంటినిరా వ్రజధీరా నీకై...
సీతాపతి పెదవులు చిరునవ్వుబోయినవి.
చింతల దొంతర విరిసిన
చీకటిలో మాటుమణగి
అంతలోనె వెన్నెల గిలి
గింతల వింతకు మేల్కొని...
సీతాపతి రెప్పలు విలవిలా అల్లాడిపోయినవి. ఒళ్ళు ఒదిగి విరుచుకుంటూన్నది.
మందల లేగలు మసలిన
సందడిలో జాణతనపు
మందెమేలముల పరవశ
మందితి సుందర–నాగర...
నిదుర, మేలుకొనేందుకు ఎంతసేపటినుంచో మొగం వాచిపోయి ఉంది... ఇల్లాలు ఇంకోపాట వింటూంది...
ఘుమఘుమ సుమ పరిమళాలు
గుములువారెనే...
ఝుమ ఝుమ ఝుమ షట్పదాలి
ఝూంకరించెనే...అమని
హొంకరించెనే...సజని
కిల–కిల కోకిల కాకలి
కలువరించెనే...
కలువరించెనే...
ఝులఝులఝుల చంద్రవాణి
ఝూంకరించే...అమని—
సలసల మలయానిలాల
సొలసిపోయెనే...

ఝణ–ఝణ–ఝణ ప్రణయవార్ధి
ఝూంకరించెనే...అమని...

ముంగురులు సవరించబోయే చెయ్యి అలాగే ఆపి...ఆవంక చూస్తున్నాడు...రెప్పపాటు పాటుకూ ఇల్లాలు క్రొత్త క్రొత్తగా అందమై చందమై మిల–మిలలాడుతూంది. ఇటు తిరిగినప్పుడు...అటు రవ్వంత ఒరిగినప్పుడు...

––ఎన్నికళ్ళో ఎరువు తెచ్చుకున్నానే యిందాకటినుంచీ అనుకుంటూ చిన్న బుచ్చుకున్నాడు, సీతాపతి. ఇల్లాలు, చూసీచూడకుండా రాచుకునేంత 'దగ్గిరగా వస్తూ' కళ్ళలోకి పొగపోయి...హాలంతా కిల– కిలలాడించింది...పిచ్చికలు బుర్ మనీ, తుర్ మనీ అన్నీ తలోమూలకూ దూసుకుంటూన్నవి––

* * *

# చెంగల్వ

నడివెత్తిన మబ్బుతునకలన్నీ నిదుర మత్తులో ఉన్నాయి. పారాడే బాలపాపడు కన్నులెత్తి అమ్మవంక చూసిన చూపుమీద ఉంది ఆకాశం. చిన్నదాని చెక్కిలి పుణికేందుకు, బాలకుమారుడు చేయి జాపినట్టు ఆకాశానికి అల్లంత చేరువకు అందీ అందనట్టు వుంది కొండ శిఖరం. శిఖరానికి పది బారల దిగువను అదమరచి ఆపసోపాలుపడే కన్నెపడుచులాగా మల్లెలగుబురు, గుబురుమీదకు కమ్ముకుని కలియబడుతూన్న జాజితీవల కీకారణ్యం. ఏ వాడనుంచో సాగివస్తూ, ఎన్నో ఘుమఘుమలు మూటకట్టుకు వస్తున్న చల్లగాలి—

ఓబులయ్యకోనలో, పన్నీరు మాకులబాట నంటుకుని, ఏటి చిలుక వారను, జారుడు బండలమీద పాదం మోపీ మోపకుండా, కటిక చీకటిలో, కన్నుపొడిచినట్టు చెల్లాచెదరుగా మెరిసే మిణుగురుల వెలుగు ఆనవాలు పెట్టుకుంటూ, అప్పటికీ ఏ జామాయె, చిక్క నాయకుడు పయనంకట్టి—

ఆ కడకు నూరు అమ్ముల దూరాన–ఆరుద్ర నక్షత్రం మెరసే మెరుపుక్రింద సూటిగా తురాయి తోపులో వాళ్ళ గూడెం ఉంది. ఆ కడ, అయ్య దొడ్డనాయకుడు, తన చేతిక్రింద, చెట్లక్రింద నమ్ముకు బతికే వేయిన్నొక్క విలుకాడికీ ఎకిమీడు.

అటువంటి తన అయ్య దొడ్డనాయకుడు, నాటికి మూడు పొద్దులనాడు, కోనలో లేడికూనను కోరనేసుకు పోవచ్చిన చిరతను అదలించబోయి, అటో ఉరుకు ఉరకంగనే గురి చెడిసి, కాలు మలగబడె.

పడిన పాటుకు మరో మొనగాడైతే కోలుకునేవాడే కాదు. నాయకుడు అంత పాటూపడి, తెప్పరిలుకున్నాడు. ముక్కాలా, మూలగలా కాని, మరో పొద్దుకల్లా కాలు, పూర్ణమైపోయె. మందుకు లొంగలా, మాకుకు లొంగలా. పూసిన పసరల్లా విరిగింది. కట్టిన ఆకల్లా ఎండి విరింపులైంది. యింక ఏం సాధన!

అక్కడికి ఒక్క పొద్దు పయనంలో సిరిసింతల తోపులో, గంగాధర మడుగు ఒడ్డున, ఒంటికంబం గుడిలో కొలువున్న సిరిదేవమ్మను కొలుచుకుంటూ తెల తెలవారంగనే ప్రతి పొద్దూ, సిటికెన వేలి రగతంసుక్క ఆ అమ్మతల్లికి ఆరగింపుచేస్తూ, దగలేక దప్పికలేక సదా ఆ వీడనే పడుండే గణాచారికి ఆ వైనం చెప్పి, శకునం అడగ్గా, కొలువున్న ఆ తల్లి నోటివెంట పలికించి దేమంటే – ఔనురా ఓరయ్య – ఆకళించరా—

'భూమి పుట్టక ముందు, పృథివి పుట్టక ముందు, తనంత ఆకాశంలో, ఆకాశమంత తానై, శివదేవయ్య తపస్సులో ఉండగా, ఆ తపస్సు పండి పండి, పండు తల్లంటి అమ్మవారైంది. కాలు ఊనేందుకు లేక, గాలిలో తేలిపోతున్న అమ్మవారిని, అయ్య సిగపాయలో ఉన్న చందమామ, హంస వాహనమై మరల్చుకొచ్చాడు.

అయ్యకు అమ్మమీద మనసుకాగా, చేజాపి చేరువకు తీసుకోబోయినాడు. ఆ తల్లి అందుకు ఒల్లనంది. కాలు మోపేందుకు వీలూ చాలూ లేని గగనంలో ఎల్లకాలం తేలిపోలేనంది. శివదేవయ్య చిన్న బోయి, మొగం చిట్టించగా, చందమామ అయ్య తడబాటు చూసి ఒకసారికి రెండు సారులు నవ్వాడు. ఒక నవ్వో చెంగల్వ, మరో నవ్వు మరో చెంగల్వ అయింది. అనగా – ఒక పువ్వు గాలిలో రాలి, రాలి, రేకలు విచ్చుకుని, ఒక్క మెయిని పోగా పోగా బరువెక్కి భూమ్మై నిలిచిపోయింది. మరో చెంగల్వను అమ్మవారు చేతనందుకుని, మరోచేయి శివదేవయ్యకు అందియ్యగా భూమీ ఆకాశం కలిసి శుభం పలకగా, అయ్యా అమ్మా ఒక్క మనసుతో భూమ్మీద పుట్టబోయే మనంటి బిడ్డలను తలుచుకోగా, అయ్యకంటిలో ఉరుకు చూసి అమ్మ చిన్న నవ్వు నవ్వి చేత నున్న చెంగల్వను విసిరివేయగా అది పూలపానుపై విచ్చుకుంది గదరా! ఆ పానుపుమీద, అయ్యా అమ్మా కలకాలానికీ తొలిసారిగా ముచ్చటపడ్డారురా, నాయకుడి కూనా—

'భూమి పుట్టంగనే అయ్యా, మ్మా కాలు మోపిన చోట, నాయకుడు పాటుపడ్డాడురా – బాలుడా! దానికిదే మందు.

'ఆ మందు, భూమి పుట్టినాక యింతవరకూ తెచ్చినవారు లేరు. వాడినవారు లేరురయ్యా!

'అయ్యకూ, అమ్మకూ పానుపైన చెంగల్వ వెన్నెలకు తడిసి, మెరుపుల్లో కరిగి, గడ్డగట్టి ఆకడనే ఉండిపోయినది. అదిరా మందు. చెంగల్వను చేత నద్దుకుని, ఆ చేతులు నాయకుడికి అద్దితే మళ్ళీ మనిషవుతాడురా!–

—"పుట్టి బుద్దెరిగినాక, అడకన్ను చూసి ఉలికిపడని తనువై యుండాలిరా. పయనం ముగిసేదాకా, ఆకలి దప్పిక అణచుకోవాలిరా! అందుకు చాలిన వాడేడిరా? -- అది నీకు తరమూ?" అంది గణాచారి!

"తరమే–"

"నీవు మల్లెపూవంటి వాడివేనా?–"

"అంబ మీద ఆన, కాకపోతినా దారిమయానే రావిపోనా!–"

'అయితే, అయ్యను కాచుకోరా! అడుగు ముందు కెయ్యరా!–' అని సింగం ఎలుగున పలికింది గణాచారి.

ఆ అవ్వకు మొక్కి, సిరిదేవమ్మకు మొక్కి అడుగు ముందుకు వేశాడు చికినాయకుడు–

గూడెం చేరుకుని, నాయకుడితో అంబ పలికిన తీరు చెప్పి చిన్నవాడు పయనం కట్టగా, దొడ్డనాయకుడు హుంకరింపుగా, 'నా కా మందుతో పనిలేదుర. యీ బతుక్కంత విలువలేదుర. ఏడుగురు తల్లు లెత్తి పెంచిన కూనవు. కులంవోళ్ళను దిద్దుకోవలసిన నాయకుడివి. ఒంటిగా నిన్నంపలేను' అని వాపోయినాడు. చికినాయకుడు అయ్య ముంగాలిమీద ఒకచేయి, చెంపకు ఒకచేయి ఉంచి – 'అయ్యకు ఆపదొచ్చినపుడు ఆదుకోలేనివోడు కులానికి నాయకుడౌతాడా? అయ్యా! యిది నీవిచ్చిన తనువు కాదా; నీవు పంచిచ్చిన రగతం కాదా! యీ బతుకు నీ చలువకాదా! నా అయ్య విలువ నాకు తెలుసు! పయనంకట్టక, బడుగల్లే యీడనే పడుండి, నీవు ఉసురు విడవగా, చూస్తూ ఉండమంటవా? అది, నీకు పరువా, నీ బిడ్డకు

పరువా! నిన్నుద్ధరించలేని కొడుకు నేల కన్నావని ఆ లోకంలో పెద్దలడిగితే, తలెత్తగలవా అయ్యా! – పోనీ, ఏ మెకమైనా నన్ను వేసుకుపోతుందని వెరపా! విల్లమ్ములు పట్టిన బతుకైనాక మనసేత దానికో, దానిసేత మనకో కన్నుమూత బ్రహ్మరాతే గంద! అందుకు, సింతలేదు గంద! కాని అయ్యా! తిరిగి రాకపోతినా, మరోపుటకపుట్టిఅయినా, నీకు అక్కరకొస్తా. మేను ఒరిగిపోయినా, ఆశ గాలిలో కలవదు గంద! సిరిదేవమ్మ కరుణించిందా యీ కంటితోనే బిడ్డను చూసుకుంటవు లేదా నేను మటుకు ఏ పుటక పుట్టినా నీ కంటికి దూరంకాను!--' అనగా,--

దొడ్డనాయకుడు బిడ్డను దీవించుకున్నాడు. చికినాయకుడు పయనంకట్టాడు

* * *

పయనంకట్టి అప్పటికి జామైంది. అట్టనే నడవగా నడవగా, ఎన్ని జాములో గురుతుపోయింది. అడుగు బరువుగా పడుతూంది మణికట్టులు ఉక్కు గుళ్ళల్లే దిగజారుతున్నాయ్. మెడ నిలువలేని బడలిక ముంచుకొస్తూంది. ఎత్తిన అడుగు నిలిపి, మరో తడవ సిరిదేవమ్మను తలుచుకుని, కన్నుమూసి, అడుగువేసి, కన్ను తెరచాడు. ఆకాశం నిండా తోరణాలుకట్టినట్లు చుక్కలు. చూపంతమేరా వెల్ల వెన్నెల–

యింకా ఏటివారనే నడుస్తున్నాడు. చూపుమేరలో, దప్పిక తీర్చుకుంటున్న జాలు మెకం పసిపట్టి, వార ఎత్తి గుర్రుమన్నది. అలవాటు కొద్దీ చికినాయకుడికి అమ్ములమీదికి చేయిపోయింది. ఆ చేయి చెంగల్వకు మీదుకట్టినానని యాదకు తెచ్చుకుని, అడుగు అటువేశాడు. జాలు మొకం ముందుకు దుమికే ఊతం మీద ఒగ్గివుంది. యిక దుముకుతుంది. అంతలో కారుదున్నల మంద, ఎటు వెంపునుంచో ఊచలల్లే వచ్చిపడి జాలు మెకాన్ని తరుముకు పోయినవి–

మరో అడుగు ముందుకు--

ఆకాశాన్నుంచి దట్టంగా పూసిన మల్లెతీగె వ్రేలాడుతూంది దానిమీద ఒత్తుగా తుమ్మెదలు మూగి ఉన్నాయి చికినాయకుడు దరికిరాగానే అవి చెల్లాచెదరై పోయినవి. మల్లెతీగె కాదు అది, తెల్లతాచుకదా అని పోల్చుకున్నాడు బాలుడు త్రాచు పూలదండ పడినట్టు గభాలున చుట్లు చుట్లుగా, నాయకుడి మెడలో పడి పడగ ఎత్తి బుసకొడుతూండగా, ఆ బుసలో ఊపిరి పీల్చుకుంటూ గాలిలో తేలిపోతున్నట్టూ, పట్టు తప్పి రాలిపోతున్నట్టూ, తూలుతున్నట్లు, ఏదో మత్తు ఎక్కుతున్నట్లు, ఏమో తెలియనట్లు, ఒక్కక్షణం, అంతా మసకవేసుకుపోయి, తెప్పరిల్లగా – తాను ఎక్కడున్నదీ ఊపిరి, ఊపిరిగా, తెలిసొచ్చే తెలివి వచ్చింది

కనుచూపు మేర, అపరంజి చిలకరించినట్లు, రంగులు పరచినట్లు, వెలుగు విరజిమ్మినట్లు ఉంది. మెత్తని పచ్చపట్టు– పక్కనే పడగవిప్పి కదలకుండావున్న త్రాచు. త్రాచు, తానూ పాకుతూ పోతున్నారు అల్లంత మేర మంచిగంధం వాసన. అది దాటగానే మల్లెల గుమాళింపు, దాని సరసను పగడపూల తావులు, ఆ తావిని ఒరుసుకుంటో అలవిమాలిన మత్తు. త్రాచు తళుకు తళుకుమంటూంది తళుకులన్నీ ఒక్కచోట చుక్కకట్టుకుని, సికిలింత ముల్లు మొనంత మెరుపు ఆ మెరుపే రేకలు అదే చెంగల్వ! సిరిదేవమ్మ పలికిన చెంగల్వ!

నాయకుడు, లేని సత్తువ తెచ్చుకుని, చెంగల్వ మీదికి చేతులు జాపాడు. పడగవిప్పిన త్రాచు కస్సుమంది చేతులు అట్టనే ఉంచాడు. బుస్సుమంది. ఆ చేయి వెనుకాడ లేదు. కాటేయబోయిన త్రాచు, ఒళ్ళు విరుచుకుంటూ, కన్నెపడుచై, కలకల నవ్వి, ఆ చేతులు అందుకోబోయింది నాయకుడు ససేమిరా అన్నాడు

"పుణ్యంకొద్దీ పుటకెత్తాను నాయకుడా! అయ్యా, అమ్మా ఆదికాలంనాడు నాకు వరం యిచ్చారు. యుగాలు గడచినా కాచుకుని ఉన్నాను. యింక నిన్ను విడిచేనా?" అంది కన్నె.

"ఏమిటీ కథ!"

"మనకథే"

"మనం, ఎవరం?"

"ఎవరమో ఎరుకచేస్తాను. అలనాడు, అయ్యా అమ్మవారు, అల్లదిగో ఆ పానుపున ఉండగా, మా తల్లికి గిలిగింతలై చిరునవ్వు నవ్వగా, సిగలో తురుముకున్న వావిలి పూవు చెదిరి క్రిందపడలేదా! ఆ పూవును నేను కానా! నా మురిపెం చూసి, అయ్య గోముగా చందమామను చిదిమి, అల్ల తునకను, నన్నేల్లుకోమనలేదా? ఒల్లుకుంటివి, గురుతులేదా! ఆ గడియలో ఒక్క ముచ్చటకే కరిగి మాయమై పోతివే! నేనందుకు వాపోగా ఆ తల్లి జాలిదలచి, నాకీ రూపమిచ్చి, యీ తావున నిలువనిచ్చి, ఏనాటికైనా సుఖపడేవని వరమిచ్చేనే! కాదనకు నాయకుడా" అని బతిమాలింది కన్నె!--

"కాదనను, మా అయ్యను బతికించుకుని నిన్ను ఆదరించే"నన్నాడు

కూడదన్నది కన్నె--

నీ గోడు విననన్నాడు నాయకుడు.

"సుఖం కోరి రాలేదు సౌఖ్యం కోరి రాలేదు. చిన్నదానా, నీ కథ కాదనను కాని, మా అయ్యను బతికించుకోక మానను. యిన్ని యుగాలు కాచుకుంటినంటివే యింతలో తొందరా! ఏనాడో ఒల్లుకొంటినంటివే ఆ కత తలచుకుబతకరాదా! నన్ను మొగమాటపెట్టలేవు!- నా చేతులకు అడ్డురాకు-" అని మొగంలోకి చూసి, కంటికి కన్నుందనీయక నాయకుడు చేతులతో చెంగల్వను అద్దుకున్నాడు. కన్నె జలదరించి, కస్సుమని కాటువేసింది.

కాటుతిని, నాయకుడు కన్నెవంక చూసి, ఒక్క నవ్వు నవ్వి "యింక ఎన్ని యుగాలు కాచుకుని ఉండాలో!" అని జాలిపడి చెంగల్వకు అద్దిన చేతులు ఎత్తిపట్టుకుని, సిరిదేవమ్మను తలచుకుంటూ, తిరిగి చూడక, అడుగు ఆపక, ఒక్క బిగివిన వచ్చిపడి అయ్యను అదుకున్నవాడాయెను

గూడెం గూడెం కోలాహలమైపోయింది. అందరూ వాలలాడిపోతున్నారు నాయకుడు మటుకు తూలిపోవడం చూసి ఎత్తి పెంచిన ఏడుగురు తల్లులూ, దుత్తలతో పాలు తెచ్చి బాలుడికి యిచ్చారు. నోటపట్టగానే విషం కమ్మకు విరిగిపోయినాయి. పాలుకాదని నీరు పట్టారు. నీరు గుక్కెట దిగగానే, నాళాలన్నీ విషంకమ్మగా, నాయకుడు, వేకువను మంచుముద్దయిన మల్లెపువ్వల్లె రాలిపోయినాడు.

నాయకుడు రాలిపోంగనే, కోనంతా బుసకొడుతూ త్రాచు వచ్చిపడ్డది. చెక్కిలిమీద పడగ ఆన్చి బతిమాలుతూన్నట్టు పడివుంది. సిరిదేవమ్మ కొలువుచేసుకొనే గణాచారి, అక్కడికి ఉరికిపడి, తాచును ఎత్తిపట్టి, ఆ చెంపా ఈ చెంపా చరిచి, "పోవే, పింజారి" అని విసిరివేసి, "అయ్యో నా తల్లీ! ఎంత నిర్భాగ్యురాలివే!" అని, ఆకాశం భూమిదద్దరిల్లేట్టు అరచింది. కులంలో వేయిన్నొక్క విలుకాండ్లూ కమ్ముకుని చూస్తూండగా, వాలిపోయిన చికినాయకుడు, కరిగిపోయి మాయమైపోయినాడు. పై నున్న చందమామ, మబ్బు విడిచినట్లు, వెలుగువిచ్చుకున్నాడు. గణాచారి, కలకలనవ్వుతూ, "అదుగో నీ బిడ్డ!" అని ఆకాశం కేసి చూపించి, దొడ్డనాయకుడి వెన్ను చరిచింది. దొడ్డనాయకుడు తంద్రంత నవ్వు నవ్వాడు.

ఓబులయ్య కోనలో, చెంగల్వకు చేయెత్తి మొక్కినట్టు చందమామ ఎగువకూ దిగువకూ గోరాడి, దిగులుగా సాగిపోయినాడు. పడగవిప్పిన త్రాచు బుసలో ఉసూరు – నిలిచి పోయింది.

* * *

# మాద్రి

'నేనేం చేతునే మాతల్లీ! కన్నకడుపు అని అయినా జాలిలేకుండా ఇంత కటికవాడైనాడేమి నీ తండ్రి!'

'అదేమిటి అమ్మమ్మా - నాన్న నాకోసమే...నేను సుఖపడాలనేకాదూ...చేసే యీ నిర్వాహకం!'

'హయ్యో! నిర్భాగ్యులారా...నల్లనివన్నీ నీళ్ళూ, తెల్లనివన్నీ పాలూ నీకంటికి...ఎలా బ్రతికి బట్టకడతావే.'

'ఇక, కట్టేవన్నీ బనారసుచీరలే! పెట్టిన నగ పెట్టకుండా, తొడిగిన రవిక తొడగకుండా...ఓ!... మహారాణి నౌతాను, నాకేం...తీ పెళ్ళిందా?...ఎంత వైభవం?'

'...భళ్ళున తెల్లవారినట్టే ఉంది!'

'సందెపడేటప్పటికి గూట దీపం పెట్టేవారు లేరనేనా...పాపం...అతడు ఇంత తొందరపడుతూంది; మరేం, అంత ఊసు తప్పయితే, మగవాడికి కూడా విధవరికం మన శాస్త్రాల్లో వ్రాసిపెట్టించకపోయినారూ?' ఆ పిల్లదానికి భూమ్మీద అన్నోదకాలు కరవై..అది పోయిందికదా అని... ఇవతల ఈతడు అఘోరించుతూ కూర్చుండవలసినంత అవసరం ఏం వచ్చిందీ? తెల్లవారితే అప్పుడే నాలుగాయెనా... యీవారం ఏలాగో కళ్ళుమూసుకుంటే మైలస్నానం...మంగళస్నానం... రెండూ ఓమారే...

'ఏమోలే, నీ కర్మానికి...ఎవరుకర్తలు...'

'నా అదృష్టదేవతలు!..నోయాలసిన నోములకు ఫలం...అప్పుడే అడ్వాన్సుగా నాకు దక్కుతూంటే...చూసి చంకలు కొట్టుకుంటూ సంబరపడటానికి బదులు, ఏమిటి నిండిన యింట్లో కూర్చుని...ఇలా అగాయిత్యం...

'చాల్లే.. నాతోబాటు సంతోషించాలి కాని....దిక్కుమొగం వేసుకుని లేనిపోని చిక్కుతెచ్చిపెట్టక... ఇంకా వ్యవధి ఉందా...యీలోపుగా మళ్ళా తలుపుదగ్గిర పాటలూ ... తలుపు గడియ పడకముందు పాడాలిసిన పాటలూ...అప్పుడు నట్టుపడకుండా...ఓమారు వల్లించుకో... '

* * *

'కృష్ణా...

'నిన్ను ఇంత చనువుగా పేరుపెట్టి పిలవలేదు...సిగ్గు విడిచి నీ యెదటపడి మాట్లాడలేదు.

'ఇప్పుడు...సిగ్గుపడి లాభంలేదు.

'నా మనసులో ఏమున్నదో నీకు అంతు చిక్కించకపోయినా...నీ మనసులో కోరికలు... ఎప్పటికప్పుడు, నీవు కిటికీదగ్గర నిలుచున్నప్పుడల్లా, నీ చూపులు నాకు తెలుపుతూనే ఉన్నవి...

'కాని, ప్రయోజనంలేదు... అందని మ్రానిపండు.. అది ఎవరి దోసిలిలో రాలితే...మనకు ఒరిగేది ఏముంది.. అని మనసును వెన్నగా మళ్ళించు...'

'నీకు అంతయిష్టమైతే...అవసరమైతే...నన్ను జ్ఞాపకం ఉంచుకో!'

* * *

'తాతయ్యా!...నవలల్లో చదువుతాం చూడు... పెద్దకోపం వచ్చినప్పుడు అందులో వీరుడు ఏం చేస్తాడు?—'

'పళ్ళు పటపటలాడించి జుట్టుపీక్కుంటూ'

'పాపం నీ కా యోగం లేదుకదా..ఈ వార్ధక్యంలో...ఇదే ఇంకో పాతికేళ్ళ క్రిందనైతేనా...'

'కాదులే...అప్పుడైనా నీ కాఛాన్సు వచ్చేది కాదులే... యీ సినిమాలు ముదిరిన తరువాతనేగా...నాలాటి వెర్రిపిల్లలు కళ్ళు తెరిచింది...'

'కంట నీరుపెట్టావో...నా మనసు చివుక్కుమంటుంది.. నడుంకట్టుకుని పెత్తనం చేయవలసినవాడవు...జబ్బలు సవరించుకో!'

## 2

'గృహిణి వచ్చి గూట దీపం పెట్టగానే..

'మీకు—గుండె గుభీలుమనేలాగుంది అత్తా!...తెలిసినవారు, ఏలా నడవాలో తీర్చి దిద్దుకోండి...'

'తెలిసింది...నా తెలివి తెల్లవారమట్టే హాయ్యో భగవంతుడా! మావాడి బ్రతుకు చివరకు ఇలా అఘోరించిందేమో అని...నడవాలో కంట ఒత్తివేసుకుని పడిగాపులు పడి...అలకిస్తున్నా...వాడి ప్రాణానికి...'

'నేను దాపురించింది...ఆయన సుఖంగా ఉండటానికే కాదండీ...'

'ఈ శ్రీరంగనీతుల కేం...సందేపడగానే...ఇప్పుడున్న బుద్ధి.. వాడు చెప్పలేక. చెప్ప లేక... పిచ్చపొడగట్టు...నాదగ్గిర బావురుమన్నాడు...సరి, చూద్దును గదా..నీవాలకం.. ఆడజన్మ ఎత్తింది...అణగి మణగి పడి ఉండటానికా.. మగవాడిని రాచిరంపాన పెట్టడానికా.. అక్కరలేనిదానవు. .అక్కరలేనట్టుగానే ఉండలేకపోయావూ? లేక. ఏ రాజ్యాలన్నా ఏలుదామనా..యీ దిలాసా?'

'వారూ మీరూ...ఏరీ కోరీ కట్టబెట్టింది...యీ రాజ్యాన్నే కదా, ఏలడానికి! ఇంతకన్నా ఎక్కువ.. ఎక్కడ మాత్రం దొరుకుతుందా?'

'ఆ జ్ఞానం ఉంటేనా. ఏలుకునేవాడు ఎంత పరితపించిపోతున్నాడో అని కనికరం నీకు ఉంటేనా?...'

'.. అమ్మా!

నా జన్మకు ఇహ సుఖపడేయోగం లేదేమోనమ్మా... పెళ్ళినాడు మెడనుపడ్డ జంధ్యం... పెద్దదానితోనే పెరిగిపోయిందమ్మా... ఎన్ని ముడులు వేసినా ఏం లాభం .'

'అయ్యో నాతండ్రీ!...చూసి చూసి నీ కీ రొమ్ముల కుంపటి ఎత్తానేమిరా? ఈ శిఖండితో ఏలావేగుతావయ్యా!'

'ఏనాడు కష్టంతోస్తే...'జా పరమేశ్వరా' అని ఏ కాశో లేచిపోతాను. నా పీడ విరగడ అయిపోతుంది... పెళ్ళాం ఉన్నా...సన్యాసినే...'

'నా బొందిలో ఊపిరుండగా...నీకు వచ్చిన ఫరవా ఏమీ లేదురా. నాయనా! నీ వాకిలి ఊడ్చటానికి వచ్చిన బానిసకూతురు...నీ చెప్పుచేతల్లో పడి ఉండక ఏ చెరువునీళ్ళు త్రాగుతుందో చూస్తానుగా... మొండికి మొండే ప్రతి...నీవు లాలించినకొద్దీ దాని ఆగడం ఇలాగే రెచ్చిపోతుంది. నాలుగు చరిచి అన్నా లొంగదీసుకోవాలి కాని...చెట్టెవంగనిది...ఇకముందు నీపాట్లు అడిగావూ... ఎద్దు నడిగి గంత కడతారటరా...ఎక్కడన్నా ఉందా ఇది...నీ యిష్టం ఇక...అంతా నీచేతులో ఉంది...'

'మంచినీళ్ళు కావాలి!'

'మీ అమ్మగారిని అడగండి.'

'ఎంతమాట అన్నావూ! మానాభిమానాలు ఏకోశానా లేవుగదా...అమ్మని అడగాలా అంట!.. అయితే మరి, బొమ్మవు నీవెందుకూ...తినిపెట్టడానికా...'

'కాదు...కని పెంచడానికి తల ఒగ్గకపోతే...తినే ముద్దకూ కరువు వస్తుంది.'

'ఆ మాట ఎత్తితే...నీకు ఎక్కడలేని తలనొప్పీ...వేయిపుట్లు జ్వరమూ ముంచు కువస్తుంది...'

'అవును...నా ముఖానే ప్రొద్దుపొడిచింది...నేనూ ఓ మనిషినే...'

'నేను...మ్రాకును...అదేనా నీ వనేది...మూడు రోజులనుంచీ వళ్ళు సలసలా కాగుతూంది... ఆర్చేదిక్కు ఉంటేనా...'

'అన్నింటికీ మీకు దొరికింది...అదేవంక...ఇలా అనుక్షణం పట్టి పల్లార్చుతూంటే...ఎవతె బ్రతుకుతుంది...మీ చేతుల్లో...ఈ కడగండ్లుగడిచి...పోయిందే అదృష్టవంతురాలనుకుంటే... దానికి ప్రతిగా మళ్ళా నేను వెలశాను...వంటింట్లో కుందేలు...మన్ని తప్పించుకుపోలేదు కదా అనేకాదూ మీ చెలగాటం...'

'ఆలా దోవకు రా...'

'మీకు...ప్రాణంమీదన్నా ఆశలేదూ?'

'ప్రాణంమీదకన్నా కూడా...'

'అంతేనా..!'

'ఆహా...బ్రతికిన నాలుగు గడియలూ సుఖపడకపోతే...'

'నేను ఎంత చెప్పినా..వినరు; మొరపెట్టుకున్నా ఆలకించనూ..ఇక మనకూ... పశువులకూ ఏమిటి తేడా?...'

'పదిమాట్లకు...వేయిమాట్లకు నేను పశువునే...నిన్ను చేసుకున్న తరువాత...నాకు అభిమానం ఎందుకూ? ఎంత వదరినా ఇప్పుడు నిన్ను వదిలేదిలేదు...చూద్దాం.. నీ తాత ఎవరు అడ్డం వస్తాడో...పద...'

'తాతదాకా ఎందుకు లెండి...ఆ కీర్తి నేనే దక్కించుకుంటాను...'

## 3

'నాలుగు గడియల్లో ఎంత ముంచుకువచ్చిందీ...నా బంగారుతండ్రిని నీ పొట్టను పెట్టుకుంటావటే మహామారీ!...తొడకాదు...దీన్ని నిలువునా చీల్చండయ్యా తండ్రుల్లారా...మాపాలిటికి ఎక్కడ దాపురించావే...నీముఖం...'

'ఊరుకోండి అత్తా...మనమేం చేయగలము? ఆ మహారాజుకు భూమ్మీద చిట్టె దుప్ప కరువైపోయింది. పోయినవారితో మనం పోతామా...పోగలమా?...తాతయ్యా! పాపం... మావాళ్ళకు ఎంతకామాటం అనుకున్నావు? స్వంతవ్యవసాయమా...ఇచ్చిపుచ్చు కోవడాలూ... గంపంత వ్యవహారం...ఒక్కర్తే తిప్పలుపడాలి ఇక...అయినా మెలిగిన చేయికనుక ఇబ్బంది ఉండదులే...'

'ఏమనుకోమోకండమ్మ..పైత్యించి వెర్రిమాటలు వస్తున్నాయి దానికి...'

'నీవూ నీ మనుమరాలూ, కట్టకట్టుకుని గంగలో దూకండి...'

'—దూకమంటారేకాని...లోకానికి వెరవాలిసిన అవసరం మన కేముంది అత్తా! మునిగినవారు... మునగగా...ఒడ్డుకు చేరినవాళ్ళు...వంతు దీర్చుకోవద్దా? కాదా మరి...తాతయ్యా!... సహధర్మచారిణి మరోవిధంగా నడుచుకుంటే ఆ లోకంలో ఉన్న అయన మనసు ఎంతో బాధపడిపోదూ?.. ఆయనే మిగిలి...దైవవశాన నేనే రాలిపోయి ఉంటే...ఆ సద్బ్రాహ్మణుడు...అత్తగారూ మూడోనాటికల్లా...గుమ్మటంలాంటి పడుచును ఎక్కడనుంచో ఏరి కోరి వెదుక్కుతెచ్చుకుని గృహపావనం చేసుకునే వారేనా?

'ఉత్తమగతుల ప్రాప్తి ఆశించేదాన్నే అయితే...ఆయన అడుగుజాడల్లో మెలిగితే...నాకు ఎన్నిక ఉంది కాని...'

'అత్తయ్యా! ఉరిమిచూడబోకండి. శుభమస్తు అనడానికి బదులు నే నేమీ లోపం చేయను.

'స్వరూపాలకి భేదమే కాని...భగవంతుడు నిర్దేశించిన వైవాహికధర్మస్వరూపం మారలేదని...నా పెళ్ళినాడు...పెద్దలందరికీ మీరు నీతి ఉపదేశించినవారు కారండీ!... ఒప్పుకున్నాను.

'తాతయ్యా!... మైల వెళ్ళిపోగానే మంచి ముహూర్తం ఏర్పాటుచేయి...కృష్ణని పెండ్లికొడుకును చేయించు..కోపంతో కొరకొరలాడు...అంతే, నీపుణ్యమాయెనుకాని... పండ్లు కొరకబోకు...మళ్ళాకట్టించడం...ఇప్పుడు నాన్నకు మళ్ళా అదో అదనపు ఖర్చు.'

★ ★ ★

# కామకోటి

"సూాచయంతి సుందరి...తవ...సూాచయంతి సుందరి! కుసుమాయుధ శాస్త్ర పండితమ్...రమణమ్..."

...కోపం తలమునుకలుగా...సంస్కృత గ్రంథాలన్నింటికీ...వెనుక భోజరాజు చరక సుశ్రుతాదులకు తలపెట్టిన సత్కారంచేయాలని...లోకాన్నంతా...

ఓ!...నిలువలేనంత చిరాకు ఎత్తుకు వస్తున్నది.

అప్పటికి నాలుగురోజులనుంచీ ప్రయత్నం చేస్తున్నాను...మరిచిపోదామని; కాని, మేలుకున్నా కలువరింపు మానే ఉపాయం తోచడంలేదు. ఆ పద్యార్థం లాషాలాగా...పట్టుకుని వదలకుండా ఉన్నది.

మొదట...తమాషాగా..ముచ్చటపడి నవ్వుకున్నాను: తరువాత, కొంచెం చిరాకు తెచ్చుకున్నాను. ఇప్పుడు...గింజుకుంటున్నాను; ఉహుఁ...ఏ సుముహూర్తమున నన్ను వరించిందో. ..ఏమో...వెన్నెల వచ్చింది.

క్లబ్బునుంచి అప్పుడే యింటికి వస్తున్నాను; గుమ్మానికి పెడల్ డీకొట్టకుండా, కాలితో ఆచుకుని, సీటు దిగకుండా...పని అయిపోయినా...చిగురుదమ్ముల పస తెలిసిన రసికుణ్ణి గనుక పెదవులకు అంటే చురుకును సహించుకుంటూ, శేషరూపలేశమైన సిగరెట్ – కన్యను బలవంతాన మరో రెండు వలపులు వలచి... మేనకకు ఉద్వాసన చెప్పి తప్పించుకున్న గాధేయుడి దర్జాతో లోపల ప్రవేశించాను.

కోటు కుర్చీమీదకు...విప్పాకునేటట్టు విసిరివేసి, రేకెట్ ప్రెస్‌లో అమర్చి కూర్చుని షూ తీసివేస్తూ.. పరధ్యానంగా...తవ సూచయంతి...సుందరి...

'నాయనా!'

..మెలకువచ్చినట్లయింది. మనస్సు చేస్తూన్న మోసం తెలిసిపోయింది. కాని...కన బడని వస్తువుమీద, పగ ఎలా సాధించడం? నిలుచుని...ధూకుడుగా...ఏ పాపమున్నూ ఎరుగక, నా పాదములే నమ్ముకొని ఉన్న...షూడ్‌ను...తన్నేశాను. తల ఎత్తి చూశాను.

జాలిగా, దీనంగా, కన్నీళ్ళతో, నా పలుకరింపుకు ఎదురుచూస్తూ...అమ్మమ్మ!

కలకలలాడుతూ...ఎప్పుడూ సిరి ఓడిపోతూండే పండుముత్తైదువ అలా ఉండటానికి కారణం?

'ఏం...ఏమిటి?' అని గాభరాపడుతూ అడిగాను; ఆమె మాటాడలేదు. కళ్ళవెంట మరీ, జల జలా..

'ఏం.. ఏమిటి మాటాడవేం?' రెట్టించాను. సంగతి ఏమిటో అర్థంకాదు. నాకు మనసు నిలవడంలేదు.

'తాతయ్య ఏడీ?'

అడగడం వ్యవధానంగా...నానోటివెంట ఆ రెండు ముక్కలూ వస్తూండగానే అమ్మమ్మ శ్రుతి ఎక్కించింది; నాకు మతి సాఫుగా పోయింది.

ఆమె ముందూ, అనుసరించి నేనూ అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వెళ్ళాము. చుట్టు తిరగకుండా, మడి వసారా తలుపు తీసుకుని...తులసికోట పక్కనుంచి, తోటలోనికి వెళ్ళేసరికి...

చూసే చూడటంతోనే, నవ్వు పట్టలేక పోయినాను. తాతయ్య మామిడి తిన్నెమీద పద్మాసనం వేసుకుని, చిత్రాసనంమీద కూర్చుని, చిన్ముద్రలు సవ్యాప సవ్యములు చేసుకుంటూ...దృష్టిని ఊర్ధ్వాభిముఖంచేసి, భ్రూమధ్యాన నిలుపుకోవడానికి యత్నంచేస్తూ, అచల సమాధిలోకి వెళ్ళిపోయే హంగామాతో ఉన్నాడు.

...ఉద్దండుడు, యేదో పథకం పన్నుతున్నాడు; అలా కాకపోతే..ఏమిటి యీ చోద్యం? మదన సామ్రాజ్యానికి యావత్తూ ప్రధాన అమాత్య హోదాలో వాడే...వర్షీయసి ముక్తికాంత ఉపగూహనం కోసం, రాచకార్యాలు కట్టిబెట్టుకుని కూర్చోగల తీరిక ఉన్నదా? వేదాంతమా అంటే, ఛాందోగ్యం పారం చెపుతూ, దహరాకాశాన పరమాత్మకు ఉనికి ఉన్నా, మానినా, ప్రణయజ్యోత్స్నలు అక్కడ వాలలాడిపోతూండవలసినదేనని... పంతానికి సాధించిన భావుకుడే!...మరి ఏమిటి ఈ వాలకం?

ఇక ఆలోచించకుండా ఆయన కొంటెతనానికి పైఎత్తుగా సాగిలపడి మ్రొక్కి, లేచి, పేంట్సుమీద మోకాళ్ళకు అంటిన మన్ను దులుపుకుంటూ, చేసిన ఘనకార్యానికి అభినందనా లేమైనా తగులుతాయేమోనని...అమ్మమ్మవంక చూశాను.

...లాభించలేదు: పైగా, ఆమెకు నా అల్లరి అర్థం కాకపోవడం అటుండగా 'నీవూ' మీ తాతగారు చేసిన పనికి హర్షిస్తున్నావా' అనే అర్థపు చూపుపెట్టి...మన్యువేగం నిలవదీసుకుంటూ...

'ఇదీ వరుస, నాయనా! సంధ్యపడకముందునుంచీ, ఎన్నో విధాల బ్రతిమాలాను. కాళ్లు పట్టుకున్నాను, నెత్తీనోరూ కొట్టుకుని 'ఇది మీకు తగదు' అని మొరపెట్టాను. నీవుకూడా చెప్పి చూడు, అప్పటికీ ఆయన మనసు మారనట్టాయెనా, నన్ను భరించడానికి ఆ గంగాభవానే ఉంది! ఇంతకాలానికి...ఇన్నోపడిలో...నన్ను విడిచేసి...సన్యసించుతారా?' అన్నది గాద్గదికంగా.

నేను, ఆమె మాటకు అడ్డం వెళ్ళి,

'ఇప్పుడు ఆ సంగతేం వచ్చిందీ? నీమీద కోపంగా ఉన్నాడా?'

ఆమాట అడుగగానే, వాళ్ళ సంసారిక ప్రణయాన్ని అవమానించానని, కోపంవచ్చి, ఆమె చూపు చురచురలాడింది-ఆ పుణ్యదంపతుల విషయంలో అలాంటిది అసంభవం అని తెలుసును. కాని, కేవలం మాటవరుసకని అని...చేసినతప్పు దిద్దుకుంటూ-

'ఏం జరిగిందో చెప్పు, నాకు తెలియదు కాదూ!' అని సానునయంగా అడిగాను.

'అకారణంగా, ఉన్నవారు ఉన్నట్టుగా..'సన్యసించితే మేలు' అని అనుకుంటూ, లేచివచ్చి ఇక్కడ కూర్చున్నారు. మాటా మంతీ లేదు; ఉలకరు...పలకరు. కోపమేమో ననుకుందామా...ఆ మహారాజు ఎన్నడన్నా పల్లెత్తి ఒకమాట అనడం విన్నావా?"

'ఒక మాటేమిటి? నిమిషానికి లక్షమాట లంటూాండటం ఎరగనూ? తాతయ్య తన రసికత్వమంతా, నీ మీదనే పదును చేస్తూాంటాడాయెను...'ఈ ధోరణిలో...ఆమె దిగులు మరపించడానికి విసిరి చూశాను పనిచేయలేదు.

"వాటికేంలేస్తూ...యిప్పుడు ఏమిటి చేయడం?"

"ఏమీ చేయకుండా, చూస్తూ ఊరుకోవడం."

"ఏమీ చేయక..."

"స్వాములారి లోకంలోకి ఇంకా పూర్ణంగా దిగనీ. అప్పుడు సుష్టుగా భిక్షచేద్దాం. అందాకా ఏమీ తొందర లేదు. మనం, ఒకవేళ ఈలోపల ఏమన్నా చేద్దామన్నా అయనేం ఊరుకునే రకమా?"

ఈ ధఫాతో, నేనేమీ, అర్చేవాడినీ, తీర్చేవాడినీ కాదని ఆమెకు తెలిసిపోయింది. ఇక నా మాటలు వినిపించుకోకుండా పునః తిన్నెను అనుకుని కూర్చుని ఆయన బొాసెపెట్టు దగ్గరగా తల ఓరగిలవేసి విలపించడం మొదలుపెట్టింది.

"భిక్కునీ"

...నకనకలాడే సింహం, గుహాముఖమున గర్జించే దమ్ముతో, తాతయ్య మౌనమూర్తి ధ్వనించింది. నేను ఫక్కుమన్నాను. ఏం ప్రభూ! బౌద్ధంలోకి మార్చాడే బాణీ...అదుగదీ, ఇప్పుడూ అసలు రంగంలోకి దిగుతున్నాడు. ఆశ్రమ స్వీకారానికైనా...ఆడ బాహుళ్యం ఉన్న సంప్రదాయం ఏరుకున్నాడు.

—అమ్మమ్మ ఆ మాట ఏదో తిట్టూ అనుకుని, ఉలికిపడి, తెల్లమొగం వేసి...లేచి దూరానికి తప్పుకున్నది. స్వాములు కళ్లు...రెప్ప లల్లార్చి తెరిచారు.

"జయము శ్రమణ భదంత కామాయనులకు!" అని నేను ప్రత్యుత్థాన స్వస్తివాచకమాడాను.

తాతగారు, విజృంభించి...ఒళ్లు మలుపులు సర్ది విరుచుకుంటూ,

'అయితే మనకేంలే! అగ్ని పేటిక, మిగతా సరంజామా, ఇలా రవాణా చెయ్యి. సన్యసిద్దామనుకున్నాను కాని, ఉన్న పాయ ఊరికే పారవేయడం ఎందుకూ?...నేను తప్ప తట్టుకునే నాధుడు లేడాయెను, ఈ యింట్లో... రేపు పొగోలు సరుకు ఊళ్ళో దిగితే బాగుండును.'

'మరి నీ సన్యాసం!'

తాతయ్య మాట మెలకువ అర్థంచేసుకోలేని అమాయికతనం చూపులో తొణికించి...నాకు విప్పి చెప్పుతున్నట్టుగా...

'గీర్వాణం వెలిగించానయ్యా! ఈ పొగాకు ససిగా లేదు, మానివేద్దా మనుకున్నాను...అది స్వగతంగా...అర్థోక్తిలోనే...అసలు మనసుదాటి రానీయకుండా ఉండవలెననే మాటే మరచిపోయినాను. సంకల్పం పవిత్రమైనది. గనుక, కూతురు ఎందుకని తల్లినే ఆశ్రయించాను... తలదిమ్ము..తిక్క... తీరేందుకు తరుచ్చాయ...

'అందుకూ మా గృహిణికి యింత అలుక. కసి తీర్చుకున్నానుగా, 'భిక్కునీ' అని తిట్టి. ఏం అషైనా? ఇంటావిడా.

ఇంకో విషయం..విశేషం ఉందోయ్...వేళకు సరిగ్గా అన్నీ అల్లా సరిపోయినాయి చూడు..నీవు, సంఘం సరే, ఈ ఆరామం, మరి భిక్కునో?—'

నేనూ, నాతోబాటు అమ్మమ్మా, తాతయ్య శ్రుతి అందిపుచ్చుకుని...నవ్వాము.

'పాపం! పాడిలిపోయిందయ్యా!'

'అలాకాదు: మాట దక్కించింది. మీ అమ్మమ్మే. విరహవేదన ఎంత మజాగా అభినయించేదనుకున్నావు... పడుచుదనంలో? ఒకమారు చూద్దామని ముచ్చట వేసింది. ఫరవాలేదు–వెనుకటి బింకం ఏలా వస్తుంది కాని?...నేను మాత్రం...ఇప్పుడు నిత్యం...భోజనానంతరం రాత్రులు... మహాభినిష్క్రమణంచేస్తున్నానా ఏం ..ఉద్దీపన లేందే వీణ మోగదు.'

'ఎంత నాటకం ఆడావూ?'

'అవును బాబూ...మా ముసలి ముచ్చట్లు మేమే తీర్చుకోవాలి కాని...ఎవరు ఆదుకుంటారు?...'

...వాక్ప్రవాహానికి, చప్పున అడ్డుకట్టవేసి...తాతయ్య...చెవులు దోరబెట్టుకుని... వింటున్నాడు.. .కారుమబ్బులు దూసుకుని...ఫెళ్లున వెలిగే చందమామలాగా...ఆయన ముఖం కలకలలాడిపోయింది...అంటించబోతూన్న చుట్టను...తీసి, చేత బుచ్చుకుని...అతి హుషారుగా...లేచి నిలుచున్నాడు. నేనూ...సిగరెట్...ఆ పరిస్థితిలో అంటించడమా మానడమా అనే విచికిత్సలో పడిపోయినాను...తాతయ్య. ..ఇంత హంగామా చేసిన తరువాత...కొంచెం తెప్పరిల్లేదాకా...ఆయనను అక్కడనుంచి కదలనియ్యదలచుకో లేదు...వదలదలచుకోలేదు.

'కూర్చో...'

'వీలులేదు...శివాజ్ఞ అయింది: పలుచని పద్మినులను వల...చే సుకుమార రసికులు ఆయెను– మీ సజ్జు అంతా...నీవు రికామీగా, కూర్చుని...కాల్చుకో...పొగల తీగలెలలోనే...మీకు... ప్రియురాలి వగలన్నీ కుసుమిస్తవి...మేం...అంత తీరుబడికి మా పడుచుదనంలోకూడా నోచుకోలేదుసుమా!...ఎందుకు...చెవులూ, కన్నులూ కలిగిన లాభం ఇంకా వినిపించడం లేదూ?'

ఒకరిని మించాలని ఒకరము...పందెం వేసుకున్నట్లుగా...అంగలతో దూకుతూ... వాకిటిలోకి వచ్చాము...అమ్మమ్మ మాటే మరచిపోయి.

ఇంటిముందర పెళ్ళివారు ఎవరో, ఊరేగుతూ ఆగారు. మేళంలో...పచ్చసిల్కు వోణి వేసుకున్న ఓ పిల్ల .

'రమ్మనే! మహరాజుగ...', అనేపదం పల్లవి ఎత్తుకుని అభినయిస్తూన్నది.*

* * *

* తాతగారి కథలలో – మూడవది
"ఆతిథ్యం" – "గురుప్రసాదం" జ్వాలలో ఇదివరకు అచ్చుఅయినవి–మ రా శా.

# రాజసూయం

వాన కురిసి, యింకా బాగా తెరిపి కాలేదు...సన్నతుంపురు పడుతూనే ఉన్నది ఈదురు ముసిరి... ఎడాపెడా వెలిగే దీపాలు...మసకబారినవేమో, కదిలితే నీడబారుతూన్నది.

కారు, కదలికలోనే ధూకుడు చూపించింది. పదిబారలైనా సాగలేదు–పదునెక్కిన తారురోడ్...నీళ్ళు నిలిచిన గతుకులు...చీకట్లు–పొరజాడకుండా దాటిపోయి, కాలుజారి అడ్డంగా పడిపోయినాడు–ఎవడో– కాళ్ళమీదకు ఎడమవైపు చక్రాలు పోయినవి...

అక్కడికి–నలుగురూ పోగయినారు.

ఎవరో పాపం.

ఎవరైతే నేం.

కారులో ఎక్కేవాళ్ళకు కళ్ళు ఉండవ్వా?

ఇదివరకు ఎన్నైనాయో? – కండకావరం కాకపోతే–

అనవసర ప్రసంగాలు, అంతకన్న...ఆపదవచ్చిన వేళల అయినా, లోకం...ఎందుకు అక్కరకువస్తుంది.

పడిపోయినవాడు ..తెప్పరిలుతున్నాడు., బాధ తెలుస్తూంది. ఎవరవని అడిగితే... ఏమని చెప్పగలడు–

ఆ యిద్దరూ ... జనాన్ని సర్దుకుంటూ ముందుకు వచ్చారు. అత్తరువువాసనా – ఆ వాసనా – అక్కడంతా ఘుమాయిస్తూన్నవి. ఆమె చొరవగా ముందుకు వెళ్ళింది. ఆతడు తూలుకుంటూ అడుగు వేసినచోటనే వేస్తున్నాడు. అవతలగా...చేత డైరీ...వేలుమడిచి పాయదీసి పట్టుకుని...ఏం వ్రాసుకునేందుకైనా తయారుగా కాన్‌స్టేబుల్–

వాళ్ళిద్దరినీ చూసి...ఫాయాకు జంకి...చోద్యంచూడ పోగైన జనమంతా సైగలతో చూపులతో ప్రశ్నలూ – జవాబులు సరిపుచ్చుకున్నారు.

ఆ కారులో వాళ్ళు వీళ్ళేకాదూ? – అవును.

ఇంతకుముందు ఆ బారులోనుంచి...మరి...ఆహా! ఇవాళేం? – రోజూ ఇదేపని ఒళ్ళు తెలియకుండా ఒకరిమీద ఒకరు పడుతూ–

ఇదా వరుస? – కాకపోతే ఇంతకన్న ఏం వరుస? కనబడటం లేదూ? – రాటుదేరిన రకం...వాడెవరో తేభ్యం...పిండేస్తూంది.

కండకావరం... మనకెందుకు ఎవరేలా...

అవును——

ఆమె ముందుకువంగి పరకాయించి చూసింది. అలా పడిఉన్న అబిసి...అ...లా... ఒత్తిగిలి... సొమ్మసిలి...కళ్ళు మూసుకున్నాడు.

ఆరెకుడు...అంతో యింతోగానో...ఆమె చెప్పినది నచ్చి, అక్కడ మూగినవారం దరినీ...ఇక కాలు సాగనీయమని...అక్కడనుంచి తప్పుకున్నాడు...పుస్తకం మూసేసి జేబులో పెట్టుకుంటూ——

ముందు కొంచెం సణగబోయి...ఆమె గద్దించేసరికి...పిల్లిలాగా——అతడు...అలా పడిపోయిన అతడిని తన చేతుల్లోకి అలాగ్గా తీసుకుని...పసిపాపనులాగా భద్రంగా కారులో వెనుక పరుండబెట్టినాడు—

ఇంకా...ఎవర్రోవను వారు పోకుండా...ఇందాకటి వారందరూ...అ చాటునా మాటునా... మళ్ళా మాట రాకుండా...నిలిచి ఏం జరుగుతుందో అని కనిపెట్టే ఉన్నారు...అతడు మోరాయించడం...ఆమె నోరుచేసుకు గదమాయించి...

పాపపు మాటలనుకున్నాం— చూడు...అ యిల్లాలు

ఇల్లాలు కాకపోతే మాత్రం...మనిషి కాదూ?

మరి, వాడూ ఓ మనిషేనా?—అడదానిపాటి చేయలేదూ... తాను చేసిందేగా...యీ నిర్వాహకం.

ఏంచూసి వలచింది...ఏమోలే, అదంతా మనకెందుకు? —— కులం చెడితేనేం...గుణం మిగలడంసరి—

మరీ ముసుర్లై... దీపాలు చప్పున ఒక్కసారిగా కొండెక్కి ఊరుకున్నాయి. లైట్ హౌస్ మాత్రం వెలుగు...అందని ఎత్తునుంచి...అవతల దూరాలకు అర—మామగా త్రిప్పుతూన్నది. రోడ్డుమీద పిట్ట అయినా అడటంలేదు.

సమయానికి, యింజన్ జమ్ముకున్నది. ఎంతనొక్కినా త్రిప్పినా...గూడు పట్టుకుపోతూన్నది కాని, దానికి జవ పుట్టటంలేదు...

దమ్ముకట్టింది — నెట్టేందుకు ఆమెకూడా ఓ చేయి వేస్తే బాగుండిపోను...కాని అడిగేందుకు దమ్ము చాలడంలేదు:

ఆ బిచ్చగాడు ఎవరో...

ఎవరాతడు...ఎవరో...మన హాయాంకు పూర్వ పరిచయంతో...చిత్తయిపోయి చివరకు యీ స్థితికివచ్చిన బాపతా?—

అయితే మాత్రం...అ పరంపరలో చిదికిపోయిన ఘటాలన్నిటికీ...చికిత్సచేస్తూ కూర్చుండటానికి...తానేం త్రాడుకట్టిన మగడా...

వాడే ధన్యుడు — విడిచిందో...బ్రదికాడో—చేసుకుని చేతగాక దేశంమీద వదిలాడు...విరుచుకు తింటూన్నది... విడిచిపెడితే...

అది నాకు చేతకాదని తెలుసు...అందుకే యిన్ని ఆటలు—

కారులో మొదటనే ఆమె ఎక్కి కూర్చున్నది: ఎక్కడనో పుట్టి ఏ మూలకో మాయమయే వెలుగు, ఆమె పరాకున తల కదిలించినపుడల్లా చెవుల రవలకు ఒరసి...జిల్లున తళుకు కొడుతూన్నది: కారు సాగించడానికి తంటాలుపడుతూ...చుట్టి

ప్రదక్షిణంగా పరిశీలించబోతూన్నప్పుడల్లా ఆ మెరుపు అతని చూపుకు తగిరి ...బెడిసి పోతూన్నది...

కంగారు అంతా అయినతరువాత, కారు కదిలింది: కదిలిక ఎక్కువ తగలకుండా నిదానంగా నడుపుతున్నాడు...వెనుకనుంచి శ్రుతిగా కమ్ముకున్న మూలుగు...అతని మనసులో అనేక రకాల ప్రశ్నలకు, చిలవలూ పలవలనూ...ఆమె వైఖరిలో అమిత నిర్లక్ష్యాన్ని...పెంచుతూంది.

కారు, రోడ్డుమెలివెంట తిరిగి గుమ్మంముందు నిలకడకు మసులుతూండేలోగానే, ఆమె దిగి, తలుపు తాళం తీసి లోపలికి వెళ్ళిపోయింది! అతడు, చక్రం మీదకు ఓ చేయిజాపి...మోపిన మరోచేయి సిగరెట్ కు ఆసరాయిస్తూ...పొగలు గ్రక్కుతున్నాడు:

లోపల వెలుతురు అయింది: వెలుగును పాయదీసుకుంటూ ఆమె, తిరిగివచ్చి... చేరువలో మెట్లమీద నిలుచున్నది:

చూపులకు అందనీక...చూపులను తప్పించుకున్నా...బానిస పడిపోయిన అతని మనసు...ఆమె అక్కడ నిలుచుని, అనుకున్న ఆజ్ఞను...తలనుదాల్చి పాలించింది: అతడు చురుకుగా...పొదుపుగా...అతన్ని...లోపలికి.

...ఆమెకు వచ్చినచోట...అలాగా...ఉంచాడు...తెచ్చి ఆ నిమిషాన ... అందరికీ మౌనం: అంతలో అతని మూలుగు...దాన్ని తరచింది వివరించింది: అతడు ఓర్వలేక...అక్కడ నిలుచోలేకపోయినాడు: మూలుగు, వెక్కిరింతగా...వెనుకబడి తరిమింది.

అత...ను, ఆమె...మిగిలారు:

అదే, ఆమెకు చాలా...ఇరకాటం అనిపిస్తూంది:

అతను మూలుగు నిలిపి...ఆమె చూపును తనకు మళ్ళించుకున్నాడు: ఆమె వశం తప్పిపోతూ... ఆస్తికుడు అడ్డుపడకముందు...అగ్నికుండంవేపు దూసుకునే పన్నగి...అంతకు మిన్నగా ఝుళుకుతూన్నది!

ఎవరు ముందు మాట్లాడేది? – ఏమని?

మాటలాడకపోతేనేం?...

లేకపోతే...మౌనం భరించడం...మరీ కష్టం.

తాను పలుకరించడం...ఏ మొగం పెట్టుకుని?... అతనికి అంత అపకారం చేసిన తరువాత ...అతని... బంగారం పండాలిసిన జీవితం...

పాడుచేసిందా...నిజంగా ఆలోచిస్తే...

అప్పుడు ఆలోచన...అతడు అంతకన్నా ..అలా తాను...అన్నివేళలా అంటిపెట్టుకుని ఉంటే... బాగుపడలేదేమోననే ఆదుర్దాయేగాని...అంతకు మించిన...అన్నెమూ పున్నెమూ అలవరచుకొనగలిగిందా?

ఎవరిది దోషం...

అప్పట్లో...తనకు...ఎవరితోనూ ఊరువిడిచి ఉడాయించవలసిన అగత్యం ఎంతమాత్రమున్నూ లేదు:

మగడు... తగనివాడు కావడం...తనచేత...తనకొరకు ...తనకై...తల్లిదండ్రులు...వారి... వా...రి తల్లిదండ్రుల తరాల నోములకు ఓచని...తపస్సులే...టుస్సుమనగా...

అనగా...ఏం...ఒళ్ళు విరుచుకునేందుకు యింట మన సొగ్గనిదని...పోకిళ్లు పోబోతుందని... నోరూరించుకునే ఊరి మగరాయలకు...తనకూ...ఏమిపని?...ఎవరో ఒకరికి చిక్కక మిగిలితే... తనమనసే తనకు దక్కదనుకుని...గునిసే...కొత్తకోడలా?...

అనూ పాను...అలవోకగా...అలవాటుకు తలచూపకుండా...అమరి...అణగి...అన్ని నాళ్ళకు... ఆడజాడలకు బిడియపడే...ఆ పడుచువాని సిగ్గుపాటున...అలనాటి సంజెవాటున...ఆకలివిచ్చి... రెపరెపమన్న వేళ...

కోరికగా...నేర్చుకున్నది... తీరికకు తనైనాడు. ఆతను, ఎందుకిలా అయినాడు?

మొదట తాను కోరి చేసిన ఉపకారం చివరకి ఆతనికి అపకారం ఎందుచేత అయింది?

అందుకు ఏమిటి కారణం?

ఏరి కోరి వలచింది...ఏమీ తెలియని అర్భకునిచేత వలపించ నేర్పింది...తాను:

ఔనా...అతనికోసమే...అంతవరకూ అవసరంలేని...త్యాగం...నిజంగా తన తలకు మించినపని...చేసింది: అతనిని తనవెంట లేవదీసుకుని...ఇంటిని విడిచివచ్చింది.

వేళా పాళా తెలుసుకో నక్కరలేకుండా యుగం అంత బ్రతుకు దీరు పోకుండా...నిమిషంలో గడపటం... ఏలాగో...గురువై తెలిపింది...తాను అతనికి బరువు తోచకముందే...సన్నతెలిసి... కన్నుమలగిపోయింది...

అతనికి అంతు తెలియని. .దూరంలో...కటిక చీకటి కమ్మించుకుని...హాఁ...అతను ఎంతవాడో కావడానికి...తాను ఏమైతేనేం?

కాని...అనుకున్నది...ఏదీ కాలేదు.

మొదటి మోసం...తన మనసే–

నిన్ను మరచిపోతాడు...నీవు కనపడకపోతే కనపడవని...ఏమో వెతుక్కుంటూ... ఎక్కడికో...ఎక్కడికో. ..ఎక్కిపోతాడు...ముందుపడే అతని అడుగులకు నీవు సంకెల వెందుకౌతావు?...ఇక...అయినది చాలు...తప్పుకో అని దద్దరించినది...తానందుకు సరి అని తల ఊచింది...కాని...

ఆమీదటిమోసం...తనకు తానే...

తాను...ఎందుకు మరచిపోలేదు? పోలేకపోతేనేం?...అతను లేక బ్రతుకలేని అలసురాలా? అదివరకున్న బ్రతుకు...అదేకదా?...కాని...

అతన్ని మరువలేకపోయింది...అతనులేక ఉండలేనని తెలుసుకుని...మోసగించిన మనసును, తననూ మోసగించుకునేందుకు...ఎదురాటగా...అతన్ని పోగొట్టుకొన్న ఆరాటము ఒరపిడికి...మరొక అతడెవరైనా...

ఎవరైనా...ఎందరైపోయినా...ఆ ఉమ్మరంలో తనలోతాను దాక్కునేందుకే...

మరి...ఆతను?...ఎందు కలా అయిపోవాలి?... తాను చేసిన చేత వృథా? తనకు చేతకాలేదా? అతను–– ఎవరో అయి...ఏ ఎత్తునో నిలువకుండా...అతనే అయి...తనకుదక్కిన ఆతని నీడగా – ఎందు కీనాడూ మిగలాలి? తనకోసమేనా?...

ఆ ఊహకు ఎక్కీ దక్కీ అయిన జాలితో...అతని వంక చూసింది...అందుకోసమే ఊపిరి చివర నిలచి ఉన్న అతని చూపులు...ఆశగా దీనంగా...హాయిగా...

అందులోనే...తుఫాను చెలరేగింది...తన పరాజయాన్ని అంగీకరించలేకపోయింది.. దిద్దినా...తీరని ఆతని పసితనాన్ని సహించలేకపోయింది...చూపుల్లో వెన్నెల చలువలు యిగిరి...నిప్పులు కళపెళలాడినవి... ముఖము త్రిప్పేసింది..

అవతల గుమ్మందగ్గర...అంతసేపునుంచి ...ఆమె కోసం కనిపెట్టుకుని ...అతడు... తిరిగి తనకే దక్కే దేవికి మనసుతో సాగిలపడి...మమతతో 'పాపం ఆతను ఏలా ఉన్నాడు'...అని ధైర్యంగా అడిగాడు: ఆమె విషంగా – 'పాపమే...అతనిలా ఉండటం: ఇక్కడ ఉండటం—లేవ సత్తువచ్చిన తరువాత – పడినపాటుకు ఏదో యింత యిచ్చి – పంపివేయమను – మన నౌకరును...అతను ఎవడో—పాపం...' అని అతడిని ఆశలునిండే చిరునవ్వుతో మురిపించి — దొరసానిలాగా — లోపలికి వెళ్ళిపోయింది.

* * *

# విపులాచ పృథ్వీ

ఆడదానికి, పుట్టుకతోనే అర్థిక పారమార్థిక స్వాతంత్ర్యం వారసత్వంగా ఏర్పరచని మన ధర్మశాస్త్రం మీద – ఆ ధర్మపన్నాలన్నీ పన్నిన ఋషుల అమ్‌టీన్ – తరంవాణ్ణి, నామీద – ఆ చిన్నదాని కళ్ళు శివశక్తుల్లాగ భగ్‌మని పోతున్నాయి.

నేను అసలు సజావైన మనిషినే – దురుసువాణ్ణి కాను: మాట తొణకను. కాని ఉత్సాహంకొద్దీ మాట్లాడటంలో ఎదుట ఉన్నది మగవాడో, ఆడదో – ఆ సంగతి మరచిపోతూంటాను.

ఇంతకూ నేను ఏమన్నాను చెప్పమా?

అసలు దేనిమీద మాట్లాడుతున్నామూ?–

నేను ఎవరు, ఆ చిన్నది ఎవరు?

నేను ఎవరో తెలుసుకోవాలని మీకు ఎన్నడన్నా ఉబుసుపోకకు కుతూహలం కలిగితే – నేనంటే గిట్టనివాళ్ళు కొందరు ఉన్నారు: వాళ్ళని అడిగితే నా దుర్గుణాలన్నీ నిష్పాక్షికంగా వాళ్ళు చెప్పగలరు. ఎందుచేతనంటే, సుగుణాలనేవి ప్రతి జీవరాశికీ ఉండేవే కనుక. అవి అంటే నాకు, మీకు అంత గౌరవంలేదు ఒక మనిషి సంగతి సిసలుగా తెలుసుకునేందుకు అవి ఎంతమాత్రమూ ఉపకరించవు. సరే. దీనికేంగాని...నేను ఫలానావాడినే అనుకోండి.

ఆ చిన్నది ఎవరా?–

ఎవరో ఆ వైనం తెలుసుకునేదాకా రానేలేదు: ఇంతలోకే, చూస్తుండగానే ముదిరింది పాకం–

ఎవరైతేనేం గాని...

'అయ్యో:... ఇదుగోనండి మిమ్మల్నేనండీ–' అన్నది. నా కళ్ళకూ ఆ పిల్లకూ, అంతకుముందే వచ్చిన పత్రిక అడ్డం ఉండిపోయింది...కాని, ఆ గొంతులో పదుచుతనం, నాచేత జవాబు పలికించింది.

అది, మూలుగో, సణుగుడో తెలియదు కాని... కడుపులో మెసిలిన గంపెడు వాక్యాలు కదంబంగా – ఒక్క నిట్టూర్పుగా ధ్వనించినవి.

'బాబూ! పేదవాళ్ళం..'

ఈ ముక్క, నే నెరుగున్నంతవరకూ చాలిన వాళ్ళందరికీ అతివినయంగా అలవడిన దుర్గుణం – ఇదీ అంతేకదా అనుకున్నాను...

'పేదవారు ధన్యులు. దే...వుని రాజ్యము వారిది...' అంటూ అపచారంగా నవ్వాను...నవ్వుతూ ఆ చిన్నదానివంక చూస్తున్నాను.

చూస్తుండగా క..ళ్ళు కొరమారినవి. నవ్వు వూడి పోయింది...గొంతుక మండి గుండు తిరిగింది.

ఆ చిన్నది...మా అమ్మకన్న ఎన్నో రెట్లు అందంగా ఉంది... మా చిన్న చెల్లెలికంటే ఎంతో అబ్బనాకారణంగా ఉంది...

"ఏమమ్మా దా...ఇలా...కూర్చో..."

ఉహూ...నావంటి పెద్దల ఎదుట...నా సరసను కూర్చునేందుకు ఆ పేదరాసి పెద్దమ్మకు యోగ్యత ఉందా?– అంత అపచారం చేస్తుందా? అమ్మో...

నేను భాగ్యవంతుణ్ణి. అదృష్టశాలిని...పెద్దవాణ్ణి...

నాకు కూలపడితే ఓ పట్టాన తేలిగ్గా లేవలేనంత ఒళ్ళు ఉంది– పెద్దల దయాధర్మాన నన్ను కట్టుకుపోయేంత–– లంకంత కొంప ఉంది. ఏ తరంవారో కూడబెట్టిన పాపాన – అదనుకు అక్కరగా పర్సులో పదో పాతికో ఆడుతూన్నవి...కలియుగానికి ఇంకా ఒక్క కాలు మిగిలి ఉన్నందువల్ల– నా నెత్తిన ఏ మూలనో గోష్పాదమంత మేర ఆయకట్టులో ఉంది...ఇవి భాగ్యవంతుడి చిహ్నాలని తల్లి కడుపులో ఉండగానే ఆ చిన్నది...విన్నది.

సహజ ఔదార్యమంతా ప్రకటిస్తూ నేను దానం చేసే పరకో పాతికో – ఆ తల్లికి ఆ పూట కడుపునింపుతుంది– నాలాంటి తలకుమాసిన విప్రాసులు యీ గడ్డమీద ఎందరు లేరు?– మా అందరి కళ్ళకూ అయాచితంగా ఆ చిన్నది పండువుచేసి పోతుంది. పోతుందా?

"కూర్చో అమ్మా!"

–భయపడుతూ – ముళ్ళమీద కూర్చున్నట్టు ఉంది– నను, పరకాయించి అదేపనిగా తేరిపారజూస్తూంటే – ఆ కళ్ళకు భయం ముంచుకొచ్చింది. ఆ మొగం బిక్కమొగమైంది.

'నీవు పేదరాలివమ్మా?

ఆ అమ్మాయికి అర్థంకాలేదు. కాని, ఆ చూపులకు నాచేత నేనన్నమాట విప్పి చెప్పించుకోగల ధీమాలేదు. నావంక చూడక – నేను చేరగిలపడిన కుర్చీనీ – నా చేతిలో ఉక్కిరిబిక్కిరౌతూన్న పత్రికనూ – నా మణికట్టును కట్టుకొని ప్రాకులాడే గడియారాన్నీ – 'అయ్యగారు అన్నమాటకు అర్థం ఏమిట'ని అడిగితే – విడబరచి చెప్పేటంత నోరూ – వాయూ వాటికి ఎక్కడివి?

'ఏమమ్మా – బంగారంలాంటి ఒళ్ళు – రతనాలవంటి పళ్ళు – నీలాలు ద్రిమ్మరించే కళ్ళు – యింత సంపద నీవు ఒక్కర్తెవ్వూ ఏం జేసుకుంటావమ్మా? నీకే పేదరికమైతే – ఇక మా అందరిమాట ఏమిటి?'

–నేను, ఇంకా నవ్వుతున్నాను – ఆ చిన్నదాని మొగం వికంగా మెక్సికో – రోజా అయిపోతూంది...

'బాబూ – కులానికి పేదలం కాని–' గులాబీ రేకలు తతిమ్మా అర్థాన్ని నిప్పులు చెరిగినవి–

–నేను యింకా నవ్వుతూనే ఉన్నాను – అవును, నేను రాక్షసుణ్ణి.. ఆ చిన్నది – వెక్కి వెక్కి ఏడుస్తూన్నది.

–అచ్చమైన ఆడపిల్ల ఏడుస్తూన్నప్పుడు అందంగా ఉంటుందని...ఈ చిన్నది కలగన్నదా? ... ఒక్క నిమిషంలో నేను పంచకావ్యాలూ...ఆ కళ్ళ కొలుకుల్లో పఠించాను...

లేచి వెళ్ళిపోతూంది...

"ఎక్కడికి పోతావ్?" – నా గొంతులో ఏకోశానా దయాదాక్షిణ్యాలు లేవు...నేను పుట్టినప్పటినుంచీ బస్తీల్లోనే పడి ఉండి, ఎన్నడూ అరణ్యం మొగం అంటూ చూడని పాపాన...పులి గాండ్రుమన్నప్పుడు లేడిపిల్ల కదలలేక ఎలా గజ–గజలాడిపోతుందో ఆ పోణిమి ఎరుగను...కాని, బాధ చూస్తుంటే మనసుకు అబ్బే శాంతి–యిప్పుడు అర్థమౌతూంది...

'వచ్చి...ఇలా కూర్చో'

దక్కిస్తూ...రాక ఏంచేస్తుంది? – వంటయింటి కుందేలు...

'అనగా–అనగా ఓ రాజు ఉండేవాడు...ఆ రాజు పేరు, నీకు నోరు తిరుగదుగాని...ఊఁకొట్టవేం...?'

ఆకళ్లు...తల్లిగర్భంలో తన్నుకునే శిశువులాగా...మూగయాతన పడుతున్నాయి... 'ఊఁ–' మెడనరాలు కదలినాయి...

"ఆ రాజుగారి దర్బారులోకి...ఒకనాడు...ఓ పేదపిల్ల వచ్చింది...పేదపిల్లంటే...అచ్చంగా పేదపిల్లే... మొలచుట్టూ చాలిన కోక లేదు...రొమ్ము జుట్టుతో కప్పుకుంది...అడుగుతీసి అడుగు వేసినప్పుడల్లా ఒళ్ళంతా బట్ట–బయలౌతూంది...

–ఆ చిన్నది...సిగ్గుతో భూమిలోకి క్రుంగిపోతూంది. అణగి మణగిపోతూంది...

సభలో ఉన్నవాళ్ళందరూ తల తిప్పేసుకున్నారు... రాజుగారికి మాత్రం ఆ అలవాటు లేనందువల్ల అలాగే చూస్తూ కూర్చున్నాడు...క్రమంగా ఒక్కొక్కరే సభలో వాళ్ళందరూ, చల్లగా బయటికి జారుకున్నారు...సభ బావురుమంటూంది...సింహాసనంమీద రాజు...మెట్లక్రింద ఆ పిల్ల... వాళ్ళిద్దరే మిగిలారు..."

–కుర్రది, యీదురులో గిజిగాడులాగా ఉంది. తల ఎత్తకుండా కళ్ళు మలపకుండా...చుట్టుపక్కల యావత్తూ ఒకసారి చుట్టేసింది...ఎక్కడా ఎవరూ లేరు...మేము యిద్దరమే మిగిలాము.

'అప్పుడు ఆ రాజు ఏంచేశాడో తెలుసునా?...కూర్చున్నచోటునుంచి, క్రిందికి దిగివచ్చి, ఆ పిల్లను...'

–నాకు ఎందుకో భయంవేసింది...కాని, చెప్పక తప్పదు...

...'ఆ పిల్లను – పెళ్ళిచేసుకున్నాడు...'

పిడుగుపడినంత నిశ్శబ్దం మార్మోగింది... ఆ చిన్నదాని కళ్ళూ, పెదవులూ, ఎండిపోయినాయి...ఎడం చెక్కిలిమీద, సగం యింకిపోయి ముత్యమంత ఓ చుక్క తొణికిసలాడుతూంది...

..."మంచిపని చేశాడు కాదూ..."

ఆ చిన్నదాని మెడ, వెనక్కు విరుచుకుంది – గొంతు చాయల నరాలు కదను తొక్కుతున్నాయి... కణతను పుణుకున్న లేతనరంతీగె కళుక్ మంటూంది.

"నన్ను...పెళ్ళి...చేసుకుంటారా?"

...నిన్న, మా చెల్లెలి మనుమరాలు అడిగిందికదా... 'తాతయ్యా! నిప్పు కరుస్తుందా?...' అప్పుడు ఆ పసికుంక తీరూ, చూపూ ఇలాగే ఉంది...

"ఓఁ...తప్పకుండా!..యింతకన్నా నాకు కావలసిన దేముందీ?"

...సప్త సముద్రాలలోనూ ఆదికాలంనుంచీ మనకు అందకుండా పేరుకుపోయిన ముత్యాలన్నీ ... ఆ కళ్ళు పంతంగా కురిపిస్తున్నాయి...చూడ ముచ్చటగానే ఉందికాని...చెప్పొద్దూ, ఇక నాకు నవ్వు ఆగడంలేదు...

'ఏమిటి కేద్చెదవానన తామరసంబెత్తిచూడు,'

అర్థంకాక, తలఎత్తి నావంక బిక్కగా చూస్తోంది... నేను పకాల్ మన్నాను...

'కోమల కటాక్షవీక్షాదామకమున వీరసేనతనయున్...'

గుమ్మంలో నిలుచుని...మా తాత తండ్రుల ఆస్తి పాస్తులన్నింటికీ జ్యేష్ఠవార సుడు...ఇవతల అడుగువేయడానికి సందేహిస్తున్నట్టు...కళ్ళ కెదురుగుండా ఉన్న అద్దం, దాఖల్ చేస్తోంది...సరే ...బాగానే...ఉంది.

'ఇక నీకు తప్పదమ్మాయ్! నీవు ఏమనుకున్నా సరే... పెళ్ళిచేసుకు తీరాలిసిందే...' – చాలా నిష్కర్షగా అన్నాను.

అందుకు ఆ చిన్నది, ఏమంటుంది?...గర్జిస్తుందా, గాండ్రిస్తుందా? ఇల్లుతీసి, పందిరి వేస్తుందా? చిగురుతొడిగీ నవనవలాడుదామనుకునే లతకూనకు శివమెత్తి ప్రళయహుంకారం చేసినప్పుడు మెరసే సమ్మోహనంకోసం యీ కళ్ళు ఎన్నో యుగాలనుంచి, కాయలుకాసి పోయినవి. కాని, ఆదికాలంలో వేదాలకొనలో, ప్రకృతి, ఒక్క రుద్రమూర్తికే ఆ వరం యిచ్చింది...ఆ తరువాత, నాటినుంచి నేటిదాకా అంతటి భయంకర సౌందర్యాన్ని భరించగల మొగవాడెవడూ పుట్టనేలేదేమో...ఏమో. ఆ సంగతులన్నీ మన కెందుకుగాని...

ఆ చిన్నది ..బంగరుబొమ్మై అలాగే నిలువబడిపోయింది... పెదపాటి ఎర్రన్న మల్లణ చరిత్రలో, ఆ సీసపద్యం మీకు జ్ఞాపకం ఉందా? లేకపోతే మానె. పాపన్న ఉత్తర రామాయణం విప్పి...రంభ బలవంతాన అలసిసొలసి అత్తవారింటి చాయలకు అడుగుతీసి అడుగువేస్తున్నప్పుడు పాపన్న సీసంలో పడ్డబాధ... అన్ని పాదాలూ చదవండి... నాకు పది తలకాయలు లేవు.. ఇరవైచేతులు లేవు... ఈక్షణం వరకూ గోరంత అయినా పాపం చెయ్యపూనుకోలేదు.. కాని, ఆ చిన్నది...ఆ నిమిషంలో మౌనంగా సహిస్తున్న బాధ...మీరుకాదు...మీకన్న కొమ్ములు తిరిగినవాళ్ళే చూడలేరు...

'అమ్మాయ్' .కూర్చున్న చోటనుంచే అన్ని గదులలోకీ కూలంకషంగా వినబడి తీరవలసిన పొల్లుకేకపెట్టాను..

"ఆఁ..."అనుకుంటూ, ఒక అమ్మాయి అవతరించింది...."ఊఁ" అని దానికన్న చిన్నది చనువుగా ముద్దులు గుడిచింది...

'ఏందుకు నాన్నా!' అని ఇద్దరూ, తలొకశ్రుతిలోనూ అన్నారు.

"...లోపలికి తీసుకువెళ్ళి పెళ్ళికూతుర్ని చేసి తీసుకురండమ్మా!..." ఆ చిన్నదానివేపు తల విసిరాను.

'సైఁ' అన్నట్టు యిద్దరూ ఎగిరి గంతువేశారు. ఇక్కడ ఒక అప్రస్తుత విషయం ఉద్ఘాటించి తీరాలి... నా నోటినుంచి ఏ ముక్కన్నా వచ్చేదే వ్యవధానంగా, మా పిల్లలు, యిలాగే అవును – కాదు – అనకుండా ప్రతిపనీ చేస్తారు.. మంచి వినయ విధేయతలు వున్నాయి.. బుద్ధిమంతనపు పిల్లలు...అని అనుకుంటారేమో? వాళ్ళు వట్టి రాలుగాయలు సుమండీ.. నేనన్నమాట అర్థమైందనిః కాదు. కాని, నేనేదో పాడుపని తలపెట్టానని ...ఏది చెప్పినా చిటికలో చేస్తారు. నా దుర్మార్గంమీద, వాళ్ళకు అంత ఘట్టినమ్మకం..

★ ★ ★

# మస్తానీ

నాకుమాత్రం రూఢిగా తెలుసును. వాళ్ళ అన్నయ్యకు అ కీ చిక్కీ – చిక్కనట్టువుంది. యింకా అనుమానం వేధించుకుతింటూనే ఉందనుకుంటాను. లేకపోతే, 'ఏం తాతా! మావాడు తాగుతున్నాడటనే, నిజమేనా?' అని నన్ను ఎందుకు అడగడా?...అనుకుంటూ నేను బాధ పడటం ప్రారంభించాను: అయన గుట్టు చప్పుడు కాకుండా అలా ఊరుకోవడం, నాకు, ఎందుచేతనో తగని చిన్నతనంగా ఉంది.

అరోజుకు అరోజు అలానే గడిచిపోతుంది. వారాలై...ఆ వారాలన్నీ నెలలై...

వాడు త్రాగడమేకాదు. అంతటితో పోనీకుండా, ఎవతెనో మరగి తందనాలుకూడా అడ్డం ప్రారంభించాడుట! పోనీ, అప్పుడైనా, వాళ్ళ అన్నయ్య, గుడ్లనీళ్ళు కుక్కుంటూ వచ్చి, తనసొదంతా నాదగ్గిర వెళ్ళబోసుకున్నాడా? – ఉహుఁ...మునుపటంత ఝూరీగా నాకు కనపడటమే మానేశాడేమో కూడాను ఈ నడుమను.. అనుకోవలసివస్తూంది...

పోనీ, ఎవరి ఖర్మం వారిదీ; నేను అఘోరించడం ఎందుకు మధ్యను?

ఇంతకన్నా మరీ అగడంగా ఉందిట, చూశారా, వాడిపని యీ మధ్యను? – అనాటి కానాడు, మరీ పెచ్చుమీరిపోతున్నాడట. మొగరాయుడు, ఒకతెనుకాకపోతే, వందమందిని పెట్టుకుని దేవుళ్ళాడనీయండి; కాని, పాపం, నోరూ – వాయాలేని అ యిల్లాలిని రాచి – రంపానపెడుతున్నాడట!

ఇలా కొంపముంచుకువచ్చినా, యిప్పటికన్నా, ఆ అన్నగారు, బెల్లంకొట్టిన రాయిలాగా, అన్నీ చూస్తూ సహించి ఊరుకున్నాడా? – ఊరుకున్నాడన్న మాటేకదా? యిప్పుడన్నా వచ్చి, నా చెవిని వేస్తే వాడి ముల్లెంతా ముంచుకుపోతుందా ఏం? – ఎబ్బే! కంటికంటూ కనబడితేనా, అసలు?–

నాకన్న ఆప్తులూ, వాళ్ళమేలు కోరేవాళ్ళూ, ఎవరున్నార్రా వాళ్ళకి? ఎటు పారజూసినా, రవంత వంకర వస్తే ఎంచులుపెట్టేవాళ్ళేతప్ప! – అయినా, ఏం అనుకుని మాత్రం, ఏం లాభం...

ఈ పాటికి ఊరంతా అట్టుడికినట్టు ఉడికిపోతూ ఉండదూ? ఈలాటి విషయంకూడా, అందరికీ తెలిసిన తరువాత నాదాకా రావడం?

నేను ఇలా అంటున్నానని, 'ఈయనకేం కొమ్ములు మొలిచాయా? ఈయనేమన్నా, కొండమీదనించి దిగి వచ్చాడా? ప్రతీది యీయనకే తెలియాలనీ, ఈయనే ఆర్చేవారూ–తీర్చేవారూ అనీ..ఎందు కీ ముసలివాడికి యింత అహంకారం?' అని అనుకునేరు సుమీ? అదికాదు, నే ననేదల్లా ఒక్కటే: యిక్కడ నేనంటూ ఒకడిని ఉన్నానుకదా, ఏవంక చూసినా పెద్దవాణ్ణి. వాళ్ళు పచ్చ–పచ్చగా ఉంటే, అ ముద్దూ – మురిపెమూ చూసి సంతోషించేవాణ్ణి...నేనంటూ యింకా ఉన్నానుకదా...నా చెవిని

వెయ్యకూడదూ...'అబ్బీ నీ కిది తగదురా!' అని మందలించేందుకు, నేను తగనూ? ఇంతకూ నేనంటే వాళ్ళకు లక్ష్యంలేదు... ఈ కాలంవాళ్ళందరికీ, యివే బుద్ధులు, ఇవే సర్వజ్ఞత్వాలున్నూ! ఏమిటో, యీ వృద్ధాప్యంలో, నడుమ నాకు పట్టింది యీ రంధి...ఛస్, ఎవరు ఎల్లాపోతే నాకేం?

'ఎవరెల్లా పోతే నాకేం' అని ఊరుకుందామా అంటే, మళ్ళా ఓ పక్కను పీక్కుతింటూనే ఉంది. రేపు ప్రొద్దున్న ఎవరికన్నా, యీ సంగతి తెలిస్తే, ఏమంటారు? – 'ఏమయ్యా వాళ్ళు బొత్తిగా లోకజ్ఞానంలేని కుర్రకుంకలనుకో; యిన్నేళ్ళు వచ్చి, నీవు వెలిగించిందేమిటి?– నీకన్నా అమాత్రం యింగితం ఉండవద్దూ? యిదేమన్నా పెళ్ళా పేరంటమా, బొట్టూ కాటుకా పెట్టి పిలిచారు కాదని భీష్మించుకు కూచునేందుకు? వాళ్ళ యింటికి పెద్ద దిక్కు,వు, నీవే ఇలా అంటీ ముట్టకుండా ఉంటే, ఇహ ఇతరులకేంపట్టింది? ఛాల్ చాల్లేవయ్యా, ఎవరన్నా వింటే నవ్విపోయ్యేరుగాని!'...అనరూ? అవును. ఎందుకు అనరూ?...

సరే...యింతకూ, నాకు తప్పుతుంది గనుకనా...ఆలనా – పాలనా లేకపోయినా, నేనే తగుదునమ్మా అంటూ పోయి, ఆ సంగతేదో తేల్చాలి...హింతకూ...యీ కాలంలో ముసలివాళ్ళంటూ బ్రతికి ఉండటం అనర్థకం? బ్రతికి ఉండి బావుకునే దేముంది? ఈ అగచాట్లన్నీ చూస్తూండటానికేనా?

మూడు బారలు ప్రొద్దెక్కింది. యిప్పటికీ ఆ ప్రబుద్ధుడికి యింకా తెల్లవారలేదు. పెద్దవాడు, బంగారు తండ్రిలాగా, నాకు ఎదురుగుండా వచ్చాడు. నేను గుమ్మంలో అడుగు పెడుతూండగానే వాడి తండ్రి కడుపు చల్లగా...వాడి మొగం చూస్తేనే, పంచమహాపాతకాలూ రాలి చక్కాబోతాయి యింకా అలాటివాళ్ళు ఒకడో, అరో ఏమూలో ఓమూల ఉండబట్టే పచ్చి –. కలి భగ్గుమనకుండా ఉంది!

'ఏం తాతయ్యా!' అని నోటినిండా పలుకరించాడు. 'ఏం రా నాయనా' అన్నాను: అంతే – తరువాత ఏం మాట అనడానికీ, వాడికీ భయమే, నాకూ భయమే. నోళ్ళు మెదపకుండా, నొసళ్ళతోనే మాట్లాడుతున్నాము. సరే పెద్దవాడికి ఏదో వీధిలో పని ఉండటం, వాడిమానాన వాడు వెళ్ళిపోయినాడు.

ఇల్లంతా చిన్న బోయి ఉంది; బావురుమంటూంది. పెద్దవాడి పెళ్ళాం నీళ్ళాడటానికి ఈనడుమనే, అంటె రెణ్ణెల్ల క్రితం పుట్టింటికి వెళ్ళిందాయెను! లేకపోతే, అదీ పిల్లలూ ఉంటే ఇల్లు ఎప్పుడన్నా ఇల్లా ఉండేదా? అస్తమానమూ గలగల్లాడుతూ, చూడ ముచ్చటగా, కనులపండువుగా ఉండేది కదా! పెద్దవాడు, పెళ్ళాం ఇంట్లో లేకపోతే, ఒక్క ఘడియ ఇంట్లో ఉండడు. ఆ వేళకు వచ్చి నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని చక్కా బోవడమేకాని, లంకంత కొంపలో, ఇహ ఉన్నదల్లా, ఆ చిలుకా గోరువంకా!

నేను, పిలవగా పిలవగా, పక్కా ఝామునకు, వాడు ముక్కుతూ మూలుగుతూ, నిక్కి నీలిగి, లేచాడు ఏలాగైతేనేం...నన్ను చూసి కళ్ళు చిట్లించికుని, కూర్చున్న వాడల్లా అట్టె దభాలున గోడవేపు ఒత్తిగిలి పడుకున్నాడు. నాకు చర – చరలాడుకువచ్చింది చెప్పొద్దూ.కాని నిభాయించుకున్నాను. చూస్తూ కూర్చున్నాను.

ఎంతసేపు కూర్చున్నా, వాడిలో ఏమీ చలనం కనిపించదు.

'ఏమిరా అబ్బీ! యింకా తెల్లవారలేదా?' అన్నాను నిదానంగానే.

వాడు ఈ పక్కకు ఒత్తిగిలి, తలయెత్తి చెంపను చెయ్యి ఎత్తుపెట్టుకుని,

'తెల్లవారితేనే కాని, నిద్రపోవడానికి తీరిక ఉండదు. తాతయ్యా!' అన్నాడు. బాగానే ఉంది వరుస!

'అంత తీరిక లేకుండా ఏం వెలగబెడుతున్నావో?'

'లక్ష్మీసుందరం ఇంట్లో అత్తరు దీపాలు.'

'ఊహూఁ' మకున్నాను మనసులో, గదమాయించేందుకు నోరు రాక...

'తాతయ్యా! వాళ్ళ మేనత్తని, మా పెదనాన్న ఉంచుకున్నాట్ట – ఎప్పుడో ఏభైఏళ్ళ క్రిందటి వాళ్ళ ముచ్చటలన్నీ ఆ ముసిలిది, వసపోసినట్టు వాగుతూ ఉంటుంది...మొత్తానికి, అకాలంలోనూ దేవాంతకులు ఉండేవాళ్ళన్నమాటే... మా కారువాళ్ళే ప్రయోజకులనుకోవడం శుద్ధ పొరబాటేమో అనిపిస్తూంది. వాళ్ళ ముద్దులూ, మురిపాలూ, ఆ కేరింతలూ...వాటిల్లోనూ మజా లేకపోలేదు. అయితే తాతయ్యా! నువ్వు ఎన్నడన్నా, తలకు మల్లెపూలు చుట్టుకున్నావా?' – ఇంకా వాగుతున్నాడు; వాడి నోటికి 'శుద్ధీ–బద్ధీ' అంటూ ఉంటేనా?

'ఒరేయ్, పెద్దవాళ్ళను ఏమన్నా అంటే కళ్ళు పోతాయిరా! మీ పెద్దనాన్నకే ఎంచులు పెడుతున్నావుగా...ఆయన ఘనాంత స్వాధ్యాయి.'

'నాకు తెలుసును లేవయ్యా...ఆయన సత్తా ఆ రంగనాయకి ఆవరణలో పడి ఉండి, ఆ బ్రాహ్మడు 'అహోరాత్రశ్చ" ఘనా–జటా చెప్తుతూ, ఉండేవాడని. అయినా, పోయిన వాళ్ళసంగతి మనకు ఎందుకులే...'

'వాళ్ళపేరు తలవడానికి అయినా నీకు యోగ్యతలేదు.'

'ఎందుచేతనో?'

'ముఖం ఉంది – అద్దం ఉంది, లోకం అంతా కోడై కూయటంలా?'

'కోడికూత కూయడమన్నా ప్రతివాడికి తరమా తాతయ్యా! అంతకుముందు, ఒళ్ళంతా కళ్ళుచేసుకుని అధమం రెండుకళ్ళన్నా, ఏ ఆడదానిమీదన్నా వెయ్యాలి, అర్ధరాత్రివేళ...తీరా యింతచేసినా, ఆ పిల్లదాని పెనిమిటికి నిదురలేవగానే స్నానంచేసే అలవాటు లేకపోతే, యిక్కడ ఈ అయ్యవారికి రససిద్ధి కాదు.'

"రససిద్ధి ఎలాగూ కాదులే; అయితే–గియితే దేహ శుద్ధి..."

"అది మాత్రం అందరికీ దక్కుతుందా తాతయ్యా! దానికి ఎంత నిబ్బరం ఉండాలి? – చీమ చిటుకుమనకముందే తోక ఝాడించడానికి సిద్ధంగా ఉండే రసికుడికి, సిద్ధీలేదు. శుద్ధీలేదులే...."

"మరి...బుద్ధి అంటూ..."

"అంటూ ఉంటేనే యీ చొరవలన్నీ! లేనినాడు, ముక్కు మూసుకు జీవితమంతా కూచుని, తదనంతరం, రంభ పడకగదిలో నిదురలేవాలని... అవునులే, వాళ్ళ ఆశకు ధరీ అంటూ అంతు ఉండదు. యుగయుగాలనుంచీ చచ్చి చెడి అక్కడకు చేరుకున్నవాళ్ళ యీతి బాధలన్నీ ఒంటపట్టి కూర్చున్న ఆ తొత్తుకూతురు కానీ ఖర్చులేకుండా, తేరగా దక్కుతుంది కదా అని..."

"సరే, యీ శుష్క ప్రియాలకేంగాని...నీ వరుస ఏమీ బాగుండలేదురా అబ్బీ!"

"ఏ వరుస?"

"ఏం వరుసా? నేర్చుకుపోయావులే...యతి అంటే ప్రతి అనడం... నీతోటి వాళ్ళంతా యిలాగే చేస్తున్నారటరా? – చూసి నేర్చుకోరాదూ? నీ అన్నచూడు!"

"వాడిపేరు ఎత్తడం ఎందుకులే? మా అన్నయ్య, మా వంశం పరువులీ సేస్తున్నాడు..."

"అవును, ఆ మాట నిజమే. మహానుభావుడవు, నీవు ఒక్కడవే కులం ఉద్ధరించడానికి అవతరించావు."

"నిజం చెప్పావు తాతయ్యా! ఊళ్ళో వాళ్ళ అందరి ఆయుస్సూ పోసుకుని, యింకో వెయ్యేళ్ళు బ్రతుకు!"

"అవును, యీ చూసే ఘోరాలు చాలక..."

"చూసి సంతోషించడం ఎంతకాలం తాతయ్యా... నీవు కూడా కొన్ని ఘోరాలు చెయ్యరాదూ – పితృదేవతల కడుపు నిండుతుంది?"

"... ఆహాఁ, నీవు చేస్తున్న నిర్వాహకం అదేగా..."

"తప్పకుండానూ! పురుషుడైపుట్టి బుద్ధెరిగిన తరువాత..."

"ఆఁ... బుద్ధి బుగ్గయినట్టే ఉంది... తా జెడ్డకోతి..."

'వనమెల్లా బాగుచేసింది... తాతయ్యా! నాకు నీతులు ఉపదేశించాలని, పనివాళా ఇంతదూరం నడిచి వచ్చావు, పెద్దవాడవు...'

'నా పెద్దరికం మండినట్టే ఉంది..'

'నీవేం చేస్తావు తాతయ్యా... వయసు తానంతట అదేవచ్చేస్తుంది. మనం వద్దన్నా మానదు. కనపడవద్దన్నా దాగదు... దానికి బుద్ధిలేదు. నిన్నంటున్నా ననుకునేవు సుమీ... ఉన్న విషయం చెపుతున్నాను...'

'ఎంతకైనా తెగించిన వాడివి; నీ కేంభయం?'

'మళ్ళీ అంత గుణం నా దగ్గర ఉంచుకోనులే... నేను మంచి అనుకున్న దేదో చెయ్యడమేకాని, ప్రతివాడినీ చేరదీసి ఉపదేశం చేయాలనే ఉబలాటం లేదు. అసలు తీరిక లేదు, ఇంతకూను. ఈ వితండం అంతా ఎందుకుగాని, ఒక్కముక్క చెపుతా విను తాతయ్యా!'

'మా పెద్దలందరూ, ఎవడికి వాడే మాంచివేత్త... తనకన్న, తన తండ్రి తాత నయం, వాళ్ళే – మంచివాళ్ళు అనిపించేందుకు, ఎవడికి వాడే చెడిపోయినాడు.'

'చెడిపోయిందెందుకూ, స్వార్థంతో కాదు సుమా! పెద్దవాళ్ళపేరు బాగుచేసేం దుకు... మా నాన్నకన్న నేను చాలా ఉత్తముణ్ణి అని అనిపించుకోవాలని నాకు ఏ కోశానా లేదు. మా అన్నయ్య మా వంశంలో చెడబుట్టాడన్నది అందుచేతనే.'

'నేను చెడ్డవాణ్ణి అని లోకానికి తెలియడం ఎట్లా? నాలిక భుజాన వేసుకొని ఎక్కేగడపా – దిగేగడపాగా ఊరూరా మ్రోగినా – లోకం నా మాట నమ్ముతుందంటావా? చెబితే ఎవడూ ఏ మాటా ఛట్‌న నమ్మడు; మన ముందర ఔనని తలఊపి, మనవెన్ను తిప్పగానే అవునా కాదా అని ఆరాతీయడం ప్రారంభిస్తాడు... అదీ చిక్కు.

'అందుచేతనే, చెబితే తీరదు. చేసి చూపించాలి. వాళ్ళకంటబడేట్టు చేయాలి.

'నేను తప్ప తాగుతున్నాను. ఎవతెనో ఓ కుర్రముండను ఉంచుకున్నాను. ఈ రెండు నిదర్శనాలు ఘట్టిగా చూపించిన తరువాత, తతిమ్మా విషయాలు లోకం ఊహించుకోగలదు – వీడు ఆస్తి అంతా తగలేస్తున్నాడు; పెళ్ళాన్ని రాచి – రంపాన పెడుతున్నాడు, వట్టి అప్రాచ్యుడైపోయినాడు – యిత్యాదులు...'

'అయితే తాతయ్యా! యిందులో, ఇంత స్వార్థం లేకపోలేదు; పరాయివాడివి కావు గనుక చెపుతున్నాను మర్మంవిడిచి; ఆ త్రాగేదేదో చచ్చూ–చవక బారూ కాకుండా ఉత్తమోత్తమమైన రసాయనాన్ని సేవిస్తున్నాను: అది తుష్టీ పుష్టీ యిచ్చేదే కాని, అజ్ఞాను లనుకునేట్టు ఒళ్ళు గుల్లచేసే బాపతు కాదు. నా బుగ్గలు చూడు యెలా ఉన్నాయో – నా దండలు చూడు ఎలా ఉన్నాయో – అచ్చంగా బంగారు తండ్రిని!

'ముండను ఉంచుకున్నా నంటావూ...ఓపిక ఉన్నప్పుడల్లా పట్టుమని పదిరూపాయలు ఖర్చుచేస్తున్నానేకాని, అందుకోసం యజ్ఞ – యాగాదులేమీ చెయ్యడంలేదు: నేను లక్ష్మీసుందరాన్ని ఉంచుకున్నాను. రంభ, నా వార్ధక్యంలో నన్ను కూడా ఓకంట కనిపెడుతూ ఉండాలనే అభిలాష నాకు కలలోనైనా ఉండదు...

'పెళ్ళాన్ని రాచి – రంపాన పెడుతున్నానంటారూ? నిజమే, అక్షరాలా నిజమే తాతయ్యా...తెల్లవారి లేచేప్పటికల్లా తల చెదరకుండా సిగలోపూలు నలిగి, నామరూపాలు లేనివైపోకుండా, కంరసరులు చిక్కుపడకుండా, చిన్నది అసురుసురంటూ వసివాడకుండా – ఒక్కనాడన్నా ఉన్న పాపాన పోలేదు. ఏం చేస్తాము. అడజన్మ ఎత్తినందుకు అనుభవించక తీరదేమో! అయినా, నీ మనుమరాలు ఏమంటుందో కనుక్కో?"

––వీడి అమ్మకడుపుడకా. గుక్క తిప్పకోకుండా పనస చెప్పినట్టు చెప్పకొచ్చాడు: నన్ను, ఊం అననివ్వలేదు ఆం అననివ్వలేదు. ఔనందునా, కాదందునా? – మాటలు నేర్చిన కుక్కని వేటకుపంపితే అన్న సామెతగా ఉంది వీడి యుక్తులూ వీడూ బంగారంగానూ!

"ఇంతకూ నీవు ఏ దోషమూ ఎరుగవన్నమాట?" – ఏదో ఒకటి అనాలిగా మరి. ఏమాటా అనకుండా బెల్లం కొట్టిన రాయిలాగా ఊరుకుంటే, వాడు మరీ రెచ్చిపోయి నా చెవులట్టుకు ఆడించేట్టే ఉన్నాడు.

"అదేం మాట, తాతయ్యా! దోషం ఎరుగనంత కర్మం నాకేంపట్టింది?...ఎరుగుండే, మహారాజులాగా త్రికాలములయందూ చేస్తున్నాను: నేను ఏపాపమూ ఎరుగనని మడిగట్టుకుని, మా భ్రాతలాగా కూర్చుంటే, పెద్దవాళ్ళందరిపేరూ మాసిపోతుంది. నీమటుకు, నీ సంగతి చెప్ప, మా అన్నయ్యను చూసినప్పుడు ఎన్నడన్నా మా పెద్దవాళ్ళపేరు తలచ బుద్ధిపుట్టిందా నీకు, తద్దినంనాడు భోజనంముందు తప్ప.. చచ్చి స్వర్గాన ఉన్నాడని అనుకోరే...నాలాటి సుపుత్రుడు ఉండబట్టే...నా మొహం చూసినప్పుడల్లా...నేను చేస్తున్న ఘనకార్యాలు, మీ చెవిని పడినప్పుడల్లా మా నాన్న పేరు పట్టుబలవంతాన తలచుకుని.. నా అంత దుర్మార్గుడు కాడని మెచ్చుకుంటారు... అవునా, కనుక, ఏతావాతా నేను అనేదేమంటే కులము ఉద్ధరించేందుకు నావంటి కొడుకే కావాలి: పితృదేవతలకు, నా స్వార్థ త్యాగం నచ్చితే, నాకన్న ఛండశాసనుడు నా కడుపున పుట్టేట్టు దీవిస్తారు..."

రామ – రామ, వీడితర్కం ప్రచండంగా ఉంది– వీడికి సమాధానం చెప్పడానికి పెద్దలు దిగిరావలసిందే – వీడికి సమాధానం చెప్పడానికి పెద్దలు దిగిరావలసిందే – నాతరమయేట్టులేదు. కానీండి. ఎవరెలాపోతే నా కెందుకు? నేను ఎల్లకాలమూ ఉట్టిగట్టుకు ఊరేగుతూ ఉండవచ్చాను గనుకనా? – ఈకాలపువాళ్ళవన్నీ, యివేబుద్ధులు. యిక నాదోవను నేను పోనా?

'కాస్త కాఫీ పుచ్చుకు మరీ వెళ్ళు తాతయ్యా! చాలా హైరానుపడి వచ్చావు పాపం!' అంటున్నాడు ఆ దిప్పకాయి:

కాఫీ అ? ఈ కాఫీలూ గీఫీలు నాడూ నేడూ ఎన్నడన్నా, ఎరుగుదుమా? ఏవీ అక్కర్లేదు. మా రోజులు ఇల్లా వెళ్ళిపోతే చాలును.

'కాఫీకి ఏమీ నిషేధం లేదు తాతయ్యా! ఇది సప్తవ్యసనాల జాబితాలో లేదు. పుచ్చుకున్నంతమాత్రాన చెడిపోయే యోగ్యత నీకు దక్కదు. అదిగాదు, అసలు విషయం మరచిపోతున్నాను – రంభ చెల్లెలి కూతురుకి, కాఫీ అలవాటో, విస్కీ అలవాటో నీకు తెలియదాయెను. ఎందుకన్నా మంచిది... ఇక్కడుండగానే అదో గుక్కెడూ ఇదోగుక్కెడూ రేపూ మాపూ కాస్త హితవు చేసుకుంటే, తీరా అక్కడకు వెళ్ళిన తరువాత అప్పుడు ఓనమాలు దిద్దవలసిన అవసరం లేకుండాపోతుంది... 'నాథా! నా ముద్దు చెల్లించరూ' అంటూ బ్రతిమాలే వ్యవధానం, తీరుబడి ఆ లోకపు లంజెకానలకు ఉంటుందంటావా? ... హరిః ఓం అను తాతయ్యా...మీలాటివాళ్ళ ముద్దూ ముచ్చటా చూసి సంతోషించే భాగ్యం మాకూ కలిగించకపోతే ఎలా? – ఆర్యే...తాతగారికి మధుకలశం అందీవో'

–ఇక అక్కడ ఓ నిమిషం ఉంటినా, మాట దక్కేట్టులేదు. అదిగో, వాడికి తగిన జగజ్జంత్రే అదీని: ముసిముసినవ్వులతో గ్లాసునిండా నురగలుగట్టించి పట్టుకు వస్తూంది. పసివాణ్ణిలాగా కాళ్ళమీద పడుకోపెట్టుకుని ఉంగపట్టినట్టు పడుతుంది..నాకు తెలుసును. అది మాత్రం వాడి పెళ్ళాం కాదూ?

...చ్చ్...యింతకూ ఉన్నవాణ్ణి ఉన్నట్టు ఉండక...వాళ్ళే గంగలో దిగితే నాకేమని ఊరుకోక.... పూసుకుంటూపోయి, నేను బావుకున్నదేమిటి?...ఆ వెకవెకలూ – పకపకలూను. హాఁ... కలియుగం. ఒక్క అడుగన్నా యింకా అవతల పడలేదు...యిప్పుడే యింత పచ్చికలి భగ్గుమంటూంటే... ఇంకా ముందుముందు ఏమికానున్నదో! ఎన్ని వింతలూ విడ్డూరాలూ పుట్టనున్నవో!

––అయినా నా కీ వాగుడు ఏమిటి? ఎవరెల్లా పోతే నా కేమిటి?...యింతకూ.. లోకంలో అందరి అయుర్దాయం యీ ముసలాళ్ళకి పోస్తాడేం, ఆ రామయ్యతండ్రి?

అదుగో పెద్దవాడు వస్తున్నాడు...ఊఁ, పెద్దవాడు...ఈయన ఒరిగించేదేమిటి?... ఆయన ఒరిగించేదేమిటి?...అందరూ ఆ గూటి చిలకలే...హూఁ ఎలాటివాళ్ళ కడుపున... చివరకు ఎలాటి వాళ్ళు పుట్టుకు వచ్చారు?...ఇప్పటి వీళ్ళదే రాజ్యం!

మాలాటివాళ్ళం, ఎందుకో బ్రతకడం...ఇహ?...

★ ★ ★

# చామన-చాయ

[లక్ష్మీదేవి మాయమైపోయింది; – ఏమైపోయిందో, ఎవరికీ తెలియదు. నింద మోయలేక, ఎందులోనో దూకి ఉంటుందని కొందరు అనుకున్నారు.

ప్రాణం–తీపి చావనివాళ్ళు.. ఎట్టే అదికాదు, ఏ అధ్వాన్నపు అడవులో పట్టి ఉంటుందని, సిద్ధాంతం చేశారు

ఏమైతేనేం, లక్ష్మీదేవి మాయమైపోయింది.

పోయిందని హఠాత్తుగా తెలిసినప్పుడు ఏమైపోయిందో అని గుండెలు తోడుకుపోయినవి. కాని––

కాని...లక్ష్మి పోయినందుకు, పరమానందమైంది. అలాటివాళ్ళు బ్రతికేలోకం ఎక్కడన్నా వేరే ఉందా?

మా జాతి, జాలిపడేందుకుకూడా నోచుకు జన్మ ఎత్తలేదు..కాని, తాతకు ఉన్న పాటినీతికి కొరమాలినా మాకూ బాధలు భరించే పడుచుదనం, రొక్కంతో బాటు కలకాలమూ ఉండదు.

లక్ష్మి పోవడమే, మంచిది...కాని ఆ మాట నా నోటివెంటరావడం...అది ఏనాడో, మాలో ఏ తరంవాళ్ళో చేసుకున్న పాపం––

పాపం...లక్ష్మీదేవి...]

––ఏం మాయచేశో, ఏలాగో మరులుపుట్టించి, సుబ్బారావు రెండో కొడుకు, లక్ష్మిందేవి గొంతుకోసి, నట్టేట్లోదించాడు అని– నాకు నీళ్ళుతోడిపెట్టే హనుమాయమ్మ, నిన్న ఉదయం చెబితే – మొదట నేను నమ్మలేదు. సుమా!

లక్ష్మీదేవి గుణం అలాంటిదని నేను అనుకోలేదు.

..దరిద్రుడి కూతురు: దరిద్రుడి మనుమరాలు ఆ పిల్లదానికి డబ్బు విలువ ఏమిటో తెలియదు: తల్లీతండ్రి చిన్నప్పుడే పోయినా, తాత, దానికి వేయిమంది బలగం పెట్టు: బొడ్డు ఊడనప్పటినుంచీ పూవుల్లో పెట్టి పెంచేవాడు: ఆ కుటుంబానికి "ఇదిలేదు" అనేలోటు ఏకోశానా లేదు. మాతోటనే నమ్ముకుని – మాయింటినే నమ్ముకుని – తరతరాలుగా వర్ధిల్లుతూ వచ్చారు...నేటిదాకా–

నా కళ్ళముందర పెరుగుతూన్న పసిపిల్ల కాబట్టే, ఎన్నడు పెరిగి పెద్దదైందో నేను గమనించలేకపోయినాను. ఈడువస్తూన్నదనీ, చూసిన కుర్రవాళ్ళ నోరూరించే తళుకు బెళుకూ ఆ చిన్నదానికి అబ్బినవనీ – నాకు ఆ ధ్యాసే లేదు సుమా – ఫలానా మనువు అమిరిందని, వాళ్ళ తాత నాదగ్గిరకు ఎన్నడో ఓనాడు వచ్చి చెపుతాడు. అప్పుడు. సరే. సలక్షణంగా, సారె చీరెపెట్టి, అత్తవారింటికి పంపించడం

ఎలాగూ జరుగుతుంది. అందుచేత, నాకు ఆ ఆలోచనే పోలేదు. చివరకు ఇలా మునుగుతుందని కలగననూ లేదు.

—వినేప్పటికి నాకు మతిపోయింది. స్నానానికి చెంబుఎత్తి మీద పోసుకోబోతున్న వాడినల్లా, ఆ పాళాన అవి అక్కడ పారేసి.. అలాగే, వాళ్ళ పాకవేపు పరిగెత్తాను...బిక్కు బిక్కుమంటూ అక్కడక్కడ గింజలు కొక్కిరిస్తూన్న కోడి పెట్టలు నా విసురుకు, రెక్కలు విలవిల లాడించుకుంటూ మలుపు తిరిగి పారిపోయినవి...అలికిడి పడికట్టి, చూపుమేరలో గున్న మామిడివారను కుక్కిలో కూలబడి ఉన్న తాత, లేచి, నన్ను చూసి, విల–విలలాడుతూ వచ్చి, సగం దూరంలో కుప్పకూలినట్లు కూలిపోయినాడు.

'బాబయ్యా, ఈ తప్పంతా నాది: ఇదంతా ఏనాడో నేను చేసుకున్న పాపం...' ఒక్కొక్క మాట కుమిలి–కుమిలి బయటపడుతూన్నది.

"నెయ్యీవణ్ణంతినే మహారాజులకు, నీచపు బుద్ధులు పుట్టిస్తాడు ఎందుకు బాబూ భగవంతుడు?"

తాత కనుకొలకుల్లో ఒక్క నీటి బిందువైనా లేదు. మొగమంతా, కాగిన తాషామరఫా చర్మంలాగా బిర్రబిగిసి పెటపెటలాడుతూ ఉంది. కన్నీళ్ళలో తెప్పతేలకపోతే, గుండెను పట్టుకుపోయిన శోకం ఆ ముసలిజీవాన్ని విరుచుకు తినేస్తుంది...తాతను ఏడిపించకని...మా ఇలవేలుపులకు వేయివిధాల మ్రొక్కుకున్నాను.

ఏముందీ, మామూలు కథే...

ఎవడో అయినయింటి పిల్లవాడు, ఏమీ అభమూ శుభమూ తెలియని అమాయకపు పడుచును. .ఎలాగో గోతిలోదించి. .చేతులు దులుపేసుకుని, తన్నతోవను తాను చక్కాబోడం...

ఒళ్ళుపరవశించిన తీయదనంలో, చేసేదేమీ తెలియక. తీరా నిలువునా మునిగిన తరువాత చేసింది తప్పని తెలుసుకుని...ఏ పాపమూ నిజానికి ఎరుగని ఆ పిల్లది...ఆహుతి అయిపోవటం...కోటి–కోట్ల పర్యాయములు జరిగింది ఇలా. లోకంలో ఇలాగే జరుగుతుంది.

—కాని అలా అనుకుని ఊరుకునేందుకు మనసు ఒప్పుతుందా? – నిలువెల్లా దహించుకుపోతుంది – మమకారము అలాంటిది; లక్ష్మీదేవి, నాకు చిన్న చెల్లాయ్.

"ఇహ ఈ జన్మకు, నా కళ్ళకు కనబడదు నా తల్లి... దాని అభిమానం నాకు తెలుసును..." నా అభిప్రాయమమూ అదే: నేను ఎరుగున్నంతలో, లక్ష్మిందేవి ఎన్నడూ ఎవరిచేతనూ మాటపడి ఎరుగదు: కులానికి పేద అన్న మాటగాని, ఆ కుర్రదాని గుణం విలువకట్టరానిది...

"ఏం తల్లీ, అలా ఉన్నావు" అన్నాడట, పిల్ల ఏదో నలతగా, పరాకుగా ఉండటంచూసి:

"ఏం లేదులే" అన్నదట:

"ఏం లేకపోవడమేమిటే?. .చెప్పు"మని బ్రతిమాలాడట: నిర్బంధించాడట బుజ్జగించాడట...

"నేను, నీళ్ళోసుకున్నాను?" అన్నదట..

"ఎందుకలా నిలుచుంటావ్ సిగ్గులేక? పోయి ఏ ఏట్లోనన్నా కలు..." అన్నాడు..."సరేలే తాతా" అన్నది- వెళ్ళిపోయింది..

లక్ష్మీదేవి చుట్టుప్రక్కల ఎక్కడా తేలలేదు-ఏమై పోయిందో తెలియలేదు...

—ఓనాడు చీకటిలో, తాత, నా నిద్రమంచందగ్గిరకు వచ్చాడు.

"సెలవియ్యి బాబూ – నేను పోతాను" అన్నాడు క్రుంగిపోతూ.

"ఎక్కడికి"

"ఎక్కడికంటూ ఏమిటి-లక్ష్మి ఎక్కడుందో..."

తాతకు మతిబోయిందనుకున్నాను.

"ఎక్కడెక్కడో వెదుకుతాను...ఏ అధ్వాన్నపు అడవిలోనో వెదుకుతూ రాలి పోతాను. ఊరికే ఉంటే మతిపోతూంది: మతి పోతూందనుకుంటేనే వెర్రిఎత్తుకొచ్చేట్టుంది...బ్రతుకంతా మీసేవలో గడిపాను· చివరకు వెర్రిచావు చచ్చేట్టు చేయకు బాబూ–నన్నుపోని..."

తాతకు దణ్ణం పెట్టాలనిపించింది: వంగి పాదాలు పట్టుకున్నాను: తాత, రావాకులాగా కంపించిపోతూ, పసివాడిలాగా పెద్దపెట్టున ఏడుస్తూ వెళ్ళిపోయినాడు.

...నాకు, వెంటనే మతిపోయిందని చెప్పడం శుద్ధపొరబాటు: ఉన్నదో, పోయిందో. రెండురోజులపాటు, దహరాకాశమంతా చీకటిగుయ్యారం. 13వ తారీఖుమీద నిలిచి పోయిన చూపు, మేలుకుని 15వ తేదీని చూసింది.

తెలివి వచ్చినప్పటినుంచీ, ఏమిటి చెయ్యడం అని కలవరింత బయలుదేరింది...కాని, ఏం చెయ్యాలో మాత్రం పాలుపోలేదు...చివరకు నామీద దయతలచి, కాళ్ళు వాటంతట అవి చొరవ తెచ్చుకుని కాయాన్ని సుబ్బారావు యింటికి యీడ్చుకు వెళ్ళినవి. వాళ్ళయిల్లు అల్లంత దూరాన కనబడటంతోనే మనసులో బాణసంచా ఉద్ధోలంగా రగలడం మొదలు పెట్టింది. రకరకాల మారణసాధనాలు పుట్టుకు వస్తున్నాయి: దేనికదే సుబ్బారావు రెండో కొడుకుమీదికి సూటిగా దూకుతుంది. అన్ని అస్త్రాలధాక ఒక్కసారిగా తగిలితే, ఆ పరాత్పరుడే తట్టుకోలేక అవతారం మార్చుకోవలసివస్తుంది. ఒక్క అల్పప్రాణి, అనంతకోటి జీవరాసుల్లో సుబ్బారావు రెండో కొడుకు, ఏమైపోతున్నాడు?...

వాడు, దెబ్బ–దెబ్బకూ ఛస్తున్నాడు మరో వ్రేటు తినడానికి మళ్ళా తెప్పరిలు తున్నాడు. వాడు అన్ని చావులు చచ్చినా, నా కసిలో, ఆవగింజలో – అరపాలు యింకా తీరలేదు.

—సుబ్బారావు ముందుహాల్లో తివాచీ మీద కుదిమట్టంగా కూర్చుని ఉన్నాడు, మనుమడిని ఒళ్లోపెట్టుకుని, గుమాస్తాలు నమస్కారం చేశారు నేనూ మొత్తానికి, అంత ఆసామీనేకనుక మొగం వేయిముడతలు పడేట్టు, కోట తలుపులు విడలాగినట్లు, పుట్టెడు బరువుపెదవులసందునించి, చిరునవ్వొకటి నా వంకకు పెకలించి, ప్రక్కకు జరుగయత్నించిన గుర్తుగా ఒళ్ళు ఓ నూలువాసి కదిలించి...ఇదమిదమాసనం-గా, సరసన పతాక బోర్లగిలవేసి జరిగాడు...సుబ్బారావు ప్రక్కను కూర్చుంటే, కొవ్వొత్తుల గిడ్డంగిలో కాలు చేతులు కట్టేసి పారేస్తే ఎలా ఉంటుందో అలా ఉంటుంది అవస్థ... ఏది ఎలా అయినా, యీ స్థితిలో ఫరవాలేదు.

"ఏమోయ్. మీ చిన్నవాడు ఏడీ?" అన్నాను. మాటలధోరణిలో అడిగినట్లు – కాలూ చెయ్యీ కూడదీసుకున్న తరువాత.

'ఏమో, దొరగారు ఏ రాజ్యాలు ఏలబోయినాడో–' కోపంగాలేదు. అంతో–యింతో గర్వంగానే అన్నాడు సుమీ.

"రాజ్యాలు ఏలేవాళ్ళపాట్లు, యూరప్‌లో గీరప్‌లో ఏమైనాయో చూస్తూనే ఉన్నాం కదా. తలకాయలు ఎగరడానికి సిద్ధంగా ఉన్నాయ్!"

'తలకాయ అంటూ ఉన్నవాడికికాని ఆ దిగులు–' సుబ్బారావు మరొక్కసారి నవ్వేందుకు విశ్వ – ప్రయత్నం చేశాడు. కాని, లాభించలేదు – సాగరగర్భంలో ప్రజ్వరించే బడబానలంలాగా నవ్వు, నఖ – శిఖ పర్యంతమూ లోలోనే కుతమారింది; ఉండుండి, రాలుతూంది.

....సుబ్బారావు మనమడు, యిందాకటినుంచీ తెగమారాం చేస్తున్నాడు – బల్లమీది కృష్ణవిగ్రహాన్ని యివ్వమని...ఏమరించాలని ఎన్నివిధాలో తంటాలుపడి, విసుగేసి, వాళ్ళమామ్మను కేకవేశాడు షాహుకారు. ఆ పెద్ద ముత్తైదువ ఎడంగా గుమ్మంలో నిలుచుని చేతులతో సైగచేసి పిలుస్తూంది మనుమడిని; ఆ రాలుగాయి, మరీ విలవిల లాడుతూ కాళ్ళూచేతులా నిలవకుండా యిల్లుతీసి పందిరేస్తున్నాడు. సుబ్బారావు, ఇక లాభంలేదనుకున్నాడు కాబోలు, వాడితో రాజీకివచ్చి 'అది తగనిబలువు. ఏం చేస్తావురా నాన్నా' అని గారాబంగా అడిగాడు. ఆ కుర్రకుంక తడుముకోకుండా 'పగలకొడతాను' అన్నాడు. సుబ్బారావుకు, మహా – ముద్దొచ్చింది వాడి మాటలకు.. 'వేలెడున్నాడో లేదో, యీ బొజ్జలో ఎంత ఊహ ఉందిరా, బాబూ' అంటూ పగలగొట్టావా అంటే నీ బుగ్గలు సాగదీసి బూరె లొండించి పెడతా చూసుకో' అని సాగదీస్తూ, బొమ్మ వాడిచేతికి యిచ్చాడు – వాడు ముక్కలు చెయ్యనే చేశాడు

అవతల గుమ్మంలోనుంచి యిల్లాలు నెత్తీ నోరూ కొట్టుకుంటూ యిందాక టినుంచీ లబలబలాడుతూనే ఉంది, 'అది వాడికి యివ్వద్దు మొర్రో' అంటూ. వినిపించుకుంటేనా? – తీరా అధ్వాన్నమైపోగానే 'నిక్షేపంలాంటి బొమ్మ...' అని ఉసూరుమన్నది. సుబ్బారావు, వినిపించుకున్నట్టూ–– వినిపించుకోనట్టూ కాకుండా, 'పోనిద్దూ...చిన్నతనం, వాడిమీంచి బలాదూర్' – అని ఇక ఆవిడ మళ్ళీ నోరెత్తేందుకు వీలులేనంత ఖండితంగా చెప్పి...నాతో సంభాషణ అందుకునేవాడిలాగా, యీ ప్రక్కకు తల తిప్పాడు.

నాకు, యిందాకటినుంచీ సల–సలలాడిపోతూందేమో, సందుచిక్కిందే వ్యవధా నంగా ఉన్నవి నాలుగూ పెట్టేశాను. పట్టుకుని, కడిగి – కడిగి వదిలి పెట్టాను, ఆతని సుపుత్రుడు చేసిన ఘనకార్యం.

అంతావిని – సుబ్బారావు ఎంతో నొచ్చుకుంటాడు...ఎంతో ఖిన్నుడై పోతాడు.. పాపపరిహారం ఏమిటని అడుగుతాడు... ప్రాధేయపడుతాడు... తప్పక అలా జరిగితీరుతుంది–అని అనుకున్నాను.

సుబ్బారావు ఏంచేశాడో తెలుసునా, విని–విని బద్ధకంగా చిటికెవేస్తూ ఆవలించి ఒక్క నిమిషం నిదానించి "పోనిద్దూ, ఏదో చిన్నతనం" అని ఒక్కమాటలో కొట్టేశాడు.

నిలువునా నీరవడమంటే ఏమిటో అప్పుడు నాకు తెలిసివచ్చింది. మొగం అప్పచ్చి అయ్యేట్టు ఒక్క గుద్దు గుద్దుదామనిపించింది. కాని, గోడనుగుద్దితే ఎంతో – అంతే...అయినా, నేనూ, ముసిలివాణ్ణే:– పసివాడు బొమ్మను పగుల గొట్టినా, వాడు రేపీ పాటికి ఎదిగి ఎవతె జీవితమో భగ్నం చేసినా...రెండూ ఒకటే అవ్వారి దృష్టిలో ఏం చెప్పినా అంతకన్న ఆ జీవానికి, అర్థంకాదు.

ఈ ప్రబుద్ధుడి కొడుకు...వాడు మరీ యింతకన్న ఛండాలుడౌను.

–అదికాలంనాడు, ఖజానాకొట్లు మూలగకుండా, భూతాలూ బ్రహ్మరాక్షసులూ కాపలా కాస్తూంటాయట. వాటికి, ఆకలైనప్పుడల్లా, కూర్చున్న చోటనుంచే, ఏదో ఓ జీవాన్ని జుర్రున పీల్చి, చప్పరించి, ఒఖ్ఖగుక్కను మింగేసి మళ్ళీ ఆకలయ్యేదాకా...ఏమీ ఎరుగనట్లు అలా చలనం లేకుండా మొద్దుల్లాగా పడి ఉంటాయట– అని, నా చిన్నతనంలో మా అమ్మమ్మ, కాకమ్మ–పిచికమ్మ కథల్లో చెప్పిన ముక్కకు తిరుగుడు ఏభైఏళ్ళకు అర్థం అయింది...

––సుబ్బారావుమీద, కోపంరాలేదు. మనిషి కాదుకదా అని, చచ్చేటంత – జాలి వేసింది...లక్ష్మీదేవి బ్రతికి ఉండి –– బట్టకడితే... చిగురుకు మరోభూతాన్ని కనేదేమో అని భయం వేసినమాట నిజం.

లక్ష్మీదేవి పోయినందుకు పరమానందమైంది.

* * *

# సైరన్ధ్రి

నిన్న సాయంకాలం. దీపాలుపెట్టిన వేళనుంచీ భూమి చుట్టూ సూర్యుడు తిరగడం ప్రారంభించాడు.

...మనుష్యులు నడిచే చప్పొ, మరీ యిరుకుగా ఉంటుంది. నడిరోడ్డుమీద నడవటం, నేరమే అయినా, నడక, ఎవరో తరుముకువస్తూన్నట్టు సాగుతుంది.

ఆగమని ఎంతబ్రతిమాలుకున్నా, ఆశాశపెడుతూ పరుగెత్తుతున్నాయి బస్సులు. అందులో, ఒక్కదాన్లోనన్నా నన్ను కాలుమోపనియ్యకపోతే, ఆ అమ్మాయి నాకోసం ఎంతసేపని నిలుచుని ఉంటుంది? – ఒంటరిగా కూర్చుంటే యిసుకలో పచారుచేసే జనాభా, చూసి ఓర్వలేదు–

లోపలికి పొమ్మన్నాడు, మెట్టుమీద నిలుచుని కండక్టరు. వద్దన్నాడు, అడ్డంగా ఎవరో ఆసామి, "అయ్యోపాపం!" అనుకుంటున్నాయా, ఆ చివరనుంచి తొంగి చూసేకళ్ళు? అణాయిచ్చి తొక్కిసలాడుతారేం, అందంగా ఉండే పిల్లలందరూ? – హాయిగా ఓపిక ఉన్నంతసేపూ నడిచిపోతూంటే, ఆ వెనకాలే ఖాళీగా పరుగెత్తుకురాక ఏమౌతుంది, బస్సు? కాళ్ళూ కళ్ళూ మెసిలే మనిషిని చూసి కదలకుండా పడి ఉండే ఇళ్ళూ వాకిళ్ళూ బస్సు తలుచుకునేటప్పటికల్లా అలా పరుగెత్తుకు పోతాయేం? నున్నగా నిగనిగలాడే రోడ్డు, కన్నెకోమలిలాగా జిలిబిలిపడుతూ మెలిదిరిగి, కులికిపోతుందేం? దీపాలన్నీ, ఏ అమ్మాయికోసం, తలక్రిందులుగా తపస్సు చేయడం?

నిలుచున్న ఆడపిల్లనుచూసి, కూచోమనకపోతే, నన్నుచూసి పక్కనున్న మగ వాళ్ళందరూ ఏమనుకుంటారు? – 'అక్కడ నేనే కూర్చుని ఉంటేనా?..నే నంటే –– నే'నని మనసులన్నీ మౌనంగా యుద్ధం ప్రారంభిస్తాయి. కాని, అమీ – తుమీ తేల్చుకునేందుకు మరో అణో బేడో పారేసి, ఆఖరుదాకా ఒక్కడూ ఊగిసలాడడేం? – అందరికీ పాపం, మించిపోయే పనులేవో ఉంటాయి – కాబోలు! అరమైలు దూరంలో అరవై ఆరు కాశీమజిలీలు: ఆగినప్పుడల్లా ఒకటో అరో బయటికి కక్కేసి, పదేసిమందిని బలవంతాన కూరుకుంటుంది బస్సు! కండక్టర్ కాకలు దేరిన వాడైతే.. బస్‌ను కుబేర పుష్పకం చేస్తాడు.. ఎందరు ఎక్కినా ఇంకోమనిషి నుంచునేందుకన్నా ఎప్పుడూ జాగా ఉంటుంది.

కమ్మీపట్టుకు నిలుచుని, 'అమ్మయ్య' అనుకోంది ఎన్నడూ...నేను ఒక్కణ్ణేనేమో? – ఏం తీపెళ్ళిందా, హాయిగా ఏపక్కకు కావాలంటే ఆపక్కకు తిరగవచ్చు: ఒత్తిడిలో ఒత్తిగిలవచ్చు – బస్ ఊపినప్పుడు జరిగి...కాలు, ఆ పిల్లదాని వ్రేలిమీద ఆనించవచ్చు: ఓపికలేనట్టు ఊగిసలాడి, మోకాలుతో, చేరువలో సిల్కుచీరెను తాటించవచ్చు...పండూ ఫలం ప్రమేయం లేకుండానే, బస్‌లో నుంచుని, పార్థసారథిగుడిలో కన్న వెక్కసమయేటంత క్రిక్కిరిసిపోవచ్చు...

ఏ పిల్లది ఎక్కడ దిగుతుందో...ఏ కుర్రది ఎక్కడ ఎక్కి సరిగ్గా ఎక్కడ దిగుపోతుందో... నాలుగు రోజులు వరుసగా చూస్తే తెలిసిపోతుందనుకో. బస్ ఎక్కే చోటో, దిగే చోటో వాళ్ళయిల్లు... పరిశోధన అక్కరలేదుగాని, ఆ ఫూటపని మానుకుని అడుగులో అడుగు వేసుకుంటూ పోవాలి... ఇంటినెంబరూ, సందు మొగదల స్తంభించుకు కూచున్న నామధేయమూ, గుర్తు ఉంచుకున్నా, అ ఒక్క పూటతో ఆ యిల్లు వాళ్ళదౌనోకాదో, అరా తేలదు: వీలుచేసుకుని ఇంకా ఒక్కసారి అయినా ప్రదక్షిణం చేసిరావాలి .ఛస్, ఎందుకీ సంసార ... తాపత్రయం?...ఇల్లూవాకిలీ, ఆ యిల్లాలూ కూడా...యింటివాళ్ళదే: మనం ఒంటరిగాళ్ళం...మొగాళ్ళం...

బస్ ముందరపోతూంటే పక్కనే, పందెంవేసుకు ముందుకుదూకుతూన్న ప్లెషర్ కార్‌లో హాయిగా వెన్ను విరుచుకు కూర్చున్న చిన్నదానికళ్ళు, అల్లరి మొదలుపెడతాయి. నన్ను చూసే అనుకుంటారు, నాగన్నలు అందరూ: నిన్నూ కాదు నన్నూ కాదు చూసేది...నీవూ నేనూ చూడని నిన్న రాత్రి ముచ్చట్లని .

దీపాలు వెలగకపూర్వం పార్కులో కనబడేవన్నీ చెట్లు...చేమలు మనుష్యుల చాటున దాక్కుంటాయి. బస్ మలుపు తిరుగుతూంటే పార్కు రంకులరాట్నం అవుతూంది.

రోడ్డుమీద మనుష్యులు నడుస్తూంటే..బస్‌కూడా నడుస్తూందికదా అనుకుని పరధ్యానంలో ఉంటే ఎప్పుడో చప్పబడి ఊరుకుంటుంది....ఆ హోరు ఏమిటయ్యా మరి? అనుకుంటే ఆ హోరు, క్రిందకాదు, పైన. ఏదో పక్షి తగుదునమ్మా అని హోరు – హోరున ఎగురుతూంది.. పక్షి రెక్కల చాటున నక్షత్రం కనబడుతుంది కాని, తొంగిచూడాలంటే మరీ ముందుకు వంగాలి.. 'దయచేసి అందరూ క్రిందికి దిగ'మంటాడు కండక్టర్: నన్ను కాదేమో, నా అంతవాణ్ణి పట్టుకుని అంతమాట అనడానికి వాడికి దమ్ములున్నాయా అని ఎవడికివాడు, అత్తా కోడలంచు ఉత్తరీయం వంక, బాటా షూవంక...ఆ క్షణంలో ఎవడికి ఉన్న ఆస్తివంక వాడు చూచుకుని, భయంలేదనుకుంటాడు: 'మీరూను, మీరు, మరిమీరును మీరును...' అంటూ కండక్టర్ వేలు మెదుపుతూ నిన్నూ, నాపక్కనున్న ఆ కళ్ళజోడు నాయుణ్ణీ, ఇలా అశేష జనంబులనూ సగౌరవంగా దింపుతాడు: ఈ శాసనం అయ్యలకుమాత్రమే అనువర్తించేది కావడంచేత...అమ్మలందరూ ఇంకా విశాలంగా సర్దుకు కూర్చుంటారు: బస్‌లోనుంచి మనుష్యులు దిగనట్టే ఉండదు. అందరిచేతులూ పడేటప్పటికి అది అసలే చెప్పినమాట వినదు..దాని మనసులో ఏముందో డ్రైవరుకే తెలియదు.

వెనుకనుంచి వచ్చే బస్‌లో దేన్లోనన్నా జాగా ఉంటుందా?...ఏమో..."ఇది నీ జాగా చెప్పిందిలింగ్!, ఎక్కువ తక్కువలేమో హెచ్చు కంచివరదా!"

ఎవడూ బస్ మా దగ్గిరకే రానియ్యడేం?...అవును మరచిపోయినా, యిది కాదుగా మజిలీ... వచ్చేపోయే బస్‌లన్నింటికి మేమంటే జిలాయ్...నాళ్ళ–నడుమను ఉన్నా ఆ నిమిషంసేపూ అంతమేరా అధ్వాన్నపు అడవైపోతుంది.

శరవేగంతో కారులో మా ప్రక్కనుంచి పోయింది, ఎవరో తార..

ఎవరో ఏమో.. తార అని నీకు ఎలా తెలుసునూ? కారు నంబరు ఫలానా అని గుర్తు ఉంచుకున్నావా?.

అక్కర్లేదు: కారు ధ్రూకుడు చూసి... లోపల నక్కి కూర్చున్నది... తార అని — చూడకుండానే చెప్పేయవచ్చును...

అటూయిటూ చూస్తూ కూచోరేం వాళ్ళు...ఒకవైపంటే...ఎందుకంత పక్షపాతం? నీవంకనే చూసిందని నీవు అనుకుంటావు. కాదు నన్నే చూసిందని నేను నమ్ముతాను: ఇవన్నీ మనసులో నిలిచిపోయేవేగనుక, ఔను— కాదు తేలదు, ఎన్నటికీ.

నిన్నూకాదు – తన్నూ కాదోయ్ చూసింది... తలుపు అద్దం మీద పడ్డ తన బొమ్మను... కళ్ళజోడులోంచి రిక్కించి చూస్తూంది: నలుగురినోటా పడినప్పటినుంచీ .. నరుడికంట పడేందుకు నోచుకోలేని అవస్థలో పడతారుకదా వాళ్ళు పాపం! చూస్తే అరిగిపోతారని కాదు: కాని... నల్లజోడు మాటునుంచి కాకుండా...అసలు కళ్ళతోనే చూసేట్టయితే...అందరి సంగతీకాదు సుమా... ఎన్నికైన వాళ్ళమాట, నేననేది... ఏమైపోతామో మనం...అనిపించదూ...చూడక–చూడక మొగంవాచిన లోకంమీద (అంటే దైవవశాత్తూ నీమీద — నామీద కూడా కావచ్చును) ఒక్కొక్కప్పుడు వాళ్ళ చూపు ఎండ తెరలాగా విచ్చుకుంటుంది...విచ్చుకునే కూర్చున్నచూపు రోహిణై భగ–భగమనిపిస్తుంది... నిజంగా ఒక్కొక్క కన్ను పొంకంగా కలువరేకు విరిసినట్టుగానే...దీటుగా ఉంటుంది. కాని, ఆ కన్నేమిటి...ఈ కన్నేమిటి...అన్నీ, నీడనే అవిర్లు తేరుతూ ఉంటాయి.

గుజిలీవేళ...పదినిమిషాలకు ఓ బస్ వస్తుందనుకోండి. కాని, కదిలినప్పటినుంచీ ఏదీ ఖాళీ ఉండదు...ఆగాలిసిన చోట ఆగదు: ఆగమని బ్రతిమాలుదామనుకున్నా ఆగదు...వేళకాని వేళప్పుడైతే, చిట్టి—పొట్టి మజిలీల్లో ఎక్కేవాళ్ళూ దిగేవాళ్ళూ, ఎక్కడబడితే అక్కడ వెళ్ళుకొస్తూంటారే... యిప్పుడా అణాటిక్కెట్ వాలా లందరూ ఏమైనట్లు?

ఎంతసేపు మొండికేసి నిలుచున్నా, సుఖానపడ్డ ప్రాణిలాగా, బస్ కదలడానికి సమ్మతించదు.. ఉబుసుపోవడానికి... ఇంకో కారన్నా మరోతారను ఎక్కించుకుని స్థాయి మనదు...ఎలా ఈ కాస్సేపూ గడపటం?

..."ఏయ్ అమ్మాయ్, ఏవూరూ మనది?...ఇక్కడికి ఏంపనిమీద దయచేశావు?...ఆ వెంటవచ్చే ఆయన (ఊహుఁ) నీ వెంట ఆ రౌతు బయలుదేరాడా? – ఆ నవమన్మథుడి వెంటపడి నీవు వచ్చావా?. ..సినీమాలో చిల్లర వేషం ఏదన్నా రాలుతే ఏరుకుందామని పోతూ, తల్లో అన్ని పువ్వులెందుకు కుక్కుకున్నావమ్మా...సరే, ఫరవాలేదులే."

పలుకరించడానికి నాకు మొగమోటం లేకపోతే, ఇందులో ఏ ప్రశ్న అయినా అడగవచ్చును. యిబ్బందిలేదు...కాని, అన్నిటికీ ఒక్క రకం సమాధానమేవస్తుంది...ఆ అమ్మాయి నీవంక తిరిగిచూసి... కళ్ళారాచూసి...చూసీ చూడనట్టుగా పర–ధ్యాసలోకి మొగం తిప్పుకుంటుంది...

"నా వూరెందుకోయ్, నా పేరుందుకోయ్. నా వెంటనున్నది ఎవరో ఆ ఆరాలెందుకోయ్..?"

ఏదో ఒహటి మనసులో అనుకుంటూంది...అవును అనుకుంటుంది అంతే...నడిబజారు గనుక...రేగదు...

పక్కనున్నవాడు, పాపం, మొగుడేనేమో! అయిఉండడు...ఒక అడుగు వెనక్కి తగ్గి నీడలో అటూ యిటూ పచారుచేస్తున్నాడు...అదే గుర్తు, వాడికి రెక్కలు ఉన్నట్టు...

వాంగో...ఏరుంగో అంటున్నాడు... ఎన్నాళ్ళకో మా సారధి సలలిత మురళీ నినాదంగా... ఆడవాళ్ళూ అరవైయేళ్ళ కుర్రాళ్ళూ, నిన్నోవంతెనగానూ, అధమం కాలిబాటగానన్నా భావిస్తారు... లోపలికి ఎక్కి ఒకరిమీద ఒకరు ఒక్కచోటనే కూర్చునేందుకు తొక్కిసలాడుతున్నారు. ఇంకా ఖాళీగానే ఉంది.. కాని ఆ జాగావంక ఎవరూ చూడరు...

ప్ఛ్...పోనిద్దూ, కాశీవెళ్ళి వచ్చినంత హైరానైంది. బస్‌లో ఎక్కేందుకు ఓపికలేదు...ఎటో అటు నడిచి పోవచ్చు... సరదాగా ఉంటే పరుగెత్తినా తప్పలేదు...

"బస్...ఈ తావున నిలుచునా?"

—నిలువకేం చేస్తుంది స్వామీ! ఏ బస్ జీవిత చరిత్రను చూసినా నడిచినమైళ్ళకన్న నిలిచిన ఘట్టాలే ఎక్కువ: బస్ అనేది ఆగడంకోసమే పుట్టింది: మనమైతేనే ఆగకుండా అయినదానికి కానిదానికీ ఉరుకులూ, పరుగులూ ఎత్తుతూండటం: దాని కేమంత గ్రహచారం?..మనం ఆగమన్నా ఆగుతుంది, దానికి ఆగ్రహం వచ్చినా ఆగుతుంది.. ఆగని బస్ అంటూ ఇంతవరకూ ఏ యుగంలోనూ ఉద్భవించనేలేదు...

"ఆఁ...నిలుస్తుంది" — ఈ రెండుముక్కల్లో, నా ఊహంతా, ఆ పెద్దమనిషికి తెలిసేట్టు ఇముడాలి... తెలుక్కి అంత కుక్షిలేదు. .మరి ఇంకొకతెకు అలవి అవుతుందేమో ఆలోచించవయ్యా, స్వామీ...

అటా—ఇటా?

ఇటూ అయితే..పోగాపోగా మనం తలదాచుకునే ఇల్లు కనిపెట్టుకుని ఉంటుంది, దీపం అన్నా వెలగకుండా...ఉండనీ...అటూ సాగనీ కాలు...అక్కడ కనిపెట్టుకు కూర్చున్న అమ్మాయిసంగతే మరచిపోవడం...అది జీనియస్ లక్షణం. .నీవు కవివన్నా కాకపోతివి...వర్ధి రసికుడివి ..పదవయ్యా... పద: అడుగులు, హంసలూ గోరువంకలూ వేసినట్లు కొక్కిరిగా కాకుండా ఉమ్మసంగా వెయ్యవేం?— వయ్యారం నీకు కాదు .ఒప్పులకుప్పలకి...

అడుగులో అడుగు.

అడుగుమీద—అడుగు...

ఊఁ...పైనపడే అడుగు ఎప్పుడూ మనదే...అవతలకు జాచనంతవరకూ...

కాలు మెసలగానే.. మన అడుగు...ఆదికాలంనుంచీ పడుతున్న అనంతకోటి అడుగుల్లో కలిసి, లెక్కాజమా లేకుండా. నీ వెనుకాల వచ్చేవాడి అడుగు క్రింద పడిపోతుంది.

బస్సుల్లో చాలా జాగా ఉసూరుమంటూంది: పద ఎందులోనో ఎక్కు...వెనక్కి పోవడం, ఎందుకా? వెళ్ళేది సముద్రం ఒడ్డుకి...ఈదుకుపోయి...ఒక్కసారిగా అక్కడ విరుచుకుపడవచ్చును.. ఆ విసురున—

అమ్మయ్య...ఇన్ని గడియలకి యిసుక తగిలింది, కాలికి... ఈ చరణంబులే, యిందునిభావన... ఉహుఁ.. అడుగులు ఆడో మగో, వెలుతురు ఉన్నప్పుడే తెలియడం కష్టం... యిప్పుడు అన్నీ ఏకమైపోయి ఉంటాయి.

ఏ మూలచూసినా, నేల యింకా గోరువెచ్చగానే ఉంది...కొన్ని నలకలు పవలంతా నిద్రపోయి తెల్లవార్లూ మేలుకుని పడి ఉంటాయి. ఏ బంగారు తల్లికో పట్టుపరుపుగా అమరేందుకు: ఒక్క నలుసుకు ప్రాణంపోస్తే... దాని కథలు వినేందుకు వెయ్యేళ్ళ ఆయుస్సు ఉండాలి...

వీటేఒడ్డున... ఎంత గొంతు చించుకున్నా, యెదురుగుండా కూర్చున్నవాళ్ళకే వినబడదు...

వినబడితే, గాలిపాటు ఎటుంటే ..వాళ్ళు పలుకుతారు...నీవు మరొహారిని ఫలానా పేరున పిలిచినా... ఈ ఇసుకలో యెప్పుడూ యిదే మామూలు... ఎవరిని పిలిచినా...ఎవరువింటారో తెలియదు: ఎవరు పలుకుతారో తెలియదు–

...ఎక్కడో కూర్చుని ఉంటుంది. ఎటువేపు నుంచన్నా, రావచ్చు గనుక –– అటూ ఇటూ చూసి విసుగెత్తి యెటూ చూడకుండా సముద్రం వంకకు తిరిగి తల వంచుకుంటుంది...యింటికి వెళ్ళిపోయి ఉంటుంది...

నగరంలో నాలుగు మూలలనుంచీ బారలు సాచుకుని జ్యోతులు ఆకాశంలో చుక్కలు లెక్కపెడుతున్నాయి. నేనొక్కణ్ణే కాదు, పనీపాటాలేకుండా లేనిసింగారం కోసం వెదికే ఆసామిని.

గట్టు యెక్కేటప్పటికల్లా సిద్ధం...'ఏం సామీ...' ఆవేళప్పుడు కొందరికి ఆ పలుకరింత యెంతో చల్లగా – తియ్యగా వినిపిస్తుంది...యెక్కి కూర్చున్న రిక్షానిండా...మనసులో మల్లెపూల తోరణాలు వాలలాడుతాయి....ఏ యింటికో..యెక్కడికో అక్కడికి...

నాకు ఆ ముచ్చట వద్దులే నాయనా! నీబండీలో యెక్కాలేను...ఆ గుమ్మంలో దిగాలేను ..ఇలా –– అలా సంజెవేళల్లో రవంతసేపు యెంత చెడ్డా.. ప్రొద్దుపోయిన తరువాత నేనూ ఒక యింటివాణ్ణి.. నిలుపుకో. నేను నింపాదిగా నడిచిపోతానులే...బస్‌లన్నీ కట్టేసే వేళైంది.

ఇల్లంటూ ఒకటి ఉంటే...యెన్ని వంకరటింకర త్రోవల తిరిగినా, చివరకు అక్కడికే చేరుకుంటాయి కాళ్ళు: నీలాగా నాలాగా భూమికికూడా తిరిగే స్వభావమే ఉన్నదనుకో... అయినప్పటికీ అది మన అందరికన్నా గుండ్రంగా ఉందనడానికీ – దక్కిస్తూ మనం దానిచుట్టూ తిరుగుతూండాలిసిందే కాని... మొగమాటం కొద్దీగాని, పోనీ పాపమనిగాని...ఆఖరికి యెలాటి ప్రాణావసరం వచ్చినాసరే, అది తన చుట్టూ తాను తిరుగుతుందేకాని, కలలలోనైనా...పరాకుగానైనా, మనచుట్టూ తిరగదు అనడానికీ... యిదే నిదర్శనం––

.. ఇవాళ...ఏ వాహనాన్నీ నమ్మను; నడిచి పోతూంటే, పట్టపవలు నడిరోడ్డున నన్ను ఆగమని చేసైగ చేసేవాళ్ళు ఉండరు...అదా – అదా దూరంలో...

నా కాళ్ళ దగ్గిరకే.. అలలెత్తుకుంటూ సముద్రం నడిచి వస్తుంది...అంతా, నీలో ఉంది.

★ ★ ★

# జీవ-ఫలం

జ్ఞాపకం ఉందా? – మీరందరుకూడా బహుశః చూసే ఉంటారు: తారీఖు సరిగా గుర్తురావడంలేదు కాని, ఆంధ్రప్రతిక వెనుక పేజీనిండా అన్నీ అలాటి బొమ్మలే. ఎడమ చేతివైపున, క్రిందనుంచి ఎగువకు రెండో చిత్రం – తెలిసింది కాదూ? అందరికన్నా, ఎంత అందంగా ఉన్నారు – అచ్చులోనైనా – ఆ దంపతులు!

మీరందరూ చూసి...అప్పటికి పోయిపడి, ఆ మరుక్షణంలో ఆ మొగాలను మరిచిపోయి ఉంటారు. నేను, చూడగానే, నవ్వడం మొదలు పెట్టాను...ఆ సంగతి అనుకుంటే సరి, ఇప్పటికీ నాకు నవ్వు ఆగదు.

అందుకు ఎంతగాథ ఉందని?

––రోహిణి రెండో పాదం: నిప్పులు చెరుగుతూంది: అన్నీ, అద్దాలతలుపులు... అన్నింటికీ అంతో యింతో పగులు..అపుదల ఏమీలేదు..ఇక నా అవస్థ చెప్పాలా? – అయినా, అలాగే మంగలంలోపడి వేగుతూ ముచ్చెమటలు ధారకడుతూంటే మోచేయి క్రింద అద్దుడు కాగితం పెట్టుకుని...ఎలాగో ప్రూఫ్‌లు సరిచూస్తున్నాను. తోడు ఎవరూలేరు. బుద్ధిపొరబడి.. చేతిక్రింద కుర్రవాడిని గొంతుతడుపుకొనేందుకు, "రెండుసోడాలు తీసుకరారా నాయనా" అని పంపితే ... అప్పటికి గంట అయింది...వాడిది అదే పోక, –– క్రిందనుంచి, అచ్చుపనివాళ్ళు...కాపీ అందీయ లేకపోతున్నానని మోత––ప్రభూ! పత్రికా సంపాదకుడి బ్రదుకు––పగవాడికన్నా వద్దు––

––ధూకుడుగా మెట్లమీద బూటుచప్పుడౌతే––ఎవరావచ్చేది, మనకోసం ఆ మిడసరిలగ్నాన అని...చేసే పని ఆపి, కలం పళ్ళసందున కటకటలాడిస్తూ పరకాయించాను..అవతలవైపునుంచి తలుపు అద్దంమీద టక – టక – పిలుపుమోగింది కలం బల్లమీదకు విసిరేసి 'లోపలకు రండి' అని, పక్కకుర్చీలోంచి, కాగితాలూ పుస్తకాలూ తీసి చోటు చేశాను.

నాలుగుమూలలా చూసి.నావంక రెప్పవేయకుండా ఇంకా నిదానంగాచూసి, "మీరేనా – ఫలానా.." అన్నాడు. నేను అవునని, తల ఊగించగానే "నేను––ఫలానా" అని తానెవరో చెప్పాడు. నేను చాలా సంతోషించాను, విని అదివరకు ఎన్ని కథలో ప్రకటించాను..ఉత్తరాలద్వారా దస్తూరి పోలికే కాని, ఆ భాగ్యశాలి పరిచయం అదివరకు నాకు లేదు.

"పత్రిక (నెలనెలా) అందుతున్నదా?" అదీ నాలుక చివరను మొదట ఆడిన ప్రశ్న...యీ వృత్తిలో అలవాటయింది.

"ఆహాఁ...అందుతూనే ఉంది. ఆలస్యం చేయకుండా నా కథలు అందిన వెంట వెంటనే ఆ సంచికలోనే ప్రకటిస్తున్నారు...అందుకు—"

"అది మా విధి: చక్కని సామాగ్రి జతకూడినప్పుడు వినియోగించకపోతే...పాఠకులకు ఏం బదులు చెప్పగలుగుతాము?"

"అందుకు సంపాదకులూ, అలా అనుకున్నట్లయితే – యీపాటికి, కవులందరూ కలకలలాడుతూ ఉండకపోయినారా?"

"ఏమోలెండి...ఎవరి భాగ్యం వారిది?

అలా అని ఊరుకుంటున్నారా, మరి, ఎలికమీద పిల్లిని ఎక్కించకుండా..."

—సంభాషణ సజావైన ధోరణిమారి, శ్రుతిమించే పాకంలోకి వస్తోంది: యిదేచావు వీళ్ళతో... మాకూ మాకూ అసలే అంతంత సయోధ్య: అందులో ఈ మధ్యవాళ్ళు వచ్చి, గాలిపోగుచేసి అక్కడిమాట యిక్కడా – ఇక్కడిమాట అక్కడా ఊది, చేతులు దులుపుకొని తమ దోవను తాము పోతారు: ఇక్కడ కొంపలంటుకుంటాయి.

నేను జవాబు చెప్పకుండా, ఆ మాట వినిపించుకోకుండా ఉండడం చూసి, అతడూ మౌనం దాల్చాడు. ఆ నిశ్శబ్దం మరీ కంటకంగా ఉంది..ఏమయేదో కాని, ఇంతలో ఎంతసేపటిక్రిందనో అదే పోకపోయిన బాయ్ సోడాలు పట్టుకువచ్చాడు...

పుచ్చుకోనన్నాడు...నేను బలవంతం చేయకపోతే బాగుండదాయెను...అందుకోసం, అదికాదని, కుర్రవాణ్ణి టీ తీసుకురమ్మని మళ్ళా పంపాను..యీలోపల యిద్దరం సిగరెట్లు ముట్టించాము...

"ఏమండీ...ఎవరా అమ్మాయి?" — ఉపోద్ఘాతం ఏమీ లేకుండా, ఏమాత్రమూ తడుముకోకుండా ప్రయోగించాడు ఆ ప్రశ్న నా కెలా అర్థం అవుతుంది?

"ఎవరు?"

"ఆమె...మీ పత్రికలో వారం వారం కథలు వ్రాస్తున్నది. మేమిద్దరమే కదా...ఎవరని అడుగుతారేం?"

"ఓహో...ఆమా..."

"అవును..."

"తెలియదు..."

"తెలిసినా చెప్పరన్నమాట?"

"నామాటకు అన్ని మాటలుండవు."

ఇద్దరం, ఒకరిని చూసి ఒకరం కొరకొరలాడాం— నా మాటకు అతనికి కోపం రావచ్చునా? — అతని దూకుడును నేను సహించాలీ? – కాని మనకోసం వచ్చిన పరాయి పెద్దమనిషితో మన విడిదిలో తగవులాడటం మంచిదికాదు కనుక—

"అవునండీ.. ఆమె ఎవరో నాకు తెలియదు... ఎంత వయసో, కను ముక్కు తీరు ఎలా ఉంటుందో...ఇవన్నీ కనుక్కోవలసిన అగత్యం ఏం ఉంది? – కావాలంటే చిరునామా మాత్రం సప్లయి చేయగలను. ఆ మీద దేవర చిత్తము..." అని సర్ది చెప్పినా...ఆ వాలకంలోనూ అప్రయత్నంగా కొంచెం కొంటెతం మెరిసినందువల్ల...అతనికి మళ్ళా కోపం వచ్చేస్తోంది—

టీ వచ్చింది...దైవకృపవల్ల...యిద్దరం పుచ్చుకున్నాం. తాంబూలం...సిగరెట్లూ...

—అతడు గడియారంవంక చూశాడు. నేను చెక్‌బుక్ తీసి...అతనికి నా తాహతుకు తగిన ప్రతిఫలం – అంకెవేసి...అందిచ్చి... 'చంద్రుడికి నూలుపోగు అనుకోవలసిందే' అని నవ్వుతూ అన్నాను...

అతడు మెదలకుండా తీసుకుని మడిచి పర్సులో పెట్టుకుని...ఆమె అడ్రసు అడిగి పుచ్చుకుని... సెలవు పుచ్చుకుంటా నన్నాడు....

'మీరు ఇక్కడ ఉన్నంతలో, తీరుబడి అయినప్పుడల్లా, యిక్కడికి దయచేస్తూంటే చాలా సంతోషిస్తాను..' అని మనస్ఫూర్తిగా కాకపోయినా, మాటవరుసకన్నా అన్నాను.

అతడు మెట్లుదిగి వెళ్ళిపోయిన తరువాత...నిర్వేదంతో నిట్టూర్పు విడిచాను; ఆశాభంగం అయింది: నే ననుకున్నాను కదా...కథలలో అంత భాగ్యం, సంపదా చిందించే కథకుడు లోభిగా ఉండి మనం అతికష్టంమీద యిచ్చే తృణానికి ఆశించు తాడా...ఆఫరుచేయడం మనకు దర్జా...అతడు మర్యాదగా అది అక్కరలేదని తిరిగి యిచ్చేయడమే కాకుండా, మన కష్టసుఖాలు కనిపెట్టి ఏ మహారాజ పోషకుడుగానో వేసుకోమని...మన చెక్కుకు తన చెక్కు జోడించితే – ఎంత బాగుండేది... అత్యాశకు పోతే యింతే అవుతుంది కాబోలు...ఆ నాలుగురాళ్ళూ ఉంటే యీ వారం పత్రిక పోస్టులో వెళ్ళేది...ఇప్పుడు దారి?

—అలాటి తవాయిలు తగలడం అదే మొదటిసారి కాదు కనక..ఓ పావు గంట మనసులో బాధపడ్డా, మొండికేయడం కష్టంకాలేదు. కానీ ఎప్పటి కప్పుడు తడుముకోకుండా కనబడేవాడికి గాలిలో మేడలు కట్టడం చేతనవుతుందా.. అయినా ఉత్తరక్షణంలో ఏం జరుగుతుందో మనకేం తెలుసును, మంచో చెడో?...

మళ్ళీ తలుపు చప్పుడైంది:

అయిదు కావచ్చింది...ఇక పైమీద బట్టవేసుకుని బయటికి నడవచ్చును కదా అని అనుకుంటూన్నాను. కాని ....

తలుపు తీసే దిక్కు కూడా లేదు...ఆ కుర్రవెధవ వాడికి నిజంగా జీతం యివ్వడం శుద్ధ దండుగ... నిమిషం వాడికి కాలు అక్కడ నిలువదు...

—కొంచెం విసువుతో లేచివెళ్ళి తలుపు తీశాను– ఆ తలుపులతో అదో గొడవవచ్చింది...దగ్గిరగా గడియ లేకుండా వేసి ఉంచుదామా అంటే, రవంత గాలిసాగితే అద్దాలు పప్పు — పప్పు అవుతవి—అందుకని—

—గుమ్మంలో ఎదురుగుండా నవ్వుతూ — ఆమె నిలుచుని వుంది..

ఆ అమ్మాయి ఎవరో అప్పుడు నాకు తెలియదు కదా! ఎవరా అని ఆశ్చర్యపడుతూనే ... కలవరపాటుతో లోపలకు ఆహ్వానించాను.. సిగ్గువేస్తూంది, ఆ పాతకుర్చీలో ఆమెను కూర్చోమనడం...కాని, మనభాగ్యం అంతేనాయెను...

మనకు సహజంగా ఉండే బిడియంతో, నేను సంకోచంతో మాటాడుతున్నాను: కాని ఆ అమ్మాయి చాలా బోళాగా...అతి చనువుగా...నేను ఒకమాట తెములుచ్చుకొనేలోపల తాను పదిమాటలుగా... నా గుండె కొంచెం కుదుటపడేసింది: ఇంతకూ ఆమె ఎవరో తెలుసునా...నా పత్రికకు అంత ప్రసిద్ధిని తెస్తూన్న ఆ కథలు...లోకంలో వున్న

బాధను, దరిద్రుల బాధలను...గుండెలు మండిపోయేటట్టుగా...అంత ప్రత్యక్షానుభవంతో చిత్రిస్తున్నవి...అవి వ్రాసేది ఆ అమ్మాయే...

ఆమె, దయతో నన్ను చూడటానికి వచ్చినందుకు నిజంగా నాకు ఏనుగునెక్కినంత సంతోషంగా ఉంది...

కాని, యెంత దౌర్భాగ్యం...ఆమెను బహూకరించడానికి...ఆమాట అలా ఉండగా, ఆఖరుకు కాఫీ తెచ్చి యివ్వడానికైనా పైసా లేదు...

ఆమె, ఎదురుగుండా కూర్చుని మాటాడుతూంది... వింటున్నాను...నిజంగా ఆ ప్రశంసకు ఎంతైనా వుబ్బిపోవచ్చును: నా కృషినీ–నా పత్రికనూ ఎక్కడో ఆకాశానకు ఎత్తుతూంది. కాని, నా ధ్యాస అంతా అక్కడ లేదు...కళ్ళ ఎదురుగుండా ఖాళీపర్సు బావురుమంటూ కనబడుతూంది....కలగా... పచ్చకాగితాలు...నాకు అంత కలిమి ఉంటే...ఆమె రుణం కొంతవరకన్నా తీర్చుకోగలిగేవాడిని కదా! ఏమో ఎప్పటికన్నా కల నిజమైతే—

కల నిజంకావడం — నిజంగా దారుణం...

—మనకళ్ళను మనం నమ్మకపోవడమనేది ఏమిటో మనకు ఎన్నడూ ఇదివరలో అనుభవంకాలేదు; కాని.. కళ్ళ ఎదుట, బల్లమీద...అలా ఆ దొంతరవుంటే...

'నేను చాలా సంతోషిస్తాను...మీరు మొగమాట పడకుండా తీసుకోవాలి....మీకూ, మీరు సారస్వతానికి చేస్తూన్న సేవకూ...మేం ఎవరమూ ఎన్నడూ విలువ కట్టలేం. అందుకుకాదు...ఎప్పటికీ పసిపాపగానే వుండదు కదా, ప్రాకులాడుతూ, పత్రిక? పెరిగి పెద్దదౌతూన్న కొద్దీ, వన్నెలకూ చిన్నెలకూ...మీదే అంతా భారం అయినా మీ ముద్దూ ముచ్చటా మేమూ తీర్చుకునేందుకు మీరు అనుగ్రహించి అనుజ్ఞయివ్వాలి...తప్పదు...'

ఆ అమ్మాయిని అగౌరవించినట్లు కాదూ, అప్పుడు నేను తీసుకోకుండావుంటే...నా కనులేకాదు, మనసూ చల్లబడ్డది. కాని.. ఎంత సిగ్గువేసింది?

"వెళ్ళి వస్తానండీ" అంటూ ఆమె లేచింది.

'మళ్ళీ తప్పకుండా—రండి' చాలా వినయంతో. హృదయంతో అన్నాను: ఆమె నవ్వుతూ...

'ఏలాగూ తప్పదు లెండి; నేను వస్తున్నాను కదా అని పోస్టులో పంపకుండా వెంట తీసుకువచ్చాను...ఇవాళ యిక్కడకు వద్దాం అనుకోకుండా బయలుదేరాను...అందుచేత రేపు పట్టుకు వస్తాను, కథలు...'

—గడియారం అరగంట కొట్టింది. కుర్రవాడు వచ్చి...టోపీ తీసుకుని..'వేళ అయింది, కిటికీలు మూసివేయనా' అనే ప్రశ్న–చూపు చూశాడు. నేనూ ఉత్తరీయం అందుకున్నాను. ఆమెను సాగనంపవచ్చును కదా అని...

ఇంతలో...అతడు వచ్చాడు;

ఆమెవంక వింతగా చూసి...నన్ను సమీపించి,

'మీకు కొంచెం శ్రమ..పరధ్యానంలో ఉండి ఇందాక తారీఖు ఇంకో నాలుగు నెలలకు వేశారు. నేను చూడలేదు తీరా ప్రెజెంటు చేసేటప్పటికి..'

—చెక్ అందుకుని చూశాను...నిజమే, నాలుగుకు ఎనిమిదీ – ఎనిమిదికి నాలుగు...నెలా తేదీలు తారు మారుగా వేశాను. ఎన్నడూ లేదే అలా పొరబడటం...చెక్ బల్లమీద పడవేసి, జేబులోనుంచి, కాగితం తీసి యిచ్చాను; అతడు 'మార్చుకురానా' అనగానే నేను నవ్వి 'మార్చక ఏం చేస్తారు...కాని మళ్ళీరావడం ఎందుకు?' అన్నాను. అతనికి...అర్థం కాలేదు...

ఆ అమ్మాయి చెక్ తీసి చూసింది.. పేరు చదివి...నేనింకా ఒకరికొకరిని ఎరుకపర చాలా వద్దా అనే మీమాంసలో ఉంటూండంగానే...తానే కలిపించుకుని మాటాడింది. ఒకరినిచూసి ఒకరు 'ఓహో' అనుకున్నారు...ఎన్నాళ్ళనుంచో ఎరుగున్నవాళ్ళలాగా... నామాటే మరచిపోయి...నావంకనైనా చూడకుండా మెట్లు దిగిపోతున్నారు....నేను మండిగం రెండు కమ్ములూ పట్టుకుని అలాగే నిలుచున్నాను—

ఆ ధీరుడు మళ్ళా తల నావంక త్రిప్పనన్నా లేదు. మెదలకుండా ఎక్కి కూర్చున్నాడు: ఆ అమ్మాయి మాత్రం, అడుగు కారులో ఉంచుతూ నా వైపుచూసి చేయి ఊపింది... రెండు వేళ్ళు కదుల్చుతూ...కారు నిశ్శబ్దంగా రంయిన వెళ్ళిపోయింది...

—నేను నిజంగా నా ఫాయాకు కుబేరుణ్ణి అయిపోయినాను. ఆమె చలువచేత...ఇక పత్రికను ఎంతో బాగుచేయవచ్చును, ఎన్ని అందాలో తేవచ్చును: ఎందుకూ లోటు లేదు కదా...

అప్పుడు హడావుడిలో..ఆమెకు నా కృతజ్ఞత అయినా తెలుపలేదు....మాట తెముల్చుకుని ఏమన్నా గొణిగేవాడినో ఏమోకాని, యింతలో ముంచుకుపోయినట్లు ఆ దరిద్రుడువచ్చి...అసలు ఆమెనే ఎగురవేసుకుపోయినాడు రేపు వస్తుంది కదా, అప్పుడు యధోచిత మర్యాదలన్నీ చేయవచ్చును అని మనసును సమాధానపరచుకున్నాను.

మరునాడు ఆమె రాలేదు: పోనీ, అమరుసటినాడైనా ...ఉహూం...కథలు పోష్టుకూడా చేయలేదు:

మూడోనాడు మాత్రం..నేను అప్పటికి ఎదురుచూడటం మానేశాను...ఉత్తరం...

అతడు వ్రాస్తాడూ—

'భాయిజీ!

'మీకు...లోకానుభవం ఉందో లేదో నా కంత పరిచయంలేదు కనుక గట్టిగా చెప్పలేను కాని, కావ్యంలోకానుభవం–పూజ్యం . అది నేను వెంటనే గ్రహించాను...మీరు గమనించలేదు కాని.

'నాకు అప్పుడే అర్థమయింది: చెక్ వ్రాస్తూ నావంక చూశారే, 'ఏమిటి యీ భాగ్యవంతుడు మన పైసా ఆశించవచ్చాడా, సరదాకు కథలు వ్రాస్తున్నాడు కాని' —అలా అనుకుంటున్నారని నేను వెంటనే కనిపెట్టి – మీ ముఖం మీదనే నవ్వడం బాగుండదని బలవంతాన మింగేసి ఊరుకున్నాను.

'అవునులెండి , మీరిలా అనుకుని ఉంటారు 'ఏ కథలో చూసినా అన్నీ సోఫాలూ, మార్బిల్ భవనాలూ, కార్లూ, న్యూషాలిమర్లూ...అలాటి జీవిత ఫాయాలో వాడు కనుకనే అంత స్వానుభవంతో వ్రాస్తూన్నాడు...' అంతేకాదూ?

'అంతా అబద్ధం...అది ఊహాగానం. అప్పుడు నేను అతి సామాన్యుణ్ణి (ఇప్పుడు?.. చివరదాకా ఓపికపట్టి చదవండి!) – మీరు చెక్, దయతలచి యివ్వకపోతే మనపని

పస్తు అయేది. తీరా కాళ్ళు యీడ్చుకుంటూ బ్యాంకుకు వెళితే—అక్కడ వాడు తిప్పికొట్టగానే నీళ్ళు కారిపోయినా ననుకోండి— మీరు అందుతారో, అందరో, అయితే ఏం కావాలి?—మీ మీద ఆశతోనే పట్నం వచ్చింది...

'వచ్చినందుకు...

'చూశారా? — మీరు ఎంత అమాయకులో!'

* * * *

పేజీ తిరగగానే దస్తూరిలో మొగ-వరవడి అయిపోయింది. ఇక ఆమె—

"అన్నగారూ!

"ఆయన పైన వ్రాసినట్లుగా - మీరు అమాయకులండి-నా కథలలో బాధ, దారిద్ర్యం పరమేశ్వరుడు నాకు ప్రసాదించకపోగా...కసితీర్చుకుంటూన్నట్టు...అతని కథల్లో అపురూపాలన్నీ అనుగ్రహించాడు.

"లేనివానికోసం కలలుకనడం — మానవసహజం అవునా కాదా?

"కాని ఇంతకాలం — నాకు లేమి ఏదో తెలియకుండా మాయచేసింది—కలిమి—

ఇప్పుడు — ఈ కలిమి—

"ఇద్దరం...భాగ్యవంతులం."

* * * *

ఇద్దరూ కలిసి ఇలా చిలిపిగా వ్రాశారు.

"సంపాదకరాయా—

"పాపం! మిమ్మల్ని తలచుకుంటే నిజంగా జాలివేస్తుంది. పేదకు పెన్నిధానం దొరికిన తరువాత (ఇది కేవలం మా విషయంలో, స్వామీ! తమరు ఏమాత్రమూ ఆగ్రహించకండి) ఇంకా ఎంతకాలం, లీదతనం..

"మనమందరం భాగ్యవంతులం—

"మీ పత్రిక కలకాలమూ వర్ధిల్లవలెనని - కాబోయే దంపతులు దీవించడంకన్న, మీకు కావాలిసిందేముంది?

"కథలు—

"అవును, మీకెప్పుడూ అదే రంధి — మాకేం పని పాటలు లేకనా మీ పత్రిక నింపడం—

"మీ మీద కోపంలేదు కనుక — కోపం ఎందుకంటారా, కాదా మరి, చక్కగా కథలు వ్రాసుకుంటూన్నవాళ్ళకు 'మల్లెపూల తెప్పకట్టి' — మీ పత్రికే కాదా...ఇంతకూ మూలం? — మా అమ్మాయికి తప్పకుండా మన పత్రిక పేరు పెట్టుకుంటాం...దైవం రక్షించితే...

"అవును, మీరుచేసిన — ఉపకారానికి —మీ కంతే కావాలి!"

అవును, నాకూ అంతే కావాలి వీళ్ళయిల్లు బంగారం కానూ,—ఒకరిని చూసుకుని ఒకరు—ఎంత పొంగిపోవడం—చూసింది...మా ఆఫీసులో...ఈ నిర్వాహకం చేసింది—వాళ్ళు అన్నట్టు అమాయకుణ్ణే- నేను...కాని, ప్రతిఫలం—

కావ్యసంతానమగ్రో అని మనం ప్రబోధించడం...కని పెంచడానికి వాళ్ళు తయారుకావడానికేనా..

కథలకేం...కావాలిసినన్ని వచ్చిపడుతవి: అంతగా దేశమే గొడ్డుపోతుందా...నా రెక్కలు చల్లగా ఉంటే చాలు–

కాని... యీ దెబ్బతో ఒక్క విషయంమాత్రం... తల బొప్పికట్టేటట్టు తెలిసివచ్చింది... కవి ... కావ్యంలో, కల్పనలో ప్రతిబింబించుతాడనే – సట్టిక్టివు–వాదం ఉందే అది నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు 'బన్‌కమ్' అని ఢంకా బజాయించి చెప్పడానికి...యింతకన్న కావలసిందేముంది?

–అంతా బుకాయింపు, ఇదీ కథే అనుకుంటారా...నా మాటలకేం...మళ్ళా ఓమారు కావలిస్తే ఆంధ్రపత్రికలో...ఆ దంపతులబొమ్మ చూడండి: మరీ అందంగా ఉంటారు...అది నిజంగా––నిజం!

★ ★ ★